# చిలకమర్తి లక్ష్మీనృసింహాకవి

# సంపూర్ణగ్రంథావళి

## షష్టిపూర్తిముద్రణము

## ౧-వ సంపుటము—ప్రహసనములు



షష్టిపూర్తి సంఘకార్యదర్శి

పాలకోడేటి గురుమూర్తిగారిచే

ప్రకటితము.

1927

 [ Price Rs. 3.

శ్రీరస్తు.

# చిలకమర్తి లక్ష్మీనరసింహకవి జీవితసంగ్రహము.

## బాల్యదశ-విద్యాభ్యాసము.

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు క్రీ॥ శ 1867 సం॥ము సెప్టెంబరునెల 26 తేదీకి సరియైన ప్రభవసంవత్సర భాద్రపద బ ౧౮ నాఁటిరాత్రి ప్రస్తుతము పడమటిగోదావరీమండలమునందలి తణుకుతాలూకాలోనున్న ఖండవల్లిగ్రామమున, మాతామహగృహమున జన్మించిరి. ఈయన యారామద్రావిడశాఖలోఁ జేరిన వైదికబ్రాహ్మణుఁడు. ఋగ్వేది, ఆశ్వలాయనసూత్రుఁడు. కాశ్యపగోత్రుఁడు. ఈయనతాతగారిపేరు పేరుభట్టు. వ్యవహారములో నీయన పేరయ్యయని చెప్పఁబడుచు వచ్చెను. తండ్రిగారిపేరు వెంకన్నగారు. తల్లిగారిపేరు రత్నమ్మగారు. లక్ష్మీనరసింహంగారి పితామహుఁడు పేరుభట్టుగారు మొదట గుంటూరుమండలమందలి యద్దంకిసీమలో నేదో యొకగ్రామమున నివసించుచు 1830 సం॥న ప్రాంతమున నచ్చట గొప్పకాటకము రాఁగాఁ దనకుటుంబముతోఁగూడ గోదావరీప్రాంతమున వసింపఁదలఁచి మొట్టమొదట మొగలితుర్రుగ్రామమునఁ గొంత కాలముండి, పిమ్మట వీరవాసరగ్రామముఁ జేరిరి. కాఁబట్టి లక్ష్మీనరసింహముగారిది ప్రస్తుతము పడమటి గోదావరీమండలములో భీమవరము తాలూకాలోనున్న వీరవాసరము నివాసస్థానము.

ఈయన పితామహుఁడు వైదికవృత్తిచేత జీవించెను. తండ్రి వెంకన్నగారు వైదికవృత్తి నవలంబింపక మొదటినుండియు జక్కఁగా

వ్రాయుట, చదువుట, లెక్కలుకట్టుట నేర్చికొని, యచ్చటి తాలూకా
కచ్చేరిలోఁ గొంతకాల ముద్యోగము చేసి, వేదభాష్యలచేతను
వృత్తిచేతను లౌకికుఁడై జీవయాత్రగడపెను. లక్ష్మీనరసింహముగారి
తల్లి రత్నమ్మగారు, ఖండవల్లిగ్రామీణుఁడును సంస్కృతాంధ్ర సార
స్వతపారీణుఁడును, నుభయభాషాకవితావిశారదుఁడునునగు పురాణ
పండ భద్రయ్యశాస్త్రిగారి రెండవకూఁతురు. ఆంధ్రగీర్వాణవాఙ్మయ
ధురంధరుఁడై యమలాపురము, తణుకు మొదలగు తావులయందె
గాక పిఠాపురమునందును జాలకాల మున్నతపాఠశాలలలో నాంధ్రో
పాధ్యాయుఁడుగానుండి శ్రీపిఠాపురిమహారాజుగారగు శ్రీరాజారావు
వేంకటకుమారమహీపతిసూర్యారావుబహద్దూర్ వారి యాస్థానపండి
తుఁడై యనేకాంధ్రప్రబంధములకు వ్యాఖ్యానములురచించి, యాంధ్ర
బ్రహ్మసూత్రభాష్యకర్తయై వాక్చమత్కృతికి సౌజన్యతకుఁ బేరు పడి
యాంధ్రమండలమందు విశేషకీర్తిసిగాంచిన శ్రీపురాణపండమల్లయ్య
శాస్త్రిగారు లక్ష్మీనృసింహంగారికి మేనమామ.

చిలకమర్తి వెంకన్నగారి పురుషసంతానములో లక్ష్మీనరసిం
హముగారే జ్యేష్ఠులు. ఈయన చిన్ననాఁడు వీరవాసరములో
మొదటి నాలుగుతరగతులు జదివి యప్పటిపరీక్షాధికారియగు నల
గ్జాండర్ మన్రోదొరగారివల్ల మంచియింగ్లీషునిఘంటువును బహుమాన
మునుబడసి మిడిల్‌స్కూలుపరీక్షకుఁ జదువుటకై నరసాపురమునకుఁ
బోయి యచ్చట మిషనువారి పాఠశాలలో 1882 సంవత్సరప్రారంభ
మునఁ జేరెను. ఆసంవత్సరమే మిడిల్‌స్కూలుపరీక్షలోఁ గృతార్థుఁడై
పైతరగతిలో 1883సం॥రమునఁ జేరి చదివెను. అచ్చట బ్రహ్మశ్రీ యేలేశ్వ
రపు వెంకటప్పయ్యశాస్త్రిగారు వీరి కాంధ్రభాషాగురువులైరి. కవిత్వము
చెప్పవలెననునభిలాష 1883సం॥రమున జనించెను. అందుచే ఛందశ్శా
స్త్రము నేర్చుకొనవలెనని ఛందోవిషయసారసంగ్రహమును లక్షణగ్రం

థమును జదివిరి. 1884 సం॥రమున మేనమామగారైన బ్రీ॥శ్రీ॥ పురాణ పండమల్లయ్యశాస్త్రిగారు రాజమహేంద్రవరములోనున్న యిన్నీసు పేట పాఠశాలలో నాంధ్రోపాధ్యాయులై, మేనల్లుని దనవెంటఁబెట్టు కొనివచ్చిరి. 1885 సం॥రమున లక్ష్మీనరసింహముగారు దొరతనము వారి కళాశాలలో మెట్రికుృలేషనుతరగతిలోఁ జేరిరి. అట్లుచేయుటచేత మహనీయులైన రావ్ బహద్దూర్ కందుకూరి వీరేశలింగముపంతులు గారియొద్దను, వావిలాల వాసుదేవశాస్త్రిగారియొద్దను, ప్రకృతిశాస్త్ర పండితులైన శ్రీరంగాచార్యులుగారియొద్దను శిష్యుఁడై విద్యాభ్యాసము చేయుట కవకాశము గలిగెను.

కాని యాసంవత్సరాంతమున గవర్నమెంటువారి కళాశాలలో మెట్రికుృలేషనుతరగతి తీసివేయఁబడుటచే మఱియొక పాఠశాలలోఁ జేరి చదివిరి. ఆపాఠశాలకు బ్రీ॥శ్రీ వేదం వెంకటాచలంపంతులుగారు ప్రధానోపాధ్యాయులై యుండిరి. మేనమామగారైన మల్లయ్యశాస్త్రులుగారే యక్కడ నాంధ్రోపాధ్యాయులు. అందుచే మల్లయ్య శాస్త్రిగారి కాయన మేనల్లుఁడగుటయేగాక శిష్యుఁడుగూడ నయ్యెను. 1887 సంవత్సరమునఁ బ్రవేశపరీక్షయందాయన కృతార్థుఁడయ్యెను. కళాశాలలోఁ బ్రథమశాస్త్రపరీక్షకుఁ బట్టపరీక్షకుఁ జదువ వలెనని కుతూహల మాయనకు మెండుగ నుండెనుగాని, ప్రధానమగు గణిత శాస్త్రమం దభిరుచి లేకపోవుటయు, నేత్రవిరోధ మప్పటికే జనించుటయు నాయన నీసంకల్పమునుండి మరల్చెను.

ఉద్యోగము.

1889 సంవత్సరమున మేనమామగారికి జబ్బుచేయుటచేత, లక్ష్మీనరసింహముగా[illegible]సాహిత్యము సం

పాదించియున్నకతన వారిస్థానమున నాంధ్రోపాధ్యాయులుగా నిన్నిసుపేటపాఠశాలలో నియమింపఁబడిరి.

1889 సం॥రము ప్రారంభమున రాజమహేంద్రవరము నందలి కొందఱు మిత్రులు ప్రాతయూరునందొక యున్నతపాఠశాల స్థాపింపఁదలంచి "ఆర్యన్ హైస్కూల్" అను పేర నొకదానిని నెలకొల్పిరి. లక్ష్మీనరసింహముగా రందులో నాంధ్రోపాధ్యాయుఁడుగా నియమింపఁబడి చిన్నతరగతుల కాంగ్లేయభాషయుఁ బెద్దతరగతులకు నాంధ్రభాషయు నేర్పుచుండిరి. కాని యాపాఠశాల వేసవికాలపు సెలవులనాటి కంతరించెను. 1892 సం॥రము జూలై నెలలో నిన్నిసుపేట స్కూలులో నీయన సహాయోపాధ్యాయుఁడుగా నియమింపఁబడి 1893 సంవత్సరాంతమువఱకు నందుఁ బనిచేసెను.

1894 సంవత్సర ప్రారంభమున గవర్నమెంటువారు రాజమహేంద్రవరమున ట్రెయినింగు కాలేజిని స్థాపించిరి ఈపట్టణములో నున్న పాఠశాలలన్నియు దానిలోఁ గలుపఁబడుటచే వీరియుద్యోగము పోయెను. అప్పుడు మరల నాఱుమాసములవఱకేయుద్యోగము లేక, యాసంవత్సరము జులయి నెలలో ట్రెయినింగుకాలేజీలో సెకండరీగ్రేడు ట్రెయినింగుతరగతిలోఁ జేరిరి. 1895 సంవత్సరము ఏప్రెిలు నెలతో నచ్చటివిద్యసమాప్తముకాఁగా, నూతనముగ స్థాపితమైన మ్యునిసిపల్ స్కూలులో వీరు మూడవ యుపాధ్యాయులుగా నియమింపఁబడిరి. ట్రెయినింగయినతరువాత జరిగెడు వ్రాతపరీక్షలో లక్ష్మీనరసింహముగారు కృతార్థులైరి. కాని నేత్రావరోధముచేత రెండవదియగు ప్రాక్టికలుపరీక్షలోఁ గృతకృత్యులగుట కష్టమని దానివిషయమై ప్రయత్నముచేయులేదు. ఆపరీక్షకుఁ గూడ వెళ్లవలసినదని పరీక్షాధికారులు నిర్బంధించిరి. అందుచే మ్యునిసిపల్ మిడిల్‌స్కూలులో 1898 సం॥రము ఆగష్టువఱకు ననఁగా మూఁడుసంవత్సరములు మూఁడుమాసములు పనిచేసి యాయుద్యోగము నావఱకు వదలిరి.

కీ॥ శే॥ శ్రీ పోలవరము జమీందారుగారును, లక్ష్మీనరసింహము గారును బాల్యమిత్రులగుటచే వారు సరస్వతియను మాసపత్రికను నెల కొల్పి దాని కుపసంపాదకుఁడుగా లక్ష్మీనరసింహముగారి నేర్పఱచిరి. కాని జమీందారుగారికిని వీరికి నభిప్రాయభేదములు గలుగుటచేత 1899 సంవత్సరములో వీరు సరస్వతీపత్రికతో సంబంధముగూడ వదలు కొనిరి.

## గ్రంథరచనము.

ప్రవేశపరీక్షకుఁ జదువుచున్న కాలముననే యీయన తెనుఁగునఁ గవిత్వముజెప్ప నారంభించెను. 1887 సం॥రము ప్రారంభమున శ్రీ విక్టోరియామహారాజ్ఞీగారు నేబదియేండ్లు పరిపాలనము చేసినందుకు దేశమం దంతట గొప్పయుత్సవములు జరిగెను. అప్పుడు లక్ష్మీనరసింహముగారు రాణిగారిమీఁదఁ గొన్నిపద్యములు రచించిరిగాని యవి ప్రకటింపఁబడలేదు. 1888 సం॥రమున వీరికి గురువులైన వేదము వేంకటాచలముగారిని సన్మానించుటకు జరిపిన వీడుకోలుసమావేశమునందు లక్ష్మీనరసింహముగారు వారిమీఁదఁ గొన్ని పద్యములు జదివిరి. అవి చక్కగానున్నవని సభాసదులు మెచ్చి సంతసించిరి. ఆయనకవిత్వము వెల్లడికివచ్చుట కదియే మొదలు. కాని లక్ష్మీనరసింహముగారిని సంపూర్ణముగఁ గవిత్వధోరణిలోనికి దింపినవి రెండుసంస్థలని చెప్పవచ్చును. ఇందు మొదటిది నాటకకళాభిలాషులగు కీ॥ శే॥ ఇమ్మానేని హనుమంతరావునాయుడు గారు 1889 సం॥రమున స్థాపించిన హిందూ నాటకసమాజము. రెండవది సుప్రసిద్ధాంధ్రులును, దేశభక్తాగ్రేసరులలో వన్నెకెక్కిన న్యాయపతి సుబ్బారావుపంతులుగారిచే 1891 సం॥రములో నెలకొల్పఁబడి కీ॥ శే॥ రావుబహదర్ కందుకూరి వీరేశలింగకవిచే నతిసమర్థతతో నిర్వహింపఁబడుచువచ్చిన "చింతామణి" యను మాసపత్రిక. ఈరెండుసంస్థలును భాషాభివృద్ధి కేర్పడినవిగాని ద్రవ్య

మార్జించుటకుఁగాదు. గద్యనాటకములనే ప్రదర్శించుట నాయుడుగారి మతము. ఆంధ్రవాఙ్మయమున నవలారచనము లేనిలోటు దీర్పవలెనని పంతులుగారి దీక్ష. ఇది నెరవేరుటకు, పోటీకి నవలలు వ్రాయించి చింతామణిలోఁ బ్రకటించి యుత్తమగ్రంథములకు పంతులుగారు స్వయముగఁ బారితోషికముల నిచ్చుచుండిరి. ఈరెండుసంస్థలే లక్ష్మీనరసింహముగారిని విశేషముగ గద్యకవిగఁ బరిణమింపఁజేసినవి.

ఈయన నాటకసమాజమునకు మొట్టమొదట వ్రాసియిచ్చినది కీచకవధ యనువచననాటకము. దీనిని ముగించుటకు నాలుగుమాసములు పట్టెను. 1889 సం॥రం జూను 15 తేదిని సామాజికులు ప్రదర్శించిరి. ప్రేక్షకులు మెచ్చుటచేత నచిరకాలములో మఱికొన్నినాటకములను వ్రాయవలసివచ్చెను. ఈరీతిగ ద్రౌపదీపరిణయము, గయోపాఖ్యానము, రామజననము, సీతాకల్యాణము, పారిజాతాపహరణము, నలనాటకము ననుదృశ్యకావ్యములను క్రమముగ రచియించి ప్రదర్శనార్థమై సామాజికుల కిచ్చిరి. నాటకసమాజమునకుఁ గేవలమాస్థానకవియె గాక లక్ష్మీనరసింహముగారు ముఖ్యసభ్యులుగా నుండుటచేత గ్రంథరచనము చురుకుగా జరిగినది. సామాజికులలో వేషధారుల సంగీతసామర్థ్యమునుబట్టి కవి యచ్చటచ్చటఁ గొన్నిపద్యములను జేర్చినను మొత్తముమీఁదఁ బైనాటకము లన్నియు గద్యాత్మకములని చెప్పవచ్చును.

చింతామణి పత్రికాస్థాపనానంతరము లక్ష్మీనరసింహముగారి దృష్టి నవలారచనముపైఁ బ్రసరించినది. 1894 సం॥రము మొదలు కొని రామచంద్రవిజయము, హేమలత, అహల్యాబాయి యనుమూఁడు నవలలు పోటీపరీక్షార్థము వ్రాయఁబడినవి. ఇవి మొట్టమొదటఁ జింతామణిపత్రికలోఁ బ్రచురితములై ప్రథమబహుమానములను బడసినవి.

## ప త్రి కా ని ర్వ హ ణ ము.

గ్రంథరచనమునందేగాక పత్రికానిర్వహణమునందుఁగూడ లక్ష్మీనరసింహముగారికిఁ గుతూహలముండెను. ఈపత్రికలు వార్తావిషయములకేగాక గ్రంథప్రకటనమునకుఁ గూడ నుపకరించుచుండెడివి. సరస్వతీపత్రికకు పోలవరమురాజాగారితో నుపసంపాదకుఁడుగ నున్నప్పుడు సౌందర్యతిలక యనునవలయు, అభినవభట్టబాణకృత పార్వతీపరిణయమనుసంస్కృతనాటకమున కాంధ్రీకరణమును వెలువడినవి.

1908 సంవత్సరమున జమీందారులగు శ్రీ కంచుమర్తి వేంకట సీతారామచంద్రరావుగారి సాహాయ్యమున నొక ముద్రణాలయమును సంపాదించి మనోరమ యనుమాసపత్రికను నెలకొల్పి యందు ప్రసన్నయాదవము, కర్పూరమంజరియొక్క ప్రథమభాగము, మహాపురుషుల జీవితచరిత్రములు, రాజస్థానకథావళి, నానకు మొదలగు సిక్కుగురువుల చరిత్రము లనునుద్గ్రంథములను బ్రకటించిరి. ఇవిగాక వినోదములను చమత్కారకథలును, చతురచంద్రహాస నాటకముయొక్కయు, రమేశచంద్రదత్తుగారి సుధాశరచ్చంద్రముయొక్కయు కొన్ని భాగములును నీమనోరమయందే ప్రకటింపఁబడినవి. ఈచివర రెండుగ్రంథములను 1919 సంవత్సరములో కవి పూర్తిచేసెను.

1910 సం॥రమున మనోరమనుచాలించి దేశమాత యనుపత్రికను బ్రకటింపఁజొచ్చిరి. ఇది వారపత్రికయైనను కొన్నిగ్రంథముల నింపుమూలముగఁ బ్రకటించిరి. కృష్ణవేణి, మణిమంజరి యనునవలలును, భారతకథామంజరి యనునీతికథలును దేశమాతలోనివే. ఈప్రహసనసంపుటములో దేశమాతలోని హాస్యలత లనేకములు చేర్పఁబడినవి. 1916 సం॥రమున దేశమాతకుఁదోడు మనోరమకు పునర్జీవముఁబోసి కొంతకాలము రెండుపత్రికలను నడపిరి. గణపతి, రాజరత్న మనునవ

లలును, రఘువంశమున కనువాదమగు రఘుకులచరిత్ర మనువచనప్రబంధమును, సిద్ధార్థచరిత్రయు, భాసమహాకవికృతనాటకములలో నైదింటి యాంధ్రీకరణములును రెండవతూరి వెలువడిన మనోరమలోఁ బ్రకటింపఁబడెను. ఇంతకుపూర్వమె మధ్యమవ్యాయోగమును స్వప్నవాసవదత్తయు నాంధ్రీకరింపఁబడినవి. ప్రచ్ఛన్నపాండవమను వచనప్రబంధమును, రామకృష్ణపరమహంసచరిత్రయు, కాళిదాసచరిత్రయు పత్రికాముఖమునఁ గాక ప్రత్యేకగ్రంథరూపమున వెలువడినవి. భాగవతకథామంజరి, ప్రహ్లాదచరిత్ర, కర్పూరమంజరియొక్క రెండవభాగము సముద్రితములు ఇవి ప్రత్యేకించి షష్టిపూర్తిముద్రణమునకై వ్రాసిరి.

నాటకములు నవలలు మాత్రమే గాక లక్ష్మీనరసింహముగారు కొన్ని పద్యకావ్యముల రచించిరి. కాని యవి పూర్తికాలేదు. 1895సం॥రమున పృథివీరాజీయమను ప్రబంధమును వ్రాయ నారంభించిరికాని పూర్తిచేయలేదు. ఇట్లే హరిశ్చంద్రనాటకమున నొకయంకము మాత్రము వ్రాసి చాలించిరి. దీనకల్పద్రుమ మనుభక్తిరసప్రధానమగు శతకమున నఱువదిపద్యములవఱకు వ్రాసి మనోరమలోఁ బ్రకటించిరి. ఇవిగాక వీరుసమయస్ఫూర్తిగ చాటుధారగఁ జెప్పినపద్యములు గూడ గలవు. అందు ప్రథమగోదావరీమండలసభలోఁ జదివిన పన్నులపద్యములును, పకోడీలపైనఁ జెప్పినపద్యములును స్వదేశోద్యమము నూతనముగఁ దలయెత్తినప్పుడు జెప్పిన "భరతవర్షంబు చక్కని పాడియావు" మున్నగు పద్యములును నాంధ్రదేశమున నెక్కుడు ప్రచారములో నున్నవి. వీరి పద్యకావ్యములలో న్యాపతి సుబ్బారావుగారి ప్రోత్సాహమువలన వ్రాసిన వాల్మీకిరామాయణసంగ్రహ మొకటియె సమగ్రముగ నిలిచి యున్నది.

చిన్నవి పెద్దవి గలిసి రమారమి యేబదిగ్రంథములకు లక్ష్మీనరసింహముగారు కర్త. వీనిలోఁ జాలభాగ మాంధ్రమహాజనుల నాక

ర్షించి వారి గౌరవప్రేమాతిశయములకుఁ బాత్రములైనవి. గయోపా ఖ్యానము సుమారు లక్షప్రతులు చెల్లినవి. నవలలలో హేమలత పెక్కుముద్రణముల నందుటయేకాక ఇంగ్లీషు, కన్నడము, ఓఢ్రభాష లలోనికిఁ బరివర్తనము చేయఁబడినది. తెలుఁగువాఙ్మయమున గద్యకా వ్యములు సకృతుగ నున్నకాలములో నాబాలగోపాలము నాకర్షించి మనోహరమగు సులభశైలిలో వ్రాసిన లక్ష్మీనరసింహకవికృతు లాంధ్రసారస్వతమునకు మహోపకారము జేసినవనుట యతిశయోక్తికాదు.

## విద్యావ్యాపకము.

దానములలో నన్నదానమువలె విద్యాదానము గూడ సర్వో త్కృష్టమయినదని లక్ష్మీనరసింహముగారి నమ్మకము. తమగ్రంథముల వలననే గాక పాఠశాలలను స్థాపించి విద్యావ్యాప్తి చేయుటకుఁ బ్రయ త్నించిరి. 1899 సంవత్సరారంభమున "హిందూ లోవర్ సెకండరీస్కూల్" అనుపేర నొకపాఠశాలను స్థాపించి తొమ్మిదిసంవత్సరములు దాని నవిచ్ఛిన్నముగ నిర్వహించిరి. ఈపాఠశాలలో నూటికి నలుబది మందిబాలు రుచితముగ విద్యాభ్యాసముఁ జేయుచుండిరి. ఈపాఠశాలను నిర్వహించుటలో లక్ష్మీనరసింహముగారికిఁగొందఱుమిత్రులు తోడ్పడిరి. ఇందు ముఖ్యముగఁ దక్కువజీతమున నుపాధ్యాయత్వము నంగీకరించిన కుందూరు వెంకటరత్నముగారికిని, ఆగర్భశ్రీమంతు లయ్యును శ్రీమ యనక వేతనముఁబుచ్చుకొనకయె యేడుసంవత్సరములు ప్రధానోపా ధ్యాయులుగనుండి పాఠశాలను మిక్కిలి యభివృద్ధిలోనికిఁ దెచ్చిన కీర్తి శేషులగు సత్యవోలు లక్ష్మీపతిగారికిని వారు యావజ్జీవము కృతజ్ఞు లుగా నుండఁగలరు.

1906 సంవత్సరములో కీ॥ శే॥ వీరేశలింగముపంతులుగారొక యాస్తికపాఠశాలనుస్థాపింపనుద్యుక్తులై లక్ష్మీనరసింహముగారిస్కూలు

నీయవలసినదని కోరిరి. అందుకని 1907 సం॥ సెప్టెంబరు 16 తేది పరి
కరము లతో సహా తమపాఠశాల నుచితముగ వీరేశలింగముగారి వశము
చేసిరి. అది కొంతకాలము హితకారిణీహైస్కూలను పేర వర్ధిల్లి యి
ప్పుడు శ్రీపిఠాపురముమహారాజావారియౌదార్యమురూపముదాల్చినట్లు
వెలయుచున్న దివ్యభవనమున వీరేశలింగము హైస్కూలను పేరుతో
దినదినాభివృద్ధిఁ గాంచుచున్నది.

ప్రజాహితజీవనము.

లక్ష్మీనరసింహముగారి కెప్పుడు వైదికమతకర్మలయం దాసక్తియు
న్నట్లుదోఁచదు. శ్రోత్రియవంశములోఁబుట్టినందున గర్భాష్టకాలుదాటక
మునుపె యుపనయనము జేసిరి. కాని తనస్నేహితుఁడగు నొకయంబ
ష్ఠసూనునకు గాయత్రీమంత్రోపదేశము చేయుట జూచి గురువుగారు
లక్ష్మీనరసింహముగారికి సంధ్యావందనము జెప్పుటమానిరి. వేదమంత్రా
ర్థము సర్వజనగ్రాహ్యముఁ గావలెనని వారియూహ. అందుకనె వృద్ధా
ప్యములో వేదముల నాంధ్రీకరించుటకు సమకట్టిరి. కాని యాప్రయ
త్నము కొనసాగలేదు.

పాశ్చాత్యనాగరకతానుగుణ్యముగ సంఘసంస్కరణమన్నను మత
సంస్కరణమన్నను నిమ్నజాత్యుద్ధరణమన్నను వీరి కభిమానము మెండు.
వీరేశలింగముగారితోను రఘుపతి వెంకటరత్నమునాయుడుగారితోను
వీరికిఁ గలిగినసాంగత్య మిందుకుఁ గారణమైయుండును, 1895 సంవత్స
రమున లక్ష్మీనరసింహముగారు ప్రార్థనసమాజములోఁ జేరిరి. వీరేశలిం
గముగారికి వీరియెడఁగల విశ్వాసమునుబట్టి వారు స్థాపించినహితకారిణీ
సమాజములో వీరిని యావజ్జీవసభ్యులుగ నియమించిరి. ఇప్పు డాస
మాజమునకు వీ రుపాధ్యక్షులు.

నిమ్నజాత్యుద్ధరణమునకై వీరు పలువిధములఁ బాటుపడిరి. వారి
కై ప్రత్యేక మొకపాఠశాలను 1909 సం॥రమున స్థాపించి 13 సంవత్స

రములు జయప్రదముగ నడిపిరి. దొరతనమువారి గ్రాంటులకుఁదోడుగ శ్రీపిఠాపురమహారాజావారు పాఠశాలనిమిత్తము విరివిగ ధనసాహాయ్యముఁ జేసిరి. ఇట్టియుపపత్తు లుండినను బోషించుట దుర్భరమగుట చేతఁ బాఠశాలను 1922 సం॥రములో మూసిరి. కాని యీపాఠశాలలోఁ జదివిన పలువురు నిమ్నజాతియువకులు గౌరవముగ జీవనము జేయుచున్నారు.

సంఘసంస్కరణమేగాక రాజకీయసమస్యలయందు వీరి కభిరుచి గలదు. దేశీయమహాజనసభయం దభిమానము గౌరవము గలదు. నాలుగైదుసభలకుఁ బ్రతినిధిగ వెళ్ళిరి. 1914 సం॥రమున మద్రాసులో జరిగినసభలో దక్షిణాఫ్రికాసమస్యపై నాంధ్రమున మాట్లాడిరి. అప్పుడే మనరాజధానికి గవర్నరుగానుండిన పెంట్లెండుప్రభువు వీరికిదర్శనమిచ్చి జ్ఞాపకార్థము "ఆప్టిమిజమ్" అనునింగ్లీషుపుస్తకము నొసంగిరి.

ము గిం పు.

ఒకటిరెండుచిల్లరవిషయములతో నీజీవితసంగ్రహమునుముగింపవచ్చును. "గతిలేనిదేవుఁడు మతియిచ్చె" ననురీతిని దృష్టిలోపమును గూడదీయుటకో యనునట్లు మొదటినుండియు లక్ష్మీనరసింహముగారికి జ్ఞాపకశక్తి విశేషముగఁగలదు. చిన్ననాఁటి సమాచారము లిప్పుడు పూసగ్రుచ్చినట్లు తేదీవారిగాఁ జెప్పఁగలరు. క్రొత్తపద్యముల నొకపర్యాయము విని యప్పచెప్పెడియలవాటు గలదు. ఈయేకసంతగ్రాహిత్వమునకు మెచ్చి వడ్డాది సుబ్బారాయకవి వీరికి ఫోటోగ్రాపని పేరుబెట్టిరి. వీరికి విద్యార్థిదశలోనే నేత్రముల కవరోధముగలిగినను, పగలుమాత్రము వ్రాయుటయుఁ జదువుటయుఁ గొంతకాలమువఱకు నుండెడిది. కాని 1905 సంవత్సరమునుండియు వీరిగ్రంథములు గుమాస్తాలను బెట్టి వ్రాయింపవలసివచ్చెను.

ఉపన్యాసధోరణి వీరికిఁ జక్కఁగ నున్నది. ఉపన్యసించునప్పుడు రసవంతములగు హాస్యోక్తులతో సభాసదులను నవ్వించుచుందురు. కాని వీరు మొదట వ్రాసినగ్రంథములలో హాస్యరసము లేదు. తరువాత వ్రాసినగ్రంథములలోఁ బ్రహసనములు, వినోదములు, గణపతి యనునవలయు హాస్యరసప్రధానములని చెప్పవచ్చును.

మనపూర్వకవులకు రాజపోషణము మెండు. ప్రజలవలన గౌరవమే కాని లబ్ధి తక్కువ. ఇప్పటికవులకుఁ బ్రజాదరణమె యెక్కువ. ప్రజాపోషణముతోఁగూడిన రాజావలంబనము బడసినకవులు సకృతుగ నున్నారు. లక్ష్మీనరసింహముగారిభాగ్యవశమున నీరెండుఁ జిరకాలముగ లభించినవి. ఇట్లుభయపార్శ్వములనుండి సంపూర్ణాదరణ మున్నను, సంతానము లేకపోయినను సామాన్యముగఁ గవులందఱివలె వీరుగూడ నిరంతరము లక్ష్మీకటాక్షమునకు దూరులెకాని సన్నిహితులుగా లేదు. వీరిసహజోదారస్వభావమె యిందుకుఁ గారణ మని చెప్పవచ్చును.

1907 సం॥ ఫిబ్రవరిలో పిఠాపురముమహారాజుగారగు శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరు వారి పట్టాభిషేకమహోత్సవము జరిగినది. అప్పు డాహ్వానమువచ్చుటచే వీరు పిఠాపురము వెళ్ళిరి. నాఁటినుండి యాంధ్రభోజుఁడని ప్రఖ్యాతిఁబడసిన శ్రీవారికి లక్ష్మీనరసింహముగారిపై నవ్యాజప్రేమయు గౌరవమును జనించినవి. నిమ్నజాతులకొఱకు వీరు స్థాపించిన రామమోహనపాఠశాలకు భూరివిరాళముల నిచ్చుటయెగాక యిబ్బందులుగలిగినప్పుడు శ్రీమహారాజావారు వేలకొలఁది ద్రవ్యసహాయముచేసి లక్ష్మీనరసింహముగారిని ధనబాధలనుండి తొలఁగించిరి. ఇప్పటికిఁ గొన్ని సంవత్సరములుగ శ్రీవారు నెలకు 125 రూప్యములనిచ్చి పోషించుచున్నారు. ఇట్టి నిర్వ్యాజప్రేమకుఁ బాత్రులైనందుకు శ్రీవారియెడ లక్ష్మీనరసిం

హము గారు మిక్కిలి కృతజ్ఞులై యుందురని వేఱె చెప్పనక్కఱలేదు. కాని కవులను బోషించుబాధ్యత ప్రజలమీఁదను గలదు. అయినను శ్రీనాగొక్కరే యిరువురిబాధ్యతలను భరించుటచేత వారియెడ నాంధ్రులందఱుఁ గృతజ్ఞతఁ జూపఁగలరు.

హిందూధర్మశాస్త్రములఁబట్టి షష్టిపూర్తి జీవితయాత్రలో నొకపెద్దఘట్టము. వృద్ధాప్యము పైఁబడుట సూచించును. దీనికి పైమెట్టు సహస్రచంద్రదర్శనము (సహస్రమాసజీవి). ఈ రెండుమకామములు చేరినవెంటనె వైదికమతాభిమానులు ధర్మశాస్త్రములు విధించినస్మార్త కర్మలు కొన్ని నెరవేర్చుట గలదు. లక్ష్మీనరసింహముగారికి వైదికకర్మల యందు విశ్వాసము లేకపోయినను షష్టిపూర్తినాఁటికి వృద్ధాప్యము వచ్చినది. శరీరములోఁ బాటవము తగ్గినది. ఇఁకమీఁద సారస్వతాభి వృద్ధికి విశేషము పాటుపడలేకపోవచ్చును. కాని వారివయసులో నర్పించిన యాభరణములకే సంతసించి యాంధ్రభాషామతల్లి వీరిని దనకూర్మిపుత్రులలోఁ జేర్చినది. వీరికృతు లాంధ్రులలో జాతీయోద్బో ధనముఁ గలిగించినవనుటకు సందేహము లేదు. వీరిభాషాసేవయు, వాఙ్మయాభివృద్ధికిఁ జేసినకృషియు, దేశాభిమానమును జిరకాలము సంస్మరణీయములు. దయామయుఁ డగుసర్వేశ్వరుఁ డీదంపతులకుఁ జిరా యురారోగ్యములఁ బ్రసాదించుఁగాక.

వేమూరి విశ్వనాథశర్మ.

# విషయసూచిక.

పుట.




# కనకశునక ప్రహసనము

(అంతట కామశాస్త్రులు ప్రవేశించుచున్నాడు)

కామ—(తనలో) రామదీక్షితులు చాలా పొగరుపట్టి యున్నాడు అతని పొగరణచుటకు నా కుపాయము గనపడకున్నది. ఈ గ్రామమంతకు నేనే ధర్మశాస్త్రములు తెలిసినవాడనని పేరుబడుటచేత కొందరుద్యోగస్తులు, వర్తకులు, బ్రాహ్మణులు, మైలవచ్చినను, పురుడు వచ్చినను, తిథిప్రయోజనముల విషయమై సందేహము దోచినను నన్నేవచ్చి యడుగుచుందురు. రామదీక్షితులు మాత్రము నన్నువచ్చి చూడడు. నన్నొక పెద్దగా అంగీకరింపడు. నన్నుచూచినప్పుడు పలుకరింపడు. ప్రజల కందరకు ఆతడు మంచివాడని, పెద్దమనుష్యుడనిగౌరవము. అతనిని వంచనచేయవలయునంటే వీలుకనబడకున్నది. ఊరకుండాముంటే వీడు క్రమక్రమముగా గ్రామములో నాగోప్యము చెడగొట్టి తానే మొనగాడయి కూర్చుంటాడే మోననిభయము కలుగుచున్నది. కానీ సమయము దొరకకపోవునా, వీడిజుట్టు నాచేతిలో చిక్కకపోవునా, దొరకినాడంటే ముక్కు నేలబెట్టి రాసి వేసి దుంప తెంపివేస్తాను.

(అప్పుడు రామదీక్షితులు ప్రవేశించుచున్నాడు.)

రామ—(తనలో) ఈవిషయములో కామశాస్త్రి ధర్మశాస్త్ర మేలాగున చెప్పునో చూడవలయునని యున్నది. ఈయనగారి పాండి

త్యము యీయనగారి నిష్పక్షపాతము యీ దెబ్బతో గ్రామమందరకు తెలియవలయును. అదుగో స్నానముచేసి విభూతిపెండికట్లు పెట్టుకొని శాలువ గప్పుకొని బకధ్యానము చేయుచు కామశాస్త్రి చాప మీద కూర్చున్నాడు. ఎవరికొంప తీయవలయుననియో ఆలోచించుచున్నాడు. (ప్రకాశముగా) కామశాస్త్రిగారూ! నమస్కారము.

కామ -- ఓహోహో రామదీక్షితులుగారా? ఇదేమిటియెన్నడు లేనిది మా యింటికి దయచేసినారు? ఊరకరారు మహాత్ములు. ఏదోపనియుంటేనేగాని, మాగృహపావనము చేయరు. దయచేయండి.

రామ—కొంచెము పనిమీదనే వచ్చినాను. మీదర్శనం చేయకుండా గ్రామములో గడచునా? చిన్నసందేహ మొకటివచ్చి మీ ముఖతః తెలుసుకో వలయునని వచ్చినాను సెలవైతే మనవిచేస్తాను.

కామ—అబ్బబ్బ! మీకు సందేహము తోచడము, నేను తీర్చడమునా! నేనెంతవాడను! తీర్చుటకు అన్నింటికిమీరేయున్నారు. నాగోష్యము నా పాండిత్యము మీకు లక్ష్యమా! ఊరందరకు మీరేగురువులైయున్నారు. నాకు సందేహములు తోచినపుడు నేను మిమ్ములనే అడుగవలసి యున్నది. నాలుగురోజుల క్రిందట పేరిశెట్టితో కామశాస్త్రిగారి కేమితెలుసునని మీరన్నారటగాదూ, తెలియనివారి వద్దకు మీ రెందుకు వచ్చినారు.

రామ—అయ్యో! మీరు మంత్రసానిదెప్పులు దెప్పుతారని నే నెరుగుదును. కాని సందేహము వచ్చినపుడు అడుగక మానరాదు. పేరిశెట్టితో కామశాస్త్రిగారి కేమి తెలుసునని నేనన లేదు. నేను అన్నట్లు మీరు ఋజువు చేసినట్టయితే మీరుకోరిన గునహాయిస్తాను.

కామ—సరే దానకేమి; అంది తేజుట్టు లేకపోతే కాళ్లుగదా; మీ అవసరంపుంటే మీరువచ్చు నచ్చికలు మచ్చికలువేసి మాట్లాడు

తారు; లేకపోతే మొగమే చూడరు. ఇంతకు మీసందేహమేమిటో చెప్పండీ.

రామ—చెప్పుతానుగాని ఆవిషయము మీతోమనవిచేయుటకే సిగ్గుగానున్నది. అయినప్పటికి చల్లకువచ్చి ముంతదాచడ మెందుకు! మాఅబ్బాయి మరికొందరు పిల్లలుకలసి నిన్నసాయంకాల మాడకుక్క నొకదానిని తీసుకొనివచ్చి దానిపాలు పితికి తాగినారు. రాత్రి నేను తిరిగితిరిగి యింటికి వచ్చినతరువాత మావాళ్ళు నాతో ఈ సంగతి చెప్పినారు. విన్నప్పటినుండి నాకెంతో విచారముగానున్నది. దీనికేదయినా ప్రాయశ్చిత్తమున్నదేమోచూచి మీరుచెప్పవలయును.

కామ—(తనలో) వహవా! ఆడబోయిన తీర్థమెదురయినది. ఇప్పుడే వీడు నాచేత జిక్కినాడు. వీనినిముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించెదను. నాశక్తి యెటువంటిదో వీరికిప్పుడు చూపించి తీర్తాను. వీడిపెద్దలు దిగివచ్చినా యిక వీడు తప్పించుకోలేడు (ప్రకాశముగా) దీక్షితులుగారు! ఎంతపని జరిగినదండి! మీవిషయమయి నాకుచాలా విచారముగానున్నది. మీవాడు మిక్కిలి కుఱ్ఱవాడు శాబోలు.

రామ—అవునండి బొత్తిగా కుఱ్ఱవాడు ఎనిమిదవయేడు.

కామ—అందుకనే నాకు చాలా విచారముగానున్నది. ఈపాపమునకు ప్రాయశ్చిత్తములు చాలా గొప్పవియున్నవి. ధర్మశాస్త్రమునకు పిల్లవాడు పెద్దవాడు అనేభేదంలేదు. శాస్త్రములకు జాలియుండదు.

రామ—శాస్త్రములో నున్నదానికి మీరేమి చేయగలరు. ఉన్నదేమిటో చెప్పండి.

కామ—చెప్పుటకు నాకు నోరేరావడం లేదండి; ధర్మశాస్త్రకర్తలు బొత్తిగా లౌక్యమెరుగరు. వారికి పైదృష్టేగాని లోదృష్టిలేదు

రామ—ఎందుకయినను మేము సిద్ధముగానే యున్నాము. కాబట్టి శెలవియ్యండి.

కామ—(తనలో) వీడు కూర్చున్నపాళముగా కుంగిపొయ్యే టట్టు చెప్తాను. పిడుగు మొత్తినట్టు చెప్పితేనేగాని వీడిరోగము చప్పగా కుదరదు. ఈదెబ్బతో వీని తెగనీలుగణిగి కాళ్ళబేరమునకురావలయు ను (ప్రకాశముగా) కుక్కపాలు త్రాగినవాని నాలుక మొదలంట కోసివేయవలెనని ధర్మశాస్త్రకర్త లందరిలో శిఖామణియని చెప్పదగిన శాకటాయనులవారు చెప్పినారు. ఎఱ్ఱగాకాలిన యినుపముక్కతో నాలుక కాల్చివేయవలసినదని భాండాయనుల వారు చెప్పినారు. ఈ రెండిటిలో మీయిష్టము యేదిచేసినాసరే. లేకపోతే ఆపిల్లవాడు మా లవాళ్ళలో కలసిపోవలసినదే గాని మనకు పనికిరాడు.

రామ—హరిహరి ఎంతమాటండి చంటిపిల్లవాడు. ముక్కుప చ్చలారనివాడు వాడినాలుక చూచి చూచి కోసివేయగలమా. ఇనప ముక్కతో కాల్చగలమా పెద్దవాళ్ళయినా అటువంటి పని చేయలేము చిన్నపిల్లలకా అటువంటిశిక్ష; ఏదయినా ప్రాయశ్చిత్తము మనకు శ క్యమయింది యుండవలెను అసాధ్యాలు యెవరు చేయగలరు.

కామ—(కోపముతో) ఏమిటి! అసాధ్యాలా? కొడుకుచేసినప నులు బాగున్నాయి. పిల్లలను వెధవపెంపులు పెంచి శూద్రసహవా సాలు జేయించి మాలకుంకలులాగ తిరగనిచ్చి కుక్కపాలు పందిపాలు త్రాగించి పైగా మెట్టపంచాంగాలు చెపుతారేమిటి. ధర్మశాస్త్రమా, మజాఖా. శాస్త్రమంటే మన రేవులో స్నానంచేశే బోడిముండలకు సం కల్పము చెప్పడమనుకున్నారాయేమిటి; ఓఅంటేఢంరాని వీనుగులంద రు పెత్తనాలు వహించబట్టే గ్రామము యీలాగు తగులడుతూవుంది. లేకపోతె యేనాడయినా కుక్కపాలు త్రాగడ మెరుగుదుమా? కలిధ ర్మము మండిపోతూ వున్నది. ఈలాగు పూర్వము మాతాతగారు

శూద్రదాసిచేత పాలిప్పించిన బ్రాహ్మణులందరిని వెలివేయించినారు. ఆరోజులే పోయినాయి. ఆసదాచారాలు చట్టుబండలయిపోయినాయి. శాస్త్రిలలో నన్నమాట జెప్పితె నీకంతపుస్సెందుకు? మీకిష్టమయితే ఆలాగు చెయ్యండి, లేకపోతే మానెయ్యండి.

రామ—కామశాస్త్రిగారు! మీరంత కోపపడడానికి నేనేమన్నానండి ధర్మశాస్త్రం చాలా కఠినముగా నున్నదన్నాను. ఆమాట మీరుకూడా ముందే శెలవిచ్చారు. గర్భవాసమవుటచేత చూచిచూచి కుర్రివాడినాలుక తెగ్గొయ్యలేక పామరత్వంచేతను ఆలాగన్నాను. అందులో ఏమయినా తప్పుంటే క్షమించి యింతకంటె తక్కువ ప్రాయశ్చిత్త మేమన్నాయుంటే శెలవివ్వండి. పసిపిల్లవాడు గనుక క్షాంచెము కరుణించండి.

కామ—ఓహోహో కరుణించేటందుకు నాశెలవటయ్యా యిది నాచిత్తముగనుకనా నేనేదో విధముగా జెప్పనా; ధర్మములంటే కత్తిమీదసాములు. ఋషిముండా కొడుకులు వ్రాసిపెట్టిన మాటలు చెప్పినానుగాని నాస్వంతకవిత్వం చెప్పడము లేదు. కరుణించేటందుకు నేనెవడని.

రామ—తమరు కరుణించియింకాయితర గ్రంథాలు చూడవలసినదని నేను కోరినాను. దీనికి రెండవపక్షం మేదయినా యుండకపోదు. తమరు కష్టపడి వెతకండి.

కామ—వెతకడమెందుకు శాస్త్రాలన్ని నాకు హృత్కవిలిగా రానేవచ్చును. ఈమాత్రిపు మహద్భాగ్యానికి పుస్తకాలు వెతుకవలయునా.

రామ—ఇటువంటి శాస్త్రార్థములు మీనాలుకచివర వుంటాయి అని నేనెరుగుదును. అందుకే పక్షాంతరము చెప్పుచున్నాను. అశక్తుల విషయాల్లో శాస్త్రాల్లో మినహాయింపు లుండకపోవు.

కామ—ఉండకపోవు. ఋషులుగూడా తెలివైన ముండాకొడుకులు గాని చచ్చుఘటాలుగారు. సూత్రమేర్పరచేటప్పుడు దేశకాలపాత్రాలు చూచేవేస్తారు వాళ్ళు. దీనికొక పక్షాంతరమున్నది. కుక్కపాలు తాగినవాడు యిరవయితులాల బంగారం తెచ్చి బంగారపు కుక్కను జేయించి ధర్మశాస్త్రాలు తెలిసిన బ్రాహ్మడికి దానమిచ్చి శివాలయములోకి వెళ్ళి అభిషేకంజేసి నూటయెనమండుగురు బ్రాహ్మణులకు సంతర్పణ చేయవలయును. అంత పనిచేస్తే యీపాపం పోతుందన్నాడు. లేకపోతె అటు యేడుతరాలు యిటుయేడుతరాలు పద్నాలుగు తరాలు పట్టి పీడిస్తుందన్నాడు పాపమా మరొకటియా యీలాగున పాపపరిహారం చేసుకోకపోతె యింక నీకు గతులేవు.

రామ— శాస్త్రిగారు! దానికంటె యిది నయమేగాని నాకున్న ఆస్తిఅంతా పోగుజేస్తెపదితులాలు బంగారం కిమ్మతు చెయ్యదు. మాకున్న భూములు రుద్రభూములే. దొప్పెడుయిల్లు మాత్రమున్నది. అదితాటాకుది. అమ్మితే రెండునందలనూపాయలకన్న యెక్కువరాదు. పాత్రసామగ్రి అంతా పోగుజేస్తే యాభయిరూపాయలుండదు. నాభార్య ఒంటిమీద నగలేమున్నవో నీకే తెలుసును. అరుంధతీదేవిలాగ బొందితో నున్నదని నేను చెప్పనక్కరలేదు. యిటువంటిస్థితిలో యిరవయితులాల బంగారము యెక్కడతేగలను. నూటయెనిమిదిమంది బ్రాహ్మణులకు అన్నమెక్కడ బెట్టగలను. యిది నాతరమా నా అబ్బతరమా.

కామ—మీపనంతా ఆటగానుంది. దానికది వల్లగాదంటివి. దీనికిదివల్లకాదంటివి యెక్కడికక్కడే విరుపులా, కొడుకుచేత కుక్కపాలు తాగించి ప్రాయశ్చిత్తం లేకుండా కులుకుతూ కూచోవాలనుకున్నావేమి? చూడు స్వాములవారిపేరవ్రాసి మూడవనాటికి నీకు అంటుపత్రిక జెప్పింపెదను. నీయింటిమీద కాకి అయినా వాలదు. బ్రా

హ్మణుడెవడు నీ గుమ్మం తొక్కిచూడడు. నీవు ఆడింది ఆట పాడింది పాటనా! బ్రాహ్మణ్యం మట్టిగొట్టుకుపోతుందనుకున్నావా యేమిటి.

రామ—బ్రాహ్మణ్యం నిలుపుకోవాలనేగా దూమీదగ్గరకొచ్చి మిమ్మల్నింత ఆశ్రయిస్తావుంటా. నామాటట్టసరేగాని మాపిల్లవానితో పాటు మరికొందరుపిల్లలుకూడా తాగినారు. వాళ్ళగతేమిటి?

కామ—వాళ్ళగతివేరూ మీగతివేరూనా? అందరిగతి వొకటే చెప్పండి వాళ్ళపేళ్ళేమిటో అందరిని పిలిపించి యేటివొడ్డున రావిచెట్టుక్రింద గూరుచోబెట్టి మంగలి గంగన్న చేత బుర్రలుగొరిగించి బంగారపుకుక్కలను దానాలిప్పిస్తాను. ఇవ్వలేకపోతే కొంప గోడ్డి అమ్మి యిచ్చుకుంటారు. అంతేగాని వదిలేస్తానా. ధర్మశాస్త్రం దగ్ధపటలం జేస్తానా. కామశాస్త్రి కంఠంలో ప్రాణముండగా ధర్మాలు ధ్వంసంచెయ్యడు.

రామ—చిత్తము తమరాలాటివారే నేనెరుగుదును. తమకు పక్షపాతమన్నమాటేలేదు.

కామ—పక్షపాతముంటే మన గౌరవాలు దక్కుతాయటయ్యా.

రామ—అందుచేతనే తమతో ఒక్కసంగతి మనవి చేయాదలంచుకొన్నాను. తమరు సావధానంగా చిత్తగించవలయును.

కామ--చెప్పండి కావలసినంత సావధానముగ వింటాను.

రామ—కుక్కపాలు తాగినవాళ్ళల్లో మీవాడు కూడా వున్నాడు.

కామ—(కోపముతో లేచి) ఆ! ఆ! ఎంతమాట యెంతమాట! మాపిల్లవాడెంతో బుద్ధిమంతుడు! నాకు మీకున్న విరోధాలనుబట్టి మీపిల్లవాడు చెడిపోయినాడుగదా అతని మాపిల్లవాడుకూడా చెడిపో

యినాడనిపించేటందుకు గ్రామంలో పూజ్యం చెడగొట్టి అప్రతిష్ట తే వాలన్న దురుద్దేశ్యముతో మాపిల్లవాడి నెత్తిమీద అక్షింతల గింజ లు వేస్తున్నారా. మాపిల్లవాడేమి ఆలాచేయడమేమి. వాడల్లరచిల్లర వాడుకాడు. మీపిల్లలవలె తుంటరివెధవకాడు. ఈలాటి పాపాలాణ్ణం దుకు మీ జిహ్వాలు పుచ్చిపోతాయి. అగ్నిహోత్రంవంటివాణ్ణి ని ష్కారణంగా వుసురు బెట్టుతున్నావు. మావుసురుదగిలి పోతారు మీ రందరు జాగ్రత్త.

రామ—నేను అబద్ధమాడుతున్నానని మీఅభిప్రాయంకాబో లు. కొంచెం శాంతించండి యిక్కడ పదిమంది పెద్దమనుష్యులు చేరి నారు. పేరిశెట్టి వెంకటరెడ్డి గంగినీడు భద్రాచలంగారు నున్నారు. వారినడగండి నిజస్థితి తెలుస్తుంది.

పేరిశెట్టి—కామశాస్త్రులుగారు! మీపిల్లోడు కులాసాగా కు డుచుకున్నాడండి. తక్కినపిల్లలు పితుక్కొని తాగినారు.

భద్రాచలం—శాస్త్రిగారు! ఆమాట నిజమేనండి. నేనుకూడా అక్కడున్నాను.

కామ—(తెల్లబోయి)మావాడే! మావాడే! ఆంతపనిచెయ్య డమే! చెడ్డపిల్లల సహవాసముచేశి చెడిపోయినాడు నాకొంపదీశాడు. ఇది మావాడికిపుట్టిన బుద్ధికాదు. నామీదకక్షచేత నాపరువు తీసివే యించవలెనని ఎవరో వాడిచేత యీపని చేయించారు (అని చతికలప డుచున్నాడు.)

రామ—విచారించిన కార్యమేమిటి. అందరికిగలిసి యేదో ఒక ప్రాయశ్చిత్తం నిర్ణయించండి తమరు పక్షపాతంలేనివారు. బ్రాహ్మ ణ్యం నిలబెట్టేవారుగదా. కంసాలివీరయ్యను బిలచి యిద్దరము చెరి యొక బంగారముకుక్కను చేయింతాముదండి. మనయిద్దరంగలిసి భవి శేశ్వరములోవుండే బ్రాహ్మణ సోమయాజులుగార్కి దానమిత్తాము,

కామ—(తనలో) ఈముండాకొడుకు గడుసుబుర్ర. ముందుగా నాకొడుకుమాటచెప్పక నాచేత అడ్డమయిన పేలాపన పేలించి చివరకు నాగుట్టు బయలుపెట్టినాడు. యిప్పుడేముపాయము. ఈనిర్భాగ్యులకెవళ్ళకీ ధర్మశాస్త్రాలు తెలియవు. అందుచేత సమయస్ఫూర్తిగా మాట్లాడి ఒక్కదాటు దాటుతాను. నాయుపాయమువల్ల రామదీక్షితుడుగాడు దాటిపోతాడు అదే విచారము. అయితేమిలే యింకొక మాటు దొరక్కపోతాడా కానీ.

రామ—ఏమంటారు శాస్త్రుల్లుగారు. కంసాలి వీరయ్యను పిలిపించనా.

కామ—ఉండవయ్యా నీతొందర కూలిపోను. బంగారం మూలుగుతోందాఏమిటి యింట్లో? ధర్మశాస్త్రాలు మళ్ళీ తిరగేస్తూన్నానుండండి. నిన్న ఆదివారముకాదూ; నాల్గుగడియల ప్రొద్దువేళగాదూ యీపని జరిగినది, మాపిల్లవాని కెనిమిదోయేడు మీపిల్లవానికి అంతేకాదూ వయస్సు.

రామ—చిత్తము ఆలాగేనండి.

కామ—అయితే చెప్పుతున్నానువినండి. ఆదివారంనాడు నాల్గుగడియల ప్రొద్దువేళ యెనిమిదేండ్లపిల్లవాళ్ళు నల్లకుక్కపాలుత్రాగినట్టయితే అదితప్పుగాదని గండాయనస్మృతిలోనున్నది. అందుచేత మన పిల్లలు కనకశునకదానములు యివ్వనక్కరలేదు.

అందరు—(పక్కుననవ్వి) ధర్మశాస్త్రం చాలా బాగానున్నది.

రామ—మీమాటే ధర్మశాస్త్రం; మాకు యిదివరకు మనుస్మృతి పరాశరస్మృతి విన్నాముగాని శాకటాయన భాండాయన గండాయనస్మృతులు వినలేదు. ఇవన్ని తమ హృదయంలోనే యున్నవి. ఏమయిన మాపిల్లవానికి ఆపత్తుతప్పింది. మనమందరము నేటిదినము కనకశునకప్రహసన [illegible] సుగాని నా

కంఠియంతనొప్పి నురేది లేదన్నాడట ఒకడు. ఆలాగే మీపిల్లవాడు దోషికాగానే ధర్మశాస్త్రిలు తల్లక్రిందులయిపోయినాయి. బంగారు కుక్కలతో పని లేకపోయింది. నోరుంటే తలగాస్తుంది. ఏమయితేనేమి. మాఆపత్తు తప్పిపోయినది. శెలవు పుచ్చుకుంటాము.

(అందరు నిష్క్రమించుచున్నారు)

—o:o—

# మహారసిక ప్రహసనము

## రంగము 1.

[రుక్మిణీబాయమ్మయు సుందరమ్మయుఁ బ్రవేశించు చున్నారు.]

సుంద—(కన్నీరు వెట్టుకొనుచు) రుక్మిణీబాయమ్మగారూ! చూచారా యీఅన్యాయము. ఇంతంత ఘాతలు చేయుదలచుకొంటే మా వంటివాళ్లు బ్రతకడమేలాగు. నావంటివాళ్ళు మీకు లేరా? కూటికి పేదవాళ్ళమైతే కులముకు పేదవాళ్లమా? ఏమైనా నోరెత్తితే మీరు గొప్పవాళ్ళు. ఎంతో కోప మొస్తుంది.

రుక్మి—(తెల్లబోయి) సుందరమ్మగారు! మీగొడవేమిటో నాకు తెలియదు. సంగతేమిటో చెప్పకుండా వూరికే కేకలువేస్తే ప్రయోజనమేమిటి? మిమ్మల్ని నేనేమైనా అన్నానా! అవవసరంగా కేకలు వేస్తా రెందుకు?

సుంద—అనవసరంగా వేస్తున్నానా కేకలు. నన్నింతమాట లాడవచ్చునా? ఈసంగతులు మావాళ్ళువింటే నన్ను బ్రతకనిస్తారా? మీయందరికి మల్లేనే నేనుకూడా పెనిమిటితో కాపురము చేస్తున్నదా న్నేగదా! భోగముదాన్ని గాను! గుడిశేటిదాన్ని కాను. పేదవాళ్లమై

మీయింటికి ముత్తైదువుగా వచ్చినందుచేత యిల్లా పరాభవంచేయుట న్యాయమా !

రుక్మి—సుందరమ్మగారు! ఇదేమి పాపమండి మిమ్మల్ని యెవర న్నారో యేమన్నారో చెప్పకుండా నామీద ఆలా గెగిరిపడతా రేమి నేనేమైనా మిమ్మల్నంటే నామీద కోపపడవచ్చును. ఏవిధమైన అప రాధము చేయనిదాన్ని నన్నుపట్టుకొని మీయిష్టమువచ్చినట్లు దులిపి వేస్తే నేనేమిచేయగలను.

సుంద—మీరుమిక్కిలి నేనుదులిపి వేసినా నంటున్నారా! మీ చేష్టలు బాగున్నవా ?

రుక్మి—నాచేష్ట లేమిబాగున్నవికావో చెప్పరాదటమ్మా ?

సుంద—మీచేష్టలంటే కేవలం నీచేష్టలేనా ?

రుక్మి—మరెవరి చేష్టలు ?

సుంద—మీపంతులుగారిచేష్టలు యెంతమాత్రం బాగున్నవి కావు.

రుక్మి—ఏమి ! మాపంతులుగా రేమిచేసినారు ?

సుంద—ఏమిచేసినారని అడుగుతున్నారా మెల్లిగా. నేనేమని చెప్పుకోను. మీదాసీదాన్ని గంగి నడగండి తెలుస్తుంది. మీరుగొప్ప వారైతే మీగొప్పతనము మీరేయుంచుకోనవలె. మీకైశ్వర్యముంటే మేడలుమిద్దెలు కట్టుకుంటారు. నగలునాణెములు పెట్టుకొంటారు. పరువు మీకుమాకు సమానము. దాసీముండ గంగిచేత మదనగోపాల రావుపంతులుగారు నాకు కాసులు పేరిస్తామని వర్తమానమంపించినారు. ఇంతకంటె ఘోరముున్నదా ? పదిమందిలోను నేనెంత పరువుగలిగి బతుకుచున్నానుగదా ! నన్నిట్లవమానము చేయవచ్చునా ! నే నెవరిత ననుకొన్నాడో ఆయన. ఈసంగతి నేనింకామావారితో చెప్పలేదు. చెప్పినానంటె [illegible] చెప్పి నూ

కలు వేయింతామని నే నూరుకొన్నాను. ఇన్నాళ్లనుంచి నేనీవూళ్లో యున్నాను. ఎంతమందియిండ్లకో వెళ్ళుతుంటానువస్తువుంటాను. ఇల్లాంటి దెప్పుడైనా వుందా ? ఈమున్సిద్ధులు మీవారికి తప్ప మరెవరికి పుట్టలేదు.

రుక్మి—అయ్యయ్యో! ఎంతమాట సుందరమ్మగారు ! ఆమాట నే నెరుగను. మాపంతులుగారు చేసినది చాలాతప్పు. వారు క్షమించవలెను. ఇవి చేతులుకావు కాళ్ళు. (అని చేతులు పట్టుకొనును.)

సుంద—అయ్యయ్యో రుక్మిణిబాయమ్మగారు! అంతమాటసెలవియ్యవద్దు. మీరొకతల్లి నేనొకబిడ్డను. మీరు చేతులుకాళ్ళు పట్టుకొనక్కఱలేదు. నాకిటువంటి పరాభవం మళ్లీజరగకుండామాత్రం చేయించవలెను. గంగినికూడా మీరు గట్టిగా చీవాట్లు పెట్టవలెను.

రుక్మి—అయ్యయ్యో చీవాట్లు పెట్టనా? మీరీసంగ తెక్కడా చెప్పవద్దు. అందరిని తగినట్టుమందలిస్తాను.

సుంద—అమ్మా ! నేను సెలవుపుచ్చుకొని వెళ్లుతాను. నేనిల్లా అన్నానని తమరు మనస్సులో నుంచుకొనవద్దు.

రుక్మి—నా కెంతమాత్రం కోపంలేదు. సంగతిచెప్పడంవల్ల నాకెంతో మేలుచేసినారు. ఇంక మీరు వెళ్లండి.

సుంద—చిత్తము (అని వెళ్ళుచున్నది.)

రుక్మి—(తనలో) అబ్బబ్బ! ఈయనతో నేను వేగలేకుండా వున్నాను. ఈయనకిప్పటికి నలభైసంవత్సరములు దాటినవి. యాభైయేళ్ళుసమీపించుచున్నవి. ఇప్పటికిపాడుబుద్ధివదలలేదు. ఈయనచిన్నతనపుచేష్టలు తలుచుకొంటే నాకెంతో సిగ్గగుచున్నది. చీవాట్లు పెడుదామంటే మొండితన మెక్కుతుందేమోయని భయంగావున్నది. మెత్తమెత్తగా మిక్కిలి చమత్కారంగా మందలించవలెగాని మోటతనంగా మందలించగూడదు. అయినా గంగినిబిలిచి సంగతేమిటో కనుక్కొంటాను. (ప్రకాశముగా) ఓసే! గంగీ! ఏమిచేస్తున్నావు ?

గంగి—(ప్రవేశించి) అమ్మా ! యెందుకండి. అంట్లుతోమడాని కెల్తావున్నాను.

రుక్మి—ఓసీ ! పంతులుగారికి నీమీద దయ యెక్కువైనట్లున్నది.

గంగి—అదేం టమ్మా అలాగంటారు ?

రుక్మి—కాదులే! నీమొగము చూస్తే నాకాలాగు తోస్తోంది. పంతులుగారు నీతో తరుచు గుసగుస లాడుచున్నారు. నీకథంతా నాకు తెలిసిందిలే.

గంగి—ఏమున్నదండి నాకథ తెలిసేటందుకు. పంతులుగారు నాతో యెప్పుడు గుసగుస లాడ లేదండి.

రుక్మి—లేదంటె పోతుందా ! సుందరమ్మవచ్చి నాతో నీగుట్టు మీపంతులుగారిగుట్టు బయటపెట్టింది. పంతులుగారు కాసులపేరిస్తారని సుందరమ్మతో చెప్పినావటకాదూ ! అబ్బో ! కొత్తవుద్యోగం సంపాదించినావే నీవు తారుపుకత్తెవైనావుకాబోలు ! దాసీపనిలో నీకంతగా డబ్బు దొరకలేదు గాని కొత్తవుద్యోగంలో డబ్బు దొరుకుతుందిలే.

గంగి—అమ్మగా రమ్మగారు, లేదండి లేదండి నే నెరగనండి.

రుక్మి—యెరగవా; సరె! సుందరమ్మపెనిమిటి యీసంగతివిన్నాడులే నిన్ను చెప్పుదెబ్బలు కొట్టి యీడ్పించదలచుకొన్నాడు. అప్పుడు పంతులుగారు అడ్డమొస్తారో యెవరడ్డమువస్తారో చూస్తుగాని.

గంగి—అమ్మగారు ! రక్షించండి రక్షించండి. బుద్ధినేరక తెలివితక్కువపని చేశానండి.

రుక్మి—సరె! ఆదారిన రా ! బాగున్నది. జరిగినపని నేమిటో చెప్పునీకు ప్రమాదము లేకుండ చేస్తాను.

గంగి—అమ్మా ! అబద్ధం చెప్పను. నిజం మనియిశేస్తావినండి నిన్న మద్దినాల్ల లేచు చేసుకుంటావుంటె అయ్యగారు నాకాడికొ

చ్చి రూపాయ నాచేతిలో పెట్టి "గంగీ! నేనొకమాట చెప్తాను వారితో చెప్పవుగదా,, అన్నారు. వేదముండాదాన్నిగనుక రూపాయకాశపడి యెవరితో జెప్పను బాబయ్యాఅన్నాను "ఓసీ! మనింటికి పేరంటకానికి వచ్చేసుందరమ్మగారిని నేను పిలిచినానని పిలు. కాసులుపేరిస్తా"నని అయ్యగారన్నారు. చిత్తం బాబయ్యా అని నేనెల్లి ఆయమ్మగారితో జెప్పాను. చెప్పగానె ఆయమ్మ కళ్ళెఱ్ఱజేసి దుమ్మెత్తిపోసింది. నేను దడిసి పారిపోయొచ్చాను.

రుక్మి—ఈమాట పంతులుగారిత్తో జెప్పావా ?

గంగి—చెప్పలేదు. అయ్యగారు నాకింకా కాపడలేదు.

రుక్మి—సరె! నేను చెప్పినట్టు వింటావా ?

గంగి—వింటానండి.

రుక్మి—ఇక ముందెప్పుడు యీలాంటిపనులు చేయకు. బుద్ధితెచ్చుకో. నేనొక రహస్యము చెప్తానురా. (అని చెవిలో రహస్యము చెప్పును)

గంగి—ఆలాగే చేస్తానండమ్మ. ఈమాట తప్పితే చెప్పులో గొట్టండి. బుద్ధి గడ్డితిని కానిపని చేశాను.

రుక్మి—అదిగో, పంతులుగారొస్తున్నారు. నేను లోపల పనిచేసికొనుటకు వెళ్ళుతున్నాను.

(అప్పుడు మదనగోపాలరావుపంతులుగారు ప్రవేశించుచున్నారు.)

మదన—(తనలో) గంగి తెలివిగలముండ. ఎటువంటివాళ్ళనైనా టోపీ పెట్టగలదు. అది కార్యసాధనం చేసేవుంటుంది. దీని మొఖం కలకలలాడుతోంది. అందుచేత తప్పకుండా కార్య మయ్యేవుంటుంది.

(అని గంగిని చేతితో రమ్మని సంజ్ఞచేయును.)

గంగి—(నవ్వుచు వెళ్లి) ఎందుకండి బాబయ్యా !

మద:—గట్టిగా మాటలాడకే మీ అమ్మగారు వింటారు.

గంగి—అమ్మగారు లోపల మడిగట్టుకొని పని చేసుకుంటు న్నారండీ. బయంలేదు.

మద:—సరె, సుందరమ్మ కనపడిందా ?

గంగి—కనపడిందండి.

మద:—నే చెప్పమన్నమాట చెప్పావా ?

గంగి—చెప్పానండి.

మద:—ఏమన్నది. కోపపడలేదుగదా ?

గంగి—కోప్పడలేదండి, సరేన్నదండి.

మద.—నిజంగానె నిజంగానె సరేఅన్నదా, అవును మూడు వందలరూపాయల కాసులపే రొస్తూంటే చేదా యేమి. అందులో నీవు వెళ్ళితే కార్యము చెడిపోతుందా ? బాగుంది అయితే యెప్పుడొస్తా నన్నది ?

గంగి—తమరు కాసులపే రెప్పుడు సిద్ధంచేస్తే అప్పుడు.

మద:—కాసులపే రెంతసేపు, కంసాలిశీతన్నదగ్గర కాసులపే రొకటి అమ్మకమునకు సిద్ధముగానున్నది. అది కొని పట్టుకొస్తాను. ఈ వేళ రాత్రికే రమ్మని చెప్పు. రాత్రి పదిగంటలైనతరువాత మనయిం టివెనుక తోటలోనున్న బంగాళాలోనికి తీసికొనిరా.

గంగి—చిత్తము. కాసులపేరుమాత్రం రాత్రి జేబులో వేసికొ ని తీసుకురండి.

మద—సరే నీవు వెళ్ళు. ఇదిగో ఈరూపాయకూడా తిసికో. రేపుఉదయం యింకా రెండురూపాయ లిస్తాను.

గంగి—మీయనుగ్రహము బాబయ్యా !

(అని నిష్క్రమించుచున్నది)

మద:—(తనలో) నాచిరకాలమనోరథము నెఱవేరినది. ఇ ప్పుడే కాసులపేరు కొని పట్టుకొస్తాను (అని లోపలికివెళ్లి) ఏజేం

స్తున్నావు ఇల్లారా, నాకీరాత్రి పెందరాళే వంటచెయ్యాలి, ఎనిమిది గంటలకు భోజనంచేసి వెళ్లిపోవాలి. పనుందినాకు.

రుక్మి—ఎక్కడికి వెళ్ళుతారు?

మద—చీ! నోరుముయ్య పనున్నది వెళ్ళవలెనంటే యెక్కడికివెళ్లుతారని అడుగుతావా? ఎప్పుడువస్తుంది నీకు జ్ఞానము, నలభైయేళ్ళు నెత్తిమీదకొచ్చాయి నీకు. యప్పటికింకా బుద్ధిలేదు నీకు ఎక్కడికని యడుగుతావా? అడుగగూడదన్నమాట చిన్నపిల్లకుగూడ తెలుసునే. ఇంత బుద్ధిమాలినదాన వన్నమాట యెఱుగను. మగవాళ్ళకు నూరుపను లుంటవి,

రుక్మి—ఔనౌను, పొరబాటే చేశాను. అడుగగూడదు. బుద్ధి తక్కువవాళ్ళకు వయస్సుతో పనేమున్నది. బుద్ధిమాలినపనులు చేసేవాళ్ళకు నలభైయేళ్ళున్నా వకటె యాభైయేళ్ళున్నా వకటే. సరె. యెనిమిదిగంటల లోపుగానే వంటచేస్తాను, వెనుక మీరు దుద్దులజత వకటి మంచిదుంటే తెమ్మని షరాబు పేరిశెట్టితో చెప్పినారు. మంచిజతవొకటి అమ్మకమునకు వచ్చినదని చెప్పాడు మీరు నాకది కొంటారా?

మద—సింగినాదం జీలకఱ్ఱకొంటాను. చేతిలోడబ్బులేక నేను చిక్కుపడుతుంటే నీకు దుద్దులజతలు తోడాలు జతలు కావాలేమి?

రుక్మి—డబ్బులేకేమి? నిన్ననేగాదూ బోడసకుఱ్ఱుతోటతాలూకు వెయ్యిరూపాయిలొచ్చింది.

మద—అదింకా వుందనుకున్నావా యేమిటి? ఇవ్వవలసినవాళ్ళకప్పుడే యిచ్చివేసినాను.

రుక్మి—మనకే వొకరియ్యవలెనుగాని వొకరికి మన మియ్యనక్కరలేదు.

మద:—ఇట్టే అధికప్రసంగాలు చేయక వెళ్లి వంటచేసికో. ఆడుదానికి చనువియ్యకూడదని యిందుకే అన్నారుపెద్దలు. నీకంతకం తకు పెంకితనము ముదిరిపోతున్నది. తగినట్టు బుద్ధిచెప్పవలెనోకసారి.

రుక్మి:—బుద్ధిలేకనె యీలాగున్నాను. (అని వెళ్లిపోవును.)

మద:—ఓసీగంగీ! నేను తలంటిపోసికోవాలి. నీళ్ళుపెట్టు. మంగలిమాచిగాడిని పిలిచికోనిరా!

గంగి—చిత్తము బాబయ్యా.

(అని నిష్క్రమించును.)

## రంగము 2.

[చావడిలో కుర్చీమీఁదఁ గూర్చుండి మదనగోపాలరావు ప్రవేశించుచున్నాఁడు.]

మదన:—(తనలో) అబ్బబ్బ! ఈదిక్కుమాలిన గడియారం యెంతసేపటికి పదికొట్టదేమి? యిప్పుడెన్నిగంటలయినదో? ఓహో! తొమ్మిదిన్నరైంది. పదిగంటలైనతర్వాతకదా సుందరమ్మ నస్తానని కబురంపినది. ఇంకా గంటన్నరసేపు కూర్చోవాలి కాఁబోలు. అబ్బ! నిమిష మొకయుగములాగున్నది- ఈగంటనరకాల మేలా గడుపగలను. పోనీ నిద్రపోదునా? నిద్రపట్టనేపట్టదు. పట్టినా సమయానికి మెలకువ రాదు. అందుచేత నిద్రపోవుటకు ప్రయత్నముచేయనేకూడదు. పోనీ చదువుకుందునా? మనస్సు పుస్తకంమీఁది కెళ్ళడంలేదు. పోనీ యేదైనా పాట పాడుకుంటాను. "తత్తరపడనేల తాళుతాళురసామి" (అని పాడుచుండును.)

(అప్పుడు గంగి ప్రవేశించుచున్నది.)

మదన—గంగీ! యిప్పుడు తొమ్మిది గంటలైనది, ఈపాటికి నీవు వెళ్లి ఆబిడను తీసికొనిరా?

గంగి—ఇప్పు డప్పుడే కాదండి! వారింట్లో యీపాటికి భోజనాలేకావు.

మదన—కాసుల పేరు కొంకతెచ్చినానని చెప్పుసుమా. తేలేదనుకొని రాకపోవునేమో!

గంగి—అలాగే చెప్తానండి! ఆబిడ పదిగంటలు దాటితేకాని రాదు. అందాక తమరిక్కడే కూర్చోండి. నేనొచ్చి మిమ్మల్ని తీసికెళ్తాను, నేను పిలవండేమాత్రము మీరు తొందరపడిరాకండి.

మదన—సరే! నేను తొందరపడిరాను. ఇక్కడ మేలుకొని యేదోపాడుకుంటూ కూర్చుంటాను. ఏతే మీయమ్మగారేంచేస్తూంది.

గంగి—ఇప్పుడే పనంఇంది. తాంబూలము వేసికొంటున్నారు.

మదన—త్వరగా పడుకో మని చెప్పు.

గంగి—పంతులుగారు పనున్నది యెక్కడికో వెళ్లవలె భోజనంచేసి వెళ్లుతా సన్నారు. వెళ్లలేదే మని అమ్మగారన్నారు.

మదన— తీరా భోజనముచేసినతర్వాత నేనెవరిదగ్గరకువెళ్లాలనుకున్నానో ఆయన వూళ్లోలేరు. అందుచేత వెళ్లనక్కరలేకపోయింది. అయితే ఆబి డేమైనా అనుమానపడుతుందా యేమి? నేనుతలంటుకోవడం, భోజనంచేయడంవల్ల ఆబిడ కేదైనా సందేహం తోస్తుందా యేమిటి?

గంగి—అమ్మగారికి సందేహ మేమితోచలేదుకానండి. దుద్దులజత చేయించారు కారని కోపంగా వుందండి.

మదన—దుద్దులజత కేమి యెప్పుడో వకప్పుడు చేయిస్తాను.

గంగి—సుందరమ్మగారికంటే మూడువందల రూపాయల కాసులపేరు కొన్నారు. అమ్మగారికంటే నూరురూపాయలు మీకాడలేక పోయినవి. ఇదిబాగుందా ?

మదన—ఆమాట కేమిలే. నీవువెళ్లి ఆపని చూడు!

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

## రంగము 3.

### తోటలో బంగాళా.

[అప్పుడు మంచముమీఁద పండుకొని యొక స్త్రీయు గంగియు ప్రవేశించుచున్నారు.]

స్త్రీ—ఓసి గంగి! పదిగంటలు దాటిపోయిందే! పాపము పంతులుగారు నిద్దురపోకుండా మేలుకొన్నారుగాబోలు. త్వరగా వెళ్లితీసుకొనిరా?

గంగి—పంతులుగారిమీఁద మీకు జాలి యెక్కువగావుందే.

స్త్రీ—ఏడ్చినావులే. వెళ్లితీసుకొని రా.

గంగి—యిదిగో యెల్తావున్నాను. (అని కొంతదూరము వెళ్లి) వోవరావచ్చేవారు!

(మదనగోపాలరావు ప్రవేశించుచున్నాఁడు.)

మదన—నేను గోపాలరావును ఎవరు వారు?

గంగి—నేను బాబయ్యా! గంగిని. తమరే వస్తున్నారా?

మదన—నీ వెంతసేపటికి వచ్చావుకావని నేనే బయలుదేరి వచ్చాను. ఆబిడవచ్చిందా?

గంగి—వచ్చిందండి! కానులవేరు తెచ్చారా అని మాటిమాటి కడుగుతూందండి!

మదన—కొన్నానని చెప్పకపోయినావా?

గంగి—సెప్పానండి! ఆరికి నామాట నమ్మకమా.

మదన—తెచ్చానని యిప్పుడు చెప్పు.

గంగి.—యిదిగో మెల్లివస్తాను. (అని లోనకు వెళ్లుచున్నది.)

మదన—(లోపల బ్రవేశించి) గంగి! దీపములేకుండా చేశావటే. ఇంటికివెళ్లి దీపము పట్టుకురా.

గంగి—దీపము పెట్టితే అమ్మగా రనుమానపడి తోటలో దీప మెందు కున్నదని అడుగుతారు. అందుచేత పెట్టలేదు. తమరు తెమ్మంటె తెస్తాను.

మదన—తీసికొని రావే. చీకటింట్లో మొకం కనపడకుండా సరస మేమిటి? ఏది యెక్కడ ఉంది సుందరమ్మ !

గంగి—దక్షిణపుగోడదగ్గిర మంచముందండి ఆమంచముమీద తొంగున్నారు.

మదన—సుందరమ్మా ! సుందరమ్మా !

స్త్రీ—(తనలో) నేను పలుకక యీయనను కొంతసే పాడించెదను.

మదన—పలుకదేమే.

గంగి—కొత్తగనుక సిగ్గండి !

మద—(మంచముదగ్గిఱగా వెళ్లబోయి స్తంభముమీద పడి) అబ్బబ్బ! మొఖము బద్దలైంది, దిక్కుమాలినముండా ! దీపము తెమ్మంటే తెచ్చావుకావు. అప్పుడే యుసిరికకాయంతబొప్పి కట్టింది.

స్త్రీ—(తనలో) ఈలాటివి రెండుమూడుబొప్పిలు కట్టితేకాని యీబాడ్యము వదలదు.

గంగి—కొంచెము సున్నం బెల్లం తీసకరానాండి పట్టేనుకొనేందుకు.

మద—ఏడ్చినట్టేవుంది నీసలహా. పట్టువేసికొనియింటికివెళ్లగానే ఆవిడగారనుమానపడి బాధపెట్టేందుగా ? అసలే శంఖణీముండ నా పెళ్లాము. ఆవలిస్తే పేగులు లెక్కపెడుతుంది.

స్త్రీ—(తనలో) పెండ్లాము శంఖణీముండా, యీలాటిపనులు చేసే మహానుభావుఁడు పెద్దమనిషి కాఁబోలు ! సోసీ, పెళ్లాముపేరు చెప్తే యీమాత్రము భయముంటే చాలు.

గంగి—అమ్మగారు దగ్గఱ లేరుకదాయని మీాయిష్టమొచ్చినట్లు తిడుతున్నారా!

మద.—నేను తిట్టానా? అది పెంకిభడవలలో మొదటిరకం.

గంగి—సరె నొప్పి కొంచెం సద్దుకున్నదాండి. నెత్తురు రాలేదుకదాండి.

మద:—నెత్తురు రాలేదు. నొప్పి కొంచెం సర్దుకున్నది. ఏదీ మంచము.

గంగి—తిన్నగా వెళ్ళండి

మద:—(వెళ్ళి) అబ్బ! మంచముకోడు మోకాలికి తగిలిందే. సీయమ్మ కడుపుకాల. దీపం తెమ్మంటే తేవేమి?

గంగి—తిట్టకండి తెస్తాను.

స్త్రీ—(తనలో) ఇక్కడికి రెంకుబొప్పిలు కట్టినవి.

గంగి—కొంచెము తమాయించుకొని మంచంమీాద కూకొని పిలవండి.

మద—నొప్పి తమాయించింది. కూచున్నాను మంచంమీాద. సుందరమ్మా! సుందరమ్మా! పలుక వేమి?

గంగి—నిద్రపట్టిం దేమోనండి.

మద:—అయితే మళ్ళీపిలుస్తాను సుందరమ్మా! (అనిమీాద చేయివైచి లేపును) ఇదేమిటే సుందరమ్మ సన్నంగా వుంటుందిగదా! చెయ్యి లావుగావున్న దేమి?

గంగి—తమకు దూరంనుంచి చూచి సన్నంగా వున్నదనుకొన్నారుగాని ఆబిడా లావేనండి.

మద:—ఏమిటే లావంటావు?

గంగ—మీాకు తెలియదండి! లావేనండి!

మద:—సుందరమ్మా! యింతలో నిద్రపట్టిందా?

గంగి—నిద్రకా దేమోనండీ! బెట్టుసరేము.

మద:—బెట్టుసరెందుకు? చల్లకువచ్చి ముంత దాచవచ్చునా?

గంగి—కాసులపేరు చేతిలో పడిందికాదని బెట్టుసరి. సమయం దాటిపోతే తర్వాత మీరిస్తారో యివ్వరో.

మద:—ఇదా నీసందేహము. నేనేమిమాటదబ్బఅమనిపి. నను కొన్నావా యేమి! ఇదిగో కాసులపేరు. ఇదిఅరకాసులపేరు నలభై అర కాసులున్నాయి. మూడువందల యాభై రూపాయలు కిమ్మతు. ఇదిగో! యీకాసులపేరు వేసికో! (అని చేతికిచ్చును)

స్త్రీ—(తనలో) ఎంతదక్కితె అంతేలాభం. (అని పుచ్చుకొని మెడలో వైచుకొనును)

మద:—సుందరమ్మా! బాగున్నదా కాసులపేరు?

స్త్రీ—ఊఁ!

మద:—ముందునెలలో కంటె చేయించిపెడతాను. ఆపై నెలలో తోడాగొలుసులు చేయిస్తాను.

స్త్రీ—(తనలో) అబ్బ! సుందరమ్మంటె యీయనకు శరీరం పరవశమైపోతూంది. కొంపంతా దోచిపెట్టేట్టు కనబడుతున్నాడు.

మద:—ఇప్పటికైనా మనసిచ్చి మాట్లాడవేమి? సిగ్గా బెట్టుసరా భయమా యేమిటి?

గంగి—భయమే నండి. అమ్మగారంటేఆబిడకు గడగడ. అమ్మగారి కీసంగతేలాగైనా తెలుస్తుందేమో అని, తెలిస్తే వూళ్ళోవుండనీయకుండా కొడుతుందని యెంతో అంత భయపడుతున్నారండి.

మద:—ఏలా తెలుస్తుంది మీఅమ్మగారికి? నే జెప్పనుకదా! నాగొంతుకకు నే వురేసుకొంటానా యేమిటి? సుందరమ్మవెళ్ళి చెప్పుకోదుగదా! అంతవిరుద్ధం లోకంలో వుంటుందా? ఇకెటువచ్చినా నీవు చెప్పాలి నోట్లో నూవుగింజ దాగనిముండవు. అంతేనా సుందరమ్మా!

స్త్రీ.— ఊఁ!

మద:— ఇది బయలుపడిందంటే నీవే బయలుపెట్టావన్న మాట. ఇది మీయమ్మగారితోగాని, మఱెవరితోగాని అన్నావంటే నిన్ను చీమలచింతకు గట్టించి చిట్లనారింకమ్మచీఱినట్లు చీఱి నీకొప్పు గొఱిగించి యీవూరునుంచి సాగతోలేస్తాను.

గంగి—అమ్మనాయనో! నేనెందుకు బయలు పెడతానండీ! తమ అనుగ్రహం వుంటే రూపాయలిస్తారు. చీరలిస్తారు. యెన్నోయిదాల పీదముండాదాన్ని నన్ను కనిపెడతారు. యియన్నీ చెడగొట్టుకొంటానా? నాకూట్లో నేనే మన్నేసుకుంటానా?

మద:—చెప్పకుండాదాచి యీలాగే సుందరమ్మను తీసుకొస్తూ పోతున్నావంటే, సాలు కేలాగైనా పాతికరూపాయలసొమ్ము నీకు ముట్టచెప్తాను.

గంగి—చిత్తము బాబయ్యా! ఆలాగే వుంటాను.

మద:—అయితే యింక మీయమ్మగారివల్ల భయమే అక్కఱలేదు. ఒకవేళ అనుమానపడి మీయమ్మగారు సుందరమ్మ నేమన్నా అంటుందనుకో, అంటే తక్షణం నాతో చెప్పండి.

గంగి—చెపితే యేం జేస్తారు?

మద:—ఏంజేస్తానా, నాకోపము నీ వెరుగుదువుకదా! వీపు బద్దలకొట్టేస్తాను. నగలన్నీ లాక్కుంటాను. తలవెండ్రుకలు వెదపలాగున యింట్లోమూలల కూర్చోపెడతాను. లేదా, పుట్టినింటికి తోలేస్తాను, నాకుకానివాళ్ళునాకు లేనివాళ్ళే.

స్త్రీ—(తనలో) ఆహా! యేమిసాహసము. ఏమిపౌరుషము. ఇవతలవాళ్ళే అంతచాతగానివాళ్ళు కాబోలు.

గంగి— [illegible]

మద—నేను దాన్ని వదలి వేసేసి కావలిస్తే మళ్ళీ పెళ్లాడుతాను. అది కట్టుఃపొగరుబోతన్నమాట నాకు తెలుసును. దానిగర్వముచే తనే సేనీలాగున పైవాళ్ళ స్నేహము చేస్తున్నాను. అది గయ్యాళిగం పయై ఉన్నగోడు చెడగొట్టుకుంటూంది. అందుకే దాని కీమధ్య నేను నగలు చేయించడం మానివేశాను. ఇంకా నీకుభయమెందుకు?

గంగి—ఈపర్యాయము భయపడ నక్కఱ లేదమ్మా.

మదః—సుందరమ్మ! విన్నావా నాప్రతిజ్ఞ.

స్త్రీ—ఊం!

మదః—లేచి కూర్చో!

గంగి—ఆబిడ కింకొక్క అనుమాన మున్నదండి.

మదః—అదేమిటో చెప్పు! ఉన్నఅనుమానాలన్నీ యిప్పుడే తీర్చుకోవాలి.

గంగి—రెండు నెల్లో మూడునెల్లో స్నేహితముచేసి వదలివేస్తారేమో, రెండు విధాలా చెడిపోయినదాన్నే అవుదును. శాశ్వతంగా వుంటారో లేదో తెలిసికోవాలని ఆబిడకుందండి.

మదః—ఆలాగున తెగేసిచెప్పరాదూ అభిప్రాయమేమిటో. నేను స్నేహంచేస్తే యావజ్జీవము చేసేవాడనేకాని రెండు నెలలూ మూడునెలలు చేసేవాడను గాను. నామాటంటే వేదాక్షరం. నేను నీకోసం చిరకాలాన్నుంచి తపస్సు ధారపోస్తున్నాను. నిజంగా అన్నం తినడంలేదు. నీరు తాగడం లేదు. నిద్రపోవడంలేదు. కచ్చేరీపనిచూడడం లేదు. సుందరమ్మంటే రంభ ఊర్వశీ మేనకల మించింది.

గంగి—అంత అన్నం దినకుండా నిద్ర పోకుండా వుండడమెందుకండీ! సుందరమ్మగారు మాఅమ్మగారికంటె యెక్కువ చక్కనివారా యేమిటి?

మద:— మీయమ్మగారా! దానీదానవగుటచేత శేనిపోనిదురభి మానం పెట్టుకొని పూసుకొని వస్తున్నావు. మీయమ్మగారికి చక్కదనంకూడానా? ఆబిడకూచక్కదనానికీ నూరామడదూరం. చిన్నతనంలో నేనెఱుఁగనపుడు నాకొక్క మద్దిరోలు తీసికొచ్చి కట్టిపెట్టినారు. మెంటాలమ్మలాగు వొడ్డూ పొడుగుంటేసరా! అందంచందం అక్కఱలేదూ, ఆమొఖంచూస్తేనే అసహ్యం నాకు. పగలు చూస్తే రాత్రి కళ్లోకి వస్తూంటుంది. పేడబొమ్మకు తగిలించినట్లు యిన్నినగలు తగిలించుకోగానే సరా? సుందరమ్మనిలుచున్నచోట నిలుచునేందుకైనా పనికిరాదు. సుందరమ్మ బంగారపుబొమ్మ. అందానికిదోడు గుణాలు కూడ దిక్కుమాలినవికదా. దాన్ని చూస్తేఅంతకంతకు నాకు డోకొస్తుంది. నేను యింతకూ మంచివాడనుకనుక ఆదౌర్భాగ్యురాలితో యింతవఱకు కాలక్షేపం చేసుకొస్తున్నాను. మరొకడైతే యీపాటికి దాన్ని లేవగొట్టి యింకొక దాన్ని పెళ్ళిచేసికొని యుండును.

గంగి— ఈమాటలు మాయమ్మగారు వింటే యేమనుకొంటుందో?

మద:— మీఅమ్మగారు వింటుండగానే అంటాను. నాకేం భయమైందా యేమి? అట్టే పెంకితనం చేసిందంటే నెలకు నాలుగు రూపాయలు మనవర్తి యిచ్చి సాగనంపుతాను. సందేహాలు తీరిపోయినవా నీవి?

గంగి— అన్నీ తీఱిపోయినాయండి!

మద:— గంగీ! దీపం తీసుకరావే. కాసులపేరు వేసుకుంటే సుందరమ్మ మొగ మెంత కలకలలాడుతుందో చూస్తాను.

గంగి— యిప్పుడే పట్టుకొస్తా నుండండి. (అని వెళ్ళుచున్నది.)

మద:— సుందరమ్మా! నీవెంతపిరికిదానవు. మాయాబిడ నిన్నేదో చేస్తుందని పిరికితనం పెట్టుకొన్నావా? అలాంటిభయ మేమి పడకు. నేనుండగా నీకేం భయములేదు. నీవే నాభార్యవు. నేనే నీభ

ర్తను. కావలిస్తే చేతిలో చేయివేస్తాను. ఏదీ నీచెయ్యి యిల్లాయియ్యి. (అని చేతిలో చేయి వైచును) నీవేదో యుత్తరీయం కప్పుకొని పడుకున్నావేమి. చలిగానున్నదా?

(అప్పుడు గంగి దీపము పట్టుకొని ప్రవేశించును.)

మద:—ఏమే మీ యమ్మగారు నిద్రపోతున్నారా?

గంగి—బాగా ముసుగుపట్టి నిద్రపోతున్నారండి!

మద:—ఈబిడ ముసుకు బిగతన్ని పడుకొన్న దేమే?

గంగి—యేమోనండి.

మద:—సుందరమ్మా! ముసుగుతీయి (అని యుత్తరీయము లాగును.)

స్త్రీ—(లేచి కూర్చుండును.)

మద:—(తుళ్ళిపడి మంచముమీఁదనుండి లేచి క్రిందనిలువబడి తొట్రుపాటుతో) గంగీ! గంగీ! యిదేమిటే?

గంగి—నేనెఱుఁగనండి బాబూ!

రుక్మి—ఇదేమిటని కంగారు పడకండి. పాపము మీకు ప్రాణములో ప్రాణము సుందరమ్మ రాలేదు. కట్టుపొగరుబోతు, మొంటాలమ్మ, తుంటరి, మద్దిగోలు, అయిన రుక్మిణిబాయమ్మే మీయెదుట వుండవలసి వచ్చింది. పుట్టింటికి పంపినాసరే, నెలకు నాలుగురూపాయలు మనవర్తి యిచ్చినాసరె, వీపు బద్దలు కొట్టినాసరె, మీచిత్తము వచ్చినట్లు చేయండి! పాపము; పగలు చూస్తె రాత్రి కలలోకి వచ్చే భార్య విరగడై పోయింది కాదుశాబోలు.

మద:—చూడు—! నావల్ల బుద్ధిపొరబాటొచ్చింది. నన్ను నలుగురిలో అల్లరి చేయవద్దు. నాపరువు కాపాడవలె.

రుక్మి—సుందరమ్మను రాకుండా జేసినందుకు నన్నె మీరు క్షమింపవలె. మిమ్మలిని క్షమించ...కనే నేరతదాన్ని. మీరు మగ

వాళ్ళు. సర్వాధికారులు భార్యను చావగొట్టగలరు. వదలివేసి తిరిగి పెళ్ళాడగలరు. మనవర్తి యియ్యగలరు. పనికిమాలిన ఆడవాన్ని నే నెంతదాన్ని.

మద:—ఈగంగిముండ నాకొంపదీసింది. అయిందేమిటో అయింది. గతం నాస్తి. కాసులుపేరు నీకే దక్కిందికదా! సొమ్ముసొమ్ము లోవుంది.

రుక్మి—ముండివాళ్ళతో జవాబెవరు చెప్పఁగలరు? గంగీ! రావే వెళ్ళుదాము.

(అని పోవుచున్నారు.)

మద:—నేనుకూడా వస్తానుండండి! అమ్మ! యెంతపని చేసినారురా? ఆడవాళ్ళిద్దఱూ కలిసి నాకు చక్కగా బుద్ధి చెప్పినారు.

(అని నిష్క్రమించును.)

---

# గయ్యాళి గంగమ్మ ప్రహసనము

## రంగము 1.

(అప్పుడు శోభనాద్రియు, జగన్నాథమున్ను ప్రవేశించుచున్నారు.)

శోభ—ఎంతకాలమయినదోయి నిన్నుఁ జూచి! నిజముగా నాప్రాణములు లేచివచ్చినవంటే నమ్ము, ఈరోజున నాకు పండుగగా ఉన్నది. నీవు మాయింట మూఁడు దినము లయినా ఉంటేనేగాని వీలు లేదు. మనమిద్దరము కలుసుకొని పదిసంవత్సరము లయినది. నాఁడు పుష్కరాలకు కోటిలింగాలదగ్గిర కలుసుకొని ఒక అరగడియసేపు మాట్లాడి విడిపోయినాము. రెండుమూఁడుదినములు మనము కలిసియుండి

చిన్నప్పటి గొడవలు చెప్పుకొని కులాసాగా కాలము గడుపుదామని నాకున్నది. అది నేటికి సమకూరినది.

జగ—నిజముగా నాకుకూడా అలాగే యున్నది. ఎన్నిసారులు రావలె ననుకున్నా తీరుబడి లేదు. ఎప్పటికప్పుడే యేదోయొకపని. సంసారములో బడ్డతరువాత గిజగిజ తన్నుకొని కాలక్షేపము చేయవలసినదే కాని తీరుబడి యుండదు. పైగా మునుపటిరోజులు మునుపటి స్థితులుకావు.

శోభ—సరే! దైవానుగ్రహమువల్ల మనయిద్దరి సంకల్పము నేటి కీడేరినది. అయితే నీ వేమిపనిమీద వచ్చావు?

జగ—మాపెద్దమ్మాయికి వివాహసంబంధము వెతకడముకోసము వచ్చాను. మీగ్రామములో ఎవరోపిల్లవాడున్నాడని తెలిసినది. ఆపిల్లవాడిని చూచిపోదామని అతని స్థితిగతు లేమో కనుక్కొందామని వచ్చాను. ఈరోజులలో మనము వివాహములు చేయలేమోయి! కట్నాలు పెరిగిపోయినాయి. ఒక్క వివాహముతోనే కొంప గుండమై పోతుంది. పిల్లలు లేనివాళ్ళే అదృష్టవంతులు.

శోభ—పిల్లలు లేనందుకు నేను దుఃఖపడుచుంటే ఉన్నందుకు నీవు దుఃఖపడుచున్నావు. బాగున్నదిలే.

జగ—ఏమి చేయనయ్యా! పిల్లలను చూచిచూచి యిల్లువాకిలి లేని నిర్భాగ్యుల కియ్యలేము. కొంచె మాస్థియున్నవాడి కియ్యవలె నంటే వాడు కొండెక్కి కూర్చుంటున్నాడు. తలిదండ్రులకు బాధ యింతా అంతా కాదు.

శోభ—సరె. సంబంధము విషయమై భోజనమైన తరువాత మాట్లాడుదాము. ఇప్పుడే బజారుకు వెళ్లి వస్తాను.

జగ—సరె. త్వరగా రా! (అని చావడిలో కూర్చుండును.)

శోభ—ఒసే! ఏమిచేస్తున్నావే?

(అప్పుడు గంగమ్మ ప్రవేసించుచున్నది.)

గంగమ్మ—ఇదిగో! ఇప్పుడే లేచాను. ఇల్లలుక్కుంటున్నాను.

శోభ—నాలుగుగడియలుప్రొద్దెక్కింది. ఇప్పుడు లేవడమేమిటి, ఇల్లలుక్కోవడ మేమిటి.

గంగ—మా బాగుంది. నేను మీకుమల్లె తెల్లవారుజామునే లేవలేను. నాకు పెందలాడె మెలకువరాదు. ఒకవేళ బలవంతాన పెంద లాడె లేచినా నావొళ్ళు భారకింపుగా వుంటుంది. ఆరోజంతా తలనొప్పి వస్తుంది. ఒంటికత్తెను. చాకిరి చేయలేక చస్తున్నాను. పైగా దిక్కుమాలినవాళ్ళు చుట్టాలు, పక్కాలు. వాళ్ళసొమ్మంతా దాచబెట్టినట్లు వస్తారు తినడానికి! మీరు డబ్బు తేగలరేమో కాని నేను చాకిరీ చేయలేనుసుమండి!

శోభ—సరె సరె, గట్టిగా అరవకు. ఈరోజున నాస్నేహితుడొ కాయనవచ్చాడు. అతడు నాకు ప్రాణస్నేహితుడు. అతడు నేను చిన్నప్పటొక మంచముమీద పండుకున్నాము ఒక కంచములో తిన్నాము. అతనిని చూచి పదేళ్ళయినది. అతడు చాలా స్థితిపరుడు. మనము వెయ్యివిధాల ప్రార్థించినా వచ్చేవాడుకాడు. రాక రాక వచ్చినందుకు అతనిని మనము చాలా గౌరవము చేసి పంపాలి.

గంగ—ఏమిగౌరవము చేయవలెనంటారు! పొద్దున్నే లేవగానే దిక్కుమాలినపిల్లి నా కెదురుగుండావచ్చింది. అప్పుడేఅనుకున్నాను. నాకేదో యీవాళ కష్టముందని. అనుకొన్నట్లే జరిగినది.

శోభ—నీ కేమికష్ట ముంది. ఈపూటకు మామూలుగానే వంట చెయ్యి. రాత్రికేదయినా పిండివంట చేదాము. ఏమిపిండివంట చేస్తే బాగా వుంటుంది?

గంగ—ఏమో—ఏమిచేస్తే బాగుంటుందో మీరే ఆలోచించు కోండి. నేను పిండివంట చేయలేను. నాకీవేళ తల పోటుగానున్నది.

శోభ — సరే పోనీ మామూలువంట చేయి. రాత్రికి మాబం గారమ్మను తీసికొనివచ్చి పిండివంట చేయిస్తాను. నాపినతల్లికూతురైనందుకు నా కీమాత్రము సాయము చేయకపోదు. ఇతడు మూడురోజులుంటాడు. ఈ మూడురోజులు నీమామూలు కోపము, చిరాకు మాని కొంచెము మెల్లిగా మాట్లాడి అతనిని గౌరవము చేసి నాకుమాట దక్కించు. ఉత్తప్పుడెన్నుకొన్న బాధలేదు. క్రొత్తవాళ్ళువచ్చినప్పుడు కొంచెము జాగ్రత్తగా వుండాలి.

గంగ — నాకెందుకు. నేను నోరెత్తను. చచ్చినపీనుగులా గుంటాను. నేను బ్రతికుండడమే మీకు బాధలాగుంది. ఆదేముడికి నా మీద దయ రాలేదు.

శోభ — సన్నేమన్నానని నీవు విసుక్కుంటావు. నీకెప్పటికీ తెలివి రాలేదు. ఇదిగో నేను బజారుకు వెళ్ళుచున్నాను. రాత్రికి క్షీరాన్నము పూరీలు చేయించవలెను. సగ్గుబియ్యము గోధుమపిండి జీడిపప్పు ద్రాక్ష పండ్లు తెస్తాను. ఈలోపుగా నీవు మడికట్టుకొని త్వరగా వంట చేయి పాపము అతడికి రాత్రికూడా భోజనములేదట. ఇదిగో నేను వెళ్ళు చున్నాను. (అని నిష్క్రమించును).

గంగ — (తనలో) పిండివంట గాదు పిడకవంట చేస్తా. ఈసింగన్నెవడో వచ్చాడట, మూడుదినములుంటాడట, ఈయనకు పిండివంటలు పరమాన్నము కావాలట. ఎవడుచేయగలడు వెట్టిచాకిరి. ఈమధ్య మాపినతల్లి దానిమగడు మాయింటికి చుట్టరికానికివస్తే పిండివంట చేయుమని నే నెన్నివిధాలో పోరినా చేయొద్దన్నారు. పునిస్త్రీపసుపుకి ఒకరూపాయి చీరపెట్టమంటె పెట్టినారుకారు. నావాళ్ళంటె ఈయనకు గౌరవములేనప్పుడు ఈయనవాళ్ళంటె నాకెందుకుండాలిగౌరవము? ఈయన బజారునుంచి వచ్చేలోపుగా ఈకొత్తస్నేహితుని జెద్దేవరాయని లేవగొట్టుతాను. అదుగో! పండుకోతిలాగ చావట్లో కూరుచున్నాడు

తివాసిదగ్గిర, చేసిపెట్టితే పిండివంటలు పొట్ట బ్రద్దలయ్యేటట్లు తినాల నుకొన్నాడు కాబోలు. ఈయన్ను లేవగొట్టేందు కేమియుపాయము? (అని ఆలోచించుచున్నది). సరే! ఈపన్నాగము పన్ని చూస్తాను. ఇది పనిచేయకపోతే మరొకటి చేయవచ్చును. ఇప్పుడు నాకు తోచిన ఉపాయము సాగినట్లయినా వీడేకాదు మరెవ్వడైనా జన్మజన్మాలకు నా కొంప కెక్కడు. నూకాలమ్మా! తల్లీ! నాకోరికె తీర్చితివా నీకుచద్ది నైవేద్యము పెడతాను. ఇంకాచేతిలో డబ్బుంటే చిన్నకోడిపిల్లనుకూడా యిస్తాను. (అని దండము పెట్టి సన్నికల్లు పాత్రము తెచ్చి పడమటింటి గుమ్మముప్రక్క గూర్చుండి పాటపాడుచు నాటికి పసుపు కుంకుమ పెట్టుచుండును.)

(జగన్నాథము వచ్చిచూచి,)

జగ—(తనలో) ఏమిటిది! ఇప్పుడు రమారమి జాముప్రొద్దెక్కినది. ఈబిడ వంటచేయకుండా సన్నికంటికి పాత్రమునకు పసుపుకుంకాలద్దుచు కూర్చున్నది. వంటచేయుటకు వీరింటిలో యెవరైనా వున్నారా యేమి? అదట్లుండగా ఈబిడ నాకెదురుగాగూర్చున్నది. నేనుకొత్తవాడను. ఇదివరకు పరిచయములేదు. అటువంటప్పుడు సందేహము లేకుండా ఈబిడ నాకెదురుగా కూర్చోడం చాలాఆశ్చర్యముగానున్నది ఈబిడేమైనా పూజ చేయునా యేమిటి! ఆపూజేమిటో అడిగి తెలిసికొందునా? పరిచయము లేనిమగవారికే పలుకరించుట బాగుండదు. అందులో ఆడువారిని పలుకరించుట బొత్తిగా బాగుండదు. అయినప్పటికి అదేమో తెలుసుకొందా మని నాకు మిక్కిలి యాత్రముగా నున్నది. అడిగిచూచెదను.

గంగ—నారాయణ నారాయణ ఏమి చేతును దైవమా! నా మాట సాగదు.

జగ—(తనలో)ఈబిడేదో విచారపడుచున్నట్లున్నది, ఈమాటల వల్ల నాయాత్రము మరింత హెచ్చిపోతున్నది. ఇక అడగకమానను (ప్రకాశముగా) ఏమిటమ్మా! మీరేనో విచారపడుచున్నట్లున్నారు. పైగా సన్నికల్లు పాత్రమునకు కుంకుమ పసపురాచి అలంకరిస్తున్నారు. అదెందుకు? ఏదైనా పూజా యేమిటి మీయింట్లో.

గంగ—నాయనా! ఈసంగతి మీరడుగగూడదు. నేను చెప్ప గూడదు.

జగ—(తనలో) ఏమిది! అడుగగూడదు. చెప్పగూడదంటున్నది. ఈ పరమరహస్య మేమిటి చెపుమా? ఇది తెలుసుకొని తీరవలెను. (ప్రకాశముగా) అమ్మా! నే నెంతో ఆత్రముతో అడిగినానని మీరు కోపగించుకొనక ఇదెందుకో చెప్పవలెనని కోరుచున్నాను.

గంగ—నామాటవిని నన్నుక్షమించి వదిలిపెట్టండి. నాపాపము ఈలాగున బద్ధలైపోయింది. మనసులో ఇష్టములేకపోయినా చేతి గో చేయిస్తున్నది.

జగ—(భయముతో తనలో) ఈ మాటలు మరీచిత్రముగా నున్నవి. నా కెంతమాత్రము తోచడములేదు. మనస్సు పరిపరివిధాల పోతున్నది. (ప్రకాశముగా) గంగమ్మగారూ! ఈసంగతేమిటో నాకు చెప్పకపోతే పిచ్చెత్తిపోతుంది. కాబట్టి నన్ను క్షమించి చెప్పవలెను.

గంగ—నాయనా! చెప్పవలె ననే నాకూ మనస్సులోనున్నది. ఈరహస్యము చెప్పితే పెనిమిటికి ద్రోహముచేసినదాననౌతాను. చెప్పక పోతే బ్రహ్మహత్యదోష మొస్తుంది. అనే తటపటాయిస్తున్నాను. ఈ రెంటిలో చెప్పడమేమంచి దని నాకు తోచినది. గనుక చెప్పుచున్నా ను వినండి! మావారు అమ్మవారిపూజ చేస్తారు. అది చాలాకాలము నుంచి చేస్తున్నారు. ఆ అమ్మవారు నరబలిమ్మని కోరినది. ఏలాంటిమనిషి కావాలంటె పచ్చగా దబ్బపండులా గుండవలె. నలభై యేండ్లు

లోపుగా నుండవలె. మంచిబ్రాహ్మణుడై యుండవలె. వేదము చదువు కొన్నవాడై యుండవలె. అలాంటిబ్రాహ్మడు ఎంతవెదకినా దొరకలేదు. నేటికాలానికి అటువంటిలక్షణాలు కలవారు మీరు దొరికినారు. అందు చేత మిమ్ములను దేవతకు మావారు బలివేయ దలచుకొన్నారు. ఈ పొత్తరం తలకాయపగలగొట్టి చంపి అమ్మవారికి నైవేద్యంపెట్టుతారు. ఆయన పిండివంటవస్తువులకై బజారుకు వెళ్లినారు. ఈలోపుగా పాత్రా నికి సన్నికల్లుకు పసుపుకుంకుమ పెట్టుమని చెప్పివెళ్లినారు. మీవంటి మహానుభావుని ఈలాగు చేస్తారని నేను మనస్సులో ఎంతో దుఃఖ పడుతూ పెనిమిటిఆజ్ఞ మీరకూడదని విధిలేక యీపని చేస్తున్నాను. నిజము చెప్పినాను. నే నేగతికి పోయినా సరే.

జగ---(భయముతో వడికి) అన్నా! అన్నా! వీడెంత దుర్మా ర్గుడు. కల్లబొల్లిప్రేమచూపించి తీయనిమాటలు చెప్పి నాప్రాణాలు పుచ్చుకో దలచుకొన్నాడా? అందుకా పిండివంటలు. మాతల్లీ! నీవు భూదేవతవు. మహాపతివ్రతవు, నీ వుండబట్టి వానలు కురుస్తున్నవి. పంటలు పండుతున్నవి. పెనిమిటియాజ్ఞ మీరినందుకు నరకము వచ్చినను సరే యని నిజముచెప్పిన తల్లివి నీవు. నాప్రాణము రక్షించు. త్వరగా దారిచూపించు. పారిపోయెదను. నాకు కూతురుపుట్టితే నీపేరు పెటు కుంటాను. ఇంకొకజన్మానికి నీకడుపున కొడుకునై పుడుతాను. నా చర్మము కోసి చెప్పులు కుట్టించినా నీఋణము తీరదు. మాతల్లీ! మాతల్లీ! దారిచూపించు వెళుతాను.

గంగ---నాయనా! దొడ్డిదారిని వెళ్ళు. అదిగో! దొడ్డితలుపు. వీధిదారిని మీరువెళ్లితె ఆయన త్రోవలో కనుపడి వెళ్ళనియ్యక తిరిగి లాక్కొని వస్తారు.

జగ---మంచిదమ్మా! అలాగే చేస్తాను. (అని పరుగెత్తును).

గంగ—(తనలో) దిట్టమైన పిరికిమందు పెట్టినాను. వెర్రిబ్రాహ్మడు తిరిగిచూడకుండా పరుగెత్తుచున్నాడు. నాఉపాయము బాగా పారినది. నూకాలమ్మతల్లికి నామీద చాలాదయ. నే నేం తలపెట్టినా యీలాగే ఆతల్లి చల్లనిచూపులు చూచి నెరవేర్చుతూంది. బజారునుంచి సగ్గుబియ్యము ద్రాక్షపండ్లు గోధుమపిండి జీడిపప్పు తెస్తే హాయిగాపూటకొక్కపిండివంటచొప్పున చేసికొని నేనేతింటాను. అదిగో! మావారొస్తున్నారు. రెండుమూడు బుట్టలు కూలిదానినెత్తిమీద పెట్టి పాపము సరకులు తెప్పిస్తున్నారు. స్నేహితుడు వెళ్ళాడనగానే యీయనగుండెలలో రాయి పడుతుంది.

[అప్పుడు శోభనాద్రి ప్రవేశించును.]

శోభ — ఒసే! ఇవిగో సరుకులు తెచ్చినాను. ఇంకా కూర్చున్నావేమిటి మడికట్టుకోకుండాను? ప్రొద్దెక్కింది. లే. ఏడీ మాస్నేహితుడేడీ? ఎవరితోనైనామాట్లాడడానికి వూళ్ళోకి వెళ్ళాడా యేమిటి?

గంగ—(బుగ్గని చెయిబెట్టుకొని) శపహబాను. నీస్నేహితుడేమిస్నేహితుడండి. ఇంతవిపరీతపు చాదస్తపుమనిషిని నే నెక్కడా చూడలేదు.

శోభ—ఏమి! ఏమి! చేసినాడేమిటి? అతడుచాలామంచివాడే.

గంగ—మంచివాడే పాపము. చాదస్తము. నేను ఈరెండింటికి పసుపు కుంకుమ పెట్టుకుంటుంటే నాదగ్గరకు వచ్చి ఈరెండు తనకిమ్మన్నాడు. ఏమిటో పిండివంటలు చేసుకుంటున్నానుగదా అమ్మవారికి నైవేద్యము పెట్టుకుంద మని యీపని మొదలెట్టాను. ఆయింతా వచ్చి నన్నడిగాడు. పరాయిమగవాడు వచ్చి నన్ను ప్రముఖరించి అడిగితె నావొళ్ళు కందరెత్తింది భయపడుతూ ఇది అమ్మవారండి కులదేవత. పుట్టింటివారిచ్చారు. ఇది యివ్వడానికి వీలు లేదన్నాను. దానితో నామీద కోపము వచ్చింది. వచ్చి ఛీ! నీయింట్లో! భోజనము చేయ

ను. ఇటువంటిపాడుకొంపన్నమాట నాకు తెలియలేదు. అనిపారిపోయి నాడండి. పాపము పట్టెడన్నమైనా మనయింట్లోతినకుండా బ్రాహ్మడు రెండుజాములవేళ వెళ్ళిపోతున్నాడని నాకెంతో విచారముగానున్నది. ఎంతబతిమాలుకొన్నాను. చివరకీరాళ్ళిస్తానన్నాను. ఎన్ని అన్నా తిక్కతిరిగింది కాదు. మీకేమంటాగో యని నాప్రాణం చచ్చిపోయి నట్టుంది.

శోభ—అయ్యయ్యో! ఎంత వెఱ్ఱివాడవురా నాయనా నన్న డిగితే నేనుయిప్పించకపోదునా యీరాళ్ళు? నీ వెంత తెలివితక్కువదా నవే! రాకరాక నాస్నేహితుడు వచ్చి వెధవరాళ్ళు రెండురాళ్ళడిగితే అంతమాత్ర మివ్వకూడదు. ఇ తలోకియివ్వ ననాలనా. నీతెలివి ఆలా గే తెల్లవారింది ఇంతకు ఆపాత్రమీలా గియ్యి. ఇది పట్టుకొని వాడి వెనకాలె పరుగెత్తికొనివెళ్లి యిదిచ్చి బ్రతిమాలి తీసికొని వస్తాను. (అని పాత్రముపుచ్చుకొని పరుగెత్తుకొని వెళ్ళుచు)

"ఓయి జగన్నాథం జగన్నాథం ఇదిగో పాత్రము. ఇదిగో ఇది గో రా రా పారిపోకు పారిపోకు."

జగ—(తిరిగిచూచి గుండె బాదుకొని) ఆ మర్మార్గుడా ఆ యిల్లాలిధర్మమా యని నే నేలాగో యొకలాగు ప్రాణాలు దక్కించు కొని బయటపడి పోతుంటే దారిలో పట్టుకొని నన్ను కడతేర్పవలెనని పాత్రము పుచ్చుకొని తరుముక వస్తున్నావా? నేను నీకు దొరికే వాడనుకాను. పిక్కబలములో నాప్రజ్ఞ నీకు లేదు. చచ్చిన గేదెదూడ వలె నీవు లావుగా నున్నావుగనుక నీవు పరుగెత్తలేవు. నేను సలాకు లాగున్నానుగనుక నేను పరుగెత్తిపోగలను. (అని పరుగెత్తును.)

శోభ—(తనలో) అమ్మయ్య నాకాయాసము వస్తున్నది. ఇంక నే పరుగెత్తలేను. పాత్తర మిస్తాను రా బాబూ అని నేను బతి మాలుతూ పరుగెత్తుతున్నా మొగట యున్నలేదనే కోపముతో వద్దని

పరుగెత్తుచున్నాడు. నే నేమి చెయ్యను. ఇంతకునాభార్య తెలివితక్కు వమనిపించుక వచ్చిన స్నేహితుడు వెళ్ళిపోయినాడు. కాకపోయిన పాత్ర మిమ్మని అడిగిన నిర్భాగ్యుడు వీడేమి తెలివిగలవాడు. ఇటువంటి నిర్భాగ్యపుస్నేహితుల నింటికి రానియ్యడము నాదే లోపము. పోనీ! పోతే పోయినాడు. (అని నిష్క్రమించును.)

## ఆత్మగౌరవ ప్రహసనము

(భోగరాజుగారు సుందరమ్మ ప్రవేశించుచున్నారు.)

భోగ—ఒసే ఈరోజునరాత్రి మనయింటికి మురళీధరరావుగారు విందుకు వస్తారు.

సుంద—మురళీధర రావుగా రెవరు?

భోగ—మురళీధర రావుగారి నే యెఱుగవు. చాలాఆశ్చర్యంగా నున్నదే. ఆయన హైదరాబాదులో మున్సబు నారు.

సుంద—మనసబుదా రేమిటి, తాణానారు. మిరాశీదారు అని విన్నాను. కాని మనసబుదా రని యెన్నడు వినలేదు

భోగ—వంటయింట్లో పొయిదగ్గఱ కూర్చుండుదానికి నీకేమి తెలుస్తాయి యిటువంటి సంగతులు. హైదరాబాదు నవాబుగారు ఎవరి యందైనదయగలిగి యున్నట్టయితే, వారికినూరు, రెండువందలు, మూడువందలు వెయ్యి యీలాగున సొమ్మిస్తారు, వారుద్యోగము చేయనక్కఱలేదు. ఇల్లు కదలనక్కఱలేదు ఊరికే జీతంయింటికి పంపిస్తారు. ఈమురళీధర రావుగారికి నెలకు నాలుగువందలు మన్సబువస్తుంది.

సుంద—ఆలాగా! అయితే యీయనను మీరెక్క డెఱుగుదురు?

భోగ — నేను చెన్నపట్నంలో ప్లీడరీకి చదువుచున్నకాలములో ఆయనకూడ అక్కడకు వచ్చి ప్లీడరీ చదివినారు. అప్పుడు మాయిద్దరికి స్నేహమైనది. పాపమాయనకు కొన్నిచిక్కులు సంభవించుటచేత ప్లీడరీ పరీక్ష ప్యాసు గాలేకపోయినాడు. ఆయన యిప్పుడు గోదావరిస్నానమునకు వచ్చుచున్నాడు. నాపేర వ్రాసినారు.

సుంద — అయితే వారెందఱు వస్తారు. ఎన్నాళ్ళుంటారు?

భోగ — వారు కుటుంబముతో నౌకర్లతో చాకర్లతో వస్తారు. వారు సత్రములో బస చేస్తారు. రేపు రాత్రిమట్టుకు మనయింటికి వారి దంపతులను విందుకు పిలుద్దాము.

సుంద — వారు బాగా సంపన్నులు కాబోలు.

భోగ — సంపన్ను లని మెల్లగా నంటున్నావా? వాళ్ళది గొప్పైశ్వర్యము. వాళ్ళమేడ లంకం తున్నది. ఆవిడకుపాతికి వేలరూపాయల నగ లున్నాయి. మనము కాపుర మున్న యీయద్దెకొంప వాళ్ళగుఱ్ఱాల సాలంత లేదు.

సుంద — ఆలాగైతే పెద్దప్లీడరుగారిభార్యనంటూ యేమివస్తువులు లేకుండా మూసివాయనపు పేరంటాలులాగ ఆవిడయెదుర నుంచోనా? ఆవిడ మొగముచూడడానికే నాకు సిగ్గు వేస్తూంది.

భోగ — సిగ్గేమిటి; సింగినాదం. మనకున్నవస్తువు లేమిటో పెట్టుకుంటాము.

సుంద — ఉన్న వేమున్నాయి తడపలాగ మెళ్ళో కంఠెఉంది. నానుపో చోకటుంది. ఎటువచ్చీ పట్టెడాక టుంది.

భోగ — వడ్డాణముమాట మఱచిపోయినావా?

సుంద — సరి యేనాడో నేను కాపరానికివచ్చినకొత్తలో యిరవయికాసులుపెట్టిచేయించినారు. ఈనాటివడ్డాణాలలాగ పటకాలా. మున్నాలా.

భోగ—ఏదో వాక టున్నదికదా, కాలముగడుపు కొందుకు. ఆమెమొదట దీపపుస్తంభములాగున నిన్ను నుంచోపెట్టలేదు. ఉన్నం తలో డబ్బు కర్చుపెట్టినీకునగలు చేయించేను. నీకు నగలుచేయించడం కోసమేకాదూ మాచెల్లెళ్ళను పురుళ్ళకైనా తీసుకొనిరావడం లేదు. మాఅమ్మా మానాన్నా కాశీయాత్ర వెడతానంటే డబ్బు లేదు పొమ్మని నీకు కంఠి చేయించాను. ఈనగలుచాలు. చీరలు నీకు మంచివే ఉన్నాయి. దక్షిణాదిచీరలు రెండున్నాయి. పట్టుచీరొకటుంది.

సుంద—ఎన్నినగలు లేస్తురూ. చెప్పకుంటే సిగ్గు.

భోగ—అయితే యేమంటావు యిప్పుడు నీవు.

సుంద—బంగారువారింటికివెళ్లి కట్టుకాసులపేరు మొహరీల పేరు తెచ్చుకుంటాను. ఆవిడ వజ్రాలదుద్దులుగూడ తెచ్చుకుంటాను ఆవిడమువ్వలవడ్డాణము తెచ్చుకుంటాను. కట్టువంకీలుకూడ పెట్టుకుం టాను. అప్పుడు మనగౌరవానికి తగ్గట్టుంటుంది.

భోగ—సరే నీయిష్టమువచ్చినది తెచ్చుకో. పారేయడము మాత్రము పారేయకు.

సుంద—పారేయను కాని వంటేమి చెయ్యమన్నారు.

భోగ—పూరీ లాడు పేణీ దూద్ పేడా చేయాలి. అన్నమా ట్టే తినరువారు. గోధుమరొట్టెలు తింటారు.

సుంద—ఈపేణీలు పేడలు ఎవరు చెయ్యగలరు. మన మా మూలుకూరలు తింటారా.

భోగ—మామూలుకూర లంటే తోటకూర బచ్చలికూరా వండాలనుకుంటున్నావాయేమిటి? నీపెసరపచ్చళ్ళు కందిపచ్చళ్ళు వారు తినేవారుకారు. వారంతా తీపి గోధుమ తింటారు.

సుంద—ఆరొట్టెలు పిట్టులు నేను చెయ్యలేను. ఎవరినైనా వం టబ్రాహ్మణ్ణి పిలిపించండి కావలసినకూరలునారలు వాడొండుతాడు

మనదేశపువాళ్ళైతే నేనెల్లాగైనా తంటాలు పడి యే బెండకాయో వండి పెడుదును. మన దేశం మన గొడవా కావాలైను.

భోగ—వారి తిండి యేలా గుంటుందనుకున్నా వేమిటి. మన తిండి చచ్చుతిండి. వారింటికి భోజనానికి వెళ్ళితె విస్తరి వరహా చేస్తుంది. వాళ్ళల్లా తింటారు. ఒకరి కాలా పెడుతారు. సరే నీవు చేయలే నన్నావు కనుక గణేశంగాణ్ణి పిలిపిస్తాను

సుంద—సరే పిలిపించండి కాని మన చాకలాణ్ణి పంపించి ఆవీధి నెక్కడో అత్తరుసాహేబు లున్నారట పది పది హేను తులాలు సంపంగినూనైనా సరే అగరు నూనైనా సరే తెప్పించండి. ఒక పదిఅగ రువత్తులకట్టలు తెప్పించండి ఒక పది అగరువుండలు తెప్పించండి.

భోగ—ఇవన్నీ యెందుకు.

సుంద—ఎందు కంటా రేమిటి. అటువంటివా ళ్లొచ్చేటప్పటికి గుమగుమలాడుతూ వుండక మిలక్కంపుకొట్టుకుంటూ వుండమన్నారా యేమిటి.

భోగ—సరే నీ యిష్టము. కావలసిన వేమిటో తెప్పించుకో రూపాయ లిస్తాను. ఇల్లువాకిలి శుభ్రముగా తుడిపించు. బూజు దులి పించు. పంతులు గారింటికి పంపించి రెండుపూలచిలాంపులు తెప్పించు.

సుంద—ఆలాగే తెప్పిస్తాను. కాని మీతో ఒకసంగతి చెప్పాలి మన యింటికి దిష్టిపిడత ల్లాగ మీ యమ్మా మీ నాన్నా వున్నారు. లక్ష్మిదేవిలాగా విష్ణుమూర్తిలాగా ఆ దంపతు లిద్దరు మన యింటికి వస్తే కొరివి దయ్యాలు లాగ వీళ్లిద్దఱు సిద్ధము. అత్తగారు మామగారు అని చెప్పుకుంటే నాకుసిగ్గు అమ్మా. నాయనాఅని చెప్పుకుంటే మీకు సిగ్గు. వారున్న కాశ్శేపూ వీరిద్దఱు కనబడకుండావుంటే బాగుండును. కోడలుదాన్ని గనుక నేను గిట్టక చెప్పాననుకుంటారేమో కాని మీ యమ్మ మాట లన్నీ లేకి మాటలు. పనులన్నీ లేకి పనులు. మూసి

వాయనము ముత్తైదులాగ వాకట్లోనుంచుంటే యేం బాగుంటుం దావిడ. ఇక మీ నాన్నగారు చూస్తే వంటినిండా బూడిద పూసికొని అంగో స్త్రమొకటికట్టుకొని కొల్లాయిగుడ్డొకటిమీద వేసికొని పొడుముపీలుస్తూ పీనుగుల నుల్లయ్యలాగ వీథరుగుమీద గూర్చుంటాడు. మీ రెంతో మంచివారు గనుక ఈలాటి నిర్భాగ్యపు తలిదండ్రులను భరిస్తూవున్నారు కాని మరొకరైతె యీపాటికి వెళ్ళగొట్టుదురు. మీయమ్మ పగలుచూస్తే రాత్రికల్లోకొస్తుంది. అమ్మవారి శివాడేదానిలాగ మొగమునిండా పసు పురాసికొని అర్థణాకాసెడు కుంకమబొట్టెట్టుకొనికూర్చుంటే దయ్యమో భూతమో అని పిల్లలు జడుసుకుంటున్నారు రోజూను, చూస్తేఅమ్మతల్లిని చూచినట్లుంటుంది. అబ్బా? యీపీ డొదిలిందికాదమ్మా.

భోగ—నిజమే యేమిచేయను. ఈదిక్కుమాలినముండా యీది క్కుమాలిన ముండాకొడుకు అందరాయువ బోసికొని బ్రతికున్నారు వీళ్ళు చచ్చిపోవరుగదా! చచ్చిపోతే పెళ్ళిమాటూ దినవారాలు చేద్దును వాడిమొగం మండా బ్రహ్మదేవుడు మరచిపోయినాడు కాబోలు వీళ్ళని. ఇంతమందికి కలరావస్తుంది. వీళ్ళకైనా కలరారాదు. నువ్వుచెప్పినట్లు వీళ్ళు యింటికి దిష్టిపిడతలే. వీళ్ళెక్కడుంటే అక్కడ దరిద్రము. వీళ్ళ మ్మకడుపుకాలా వీళ్ళమూలాన్నే నాకు నెలకు వందరూపాయలకంటె యెక్కువ దొరకవు. మా ముసిలిముండాకొడుకు నోరిప్పి మాట్లాడితే తుంపర లెదటివాడి మొగంనిండా పడతాయి. అస్తమానం నోటమ్మట చొంగ. నల్లమందుకు డబ్బులు తెమ్మని జామిపళ్ళు తెమ్మని సీతాఫలం పండ్లు తెమ్మని కుర్రముండాకొడుకు లాగ పీక్కు తింటాడు

సుంద.—సరి మీ రాయనమాటే చూశారు. మీ యమ్మ మాటెరుగరు. అస్తమానం అరిసె లొండుకుందామని, మినపరొట్టె కాల్చిపెట్టుమని పిండిచేయుమని అట్లొండుమని పీల్చి పిండెడుతుంది. ఏదోవొక టస్తమానంనోట్లో ఆడుతూవుండాలి. ముసిలిదవునా! అదేమి

తిండో అదేమిలోకమో కాని యెంతపెట్టినా చాలదు. అమ్మవారికి కుంభము తోడినట్లు తోడాలి విస్తరిసిండాను కడుపునకు తింటే ఆక్షేపించ కూడదు. కాని పప్పైదుకూర, పప్పైదుపప్పూ, నెయ్యి, జుర్రుకోవడమే. కంచంనిండా చిక్కని మజ్జిగ పోయించుకొని గడగడతాగేస్తుంది. అది కడుపోకాలవో మడుగో నాకు తెలియదు అంత భాభాకరముంటే అసహ్యముసుమూ.

భోగ — అరిసెలు చేసి అట్లొండి యీ ముసలిముండకు పెట్టి నా కొంపంతా గుల్ల చేస్తూన్నావు నీవు. అడిగినదల్లా పెడతారా. ఎన్ని పెట్టినా ఆ జిహ్వాచాపల మణగదు

సుంద — పెట్టకపోతే నాపరువుంటుందా గుడ్లుపీకుతుంది వూరందఱితోను చెప్పివస్తుంది. ఎంతమందున్నా సరే మర్యాద లేకుండామాట్లాడుతుంది పదిమందిలోను యింతాతగాను ఆకూతగాదు. తనకుకట్టుకుందుకుగుడ్డలివ్వ లేదట. ఏమైనా చేసిపెట్టడము లేదట. తానుకష్టపడి నీళ్ళబిందెలు మోసి అందఱియిండ్లలోను చాకిరీలు చేసి మీకుచదువు చెప్పించిందట మీరెప్పుడో వారాలు చేసుకున్నారట. ఆ మాటలు విన్నప్పుడునాకు శిరచ్ఛేదమైనట్లున్నది. నేను కలకల్లాడుతూమహాలక్ష్మిలాగ నగలు పెట్టుకొని పేరంటానికి వెడితే పింగళారిపేకిలాగ నాతోగూడా తాను సిద్ధమవుచున్నది, వచ్చింది నోరుముసుకొని వూరుకోవచ్చునా ఊరుకోదు. ఊరుకోక అక్కడమ్మలక్కలకు నన్ను చూపించి యిదిగో నమ్మ నాకోడలు మీరంతా చద్దన్నమెట్టి వేడన్నమెట్టి బట్టిచ్చి పాతిచ్చి జీతంచందాయిచ్చి చదువుచెప్పించి బాగుచేశారు గనుక మావాడింతబాగుపడ్డాడమ్మా నెలకు నూరురూపాయిలు తెచ్చుకుంటూన్నాడని కూస్తుంది అల్లాటప్పుడు నాకు చచ్చిపోయినట్లుంటుంది. అప్పుడు బండకత్తిపెట్టి నాలిక తెగ్గోయ్యాలని వుంటుంది. నాకుఅత్తగారైతే అ

యింది కాని తనకి తోచకపోతే వాకరు చెప్పితె వినవద్దు. అంత మొండి తనమేమిటమ్మ అంతదిక్కుమాలినబుద్ధులా

భోగ—నిజంగా అలాగంటూందా ప్రతిచోటాను. ఈ ముండ చచ్చిపోతేనేకాని మనకీవూళ్ళొ మర్యాదదక్కదు. వాతాలుచేసికొన్నాను నేను ఈపరువుతక్కువవెధవపూలాన్నే నాకీవారా లొచ్చాయి ఎప్పుడో చిన్నప్పుడు జరిగిన సంగతులు ఊరంతా మరచిపోతుంటే యీ యవకతవకముండ వెళ్ళి మళ్లీ కెలుకుతూంటుంది ఈ పర్యాయము పది మందిలో యిటువంటిమాటలంటే యింటికి వచ్చిన తరువాత గరిటెకాల్చి వాతలుపెట్టు. పాతవాళ్ళమాట యెల్లాగున్నా మా కొత్తకాపు ప్లీడర్లు వుద్యోగస్తులు నాకోట్లు నాబూట్లు నాజరీ కండువాలు నాగుఱ్ఱపుబండి చూచి నేనాగర్భశ్రీమంతుడ ననుకుంటున్నారు ఈముండ నన్ను యేలినాటిశనిలాగ పట్టుకొని విదలడంలేదు సరే యిప్పుడేమిచేదామంటావు?

సుంద—-చేసేదేముంది ఈవేళ రాత్రివాళ్ళువచ్చినప్పుడు వీరిద్దరిని కనబడవద్దని గట్టిగా చెప్పండి వారు భోజనముచేసి వెళ్లినతరువాత భోజనము చెయ్యమనండి.

భోగ—సరే ఆ ముసలిముండతో నీవు చెప్పు ఈ ముసలాడితో నేను చెపుతాను ఏడీ చాకలి కుఱ్ఱాడు ?

ఓరీ. పేరిగా. ఆముసలాయనిల్లాపిలూ

(అప్పుడు తండ్రియైన నారపరాజు ప్రవేశించుచున్నాడు)

నార—(తనలో) ఎందుకునాయనా మావాడింత దయతో కబురంపించాడు? మొన్నకప్పుకుందుకు పక్కకు బట్టలు లేవని చెప్పినాను అవి తెప్పించాడా యేమిటి చెప్పుమా.

భోగ—ఏమయ్యోయి ఒక్కమాట చెపుతున్నానువిను. ఈ రోజున రాత్రి మన యింటికి గొప్పవారు భోజనానికి వస్తారు

నార—సరే రానియ్యి నాయనా సంతోషమే.

భోగ—చెప్పేమాట పూర్తిగా వినక తొందరపడి చస్తావెందుకు. నీ సంతోషమెవడకి కావాలి నీ దుఃఖ మెవడికి కావాలి?

నార—ఏమన్నానురా నాయనా ఇంతలో కోపపడుతావు.

భోగ—కోపములేదు తాపములేదు నోరుమూసికొని వెధవ పేలాపన పేలక విను. ఆయన మన యింటికి వచ్చినప్పుడు యీ పాడు వేషంతో ఆయనయెదర కనబడకు. గొడ్డుతోళ్ళులాగ గుడ్డలు నీవును ఇంటికి పెద్దొచ్చినా పిన్నొచ్చినా చీకపొర్కులుగోర్కుంటూ సిద్ధమవుతావు.

నార—నాయనా గొడ్డుతోళ్ళంటిగుడ్డలు కట్టుకుంటా నని ఆక్షేపిస్తావు శుభ్రమైన తెల్లని గుడ్డలు కొనిస్తే నేను కట్టుకో నన్నానా? తలంటుకుంటానురా నాయనా అంటే మంగలాడికి నాలుగు డబ్బులియ్యవు నీమరదళ్ళు వదినెగార్లునస్తేచీరె లిస్తావు మీ యమ్మకు నీ భార్య వదిలివేసిన పాతచీర్లే కాని కొత్తవి కొనియ్యవు నీబావమరుదులకు జరీకండువాలు శాలువలు కొనియిస్తావు కాని నాకు కప్పుకుందుకు నూలుదుప్పటీయైనా కొనియ్యవు బజారునుంచి కూరతట్టలు నేనే మోసికొని రావాలి కాసి యింట్లో చాకలివాడున్నా వాడిచేత నీ భార్య మోయించదు నేనెక్కడైనా అడిగితెచ్చిన అంగోస్త్రాలు కట్టుకోవలసినదే కాని చచ్చినా నీవుగాని నీ భార్యకాని యియ్యరు పైగా యెందుకు తెచ్చుకొన్నావని నీవు పెళ్లామును తిడతారు నీవు పెట్టవు తెచ్చుకొని తిననియ్యవు పైగా ఆలావున్నాయి యీలావున్నాయి అని ఆక్షేపిస్తావు ఏమిచేయ్యను నేను?

భోగ—నోరు ముయ్యి. మాలముండాకొడకా నీకీ మధ్యను చెప్పుదెబ్బలు లేక వొళ్లుపొగరెక్కింది నీ వెధవపంచాంగం నా దగ్గఱ చెప్పవద్దు ఆయన వచ్చినప్పుడు నీ వెదర కనబడ్డావా నరికిపారేస్తాను జాగ్రత ఆయన వెళ్లిందాకా సావిడిపక్కను ముట్టువాళ్లగదిలో కూర్చో పో నోరుమెదిపావంటే జాగ్రత! పళ్లేరాలగొట్టేస్తా.

నార—(తనలో) ఆ భగవంతుడు నాకు చావుపెట్టాడుకాదు ఇటువంటి కొడుకుచేతిలో బ్రతికేకంటే చస్తే మేలు (అనివెళ్లిపోవును)

సుంద—చూశారాఆముర్మార్గం ఆయనను నేనుకూడా సాదించాసట నన్నునుకుంటే పుచ్చి పురుగులోడిపోతారు.

భోగ—ఆపనికిమాలిన ముండాకొడుకుతో ఏమిటి పెద్దవాడన్నమాటేకాని ఉచ్చనీచాలు లేవు నాకోవుపాయము తోచింది అది బాగుందేమో విను (అని చెవులోచెప్పును)

సుంద—చాలాబాగుందీయుపాయము అల్లాచేద్దాము

భోగ—సరే యిక నీవింట్లోకి వెళ్లు చెప్పడంమాత్రము చెప్పు కనబడవద్దని. ఒక వేళ దైవవశముచేత కనబడితే యీ యుపాయము బాగుంది నేను వంటబ్రాహ్మడికి కబురంపిస్తాను. పంతులుగా రింటికి కబురంపించి మైదారు వెండిగిన్నెలు తెప్పించు వీలైతే వెండరిటాకుకూడా తీసికొనిరా నేను వెళుతున్నాను.

(అని నిష్క్రమించును.)

## రంగము 2.

(మురళీధరరావుగారిభార్య యమునాబాయి సుందరమ్మ ప్రవేశించుచున్నారు.)

సుంద—మీరు మా యింటికి దయచేసినందుకు నాకుచాలా సంతోషముగావుంది. గోదావరిస్నానం పేరు పెట్టుకొని వచ్చినారు. కాని వెయ్యి వర్తమానాలిచ్చినా మాయింటికి రారు. మా వూరురారు.

యము—మాపంతులుగారికి మీ పంతులుగారికిని నిండా జోస్తి వుండెనని చెప్పారు. ముఖ్యంగా మిమ్మల్ని చూసేదాన్కి వచ్చాను నేను. చూస్తిని. నిండాసంతోషమైంది. ఈ యిల్లుమీదేనామ్మా.

సుంద—ఆ! మాదే.

యము—మీ యత్తమామ లున్నారా.

సుంద—లేరండి పోయినారు అంతభాగ్యముకూడానా మాకు వారిద్దరువుంటే పైన గొడుగులా గుంటను. పువ్వులతో పూజచేసు కుంటూవుందుము

యము—ఈవజ్రపొళ్ల సుద్దులు యెంతకు చేయించారమ్మా

సుంద—నూడువందల యేబైరూపాయిలు

యము—ఇదేమిటండీ. నిండాచిత్రముగా వుంది. వెయ్యిరూపా యలు పెడితేకాని నాకురావు. ఇంతచవుకగామీకేలావచ్చాయమ్మా?

సుంద—(తనలో) దిక్కుమాలినకర్మం. ఎరువుతెచ్చుకొన్నప్పు డువాళ్ళను కరీదైనా అడిగినానుకాను. (ప్రకాశముగా) మావారు మొన్న ఒక కేసులో చెన్నపట్టణము వెళ్లి కొనుక్కొచ్చారు. కరీదెంతో నేనెఱుగను. నూడువందలయాబై యున్నాయని నేననుకొన్నాను.

యము—(తనలో) ఈసంభాషణచూస్తే యీనగలెరువుతెచ్చు కొన్నట్టుంది (ప్రకాశముగా) ఈ మొహరీల పేరెంతకరీదమ్మా.

సుంద—మోహరీలపేరాండి మొహరీలపేరు ఇది మాఅత్త గారిదండి.

యము—అబ్బా మీఅత్తగారికి చాలానగలుండేవికాబోలు.

(అప్పుడు తేలుకుట్టి యేడ్చుచు అత్తగారు ప్రవేశించుచున్నది.)

అత్త—అమ్మయ్యో! నాయినో చచ్చానర్రోయి తేలుకుట్టింది సుందరమ్మా నీమూలాన్ని కుట్టిందేఅమ్మా. వారెవరో వచ్చారనిపిడక

లగూడుచాటున కూర్చోమన్నావు. అక్కడ తేలుకుట్టి చచ్చానే అమ్మా మందేయించవేతల్లీ. ప్రాణము పోతూందే.

యము—అయ్యయ్యో! ఎవరండీయీముసలావిడపాపము. పెద్ద ముత్తయిదువు. పార్వతీదేవిలాగుంది.

సుంద—గణేశం గణేశం. ఆవిడ నవతలకు పంపించెయ్యి.

యము—ఎవరండావిడ ?

సుంద—మాయింట్లో వంటలక్కండి. చిన్నప్పటినుంచి కనిపెట్టుకుంది. ఇప్పుడేమి చేయకపోయినా యింత అన్నవస్త్రాలిచ్చి పోషిం స్తూన్నాము.

యము—చాలామంచివారుమీరు. ఈరోజులలో యిల్లాపోషించేవారెవరు.

అత్త—సుందరమ్మతల్లీ! జబ్బులో కెక్కిందేఅమ్మా. గునపం పోట్లు పొడిచేస్తూంది,

సుంద—గణేశంచూస్తావేమిటి ఆవిడనవతలకు పంపించమంటే.

గణే—ఏమిటండి! అత్తగారొచ్చి తేలుకుట్టి యేడుస్తూంటే అవతలకు గెంటమంటా రేమిటి ?

యము—ఇదేమిటండోయి అత్తగారంటాడేమిటి. ఈవిడ మీయత్తగారా ?

అత్త—అవునమ్మా! అత్తగారినే.

సుంద—(తనలో) వీడమ్మకడుపుకాలా! యీగణేశానికి బుద్ధిలేదు. ఈయత్తగారుముండకు బుద్ధిలేదు. ఈవిడ వెళ్లిపోయినతరువాత నిజంగా గరిటకాలేసి వాతవేస్త. (ప్రకాశముగా) అత్తగారుకాదండి. మాఅత్తగారు చచ్చిపోయి యిరవయియేళ్ళయినది. మాఅత్తగారు చచ్చిపోయినప్పటినుంచి యీావిడ మాయింట్లోవుండి వంటచేసి పెడుతూ

వుంటే ఆవిడను అత్తాఅని పిలుస్తాము. ఆవిడ మన్ము యేమే అంటుంది వంటబ్రాహ్మణుడు కొత్తవాడేకనుక అత్తగారనుకున్నాడు. పైగాయీ విడకు మతిలేదండి. తింటే అదేతినడం నవ్వితే అదేనవ్వడం. యేడుస్తే అదే యేడవడం. ఈవిడ వెఱ్ఱిదవడంచేతను నిజంగా తేలుకుట్టినదో లే దో సందేహమేనండి.

అత్త—నారాయణ నారాయణ యిదేమికర్మమే! కిట్టకపోతే కిట్టనట్లుండు గాని నేను వెఱ్ఱిదాన్నా? మీయింట్లో వంటలక్కనా? అమ్మా! మీరు మహాలక్ష్మివంటివారు. నేను అందంగాలేనట. మీవం టివారు వస్తే కనబడకూడదట అందుచేత పిడకలగూడుచాటున కూ ర్చోపెడితే అక్కడ నన్ను తేలు కుట్టింది. భోగరాజు నాకొడుకే అ మ్మా. ఈయమ్మతల్లి కాపరానికి వచ్చినప్పటినుంచి నేను నాకొడుక్కి దూరమైపోయినాను. నోటినిండా అన్నంలేదు. కట్టుకుందామంటే బట్ట లేదు. పైగా వెఱ్ఱిదని పేరెట్టారు.

సుంద—మాటలన్ని పిచ్చిమాటలేనండి మతిస్థిరము లేనివా ళ్లతో మీరెందుకు మాట్లాడుతారు. ఇప్పుడు మిమ్మలినికూడా తిడు తుంది

అత్త—వంటలక్కనైతే అయినానే మందేయించవే చంక లో కెక్కిందే.

సుంద—అమ్మాయి! పిచ్చిదాంతో యేమిటి. మనమవతలకెళ్లి కూర్చుందాము రండి.

యము—అయ్యో! పాపము! వెఱ్ఱిదే కానివ్వండి. తేలుకుట్టి బాధపడుతుంటే మందువేయించకపోవడం యేమిటమ్మా?

సుంద—అయ్యో! మీరెఱుగరండి ఆవిడసంగతి. మతిస్థిరము లేక రోజూ తేలో జెట్టో కుట్టిందంటుందండి.

యము—(తనలో) ఈయింటిచరిత్రంతా యేదో నాటకములాగ కనబడుచున్నది. నాకు. డాబుదర్పము యెక్కువుంది. (అని సుందరమ్మతో వెళ్ళును )

రంగము 3.

[అప్పుడు మురళీధరరావుగారు, భోగరాజుగారు, ప్రవేశించుచున్నారు.]

భోగ.— తమరు దయచేయడం మాకు పరమానందంగా వుంది. మనము వెనక చెన్నపట్టణంలో కలుసుకొన్నతరువాత మళ్ళీ మనమిదే కలుసుకోవడం.

ముర--ఎన్నోసారులు నేనిక్కడికి రావాలని ప్రయత్నంచేసినాను. కానినిండావనితొందరచేత సాగిందికాదు. కాని నేటికి ప్రాప్తం వుంది. మీకోర్టులోకల్లా పెద్దప్లీడ రెవరండీ.

భోగ---వయస్సుచేత పెద్దలు చాలామందున్నారు. కొందఱు పొడుగ్గాతాడిచెట్టంత పెద్దలుకూడా వున్నారు. ఏదోమసిపూసి నేరేడుకాయ చేసి రెండులక్షలు సంపాదించినవాళ్ళూ వున్నారండి. కాని వుప్పుపత్రి లేదు నోటంట ఒకడు సరిగా క్రాస్సెగ్జామినేషను చేయలేడు. జడ్జీగారికి, నచ్చేటట్టు వాదన చేయలేడు నన్ను నేను చెప్పుకొన్నానని మీరనుకోవద్దు నేను నుంచున్నానంటే యెదరపార్టీప్లీడరికి గడగడ. నేనార్గ్యుమెంటుచేస్తూంటే తియ్యనీటికి చేపెక్కినట్టు జడ్జీ ముసిముసినవ్వులు నవ్వి యింకాచెప్పమంటూంటాడు. క్రిమినలుకేసు పుచ్చుకున్నానంటేనాది నార్టనుతడాఖా. నేనుబియల్ ప్యాసయానుకాను కానండి ప్యాసయితేనా హైకోర్టులోకి వెళ్లి ఆచెన్నపట్నణంలోవున్న అయ్యంగార్లను అయ్యర్లను అవతలకూర్చోపెట్టకపోదునా? అయితే యీపార్టీవెధవల కింత బుద్ధిలేదు కాని ఒకరూ మనదగ్గిరకురాక అంతా ఆపా

తపీనుల చుట్టూ తిరుగుతారు వాళ్ల మోసపుమాటలలో పడిపోతా రండి మనమల్లాటిమాటలు చెప్పము.

ముర — తెలివితేటలు లేకపోతే వాళ్లదగ్గఱ కెందుకు కెడ్తారు పార్టీలు.

భోగ—యూడోంటోన్సార్. మీకు తెలియదండి దేరార్ సీక్రెట్సు. కొన్నిరహస్యాలున్నాయండి. పార్టీలనుతీసుకువచ్చే యేజంట్లుం టారండి అక్కడ. మనకల్లాంటివి కిట్టవు.

ముర—సరే యిక్కడస్థితిగతు లెల్లాగున్నాయో మాకేం తెలుస్తుంది.

[అప్పుడే ఏడ్చుచు తల్లి గంగమ్మ ప్రవేశించుచున్నది]

తల్లి—అమ్మయ్యో! జబ్బల్లో కెక్కింది. ప్రాణాలు పోతూ న్నాయి.

[అప్పుడు గదిలోనుంచి తండ్రి నారపరాజు ప్రవేశించుచున్నాడు]

నార—ఏమిటే యేమిటే తేలు కుట్టిందా? అయ్యో అయ్యో మందు వేయించబ్బాయీ మందు వేయించు మందు వేయించు.

ముర—ఎవరండి వారిద్దరూను.

భోగ—మైకుక్సు.

నార—ఏమిటి నేను కుక్కనంటూన్నాడా?

ముర— లేదండయ్యా! కుక్కన లేదు. మీరు వారింట్లో వంట చేసేవారనిచెప్తూన్నారు. అందులో తప్పేమీ లేదు.

భోగ—(తనలో) వీళ్లమ్మకడుపుకాలా వీళ్లిద్దఱు సిద్ధమయినారే సమయానికి గుట్టు బయలుపడిపోయింది. ఏమిటుపాయ మిప్పుడు.

నార—ఏమిటీ! మేమిద్దఱము వంటవాళ్లమని చెప్పాడావీడు మీతోటి. నేను వంటవాడి నయితే వీడు వంటలవాడికొడుకు. నేను కుక్కనయితే వీడు కుక్కకొడుకు. వీడి రహస్యచరిత్ర వినండి. ఇదిగో

ఇది వీడమ్మ, వీడమ్మ మొగుణ్ణీ నేను. అదివీడితల్లని, నేనువీడితండ్రి నని చెప్పుకుంటే సిగ్గట. వీడి కవమాన మట. అందుచేత నంటవాళ్లు మని చెపుతాడు. మీవంటిగొప్పవాళ్ళు వస్తే మేముకనబడకూడదట. అందు చేత దావ్నిపిడకలకూడుదగ్గఱ కూర్చోమన్నాడు. నన్నీముట్లగదిలో కూర్చోమన్నాడు కానీ వాడికంతకష్టంగావున్నప్పుడు మనమెందుకు కనబడాలని ఆలాగే కూర్చున్నాము. దీనమ్మకడుపుకాలా యీ తెలిప్పుడే కుట్టాలా. అందుచేత అదీ యివతలకు రావలసి వచ్చింది. నేను ము ప్పై త్తి అందఱిళ్లల్లో చాకిరీలుచేసి నీరుకానులు పట్టి పొత్తరలుపట్టి సం భావనలకువెళ్ళి కష్టపడి వీడికి చదువుచెప్పించాను. అందుచేత నేను వీడికి తండ్రిగావుండడానికి తగినట. మాటాడితే చెంపకాయలు కొడ తాడు. బూతులు తిడతాడు. ఇక నే నిక్కడుండను. సెలవుపుచ్చుకుం టాను. రావే నేను ముందువేయిస్తాను.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

మురి—ఇదేమిటండీ ఆముసలాయన అల్లా అంటాడు. వాళ్ళు మీతల్లిదండ్రులా? మీతల్లిదండ్రులు లేరని చెప్పారే ఏరెవరు?

భోగ—వాళ్ళు మాతల్లిదండ్రులు కారండి. మాయింట్లో వం టలవాళ్ళు మావాళ్ళు చచ్చిపోయినారు. చిన్నప్పటినుంచి చనువుగా వుండడంచేత అల్లా అంటారు, వాళ్ళుపిచ్చివాళ్ళు వాళ్ళమాట పాటిం చకండి.

మురా—(తనలో) ఇదేదో మహామాయగావుంది. ఆవృద్ధులు నిజంగా తల్లిదండ్రులై యుండవచ్చును. పార్వతీపరమేశ్వరులులాగ మం చివాళ్ళలా కనబడుతూన్నారు. అయినా మనకెందుకు. (ప్రకాశము గా) అయ్యా, భోజనాలైననిగనుక యిక మేము సెలవుపుచ్చుకొని స త్రములోనికి వెళ్ళి పడుకుంటాము.

భోగ—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

# వరదక్షిణ ప్రహసనము

(అల్లూరు రాఘవరావుగారు — పురోహితుడైన చిదంబరదీక్షితులు గారు ప్రవేశించుచున్నారు)

రాఘు — ఏమండి, దీక్షితులుగారు నేనుచెప్పినమా టేమిచేసినారు, మాదామోదరరావుజాతకము సరిగా వ్రాసినారా లేదా? నేను మీతో చెప్పినమాటలు జ్ఞాపకమున్నవా? వాడు, మన్మధసంవత్సరములో జన్మించినాడు వైశాఖమాస మని జ్ఞాపకము. తిథివారనక్షత్రములు జ్ఞాపకము లేదు. జ్ఞాపక ముంటేమి లేకుంటేమి. ఏదో మంచి తిథి చూచి గ్రహము లన్నిటిని ఉచ్చదశలో పెట్టి అఖండయోగము పట్టేజాతకము వ్రాయండి. ఆసంవత్సరములో కుదురకపోతే దుర్ముఖి సంవత్సరములో పుట్టి నట్టు వ్రాసినాసరె. ఒకయేడు తక్కువవయస్సులాగాకూడా కనబడుతుంది. ఈయాడపెండ్లివాండ్లు వరకట్నము, తెలివితేటలు, సాంప్రదాయం చూచుకోడం లేదు. జాతకం తే, జాతకం తే అంటారు. అందుచేత మంచిజాతకంవ్రాసి వాళ్ళ మొఖాన పారవేదాము.

చిదం — తమ శెల వైతే వ్రాయక మానుతానా బహుశా మన్మథలోనే కుదరవచ్చును; లేకపోతే దుర్ముఖిలోనో అంతకు కుదురకపోతే హేవిళంబిలోనో వేస్తాను హేవిళంబిలో పుట్టినట్టు వ్రాస్తే యిప్పటి కిరువది యేండ్లే వుంటాయి. గొప్పకుటుంబాల్లో పిల్లవాళ్ళకి రెండేళ్ళు తక్కువుంటే మంచిది. వయ సెక్కువుంటే గొప్ప వాళ్ళపిల్ల వాడుగదా యిరువదిరెండేండ్లవర కెందుకు పెండ్లికాలేదని యడుగుతారు

రాఘు—వహావ్వా! వహావ్వా! బాగుంది హేవిళంబిలో వేయండి. జాతకంయేలా గుండా లనుకొన్నారు. అన్నిగ్రహము లుచ్చదశలో నుండాలి. విద్యాస్థానం ప్రశస్తంగా ఉండాలి. ధనజాతకమైయుండాలి! ఆహేడ్డుమాస్టరు ఈయేడు స్కూలుఫైనలుపరీక్షకు పంపించకపోవలె ననుకొన్నాడుకాని, క్రిందిమాస్టరులలో యిద్దరు కాస్త మంచివాళ్ళున్నారు. ఇద్దరికీ చెరొకపందుంధాన్యం పారేసి మార్కు లెక్కువ వేయించి పరీక్షకు పంపించేటట్టు చేశాను. మీజాతకంతో సంపూర్తవుతుంది.

చిదం—జాతక మెంతసేపుగాని వ్రాయడం. రేపుదయం పట్టుకొస్తాను. కాని యిప్పుడొకమాట చెప్పడాని కొచ్చాను. గోపరాజు నరహరిరావుగారిదగ్గరో కాడపిల్లయున్నది. ఆపిల్లనుమీయబ్బాయి కియ్యవలెననివా రాలోచించి వారిపురోహితుడిని పంపించారు. ఆయన వీథియరుగుమీద కూర్చున్నారు.

రాఘు—ఏమిటీ! వీథరుగుమీద కూర్చున్నారా? ఆమాట ముందుగా చెప్పావుకావేమయ్యా. జాతకవిషయములో మన మనుకొన్నమాటలు కొంపతవ్వి ఆయనకు వినబడలేదుకదా.

చిదం—అబ్బే! ఎక్కడో అరుగుమీద దివర కూర్చున్నాడు. ఆయనకు వినబడలేదు.

రాఘు—సరే! అయితే ఆయనను తీసుకొని రండి.

చిదం—చిత్తము. (అని వెళ్ళి రాయప్పఅవధానులుగారిని తీసుకొని ప్రవేశించును.)

రాఘు—దయచేయండి అవధాన్లుగారూ! నమస్కారము.

చిదం—వీరేనండి రాయప్పావధాన్లుగారు; గోపరాజునరహరి రావుపంతులుగారి పురోహితుడు. షోడశకర్మాధికారి; స్మార్తంలో వీరిమట్టు మరెవరు నిలుబడలేరు. [illegible]ట్టిగా వచ్చును.

రాఘు— అలాగా ! విన్నాముగాని దర్శన మెప్పుడుచేయ లేదు.

చిదం—నరహరిరావుగారికొమా ర్తెను మన బ్బాయి కివ్వవలె నని యుద్దేశమున్నది. ఆపనిమీద వీరు దయచేసినారు.

రాయ—చిత్తము ఆపనిమీదనే నేనువచ్చినాను. గోపరాజు వారంటే దేశప్రఖ్యాతులు. అల్లూరువారంటే అంతకంటే ప్రసిద్ధులు. అందుచేత మీరుభయులు వియ్య మందితే జనకమహారాజు దశరథ మహారాజు వియ్యమందినట్లుంటుంది.

రాఘు—అబ్బో! అబ్బ! రాత్రీపగలూ నిద్రాహారం లేకుండా పీక్కుతింటున్నారండి సంబంధముకోసము. సబుజడ్జీగారు కోదండరామయ్యపంతులుగారు తమపిల్లనే యిస్తామంటున్నారు. డిప్టీకలెక్టరు గోపాలంగారు తమపిల్లను చేసికొమ్మని బలవంతపెడుతున్నారు. భద్రాంపేట జమీందారుగారు మీతో వియ్యమందితేచాలు మా పిల్ల నేలాగైనా మీలో పడేసుకోండి యని వర్తమానంమీద వర్తమాన మంపుతున్నారు. ఉత్తరాలొస్తున్నాయి మనుష్యులొస్తున్నారు. ఎన్ని వేలు కావలెనంటే అన్ని వేలు వరదక్షిణ యిస్తామంటున్నారు. బాలతొడుగు వెయ్యిరూపాయలు నగ లిస్తామని కొందఱు, రెండువేలిస్తామనికొంద ఱుమూడువేలిస్తామని కొందఱు బతిమాలుతున్నారు.

చిదం—అవునవును. వీళ్లకు జవాబు చెప్పలేక ప్రాణము విసికిపోతున్నది.

రాయ—రాఘవరావుపంతులుగారి సంబంధమంటే యెవరు వదలి పెడుతారు? ఇటువంటి పరువుగలసంబంధము తల్లక్రిందల తపసు చేసినా దొరుకుతుందా ? మీతో వియ్యమందడాని కెవ రదృష్టము చేసికొని పుట్టారో వారికి లభ్య మౌతుంది

చిదం—నిజమే! నియోగ్యులలో అల్లూరువారంటే దేశదేశాలు పేరుమోచినవారు స్థితిగతులుచూస్తే చాలాగొప్పవి. సాలుకు నా

లుగు వేలరూపాయలు భూములమీదవస్తవి. కొంకుకువక్కంటికి వెయ్యి రూపాయలు ఆస్తి. ఇదంతా రాఘవరావుపంతులుగారి స్వార్జితమే. ఇదిగాక మ ప్పదినలుబది వేలరూపాయలు వడ్డీకి తిరుగుచున్నవి. పది వేల రూపాయలు జవాహారి వున్నది. సాంప్రదాయము మంచిది. వీరు దంపతులిద్దరు మిక్కిలి యోగ్యులు, ఈకాలపువారు కారు. పిల్లవాడు లక్షణమైనవాడు. చదువులోసీమమీరపకాయ, ఈలాటిసంబంధందొరక మంటే దొరుకుతుందా? ఈపిల్లవాడిజాతకం అఖండజాతకం జాతక రీత్యాచూస్తే హైకోర్టు జడ్జీపని చేసేటట్టున్నాడు.

రాయప్ప—అందుకనే మేమంతా యీలాప్రాధేయపడకం.

రాఘ—అయ్యా! అవధానులుగారు తమరు శ్రమపడి దయ చేసినారె. ఏంచెప్పడానికి నాకేంతోచడంలేదు నరహరిరావుపంతులు గారిని నే నెరుగుదును, గోపరాజువారికి మాకుకూడా యిదివరకు సంబంధము కలిసిందే. మాపిన్నత్తగారి మనుమడికి గోపరాజుగారి పిల్లనే యిచ్చారు. అయితే వకటిరెండు చిక్కులున్నాయి యిందులో ను. ఈరోజులలో పిల్లవాళ్ళు మునుపటి పిల్లవాళ్ళుకారు. మాఅబ్బా యి "బాబయ్యా! నేను బియ్యేప్యాసయితేనేకాని పెళ్లిచేసుకో" నని పట్టుపట్టికూర్చున్నాడు. ఎంతమందిచెప్పినా వినడంలేదు. పైగావాడికి పందొమ్మిదేళ్ళువెళ్లి యిరవైయేళ్ళు వచ్చినవి వాడేమోగాని పదహా రో యేటినుంచి పెండ్లిచేసుకోనని దెబ్బలాట. లేకపోతే పదహారోయే టే పెండ్లయిపోనువాడికి. ఈనాటిపిల్లవాళ్ల కెంతచూస్తే అంతేగాని పెద్దవాళ్ళుచెప్పడం, వినడంలేదు. వాడితోనాలోచించిగాని నేనేమా టాచెప్పడానికిన్నీ వీలులేదు. ఒకవేళ కట్నం, కానుకలవిషయమైనసం దేహముండి నేఃలాగంటున్నా ననుకొన్నారేమో కట్నాలంటె నాకు తలనొప్పి. అది ఆడవాళ్ళవ్యవహారంగాని మన వ్యవహారంకాదు. సాం

పరిదాయం చూడవలె; పిల్ల లక్షణంగా వుందా లేదా. ఆరోగ్యంగా వుందా లేదా, అనిచూచుకోవలె, డబ్బు పావనమటండి ! డబ్బుభోగం ముండ గడిస్తుంది, కట్నాలడిగేవాళ్ళను చూస్తే నాకుమంట. అదిగాక మగపిల్లలకు మంచిచదువుకునే వయస్సులో పెండ్లి చేస్తె చాలాచిక్కులున్నాయండి. అందుచేతనాకూ ఇష్టములేదు చిన్నప్పుడు పెండ్లిచేయడం. అయితే మాఅమ్మగారు త్వరగా పెండ్లిచేయుమని పట్టుపట్టుతుంది. మానంశముల్లోనండి మాతృదేవతమాట కడుగుదాటము. అందుచేత మాపిల్లవాడి నేలానైనా వప్పించి యేలానైనా వివాహము చేయవలెనని ఆలోచిస్తున్నాను. ఐతే నరహరిరావుపంతులుగారి కుమార్తె జబ్బుగానున్నదని యెవరో చెప్పినారండీ !

రాయ—జబ్బేమిటిలెండి. ఏదో ఆమధ్య దగ్గు. జ్వరం. వచ్చి కొంచంనుస్తీచేసింది. మందిప్పించారు తగ్గింది, పర్వాలేదండి.

రాఘు—సరే! నేనాలోచించి వర్తమానం చేస్తానని నరహరిరావుగారితో మనవిచేయుండి. తమరు రేపు వెళ్ళవచ్చును. ఈవేళకుండండి.

రాయ—చిత్తము ఆలాగే వుంటానండి. ఏదోవిధంగా తమరనుగ్రహించాలి.

రాఘు—సరే చూతాముగదండి.

(రాయప్పావధాని నిష్క్రమించు చున్నాడు)

చిదం—తమతో ఆబ్బాయి వివాహమువిషయమై వకటి రెండు సంగతులు మనవిచేయవలెను. మనమిద్దరము బెజవాడవెళ్ళి నండూరి వారిపిల్లను చూచినాముకదా ! వారు వెయ్యిన్నూటపదార్లు కట్నమిస్తామన్నారు; లాంఛనం జరుపుతామన్నారు. పిల్లను తమకళ్ళతో తమరే చిత్తగించారు. రంభలాగుంటుందికదా ! మతాబాకాని,

అదిపిల్లకాదు. అమ్మగారికికూడా ఆపిల్లను చేసుకోవాలనే వుంది. తమ రేమంటారో ఆవిషయంలో.

రాఘు — ఆపిల్లకు బాలతోడు గేనుయినావుందా ?

చిదం—అదిలేదు. ఏదో నూరుదూపాయలు వస్తువులకంటె యెక్కువలేదు.

రాఘు—పిల్లబాగానేవుందికాని యేదో ముచ్చిబొమ్మలాగుంది. కళా కాంతులులేవు. అయినా సంసారివాని కందమెందుకయ్యా? బోగముదా యేమిటి? "భార్యారూపవతీశతుః" అన్నాడు శాస్త్రకారుడు. అటువంటిపిల్ల యింట్లోవుంటెచిక్కు. నాకాపిల్లవద్దు.

చిదం — సింగరాజువారిపిల్లను చూచిరమ్మన్నారు, చూచివచ్చాను. ఆపిల్లా లక్షణంగానే వుంది. పెద్దపిల్ల. ఆరుమాసములకు కాపురానికివస్తుంది. అబ్బాయికి యీడూ జోడని నాఅభిప్రాయం. వారు కూడా వెయ్యిన్నూటపదార్ల కెక్కువ యియ్యలేమన్నారు.

రాఘు — అంతపెద్దపిల్ల మన కెందుకండీ! పిల్లవాడి చదువుచెడిపోతుంది. పెండ్లాముతో కాపురంచేస్తూ చదువేమిటి వెధవచదువులు,

చిదం — వాడ్రేవువారిపిల్లను చూచిరమ్మని తమరు సెలవిచ్చారు, ఆపిల్లనుకూడా చూచివచ్చాను. ఆపిల్లకుతండ్రి సంగీతం చెప్పించేడండి ఆహాహా ! వీణెపుచ్చుకొని యెంతబాగా పాడింపనుకొన్నారు. శేషుశాలకించేట్టుగాపాడిందండి ! ఆపిల్లనుచేసుకుంటేబాగుంటుందండి, పిల్లకూడా దబ్బపండులా గుంటుందండి, ఆపిల్ల తండ్రి కట్నం కానుక తనకు తోచింది పెడుతాను, ఖాడించి తన్నేవ రమ్మని కూడదంటున్నాడు,

రాఘు—ఆపిల్లనాకేకాదు నాశత్రువులకుకూడా వద్దుబాబూ ! సంగీతమునేర్చుకొన్న కోడలున్నదంటే కొంపకప్రతిష్ఠ, కొంప బోగ

ముదానికొంపైపోతుంది. ఎక్కడెక్కడ లేని సంగీతపాటకులు వచి సావిడి నిండుతారు ఆపిల్ల మనకువద్దు.

చిదం — కాచర్లవారిపిల్ల వున్నది. ఆపిల్లను మీఅమ్మగారు భార్యాగానుకూడా చూచారు. పిల్ల భారతభాగవతాలు గడగడచదువ్ను తుంది. ఇంగ్లీషుకూడా, కొంచెము వచ్చును. ఇస్కూలులో చదువుకొ నేటప్పుడెన్నో బహుమానాలుకూడ పుచ్చుకొన్నదట. చాలా తెలివి గలది. పచ్చగావుంటుంది. చేరడేసికండ్లు. కట్నంవిషయంలో సందేహం గావుంది. లాంచనాలు, అన్నీకలిసి వెయ్యిరూపాయలకన్న యెక్కు వియ్యరట.

రాఘు — భారత భాగవతాలు చదువుకొన్నకోడ లెందుక య్యా మనకు? ఉద్యోగంచేస్తుందా, ఊళ్ళేలుతుందా? వాకిలూడ్చుకొని యిల్లలుక్కొని, మగడికింత అన్నమువండిపెట్టి కాపురం చేసేదికావ లెకాని, చదువులు సరస్వతులెందుకు మనకు.

చిదం — అయితే తమభిప్రాయమేమిటో చెప్పండిమరి —

రాఘు — గోపరాజువారిపిల్ల ఏలాగుంది? వీరిసంగతేమిటి?

చిదం — చెప్తావినండి! గోపరాజువారిసాంప్రదాయం మంచిది. ఆయన చాలాయోగ్యులు. భార్యకూడా అటువంటిదే. నిరంతరాన్న ప్రదాతలువారు. వారిపిల్లకు పన్నెండేండ్లున్నవి. మూడువేలు రూపా యలు కట్నమిస్తారు. రెండువేలరూపాయలు బాలతొడుగండి. రా నూపోను రైలుఖర్చిస్తారు. వియ్యపురాలి లాంఛనాలక్రింద మూడు వందలిస్తారు. పెండ్లికుమారుడికి వెండిచెంబులు, కంచం, పట్టుబట్టలు, ఉంగరం ఉత్తరజంధ్యాలువగైరా లిస్తారు. చాలావైభవంగా పెండ్లిచే స్తారు.

రాఘు — పిల్లయేలాగుంది?

చిదం — పిల్లబంగారప్పు బొమ్మకాని —

రాఘ—కాని అంటున్నా రేమిమీరు?

చిదం—మీదగ్గిర నిజందాచకూడదు ఆపిల్ల రెండుసంవత్సరములుగా జబ్బుగావుంది. క్షయజాతిజబ్బు. నానాటికి చిక్కిపోతుంది. తండ్రిగారు చాలామందులిప్పిస్తున్నారు అవేమి ప్రయోజనంగావున్నట్టుకనబడదు. పిల్లకు యెటూకానివయస్సయినది బ్రతుకుతుందో లేదో యెవరూచెప్పలేరు. పెండ్లిచేయవద్దని బంధువులు పట్టుపడుతున్నారు. ఆయన దాదస్తుడు. కర్నిష్టి; బ్రతుకదని పెండ్లిచేయడం మానివేస్తె ఆయుః ప్రమాణము దైవాధీనము, తీరా బ్రతుకుతుందేమో జబ్బులోనే రజస్వలవుతుందేమో యని భయము. అటువంటిపని జరిగితే నరహరిరావుగారు శాస్త్రంలో చెప్పినట్లు గంగాప్రవేశం చేస్తారుగాని జీవించరు. బ్రతుకుతుందని తెగించి అయిదారువేలు ఖర్చుపెట్టి పెళ్ళిచేస్తె తీరా చచ్చిపోతే యింతసొమ్ము దండుగని బంధువులు పెండ్లిచేయవద్దని సలహాచెప్పుచున్నారు. ఆయన పెండ్లిచేయక మానను దైవయోగమేలాగున్నదో అని నిశ్చయించినారు. ఆయనసొమ్మును లెక్కచేసేవారు కారు. అటువంటి బిడ్డపోతే సొమ్ములెక్కేమిటన్నారు. రాయప్పవధానిగారినికూడా అడిగాను. ఆపిల్ల జీవించదన్నారాయన. అయితే తండ్రిప్రాణంగనుక జీవిస్తుందని ఆశ ఆయనపెట్టుకొన్నారు. పైగా రజస్వలవుతుందనే భయంచేత పెండ్లిచేస్తున్నారు. ఈవిషయంలో తమయభిప్రాయమేమిటి? ఇంతమాత్రం కట్నంవచ్చేసంబంధముమరివకటి లేదు.

రాఘు—అయితేపిల్లజీవించదని స్పష్టముగా చెప్పాడా ఆయన?

చిదం—ఆహా ! స్పష్టముగా చెప్పాడు. వచ్చినవైద్యులందరు పిల్లనుచూచి పెదవి విరుస్తున్నారట.

రాఘు—వైద్యులనగా దేముళ్ళాయేమిటి! వాళ్ళు తప్పక బ్రతుకుతారన్నవాళ్ళు చావవచ్చును. వాళ్ళు చస్తారని ఆశవదలుకొన్నవాళ్ళు జీవించి రాళ్ళలాగ నుండవచ్చును. ఆయుర్దాయము వీళ్ళనోట్లో

నున్నదా యేమి. వైద్యులమాటే ఆలాగుండగా రాయప్పధానులమా
టమన మేమంత నమ్మగలము? ఎందుచేతనోగాని, ఆపిల్లనే మనవాడికి
చేసుకోవలెనని నాకు పుట్టినది.

చిదం—"జనవాక్యం తు కర్తవ్య" మన్నాడు. పదిమంది బ్రతుకదని చెప్పుచున్నారు మనం చేసుకోవడ మేమి బాగున్నది.

రాఘ—బతక్కపోతేం లేతురు. మనలో మనకు సందేహాలెందుకు నామనస్సులోనున్నమాట చెప్తాను. మూడువేలరూపాయలు కట్న మిస్తారు; రెండువేలు రూపాయలు బాలతోడుగు పెడ్తారు. రాను పోను ఖర్చు లిస్తారుకదా! మనం తరలివెళ్లి మూడునాలుగువందలరూపాయలతో పెండ్లికానిచ్చివత్తాము. పిల్లచస్తె దినవారపుఖర్చుకదా! శ్రాద్ధాల వెంకటావధానులకు యిరువైయైదురూపాయలిస్తేదినవారాలంతా తేల్చివేస్తాడు. ఏలాగైనా మనకీవ్యాపారంలో అయిదువేలరూపాయలు లాభం.

చిదం—తమరుచెప్పినమాట నాకు నచ్చినదిగాని తరువాత తమపిల్లవాడిని రెండవ పెండ్లివాడంటారు.

రాఘ—అంటే అన్నారు. అన్నందువల్ల మనకొచ్చిననష్టమేమయ్యా? కాదాయనంటే రెండవపెండ్లికి స్నాతకముండదు. అది మరి మంచిది. శ్రమాలేదు. ఖర్చులేదు. ఈవివాహామువల్ల అయిదువేల రూపాయలు లాభమొస్తున్నాయి. రెండవసారి పెండ్లికి మూడువేలైనా గుంజకపోను. మావియోగ్యులలో మొలతాడుకట్టిన మగపిల్లవాడు కనబడడంలేదు. అందుచేతయెంతకట్న మడిగితే అంతకట్నం పోస్తారు. రావడానికివీలున్నప్పుడు రాబట్టుకోవద్దా! నాయిష్టమేచేవాయేమిటి? సభలలోనికివెళ్ళినప్పుడు, పదిమందిలో కూర్చున్నప్పుడు కట్నాలపద్ధతి మంచిపద్ధతికాదయ్యాఅని నేనూ అంటాను నిడదవోలులో జరిగిన సంఘసంస్కరణసభలో [illegible] అడిగితే ము

సలిముండ మాఅమ్మ బ్రతికుంది గనా దానిమీద పెడతాను. ఆబిడ జీవించి యున్నందుకు నాకీ ఉపకారం చేస్తుంది. రెండవది నా పెండ్లా మున్నదికదా! అది కొంచెమైనా చదువుకోలేదు. మూర్ఖపుపట్టు పట్టు తున్నదని దానిమీదకి తోస్తాను. శతకోటిదరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.

చిదం.—మీరు చెప్పినదిచాలా బాగున్నదండీ! ఇదితోళ్ళవ్యాపారంవంటిది. చచ్చినజంతువులతోళ్ళతో వ్యాపారంచేసేవాళ్ళు కొందఱు, బ్రతికినవాళ్ళతో వ్యాపారం చేసేవారుకొందఱు. దీనికి చాలిందింకొకటిలేదు సరేనేనువెళ్ళి నరహరిరావుపంతులుగారిదగ్గర తాంబూలం పుచ్చుకొనిరానా యేమిటి?

రాఘు—అవశ్యము మీరువెళ్ళి తాంబూలం పుచ్చుకొనిరండి కట్నం మూడువేలు, వియ్యపురాలిలాంఛనాలు మూడువందలు, రానుఖర్చులు నూరు పోనుఖర్చులు నూరు మొత్తం మూడువేలఅయిదువందలు వచ్చేటప్పాను పట్టుకొనిరండి

చిదం—చిత్తము. మధ్యాహ్నము వెళ్ళుతాను.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు)

రెండవరంగము.

(రాఘవరావు, చిదంబరదీక్షితులు, నరసింహరావు, ప్రవేశించుచున్నారు.)

నర—పాపము! తమకు చాలాకష్టమువచ్చింది. పిల్లవాడికి సరిగ్గా యిరవైయేండ్లయినా లేవు. అప్పుడే వివాహంకావడం, భార్యపోవడం, చాలాకష్టము.

చిదం—అది పూర్వజన్మకృతమండి! రాఘవరావుగారు ధర్మప్రాజుగారు ఆయన కిటువంటికష్టము రాతగదికాదు. ఆయనమట్టుకు గ

ర్భవాసానపుట్టిన కూతురుపోయినట్టుందికాని, కోడలుపోయినట్టులే దండి! ఆపిల్లకోసం రాత్రీపగలూ కంటికి నేలకు ఏకధారగా విచారి స్తున్నారు.

రాఘు — నరసింహారావుగారూ నాగృహలక్ష్మి వెళ్లిపోయింది. తెలియక భంగపడిపోయినామయ్యా! ఇంతజబ్బుగావుంటే యెంతవెట్టి ముండాకొడుకైనా చేసుకొంటాడండీ? కొంచెము జలుబుచేసి దగ్గుజ్వ రమన్నారుగాని, యీలాంటిదారుణరోగమన్నారుకారు; ఇరవైరోజు లైనా కాలేదు పెండ్లయి, అబ్బబ్బబ్బ! ఈదుఃఖం నేను భరింపలేకుండా వున్నానండీ! దిగాలుపడికూర్చున్నాడు పిల్లాడు, వాడి మొఖంచూచి నే ను భరింపలేకుండావున్నాను. నూఆబిడా! మాఅమ్మా చేసేగోలకు మి తమేలేదు. ఆబతికిన నాలుగురోజులే పాపము పిల్ల మాయాబిడను ప ట్టుకొని వదిలిందికాదండీ! ఎంతఆపుకున్నా మగవాణ్ణైనా కేదుఃఖమాగ లేదు ఆడవాళ్ళ కాగుతుందా ?

నర — రాఘవరావుగారూ తమరు ధైర్యమవలంబించియుండ వలె విచారించిన కార్యమున్నదా ? ఆపిల్ల మనకు ప్రాప్తం లేదు యింతకు.

రాఘు — ఇంతకూ నాదినములు మంచివికావు. లేకపోతే బం గారమంటిపిల్ల దక్కకపోతుందా ?

నర — చిత్తము నేను సెలవుపుచ్చుకుంటానండి తమకు వేతే చెప్పవలసినవారెవరు లేరుగదా.

రాఘు — చిత్తము నేదిగడతానండి !

నర — (నిష్క్రమించును.)

చిదం — పంతులుగారూ చిన్నరహస్యము. సూచిరాజు జనార్ద నరావుపంతులుగారు తమతో వకమాట మనవిచేయమన్నారు. వారి దగ్గరపిల్లవున్నది. రెండువేలు కట్నం, వేయిన్నూటాయలుబాలతో మగు,

రానూపోనూఖర్చులిస్తామంటున్నారు. ఏంసెలవు? పిల్లపోయి యీవాళకి మూడురోజులే అయింది. మైలరోజులువెళ్ళనీ, తరువాత మాట్లాడదామన్నాను.

రాఘు—ఏడ్చినట్టేయుంది. చచ్చుతెలివి. అలాగంటారయ్యా! మైలా లేదు. సింగినాదమూ లేదు. ఇలాజెప్పు వాళ్ళతోటి. మూడు వేల కట్నమూ రెండు వేలబాలతొడుగూ పెట్టమను. పదుమూడోనాడే పెండ్లి చేస్తామను.

చిదం—అలాగేచేస్తారుకాని, మైలలో తాంబూలమెల్లాపుచ్చుకుంటాం, కాస్త అప్పడం, వడియమెల్లా పెట్టుకొంటాం?

రాఘు—ఇందుకేమీకు వై. స. బు. పె. పేళ్ళువచ్చింది మీ వ్యవహారమంతా శుద్ధవైదికం. తాంబూలాలు మా పినతల్లికొడుకెళ్ళి పుచ్చుకొస్తాడు. అప్పడాలు వడియాలు మీయింట్లో పెట్టించు డబ్బిస్తాను.

(అంతట నారాయణమూర్తిగారు ప్రవేశించుచున్నారు)

చిదం—ఉష్! ఉష్ నరహరిరావుపంతులుగారి బావమరిదిగారు నారాయణమూర్తిగారు వస్తూన్నారయ్యా

రాఘు—ఏరీ? ఏరీ? అలాగా (అని మేడుపు మొగము పెట్టును)

చిదం—దయచేయండి నారాయణమూర్తిపంతులుగారూ! ఇక్కడేవున్నారు పంతులుగారు.

రాఘు—(మెల్లగా) దయచేయండి! (అనిచేయిచూపును.)

నారా—చిత్తము- (అని కూర్చుండును)

చిదం—ఎంతోఅంత ముచ్చటపడి వియ్యంపొందితే దైవమోర్వలేకపోయినాడు.

నారా—ఏంచేయను, అదృష్టమాలాగున్నది. తిరు రేమో నగలు పంపించమని వర్తమానమంపించినారట నరహరిరావుగారికి.

రాఘు — నేనా? నేనా?వర్తమానమంపినది. శివశివ! శివశివ! యెంతమాట, బిడ్డలగన్నాగాని, గడ్డలగన లేదు. కిట్టనివాళ్ళెవరో ఆయనతో చెప్పియుందురు. తెలివితక్కువచేత ఆడవాళ్ళే యీ కనిచేశారో? ఛీ! యీ నీచఘనకసి నేను చేస్తానండి?

నారా — సరే ఏమైతేమిలెండి ఇవిగో నగలు. మీరొక్కవస్తువైనా పెట్టలేదుగదా? అన్నీ మేము పెట్టిననగలే మరొగత్తులుకాక రెండువేల మూడువందల రూపాయల నగలున్నవి. ఇవిగో దాసి చీరలు.

(అని యేడ్చుచున్నాడు)

రాఘు — అబ్బబ్బబ్బబ్బ! ఆవస్తులకేసి నేను చూడలేనండి. నాగుండె దడవెట్టుచున్నది. దీక్షితులుగారూ! అనితీసికెళ్లి యింట్లోవేయించండి నా యెదుట వుంచకండి.

నారా — చిత్తము నేను సెలవుపుచ్చుకొంటాను. నగలన్నీ సరిగా వున్నవిగదా?

రాఘు — చిత్తము. ఏమనడానికి నోరురాదు.

నారా — (నిష్క్రమించును.)

చిదం — ఏమండోయి నరహరిరావు పెద్దమనిషే. మనముకబురంపగానే అడ్డబాసదగ్గరనుంచి పంపించినాడు.

రాఘు — పెద్దమనిషే. కాకపోతేముట్టుకు డొక్కబద్దలు చేయును? సరేకాని మాచిరాజువారి సంబంధంకుదుర్చు ఏలాగోవకలాగు.

చిదం — మీరడిగినంతవరకు వారిస్తారుకాని పిల్లకు కంట్లో చిన్న పువ్వుంది.

రాఘు — పువ్వున్నాసరె కాయున్నాసరె అడిగినంతవరకు సొమ్మిస్తే తాంబూలాలు పుచ్చుకొనిరా. వెళ్ళు.

చిదం — చిత్తం ఆలాగే.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

# బధిరచతుష్టయప్రహసనము



(చెవిటిశంకప్పయు భార్య సింగమ్మయుఁ బ్రవేశించుచున్నారు.)

శంక—నీ వనేమాట నేమిటే. చెవిటిపీనుఁగు నన్నమాట ఎరగవా యేమిటి గట్టిగా చెప్పు.

సింగ— ఇంతమాత్రానికే పీనుగన్ని నన్ను తిట్టాలీ. నేనెంత చెవిటిదానినైనా బొత్తిగా విన(బడక పోదు. కడియాలవారింటికి భోజనానికి పిలిచారు. మీరుకూడా వస్తారా?

శంక—ఏమిటీ కడియాలు చేయించాలినీకిప్పుడు. ఆసినీయిల్లు బంగారమైరిగదే నీ సిగ్గుచిమడా. ఒకమూల కుఱ్ఱదానికి పెండ్లిచేయవలెనని నే నాలోచిస్తూ డబ్బులేక కొట్టుకొనుచుంటే నీకు కడియాలు కావలెనా? కడియాలుకాదు. అందెలు చేయిస్తా.

సింగ—అందాలా...ములిసిలిదానికి నాకందా లేమిటి. నాకందాలెందుకు. నేను సంసారిని.

శంక—కంసాలిని పిలవమంటావు. అశినీయమ్మకడుపుకాలా తలచినప్పుడే తాతపెళ్లా నీకు.

సింగ— నేనేమన్నానని నీయమ్మకడుపు కాలాఅని తిడతారు. కడియాలవారింటికి భోజనానికి వెడతారా అంటే యింతకోపమెందుకూ.

శంక—భోజనం పెట్టవూ కడియాలు చేయించకపోతేను. వెధవకడియాలూ నీవూను బోడిముండ పెండ్లి చేసుకున్నందుకు బాగా అనుభవిస్తూన్నాను.

సింగ—సరి సరి అప్రతిష్ట వెధవకడియాలవారని వాళ్ళను తిడతా రెందుకు? వాళ్ళు మీజోలికొచ్చారా? మీ యింటికొచ్చారా? మీ

యిష్టమువచ్చినట్లు నన్ను తిట్టండి నేను పడతాను. వాళ్ళు కలియుగ వైకుంఠంగా పెళ్లిచేసుకుంటూంటే బోడిముండాపెళ్లనడ మేమిటి.

శంక — ఆశి నీ సాహసం మండిపోనూ. నేను వైకుంఠానికి వెళ్లి పోవాలీ. కడియాలు లేకపోతే బోడిముండలాగుంటానంటావూ. ఓసీ ముడిగాళ్లముండా. రాచ్చిప్పెడటుకులో బూర్లెమూకుడు మినపరొట్టో తిని హాయిగ నుండాలని వుంది కాబోలు నీకు. తిందుగానిలే. క్షవరం చేసి వదిలి పెడుతా వెధవా.

సింగ — ఆలా చెప్పరాదూ మరి మీద వేసూ. అంత వుండలేక పోతే అటుకులు నానపోస్తాను. మినపరొట్టయినా కాలుస్తాను. ఎంత సేపు. ఇప్పుడు పప్పు నానబోస్తాను. క్షవరం చేయించుకుంటారా చే యించుకొండి మంగలాడికికబురు పంపిస్తాను. మీరు పనిచేయించుకొని స్నానంచేసేలోపున రొట్టెంత సేపు కాలుతుంది.

శంక — నన్నే అటుకులు తినమన్నావూ, నన్నే మినపరొట్టె తినమన్నావూ, సరే! నేనే వెధవని. నాకు నీవుక్షవరం చేయిస్తానన్నావు మంగలాడిని పిలిపించి. ఛీ దిక్కుమాలినముండా నీ మొగము జూడను పోచీలు కంకణాలు కడియాలు చేయించలేదని నన్ను చచ్చిపొమ్మం టావూ. ఇదిగో లేచిపోవుచున్నాను నీకు నాకు సరి

(అని లేచు చున్నాడు.)

సింగ — నేనేమి పేచీ లెట్టాను. కారణంలేందే దులిపి వదిలి పెడుతూన్నారు. నే నీవాళ ప్రొద్దున్నే లేచి యెవరిమొగము చూచానో కాని తిట్లు తగులుచున్నాయి. వెళ్ళకండి యింట్లోనే వంట చేస్తాను

(అని జందెముపట్టుకొని యాపుచున్నది)

శంక — ఆశి నీ చేతులు పడిపోను, నాజందెము తెంపుతావంటె నాకు సన్యాసమిప్పించాలని వుందా?

సింగ—అయ్యయ్యో! నామూలాన్ని మీరు సన్యసించడమెందుకు? నేనే పుట్టినింటికి లేచి పోతాను.

శంక—పుట్టింటికి లేచి పోతావా? పుట్టింటికి లేచిపో రంగము మొన్నెను లేచిపోనా కెందుకూ. అక్కడ కడియాలు చేయించేవారు కావలసినంతమంది ఉంటారు.

సింగ—ఈబుద్ధులు నాకు రంగమ్మ చెప్పింది. దానికొంప తియ్యకండి దానిమగడు పాపిష్టిమనిషి.

శంక—నీమగడు పాపిష్టిమనిషా? నేను పాపిష్టి వాడనటే నీ దుంపతెగ, (అని నెత్తిమీద బాదుచున్నాడు)

సింగ—అయ్యో! అయ్యో! తలబద్దలై పోతోంది.

శంక—నాతల బద్దలవాలని తిడుతున్నావా? నీ పాతివ్రత్యం మండా. నీతో కాపరం చేసేకంటే గోదావరిలో దిగితే మంచిది.

(అని పారిపోవుచున్నాడు)

(ఇద్దఱు నిష్క్రమింతురు)

రంగము 2

(అప్పుడు శంకరప్ప ప్రవేశించుచున్నాడు)

శంక—(తనలో) ఈవేళ నాకు భోజనం లేకపోయినా సరే ఇక్కడనుండి కదలను. అంగవస్త్రము వేసికొని యీ రాత్రి రావిచెట్టు నీడనె పండుకొంటాను. ఆముండకు బుద్ధివచ్చిందాక తగినశాస్తి చేస్తాను ఇదిగో! గంగన్న యెక్కడనుండియో వస్తున్నాడు. అన్నట్టు మఱచిపోయినాను వీడీమధ్యనరసాపురం వెళ్లాడు. అక్కడ నాస్నేహితులు నరహరిరావుపంతులుగా రుండవలె. ఆయన క్షేమంగా నున్నాడేమో కనుక్కొని ఆయన కులాసాగా వుంటే వెళ్లి పదిరోజు లాయనదగ్గర వుండి. గెబ పూడివస్తాను. ఈలోపుగా నీదౌర్భాగ్యురాలికి బుద్ధివస్తుంది నలుగురు దానే చెప్పుదెబ్బలు కొడ్తారు.

(అప్పుడు గంగన్న ప్రవేశించుచున్నాడు)

గంగ—ఓహోహో! శంకరప్పా! ఇదేమిటి చెట్టుక్రింద పడుకొన్నావు ?

శంక—ఒరే! నీచెవులేమన్నా కొంచెం నిమ్మళంగావున్నాయా?

గంగ—సరే నేను చెవల వెధవనైతే నీ కేమిలే. ఎప్పుడూ ఆలాంటివాణ్ణె. నీవెప్పుడు యీలాగే అంటావు వేళాకోళానికి

శంక—నీవు నరసాపురాన్నించే నా రావడం.

గంగ—నరసరాజుగారియింట్లో పెండ్లి అయింది. (అని చెయ్యి విసరుచున్నారు )

శంక—ఏమిటి! నరహరిరావుపంతులు పోయినాడూ! హరి హరీ ఎంతమాట! ఎన్నాళ్లయింది.

గంగ—పదహారురోజులపండుగ అయిపోయింది.

శంక—ఏమిటి దశాహం గూడా అయిపోయింది సంగతే తెలియతేదు. జబ్బేమిటి?

గంగ— డబ్బేమిటి కావలసినంత ఖర్చుపెట్టారు. వియ్యంకుడు దిట్టమయినవాడు. డబ్బు చాలావుంది. బాగా యింతలా వుంటాడు మనిషి.

శంక—అబ్బా! అంతలావుబ్బిందీ వళ్ళు! పాపము ఆయ నింకెక్కడ బ్రతుకుతాడు. అయితే ఎవరు మోశారు?

గంగ—నాలుగేసిరూపాయలు సంభావన యిచ్చారు విద్వాంసులకి.

శంక—సరే! నలుగురుకొడుకులు మోశారు? అయిదోవాడు నిప్పుచ్చుకున్నాడు. ఆయనకేమి ధన్యుడు. దానాలు బాగాజేసారా.

గంగ—ఆ రెండవకుమార్తె గర్భాదానంగూడా చేశారు. కార్యంలో కార్యం. కాకుల్లాగున వచ్చి పడ్డారు మన బ్రాహ్మలు దేశదేశాలనుంచి 

శంక—కాకులు ముట్టుకో లేదు. అన్యోన్యా! అయన మన స్సులో యేమికోరిక లున్నాయో, దణ్ణంపెట్టుకో లేదు.

గంగ—పెళ్లివైభవం నే నేమని చెప్పుదును. పదిపుట్ల పుల్ల గాడిపొయిల్లో కాలింది. తక్కిన సంభావనలమాట ఏమి చెప్పను.

శంక—అబ్బా! పదిపుట్లకర్ర కాలవలసి వచ్చిందీ. అంతలావున వాళ్ళుబ్బినప్పుడు యెంతకర్రయినా పడుతుంది. నేను పరామర్శకు వెళ్ళాలి. ఇంతకు నాకర్మము.

(అని మొగమువోట్టుకొనుచున్నాఁడు.)

గంగ—నీకు సంభావన దొరకలేదని మొత్తుకోకు. మళ్ళీ సంవత్సరానికి రెండవకుమార్తె పెండ్లి చేస్తారు.

శంక—సంవత్సరీకమప్పుడు వెళ్లితే బాగుంటుంది పరామర్శికి. రెండవమాసికానికో మూఁడవమాసికానికో వెల్తాను.

గంగ—రెండు మూడు మాసాల్లోగా వాడింట్లో శుభకార్యాలేమీ లేవు. నేను వెళ్ళుతాను. నాకు పనివుంది.

శంక—సరే! నీవువెళ్ళు పాపము నీ వేంజేస్తావు నాకర్మానికి ?

(గంగన్న నిష్క్రమించుచున్నాఁడు.)

శంక.—(తనలో) ఇంట్లోజూడవస్తె పెండ్లాంముండ కడియాలు తెమ్మని తావళాలు తెమ్మని పోచీలు తెమ్మని చాపుతుంది. నరసాపురం వెళ్లి నాలుగు రోజులు హాయిగా నరహరిరావుపంతులుగారింట్లో వుంనామంటే అయన వెళ్లిపోయినాడు. ఇంతకు నాజాతకప్రభావము ఎక్కడికి వెళ్లితె అక్కడే నిప్పచ్చు. కాకపోతే నరహరిరావుపంతులు గారికి నలభై యేండ్లయిన సిండలేదు. ఇంతలోనే చావు రావలెనా! ఇంకా యేమిక్కచిక్కులు రాదలచి వున్నవో.

(అప్పుడు నల్లసామి యనుచెట్టిగొల్లవాఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నల్ల—(తనలో) పొద్దు పొడిచినేలనుండి నెలుగుతున్నాను.

పొద్దు నెత్తిమీాది కొచ్చింది, ఇం కెక్కడ నెలకను. కటికివోళ్ళు చం పేసి అమ్ముకున్నా రేమో. నాపేనం చాలివస్తావుంది కాళ్ళు నొస్తా వున్నాయి. కూంచే పీ చెట్టుకింద కూకొని మఱి యెల్తాను. దానిజిమ్మ లాగినఆవు.

శంక—(తనలో) నే నిక్క డున్నానని ఆముండకు ఎవరు జెప్పారో, అప్పుడే యీావెధవ నెవణ్ణొ నాదగ్గిఱికి వర్తమాన మం పింది. ఈలాటిచచ్చువెధవలు యిరవైమం దొస్తైనూాత్రను నేను కదు ల్తానా యిక్కణ్ణించి.

నల్ల—(తనలో) ఈబాపనయ్య వొవడో కాని గోతికాడినక్క లాగ యిక్కడ గూకున్నాడు. ఈన మొకం సూస్తే పెళ్ళైలు శెప్పే ఆయన లాగ యున్నాడు. ఈలాటిబొమ్మడే మునుపోతూరి మాగేదె పెయ్య కోటిలింగాలకాడ తప్పోతే పెళ్ళైజెప్పాడు. మాయావు ఎక్క డుందో, మాాదూ డెక్కడుందో! ఏలాగెల్లిందో యీాననడుగుతాను.

(అని దగ్గిఱకు బోవును.)

శంక—దూరంగా వుండు! ఏమి మీాదిమీాదికొస్తావు.

నల్ల—బాపనయ్యగోరు! నే నొక్క పెళ్ళైడుగుతానుజెప్పండి.

శంక—ఆదిక్కుమాలినముండమాట నాదగ్గిర జెప్పొద్దు. అది పెండ్లాము కాదు. నేను మొగుణ్ణీ గాను.

నల్ల—ఆట్టే ఆల్చంలేదు. చిన్నపెళ్ళై. చిటికెలో అయిపోద్ది. మీారు బుద్ధిమంతులు శెప్పండి.

శంక—ఆముండ అతి బుద్ధిమంతురాలా? నేనే అంత అపా త్రపువెధవనా? ఛీ! అవతలికి పో! దానిమాట నాకు చెప్పకు.

నల్ల—ఆవు తెల్లగా వుంటుంది. కుడికొమ్ము విరిగిపోయింది. దాని కండ్లు కాటుకకండ్లు. తరిపిదూడ కూడ వెళ్లింది. దూడవొంటి మీాద తెల్లమచ్చలు యఱ్ఱమచ్చలు న్నాయి. సన్నరాత్రి యింటికి రాలే

దు. రాత్రి రెండుజాములు వాక నెలికాను. మల్లీ పొద్దుట్నుంచి నెలుకు తున్నాను. కాపళ్ళేదు. మాగొల్లది బెంగబెట్టుకుంది గంజితాగదు. ఏడుస్తా కూసున్నది. అది యేలాగెల్లిందో చెపుదూ బాబూ! ఆవూ దూడాదొరికెనా దూడను నీకిచ్చివేస్తాను. రొం డేళ్ళల్లో యీంతది, (అని కాళ్ళు పట్టుకొనును)

శంక—ఆవు దూడ వుండగా మధ్య గుంజార్చిం దంట. మధ్య నీ కెందుకురా. నా పెండ్లాము నేను తగవు లాడుకుంటే నీవా రాయ బారివి. నాకాళ్ళు పట్టుకోవద్దు పో!

నల్ల—నేముట్టుకుంటె మైలడుతారనా కాళ్ళు యెనక్కిలాక్కు న్నారు. అయితేంగాని ఆవు యెల్లాగెల్లిందోచెప్పు.

శంక—ఆముండ యెలాబోతే నాకెందకు. ఈలాగున దక్షిణ దిక్కుగా వెళ్ళనీశ్మశానభూమిలోకి. (అని చేయి జాపును)

నల్ల—అదుగల్లా జెప్పు. దచ్చినంగా యెల్లిందా. మాగొల్లది ఆలాగే అంటది. మీరిక్కడే కూకోండి నేను నెలుక్కొత్తాను దూడను తీసికెల్తురుగాని. (అని నిష్క్రమించుచున్నాడు)

శంక—(తనలో) అబ్బబ్బా శనిగ్రహాము వదిలిపోయినది. ఆపాడుముండ వీడిచేతులో యింత వూరగాయముక్కో కొంచెము కూర యో పెట్టి నేనెక్కడున్నానో యేమిచేస్తున్నానో యేమంటున్నానో కనుక్కొనిరమ్మని పంపింది. వచ్చినందుకు వీడికితగినట్టు బుద్ధిచెప్పి పం పించాను. కాస్తసేపు అంగవస్త్రము పఱచుకొని పడుకుంటాను. (అని పండుకొనును.)

(అపుడు నల్లసామి ఆవుతోను దూడతోను ప్రవేశించు చున్నాడు.)

నల్ల—(తనలో) బ్యామ్మడన్నా బ్యామ్మడు కాదు ఈన. ఈనంత బ్యామ్మడు భూమిలో పుట్టలేదు. పెరగ లేదు. దచ్చినంగా యెల్ల మని యిట్టే చెయి జూపించాడు. ఆచాయుని నే నెల్లగానే ఆవు దూడ

రెండు కాపడ్డాయి పెళ్ళి చెప్పితే యీనేచెప్పాల ఆకు గంటమక్క-
ల్లేదు. ఈయన పెళ్ళ చెప్పడానికి ఏంటో నోట్లో గొనుక్కొంటాడు.
ఇలాగాలాచూత్తాడు. యిట్టెచెప్పేత్తాడు. మనపని అయిందిగన్క అన్న
కాడికి యీన కాదూశ నిచ్చేత్తాను.

శంక—(తనలో) శని వదలిపోయిన దనుకుంటే వీడి దుంపతెగ
వీడు మళ్లీవచ్చాడు పీకొక్కనితినేటందుకు. నేనిక్కడున్నానని దానితో
చెప్పావడు కాంబోలు చెప్తే యేదో పని గల్పించి మళ్లి పంపింది. కాని
వీడిన్నిమాట్లు వచ్చి యేంజేస్తాడో చూత్తాము. రాయబారాలు పంపిన
కొద్ది నాకు కోపమెక్కువవుతుంది,

నల్ల—ఆముదాలుగాయీ దండాలండీ !

శంక—నీ వెధవదణ్ణాలు గట్టిపెట్టు. ఆవిడపంపడం నీవు రావడం
బాగానేవుంది. వెధవసారథివి బయలుదేరినావు. చాలుచాలు యీపాటి
కవతలుండు.

నల్ల— మీరు చెప్పిన పెళ్ళి యెంటనే దాకలా యిచ్చింది. ఇచ్చి
నందుకు నేనన్నమాటపెకారం దూణ్ణీత్తానుపుచ్చుకోండి. మీవాంటోరి
కిత్తే మాపితాల్లు గూడ పైకెల్తారు. ఇది కుంటుతుందని మీ రనుమా
నించకండి దీంది కుంటికాలు గాదు. రాత్రియేపాలంలోనో పడ్డేవోడో
కాల్లు దుద్దుకట్టతో యిరగెయ్యమోలు. ఆయిదంతో మూడుపూటలు
కట్టుకడ్తే నెమ్మది త్తది సూడండి బొమికగాస యిరిగిం దేమోను.

(అని దూడకాలు జూపును)

శంక—(ముక్కుమీద వేలు వేసుకొని) ఆరి దొంగముండా
కొడకా! ఆరి పాపాత్ముండా! నీ కెంతదుర్బుద్ధి పుట్టిందిరా నాపెళ్లాంముండ
చెప్పినమాటలు విని నామీద లేనిపోనినిందలు వేస్తావా ? నేను దాని
కాలు విరగ్గొట్టానా? నీవెవండవో నేనెఱుంగను. నీయావు నంతకంటా
యెఱుంగను. నీదూడ ముక్కుమొగము యెఱుంగను. నేనేమిటి కాలు

విఱుగగొట్టడ మేమిటి? నా క్షేత్రంలో గోష్పాదమంత నేలైనా లేదు ఇది నాచేతిలో పడలేదు. దీనిని నేఁగొట్టలేదు. ఛీ పో! (అనితోసి వేయును)

నల్ల — అన్న బ్యామ్మఁడు ఇంతలోకీ మాటతబ్బావతు. నేను దూడ నిస్తానన్నాగాని ఆవు నిస్తానన్ననా? నీవు నేనబద్ధమాడితే జిమ్మపుచ్చిపోవాలి. ఈజిమ్మ తెగ్గోయ్యాలి. నెయ్యి అన్నంతినే బామ్మడవు నువ్వే అబద్ధా లాడ్తే యిగచెప్పేదేమిటి? నేను దూడనే యిత్తానన్నాను ఇదిగో పుచ్చుకో.

శంక — నాప్రమాణకంగా నేను దీనికాళ్ళువిరగ్గొట్టలేదు. ఆవు దూడకాళ్ళు విరగ్గొట్టితే వంశక్షయ మై పోతాను. నాగాయత్రిసాక్షి. నే నేపాప మెఱుఁగను.

నల్ల — పుచ్చుకుంటే పుచ్చుకో దూణ్ణి. లేకపోతే అదికూడా నాయింట్లోనే వుంటుంది. మొదట దూడకే వప్పుకొని పెళ్ళి జెప్పి మల్లిఇప్పుడు గత్తే ఆవు రావాలంటావా? పూటపూటకి రెండేసి సేర్లు పాలు పితుక్కొని తాగుదాము అనుకున్నావుగాబోను నేనంత మెట్టి ముండాకొడుకును గాను. ఈబాపనయ్యాజిత్తుల్లో పడిపోవడానికి. నీవు బామ్మడవని నాకేమన్నబయ మనుకున్నావేమిటి?

(అపుడు నారాయణమూర్తి యనుబ్రాహ్మణుఁడు ప్రవేశించుచున్నాడు)

నారా (తనలో) భూలోకనారదుఁడనివచ్చినపేరు రానే వచ్చింది. నాకువచ్చినపేరుచచ్చినాపోదు. వాళ్ళజుట్లు వీళ్ళజుట్లుముడివేసినైతే కోర్టులోకి లాక్కుపోయి యేదోవిధంగా నాలుగు డబ్బులుసొమ్ము పారవేసుకోడమే ప్రియోజకత్వము. ఏమీ లేకపోతే యీసంసారం యీడదడంయెల్లాగా? యీనల్లసామిగాడు శంకరప్ప యేవో పట్టింపులు పట్టుకుంటున్నారు ఇదియేదో కనుక్కొని యేదో ఒక బస్కీ యిందులో కొట్టాలె. [illegible] బద్దలుకొ

ట్టుకున్నా వాడికి వినబడను. నీడికి వినబడను. ఈలాటప్పుడే మన దో
యం పాలేది. వెళ్ళిపీళ్ళతగాదా యేమిటో కనుక్కుంటాను. ఏమిటిరా
నీతగాదా? (అని గొల్లవానికి సంజ్ఞచేయుచున్నాడు)

నల్ల—సూడండి! మారజ్జమారజ్జ! ఈబాపనాయిన కొచ్చినదు
రుబుద్ధి సూడండి బాబూ. నాయావుదూడ యెక్కడకో పారిపోతే
పెళ్ళి చెప్పుమన్నాను. దొరికితే తరిపిదూణ్ణిస్తానన్నాను. దచ్చినంగా
యెల్లింది నెలుక్కోమని చెప్పాడు. ఎల్లాను. నావున్నెం బాగుంది.
యాలాయిసేసం మంచిది. నాగొడ్లు నాకు దొరికాయి. దూణ్ణిస్తా
నంటే వొద్దంట. ఆవు గావాల్నంట. అన్నాయం జూసండి బాబూ
పాలమ్ముకొని నెయ్యి అమ్ముకొని యీయావునూలాన్ని యేదోకొంత
పైకప్పు జేసుకొని గెంజినీలు తాగుతున్నానుండి. ఈనాశి కూలిపోను
ఈయావు నిమ్మంటాడండీ.

నారా—(శంకరప్పవంకజూచి) శంకరప్పగారూ! ఏమిటి
మీ తగాదా?

శంక—ఈవేళ నేను మాయింటాబిడ దెబ్బలాడు కున్నాము.
కోపగించి నేనిక్కడొచ్చి పండుకున్నాను. నాపెళ్ళాము నేనెక్కడు
న్నానో చూచి రమ్మని పిణ్ణిఅంపింది. మొదట దాంకో ఏదేం జెప్పాడో
ఆపలుగుముండ వీడ్తో యేంజెప్పిందో నాకేమీ తెలియదు. ఇపుడు వ
చ్చి వీడు నాదూడకాలు విరగగొట్టా వంటాడు జూడండి బ్రాహ్మణ్ణి
ఆవుదూడకాళ్ళు విరగ్గొడ్తానా? కలికాల మొచ్చిపోయింది. దీనమ్మకడు
పుమాడ అంతఘోరమే.

నల్ల—చిత్తగించండి బాబయ్యా పదిమంది పిల్లాజల్లా పెట్టి
కొని బతకాలనుకుంటున్నాము. అబద్ధ మాడ్తే నాలిక తెగ్గోయించు
డి. దూడను నేను యిస్తానన్నానుగాని ఆవును యిస్తానన లేదు.

విఱుగగొట్టడ మేమిటి? నా కీగ్రామంలో గోష్పాదమంత నేలైనా లేదు ఇది నాచేతిలో పడలేదు. దీనిని నేఁగొట్టలేదు. ఛీ పో! (అనితోసి వేయును)

నల్ల — అన్న బ్యామ్మఁడు ఇంతలోకీ మాటతబావతు. నేను దూడ నిస్తానన్నాగాని ఆవు నిస్తానన్ననా? నీకు నే నబద్ధమాడితే జిమ్మపుచ్చిపోవాలి. ఈజిమ్మ తెగ్గొయ్యాలి. నెయ్యి అన్నంతినే బామ్మడవు నువ్వే అబద్ధా లాడ్తే యిగచెప్పేదేమిటి? నేను దూడనే యిత్తానన్నాను ఇదిగో పుచ్చుకో.

శంక — నాప్రమాణకంగా నేను దీనికాళ్ళు విరగ్గొట్టలేదు. ఆవు దూడకాళ్ళు విరగ్గొట్టితే వంశక్షయమై పోతాను. నాగాయత్రిసాక్షి నే నేపాప మెఱుఁగను.

నల్ల — పుచ్చుకుంటే పుచ్చుకో దూణ్ణి. లేకపోతే అదికూడా నాయింట్లోనే వుంటుంది. మొదట దూడకే వప్పుకొని పెళ్ళి జెప్పి మల్లీఇప్పుడు గత్తే ఆవు రావాలంటావా? పూటపూటకి రెండేసి సేర్లు పాలు పితుక్కొని తాగుదాము అనుకున్నావుగాబోను నేనంత వెఱ్ఱి ముండాకొడుకును గాను. ఈబాపనయ్యజిత్తుల్లో పడిపోవడానికి. నీవు బామ్మడవని నాకేమన్న బయమనుకున్నా వేమిఁటి?

(అపుడు నారాయణమూర్తి యను బ్రాహ్మణుఁడు ప్రవేశించుచున్నాడు)

నారా (తనలో) భూలోకనారదుఁడనివచ్చినపేరు రానే వచ్చింది. నాకువచ్చినపేరుచచ్చినాపోదు. వాళ్ళజుట్లు వీళ్ళజుట్లుముడివేసినైతే కోర్టులోకి లాక్కుపోయి యేదోవిధంగా నాలుగు డబ్బులుసొమ్ము పారవేసుకోడమే ప్రయోజకత్వము. ఏమీ లేకపోతే యీసంసారం యీదడంయెల్లాగా? యీనల్లసామిగాడు శంకరప్ప యేవో పట్టింపులు పట్టుకుంటున్నారు ఇదియేదో కనుక్కొని యేదో ఒక బస్కీ యిందులో కొట్టాలె. వీళ్ళతాదుదెగ వీళ్లిద్దరికి చెముడే. తలకాయ బద్దలుకొ

ట్టుకున్నావాడికి వినబడను. నీడికి వినబడను. ఈలాటప్పుడే మన దో యం పాలేది. వెళ్ళినీళ్ళతగాదా యేమిటో కనుక్కుంటాను. ఏమిటిరా నీతగాదా? (అని గొల్లవానికి సంజ్ఞ చేయుచున్నాడు)

నల్ల—సూడండి! మారజ్జమారజ్జ! ఈబాపనాయిన కొచ్చినదు రుబుద్ధి సూడండి బాబూ. నాయావుదూడ యెక్కడకో పారిపోతే పెళ్ళి చెప్పమన్నాను. దొరికితే తరిపిదూణ్ణేస్తానన్నాను. దచ్చినంగా యెల్లింది నెలుక్కోమని చెప్పాడు. ఎల్లాను. నావున్నెం బాగుంది. యాలాయిసేసం మంచిది. నాగొడ్లు నాకు దొరికాయి. దూణ్ణిస్తా నంటే వొద్దంట. ఆవు గావాల్నంట. అన్నాయం జూడండి బాబూ పాలమ్ముకొని నెయ్యి అమ్ముకొని యీయావుమూలాన్ని యేదోకొంత పైకర్చు జేసుకొని గెంజినీలు తాగుతున్నానండి. ఈనాశె కూలిపోను ఈయావు నిమ్మంటాడండీ.

నారా—(శంకరప్పవంకజూచి) శంకరప్పగారూ! ఏమిటి మీ తగాదా?

శంక—ఈవేళ నేను మాయింటావిడ దెబ్బలాడు కున్నాము. కోపగించి నేనిక్కడొచ్చి పండుకున్నాను. నాపెళ్ళాము నేనెక్కడు న్నానో చూచి రమ్మని వీణ్ణిఅంపింది. మొదట దాంట్లో ఏదేంజెప్పాడో ఆపలుగుముండ వీడ్తో యేంజెప్పిందో నాకేమీ తెలియదు. ఇపుడు వ చ్చి వీఁడు నాదూడకాలు విరగగొట్టా నంటాడు జూడండి బ్రాహ్మణ్ణి ఆవుదూడకాళ్ళు విరగ్గొడ్తానా? కలికాల మొచ్చిపోయింది. దీనమ్మకడు పుమాడ అంతఘోరమే.

నల్ల—చిత్తగించండి బాబయ్యా పదిమంది పిల్లాజల్లా పెట్టి కొని బతకాలనుకుంటున్నాము. అబద్ధ మాడ్తే నాలిక తెగ్గోయించు డి. దూడను నేను యిస్తానన్నానుగాని ఆవును యిస్తానన లేదు.

నారా—(తనలో) చాలాపసందుగా వున్నది తగాదా. ఇంత కు నాయదృష్టము పుచ్చినది. ఇదే సమయము. వీడితో జెప్పవలసిన మాటలు వీడితో జెప్పి, వాడితోజెప్పవలసినమాటలు వాడితో జెప్పి ఈదూడను కాజేస్తేమంచిది. (ప్రకాశముగా గొల్లవానితో గట్టిగా) ఇప్పు డీయన కోపంమీదున్నాడు. నీవుచెప్పితే వినడు. నీవు వెళ్ళు. నేను నచ్చజెప్పి యీదూడను పుచ్చుకు నేటట్టు జేస్తాను. నీవు వెళ్ళు ప్రస్తుతము.

నల్ల—చిత్తం బాబయ్యా! దరమకామందులుమీరున్నారుగనక బతికి పోయినాను. (అని ఆవును తోలుకొని వెళ్ళుచున్నాడు)

నారా—(తనలో) ఇప్పటికి ఒకగ్రహ మొదిలింది. రెండవగ్ర హాన్నికూడా వదిలించి వేస్తాను. (శంకరప్పతో గట్టిగా) ఆగొలబో యడు దూడ నిక్కడ వదలిపెట్టివెళ్ళాడు. వాడిదూడను వాడికి నేనప్ప గిస్తాను. మీకు వొచ్చినభయములేదు. దీసికాలు మీరు విరగకొట్టి నారని ఎవరున్ను నమ్మరు గనుక మీయింటికి మీరు వెళ్ళండి.

శంక—రక్షించారు బాబూ! ఈముండాకొడుకు యిపుడుదూడ ఖరీదు యిచ్చుకోమంటాడేమో యని జడిశాను. మీరే వాడి కప్ప గించుకొండిదాన్ని. (అని వెళ్ళుచున్నాడు)

నారా—(తనలో) గోదానం దొరికింది గాని దక్షిణ దొరక లేదు. సాయంకాలంలోపుగా దక్షిణ యింకొకడిదగ్గిఱ పుచ్చుకుంటా ను. ఈచెవిటివా ళ్ళిద్దరు గోలచేసి నాకు గోవు నిచ్చినారు, ఈవేళకు పడ్డపాటుచాలు రెండువరహాల సొమ్మ్యుంటుంది,

(అని దూడను తోలుకొని పోవు చున్నాడు)

# బలవంత బ్రాహ్మణార్థ ప్రహసనము

## రంగము 1.

[అప్పుడు దామోదరయ్య యను కరణము, అన్నంభొట్లను బ్రాహ్మణుడును ప్రవేశించుచున్నారు.]

అన్నం—(తనలో) అబ్బబ్బా! తల్లితద్దిన మెప్పుడో యెరుగని వాళ్ళతో వేగడము చాలకష్టము. వీడి తల్లితద్దినం వీడికి జ్ఞాపకము లేదట. నేను చెప్పవలెనట! పురోహితుఁడు ముండాకొడుకును అవడంచేతను నాకర్మం కాలింది. ఇంతప్రొద్దెక్కి ఎందుకు వొచ్చావని వీడు మీదబడి కరుస్తాడేమో! వీ డమ్మకడుపు కాల. వీడు తగనిముండాకొడుకు. పెందలకడనే వత్తామంటె యీరోజున కల్లుపాలెంలో యీడిగవాడింట్లో తద్దినం వచ్చింది. వెళ్ళకపోతే నిత్యేషంవంటి రెండుపాత్రల్లుగంగలో కలిసిపోతవి. ఆకర్మ్కర్తి చేత యింతపొద్దెక్కింది ఈరహస్యము వీడితో చెప్పతానికి వల్లకాదు. అయినప్పటికి ఒకధైర్యమున్నది. వీడు పేరుకు బ్రాహ్మణుడేగాని కర్మిష్టిగాడు. వట్టిమాలముండాకొడుకు. అదిగో! బారెడుచుట్ట నోట్లో బెట్టుకొని కొరివిదయ్యంలాగవీధిఅరుగుమీద కూర్చున్నాడు. ఏమైతే అయినది. వెళ్ళిచెస్తాను,

దామో—(చూచి) ఓహోహోహో! అన్నంభొట్లుగారా! ఏమియీలాగదయచేశారు? ఏదయినాశ్రాద్ధముందా ఏమిటి బాబు! ఆటువంటి వుంటేగాని యీశ్రాద్ధాలగద్దలు మావూరిమీద వాలవు.

అన్నం—మీరన్నమాట నిజమే ఇప్పుడు మీశ్రాద్ధమే వొచ్చింది లెండి.

దామో—అదేమిటయ్యో! త్వరగా జెప్పు. కొంపతవ్వి మాయమ్మతద్దినంకాదుగదా యీవేళ? తిథేమిటి?

అన్నం.—ఈవేళ మాఘ శు ౭ గాదయ్యా? మీాయమ్మగా రితిథి యీారోజునే కాదూ. ఆహాహా! ఎటువంటికొడుకులయ్యా! క న్నతల్లి ఆబ్దికమే జ్ఞాపకములేని మహానుభావులు.

దామో.— ఓరి! నీయమ్మ కడుపుకాల తద్దినమైతే నిన్నమొన్న శెప్పక యీావేళటయ్యా చెప్పడం! ఇప్పుడేలాగ? నాకుకోర్టుహీరింగు లే జ్ఞాపక మఃంటాయిఃగాని తద్దినాలు జ్ఞాపకముండవు. ఆమాట తెలిసివుం డి నీ వింతఃద్దెక్కి రావడం బాగున్నదా?

అన్నం.— నేను పొరుగూరునుంచి రావలసినవాణ్ణీగనుక తీరు బడి లేకపోయింది. నాకాపరం చేపలపల్లె ఆయె. మీాకాపరం చీపు ళ్ళదిబ్బాయెను. ముందువత్తామంటె ముష్టియెత్తుకొనే ముండాకొడుకు ను తీరుబడి లేదాయెను. మీాకు జ్ఞాపకములేదాయెను. ఇదంతా నా ప్రారబ్ధమండి ఇప్పుడైతే యేమిఃమిఃంచిపోయింది ఇప్పుడు జాముపొ ద్దుకన్న ఎక్కువయెక్క లేదు. మూడుజాములలోవుగా తద్దిన మవుతుం ది కాని.

దామో.—అసాధ్య మొచ్చిందే! దాసికోసం తటపటాయిస్తు న్నాను.

అన్నం - ఏమిఃటి ఆఅసాధ్యం? అసాధ్యాలన్ని నేను సాధ్యాలు చేస్తాను చెప్పండి.

దామో.—సరే విను. రాత్రి మాఆవిడ వుల్లిపాయలపులుసు కాచింది. అదివంతో పాకాన బడింది. పొద్దిటికూడా పులుసుమిగిత్తే అది పోనుకొని చద్దిఅన్నం తిన్నాను. అందుకని పెద్దసందేహంగా వుంది.

అన్నం—(తనలో) ఓరి వీడితాడు తెగ! వీడు గొప్పఅసాధ్యం తెచ్చాడు. పోనీ యీారోజునశ్రార్ధం మాని రేపు పెట్టుతామంటె రేపు

మావూళ్ళో గమాళ్ళగంగడి చిన్నదినం. అక్కడికి పోక తీరదు. అందుచేత ఏవో టప్పాలు గొట్టి యీ రోజునేకానిచ్చేస్తాను.

దామో—ఏమిటయ్యో! ఆలోచిస్తున్నావు? ఏమీ పాలు పోలేదా ఏమిటి?

అన్నం—బాబూ! మీరు తెచ్చినపేచీ సామాన్యపుదా? పచ్చివెలక్కాయ గొంతున బడ్డట్టుంది. ధర్మశాస్త్రం గట్టిగా ఆలోచిస్తున్నాను. అయితే మీరు మొగం కడుక్కున్నారా?

దామో—ఏమి ఆలా గడుగుతున్నారు?

అన్నం— మీ మొగంమీద బొట్టు చెరిపోలేదు, అందుచేత కడుక్కో లేదనుకున్నాను.

దామో—నిజమేనయ్యా! మఱచిపోయినాను. పొరబాటే జరిగింది. తెల్లవారుజామున నే రైతువాడు వచ్చాడు. వాడేదో పేచీవ్యవహారము మాట్లాడుతూ కూచున్నాడు. ఆమాటలసందడిని మొగం కడుక్కోడంమఱచిపోయి, కడుక్కున్నాననుకొని శీతగ్రాసం చేసేశాను. ఇందు కేమైనాదారుందా? పోనీ రేపు పెట్టగూడదు?

అన్నం—అయ్యయ్యో! ఎంతమాట. యీవేళే పెట్టితీరవలెను. శాస్త్రాలొప్పవు దీనికి నేను పరిహారం చేస్తాను వినండి. పలుగర్రవేయకమునుపు చేసినభోజనం నిన్నటి భోజనముతో సమానము. ఇప్పుడులేచి చప్పుచప్పున మొగం కడుక్కో. దంతధావనం అయినతర్వాత భోజనం చెయ్యకపోతే యీరోజున నీవు భోజనంచెయ్యనట్టే.

దామో—వహవ్వా! మహాబాగున్నదయ్యా ధర్మశాస్త్రం. అయితే మావూళ్ళో రెండవబ్రాహ్మణకొంప లేదని నీకు తెలుసును గదా. ఇప్పుడు భోక్తలెవరు దొరుకుతారు?

అన్నం—నేనొక భోక్తను గదా! మంత్రింకూడా నేనే చెప్తాను. రెండవ భోక్తను చూడాలి. అదేకష్టము. ఒకపని చెయ్యండి. మీ

వూరి వుంతలో మీ వెట్టివెంకణ్ణీ వుండమనండి. ఆదారిని యెవరైనా బ్రాహ్మణుడు వెళ్ళుతూవుంటే దారి కడ్డంగొట్టి మనయింటి వైపు లాక్కు రమ్మనండి. ఎవడో ఒకడు దారిని వెళ్ళకపోడు.

దామో—నహవ్వా వహవ్వా! మీబుద్ధి పాదరసంవంటిది య్యా. నీపొట్ట వుపాయాలపుట్ట నాకు రాజ్యము లేదుగాని వున్నట్ట యితే నీ కొకఅగ్రహారం పాగవేస్తును.

అన్నం—రాజ్య ముంటె మీరీమాట అనకపోదురు. లేదుగ నుక శుష్కప్రియాలు చెప్పడంలో భారీ ఎక్కువ. ఈమాట కేమిగాని ముందువెట్టివాణ్ణి పంపించండి.

దామో—ఒరే వెంక!

(అప్పుడు వెట్టివెంకడు ప్రవేశించుచున్నాడు.)

దామో—ఒరే వెంకా! నీవిప్పుడువెళ్లి మన వూరిపొలిమేర లో నిలుచుండి బ్రాహ్మణుడెవడైనా ఆదారిని వెళ్ళుతుంటే వెళ్లనియ్య కుండా మనింటికి తీసికొనిరా. ఎన్నిబతిమాలిన దాటిపోనియ్యవద్దు.

వెంక—చిత్తం బాబయ్యా! కామందులోరి శెలవైనాక బ్రాహ్మ నోణ్ణి దాటిపోనిత్తానా? అట్టే తెగనీలిగాడంటే బాపనోడీమీదమడి సంక లిరగ మొదుత్తాను. అంతే!

దామో—ఒరే! కొట్టడంమాత్రం కొట్టవద్దు. నయంచేతనో భయంచేతనో ఏల గో ఒకలాగు నాదగ్గరకు తీసుకొనిరా.

వెంక—మా టన్నాగాని కొడ్తానంటండి.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

రంగము 2.

(వెంకడు పొలిమేరలో ప్రవేశించుచున్నాడు.)

వెంక—(తనలో) అబ్బబ్బా! పొద్దు నెత్తిమీది కొచ్చింది. బు ద్రమాడ తాప్రం పద్దిరంజ తాకిరా లేదు. ఆ వుతోటి మాడ్తావుంది

ఈడబ్బడిసిగ్గొయ్యి. ఒక్క బాపనోడు రాలేదు. యెంచేపు సూసోను! కాపులు మొగాలు కమ్మోరిమొగాలు కాపడ్తున్నాయిగాని బాపనోడి మొకం కాపణ్ణేదు. ఇంటి కెల్లి కూంతగంజి తాగొద్దునా? ఎత్తె కర్నం గో కేమంటారో? బామ్మడు దాటిపోయెనా కర్నపోడు నామీద మండి పడి యేడుత్తాడు. ఈడమ్మచద్దెన్నంగాదుగాని నాకునక్కసావొచ్చింది.

(అప్పుడు పురుషోత్తమావధానులవారు ప్రవేశించుచున్నారు.)

పురు—నమో, నమో, భవతి, భవతి, జాయమానో హ్నం (అను పనస చదువుకొనుచు నడుచుచున్నాడు.)

వెంక—ఓబాపనయ్యోయి! అక్కడుండు! అక్కడుండు!

పురు—ఎవరు వారు ?

వెంక—ఈవూ రెట్టోణ్ణండి.

పురు—వెధవముండాకొడక ! నాతోనీ కేంపనుంది ? అంతదగ్గిరగా నిలుచుంటావేం? పో ! దూరంగబో. నన్నుండమంటావెందుకు ? వెధవా, దారిలో కొరివిదయ్యంలాగ నిలుని అందరికి అడ్డమొస్తావేమిటి?

వెంక—ఉండుముండుమంటె పిచ్చికుక్కలాగ ఒక్కటే వరసని మొరుగుతావేంటి ? నామాటఅంతా యినండి, యిన్నాక తిట్టొచ్చును

పురు—నీమా టేమిటి? వెధవమాట. పొద్దెక్కుతూవుంది. నేను తొందరగా పోవాలె. సదస్యంగుడ్డబోతుంది ముందూళ్ళో. నేను దోవనేనడుస్తుంటాను వెనకాలేవొచ్చి చెప్పుతుండు ఆమా టేమిటో.

వెంక—నే సద్దు లెగిత్తే మూటకుక్కలాగ అదేపరుగు నీవు; నాకు దొరుకుతావా బాపనయ్యా! నామా టిను. మావూరి కర్నపాయసింట్లో చద్దెన్నమాట. అదేదో నీను మెచతారంట రా! నిన్నుతీసుకొనిరమ్మన్నారు. నాండి యెల్లారి.

పురు—మీవూరి కరణ మేమిటి? చద్దెన్న మేమిటి! నాకు బెట్టడమేమిటిరా? ఆమాట సరిగా తెలియలేదు. మీకర్ణంగారింట్లో తద్దినమా యేమిటి!

వెంక—అదుగదేగామను! మీబోడిబాపనోళ్ళ గొడవలు వోరికి దెలుత్తాయి. ఆ అన్నంబుట్టబొమ్మడూను సూకర్నంగోరుసెప్పుకున్నారు, ఆగొడవలు నాకెందుకు గాని రాండి! యెల్దారి.

పురు—మంత్రం చెప్పడానికా రమ్మంటూ నేను! నాకు తద్దినమంత్రం రాదు.

వెంక—మంత్రిమో తంత్రిమో ఆవూసు నాకు తెల్దు; కూడ రాండి.

పురు—నేను రాను. అవతలవూళ్ళో సదస్యపువేళ మించిపోతుంది. దారికే జామూరుగుడ్డ కాస్తాపోతుంది.

వెంక—రాకపోతే నేను వొదలిపెట్టేవోణ్ణిగాను.

పురు—(కోపముతో) ఒదిలిపెట్ట కేంజేస్తావురా దొంగముండాకొడకా! చెప్పుతీసు కొట్టిస్తాను. బొండవేయిస్తాను. తవ్వసా తేయిస్తాను. వెధవా! దారెంబడి వెళ్ళనియ్యకుండా అడ్డపెడతావా? ఎంత పొగరెక్కావు? గొడ్డుమాంసం తిని కొవ్వెక్కావు. కొవ్వు తీయిస్తా జాగ్రత్త!

వెంక—అబ్బోసి నాయనా! బొండవేయిస్తావా? కొవ్వుదీయింతావా? బయమేస్తావుంది. ఎలకబొక్కలో దాక్కోవాలి. ఏయించావుచాల్లే రారా! యీపాటికి. మీలాంటి బూడిదబూసుకున్న బాప్నికే జడుత్తాననుకున్నావా యేంటి? నువ్వేం తాలూకచ్చేరి బంటోతువా? పోలీసుజవానువా? ముంచీబువా? కరణాసవా? నీకు దడ్సేటందుకు? రుద్దరాసిగయ్యలు మెల్లో యేసుకొని ఒంటెనిండా ఎలిమిడి బొంకోసుగానె బయమనుకొన్నావా యేమిటి? కర్నంగారియిలెట్ కొత్తే సెడి?పో

తావా యేంటి నువ్వు? పప్పుకూడు పప్పులు కాయగూరలు దప్పళా లు దొబ్బితింటావు. నెయ్యన్నం తిండానికి కట్టపడతావుగామోను? రా రా! యీ పాటికి.

పురు—వెధవకొడకా! నే రాను. ఏం జేస్తావో చేయి.

వెంక—ఏంజేత్తానా! నీలిగావంటే ఆకాంతపని చేత్తాను.

పురు—దిక్కుమాలినముండాకొడకా! యేంపని చేస్తావురా?

వెంక—ఏంపని జేస్తానా! మీద మడి ముట్టుకుని జెబ్బలు రెండు మట్టుకొని చచ్చినగేద్దూడను లాక్కెల్లినట్టు లాక్కెల్లి మాకర్నంగోరి యీదరుగుమీదపారేత్తాను. అప్పుడు నీతెగు లొదుల్తది. పెద్దమడిసి తరాగా రావయ్యా బేమ్మడాస మెల్లగా బతిమాలుకొని బతిమాలుకొని అడుగుతావుంటే త్రాటిసెట్టెక్కి మొగుల్లో గూకుంటావు. ఇవతల మాలోడేగాని అంత శాతగానోడుకాడు. మల్లా సూస్కో! మరి నాతమాసా ఏంజేత్తానో. గింజుకున్నావంటె దిమ్మ తిరగేత్తాను. ఎట్టెంక డంటే ఓడనుకున్నావేమిటి? సచ్చేదవ గాడు. పట్టుకుంటె ఒదల్డు. పిశాసం. కడుపునిండా కూ డెడ్తాను రమ్మంటె తడిసిననులక మంచంకుక్కిలాగ బిఱ్ఱబిగుత్తా వేంటి? మీబాపనోల్లు నన్ను పిల్రుగాని పిలిత్తేనా కమ్మగా గూకొని పప్పల్తిందును.

పురు—(తనలో) ఈచుర్మార్గుడి వైఖరి నుతిమించి రాగాన పడింది. తాగివచ్చినట్టున్నాడు. నేను మోటతనంచేసి రానంటే నామర్యాద నిలచేటట్టు కనపళ్ళేదు. మాలముండాకొడుకుకు భయమా భక్తా? మీద పడి ముట్టుకొని వాడన్నంత పని చేస్తాడు. అంచేత నేనే మాట దక్కించుకొని వీణ్ణె బతిమాలడంకంటె ఎంత మోటముండాకొడుకయినా బ్రాహ్మణుడు గనక కరణాన్నే అడిగి తప్పించుకు వెళ్ళడం మంచిది. మోటసరసం చెయ్యగూడదు. (ప్రకాశముగా) పదరా! ఒస్తున్నా[illegible]గ్గిరికి. ముందువడు. దారిచూపించు.

వెంక—చిత్తం బాపనయ్యగోరు! ఇది బుద్ధికల మాట. రండి! నాయెనకాల రండి! ఒచ్చినట్లే ఒచ్చి పారిపోయేవు సుమా బాపడ! పందినిగొట్టినట్టు కొట్టేత్తాను. నాసంగ తెరిగవు.

పురు—అట్టేపేలకు. నడు వెధవా. ఒస్తున్నాను.

(అని యిద్దరు నడుచుచున్నారు.)

వెంక—(కొంతదూరము నడచి) అల్లదుగో! కర్నంగా రిల్లు. లోని కెల్లండి. ఆయనే యిలాగొస్తున్నారు. బాబయ్యగోరు! ఇదుగో నుండి బామ్మణ్ణి దీసుకోనొచ్చాను.

దామో—తీసుకొని వచ్చేవా? ఏరీ? ఈయనేనా? ఏమిటి? మీ దేవూరండి?

పురు—మాది వేదపల్లి. తమరేనా యీవూరి కరణంగారు?

దామో—నేనేనండి. మీరేవూరు వెళ్లుతున్నారు?

పురు—కొక్కరాయిపల్లిలో కోమట్ల యింట్లో వివాహమున్నది. సదస్యానికి వెళ్ళుచున్నాను. మీ రెందుకో రమ్మన్నారట.

దామో—ఈరోజున మాతల్లిగారి తద్దినం మాకు భోక్తలు దొరక లేదు. మా పురోహితు డొక డున్నాడు. రెండవ బ్రాహ్మడు లేక దారివెంట ఎవరు వెళ్ళుతూంటే వారిని పిలుచుక రమ్మని పెట్టివాణ్ణి పంపించాను. వాడు మిమ్ముల్ని తీసుకొని వచ్చాడు. మీరు రెండవ భోక్తగా ఉండవలె.

పురు—నారాయణ నారాయణ! ఎంతమాట! నేనుతద్దిన బ్రాహ్మణార్థాలు మానేసి యిరవై ఏండ్లయింది. జీవపితృవైనంతకాలం చేశాను. మాతండ్రిగారుపోయిన తర్వాత మానివేశాను. పైగా నేను అవధానంచేశాను. కొద్దో గొప్పో కర్మిష్ఠిని. అటువంటి వాణ్ణి నేనాతద్దిన బ్రాహ్మణార్థం చేయుడం? పైగా కొక్కిరాయిపిల్లి సదస్యంలో మాకు రహా కిమ్మత్తుగల జామాను పసుంది. అది చెడగొట్టకండి.

అవన్నీ అటుంచండి. తద్దినం రేపో యెల్లుండో అనగా బ్రా
హ్మణులను పిలుచుకోవాలి గాని రెండుజాములయిన తరువాత తద్దినం
రోజున వారిని పోయే బ్రాహ్మణ్ణి కొట్టుకొని రమ్మని వెట్టివాణ్ణి పంపు
తారా? మీరెంతని యోగ్య ప్రభువులైనా వెట్టివాడి చేతనా తల్లితద్ది
నానికి బ్రాహ్మణ్ణి పిలిపించుకోడం. చాలుచాల్లేనయ్యా! అన్నీ అవక
తవకలేనా? ఎవరయ్యా మీ పురోహితుడు? శిష్యుల యీలాగు త
యారు చేసినాడు.

దామో — మా పురోహితుడు మాకు తగ్గవాడే లేండి. వెట్టి
వాడు పిలిచాడని అభిమానంగా వుందా? ఎవరు పిలిస్తేను. బ్రాహ్మడు
పిలిస్తే నీకు వరహాలు ఒలికాయా? వెట్టివాడు పిలిస్తే అవి లేక పోయి
నాయా? గొప్ప కర్మిష్ఠి నని చెప్పుకుంటున్నారు మీరు. యిక్కడ
బ్రాహ్మడు దొరక్కపోతే కర్మ చెడిపోదా యీ వేళ? నాలుగు కాపా
యల జామారు కోసరం చూచుకుంటున్నారు గాని మీకు బ్రాహ్మ
ణకర్మ కొరకు చూచుకోడం లేదు. అభావ మొచ్చినపుడు అవధా
నం చేసినవారైనా సరే దేవతార్చనపరులైనా సరే సోమయాజులు
గారైనా సరే, బ్రాహ్మణార్థం చేసి బ్రాహ్మణీకం నిలపెట్టవలె. కర్మలు
చేసేవారు మీరే యీలాగంటే మావంటివాళ్ళకు పారగతమున్నదా.

పురు — కర్మలు చెడిపోకూడదు గాని బ్రాహ్మణార్థముచేసే
వాడు చేయనివాడు అంటూ లేదా? నా మనవి విని నన్ను వదలి వె
య్యండి

దామో — నిన్ను నేను వొదలను ఇక్కడనుంచి అంగుళం కది
లినావంటే వెట్టి వెంకడిచాత నిన్ను కూర్చుండబెట్టిస్తాను.

పురు — వీధిలోకి వెళ్ళితే వెట్టివాడు పట్టుకుంటాడుగాని లోప
లరాడు. నేను యింట్లోనే యుంటే బ్రాహ్మణార్థానికి కూర్చోను.

దామో — మా వంటశాల్లో గుంజకు నిన్ను విరిచి కట్టేసి నేను
తద్దినం పెట్టా.

పుర—నేను నాలుక పెరుక్కొని చస్తాను.

దామో—చస్తే శవానికైనాలచ్చిస్తాను కాని నిన్ను వొదిలి పెట్టను.

పురు—నాయనా! యివి చేతులుగావు కాళ్ళు. నన్ను రక్షించండి (అని చేతులుపట్టుకొనుచున్నాడు)

దామో—ఇవి కాళ్లుగావు చేతులు; కర్మ నిలపండి. (అని కాళ్లు. పట్టుకొనుచున్నాడు).

పురు—(తనలో) ఈముండాకొడుకు శతఘంట సహస్రబంధ కరణం తలుచుకుంటె మరగాం తప్ప దన్నాడు. ఈవేళ యిక్కడ బల వంతబ్రాహ్మణార్థంతప్పదు. దేవుడా అనియేడుస్తూ నాసిష్టంతా చెరు పుకొని బ్రాహ్మణార్థంచేసి తీరవలసిందే. ప్రొద్దున్నే లేవగానే పుట్టుకుం కముండఆమంగమ్మముండ పేడముద్ద చేతిలో బెట్టుకొని ఎదురుగా వచ్చింది. అందుచేత నాకీయోగంపట్టింది. (అని ప్రకాశముగా) ఊ, సరే. బ్రాహ్మణార్థం చేస్తే రెండవ బ్రాహ్మడేడీ మరి?

దామో—అడుగో మాపురోహితుడు అన్నంభొట్లు స్నానం చేసి యిపుడేవస్తూన్నాడు.

పురు—(చూచి) అన్నంభొట్లుగారూ! ఏవూరండిమీది ?

అన్నం—మాది చేపలపల్లె. మీది వేదపల్లి. మీరు నన్నెరగ రుగాని మిమ్ముమల్ని నే నెఱుగుదును.

దామో—అయ్యా మీరుగూడా స్నానం చెయ్యండి. అపుడే మూడుజాములు గావొచ్చింది.

పురు—ఒక్కసారిస్నానంచేశాను. మీనూతిదగ్గరనే మళ్ళీ చేస్తాను. కాని అన్నంభొట్లుగారు! మీమెడలో జంధ్యం లేదేమండి ?

అన్నం—(తెల్లబోయి తనలో) ఎంతప్రమాదం జరిగింది. రాత్రి నల్లనుందువాడికి డబ్బీలియ్యకుండా వస్తూంటే భోగంపాపితల్లి

ముసలిముండ జంధ్యం పట్టుకు లాగి తెంపివేశింది. ఆమాట నేనుమఱ చే పోయినాను. ఉపాయంచేత దాటలేనా యేమిటి ?

దామో—జంధ్యం లేకుండా యల్లా బ్రాహ్మణార్థానికొచ్చావయ్యా !

అన్నం—ఈతద్దిన మెవరిది !

దామో—మాఅమ్మది.

అన్నం—మీఅమ్మకు జంధ్య ముందా మఱి ? మీనాయనకు జంధ్యంవుంది గనుక ఆయన తద్దినానికి భోక్తకు జంధ్య ముండవలెను. అమ్మతద్దినానికి జంధ్య మక్కరలేదు. ఇది ధర్మశాస్త్రసమ్మతమైన మాట. తెలిసిప్పుడే చేశాను నేను. తెలియనివాళ్ళు మీరూరుకోండీ. ఆయన మెడలోని జంధ్యం కూడ తీసి వేయండి.

పుస—మహారాజుల్లారా ! నామెళ్లో జంధ్యం తియ్యకండి మీరు చెప్పినట్టు విని బ్రాహ్మణార్థం చేస్తాను. తర్వాత నాయేమి వేమో నే నేడుస్తాను. పదండి స్నానం చేదాము. జన్మజన్మాంతర పాప ఫలం బయటపడి నాకీబ్రాహ్మణార్థం వచ్చింది.

(అందరు నిష్క్రమించుచున్నారు)

# అద్భుత శ్రాద్ధ ప్రహసనము

[అప్పుడు సదాశివుడు, వినాయకశాస్త్రీ, నరసింహామును ప్రవేశించుచున్నారు.]

సదా—పెద్దలు చెప్పగా వినుటయేగాని స్వయముగా నే నెన్నడు చూడలేదు. నేటికాలానికి మాతండ్రిగారు చనిపోవడం కాకు

లు ముట్టుకొనకపోవడం సంభవించినది. ఈవిచిత్ర మేమిటో నాకు తెలియలేదు. చెట్లమీఁద కావలసి నన్ని కాకు లున్నవి. గోదావరి యొడ్డున క్రింద బోసినయన్నముఁ జూచి వెళ్ళిపోయినవిగాని ముట్టుకో లేదు. దీనికిఁ గారణ మే మైయుండు నంటారు? మీరు చెప్పినదంతా? జరిగినమాట నిజము. నేను చాలకాలంనుంచి శ్రాద్ధకర్మ చేయుస్తు న్నా గాని యిటువంటిచిత్రముఁ జూడలేదు. పెద్దలు చెప్పేవారు.

నర—నేనీలాటిచిత్రాలు రెండు మూడుచోట్ల చూచినాను. చచ్చిపోయిన వారికి మనస్సులో నే వైనఁ గోరిక లుంటే కాకులు ముట్టుకోవడ పెద్ద లంటారు. చచ్చిపోయినప్రేత మనకుఁ గనఁబడకుం డ దుడ్డుగఱ్ఱ చేతఁ బట్టుకొని అన్నముదగ్గిఱికి జేరకుండ కొట్టివేస్తుం దట. అందుచేతఁ కాకులు రావట. ఆమాట నిజమే యగుచ్చుంటుంది లేకపోతే నాలుగుమెతుకులు విదిపితే కావుకావు మని పందల కొద్ది కాకులు వచ్చి వాల్తాయి. ఆలాటిది తవ్వెఁడుబియ్య పన్నము వేస్తే కా కులు రాకపోవడ మేమిటి? మిరపకాయలు చూచినాక్రింద వాలేకాకు లు అన్నముఁజూచివెనక్కు వెళ్ళిపోవడంగొప్ప ఆశ్చర్యంలోదికాదా నేను మీమేనమామను; మీనాయనగారికి బావమరిదిని. కనుక నే నేదో హాస్యాని కంటున్నా నని సి వనుకో వద్దు. మీనాయనగారికి యేవోకోరికలు కొన్ని వుండితీరుతవి. ఆకోరికలు నీవు కుమారుడవై నందుకు తప్పక తీర్చి తృప్తి పొందించవలెను. ఆలాగున చేస్తే బంధు వులు లోకులుకూడ మెచ్చుకుంటారు. "ప్రేత మం తేచ కర్మణి" అ న్నాఁడు శాస్త్రకారుఁడు. కాబట్టి నీవు తప్పకుండ కోరిక దీరుస్తానని మొక్కుకో. ఇటువంటి సమయములో మనమనుసరించవలసిన శిష్టా చార మిదే.

సదా—మామయ్యా! నీవు వేళాకోళానికి చెప్పడం లేదు. ని. జమే చెప్పుచున్నావు. అంతవఱకు నే నొప్పుకుంటాను. కాని యీని

షయములో నా కెంతమాత్రము నమ్మకము లేదు. కాకులు ముట్టు కోకపోవడానికి కారణాలనేక ముంటాయి. అన్నంచాలా వేడిగనుంటే ముట్టుకోక పోవచ్చును. దగ్గఱ మనుష్యులు నిలుచుంటే భయముచేత ముట్టుకోక పోవచ్చును. లేకపోతే అదివఱ కేదయినా తిని ఆకలి లేక పోతే ముట్టుకోక పోవచ్చును. అంతేగాని పితృదేవత లేమిటి దుడ్డుగ ఱ్ఱలు పుచ్చుకొని నిలుచుండుట యేమిటి. ఇదంతా నట్టిపిచ్చిమాట బ్రతి కుండగానే కోరికలు గాని చచ్చిపోతే కోరిక లేమిటి? అది నేను నమ్మను.

నర— నీ వంటే నవనాగరికుడవు గనుక నమ్మవు. నీతాతలం టివాళ్ళు, నీముత్తాతలంటివాళ్ళు నమ్మినారు. నీలెక్కేమిటి పత్రమేమి టి? మావూరిమునసబు రెండు లక్షలరూపాయల ఆసామి, ఆతఁడు చచ్చి పోయి నప్పుడు యీలాగే కాకులు ముట్టుకోలేదు. వాళ్ళెన్నో దండాలు పెట్టుకున్నారు. ఎన్ని బెట్టుకున్నప్పటికి ఒక్క కాకైనా వాల లేదు. చిట్టచివరకు వాళ్ళపాణం విసికి అతఁడుంచుకున్న ముండకు నెలకు పదిరూపాయ లిస్తామని దణ్ణంబెట్టుకుంటే కాకులు ముట్టుకు న్నాయి. ఈలాటి విచిత్రా లెన్నో నేను భూమిమీఁద నెఱుఁగుదును. నిన్నగాక మొన్న బుట్టి కన్నులు దెరవని లొట్టకాయవు నీవు. నీనమ్మక మెంత జేసు నీవెంత జేసు?

వినా—అయ్యా! సదాశివుఁడుగారు మీరుమామాటలు కొట్టి వేయఁగూడదు. నాకుపదిహేనోయేడొచ్చిందిమొదలు యిప్పటివఱకు వందలకొలది శ్రాద్ధాలు చేయించాను. మావూళ్లో ఒకబ్రాహ్మడు యెనిమిదిలక్షలరూపాయల కధికారి. పరమలోభి. మిరపకాయ కాల్చుకొనేతిన్నాఁడు గాని అన్నము కడుపునిండా ఒకరోజుగూడ తిని యెఱుఁగడు సైనుగుడ్డే కట్టుకున్నాఁడు కాని జరీపంచ యెన్నఁడు వేసి కొనలేదు. ఆయన చచ్చిపోయినాడు. పోయినప్పుడు కొడుకు దేశ

ప్రఖ్యాతిగా దినవారాలు చేయుదలచుకున్నాడు. అది చచ్చిపోయిన తండ్రికిష్టము లేదు. కొడుకు మొదటరోజునే పీనుగమీద ముప్పది రూపాయల పట్టుశాలువ గప్పినాడు. గోదానాలు చేసినాడు. దానితో కోప మొచ్చింది. కాకులు ముట్టుకోనడం మానివేశాయి. డబ్బు ఖర్చుపెట్టనని ప్రమాణముచేసి, దండము పెట్టుకున్నాడు. అప్పుడు వందలకొలది కాకులు వచ్చి ముట్టుకున్నాయి. ఈలాటి వింకా యెన్నో వున్నాయి. నమ్మకనంటే యేలాగా? కాకులు ముట్టుకుంటే గాని గతులు లేవు. కుక్కలు మొదలైనవి ముట్టుకో గూడదు. అందుచేత మీమామయ్యగారు చెప్పినట్టు చేయండి.

సదా—మీరు నూరు చెప్పండి వేయిచెప్పండి. మీమాటలు నాకు నచ్చలేదు. అదిగాక మానాథునగారి కేమికోరిక లున్నవో నాకుఁ దెలియవు. అయన నాతో ఏమి చెప్పి పోలేదు. మీతో ఏదైన జెప్పి పోయినా, డేమో చెప్పండి. ఆలాగున తప్పకుండ చేస్తాను.

నర—మాతోను యేమి చెప్పిపోలేదు

సదా—ఎవరితోను చెప్ప నప్పుడు యే మని మ్రొక్కుకోను?

వినా—మీయిష్ట మేలాగో ఆలాగు చేస్తానని మ్రొక్కుకోవయ్యా.

సదా—సరే! వేరే మ్రొక్కుకునే దేమిటి? ఆయనయిష్ట మేలాగో యీలాగుననే చేస్తాను. మీరిద్దరు సాక్షులు.

నర—చేస్తావుగద! చేస్తావుగద! చేస్తావుగద!

సదా—ఏమి టన్నిమాట్లడుగు తున్నావు? నీకేమైన చాదదస్తమా?

నర—(గుడ్లెఱ్ఱజేసి)చాదస్తమా! చాదస్తమా! (అనిముందుకు వెనుకకు ఊగుచున్నాడు)

వినా—ఇదేమి టర్మో ్య నరసింహంగారు! ముందుకు వెనుకకు నూగుచున్నారేమిటి? సదా తురకలు పుస్తకము జదివేటప్పుడాలాగే చదువుతారు.

నర—ఏమిటి? నాపేరు నరసింహమా? ఎవఁడు చెప్పినాఁడురా నీకు నాపేరు నరసింహమని. నీకు క్రిందు, మీఁదు బొత్తిగా తెలియడంలేదు, నీకు కండ్లు నెత్తిమీఁదికి వచ్చినాయి, జాగ్రత్త! నిన్నమాంతంగా మింగేస్తా.

వినా—సదాశివుఁడుగారు! ఇ దేమిటీగోల? ఈయన కేమైన పూనిందా యేమిటి?

సదా—ధోరణిచూస్తే యాలాగే కనఁబడుతున్నది.

నర—ఏదో పూనిందా నాకు! ఏదోపూనిందా? (అని లేచు చున్నాఁడు.)

సదా—పూనకపోతే పైత్యగించిం దేమో కూచో. కూచో.

నర—నేను కూచోన్రోయి.

సదా—పోనీ! పండుకో.

నర—నేను పండుకోన్రోయి.

సదా—పోనీ! నిల్చో'

నర—నె నిల్చోన్రోయి.

సదా—పోనీ! యేం జేస్తావో చెయ్యి.

నర—ఏం జేస్తానా! కొంప పీకేస్తా. మిమ్ము లందర్ని పీక్కుతినేస్తా. గ్రుడ్లు పీకేస్తా. ప్రాణాలు తీసేస్తా నేలఁబట్టిరా చేస్తా.

వినా—సదాశివుఁడుగారు! మీకు మాట్లాడడం తెలియదు. మీరూరుకోండి!

సదా—నేనూరుకుంటాను. మీరే మాట్లాడండి.

వినా—సరేనండి చెప్పవయ్యా.

నర— నే నెవరో యెఱుఁగవటయ్యా? చిన్నప్పటినుంచి మా యింటిపౌరోహిత్యం చేస్తున్నావుగదా! యీ మాత్రం తెలియదూ?

విన — తెలియకనే అడిగినాను. క్షమించి చెప్పవలె.

నర__నేనా నేను నరసింహమునుగాను. సదాశివుడి మేనమామనుగాను.

వినా__అయితే ఎవరు మీరు?

నర__నేనా? నేను సదాశివుడి తండ్రిని. శ్రీనివాసరావును.

వినా__అయితే మీ రెందుకొచ్చారు?

నర__నో రెండిపోయింది నోరెండిపోయింది. అందుకొచ్చాను.

వినా__నోరెండి పోవడ మేమిటి? శిలోదక వాసోదకాలు తగలడం లేదూ?

నర__అబ్బబ్బా! ఆ గుడ్డపిడుపునీళ్ళు ఎవరిక్కావాలె. అవి నా కక్కఱలేదు.

వినా__అందుకేనా కాకులు ముట్టుకోలేదు?

నర__అవును. నిస్సందేహముగా అందుకే.

వినా__అయితే, మీ కేంగావాల్నో చెప్పండి. మీ కోరిక ప్రకారం నడుచుకోవడానికి మీఅబ్బాయిగారు సిద్ధంగా కూర్చున్నాడు. సదాశివుఁడుగారూ! మొక్కుకోవయ్యా! యిదే సమయము.

సదా__ఇదివఱకే మొక్కుకున్నాను గదండి. మళ్ళీ యిన్ని మాఱ్లెందుకు?

వినా__శ్రీనివాసరావుగారూ! మీ అబ్బాయిగారు మ్రొక్కుకున్నారు. మీకు కావలసిం దేమో నిష్కల్మషంగా చెప్పండి.

నర__ఆలాగయితే చెప్తాతున్నా వినండి. నాకు నో రెండిపోతున్నది. వాసోదక మని పేరు పెట్టి గుడ్డపిడుపునీళ్ళు, శిలోదక మని పేరు బెట్టి రాతిమీదనుండి గిలకనీళ్ళునాకు పోసినందువల్ల నా దాహం తీర

డంలేదు. మీరు వండివేసిన అన్నము వల్ల నా కాకలి తీరడంలేదు.

వినా_మరి మీ కేమి గావాలె?

నర_ఏమికావలెనా? చిన్నప్పటినుంచి ఉదయమున నాక్కాఫీ అలవాటు. మధ్యాహ్నంపూట అలవాటు. ఆ రెండిటితోపాటు గోధుమరవ ఉప్మాను అలవాటు. ఒక్కపూట కాఫీగాని టీ కాని లేక పోతే కాళ్ళు పీకేవి. తలనెప్పివచ్చేది. నడుంనిలబడేదికాదు. చేతులు వంకరలు పొయ్యేవి. నాలుక పిడచగట్టుకపోయేది. చెవులు దిబ్బళ్ళు వేసేవి. కంట్లు భైరవులు గమ్మేవి, నరాలు లాగేసి వేసేవి. ఆ కాఫీ చుక్కలు నోట్లోపడ్డట్టయితే వేసవికాలపు ఎండలకు శోషిల్లిపోయిన మొక్కలకు వానకురిసినట్లుండేది. అమృతంలాగుండే దంటె నమ్మండి. కాఫీ వుంటె నాకు పానక మక్కఱలేదు. మాచినీళ్ళప్పుడు త్రాగే వాణ్ణే కాను. గంగాభాండపు కొబ్బరికాయి యిస్తే గిరగిరత్రిప్పి అవతల పారేసేవాణ్ణి. కాఫీవుంటె నా కిక యేమి అక్కఱలేదు. ఉప్మాను, కాఫీ యుంటే అన్నమైనా అక్కఱలేదు. అదే అన్నం. ఒకప్పుడు కులాసా పుట్టిందంటే ఉప్మాలో యింత కాఫీగాని టీగాని పోసుకొని మజ్జిగా న్నంవలె చారన్నంవలె త్రాగేవాణ్ణి. మా తండ్రి చచ్చిపోయినప్పుడు ముందు కాఫీ నోట్లో పోసుకోందే నిప్పుకుండ బట్టుకోలేదు. తండ్రి తద్దినంరోజునగూడా ముందు కాఫీ త్రాగుతాను. తద్దినం రేపనగా ఆ నాటి రాత్రి యో తద్దిననాటిరాత్రియో వేరే ఫలహార మక్కఱలేకుండా ఈ రెంటితోనే కాలక్షేపం చేస్తాను. అటువంటి కాఫీ నా కిప్పుడు లేక పోవడంచేత యిప్పుడింతో యిబ్బంది సంభవించింది. ఇటువంటికొడుకు నాకుండగా నే నింత బాధపడవలెనా? ఇప్పుడు నాముఖ్యమైనకోరిక యేమి టంటే కాఫీతో తర్పణంచేసి ఉప్మాతో పిండం పెట్టవలెను ఆలాచేస్తేగాని నాకు ముట్టదు.

వినా_సరే ఆలాగే చేస్తాము. కాని యిది శాస్త్ర మొప్పు తుందో లేదో ... శాస్త్రములు ... కములు వాసో

దకములు చెప్పబడియున్నవి. గాని కాఫీలు టీలు ఉప్మామాలు చెప్పఁ బడలేదు. శ్రాద్ధాలు ధర్మశాస్త్రప్రకారం చేయవలసినవి గాని మీ యిష్టప్రకారం నా యిష్టప్రకారం చేయవలసినవిగావు. గారెలకు బదులుగా మసాలావడలు పెట్ట మంటె శాస్త్రం లొప్పుతాయా?

నర—ఒప్పుతాయో లేదో నా కవసరం లేదు. నాకు ముట్టడమే నాకుగావాలిగాని తక్కినవిషయం నాకక్కర లేదు. పూర్వకాలంలో మన్మథుఁడు సాంబమూర్తిగారి మూడవకంటి చిచ్చువల్ల కాలిపోయి, భస్మపటల మైనప్పు డతనిభార్యయైన రతీదేవి మన్మథునకు ప్రియ మిత్రుఁడైన వసంతునిఁజూచి చచ్చిపోయిన తన మగనికి పువ్వుతేనెతో తర్పణమిచ్చి పుప్పొళ్ళతో పిండముఁ బెట్టవలసినదని నొక్కిచెప్పెను. అక్కడ ధర్మశాస్త్ర మేమయినది. తిలతర్పణములు మానివేసి పువ్వు తేనెతో తర్పణములిస్తేను అన్నపిండములు మానివేసి పుప్పొళ్ళతోఁ బిండము వేస్తేను మన్మథునకు ముట్టినప్పుడు కాఫీతో తర్పణమిచ్చి, ఉప్మామాతో పిండం బెట్టి గారెముక్కలకు బదులు యిడ్డెనలు పెట్టితేను నాకు ముట్టక పోవునా? మీ శాస్త్రములు తీసికెళ్ళి తుంగలో పూర దొక్కండి. బ్రాహ్మణులకు పెట్టేటప్పుడు కూడ మాసికం రోజున తద్దినం రోజున క్షీరాన్నం కాచడం మానివేసి వేడివేడి కాఫిగాని వేడివేడి టీ గాని దొన్నెల్లోపోసి విస్తరిచుట్టు పెట్టండి. పిండిపంటలు మానివేడి బాగాఅల్లపు ముక్కలుపోసి గోధుమరవతో నిమ్మపండ్లపులుసు పోసి తయారుచేసిన ఉప్మామా విస్తళ్ళలో బెట్టండి. అప్పుడు నా యాత్మ శాంతి పడుతుంది. అప్పుడు నా దాహము తీర్తుంది. అప్పుడు నాకడుపు నిండుతుంది.

సదా—ఏం బెట్టమంటేఅదే పెడ్త. నా కభ్యంతరము లేదు.

వినా—నారాయణ! నారాయణ ధర్మశాస్త్రాలు తగులబడి పోతున్నాయి. కలియుగము చూచి మనవాళ్ళు యీలాటి మాటలేని

కాఫీలు, టీలు, ఉప్పుమాలు అలవాటు చేసుకోబట్టె చచ్చిపోయి పితృ దేవత లయినతర్వాతకూడా ఆకాఫీనీళ్ళ మీఁద వుప్పుమామీదకూడ వాంఛదీరకుండా యున్నది. ఇప్పుడు ధర్మశాస్త్రాలు మాని వెయ్యాలి. "తిలోదక, వాసోదక, పిండప్రదానం కరిష్యే" అను మాటలు తీసి వేసి ఉప్పుమాపిండప్రదానం కరిష్యే కాఫీ తర్పణంకరిష్యే అని మంత్రాలుమార్చి వెయ్యవలసి వచ్చింది. దీ నెమ్మకపుకాల కలిమాయ లోకాన్ని మొతవటకు ముంచేసింది. కూలిముండాకొడుకున్ను కర్మిష్టి అయినబ్రాహ్మణముండాకొడుకుకూడా సోడాదాగి కాఫీతాగి యేమి స్తుంటె యిటువంటి యోగం పట్టకపోతుందా? గొడ్లు కుడితి తాగినట్లు కంచుచెంబుడు కాఫీతాగడమున్ను కడుపులు చాకిబానల్లాగ పెంచు కొని రోగాల పాలవడమున్ను, ఈకాఫీలు కాఫీకొట్లు వచ్చినతర్వాతనే రోగాలు యెక్కువవుతూ యున్నవి. ఈ కాఫికొట్లు పోతేనేగాని మనం బాగుపడము. వేళలేదు, పాళలేదు, మడిలేదు, మైలలేదు, ఆకలి అయిందన్న మాటలేదు కాలేదన్నమాటలేదు. గోనెబస్తాలో పోసినట్లు నాదారీ పడవలో చక్క పూటుగా సరకు వేసినట్లుతిని దొర్లడమే మనవాళ్ళపని.

సర—ఇదిగో! నేను వెళ్ళిపోతున్నాను. నె చెప్పినట్లు చేయండి లేకపోతే పాడవుతావు.

వినా— ఇదిగొప్పచిక్కే వచ్చిందోయి.

సర—చిక్కేలేదు, మాత్రం శ్రీ సీరుచెప్పి ఉప్పుమా, కాఫీ, టీలు పంచిపెట్టాను. అదే శ్రాద్ధము.

# కైలాసదూత ప్రహసనము

## 1 రంగము.

(అప్పుడు వాసుదేవరావు ప్రవేశించుచున్నాఁడు.)

వాసు—(తనలో) తిట్టనోరు తిరిగేకాలు ఊరుకోలేవని పెద్ద లంటారు. కాని పనిచేసేచేతులుకూడా ఊరుకోలేవను మాట పై వాటితో కలపవలసినదే; ఏరోజు కారోజు హస్తలాఘనము చేసి యేదో సంపాదిస్తే నేకాని పత్యకృత్యం గడవదు. మా నాగమణికి బువ్వ గడువవలె బట్ట గడువవలె. పైగా నాజూదానకు నాత్రాఁగుడుకు నాతిండికి నాబట్టకు కొంత మిగులవలె. దిక్కుమాలిన బ్రహ్మదేవుఁడు ఒక్కరూపాయలచెట్టు సృష్టించి నాకిచ్చినాఁడు. కాఁడు. అందుకే ఆ నిర్భాగ్యునకు లోకంలో పూజలేక పోయింది. వాఁడి కేమి పోయే కాలమోకాని ఆ బ్రహ్మదేవుఁడు ఖోకుగా చేతికొద్దీ కష్టచేసేవాఁడికి డబ్బియ్యఁడు. ఒకరికి పెట్టక తాను తినక యొంగిలిచెయ్యి కాకికైన రాల్పనియే బ్రాశివెధవలకు కావలసినంత డబ్బిస్తాఁడు. నామాట కుదాహరణముగా ఈ రమాకాంతరావున్నాఁడు! వీఁడితస్సాకొయ్యా! వీఁడి దగ్గఱ లక్షరూపాయలున్నాయి. ప్రాణావసరమువచ్చి యెవఁడైనా బదులునకు వస్తే నూటికి రెండురూపాయలవడ్డీ మీఁద అప్పిస్తాఁడు. వాయిదా దాటితే నూటికి నాలుగురూపాయలు పుచ్చుకుంటాఁడు. ఇంట్లో రెండోవిస్తరిలేదు. తండ్రితద్దినమునాఁడైనా పైవాడిని పిలువఁడు. సొమ్ము పాపము పెరిగినట్లు పెరిగినది ఏడిదగ్గఱ. దానికి విఘదలయ్యే దారిలేదు. చూడవస్తే పిల్లలు లేరు. ఎవడినో పెంచుకుంటాడట. ఎందుకు వెధవపెంపు. పెంచుకుంటే నావంటివాఁడిని పెంచుకోరాదూ. ఒక జోడు గుఱ్ఱాలబండి ఒక మోటారుబండి పెట్టి పెళ పెళ లాడించు

ఎంతపేరు తెస్తాను వీడికి నేను. ఎవడో చచ్చువెధవను పెంచుకుంటాడు కాని నా వంటివాడిని పెంచుకోడు. నే నెంతమందినో టోపీ వేసి డబ్బు లాగినాను. కాని వీడిదగ్గఱ నా పాశిక పడినదికాదు. వీడి కొంపలో లాగితేనే నాప్రజ్ఞ అని నాకుంది. బదులిమ్మన్నాను, పాశిక పడలేదు. అర్ధరాత్రివేళ యిత్తడినగలు పట్టుకొనివెళ్ళి బంగారు నగలని చెప్పి తాకట్టుమీద సొమ్మియ్యమన్నాను. అప్పుడుకూడ నా ద్యాయము పాఱినది కాదు. దీని కేమి టుపాయము. వీడిపెళ్ళాము మాత్రము వెఱ్ఱిముండ. వీడు లేనప్పు డావిడదగ్గఱ యేదైనపాచిక వేస్తే నాద్యాయము పాఱుతుంది. అదిగో వీడు గుఱ్ఱ మెక్కి యేటోవూరు వెళ్ళు చున్నాడు. బహుశ సాయంకాలమువఱకు రాడు. పాచిక పాఱడానికి కావలసినంతవ్యవధి యున్నది. పో లేరమ్మతల్లీ. యీ వేళకనక నాద్యాయము పాఱెనా నీజాతరలో రెండు మేకపోతుల నిస్తాను. రెండన్న రెండన్నమాట యేమిటి పాఱినకొద్దీ యిన్నది.

(కేటలో)

ఎక్కడికీవెళ్ళక జాగ్రత్తగానుండు. తలుపులన్నీ తాళాలువెయ్యి.

వాసు—(తనలో) అదిగో జాగ్రత్తఅనిచెప్పి వెళ్ళిపోవు చున్నాడు. ఈవెఱ్ఱిముద్దరాలును టోపీపెట్టుటకు తగినవిధ మొక్కటే యున్నది. దానికి తగినవేషము వేసికొంటాను. చిన్నప్పటినుంచీ పగటివేషాలలో దిరగబట్టి యేవేషానికి తగ్గ దా వేషాచేకున్నది. ఈవిడ శివభక్తురాలు. మత మంటే యీవిడకు చాలపిచ్చియున్నది. నోములు వ్రతాలు అంటే చాలాయిష్టము. అయ్యవార్లు అమ్మవార్లు అంటే చాలా ప్రేమ. అందుచేత యీవిడ నాటోపీలో పడకపోదు. ఇంటికివెళ్లి వేషమువేసికొని వస్తాను. (అని నిష్క్రమించును.)

## 2. రంగము.

(అప్పుడు వాసుదేవరావు ప్రవేశించు చున్నాడు.)

వాసు—(తనలో) ఇప్పుడు నేను సరిగా జంగము బసవయ్య లాగున్నాను; కనురెప్పలమీద చెవులమీద కూడా వీభూతి పాము కొన్నాను. అబ్బ వీటికడుపు కాలా; యీ రుద్రాక్ష తావళముల మూలాన్ని మెడ లాగివేస్తూన్నది. ఏమైనాఒకగంటసేపు బాధ పడాలి ఎవరండమ్మా లోపల తలుపు తీయించండి.

(అప్పుడు మంగమ్మవచ్చి తలుపుతీయును.)

మంగ—ఎవరు వారు. ఎవరికోసము వచ్చినారు.

వాసు—అమ్మా. రమాకాంతంగారియిల్లు యిదేనా?

మంగ—ఆ. యిదేనండి.

వాసు—అమ్మా! మీరేనా మంగమ్మగారు.

మంగ—చిత్తము నేనేనండి.

వాసు—నేనూ ఆలాగే యనుకొన్నాను. వారు చెప్పిన యీన వాళ్ళన్నీ మీదగ్గఱ కనబడు చున్నాయి.

మంగ—ఎవరు చెప్పినయీనవాళ్ళండి యని.

వాసు—ఎవరుచెపితేనేమి, తరువాత తరువాతమీకే తెలుస్తుంది.

మంగ—తమరెవరో నాకు తెలియదు. మా మగవారింట్లో లేరు. తమరు వచ్చినపని యేమిటో తెలియదు.

వాసు—అమ్మా! నే నెవరినో యెందుకు వచ్చానో సవిస్తరంగా చెపుతాను; నేను వచ్చినపని విని మీచిత్తమువచ్చినట్లు చేయండి. మా కాపురము కైలాసము. నేనునంది కేశ్వరుడిని; నంది కేశ్వరుడ వైతే సాధారణమనిషిలాగుననున్నావేమి అంటారేమో. నానిజరూపంచూపిస్తే జనులంతా జడుసుకుంటారనిమా మూలుమనిషిలాగచక్కావచ్చాను.

మంగ—ఆహా! మహానుభావు లైన నందీశ్వరులవారా? నమ

స్కారము సమస్కారము. తప్పులు క్షమించవలయును. తప్పులు క్షమించవలయును. (అని చేతులు జోడించి కాళ్ళమీఁద పడును)

వాసు— (తనలో) నేను విన్నది నిజమే. ఈవిడ యమాయకు రాలే. అప్పుడే ధోరణి తెలుస్తూన్నది. (ప్రకాశముగా) అమ్మా! తప్పు లేమున్నవి క్షమించేటందుకు నీభక్తికి చాల సంతోషించినాము.

మంగ— దేవరవారు వచ్చుటవల్ల మాగృహపావన మైనది. తమ రెందుకు విజయము చేశారో చెప్పవలెను.

వాసు— అమ్మా! నేను నాస్వంతపనిమీఁద రాలేదు. పరోప కారముకోసమువచ్చాను. లేకపోతే నాకు కైలాసముకదిలి రావడానికి తీరుబడి యున్నదా? ఒక్కగడి య నేనక్కడ లేకపోతే జరగదు, సాంబ మూర్తిగారికి నేనే కుడిచెయ్యిని. నేనక్కడ లేకపోతే ఆయనకు తోఁచదు ఆయనపను లన్ని నేనే చేయాలి. ఆలోచన లన్ని నేనే చెప్పాలి. పార్వతీదేవికి నేను పెద్దకొడుకుని. పార్వతీపరమేశ్వరులు ఆస్తమానం నన్నెపిలిచి నన్నేగారవిస్తారసి ఆవిఘ్నేశ్వరుఁడికి ఆకుమార స్వామికి కడుపులో యెంతో అంతగుబ్బు.

మంగ— దేవరవారియోగ్యత అటువంటిది కనక ఆపార్వతీపర మేశ్వరు లంతయాదరణ చేస్తున్నారు.

వాసు— అమ్మమ్మా! ఆలాగనవద్దు. అది నాయోగ్యత గాదు. ఇంతకు వారిద్దరికి నామీఁద అపరిమిత మైనదయ. వారి కంతదయ లేకపోతే నేనింతకాలము నిలవగలనా? వారిదయచేత నాకెంతగౌర వముజరుగుతూన్నదో చూడండి. సాంబమూర్తివారిదర్శనముచేయడం నిమిత్తం దేవేంద్రుఁడు, బృహస్పతి, బ్రహ్మదేవుఁడు, శ్రీమహావిష్ణువు మొదలైన దేవత లందరు కైలాసమునకు వచ్చినప్పుడు దర్శనానికి తగినసమయము చెప్పవలసినదని నన్నాశ్రయించి నాయనుగ్రహము సంపాదించుకుంటారు. వచ్చేదేవతలు పోయేదేవతలు స్తోత్రము చేసే

దేవతలు వరము లడిగే దేవతలు కష్టసుఖములు చెప్పటకు నేదేవతలు. అటువంటిచోటనుండి కదలి రావడానికి నాకు తీరుబడేలేదు. అయితే ఆముసలాళ్ళకష్టం చూడలేక యిల్లావచ్చాను.

మంగ—ఏముసలాళ్ళు స్వామీ.

వాసు—ఎవరో నీలకంఠంగారు పార్వతమ్మగారు అని దంపతు లున్నారు.

మంగ—నీలకంఠంగారు మామామగారు. పార్వతమ్మగారు మా అత్తగారు.

వాసు—అవు నవు నమ్మా నే నెఱుగుదును. ఎటొచ్చి వుండబట్టే వారుపంపుతే యిక్కడికివచ్చాను నీవేనా అమ్మా వారికోడలవు.

మంగ—చిత్తము. నేనేనండి.

వాసు—నీవిషయమై వారు చాలా చెప్పారు. ఈలోకములో వున్నంతకాలము వారి కిద్దఱికి నీవు చాలాపుపచారము చేశావని, నీవు భూదేవతవని మహాయిల్లాలువని నీవుండబట్టి భూమిమీద వానలు కురుస్తున్నా యని వారు చెప్పారు. అత్తమామల మెప్పుపొందుటచేత నీవు చాలాధన్యురాలవమ్మా!

మంగ—సరి సరి యెంతమాట. అది నామంచితనము కాదండి, మాఅత్తమామలు పార్వతీపరమేశ్వరులవంటివారు. వారు మంచి వారగుటచేత నాకింత పేరుప్రతిష్టలు వచ్చాయి. నేను కాపరానికి వచ్చినది మొదలుకొని వారు నన్ను బిడ్డలాగున చూచుకొనుచున్నారు.

వాసు—వా రెంతమంచివారైనా నీమంచితన ముంటేనేకాని వారి కాపుపచారము జరగదు.

మంగ—అయితే వారిద్దరు సౌఖ్యముగా వున్నారండి అక్కడ?

వాసు—ఏమిసౌఖ్యమమ్మా సౌఖ్యముంటే వారు నన్నిక్కడి కెందుకు పంపుతారు.

మంగ — అయితే వారు మిమ్మిక్కడికి పంపిచినారా యేమిటి?

వాసు — పంపకపోతే నాఅంతట నేను వచ్చానా మరి.

మంగ — స్వామి! నాకు తెలియలేదు. అయితే వారెందుకు పంపిచారు మిమ్మలిని.

వాసు — ఎందుకు పంపించారని మెల్లిగా అంటున్నావా! వాళ్ళక్కడ పడేకష్టాలు చూచేటప్పటికి కళ్ళు చిల్లులు పడిపోనాయి అంతట నేనే మీదగ్గిరకు రావా లనుకుంటూంటే వారే పిలిచి నన్ను నీదగ్గిరకు వెళ్ళమన్నారు. అందుకని నేను వెతుక్కుంటూవచ్చాను.

మం — అయ్యో! వారు కష్టాలు పడుతున్నారా అక్కడ?

వాసు — కష్టాలన్నాకష్టాలా! అమ్మా! కట్టుకుందుకుబట్టలు లేవు వారికి. మీమామగారు గోచీపెట్టుకు తిరుగుచున్నారు. మీఅత్తగారు చిరుగులగుడ్డలు కట్టుకుని కాలక్షేపముచేస్తుంది ఈదరిద్రముచేత వారు ప్రజలమొగము చూడలేక సిగ్గుపడి తిరుగుతూన్నారు. చలిగాలికి బాధపడలేక వారు చెట్టుతొఱ్ఱలలో పండుకొనుచున్నారు. ఉందామంటే యిల్లులేదు. ఆచెట్టుక్రింద ఈచెట్టుక్రింద వారిపంచను వీరిపంచను తలదాచుకొనుచున్నారు. కష్టచేసుకుందా మంటే చేతిలో డబ్బు లేదు వారికి. వారుపడుచున్న కష్టా లిన్ని అన్ని కావు. రమాకాంతంపంతులుగారివంటికొడుకు మీవంటికోడలు నుండగా వారి కెన్నిపాట్లు వచ్చినవో చూడు ఆముసలివాళ్ళను చూస్తే నాకడుపు దరికోసుకొని పోవుచున్నది నేనే కాదు అక్కడున్నవాళ్ళంతా జాలిపడుతున్నారు ఆపార్వతీపరమేశ్వరులకు గూడా చాలా జాలి కలిగినది.

మంగ — (ఏడ్చుచు) అయ్యో! మామగారు! మీకెంతకష్టము వచ్చినదండీ. అయ్యో! అత్తయ్యా! నేనుండగామీకెన్ని కష్టాలు సంభవించాయండీ. మీరు దిక్కుమాలినపక్షులలా గైపోయూరా. ఈలాటి పెంకుటిళ్ళు నాకుండగా తలదాచు కొనుటకు కొంపే లేకపోవు

నా? కట్టుకొనుటకు గుడ్డలేదా! ఈలాగైపోతారని యెప్పుడు అనుకో లేదత్తయ్యా మీరెంతో సుఖపడుతున్నారనుకొన్నానత్తయ్యా.

వాసు—అమ్మాయి! విచారిస్తే కార్యమేమున్నది. దానికి తగినపని చేయాలి.

మంగ—ఏమిచేయాలో నాకు తెలియడము లేదండి.

వాసు—తెలియకపోతే అమ్మా నేను చెపుతాను వినండి

మంగ—చెప్పండినాయనా. ఆదంపతులిద్దరు సుఖపడేటట్టూ నలుగురిలో తల యెత్తుకొని తిరిగేటట్టూ యేమైనావుపాయం వుంటే చెప్పండి.

వాసు—చెప్పడానికేముందమ్మా. మీ మామగారికి నాలుగు జరీపంచలు నాలుగు జరీకండువాలు మంచిబనారసు పట్టుపంచకండువా వుండాలి. మీ అత్తగారికి నాలుగుజరీచీరలు ఒకరెండుపట్టు చీరలు వుండాలి. ఏదో ప్రాదేశమాత్రంగా యిల్లుకట్టుకోడానికి నాలుగైదువందలరూపాలుండాలి. నిత్యకర్చు వాడుకుందు కింకొకవంద రూపాయలుండాలి, ఈమాత్ర మైనావుంటేనేకాని వాళ్ళు గౌరవముగా వుండేటందుకు వీలులేదు.

మంగ—అయ్యోనాయనా! అమాత్రి మివ్వడానికి మాకు శక్తిలేకపోలేదు. అయితే మావారింట్లో లేరు. ఆయన వచ్చినదాక మీరు వున్నారంటే ఆయనతో చెప్పి యిప్పిస్తాను.

వాసు—చాలు చాలు. నేను నాపనులన్నీ చెడగొట్టుకొని రావడమే కాకుండా యింకా మీవారు వచ్చేదాకా వుండనా? నాకవతల పని లేదనుకొన్నావా యిదేపని అనుకున్నావా? ఈపాటికప్పుడే సాంబమూర్తివారు బెంగపెట్టుకొని యెదురుచూస్తూంటారు. పార్వతీదేవి అన్నమే తినదు. నేనొక్క నిముషముండడానికి వీలు లేదు. ఇస్తేయి

ప్పుడేమైనాయియ్యి. ఇవ్వకపోతే నేను వెళ్ళిపోతాను. ముసలాళ్ళే గంగలో చస్తె నాకెందుకు. (అని లేవబోవును)

మంగ — స్వామీ! నందికేశ్వర్లవారూ! కూర్చోండి కూర్చోండి కోపపడకండి, కావలసినజరీబట్టలు పట్టుబట్టలు నాపెట్టిలోనే వున్నాయి. అవి నే నియ్యగలను కాని నాదగ్గిఱ రొక్కమేమీలేదు. అందుకే తటపటాయిస్తున్నాను

వాసు — అమ్మాయి! ఇంతతటపటాయించాలా. రొక్కము లేకపోతే నీమెళ్ళో అన్నివస్తువు లున్నాయి. యేదోవకవస్తువుపారవేయ రాదూ. ఆత్తమామలకంటె యీవస్తువులెక్కువా వెధవవస్తువులు. చేయించుకుంటే మళ్ళీవస్తాయి. ఇప్పుడు నేను వెళ్ళిపోయినానంటే అక్కడినుంచి ఇక్కడికి వచ్చేవారు లేరు. కబురు చెప్పేవారు లేరు, ఆకాసులపేరు తీసి ఇల్లాపారై. నీమగడువచ్చి చూచినానీమీద యేమీ కోపపడడు ఎందుకంటే ఆతనితల్లిదండ్రుల కిచ్చావుకాని నీవునీవాళ్ళ కిచ్చుకోలేదు కదా. అందుచేత నీవు భయపడవలసిన పనిలేదు. అయన చాలా సంతోషిస్తాడు కాని నిన్నేమీ అనరు.

మంగ — నిజమే స్వామీ సరే యీకాసులపేరు పుచ్చుకొండి. (అని యిచ్చివేసి జరీబట్టలు పట్టుబట్టలు దెచ్చి) ఇవిగో పట్టుబట్టలు జరీ బట్టలు పుచ్చుకోండి. (అని యిచ్చును.)

వాసు — అమ్మాయి! పతివ్రతవంటే నీవే, అత్తమామలయందుభక్తిగలవానవంటేనీవే. నిజముగా నీవంటి ఆడ దుండబట్టే లోకము లోకాంతధర్మం నిలుస్తుంది. అత్తలను బాధపెట్టేవాళ్ళు మామలను బాధపెట్టేవాళ్ళు కాని యీకాలంలో నీవంటి కోడలొకర్తె కనపడదు. ఈకాసులపేరు ఈబట్టలు తీసికొనివెళ్ళి యీయత్తమామల చేతిలో పెడతాను. వారు చాలా సంతోషిస్తారు. వీలుగా ౦ంటేపదిహేనురోజులలో మళ్ళీ వస్తాను.

మంగ — తప్పకుండా దయ చేయండి. మా అత్తగారు మామ గారూ యేమన్నారో మళ్ళీవచ్చి చెప్పండి

వాసు — తప్పకుండా చెపుతాను. యిక నేను వెళ్ళుతాను (అని లేచి తనలో) ఇది పట్టివెఱ్ఱిముండ అన్నమాట స్పష్టముగా దెలిసింది. నాటోపీగో బాగాపడింది. ఇక యిక్కడ వుండకూడదు దీని మగడు వచ్చాడంటే పట్టుకొని డొక్కచీరేస్తాడు. వాసు చండశాసనుండు ఈయవస్థలో పిక్కబలమే శరణ్యము. (అనిపోవును)

మంగ — (తనలో) పాపము మహానుభావులైననందీశ్వరులవారు రాబట్టి మాఅత్తమామలకు సుఖం కలిగింది, లేకపోతే వారు కష్టపడడము నాకపకీర్తి రావడము సంభవించును. ఆయనింటిలో లేకపోబట్టి తక్కువ యిచ్చినాను. లేకపోతే యింకాయెక్కువ సొమ్మిచ్చి యుందును.

(అప్పుడు రమాకాంతముపంతులు ప్రవేశించు చున్నాడు)

రమా — తలుపు తీసికొని కూర్చున్నావేమీ నీవేమో చిన్న వోయినట్లున్నావేమి ఎవరితో నైనా తగాదాలాడినావా యేమిటి.

మంగ — (ఉత్తరము చెప్పక వెక్కి వెక్కి యేడ్చును)

రమా — (తొందరతో) ఏమిటిది. ఏమైనా జబ్బుగా నున్నదా.

మంగ — అయ్యో! అత్తయ్యా అయ్యో! అత్తయ్యా! అయ్యో మామగారూ? మీకెంతకష్టము వచ్చినదండి. మేమంతా లేనివాళ్ళమయిపోయినామా మీకు.

రమా — (తొందరతో) ఏమిటిది మీమేనమామకో మేనత్తకో జబ్బుగా నున్నాదా యేమిటి.

మంగ — అయ్యో! వాళ్ళకు జబ్బులేదు. మీయమ్మగారూ మీనాన్నగారూ. (అని యేడ్చును)

రమా — ఏమిటది నీకేదైనా దయ్యము పట్టినదా యేమిటి

మంగ—అమ్మో! దయ్యమే మిటి? సరిఇదొకటి కూడానా. మంత్రగాళ్ళను పిలిపించనక్కరలేదు. నాకుదయ్యములేదు భూతము లేదు. చెపుతావినండి. కైలాసంనుంచి నందికేశ్వర్లవారు వచ్చినారు. అక్కడ మీనాన్నగారు అమ్మగారు బట్టలేకఅన్నంలేక యిల్లులేక చాలాకష్టపడు చున్నారని ఆయన చెప్పారు. మనమంతా బాగావుండి వాళ్ళను కష్టపెట్టుచున్నాము గదా. (అని యేడ్చును.)

రమా—సరే! సరే! ఎవడో దొంగముండాకొడుకువచ్చి నిన్ను టోపీ వేశాడు. యేమైనా యిచ్చావా యేమిటి.

మంగ—(కోపముతో) దొంగముండాకొడుకా. ఎంతమాట! సాక్షాత్తు నందికేశ్వర్లువారు మనమీదఅనుగ్రహంచేతను వచ్చినిజస్థితి చెప్పినదే కాకుండా తిట్లు కూడానా? ఏమైనా యిచ్చావా అని మెల్లిగా అడుగుతున్నారా? వాళ్ళకష్టాలు తెలిసినతరువాతకూడా యివ్వకుండా వూరుకుంటానా. అత్తమామలమీద యెంతభక్తిలేనిదాన నైనా చేతనైన దియ్యకపోతానా?

రమా—ఏమిచ్చావు మెడలో కాసులపేరు కనబడడం లేదు. అదిచ్చావా యేమేటి కొంపతవ్వి.

మంగ—ఇవ్వకపోతే యేలాగు. మీరు వెళ్ళి యెక్కడో కూర్చుండిరి. నందికేశ్వర్లవారు వెళ్ళిపోవలెనని తొందరపడ్డారు. సొమ్మిచ్చి పంపకపోతే అత్తమామ లడుగుతారు. ఏమిచేయును. కాసులపేరిచ్చి పట్టుబట్టలు జరీబట్టలు నిచ్చి పంపించాను. మీతల్లికోసము నీతండ్రికోసము చేశాను. కాని మావాళ్ళకోసము కాదు గదా.

రమా—సరే టోపీదానువచ్చాడు. టోపీవేసి పోయాడు. ఏడువందలరూపాయలసొమ్ము గంగలో కలిసి పోయింది. వాడేలాగుంటాడో చెప్పు. పట్టుకొని పోలీసువాళ్ళ కప్పగిస్తాను,

మంగ — శివశివా! యెంతమాట, ఆమహానుభావుణ్ణిపోలీసువారికప్పగిస్తే వంశనాశన మవుతుంది. అలాచేస్తే నేనిప్పుడే నూతిలో దిగుతాను.

రమ — ఓపిచ్చిదానా! నీ తెలివి యిల్లా గుండబట్టే అలా టోపీలో పడ్డావు. సరేలే వాడిజోలికి వెళ్ళను. నోరుమూసికొని వూరుకుంటాను. ఈయాడవాళ్ళ మూర్ఖత చేతనే మోసగాళ్ళఆటలు సాగుతున్నాయి. లేకపోతే చచ్చినవాళ్ళకి సొమ్మెందుకు? ఇల్లెందుకు? బట్టలెందుకు?

(అందఱు నిష్క్రమించు చున్నారు.)



# ఔషధప్రకటనలు

అనేకవృత్తులుచేసి యేవృత్తియందును తనపొట్ట గడువకపోవుట చేత తుదకు వైద్యమారంభించిన యొకమనుష్యుడు తనమందుల నీక్రింది విధముగా ప్రకటించెను.

శ్రీ బరోడామహారాజుగారు మైసూరుమహారాజుగారు నేపాళ చక్రవర్తిగారు, హైదరాబాదుమహారాజుగారు తిరువాన్కూరు నవాబు గారు, జయపురం సుల్తానుగారు నావద్ద లక్షలకొలది కోట్లకొలది విలువగలమందులు ఖరీదుచేసి తమ రోగములన్నిటిని బాగొట్టుకొని నాకు కలియుగ ధన్వంతరియని బిరుదు నిచ్చినారు హైదరాబాదు మహారాజుగారైన శ్రీగోవిందరాజు బహదూరుగారు నామందుల పటుత్వమునకు సంతోషించి నన్ను ఏనుగఅంబారీమీద గూర్చుండబెట్టి ఊరేగించి రెండు జాఘీరుల నిచ్చినారు. తిరువాన్కూరు నవాబుగారు నాప్రజ్ఞలబరీక్షించి నాకు హకీంసర్దార్ అని బిరుదిచ్చి నాకు రెండు అగ్రహారములిచ్చినారు. ఈప్రాంతముల జనులు తగిన వైద్యులు, మం దులు లేక అకాలమృత్యువుల పాలగుటచేతను ఈదేశము నాజన్మభూమి యైనందున దానిమీద నాకు విశేషము అభిమానము వుండుటచేతను యిక్కడి ప్రజలను బ్రతికింపదలంచి నాజాఘీరులకు అగ్రహారములకు ముక్తిహారుల నేర్పరిచి నేను ప్రస్తుతము కాతేరుగ్రామములో నివాస మేర్పరుచుకొన్నాను. పట్టణములలో కాపురమంటే వేలకొలది రోగులు రాత్రి పగలు మాయింటిముందర పడిగాపులు పడియుండి నాకు నిద్రా హారములు లేకుండ జేయుచు వచ్చినందున పట్టణములలో కాపుర ముండక యీపల్లెటూరిలో నుండుట కేర్పరుచుకున్నాను. నన్ను నేను స్తోత్రముచేసుకో[illegible]లోకములో

నేవైద్యునివద్దను లేవు. ఈమాట నేను లక్షరూపాయలు పందెమువేసి చెప్పగలను. నాది శాస్త్రకట్టువైద్యమెగాని అల్లరచిల్లర వైద్యము కాదు. వైద్యము మాకుటుంబములో యిరవైతరములనుంచి వున్నది. పైగా హస్తవిశేషము మాది మిక్కిలి మంచిది. డబ్బుతీసుకోవడము నాకు బొత్తిగా ఇష్టములేదు. ఔషధములే నాప్రజ్ఞలను తెలియ జేయును.

వృత్తిలేక వైద్యముచేసెడి నిర్భాగ్యులగు వైద్యులవద్దకు బోక, యింగ్లీషువైద్యుల పాలబడి అరఖులు గోధుమజావలు, తాగిచావక మామందులుకొని చిరకాలము జీవింపుడు.

# మందులు

## జ్వరమూషికమార్జాలము

ఈమందు హిమవత్పర్వతముమీది ఓషధులు 100, మేరు పర్వతము మీది ధాతువులు 32, మానససరోవరములోని కలువదుంపలు 56, ద్వైపాయనహ్రదములోని నాచు వీశెడు, బదరికావనము నందలి మూలికలు మొదలైన వస్తువులు పడినవి. ఈమందు తయారు చేయుటకే 60 సం॥ రములు పట్టినది. దీనిని సేవించినవానికి సమస్త మైన రోగములు నశించును. పురాణజ్వరములు పూటకుపోవును. మణ్యాపుజ్వరములు మాత్రలో హతమగును. ఈమందు వక్కసారి పుచ్చుకొన్నమనుష్యునకు మరి యెన్నడు జ్వరమురాదు. ఇది తులము రు 93—6—0. పథ్యము సులభము. అన్నము, రొట్టె, సమస్తమైన కూరలు, సమస్తమైనపండ్లు, పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, మీగడ, నెయ్యి, నూనె, దుంపలు, ఉప్పు, పులుసు, కారము, పచ్చళ్ళు, పిండి వంటలు కందులు, శనగలు, మినుములు, పెసలు, మంచినీళ్ళు వర్జింప వలయు. తక్కినవన్నియు పుచ్చుకొనవచ్చును.

అజీర్ణమహాజీర్ణనుహాత జంఝామారుతము. అగ్నిమాంద్యవృశ్చిక కుక్కుటము. వాతసర్పగారుడము.

ఈ మూడు మందులు అజీర్ణమునకు పెట్టినది పేరు. ఈ మందు పుచ్చుకున్నవాని కడుపు వేసవికాలములో పగలు రెండుజాముల వేళ యిసుకతిప్ప యెర్రగాల్పు యేలాగున భగ భగ కాలుచుండునో ఆలాగు కాలుచుండును. అనగా అజీర్ణమన్న మాటలేక యెప్పటికప్పుడు విపరీతమయిన ఆకలి అగుచుండును. ఇం దులో వనమూలికలు, సువర్ణభస్మము, రజితభస్మము, తామ్రభస్మము, వంగభస్మము, ఇత్తడిభస్మము, కంచుభస్మము, ఇనపభస్మము, కర్ర భస్మము విశేషముగా పడినవి. ఇవిగాక రెండువందలపదహారు దినుసులు పడినవి ఇవిగాక కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, పునుగు, జవ్వాజి సీసెడు సీసెడు పడినవి. ఇవిన్నిగాక మొసలిచేదుకట్టు. పాముచేదుకట్టు, పాలపిట్టనెత్తిమీదఈకలు, పేనుచేపకట్టు, జెర్రిచేదు కట్టు, నెమలి కాళ్లభస్మము, పెద్దపులి పాలుజున్ను, పిల్లిపాలుమీగడ, సివంగిపాలవెన్న, సింహముగుండెకాయ, ఏనుగుదంతచూర్ణము కలసి నది. ఈయోగములు బసవరాజీయము, చింతామణి, బాహటము, చర కము శుశ్రుతము మొదలయిన అచ్చుపడిన గ్రంథములలోను అవకతవక యింగ్లీషు గ్రంథములలోను కనపడవు. ఇవి మాపెద్దలవల్ల నేర్చుకొన్న సాంప్రదాయములు పైగానలువది యేండ్లు సిద్ధులతోను, గోసాయిల తోను బైరాగులతోను గలసి నానారణ్యములు తిరిగి రసవాదశాస్త్ర ములు కృషిచేసి పరిశ్రమచేసినవి. ఈమందులు తులము 1కి రు 119-0-0 రోగులమీద జాలిచేత యేమియులాభ మపేక్షింపక అసలు ఖరీదుకే యిచ్చుచున్నాము. ఒక్కొక్కమందు మణుగు మణుగుకంటె యెక్కువ చేయలేదు. ఇదివరకే వకమందులో యేడుపీశలన్నర ఖర్చుఅయిపోయి నది. దరఖాస్తులు...

కదు. కాబట్టి త్వరగా దరఖాస్తులు బంపవలెను. యజ్ఞములయందలి హావిర్భాగములు మితిమీరి తినుటచేత పూర్వము దేవేంద్రునికొక సారి గాఢమైన అజీర్ణము పట్టగా అశ్వినీదేవతలు యీమందునే చేసి యిచ్చినారు. ఈసంగతి కుబేరపురాణమందును యమపురాణమందును వున్నది.

—∞∞—

### అకాలమరణ జంబాలమార్తాండము.

ఈమందు పుచ్చుకొన్నవారు నూటయేబదియేండ్లు బ్రతుకుదురు. ఆలాగున బ్రతికియున్నవారు యిప్పుడనేకమందియున్నారు. ఇందులో నల్లినెత్తురుసేరు, దోమమూత్రము కుంచెడు, పేనుగుండె కాయలు పదలం, సంజీవివేళ్ళు యెత్తెడు, తలుపుకిరకిరవీశెడు, హంస చేదుకట్లుపదిపడినవి ఇదిపుచ్చుకున్నవారికి చావులేదు. ఇది తులం రు 10 లు.

———

### భేదీమహావజ్రకవాటము

దీనికే విరేచనమరమేకు అని రెండవపేరు కలదు. ఇది సేవించినవారికి వాతమువల్లగాని పిత్తమువల్లగాని శ్లేష్మమువల్లగాని యీ మూడింటి సమ్మేళనమువల్లగాని మరి యేకారణమువల్లగాని అతిసారమువల్లగాని గ్రహాణివల్లగాని అజీర్ణమువల్లగాని వెళ్ళుచున్న విరేచనములు తక్షణము కట్టును. ఈమందు కలరాకు పెట్టినది పేరు. యీ సంవత్సరము యీ మందువల్ల కలరాజాడ్యము తగిలినవారు 9500 మంది బతికినారు. ఇది మాత్ర గూపాయి. ఈమందెవరికైన పనిచేయని పక్షమున మామందు మాకు సంపూర్ణముగా పంపించివేసిన యెడల నాసొమ్ము వారికి పంపివేయుదుము. ఇటువంటి మందు లోకమునం దెక్కడను లేదు. ఫోటులచేత ప్రతిదినము లక్షలకొలది బుడ్లు

యితరదేశములవారు మావద్ద కొనుక్కొని పోవుచున్నారు. దీనివాసన తగిలినచోట విరేచన జబ్బుండదు. ఇక లోకములో విరేచనములవల్ల చావు లుండవు.

---

సకలజాడ్య ఘూస మహిషము.

ఈమందు దున్నపోతు గడ్డిని దినివేయునట్లు సకలరోగములు హరించును. ఈమందువల్ల తలనొప్పులు, నడుమునొప్పులు, కీళ్లనొప్పులు, పళ్ళనొప్పులు, ఒళ్ళునొప్పులు, కళ్ళుమంటలు, ఒళ్ళుమంటలు, అరచేతుల మంటలు, అరకాళ్ళు మంటలు. విషజ్వరములు, సన్నిపాతజ్వరములు, మన్యపుజ్వరములు, పురాణజ్వరములు, గజ్జి, గడ్డకురుపులు. రాచపుండ్లు, పుట్రెమాదలు, చెవిలో కురుపులు, గోరుచుట్టు, కణుపు జెట్టలు, పంగలుమాదలు, మడమశూలలు, పొడుపుడుకాయలు, కంతులు, బొడిపెలు, అజీర్ణములు, ఆమములు, పిత్తములు, వాతములు, శ్లేష్మములు, ద్వంద్వములు, అతిసారములు, కలరా, మశూచి, బొబ్బలమ్మ, ఆటలమ్మ, పొంగు, శ్వాస, కాస, క్షయ, రక్తక్షీణత, పాండురోగము, మధుమేహము, శిలామేహము, బొల్లి, కుష్టు, పుప్పిగోళ్ళు, పుప్పిపన్నులు, జలోదరము, లంబోదరము, మూగ, చెవుడు, గుడ్డికుంటి, నత్తి, పిచ్చి, వెఱ్ఱి, మొదలయిన సమస్తరోగములు నశించును. ఇది పుచ్చుకున్నవారికి అకాలమున నెరసిన తలవెండ్రుకలు నల్లబడును. సంతానములేనివారి కేడాదిలో బిడ్డలు పుట్టుదురు. అన్నహితవులేనివారు పూటకు కుంచెడు బియ్యపన్నము తిందురు. ఈమందు వెల తు॥ రు 25 లు. నాలుగు తులములు వక్కసారిగా పుచ్చుకొన్నవారికి నూటికి రు 1-9-0 లు కమీషను యివ్వబడును. ఈ పైమందులు అమ్ముటకు మాకు ఏజెంట్లు కావలెను. వారు నమ్మకమైనవారు కావలెను.

ముసలివాం డ్రక్కరలేదు, పనుచువారు దరఖాస్తులు పంపకూడదు. భాగ్యవంతులతో మాకు పనిలేదు. బీదవారి నెప్పుడు మే మేజెంట్లుగా నేర్పరచము. ప్రతియేజెంటు మావద్ద రు 200 లు ధరావతు ఉంచవలయును. ఈసొమ్మునకు మేము నెల 1కి నూటికి రు 0-2-2 లు వడ్డి యిత్తుము. ఏజంటు తమకు జీతమే కావలెనో కమీషను కావలెనో తెలియజేయవలయును. దరఖాస్తులు అర్ధణాబిళ్ళ పెట్టి పంపవలయును. అట్లు చేయని దరఖాస్తులు మంజూరుచేయబడవు. ఇదివర కన్నిగ్రామములలో యేజెంట్లు కుదిరినారు గావున ఈ క్రిందిగ్రామములలో మాత్రమే యేజెంట్లు కావలెను. పెంటపాడు, పెనుమదం, పేకేరు, పాచిపెంట, పెద్దాడ, పుట్టకుండ, చంపర, నేలపోగులు, పాతళ్ళమెరక, తోలేరు, తోకలపూడి, గుమ్మంపాడు, బల్లిపాడు, దగ్గులూరు, కంతేరు. గంద్రేడు, మూలస్థానం, అలమండ, మండపేట, బిక్కవోలు, ద్వారపూడి, దొంగలగన్నవరం, వంకాయలపాడు, నూతులపాడు, చింతలూరు, భీమడోలు, గజ్జరం, వెదురుపాక, ఆచంట, తాటిపర్రు, తాటిపాక, ఆటపాక, మేడపాడు, తాపేశ్వరం, భగ్గేశ్వరం, మందపల్లి, పెనుమంట్ర.

మామందు లెంతపనిచేయునో ఈక్రింది పెద్దమనుష్యు లిచ్చిన యోగ్యతాపత్రికలు (సర్టిఫికేటు) చూచినవారికి దెలియును ఈ సర్టిఫికేట్లు మావద్ద పదివేలున్నవి కాని స్థలము చాలక మూడునాలుగు మాత్రమే ప్రకటించుచున్నాము.

---

## యో గ్య తా ప త్రి క లు.

అయ్యా! మీజ్వరమూషిక మార్జాలమువంటి మందు భూలోకములో లేదు. ఇది మూడుమోతాదు లియ్యగానే మానాయనమ్మగారికి మెనిమిది సంవత్సరములనుంచి ఉన్న పురాణజ్వరము మూసు

పూటలలో కట్టినది. మీమందులు కల్పవృక్షములని చెప్పవచ్చును. తెనుగుదేశములవారి యదృష్టమువల్ల మీరీలోకమున నవతరించిరని మా యభిప్రాయము. మీమందులున్నచోట్ల లోకములో జ్వరము వల్ల చావు లుండవు. ఇటువంటి మందు లనేకము చేసి మీరింకను లోకోపకారము చేయుదురుగాక. ఇట్లు విన్నవించు మీమిత్రుడు శ్రీ నెట్టిపాలెం బాల సూర్యనరసింహా వెంకటపిచ్చేశ్వరరావు బహదూరు, గడ్డపాలెం జమీందారు.



అయ్యా మీరు పంపిన అజీర్ణవృశ్చికకుక్కుటము అద్భుతమైన పనిచేసినది. మా మేనమామగారి పినతండ్రి అల్లుడు తమ్ముడుకొడుకు అజీర్ణమువల్ల చిరకాలము బాధపడి ఒక్కమెతుకైన తినలేక చిక్కి శల్యమై కండ్లలో ప్రాణములు పెట్టికొని యున్నవాడు. మీమందు మూడుపూటలు సేవించగానే యెక్కడలేని ఆకలి పుట్టుకొనివచ్చి యిప్పుడు పూటకు మూడు శేర్లబియ్యపుఅన్నము తినుచున్నాడు. పూటకు అడ్డెడు పెరుగు త్రాగుచున్నాడు. అతని చాతి యిప్పుడు 114 అంగుళము లున్నది. అదివరకు పూచికపుల్లయెత్తలేనివాడు యీమధ్య గడ్డపారవంచి మూడుముక్కలు చేసినాడు. అజీర్ణముగలవారందరు యీమందు పుచ్చుకొనవలయును. ఏమిమూలికలు కలసినవో కాని యీమందువంటి మందు లోకములోలేదు. ఇది స్వర్గములోనుంచివచ్చిన దేమో యని తలంచుచున్నాము. ఇది భూలోక పారిజాతము. రోగుల పాలిటి కామధేనువు. ఇట్టిమందులు తయారుచేయుటకు మీకు దేవుడు ఆయురారోగ్య బుద్ధిసంపద లిచ్చుగాక.

ఇట్లు తమ విధేయుడు, తంటికొండ పుల్లేశ్వరరావు.

స్వామీ, మీరు దయతో పంపిన అకాలమరణ జంబాలపు చండ మార్తాండము అందుకొని అనందానంద కందళిత హృదయారవిందుడనైతిని. ఈ మందు నే ననేకమందికిచ్చితిని. పుచ్చుకున్నవారందరు నూటయేబది యేండ్లు బ్రతుకుచున్నారు. మీరింకను కృషి చేసినట్లయిన మనుష్యులు వెయ్యేళ్ళు బ్రతుకునట్లు చేయగలరు మీరు అశ్వనీ దేవతల యవతారముగాని మనుష్యులుగారు. ఇట్లు మీ ప్రియశిష్యుడు, వంకపాటి వెంకటకన్నయ్య. పైడిముక్కల గ్రామం మకాం

---

భిషగ్మణీ, మీరు పంపిన విరేచన మరమేకను పేరుగల భేదీ వజ్రకవాట మందినది. ఈ మందుతో విరేచనము కట్టుట యటుండగా మేము ఒక కుండనిండ నీళ్ళుపోసి దానికి చిల్లిపొడిచి ఈ మాత్ర కుండలో వేయగా చిల్లివెంబడి నీరుకారుట కట్టిపోయినది ఇక విరేచనములు కట్టుట యేమి యాశ్చర్యము. మీరు పెట్టిన ఖరీదుకంటె నూరురెట్లెక్కువ ఖరీదు యిచ్చినను మీ ఋణము తీరదు. ఇట్లు మీ యాప్తమిత్రుడు కూచిపూడి కోనప్పగారి సిద్ధేశ్వరరావు. దుమ్ముగూడెం.

---

# ధర్మసందేహములు

జ్యోతిశ్శాస్త్రములో గట్టికృషి జేసి దైవజ్ఞ చక్రవర్తులని బిరుదు పొందిన గొప్పసిద్ధాంతి యొకరు కావలెను. మేమడిగిన ప్రశ్నల కాయన సరిగాఁ బ్రత్యుత్తరములు చెప్పినపక్షమున, ఆయన కసమానములైన బహుమానముల మేమిచ్చెదము. సాధారణ జ్యోతిష్కుడు పనికిరాడు. అనేకరాజులవద్ద బహుమానములు బిరుదులు పొందినవారే కావలయును. వారు చెప్పవలసిన ప్రశ్నలివి. ఈవఱకు మేజస్ట్రీటుపని జేసి పించనుపుచ్చుకొని ఒకానొక గ్రామములోనున్న బెంచిమేజస్ట్రీటు కోర్టుకు ప్రస్తుతము ప్రసిడెంటుగా నుండి తప్పుచేసినవారికి జరిమానలు మొదలగు దండనలు విధించుచున్న మ॥ రా॥ శ్రీ నిర్లక్ష్యం నీలయ్య గారి బక్కచిక్కిన యావు చుట్టుప్రక్కలనున్న కొంపలలోదూరి బియ్యము, పిండి, పప్పులు, కూరలు, అప్పుడప్పుడు ఎండుగడ్డియని భ్రమించి ముసలివాండ్ర తెల్లగడ్డములు తినుట యెప్పటినుండి మాని వేయును? ఎప్పటినుండి శ్రీ నీలయ్యగారు తమ యావును యింటిలోఁ గట్టివేసికాని పసులకాపరిచేతఁ గాపించికాని లోకోపకారము చేయుదురు? 2 గొప్పపదవిలోనున్న హిందువులు తమపయి యధికారుల వద్దకుఁ బోయి తమకు గిట్టనివారిమీఁద లేనిపోని పన్నుగడలు పన్ని, అబద్ధపు కొండెములు చెప్పుట యెప్పటినుండి మానుదురు? 3 మ్యునిసిఫల్ చేర్మెనులు ఎలెక్షనులలోఁ దమకిష్టమైన మనుష్యులతరఫునఁ బనిచేయుట (అనగా రహస్యముగా ఓటర్లను ఇండ్లకుపిలిపించి చెప్పియు వారియిండ్లకుబోయి బ్రతిమాలియు) పక్షపాతముగా నడచుట యెప్పటి నుండి మానుదురు? 4 సంఘసంస్కర్తలమని చెప్పుకొనువారు తాము వ్రాసినవ్రాతలకు తాముచేసిన యుపన్యాసములకుఁ గేవలము విరుద్ధ

ముగా నడచుకొనుట మన దేశములో నెప్పటినుండి యాగిపోవును ? అనగా అతిబాల్యవివాహములు కూడదన్నవారు, ఎనిమిదేండ్లపిల్లలకే వివాహములు సేయుట, వితంతువివాహములు మంచిదన్నవారు సమయము వచ్చినప్పుడు వివాహములాడక పోవుట మొదలగునవి యెప్పటినుండి మానుదురు ? 5 రాతిముక్కల మనుష్యులు, మట్టిభక్షణచేసి జీవించునట్టి మహారోగులు, ఒక్క పట్టణములలోనే యున్నారా, లేక పల్లెటూళ్ళలోగూడ నున్నారా ? రాతిముక్కల మనుష్యులనగా వీధులలో నెన్నిదుర్వాసనలు వేయుచున్నను వాటివలన నెంతమాత్రము బాధపడక, అవియెల్లను సువాసనలుగానే భావించిబ్రతుకునట్టి మనుష్యులు. మట్టిభక్షించు మహారోగులనగా ముక్కులోనుండి నోటిలోనుండి వీధులలోనిదుమ్ము కడుపులోనికి విశేషముగా బోవుచున్నను లక్ష్యములేక దానిని జీర్ణముచేసికొని యెప్పటియట్లే తిరిగెడు మనుష్యులు. 6 మ్యునిసిపల్ కమీషనర్లలో నైకమత్య మెప్పటినుండి గలుగును ? 7 మ్యునిసిపల్ కమీషనర్లు కాఁదలఁచినవారిలోఁ గొందఱు చెప్పెడు బెదురుమాటలకు, అబద్ధములకు జంకకుండ నుండునట్లు, ఓటర్లకు తెలివితేట లెప్పటినుండి వచ్చును ? 8 సొమ్ము రాబడి విశేషముగాగల ప్లీడర్లు పార్టీలకాగితముల నేలవేసికొట్టి వారినితిట్టి గౌరవముచేయక కాగితముల చదువక కేసులు పాడుచేయుట యెప్పటినుండి మానుదురు ? 9 డబ్బురాని ప్లీడర్లు పార్టీలను దేవురించి ఫీజు పుచ్చుకోకుండ అరువుకు పనిచేయుట యెప్పటినుండి వదులుకొందురు ? 11 ఆసుపత్రులలో కొఱంత లేకుండ అన్నిమందులు నెప్పటినుండి యుండును ?

# కొన్ని పట్టణములలో దొరకునట్టి శ్రేష్ఠమైన వస్తువులు

1 ప్రాణములోనున్న ప్రశస్తమైన గోవువరుగు:—లోకములో మనుష్యులు ఉస్త్రివరుగు, బుడమవరుగు, శ్వంగవరుగు, మొదలయిన వాటినే యెఱుఁగుదురుగాని గోవువరుగు నిదివఱకెప్పుడు నెఱుఁగరు. ఇది పట్టణములలో ప్రతివీథిని దొరకును మేఁతబెట్టక మొండగట్టిన యావులకు గోవువరుగని రెండవపేరు. ఈ వరుగు ప్రతిగృహములో నుండ తగినది. ఎందుకనఁగా పుష్కరసమయమందుఁ బితృకార్యములందు లక్షవత్తుల నోములందు నిది బ్రాహ్మణులకు దానములిచ్చుటకుఁ బనికి వచ్చును. ఇది మణుగుఁ ఎనిమిదిరూపాయలు. అనగా, ఒక్కొక్క యావు రెండుమూడు వీశెల బరువుకన్న నెక్కువగా నుండదు గనుక మిక్కిలి చవుకగా దొరకును. కొనినవారు దీనికి మేఁత పెట్టనక్కఱ లేదు గనుక వారికి దండుగ యుండదు. ఈ యావులు మిక్కిలి సాధువులు. వీటిదూడలు బ్రతుకవుగనుక యిచ్చినపాలన్నియు యజమానుడు త్రాగవచ్చును ఓపిక లేకపోవుటచేత, పోటులు తన్నులు లేవు మెడకు నులక త్రాడుగట్టి తీసుకుపోయినను నది హఠాముచేయకుండ వెంట వచ్చును. ఇచ్చినప్పుడు గిద్దెడో, అరసోలెడో పాలు పిసుకుకొని యింటిలో మేఁతబెట్టక వీథులలో వదలివేసినపక్షమున నవి పులివిస్తరాకులు, ఎండుత్రాటిమూకులు మొదలయినవి తిని వాటి పొట్ట యవి పోసికొనును. మేతవిషయములో యజమానికే విధమైన కష్టము నీయవు. ప్రతిజంతువు మఱియొకరిమీఁద భారము నిలుపక తనపొట్ట, తానే పాటుపడి పోసికోవలెనన్న యాత్మగౌరవ సిద్ధాంతము ఈ పశువులకుఁ బాగుగ దెలియును. అదియునుగాక కొంపలలోదూరి దొంగ తిండితినుట [illegible] దొడ్డి

దారిని చొడ్డిదారిని గొట్టినప్పుడు వీథిదారిని బోవుటలో వీటికిగల నేర్పు చెప్పనలవిగాదు. వీటికిగల పట్టుదల పూనిక మిక్కిలి మెచ్చతగినవి. పాలిచ్చినను యివ్వకపోయినను గోమయమునకు ఆశవాళ్ళు పొరుగింటికి పోనక్కఱలేదు. వస్తువు నోటికి దొరికినప్పుడు వేయికఱ్ఱలు పుచ్చుకొని కొట్టినను తినివెళ్ళనుగాని పారవేసిపోవు. ప్రజలేమనుకొన్న మనకేమియను వేదాంతదీక్షమాత్రము యజమానుల కుండవలయును. ఈ యావులను కొనదలచినవారు మాకు దరఖాస్తులను బంపవలయును. కొనుటకు వచ్చువారు, ఈ యావులను లేవదీయుటకిద్దఱు మనుష్యులను గూడ తీసుకురావలెను బేరము ఫయిసలయిన తరువాత లేవదీయునప్పుడే యొకవేళ ప్రాణముపోయినపక్షమున, ఆ దండుగ కొనుకొన్నవారే పెట్టుకొనవలయునుగాని, అమ్మినవారికి లేదు. ఇంటికి తీసికొని వెళ్ళగానే వీటికి గడ్డి పెట్టగూడదు. ఏలయన చిరకాలమునుండి గడ్డియలవాటు లేదు గనుక గడ్డి తగలగానే దానికి రోగమువచ్చును. అందుచేత మెల్లమెల్లగా నలవాటుచేయవలయును. తక్కిన సంగతులు స్వయముగావచ్చి మమ్ము కనుగొనవచ్చును. విష్ణుపురము, గోవువరుగు కంపెనీ ప్రసిడెంటు, వెంకటజగన్నాథ లక్ష్మీసుందర రాఘవేంద్రరావు, మూలవీథి, 711, నెంబరుయిల్లు అని వ్రాయవలెను.

2 మొదటిరకముదోమలు:—ఇది పల్లెటూళ్ళ కెగుమతి జేయుటకై ఈయూరిలో బెంచుచున్నాము. చిల్లరగాగొనువారికి పుట్టి రు 5 ల కిచ్చెదము. టోకుగానువారికి పుట్టి రు 4 లు. ముందుగా జట్టీకిపుచ్చుకొన్నవారికి పుట్టి రు 3 లు. డిశంబరు 15 తేదీలోపున దరఖాస్తులు పంపినవారికి రు 2-8-0 ఇవి మిక్కిలి యుపయోగమైనవి. రాత్రులయందేగాక పట్టపగలుకూడ మీదబడి సంగీతము పాడుచుండును. మూడుమాట్లు అన్నముతిని యేపనిలేక విధి విరామము లేకుండ నిద్రపోవునట్టివారికి నిద్రభంగము చేయుటకు యీ దోమలు శ్రేష్ఠమైన

విరుగును. పరీక్షలకు చదువుకొను ప్రతివిద్యార్థివద్ద, ఈ దోసెలు, అర డజనుండి తీరవలయును. ఇవి చదువుకొనునపుడు నిదురరానియ్యవు ఇవియున్న పక్షమున నిద్ర వచ్చునను భయముచేత పొడు మలవాటు చేసికొన నక్కఱలేదు. బీటుతిరుగక నిద్రపోయె పోలీసు భటులు వీటిని కొనుక్కొన్న పక్షమున వారికే ప్రమాదమునురాదు. ప్రొద్దెక్కి మెలకువవచ్చెడు వారందఱు వీటిని తప్పక పెంచుకొనవలయును. కార్తీకమాసములో తెల్లవారగట్ల స్నానమునకు వెళ్ళదలంచిన వితంతువులు తమ్ము వేకువలేపెడి వారక్కఱలేకుండ వీటిని పెంచుకొనవచ్చును. డజనుల లెక్కను పుచ్చుకొన్నపక్షమున డజను అణాకిచ్చెదము. పాలకొల్లుదోమలు కోలేటిదోమలు వీటిముందర దిగదుడుపునకైన పనికిరావు. ఈసంగతి వట్టిమాటగాదు. అనేక పర్యాయములు మేము తనిఖీజేసి చూచినారము. కావలసినవారీక్రింద సంతకముచేసినవారికి దరఖాస్తులు పంపవలెను. రెండుడజను లేకముగా పుచ్చుకొనువారికి మూడింటిని కమీషనుగా నిత్తుము.

దోమా అండు కో, మురుకికుండలవీధి,

రుద్రపురము.



# కలియుగ యక్ష ప్రశ్నలు

ఒకగ్రామమందు శివాలయములో, అర్చకుఁడైన శివలచిక్కయ్య, ఆగ్రామములోనే విష్ణుదేవాలయములో అర్చకుఁడైన నంబి నారాయణప్పను గలుసుకొని యిట్లనియె:—చిరకాలమునుండి నాకు గొన్ని శంకలు కలవు. నాశంకలు మీరు నిర్వృతిచేయవలయునుగాని నేను స్వయముగా నిర్వృతి చేసికొనజాలకున్నాను. అనగానే నంబి నారాయణప్ప అవియేవో చెప్పమని యడుగగా వారికిద్దఱికి, ఈక్రిందిసంభాషణ జరిగెను.

చిక్కయ్య—మనుష్యులలో పశువులు, పశువులలో మనుష్యులు ఉన్నారని విన్నాను, ఆమాట యెట్లునిజమగును ?

నంబి—నిజమే! తమకు న్యాయముగా రావలసినసొమ్ము పుచ్చుకొని సంతుష్టిపొందక, అడ్డమైనచోట్ల ప్రవేశించి మోసముచేసి దొంగగడ్డి తినునట్టి మనుష్యులు పశువులలోనే జమ. వారు మనుష్యులలో పశువులు. తనదారిని తానుబోయి పోటుతన్ను లేక యెవరి చేలోనుబడక తిన్నగా నింటికివచ్చునట్టి పశువు మనుష్యునితో సమానము. అట్టివి పశువులలో మనుష్యులు.

చిక్కయ్య—సరే! మగవాళ్ళలో ఆడవాళ్ళు, ఆడవాళ్ళలో మగవాళ్ళు ఉన్నారని విన్నాము. ఇదియెట్లు ?

నంబి—ఉన్నారు. ఆడవాళ్ళు చెప్పిన కొండెములువిని, అవియే నమ్మి చీటికిమాటికి, ఇతరులతో కయ్యాలాడుటకు వచ్చునట్టి మగవాళ్ళు ఆడవాళ్ళే. తక్కిన మూడవాళ్ళవలె వ్యర్థప్రసంగములుచేయక కలహములాడక కొండెములు చెప్పక చదువుకొని నత్కాలక్షేపము చేయునట్టి ఆడవాళ్ళు మగవాళ్ళే.

చిక్కయ్య—బ్రాహ్మణులలో మాలవాళ్ళు, మాలవాళ్ళలో బ్రాహ్మణులు ఉన్నారట. ఇది యెంతవరకు నిజము.

నంబి—దయ, సత్యము, శుచి, మొదలగునవి బ్రాహ్మణలక్షణములు. ఇవిలేక మెడలో జందెమమాత్రము వేసికొని యెల్లప్పుడు బూతులేమాటలాడుచు, అబద్ధమునకు, అప్రమాణమునకు వెరువక తిరుగు బ్రాహ్మణుడు మాలవాడు. జాతికి మాలవాడైనను దయాసత్యశౌచములుగలిగి పాపభీతి దైవభీతి కలిగి వర్తించుమాలవాడు బ్రాహ్మణుడు.

చిక్కయ్య—మనుష్యులలో కుక్కలు, కుక్కలలో మనుష్యులు గలరట. ఇందేమైన సత్యమున్నదా ?

నంబి—సత్యమున్నది. ఒకని కేదేని లాభము కలుగుచున్నపుడు పదిమందిపోయి, ఆపనికే మొదలుపెట్టి పోటీలకుదిగి ఒకరితో నొకరు వివాదముపడి, అందఱు చెడిపోవునట్లు ప్రవర్తించినమనుష్యులు కుక్కలు. ఒకపులివిస్తరాకు వీధిలో నెవ్వరైన వేయగానే పదికుక్కలుపడిఒక్కదానినోటికిదొరకనీయక మీదపడి కరచుకొనిపోవును. ఎవ్వరైన కొంచెముపకారము చేసినప్పుడు, ఆయుపకారము మరువక చచ్చిపోవువరకు విశ్వాసముగలిగియున్న మనుష్యులు మనుష్యులలో విశ్వాసముగల కుక్కలు.

చిక్కయ్య—మగవానికి మగడెవ్వడు ?

నంబి—చెప్పినట్లు వినని భార్య.

చిక్కయ్య.—ఆడదానికి పెండ్లామెవ్వరు ?

నంబి—అప్రయోజకుఁడైన మగడు.

చిక్కయ్య—మనయూరిలోనున్న కామశాస్త్రి మూడేండ్లక్రిందట భార్యమీద కోపగించి జందెము తెంపుకొని సన్యాసము పుచ్చుకొని మరల ... వేసికొనెను.

ఈయనను సన్న్యాసియనవలెనా ? గృహస్థుఁడనవలెనా ? ఈయన చని పోయినప్పుడు పాతిపెట్టవలెనా ? దహనము చేయవలెనా ?

నంబి — ఈయన సన్న్యాసిగాడు. గృహస్థుఁడుగాడు. సన్న్యాసి గృహస్థుఁడగును. ఈయనను చచ్చినతరువాత తగలపెట్టుటకంటె బ్రతికి యుండగానే నలుగురు మొగము తగులబెట్టి యావలకుబంపివేసిన బాగుండును.

చిక్కయ్య — పదేండ్లక్రిందట భీమన్నశాస్త్రి కాశీవెళ్లి యెంత కాలమునకు తిరిగి రానందున చచ్చిపోయినాడనుకొని యతనిబంధువులు వానికి కర్మజేసి భార్యకుతలగొరిగించిరి. గొరిగించిన కొన్నిమాసములకు భీమన్నశాస్త్రి యింటికి వచ్చెను. అతఁని మొదట పితురుదేవతలలో జేరిచి వానికి పిండములు తిలతర్పణములుయిచ్చినారుగనుక, అతనిని మన మిప్పుడు ప్రేతయనవలెనా ? పితురుదేవతయనవలెనా ? లేక భీమన్న శాస్త్రి యనవలెనా ? ఆయనభార్యను ముండయనవలెనా? ముత్తయి దువు అనవలెనా ?

నంబి — అతనిని ప్రేతయనకూడదు నిజస్థితిని దెలిసికొనకుండ శ్రాద్ధకర్మ జేసినందుకాయన చుట్టములనే ప్రేతలననలెను. భర్త వచ్చి నందువల్ల, ఆయనభార్యజుట్టు పెంచుకొనకతప్పదు గనుక జుట్టు ఎదుగు వరకు ముండ. ఎదిగినతరువాత ముత్తయిదువు.



# సాధారణసంవత్సరము; పంచాంగశ్రవణము

సంవత్సరాదినాడు అల్లిబిల్లి పట్టణమునందు చేపలబజారులో ఈక్రిందివిధముగ పంచాంగశ్రవణము చేయఁబడెను.

సంవత్సరఫలము.—సాధారణ సంవత్సరములో పంటలు సాధారణముగ నుండును. ఈసంవత్సరము చంద్రగ్రహణములు పున్నమినాడు రాత్రియందును, సూర్యగ్రహణములు అమావాస్యనాడు పగటియందును బట్టుచుండును. చాకలివాండ్రు పట్టములలో నప్పుడప్పుడు బట్టలు తెచ్చుచుందురు. కుట్టుపనివాండ్రును, కంసాలలును సౌమ్యసంవత్సరములో యిచ్చిన బట్టలును నగలును కొన్నిటిని యీసంవత్సరము మాఘమాసములోపుగ తయారుచేసి యిత్తురు. ఆషాఢమాసమందును పుష్యమాసమందును వివాహాదిశుభకార్యములకు లగ్నము లుండవు. భాగ్యవంతులు తమధనమునకు వడ్డీ తిన్నగారాలేదని విచారింతురు. అందులో కొందఱు కడుపునిండ భుజియింపరు పేదవారు నూటికి రెండురూపాయలపైనవడ్డీకి సొమ్ము తెచ్చుకొని హాయిగ తినుచుందురు. కొన్నిపట్టణములవీధులలో రాత్రులయందు, ఎప్పటివలెనే పందులు తిరుగుచుండును. చంటిబిడ్డలుకొందఱు బాలపాపచిన్నెలువచ్చి చచ్చిపోదురు. గర్భిణీస్త్రీలలో కొందఱికాడశిశువులు కొందఱికి మగశిశువులు కలుగుదురు. గోదావరీ కృష్ణా మొదలగు నదులలో, అప్పుడప్పుడు కొన్నిపడవలు మునుగును గోదావరిమొద్దున క్రొత్తగాబోసిన గట్టు మీాదనుండి కాలుజారి, అప్పుడప్పుడు కొందఱు పడుచుందురు, అమ్మకముపాలలో, ఈసంవత్సరము నీ ళ్ళెక్కువగకలియుచుండును. రాజమహేంద్రవరములో బోగమువాండ్రను లౌక్యులకంటె వైదికులు, వర్తకులు, ఎక్కువ ఆదరింతురు. వీటుకనిప్పేటులకు నిర్ధనత్వ మెక్కువవచ్చును.

నాజర్లు వారంటుగుమస్తాలు మొదలగువారిపని కొంచెము బాగుండును. చె॥ వెం॥ గోపాలరావుగారును, భద్రియ్యగారు యీసంవత్సరముగూడ కొన్నివార్తాపత్రికలను ముందుదెప్పించుకొని పత్రికాధిపతులు డబ్బడిగినప్పుడు, అక్కరలేదని వ్రాయుచుందురు. వేసవికాలములో గొందఱికి తేళ్లుకుట్టును. చైత్రవైశాఖమాసములలో కొన్ని గ్రామములలో ఇండ్లుకాలిపోవును. మునిసిపల్ ఓటర్ల తెలివితేటలు సౌమ్యసంవత్సరములో నున్నట్లేయుండును. ఏమంచిపనికైనను చందాలు వేయువారు తమయిండ్లచుట్టు వసూలుచేయు నౌకర్లను వేయిమాఱ్లు త్రిప్పించుకొనుట వెనుకటిసంవత్సరముకంటె అధికముగానుండును. విదేశ వస్తువులం దెచ్చి స్వదేశవస్తువులేయని దొంగపేరుబెట్టి యమ్ముట గతనాలుగుసంవత్సరములలో నున్నట్లేయుండును. గొప్పయుద్యోగస్థులు సిరస్తదార్లు చెప్పినట్టువినుట ప్రభవసంవత్సరము మొదలుకొని యెట్లున్నదో యిప్పుడు నట్లెయుండును. పేదవాళ్ళకుఁ ఎక్కువ ఆకలియు భాగ్యవంతులకు అజీర్ణరోగము తరుచుగా బుట్టును. ఇంగ్లీషు చదువుకొన్నవారిలో, కొందఱికి రాత్రులయందు బ్రాందిమీద అప్పుడప్పుడు భ్రాంతిపాఱుచుండును. త్రాగుబోతులకు జారులకు సిగ్గుబిడియములు నూటికి ముప్పదిపాళ్లు తగ్గిపోవును. రైలుబండ్లలో స్థలముచాలక మనుష్యులు బాధపడి దెబ్బలాడుకొనుట సౌమ్యసంవత్సరముకంటె కొంచె మెక్కువగును. రహదారీపడవల గుమాస్తాలు మొదట తక్కువరేటు కెక్కించుకొని నట్టేటిలోనికి తీసికొనివెళ్లినతరువాత రేటెక్కువగుట నిరుటికంటె నొకపాలు తగ్గును. మొత్తముమీద యీసంవత్సరమందు పోయినవాళ్ళుపోగా మిగిలినవాళ్ళు ఆయువున్నంతకాలము బ్రతుకుదురు.

# సాధారణసంవత్సరములో వృద్ధి క్షయములు

| | పాళ్లు. |
|---|---|
| కాఫీకొట్లవృద్ధి | 35 |
| సోడాయంత్రములవృద్ధి | 40 |
| కిరసనాయలులో నీళ్ళు | 10 |
| నేతిలో కంపు | 50 |
| బియ్యములో రాళ్ళు | 10 |
| మనుష్యులలో నైకమత్యము | 2 |
| దానినాశనము | 98 |
| ధర్మోపన్యాసములు | 70 |
| దానిప్రకారమాచరణము | 1½ |
| దొంగవైద్యుల వృద్ధి | 20 |
| నాశనం | 4 |
| వైదికి నియోగికక్షులువృద్ధి, కచ్చేరీలలో | 50 |
| బ్రాహ్మణ శూద్ర వివక్షత ఎలెక్షనులో | 70 |
| లంచములు | 70 |
| దానినాశనము | 3 |
| మ్యూనిసిపలు న్యూసెన్సు కేసులు వృద్ధి | 80 |
| వాటిలో శిక్షలు | 95 |
| విడుదలలు | 5 |
| అత్తాకోడళ్ళవైరం | 56 |
| దానినాశనం | 6 |
| యానాంప్రయాణములు | 15 |
| దానినాశనం | 1 |
| వడ్డీఆశ | 79 |

| | |
|---|---|
| అప్పు లెగబెట్టుట | 45 |
| వైద్యులసొమ్మెగపెట్టుట | 25 |
| ఆకాశరామన్న అర్జీలు | 50 |
| అధికారులు వాటినినమ్మట | 25 |
| కొండెములు చెప్పువారివృద్ధి | 10 |
| వారికాదరణము | 7 |
| వారికి చెప్పు దెబ్బలు | 6 |
| ఏజంట్లవృద్ధి | 33 |
| దానినాశనము | 3 |
| ఈనాందారులు శిస్తులడిగినప్పుడు రైతులు పండలేదని యేడ్చుట | 70 |
| దానినాశనము | $1\frac{1}{2}$ |
| అప్పులుతెచ్చి వర్తకులు భార్యలకు నగలుచేయించుట | 80 |
| అప్పులెగబెట్టుటకు ఆస్తులు భార్యలపేర వ్రాయించుట | 60 |
| సన్న్యాసులు కొడుకులకాస్తులిచ్చుట | 75 |
| దానినాశనము | 0 |
| వంటబ్రాహ్మణుల తెగనీలుగు | 41 |
| స్వాములవార్లకు ఆంకుపత్రికలవల్ల వచ్చు ధనవృద్ధి | 74 |
| దొంగసన్న్యాసివృద్ధి | 37 |
| ప్లీడరిగుమాస్తాలకు కర్చులెక్కవవ్రాయుగుణం | 59 |
| ఫోర్జరీలు | 12 |
| అవేకోనసీమలో | 20 |
| పెండ్లికొడుకుల ధరలవృద్ధి | 91 |
| పెండ్లికూతులధరలవృద్ధి | 24 |

# చామాలమ్మ దర్బారు

రాజమహేంద్రవరము గ్రామదేవతయైన చామాలమ్మ తీర్థము సంవత్సరాది పండగ దినములలో మిక్కిలి గొప్పగ జరుగును. ఆనాడు తెగిన కోళ్ళయొక్క మేకలయొక్క సంఖ్యకు మితిలేదు. తన తీర్థపు మహోత్సవము జూచుటకు చామాలమ్మ తన చెలికత్తెలైన వాసపల్లి పళ్లాలమ్మను రాకునూరు మామిళ్ళమ్మను విజ్జేశ్వరపు సాగులమ్మను, అయినవల్లి నూకాలమ్మను, ఉత్తరములువ్రాసి పిలిపించినది. పిలిపించి పండుగనాడు వారికి కడుపునిండ రక్తమాంసములతో విందులు చేసెను ఆ రాత్రి వారైదుగురు నీ క్రిందివిధమున ముచ్చటించుకొనిరి. ఈ సంభాషణ పోతరాజు జరిగినది జరిగినట్లుగా వ్రాసిపంపెను. పోతరాజు అమ్మవారు తమ్ముడన్నమాట యందఱెఱిగినదే. ఆయన మాపత్రిక కొక యుపవిలేఖకుడుగ నుండుటకంగీకరించి యప్పుడప్పు డేమైన వ్రాసి పంపుచుండును,

సంభాషణము.

చామాలమ్మ—నాతీర్థపు మహోత్సవమునకు నా చెలికత్తెలైన మీ రందఱు వచ్చుటచేత నాకెంతో సంతోషముగానున్నది. ఏటేట మీ రిక్కడికి రావలయును.

పళ్ళాలమ్మ—అక్కయ్యా! మీరు మా యూరు మేము మీ యూరు వచ్చి పోవుచు నుండవలయుననియే నా కోరిక. కాని మనకీ సౌఖ్యము గౌరవము చిరకాలము జరుగునని నమ్మకము నాకు లేదు.

మామిళ్ళమ్మ—(భయముతో) అమ్మయ్యో! ఏమియాపద వచ్చినది. మన సౌఖ్యము లెందుకు జరుగవు?

సాగులమ్మ—మశూచి విశూచి జాడ్యములు బొబ్బ లమ్మలు లోకములో నున్నంతకాలము మనకేమి లోపములు కలుగ పోవును ?

నూకాలమ్మ—పళ్ళాలమ్మ అక్కయ్య చెప్పినమాటలలో కొంతనిజమున్నది.

చామా — లేనిపోని భ్రమలుపడక మీ భయకారణమేమో నాకు దెలియజేయండి.

పళ్ళా — అక్కయ్యా! ఇదిగోవిను. మశూచివిశూచి మొదలైనవి రోగములేకాని, అమ్మవారుల ప్రయోజకత్వములు కావని మన దేశస్థులు శాస్త్రములు చదువుకొని గ్రహించుచున్నారు. అందుచేత మనకూటిలో దుమ్ముపడినదని నేను భయపడుచున్నాను. ఈ సంగతి లోకములో పొక్కినా, ఇకమీద మనకు కోళ్ళు గొఱ్ఱెలు చల్దినై వేద్యము ను పానకము మొదలైనవి సమర్పించువారుండరు. అప్పుడు మనమాకలిచేత చావ వలసివచ్చునని భయపడుచున్నాను. ఏబాధనైన బడవచ్చుకాని యాకలిబాధ పడలేముగదా.

మామి—సోసీ యీ దేశమువదలి మఱియే దేశమైన పోదాముఠండి.

సాగు—కొంచెమో గొప్పో యీ దేశములోనే దొరకవలె కాని మరియొక దేశములో మన మొగముచూచువారేలేరు. పొలిమేరదాటి రానియ్యరు.

నూకా— కటకటా మనదశయెంతవఱకు వచ్చినది! దీనికేమిగతి?

చామా—ఓసి వెఱ్ఱిముండలారా! మీ పిరికితనం తగులవెయ్య ఇదా మీకు వచ్చిన భయం? చాలు, చాలు బెంగపెట్టుకొనకండి. మీ భయము నేను తీర్చ గలను. వినండి. ప్రకృతిశాస్త్రమనియెడు రాక్షసియొకర్తు క్రొత్తగా బయలుదేరి మన దేశమునకు వచ్చి పట్టణములలో బ్రవేశించి కొందఱికి మనమీఁద భక్తి లేకుండఁ జేయుచున్న మాట నిజమే. కాని యట్టివారిసంఖ్య మిక్కిలి తక్కువ. మఱియు నిందులో నొక పరమ రహస్యమున్నది. అది చెప్పెదవినుండు. ఇంగ్లీషు

చదువుకొన్నవారిసంఖ్య మిక్కిలి తక్కువ. అట్టివారు నూటికొకరైన లేరు. ఆ చదువు చదువుకొననివారు మనకెప్పుడు భక్తులేయగుదురు. అదిగాక పాటకపు జాతుల వారందఱు మనకు విధేయులే. ఇంగ్లీషు చదువుకొన్న వారికి మన మీఁద నొకవేళ యిష్టము లేకపోయినను యింటివద్ద వారి మాటచెల్లదు. వారు మనమీఁద భక్తివద్దని చెప్పినంత మాత్రముననే వారితల్లులును భార్యలు తోబుట్టువులు కూఁతులు మగ వారివలె చదువుకొని చెడిపోక పోవుటచేత బ్రహ్మరాక్షసులవలె యజమానులమీఁదబడి పీకివేసి వారిమాట సాగనియ్యరు. ఈ మహాస్త్రీలు మనపాలిటి దేవతలు. వాళ్ళుండబట్టి మన పరువు దక్కుచున్నది. ఇంత అన్నము దొరకుచున్నది. ఒకవేళ యజమానుఁడు చండశాసనుఁడైన పక్షమున అతఁడు కచ్చేరీకి వెళగానే యతనికి దెలియకుండ స్త్రీలు రహస్యముగ చద్దినైవేద్యములు, వేఁడినైవేద్యములుబెట్టి యింటి నౌకర్లచేత చాటుగ మనకు కోళ్ళను మేకలను బలికిఁ బంపుదురు. మఱియు యీ చదువుకొన్నవారి తెలివితేటలుకూడ ఆడవాళ్ళ తెలివితేటలు వలెనే యున్నవి. ఏలయన బి. ఏ. ప్యాసు అయినవాఁడుకూడ జబ్బు చేసినపుడు సోదెకుఁ బంపుచున్నాఁడు. సోదె సాహేబిచ్చిన తాడు కట్టుకొను చున్నాడు. యం. ఏ. ప్యాసుఅయిన వాఁడుగూడ మనకు చాటుగ కోళ్ళను మేకలను బంపు చున్నాడు. ఈమధ్య భీమన్నపంతులు గారికూఁతురునకు మశూచికమురాగా నాలుగు రూపాయలుబెట్టి మేకను ఆయనే స్వయముగాకొని తానుమాత్రము గుడికిరాక ఆడ వాళ్ళనుమాత్రము బంపినాడు బి. ఏ లు మనయెడ భక్తి చాటు చాటుగ జూపుదురు, మశూచికము కలరా మొదలైనవి శుచిలేని వారికి మంచి గాలి పీల్చని వారికి మంచి నీరు త్రాగని వారికి మంచి బట్టలు కట్టనివారికి మంచి యన్నము తిననివారికి వచ్చును. గాని మన ప్రమోజకత్వమువలన రావు. ఈ జ్ఞానము లేకయున్న స్త్రీ

పురుషులలో నూటి కొక్కరికైన లేరు. కాబట్టి యిటువంటి యజ్ఞాన ముండగా, అటువంటి బిషేులు మెంయేలు నుండగా, అటువంటి మూఢ స్త్రీలుండగా మనము జడువవలసిన పనియేమున్నది? ఇంకా పదివేల సంవత్సరముల వఱకు మనకిటువంటి భయము గలుగదని నేను పూచీ పడి చెప్పగలను. హిమాలయ పర్వతములు త్రవ్వివేయవచ్చును. సముద్రములో నీళ్ళన్నియు ఏతాము పెట్టితోడి వేయవచ్చును ఆకాశముమీదనున్న చుక్కలనన్నింటి నేల రాల్చవచ్చును. కాని హిందూదేశములో నుండునట్టి స్త్రీలయొక్కయు పురుషులయొక్కయు మూర్ఖత మాత్రము బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముగ్గురు గలసి మూడుకోట్ల యవతారములెత్తిగూడ మాన్పలేరు. అందుచేత మనకు పుష్కలముగ నన్నయున్నది. ఇంత యెందుకు? ఈ యూరిలో రెండు కాలేజీలున్నవి. ఇక్కడనున్న విద్య మరెక్కడ లేదుగదా? ఇటువంటి యీ గ్రామములోనే కోళ్ళు మేకలు లెక్కలేక చచ్చినవిగదా! నెత్తురు కాలువలుగా పారినదిగదా! ఇవియన్నియు జూచిచూచి మీ కింత భయమెందుకర్రా!

పల్లా—అమ్మయ్యా! నాభయ మిప్పటికిపోయినదే తల్లి.

మామి— ఈ మాటపైకి తెలియనియ్యకండి ప్రమాదము కలదు.

సాగు—డప్పువేసి చాటినను భయములేదే, వీరిమూర్ఖతకు చలనములేదు.

చామా—సరే, యిక వెళ్ళుదమురండు.

(అందఱు నిష్క్రమింతురు.)



# శ్రీరామనవమి పందిరి

(అంతట గంగరాజు మంగరాజు ప్రవేశించుచున్నారు.)

గంగ—మంగరాజు బావగారు నేను శ్రీరామనవమిపండుగ జేయవలయునని యెన్నాళ్ళనుండో తలపెట్టి యీయేడారంభించినాను. రామశాస్త్రిగారు! రామాయణము గంటనుండి లోపలిచావడిలోఁ జదువుచున్నారు. కాని మీరుతప్ప మఱి యెవరును పురాణము వినుటకు రాలేదు. తక్కిన అన్నిపందిళ్లలోకి వందలకొలది వెళ్ళుచున్నారు. నాపందిరిలోకి యెవ్వరు రాకపోవుటకుఁ గారణమేమి?

మంగ—ఎందుకురాలేదో తెలియలేదా! నీపందిట్లో యేమి గొప్పయున్నదనొస్తారు. ఈపండుగ, ఆరంభించకముందే నేను నీతో వేయివిధముల చిలకకుచెప్పినట్లు చెప్పినాను. అప్పో సప్పో జేసి బోగముమేళము పెట్టవోయి బాబు అని నిన్ను నేను బ్రతిమాలుకో లేదూ? కాకపోయినా మీరు పెద్దవాళ్ల మాటలు వింటారా? పెండ్లికేమిటి శ్రీరామనవమికేమిటి మఱేయుత్సవమునకేమిటి బోగముమేళము లేనిదే నిండే లేదు. వాళ్ళు శోభనదేవతలు. వాళ్ళతో పందిరికి కళకాంతులు వస్తాయి.

గంగ—దేవుని యుత్సవానికి బోగముమేళమే ప్రధానమా? రామాయణపారాయణము భజన మొదలైనవి యింపుండదూ? మా తమ్ముడుగూడ నాతో మీలాగే వాదిస్తూన్నాడు.

మంగ—మీతమ్ముడు సబబెరిగిన మనిషి. నీలాగున మూర్ఖపట్టుపట్టఁడు. నీవీమధ్యను యింగ్లీషు చదువుకొన్న దౌర్భాగ్యులను కొందఱిజూచి బోగముమేళము పెట్టనన్నావు. వెధవసహవాసాలు చేసి పూర్వపు [illegible] చచ్చినా.

సరే నీసావట్లోనికెవ్వడు రాడు. నీవేడ్చిపోతావేమో యని నేను మాత్రము వచ్చినాను. ఆహాహా! అరుణాచలంవంటి భోగంది వచ్చి మన పందిట్లో క్షణము నేపునిలుచుండిన చాలు. మహాలక్ష్మి తాండవమాడి పోదూ! ఆలాంటిది వచ్చినట్టయినా నీపందిట్లో జనం యిసుకవేస్తే రాలకుండా వుంటారు. ఎవరూ రాకపోతే యుత్సవం చేసుకొన్న సార్థక మేమున్నదయ్యా. కనుక నామాట విని యిప్పుడు మించిపోయినదేమి లేదు, యిప్పుడైనా భోగముమేళము పెట్టు. ఈవేళ ఒకరోజు వ్యర్థముగాబోయినా తక్కిన నాలుగురోజులు యిల్లు నిండుగా నుంటుంది. మీకు కావలిస్తే వందరూపాయలు చంద్రయ్యగారిదగ్గర బదులు యిప్పిస్తానురా! ఏలూరులో కంజాక్షి మేళమున్నది. కాకినాడలో నీలాచలంమేళం బహుశా ఖాళీగావుంటుంది. ఇద్దఱికి యిప్పుడే టెలిగ్రాపులియ్యి. నూటపదహారులిస్తామువస్తారా! అని వ్రాయించు.

గంగ — బావా నేను మొదట పొరబాటుచేసినాను. మనము టెలిగ్రాఫులిచ్చి వాళ్ళు వచ్చేటప్పటికి పుణ్యకాలము కాస్తా అయి పోతుంది. మనవూళ్ళో నరహరి మేళాన్ని యెవరు పిలవలేదు.

మంగ — (నోరు చప్పరించి) ఏమిటోయి. రెండువందలు పోతే పోయినాయి, కంటికి నదరైన మేళము తెప్పించాలిగాని మనవూళ్ళో వాళ్లని పిలిస్తే యేమి గౌరవముంది “క్రొత్తరుచి ప్రాతరోత” అన్నాడు. గనక టెలిగ్రాఫులియ్యి.

గంగ — లేసబావకన్న గుడ్డిబావ మేలుకాదుటోయి బొత్తిగా లేకపోయేకన్న యేదో ఒకమేళము వాకట్లోవుంటే చాలదు. ఇప్పుడు మీవంటి పెద్దమనుష్యులందఱు కాకులు పొడిచినట్లు పొడుస్తున్నారు. తలయెత్తుకొని వీథిలో తిరగడానికి వీలులేకుండా నున్నది. ఈమాటి క్రీగాగున పోనియ్యి; ముందునాటికి నెల్లాళ్ళు ముందుగానే యేలూరో

కాకినాడ్లో వెళ్ళి కూర్చుని మంచిమేళమునకు ముందుగానే బజానా యిచ్చి వాళ్ళచేత కంట్రాక్టు వ్రాయించుకొని తీసుకువస్తాను.

మంగ—ముందు రాటి కాలాగే చేద్దాములే. ఇప్పు డేమి చేద్దాము?

గంగ—ముందు నీవువెళ్ళి నరహరితో మాట్లాడిరా! నేను యీలోపుగ చంద్రయ్యగారియింటికి వెళ్లి నూరురూపాయలు బదులు మాట్లాడుకొని వస్తాను. దేవుడుకార్యంగదా! ఆయన బదులుయివ్వక పోతాడా ?

మంగ—ఈబదులు భోగముమేళముకోసరమని మాత్రమాయ నతో చెప్పకు. వేరే యవసరమని నోటువ్రాసి పట్టుకొనిరా. పోనీ నరహరి యింటిదగ్గరకువెళ్ళి తిరిగివచ్చి నేనే సొమ్ముతెచ్చిపెడతాను: నీవు యిప్పుడు వెళ్ళకు.

(అని వెళ్ళుచున్నాడు.)

గంగ—(తనలో) చంద్రయ్యగారు సొమ్మిస్తురా లేదా? లేక పోతే చేయునలసినపని యేమిటి? మాయింట్లోదాన్ని కంటె పదిరోజులు తాకట్టుకు యిమ్మంటే యిస్తుందా లేదా?

(తొందరతో రామశాస్త్రిగారు ప్రవేశించి)

గంగరాజుగారు! గంగరాజుగారు! మీతమ్ముడు విసుచుకొని పడిపోయినాడు త్వరగారండి.

గంగ—(తొందరతో) అయ్యో! అయ్యో! ఇదేమిట డోయి (అని లోపలకు బోవుచున్నాడు)

అప్పుడు నలుగురుమనుష్యులు పట్టుకొనగా తమ్ముడు సుబ్బ రాజు లేచికూర్చుండి తలయూచుచు గంగరాజునుజూచి 'ఓరీ! దుర్మార్గు డానా స్తికుడా యింతలోనే యింతవాళ్ళు పొగరెక్కివచ్చినా! నే నెం

ననుకొన్నావు. ఎరుగవుకాబోలును జాగ్రత్త. భద్రాద్రిరాములవారిని. నాకు భోగముమేళము అక్కఱలేదటరా! వొద్దని నీతో నేను చెప్పినానా? అంతమేళము తెప్పించుకొనుటకు గతిలేనివాడవు నాకీ యుత్సవమెందుకు చేయాలిరా? జాగ్రత్త. యీలాటి బుద్ధితక్కువమాటలన్నావంటే వంశంనాశనం జేశేస్తా. కపడ్దారుగా మసులుకో. మా బంటును హనుమంతుని బంపినానంటే యీవూరంతా తగలేస్తాడు'

గంగ—(భయముతో కాళ్లమీఁదపడి) స్వామీ! నావొల్ల తప్పొచ్చినది తప్పొచ్చినది. బుద్ధిగడ్డితిని యీపని చేసినాను. ఇదిగో చెంపలు వేసికొనుచున్నాను. ఇఁకముందెన్నడు నిట్టిపనిచేయను. నా వంశం నిలిపి నన్ను రక్షించండి.

సుబ్బ—ఇప్పటికి నీకు తెలివివచ్చినదిగదా! పరవాలేదులే జాగ్రత్తగానుండు (అని వెనుకకు పడిపోవుచున్నాఁడు)

గంగ—అమ్మయ్యా! బ్రతికిపోయినాను. (అని లోపలికి వెళ్ళి) వోసే! యెక్కడనున్నావు ఈలారా?

భార్య—(వచ్చి) ఎందుకు పిలుస్తున్నారు. లోపల పేరంటాండ్రకు పసపురాయుచున్నాను.

గంగ—ఇప్పుడుజరిగిన చిత్రకథ నీవు వినలేదుగాబోలు. మా సుబ్బరాజుకు రాములవారుపూని భోగముమేళము పెట్టుమన్నారు. నీవు నాలుగురోజులు నీకంఠి నాచేతికి యిస్తివా అది తాకట్టుపెట్టి భోగము మేళము పెడతాను. లేకపోతే వంశక్షయమైపోతుంది.

భార్య—మీతమ్ముడికి రాములవారు పూని భోగముమేళము పెట్టమన్నారా? విచిత్రపుమనుష్యులు విడ్డూరపుపూనడాలు వచ్చాయి. ముండల మాటాకోరుముండానాళ్ళు మీతమ్ముడు, మంగరాజుపన్నిన పన్నాగమిది. అంతేకాని పూనడములేదు. వాళ్లపిండాకూడు లేదు.

వాళ్ళు శిమాలాడడానికి మీరు నమ్మడానికి సరిపోయినది కంటి తా కట్టెట్టి బోగము మేళము పిలిపిస్తారా ? ఆమంగిరాజు చచ్చినాడు పెట్టిన పేటనేగాని మొదట మీకీదుర్బుద్ధి పుట్టలేదు. వాడి ముండలు మోసుకుపోను. వాడి కెప్పుడూ ముండలగోడవేగాని మరియొకటి లేదు.

గంగ—పోనీ యివ్వకపోతే, యివ్వకపోయినావుకాని కేకలు వేయకు. నలుగురు నవ్వుతారు అవతలకు వెళ్ళు.

భార్య—వాళ్ళు మీరు మీయిష్టమువచ్చిన గంగలో దిగండి. నాకంతి నేను యివ్వను. (అని వెళ్ళుచున్నది)

గంగ—(చావడిలోనికి వచ్చి తమ్ముని బిలిచి) తమ్ముడూ, చంద్రయ్యగారిదగ్గరకు వెళ్ళి నూరురూపాయలు బదులు పట్టుకురా?

సుబ్బ—సరే తెస్తాను. (అని వెళ్ళును)

మంగ—(వచ్చి) గంగరాజుబావా! నరహరి నన్ను అడ్డమైన తిట్లు తిట్టింది. ఈయూళ్లో యెవరు దాన్ని పిలవకుండా చేసినవాడిని నేనట. ఇదివరదాకా పనికిరాక యిప్పుడు పనికివచ్చినానా సిగ్గులేని కుక్కా యని తరిమి కొట్టినది. కాకినాడ యేలూరుమేళములు కూడా యెక్కడికో వెళ్ళినవని కాళీగా లేవని నాకు తెలిసినది. ఏమిచేయగలం? ఈయేటి కూరుకో.

సుబ్బ— చంద్రయ్యగారు దస్తులేదన్నారు, పోనీ యీయేటి కూరుకుందాము. ముందునాటికి బోగము మేళము పెట్టి ఉత్సవము చేయుచున్నామని మనము మ్రొక్కుకొందాము, రా లోపలికిరా; (అని అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

# కావలెను! కావలెను!

చక్కని పండ్రెండేండ్ల పెండ్లికూతురు కావలెను. పెండ్లికూతునకు, అయిదువేలరూపాయల నగలు పెట్టుదురు. పెండ్లికొడుకు అత్తమామలను బావమరదులను తనయింటనే యుంచి పోషించును. కావలసినపక్షమున వేయిరూపాయలో పదిహేనువందలో రొక్కము రహస్యముగా నిచ్చునుగాని, ఆమాట పయికి రానియ్యక సాలంకృత కన్యాదానమనియే వెల్లడిచేయవలెను. పెండ్లికూతురికిచ్చెడు నగలుగాక, అత్తగారికిగూడ బంగారవుకంటెకాని, కాసులపేరుగాని పెట్టుదురు. ఈ వివాహసంబంధము కుదిర్చినవారికి నూటపదహార్లు బహుమాన మీయబడును. పెండ్లికుమారునకు నాలుగు మూడువేల రూపాయలువచ్చునట్టి భూములు తోటలు నున్నవి. ఇదిగాక లక్షరూపాయలు వడ్డీకి తిరుగుచున్నవి. పెండ్లికుమారుడు మంచిసాంప్రదాయకుడు. వీరిపూర్వులు దేశపాండ్యాలు. చాలా గొప్పఉద్యోగములు చేసి యీనడుమనే మూడు సంవత్సరములకిందట పించను పుచ్చుకొన్నారు. పించను పుచ్చుకొన్నారనటచేత, ఆయన చాలా పెద్దవారని లోకులు భ్రమపడి పిల్లనీయక వెనదీయుదురేమో. అట్లు భ్రమపడనద్దు. ఈయనవయస్సు 43 సంవత్సరములు. ఇంతచిన్నతనములోనే పించను పుచ్చుకొన్నారని యందురేమో యిటు వినుడు. ఈయన 15 వ సంవత్సరములోనే యుద్యోగములో బ్రవేశించి 25 సంవత్సరములు సర్కారుద్యోగము చేసి, యుద్యోగముమీద వినుగుపుట్టి నలువదియవయేటనే పించను పుచ్చుకొన్నారు. ఇప్పటికి పించను పుచ్చుకొని మూడేండ్లయినది. కనుక యిప్పుడు 43 వ యేడు. ఈయన పెద్దకుమారునకే 40 యేండ్లున్నవి గదా యీయనకు 43 డేండ్లెట్లుండునని కొందఱుమూరు లిదివఱకు

మానద్ద నాక్షేపించినారు. ఆ మాక్షేపణలు కేవలకల్పితములు. అబద్ధ ములు. ఏమనగా ఈయన పెద్దకుమారునకు 28 యేండ్లకంటె నెక్కువ లేవు. ఆకొమారుడీయనకు 15 వ గేట పుట్టినాడు ఈవిషయమున సందేహము తోచినయెడల పిల్లనియ్యదలచినవారు ఈయన జాతకము చూచుకొనవచ్చును. ఈయనజననము పరిభవ సంవత్సరము. జ్యోతి ష్కులకు లంచమిచ్చి తక్కువవయస్సువేసి దొంగజాతకము వ్రాయిం చినారని జ్ఞాతులు వాడుక వేయవచ్చును. ఆ మాటమాత్రము పెండ్లి కూతురువారు నమ్మనద్దు. మనిషి 60 యేండ్లవానివలె కనబడునుగాని నిజముగా అంతవయస్సులేదు తల ముగ్గుబుట్టవలె నెరసినది ఆ మనకు పెండ్లియెందుకని కొందఱనుచున్నారు. తల వయస్సుచేత నెరియలేదు. సుమారు 10 సం॥ క్రిందట ఈయనకు గొప్ప జబ్బుచేసెనది. అప్పుడు సన్నిపాతజ్వరముచేత ఈయన దేహము తెలియక మందులో గలుపు టకై గిన్నిలో పోసిపెట్టిన తేనె తలనిండ పులుముకొనుటచేత క్రమ క్రమమున తలవెంట్రుకలన్నియు తెల్లపడిపోయినవి. పండ్లలో గొన్ని పుప్పిపండ్లు బయలుదేఱి విశేషముగా బాధ పెట్టుచుండుటచేత, ఆపం డ్లు తీయించివేసి యీయన దంతపుపండ్లు కట్టించుకొన్నారుగాని పెద్ద వయస్సుచేత దంతము లూడిపోలేదు. అనేకస్థలములలో నుద్యోగ ములు చేయుటచేత, ఆయాపీళ్ళు పడక మేహకారకముచేత కన్నులు చిన్నతనమందే జబ్బుపడిపోయినందున యీయన చలువజోడు కన్ను లకు పెట్టుకొనుచున్నాడు కాని చత్వారముచేత జోడుపెట్టుకొను చుం డుటలేదు. కాబట్టి పెద్దపిల్ల లున్నవారు తప్పక యీయనకు కన్య దానము చేయవలెను వరదక్షిణలిచ్చి కోరి వేడి తలక్రిందుగా తపస్సు చేసినను దొరకని సంబంధము. కాలవశముచేత కళత్రముతప్పిపోయి నదిగనుక, యీసంబంధము దొరకుచున్నది. పిల్లనియ్య దలచుకొన్న వారు జ్యేష్ఠమాసము లోపుగ సంబంధము రహితము చేసికొనవలెను,

ఏలయనగా, యీ పెండ్లికిమారు(మగాని దౌహిత్రు)నకు, అనగా పెద్ద కూతురు కుమారునకు, ఈయన పెద్దమనుమరాలిని, అనగా పెద్దకు మారుని కుమార్తెను, ఇచ్చి జ్యేష్ఠమాసములో తిరుపతిలో వివాహము చేయుదురు. ఆవివాహములో గలిపి తనవివాహముగూడ తిరుపతిలోనే యాయన చేసికొనదలచు కొన్నారు గనుక సంబంధము త్వరగా రహితము కావలెను. పిల్లను పెద్దవాని కిచ్చిన పక్షమున పిల్లకు, అన్నిముచ్చటలు తీరవేమోయని తల్లిదండ్రులు భయపడ నక్కరలేదు తిరుపతిలో చేసికొన్నను పెండ్లి 5 రోజులు జరుగును. భోగముమేళముకూడా పెట్టుదురు ఇంటికి వచ్చినతరువాత బాణ సంచాతోను నగారా నౌబతులతోను ఫెస్ట్రుచుచు యూరేగింపు జరుగును. నాగవిల్లినాడు దండాడింపుకూడ తప్పక చేసికొనదలచుకొన్నారు. దండాడింపునకు, ఆయన నెపరెత్తుకొగలరని మీరు సందేహింప నక్కఱలేదు. వంటబ్రాహ్మణులైన సోమన్న, అక్కయ్య, అనువార లిద్దఱు వంతులప్రకార మాయనను ఎత్తుకొని మోయగలరు. ఆయేర్పాట్లన్నియు పదివఱకే జరిగినవి. అందుచేత నిక్షేపమంటి సంబంధము చెడగొట్టుకొనక పిల్లనియ్యండి. పిల్ల యెంతో సుఖపడును వెనుకటి భార్య తాలూకు 20 బనారసు చీరలున్నవి. మీపిల్ల కట్టినచీర గట్టకుండా నెల్లాళ్ళు కట్టుకొనవచ్చును. వెండిపళ్ళెములు కంచములు గిన్నెలు దొన్నెలు ఎన్నియున్నవో చెప్పలేము. కీన్ కాబు, అతలసు గుడ్డలు వేసిన పట్టుపరుపులమీద మేడలలో నిలువుటద్దములుగల గదిలో పందిరి పట్టిమంచముపై పండుకొనవచ్చును. కావలసినపక్షమున పిల్లకు ముందుగానే నాలుగుపుట్లభూమి వ్రాసియిచ్చి 10 వేల రూపాయలామెపేర బ్యాంకిలో వేయుదురు. సవతిబిడ్డలకు, యీయనకు పడదన్న భయములేదు. పెండ్లికాగానే ఆయన వేరుగా నుందురు. ఈ పెండ్లి ఆయనంతట, ఆయన చేసికొనవలెనని లేదు.

కావలసినవాళ్లము మే మందఱము స్వయముగా నొక్కి చెప్పి యితరుల చేత చెప్పించి బలవంతపెట్టి మెడలు విరిచి వివాహము చేసికొనుటకు నప్పించినాము. ఈ వేళకు ఆయనభార్యపోయి 6 దినములైనది. 13 వ దినముననే వివాహము చేసికొనుట కాయన యంగీకరించినారు గనుక దశరాత్రముల లోపుగానే తాంబూలములు పుచ్చుకోవలెను. భార్యకు సాపిండమై మాశికము బ్రాహ్మలు లేచినతోడనే 12 రోజుననే తిరుపతికి పెండ్లికి ప్రయాణమై వెళ్ళుదురు. ఇతరసంగతులేవి గావలసినను నాపేర వ్రాసి తెలిసికొనవచ్చును.

దా, దామోదరరావు,
రుద్రపురము.

# ఆనందసమాజము

ఈ పేర నొక సమాజము, ఈ పట్టణములో రెండు సంవత్సరముల క్రిందట స్థాపింప బడినది. కాని యింతకాలమును యది రహస్యముగా నుండెను. ఇప్పుడు దానిని బహిరంగముచేసి దీనివలన కలిగెడు మహాలాభములు లోకులకందఱకు గలుగజేయువలయు నని మేము సంకల్పించినాము. ఈసమాజములో చేరినవారి కందఱకు కొంచెము వెలకుమాత్రమే బ్రహ్మానందము కలుగుచుండును. ఈ సమాజపు కార్యస్థానము రాత్రి 7 గంటలు మొదలు తెల్లవారుజాము నాలుగు గంటలవఱకు తెఱవబడియుండును. ఇందు సాధారణముగ పురుషులే చేర్చుకొన బడుదురు. స్త్రీలను మొదల్లనా చేర్చుకొనము

కాని వారుకూడ అప్పుడప్పుడు వచ్చి పురుషులతోపాటు బ్రహ్మానంద మనుభవింపవచ్చును. తల్లిదండ్రుల తగాదాలు లేనియెడల చిన్నపిల్లలను గూడ సందులో జేర్చుకొందుము. ఈసమాజముయొక్క ముఖ్యోద్దేశములివి, ఇదివఱకు మనదేశములో, ఎక్కడో కొందఱు మహాత్ములు తప్ప తక్కినవారందఱు, ముఖ్యముగ బ్రాహ్మణులు కల్లు సారా బ్రాంది మొదలయిన అమూల్యవస్తువులయొక్క మహిమ యెఱుఁగక వాటివలన వచ్చెడు సుఖము మహానందము అనుభవింపలేక చెడిపోవుచున్నారు. గనుక వాటియొక్క సేవ దేశములో చక్కగా వ్యాప్తముచేసి లోకులకు అపారమైన యానందము కలిగించుటయే యీసమాజముయొక్క ముఖ్యోద్దేశము. మేము లోకోపకారార్థమే యీమహాకార్యము తలపెట్టినాము కాని స్వలాభమునకు గాను. మేము చిఱకాలమునుండి యనుభవించుచున్న యీయానందమును మాఁవోడి మనుష్యులందఱకు గలుగజేయవలయునను ఉన్నతసంకల్పమే దీని స్థాపనకుఁ బ్రథమకారణము. మేము వేదాంతశాస్త్ర మభ్యసించితిమి. గావున "ఆత్మవత్సర్వభూతాని" యనునట్లందఱు మావలెనుండవలయునని మాసంకల్పము, ఈసమాజముయొక్క మూలధనముక్రింద వేయిరూపాయలు కావలయును. భాగము వకటికి పదిరూపాయలు చొప్పున నూరుభాగములువేసి యీసొమ్ము వసూలు చేయుదుము. భాగము పుచ్చుకోదలచినవారు జూను 30 తారీఖులోపుగ యీక్రింద సంతకముచేసినవారికి దరఖాస్తులు పంపవచ్చును. భాగము పుచ్చుకొన్నవారు డైరెక్టర్లగుదురు. వీరుగాక సామాన్యమెంబర్లు నెలకర్ధరూపాయచందా నిచ్చినపక్షమున చేర్చికొనబడుదురు. డైరెక్టర్లకు సామాన్యమెంబర్లకంటె యెక్కువ హక్కులుండును. డైరెక్టర్లు తాగియొడలు తెలియకయున్నపుడు దొర్లుటకు పరుపు లీయఁబడును. ఒక వేళ యింటి

నము పెట్టబడును. ఇంటికి వెళ్ళునపుడు గోడలమీద మనుష్యులమీద పడకుండ వెంట నౌకరుం(బ్రు)తోడు నీయబడును. మఱియు కావల సివచ్చినప్పుడు యింటివద్దకే కల్లు బ్రాంది మొదలయినవి పంపఁబడును ఈహక్కులలో నేవియును సామాన్యపుమెంబర్ల కుండవు. ఈమూలధన మునొక్క వడ్డి ధర్మకర్చుక్రింద వినియోగింతుము. ఆధర్మ మేదనగా త్రాగవలెనని సరదా, ఉండి డబ్బులేక గిజగిజ తన్నుకొని బాధపడు చుండు 'త్రాగుబోతులకు, అనగా ముఖ్యముగా తమ సొమ్మంతయు త్రాగుబోతుతనముక్రిందనే కర్చుపెట్టి సంసారము చితికిపోయి యున్న వారికి ఉచితముగా కల్లు సారా బ్రాందీ సప్లయిచేయుదుము. ఈకాల మందు స్వదేశీవిదేశీ భేదములున్నవిగనుక మాసమాజములో గూడవాటి కేర్పాటులు చేయబడినవి. స్వదేశీపద్ధతిలోని వారికి తాటికల్లు యీతకల్లు జీలుగుకల్లు యిప్పకల్లు వీటిసారాయిలు సప్లయి చేయబడును. స్వదేశీ వారికి గళాసులతో పుచ్చుకొనుట యిష్టముండదు గావున సత్తుగిన్నె లతో పుచ్చుకొనవచ్చును. దేవీపూజచేసి వామాచారములో చేరిన శిష్టులెవ్వరైన వచ్చినపక్షమున వారు పట్టుపంచెలు కట్టుకొని పుచ్చు కొనవచ్చును. ఈసమాజములో దేవతావిగ్రహములున్నవి. గనుక వాటికి నైవేద్యములుపెట్టి వామాచారులు త్రాగవచ్చును. విదేశీపద్ధతివారికి బ్రాందీ, విస్కీ, జిన్ను, ఓల్టాం, త్రీడాగర్లు, సల్వగుకప్పు, రమ్ము సారా మొదలయినవియు సోడాలెమ్నేడ్లు మంచుగడ్డ మొదలగునవి యు సప్లయిచేయబడును. అలవాటులేనివారికి వెలపరము రాకుండ కొన్ని సాధనములుచేసి, ఉద్ధరణెడుగాని చెమిచా చెమిచాడుగాని క్రమముగా, అలవాటు చేయఁబడును. ఇంటివద్ద భార్య పోరాటము, తలిదండ్రుల బాధలుగలవారందఱు, ఇదివఱకు చాల యిబ్బంది పడు చున్నారు. గనుక యీసమాజమువల్ల ఆయిబ్బందులు తొలగిపోవును. ఇందుకు గానుంచిన [illegible] చక్కగా [illegible] నౌకర్ల

నేర్పరచినాము. ఈనౌకర్లందఱు మిక్కిలి నమ్మకముగలవారు. ఈసమాజకులు పడవషికార్లు రైలుషికార్లు బండిషికార్లు తరుచుగా వెళ్ళుచుందురు- ఇందులో ఎం, ఏ, బి యల్ బియె మొదలుగు పరీక్షలలో తేఱినవారుండుటచేత జనులు భయపడి మన నేమియనజాలరు. అందుచేత మెంబర్లు స్వేచ్ఛగా విహరింపవచ్చును. ఒకవేళ కొందఱు మూర్ఖులేమైనను అన్ననూ యిందులో మెంబర్లుగానున్న వకీళ్ళ సహాయమున అట్టివారిమీద పరువునష్టపుదావాలు తెచ్చి ముక్కు నేలబెట్టి రాచివేయవచ్చును. మనము వీథులలో గుడ్డలు కట్టుకొనకుండ పెద్దపెద్ద యుత్సవములలో తిరిగినను ఈపట్టణములో మనజోలికిరాగలవారెవ్వరునులేరు డబ్బులేకనో డబ్బుకర్చుపెట్టలేకనో తమశరీరములకు పడకపోవుటచేతనో దీని గురించి యానందము ఎఱుగకపోవుటచేతనో ఓర్వలేమిచేతనో కొందఱు దౌర్భాగ్యులు తాము నీతిమంతులమని విఱ్ఱవీగుచు మావంటివారిని నీతిహీనులని తిట్టి రహస్యముగాను పత్రికలలోను అల్లరి చేయుదురు. కుక్కలు మొఱిగిన జంగము పరపతి పోవునా? మనము వాటిని లక్ష్యముసేయనక్కఱలేదు. మనపని మనకు జరుగవలెను కాని యెవరెట్లు అనుకొన్ననేమి? దీనిపరమార్థము వినుడు త్రాగుబోతులు లోకోపకారులు. ఏలయనగా మనలను నమ్ముకొనియే గదా యిజారాదార్లు లక్షలకొలది సొమ్మునకు పాటలుపాడుచున్నారు. మనలను నమ్ముకొనియేగదా చాలమంది షాపులబెట్టుచున్నారు. మనవంటివారి నాధారము చేసుకొనియేగదా యీరవుఖండములో ప్రతిదేశమందు కోట్లకొలది రూపాయల సారా తయారగుచున్నది. ఆ సారా తయారుచేయు కూలివాండ్రందఱు మనవలననే బ్రతుకుచున్నారు. అగ్లాసులు సీసాలు చేయు పనివాండ్రందఱు మనవల్లనే జీవించుచున్నారు అవి యోడలమీద తెచ్చుటవలన వేలకొలది యోడకళాసులు మనవలన బ్రతుకుచున్నారు. అది దిగుమతీ యెగుమతీచేసి

యనేకులు మనమూలమున, అన్నము తినుచున్నారు. ఇక్కడివర్తకులు, వర్తకుల దుకాణములలోనున్న నౌకర్లు మనవల్లనే జీవించుచున్నారు. వేయేల! లక్షలకొలది కోట్లకొలది జనులు మనవల్ల బ్రతుకుచున్నారు. ఈపని మనము మానితిమా యిన్నికోట్లమంది అన్నములేక పస్తుండ వలసినదేకదా. కాబట్టి తాగుబోతుతనము మానినవారికి మానిపించి నవారికి అనేకులకు జీవనాధారము తీసివేసిన మహాపాపము వచ్చును. కాబట్టి తెలివితక్కువవారిమాటలు విని చెడిపోక తెలివినిబడి లోకోప కారముచేసి బ్రహ్మానందమనుభవింపుడు.

రాజమండ్రి, } ఇన్నీసుపేట. }

తా. మదనగోపాలస్వామి.
జా. రాఘవరావు.

---

# ప్లీడరుతమాషా.

రంగము—ప్లీడరుగారి యిల్లు.

(అప్పుడు ప్లీడరు రాజారావుగారు, గుమస్తా గంగరాజుగారు ప్రవేశించుచున్నారు.)

రాజా—గంగరాజుగారూ! నేను గొప్పపరీక్షలు ప్యాసు అయినప్పటికి నాదగ్గఱకు పార్టీలు బొత్తిగా రాకపోవుటకు కారణ మేమి? తిన్నగా యింగ్లీషుముక్కలైన రాని ప్లీడర్లయిండ్లకు విశేష ముగా పార్టీలు యేల వెళ్లవలెను. ఓ, అంతే ధం రాని వాళ్లవద్దకు యెందుకు వెళ్ళుతారండి పార్టీలు?

గంగ—తమరు క్రొత్తవారనడం ఒకటి. రెండవది మనమిచ్చే కమీషను చాలదని యేజంట్లంటారు. మూడవది మీదగ్గర డాబు తక్కువ. పార్టీ దగ్గరకు రాగానే యీకేసంత మంచి కేసు లేదని తప్పక నెగ్గునని సొరకాయకోతలు కోసివేయవలెను.

రాజా—మనము నూటికి పాతికరూపాయలు కమీషు నిస్తూవున్నాముగదా! అంతకన్నా యెక్కువ యెవరిస్తారయ్యా! అదిగాక డాబుకూడా తక్కువ చెయ్యడంలేదు. మొన్నవచ్చిన ద్వారపూడి పార్టీలవద్ద కోసినకోతలు నీవు చూడలేదా! ఈకేసుకు సంబంధించిన క్రొత్తరూల్సు వచ్చినవనిన్ని మ నసబుగారు మనస్వాధీనమని నదురు బెదురు లేకుండా చెప్పి వకాల్తనామా పుచ్చుకోలేదూ!

గంగ—మనమిచ్చే కమీషను చాలదు. శేషాచలంగారు నూటికి నలభైరూపాయలిస్తున్నారు. అంతకంటె మనము కొంచెమైనా యెక్కువిస్తేనేకాని మనదగ్గరకు చేరరు. ఆపైన మనము పార్టీల సొమ్ము వాడుకుంటామని కొంచెము వాడుకపడినట్టు కనబడుచున్నది

రాజా—సరే కొంతకాలమువరకు మనము నూటికి యేభై చొప్పున కమీషనిస్తామని యేజంట్లతో చెప్పండి. పార్టీలసొమ్మంటే జ్ఞాపకంవచ్చింది. ఆలమూరి కాపులు స్టాంపులనిమిత్తం యిచ్చినసొమ్ము పూడినదా?

గంగ—పూడలేదు. దానికోసమే తంటాలుపడుతున్నాను. అదియిచ్చి నెల్లాళ్ళపైచిలుకయినది. మొన్న వాడు కనబడితే దాఖలుచేసినామని చెప్పినాను. రేపటితో కాలదోషంపడుతుంది. నాకేమి తోచడంలేదు. ఈసంగతివింటే మనయిద్దరికొంపాకూడా మునుగుతుంది. ఈలాచేస్తే—

రాజా—ఊరుకోండి. ఎవరో వస్తూన్నారు. (అని మీసముమీదచేయివేచికొని) హు ఆర్యా! ఎవరుమీారు. ఎందుకు వచ్చినారు

(అప్పుడు నాగిరెడ్డియను కాపు ప్రవేశించుచున్నాడు)

నాగి—దండాలుండి బాబయ్యా. ఈలోగిలెవరిదుండి.

రాజా—నీ కెవరిలోగిలి గావలెను?

నాగి—నాకండీ! ఆరెవరండి. ఆపెద్దపీడరు. ఆబుగ్గమీసాలా యన బక్కపల్చగావుంటారు.

గంగ—పేరెవరో చెప్పు?

నాగి—నాకు పేర్తెల్దండి.

గంగ—నిన్నెవరు పంపినారు.

నాగి—నర్సాండీ, అమలాపురంనుంచి, గంగాడరావుగారు, ఉత్తరంయిచ్చి పంపించారండీ. నాయేజ్జెం ఆకోరుటులో పోయిందండి. అపీలు దాకలు చేద్దాం అని వొచ్చానండి. ఇదిగో ఆరిచ్చి నుత్తరం.

రాజా—(పుచ్చుకొని తనలో) ఇది రంగారావుగారిపేర వ్రాసినారు. అయితే నేమిలే యెవరికి వ్రాసినారో యీవెధవకి తెలియదు గదా (అని యుత్తరము చింపి కవరు ముక్కముక్కలుచేసి పారేసి) మీగంగాధరరావుగారు నిన్ను నాదగ్గరకె పంపి యీయుత్తరము నాకే యిచ్చినారు. నీ అప్పీలు దాఖలుచేసి జడ్జీగారితో హోరాహోరీగా పోట్లాడి నీకేసు గెలిపిస్తాను. ఫీజు తెచ్చినావా? వకాల్తనామా వ్రాయించు. గంగరాజుగారూ, వకాల్తనామామీద వ్రాలుచేయించండి.

నాగి—పీ చంతా తేలేదండి.

రాజా—తెచ్చినమట్టుకు జమకట్టించవోయి తరువాత చూచుకొందాము. నీవెక్కడి కెడుతావు, నే నెక్కడి కెడతాను.

నాగి—చిత్తం చిత్తం. గంగాడరావుగారు చెప్పడం పీడర్కి బుగ్గమీసా లుంటా యన్నాడు. బక్కపల్సగా వుంటాడన్నాడండి.

గంగ—ఈయనే బుగ్గమీసాలప్లీడరు. ఈమధ్య వేసవికాలంలో చీపరగా వుంటుందని బుగ్గమీసాలు తీయించినారు. ఆయనమాత్రం

బక్కపల్చగా వుండక పెద్దలావుగా వున్నారా యేమిటి. ఇదిగో వకాల్తనామామీద వ్రాలుచేసివెయ్యి.

నాగి—చిత్తం (అని సందేహముతో వ్రాలుచేసి) ఖర్చులెన్నవుతాయండి.

గంగా—నీ వ్యాజ్యం అయిదువందల రూపాయలది కాదూ, అయిదు తొమ్మిదులు నలభైయైదు రూపాయలు స్టాంపు, ప్లీడరుఫీజు అయిదయిదు లిరువైయైదు రూపాయలు. వకాల్తనామా రూపాయి. వాలంటరి రూపాయి, సమనుబత్తెము మూడురూపాయలు, ఇంకా యివ్వవలసినవారికి మామూళ్ళు అయిదురూపాయలు.

నాగి—ఇదేటుండి. టాంపుకర్చులు నూటికి రు 7-8-0 గాదండి?

గంగ—నేనేమి అబద్ధమాడినానా యేమిటి. మునసబుకోర్టులో స్టాంపు డ్యూటి నూటికి రు 7-8-0 జడ్జికోర్టులో రు 9-0-0

రాజా—తక్కిన ప్లీడర్లులాగు మేము దగాచేసి పార్టీల సొమ్ము పహరించము.

నాగి—అప్పీలులో సమనుబత్తె మెందుకండీ.

గంగ—రికార్డు సమను చేయించవద్దు టోయీ? దానినిమిత్తం బత్తాలు కావా? నీకు మామీద నమ్మకం లేదేమి? కర్చులెక్కువ కట్టి నీనెత్తిని పేడరాసేవాళ్లమాటే నీవు వింటావు.

నాగి—కాదండి. అక్కడి ప్లీడరుగుమాస్తా ఇయ్యన్ని చెప్ప లేదండి.

రాజా—మునసబుకోర్టులో పడి యేడ్చే గుమస్తాలకు జిల్లా కోర్టు రూల్సు యేమి తెలుస్తాయి.

నాగి—(సొమ్మిచ్చి) బాబయ్యా. ఇందులో గట్టిగా పనిచేయించాలండి. మీపాదాలు నమ్ముకున్నానండి (అని వెళ్ళును)

గంగ—(నవ్వుచు) పీను టోపీలో బాగానే పడ్డాడు, ఇదిగో యీలారావలెనండీ పార్టీలు.

రాజా—ఈడబ్బుపెట్టి ముందు ఆలమూరుకాపుల వ్యాజ్యము రేపు దాఖలుచెయ్యండి. ఈపార్టీ రంగారావుగారివద్దకు వెళ్లవలసిన వాడు. ఆవుత్తరం ఆయన పేరనున్నది. నేనే ఆయననని పుచ్చుకొన్నాను. దీనివల్ల యేమీ ప్రమాదంరాదుగదా?

గంగ—తగాదా లేదు. శింగినాదంలేదు ఇల్లాంటివి రోజు లక్షతొంబై జరుగుతూంటాయి.



## రంగము 2.

(అప్పుడు ప్లీడరు రాజారావుగారు ప్రవేశించుచున్నారు.)

రాజా—(తనలో) ఎన్నికక్షూర్తులకు దిగినను నెలకు ఏబది రూపాయలు వచ్చుట కష్టముగా నున్నది. మఱి యేసిపార్టిమెంటులో నైనా పనిలో చేరుదామంటే తగినపని కనబడదు. ఇంటిఅద్దె యేభై రూపాయ లియ్యవలెను. అప్పుయిచ్చే వాడైనా లేడు. ఏమిచేయవల యునో తెలియకున్నది.

(అప్పుడు కాపు ప్రవేశించుచున్నాడు)

రాజా—ఎవరోయినీవు?

కాపు—నన్నెఱుగరూ; ఎవన్నకాడికి వచ్చింది వ్యాపారము. నేను మొజ్యం దాఖలు చెయ్యమని సొమ్మిస్తే మీరు దాఖలు చేశారు కారట మొదుచేతనూ. వాడుకొన్నారా యేమిటి.

రాజా—(కోపముతో) ఏమిటోయి పరువు మరియాదలు లేకుండా మాటాడుతావు. మాకు వాడుకొందుకు నీ వెధవడబ్బే కావ లెనా? నెలకు [illegible]  [illegible]

కుంటానా? నీసొమ్మంతా పోగుచేస్తే నేనిచ్చే ఇన్కంటాక్సు అంతలేదు. పెద్దమనుష్యులవద్ద యేలామాటాడవలెనో నీకు బొత్తుగా తెలియదని తోస్తుంది.

కాపు—అయినకాడికి లాంపు కొనమన్నసొమ్ము నాడుకోని నాకు మర్యాద తెల్దంటావా? నీపేడ రెంత నొవ్వెంత. అబ్బో; మరేద త్తెల్సినోడియి బైల్దేరావు. పూటకి టికానాలేని నీనంటి చప్పుపీనుగు కియ్యడం నాదేతప్పు. యేజ్జెం డాకలుచెయ్యక పైపెచ్చు నన్ను తిడ తావా? చూడిప్పుడు జడ్డీదగ్గరకెళ్ళి నీపరువంతా తీశేస్తాను.

రాజా—నీవ్యాజ్య మిదివరకే దాఖలైనది. కాలేదని నీతో యెవరు చెప్పినారు?

కాపు—ఇప్పుడే కాదూ! యేడ్డుగుమాస్తాగారు చెప్పారు.

రాజా—హెడ్డుగుమాస్తాగారా చెప్పినది. సరిసరి. మొన్ననొక వ్యాజ్యంలో యేమైనా కొంచె మిప్పించమంటే "చీ! నేనులంచాలి ప్పిస్తానా అటువంటి పనికిమాలినపని చేయను" అని మందలించినాను. అప్పటినుంచీ నామీద ఆయనకు కోపంగానుండి యీలాంటి అబద్ధ ములు చెపుతూన్నాడు. మాగుమాస్తా రాసి ఆయన నడుగుదుగాని.

కాపు—నీగుమాస్తా తలలుమార్చేవోడు. నీవు కొంపలు తీసే వోడివి. మీకిద్దరికీ సరిపోయింది. మద్దినాల కోర్టుకొచ్చి కనుక్కుం టాను డాకలు కాకపోయెనా నాతమాసా చూసుకో (అని వెళ్ళును)

(అప్పుడు గంగరాజు ప్రవేశించుచున్నాడు),

రాజా—ఏమండోయి గంగరాజుగారూ! ఆకాపువచ్చి అడ్డ మైనకూతలు కూసినాడు నిన్నవచ్చిన అమలాపురపుఅప్పీలులోకర్చుల క్రింద యిచ్చినసొమ్ము పెట్టి యీవ్యాజ్యం ముందు తగలెయ్యండి. ఊరుకుంటే పరువుదక్కేటట్టు లేదు.

గంగ— వాడన్నమాటలన్ని వింటున్నానండి. నేను వాడుండ గానే వచ్చినాను కాని యెదరపడితే నామీదపడి యేమన్తాడని, ఆదం పుళ్ళ గదిలో దాగున్నాను. ఈవేళ తప్పక దాఖలు చేస్తాను.

(అప్పుడు రామచంద్రయ్య అను యేజంటు ప్రవేశించుచున్నాడు,)

గంగ—ఓహో! రామచంద్రయ్యగారూ! మామీద నేటి కనుగ్రహం పుట్టినట్లున్నది. దయచేయండి. (ప్లీడరుగారితో) ఈయన మంచిరాజు రామచంద్రయ్యగారండి. చాలా పలుకుబడియున్నవారును మంచివారును.

రాజా—(లేచి) దయచేయండి రామచంద్రయ్యగారూ! (అని కుర్చీచూపించి) మీపేరు వినడమే కాని యెన్నడు దర్శనము చేయలేదు నేటికి సంప్రాప్తమైనది.

రామ—నేనుకూడా మీదర్శనం చేయవలయుననే ఆలోచిస్తూ న్నాను. కాని తీరుబడిలేదు. నేను కృష్ణా రామా అని ముక్కుమూసి కొని కాలక్షేపం చెయ్యాలంటే వూళ్ళోవారు నన్ను ఊరుకోనియ్యరు. అన్నివ్యవహారాలు తెలిసినవాడను పెద్దవాడను ఘరానాకుటుంబము లో వాడను, అగుటచేత నేనురాను మొర్రోఅనుచున్నా నన్ను పార్టీలు తీసుకొనివస్తారు. ఇప్పుడువచ్చినపనివినండి ఒకమేస్త్రీటుకేసులో మీరు పనిచెయ్యాలి. అందులో నూరురూపాయలు ఫీజునిర్ణయిస్తాను. నాకు కమీషను యేమిస్తారో తెలియచెయ్యండి.

రాజా—నేను కమీషను గిమీషను యిచ్చే ప్లీడరును కాను. కమీషనుయివ్వడం లాప్రకారం చాలాతప్పు.

రామ—అయితే మీరు ప్లీడరీ చేసినారే. ఈశ్రీరంగనీతులు నేనెఱుగనివికావు. ఇప్పుడు రెండేసిలక్షలు సంపాదించి తెగనీలుగులు బలిసి గుట్టిపుబండ్లెక్కి తిరుగు పెద్దప్లీడర్లందరిదగ్గర చెప్పటువచేసి కమీ

వను లాగినవాడినే. తల్లిపుట్టిల్లు మేనమామలదగ్గరదాగదు. అయితే నేనుశెలవుపుచ్చుకొంటాను. (అని లేచును)

గంగ—రామచంద్రయ్యగారూ! మీరొక్కమాటు దయచెయ్యండి. నేను మనవిచేస్తాను. (అని దొడ్డిలోనికివెళ్ళి) రాజారావుగారూ! దయచెయ్యండి;

రాజా—(వెళ్ళి) ఏమికమీషనిమ్మంటారతనికి?

గంగ—ఏలాగో ఒకలాగు వప్పుకుందాము. ఇతని నమ్ముకుంటే కావలసినన్ని కేసులు వస్తాయి. ఇతనిచేతిక్రింద నూరుగురు పార్టీలున్నారు. ఎంత కమీషనడిగినా యితనిని వదలతగినదికాదు. ఇందులో నలభైయో ఏభైయో దొరకినపక్షమున యింటి అద్దెక్రింద కొంత బియ్యపుబాకీ కొంత యిచ్చివేయవచ్చును. వాళ్ళు తొందరపడి వ్యాజ్యాలు వేస్తామంటూన్నారు అందుచేత నామాట వినండి.

రాజా—సరే! నీయిష్టమువచ్చినట్టు చేయవచ్చును.

(అని వెళ్లును.)

గంగ—రామచంద్రయ్యగారూ ఇల్లా దయచెయ్యండి.

రామ—(వెళ్లి) మీప్లీడరుగారు వట్టి వెఱ్ఱిపప్పలాగున కనబడతాడేమి?

గంగ—ఆయన రూలుప్రకారం వెళ్ళేవారు. చాలా కరకట్టు మనిషి. అయితే నేనిప్పుడు మెడలు విరిచినాను లెండి మీరిప్పుడేమి కమీషను కోరుతారో కోరండి.

రామ—నాకు రు 60 లకు చిల్లిగవ్వతక్కువయితే పుచ్చుకోను.

గంగ—రు .0 పుచ్చుకొనుడు.

రామ—మహామహా వాళ్ళు యేభై యిస్తూన్నారు. ఈయన క్రొత్తవాడుగదా నాలుగు కేసులు వప్పచెప్పవలెనని వచ్చినానుకాని నాకు కమీషను దొరకకకాదు.

గంగ—సరే మీ యిష్టమువచ్చినట్లు చేయించండి. ముందు రొక్కముమాత్రము చేతిలో పడవేయించండి.

(అని అందఱు నిష్క్రమింతురు.)

రంగము 3.

(రాజారావుగారియిల్లు, అప్పుడు గుమాస్తా గంగరాజు ప్రవేశించు చున్నాడు.)

గంగ—(తనలో) నేనేమి చేయవలెనో నాకు తోచకున్నది. గుమాస్తావనిలో ప్రవేశించిన తరువాత పట్టణవాసపు కాపురముగుట చేత నులమల మాడిపోవుచున్నాను. చింతలపూడిలో బడిపెట్టుకొన్న పుడే నాపని యింతకంటె బాగున్నది. బుద్ధి గడ్డితిని యేమో బావు కుందామని ప్లీడరుగుమాస్తాలో ప్రవేశించినాను. నా యదృష్టముకొలది యీజైనమ్మప్లీడరే దొరికినాడు ఈయనగారికి నోట్లో ఉప్పుపత్రిలేదు. ఏ పార్టీని టోపీవేశి తీసుకువచ్చినను వాడికేసు తగల వెయ్యడమే, ప్లీడరికే రు 30 యలు రానప్పుడు గుమాస్తా ముండావాడికేమొస్తుంది. ఈయనదగ్గఱ మానివేసి మఱెక్కడనైనా ప్రవేశించవలెను.

(అంతలో నొక మనుష్యుడు ప్రవేశించును.)

గంగ—ఎవరోయినీవు?

మను—సేసగిరిరావుగారిల్లు ఇదేనాండి?

గంగ—ఎందుకు శేషగిరిరావుగారు?

మను—మా యేజెముందండి. ఆయన కొకాల్తనామా యివ్వాలుండి.

గంగ—నీవెక్కడో ఆడివిమనిషివి లాగున్నావు? శేషగిరిరావు గారు ప్లీడరీమానివేశి యీ యూరినుంచి వెళ్ళి యెన్నాళ్ళయినది—

మను—మా నేశి యెల్లినారండీ. మాకిందికోట్టు ప్లీడరుగారు ఆయ నున్నారు ఆయనకే యిమ్మని చెప్పారండి.

గంగ—పాపమాయన మెఱుగరు. ఆయన కీయూళ్లో యింటి అద్దెడబ్బులైనా కిట్టకపోవడంచేత యీ యూరునుంచి దుకాణంయెత్తి బరంపురం, అటికేసి వెళ్ళినారు మానివేసి రెండు నెలలయినది.

మను—ఆలాగైతే మరొకరికిచ్చుకోవాలి.

గంగ—ఎవరికో యెందుకు. యీ యిల్లురాజారావు పంతులు గారిది. అయనకే వకాల్తనామా యియ్యి. ఈయన నెలకైదారు వందలు సంపాదించుచున్నారు. మొన్న జడ్జీగారు సబుజడ్జీపని యిస్తాము వెళ్ళుమని యెన్నివిధాలో బ్రతిమాలితే, మీ సబుజడ్జీ జీతం నాకు రెండు కేసులలో వస్తుంది, నేను వెళ్ళనని నిరాకరించినారు. ఈయన వాదం చేస్తూంటే జడ్జీగారు చిఱునవ్వునవ్వుచు చెవులు నోరబెట్టుకు వింటారు. లా అంతా కూడా చెరిగివేస్తారుగాదూ! ఈయన యెదర రెండవప్లీడరు నోరెత్త లేడు.

మను—అయితే యీయన ఫీ జెల్లాపుచ్చుకుంటారండి;

గంగ—ఫీజు కేమోయి, నీ యిష్టమువచ్చినట్టు పుచ్చుకొంటారు.

మను—వకాల్తనామా వ్రాయించుండి.

గంగ—సరే(అనివ్రాసి వ్రాలుచేయించును)

మను—డబ్బు మద్దాల కోట్టుకు పట్టుకొని వస్తానుండి. ఈ కాయితాలుచ్చుకోండి.

గంగ—(కాగితము లుపుచ్చుకొని) తప్పకుండారా? మాకు చాలా డబ్బు వస్తూందని ఓర్వలేక కొందరు నీతో యేమైనా అబద్ధాలు చెప్పగలరు. అవినమ్మకు. కోర్టులో యెవరితోను మాటలాడకు. కోర్టుకు వచ్చుటకంటె సాయంకాలము యిక్కడికేరా? అక్కడ నీతో మాట్లాడుటకు తీరికయుండదు. ఊపిరి సలుపకుండా మాకు పనియుంటుంది.

మను— ఎక్కడికో అక్కడికొస్తాను (అనివెళ్ళును.)

రాజా—(లోపలినుండివచ్చి) ఏమండో గంగరాజుగారూ! మా చెడ్డదాబుచేశారే. మీకు సమయస్ఫూర్తి చాలాయుందండి. శేషగిరి రావుగారు యీయూళ్ళోనే లేరని చెప్పివేశారు. మనమిల్లా చెప్పినా మని తెలేస్తే చిక్కులువస్తా యేమోనుమండీ.

గంగ—చిక్కులు లేవు గిక్కులు లేవు. తమరూరుకోండురూ. ఇంత మాత్రము నేను సర్దుకోగలను. ప్రస్తుతము నేను సెలవుపుచ్చుకొని వెళ్ళుచున్నాను.

(అని ఇద్దరు నిష్క్రమింతురు.)

---

రంగము 4

రాజమహేంద్రవరము బజారువీధి.

(అప్పుడు వెంకటస్వామియను రయితు ప్రవేశించుచున్నాడు.)

వెంక—అయ్యా! రాఘవరావు నాయుడుగారిల్లెక్కడండీ!

మార్గస్థుడు—నాకు తెలియదు

గంగ—ఎందుకు రాఘవరావు నాయుడుగారియిల్లు? నీకేదైనా కేసున్నదా యేమిటి?

వెంక—చిత్తం, మాదో అపీలుందండి. దాకలు చెయ్యాలండి.

గంగ—ఆయనదగ్గరకు నిన్నెవరుపంపించారు. జాబుఅంపినవాడు నాకన్న తెలివైనవాడులాగున్నాడు.

వెం—(తెల్లబోయి) ఏమండి బాబు అల్లా సెలవిస్తూన్నారు.

గంగ—నాకెందుకులే నీ కర్మంనీది (అని నడచును)

వెంక—(వానివెనుకవెళ్లి) పంతులుగారు అదేంటో సెలవీయ్యాండయ్యా!

గంగ — నేసెలవియ్యనక్కర లేదు. ఆయనకు కేసిచ్చిన తరువాత నీకే తెలుస్తుంది. నీవు బుద్ధిపూర్వకంగా గంగలో దిగుతానంటుంటే నేను వద్దనడ మెందుకు.

వెంక — బతిమాలుకుంటూన్నాగాదండి బాబూ. అదేమిటో చెప్పండి?

గంగ — నీవు వట్టి వెఱ్ఱిమాలోకమని తెలిసి యుండికూడా క్రింది కోర్టుప్లీడరీయనదగ్గర కెల్లా పంపినావయ్యా! పార్టీల క్షేమంచూచే ప్లీడర్లు దొరకడం కష్టమండీ!

వెంక — నామనవి చిత్తగించి అదేమిటో సెలవియ్యండీ!

గంగ — సెలవియ్యడానికేముంది. ఆయనకు వకాల్తనామా యిస్తే నీకేసు భగ్గంపాడు. ఆయన లాంగ్‌ దీంగ్‌ వేసుకొని గుఱ్ఱబ్బండెక్కి వన్నెల విసనకర్రలాగు కోర్టుకు వెళ్లడమేకాని కేసుచదవడు. చదివితే అర్థంకాదు. పయిగా జడ్జీగారు అస్తమానం ఆయనను కస్సుబుస్సూమని కసిరిచీవాట్లు పెట్టుతూ నేయుంటారు. ఆయనమాట ఒకటీ సబబుగానుండదు. లా అసలేరాదు. వట్టిగొడ్డుకు అర్పులన్నట్టు పెద్ద గొంతుకమాత్రమున్నది.

వెంక — ఆలాగాండి బాబు యింతమాల గొడవుందని మాకేం తెలుస్తూందండి. మంచివాడనిచెప్పి ఆయన వెల్లమంటే కాబోసునను కొని చెప్పివచ్చాను. నారోజు బాగుందిగనుక బగమంతుడులాగ మీరగపడ్డారు. మీ రెరిగిన ప్లీడ రెవరైనా యుంటే నన్నాయనదగ్గరకు తీసుకొని వెళ్ళండి,

గంగ — అదిగో బాగుపడే దానికి వచ్చినావు పద వెళదాము!

(అని వెళ్ళుదురు.)

## రంగము 5.

(జిల్లాకోర్టులో ప్లీడర్ల గది.)

(అప్పుడు కుర్చీలమీద కూర్చుండి హనుమంత రావుగారు, భాస్కరరావుగారు, గోపాలంగారు, రాజారావుగారు, రంగారావుగారు శేషగిరిరావుగారు, మఱికొందఱు బ్రవేశించుచున్నారు.) వసారాలో కొందరు పార్టీలు నిలిచియున్నారు.

హను—భాస్కరరావుగారూ; నిన్న మునసబుకోర్టులో మీ వ్యాజ్య మేమైనది.

భాస్క—ఏమైనదని చెప్పనండి మునసబుగారికి ఫలహారమైనతరువాత కొంచెము డోజు అలవాటు గదా, మా కేసు అందులో బడి భగ్గంపాడైనది. నేను వాదించినంతసేపు, అయన జోగుచునే యున్నారు.

గోపా—మీ కేసు పోవడానికది రీజను కాదండోయి. రెండవ పక్కను గాని కొంచెము హిరణ్య శ్రార్ధం తగిలినట్టు కనపడుచున్నది ధోరణచూస్తేఅల్లాగున్నది.

రాజా—నొ. నొ. సార్. నే నామాట వప్పుకోను. మన మునసబుగారివద్ద, అట్టి దుర్గుణం లేదు. ఏమండీ శేషగిరిరావుగారూ మీ రెప్పుడైనా విన్నారండి యిటువంటిమాట.

శేష— నా జోలికి రాకండి నన్నేమి అడగవద్దు.

రంగా—రాజారావుగారూ? మునసబుగారి గుణాలు మీ గుణాలు వకటే గనుక మీ కాయనయందు మిక్కిలి యభిమానమండి

రాజా—(కోపముతో) డోన్‌టాక్ నాన్సెన్సు. అటువంటి నీచపుగుణములు మా యింట్లో కుక్కకయినా లేవు. ప్రాక్టీసువచ్చినా రాకపోయినా సరేగాని నేనటువంటివాటికి వడబడే వాడను కాను.

నేను ప్రిన్సిపిల్సు కోసము కేసుచేసేవాడనుకాని డబ్బుకోసము కేసు చేసే వాడనుకాను.

రంగా—అబ్బో ఇన్నిప్రిన్సిపిల్సు మీ దగ్గరున్నాయన్నమాట నే నిదివఱ కెప్పుడు నెఱుఁగనే మీ ప్రిన్సిపల్సును గురించి అమలాపురమునుంచినాకు జాబువచ్చి మూడురోజు లయినది. పోసీ యెందు కెందుకని, ఊరుకుంటూన్నాను. ఇదిగో ఉత్తరం. జేబులోనేయుంది.

శేష—అదేమిటండ్డోయి. ఆ యుత్తర మేమిటి.

రంగ—అమలాపురంనుండి గంగాధరరావు వ్రాసినాడండీ. హనుమంతరావుగారూ! యీ లెటరు మీరు చదివి వినిపించండీ.

హను—ఏదీ యీలాగియ్యండి (అని పుచ్చుకొని యీ క్రింది విధమున చదువును)

"మైడియర్ రంగారావు' ఈమధ్య నేను అప్పిలు మీ ద్వారా దాఖలుచేయుమని మీవద్దకు ఒక క్లయింటును బంపినాను. వాడు మీ యిల్లెఱుఁగక మఱియొక ప్లీడరింటికి వెళ్లి రంగారావుగారి యిల్లెక్కడని యడుగగా, ఆ ప్లీడరు నేనే రంగారావును అని యబద్ధమాడి వాని వద్ద వకాల్తనామా పుచ్చుకొన్నాడట. రంగారావుగారికి బుగ్గమీసా లుండవలె మీకు లేవేమని వాడు ఆ ప్లీడరును అడుగగా వేసవికాలం చిరాకుచేత తీసివేయించుకొన్నానని ఆయన చెప్పినారట. ఇది మిక్కిలి ఘోరకలిగా నున్నది, యిటువంటి ప్రబుద్ధుడు రాజారావేయై యుండవలెను. గాని మఱియొకడు కాడని తోచుచున్నది. అయినను దరియాప్తు చేయవలెను.

అమలాపురం. చిత్తగించవలెను.
15-8-1912. గంగాధరరావు.

రంగా—చిత్తగించినారా ప్రిన్సిపల్సు

రాజా—ఈ యుత్తరం కేవలము అబద్ధము. కవరుమీద పై పేరు నాదేయున్నది.

భాస్క—ఆవేళ ఆ మనిషి ఆకవరు తీసికొని ముందు మా యింటికివచ్చి రంగారావుగారి యిల్లెక్కడ అని అడిగినాడండీ! పైకవరు మీద రంగారావుగారిపేరేయున్నది.

రాజా—పేరింగ్లీషుతో నున్నది. జి అనే అక్షరమునకు జె అనే అక్షరమునకు భేదము తెలియుటలేదు. అందుచేత నాదే అనుకున్నాను.

భాస్క—(నవ్వుచు) పేరు స్పష్టముగా తెలుగులో రంగారావుగారికి అని యున్నది. ఇంగ్లీషులో లేదు.

రాజా—మీ రందరు కట్టుగట్టి నన్నల్లరి చెయ్యాలని యీలాగంటే నేనేమిచెప్పను.

రంగా—ఊరందరూ మీ మీద కట్టుగట్టుటకు కారణమేమి? మీ ప్రిన్సిపల్సు మంచివిగనుక మీ మీదందరికి కోపముకాబోలు. బియేబియల్ ప్యాసై యిటువంటి అవకతవక పనులు చేసినందుకు సిగ్గుపడి తల వంచుకొనక మీరు మిక్కిలి మెరుగుతావెందుకయ్యా!

భాస్క—ప్లీడరీలో ప్రవేశించిన తరువాత కొద్దో గొప్పో మాలకూటిపనులు మేము చేయుచున్నాము కాని యింత ఘోరకలి కూడదు.

హను—రంగారావుగారూ, ఏదో పొరబాటు జరిగినది పోనియ్యండీ. ఊరుకోండీ.

రంగా—నే నూరుకోదలచుకొన్నానండీ. ప్రిల్సిపల్సు ప్రిన్సిపల్సు అని సొలుకాయకొ తలు కొస్తూంటే యుత్తరము బయలు పెట్టినాను.

(అప్పుడు వసారాలోనున్న మనుష్యులలో నొకడు
శేషగిరిరావుగారిదగ్గరకు వచ్చును.)

మను.—సేసగిరిరావుగారు మీారేనాండి

శేష—ఆ నేనే యెందుకు?

మను—తమరీ యూళ్ళో పీడరీ చేస్తూన్నారాండీ.

శేష—చేయ్యకేమి, ఎవరైనా లేదని చెప్పినారా యేమిటి నీతో;

రాజా(లేచి వెళ్లిపోవును.)

శేష—రాజారావుగారూ వెడతారేమి కూర్చోండి. ఈ మనుష్యుడు చిత్రకథ చెప్పుచున్నాడు వినండి.

రాజా—(ఆమాట వినిపించుకొనకుండ వెళ్ళిపోవును.)

మను— మీా కీయూళ్ళో డబ్బు రావడంలేదనిన్ని యింటి అద్దైనా గిట్టకపోవడంచేత యే యూరో వెళ్లిపోయినారనిన్ని ఎవరో పీడరుగుమాస్తా చెప్పాడండీ.

శేష—ఎవరో ఆయనపే రెఱుగుదువా!

మను—పే రెఱుగనండి. నల్లంగా బక్కపల్చగా పొడుగ్గా యుంటాడండీ

హను—అయితే రాజారావుగారి గుమాస్తా గంగరాజుగారే

భాస్క—ఇంత ప్రబుద్ధుడు మరెవ్వరు కనబడరు

రంగా—అందుచేతనే రాజారావుగారంత తొందరగా వెళ్ళుచున్నారు

శేష—అప్పుడు ప్లీడరుగారు కూడా సావిట్లో నున్నారా?

మను—సావట్లో లేరు లోపలున్నారండి

శేష—హనుమంతరావుగారూ మనమిా యూళ్ళో యిక ప్లీడరీ చేయ లేమండీ పడవలపోటీలాగున వచ్చింది.

హను—నిజమేనండి మరియొక చిత్రము చెప్పుతాను వినండి ఈ మధ్య గ్రామమునసబు నాతో చెప్పినాడు. మన ప్రబుద్ధులలో ఒక రతని దగ్గఱకు వెళ్ళి తనకు సాలుకు మూడువేలు వచ్చేటట్టుగా యిన్కంటాక్సు కట్టమని బ్రతిమాలినాడట

భాస్క—అబద్ధమేమోనండీ పన్ను కట్టమని బ్రతిమాలేవా రుంటారా?

శేష—ఉండకేమండోయి తను సాలుకు మూడువేలువస్తూన్న వని డాబుగా చెప్పుకొనుటకై ఆ పనిని చేసియుంటాడు మనలో నెం తెంత మహాత్ములైనా యున్నారు ఇట్టివారున్నారు, అట్టివారు లేరని అనుకోవలసిన పనిలేదు.

హను—అదిగో జడ్జీగారు వచ్చినారండోయి వెళుదామురండి

(అందఱు నిష్క్రమించుచున్నారు)

---

# విజ్ఞాపనము

నేను మునిసిపల్ కమీషనరుపనికి దరఖాస్తుచేయఁ దలఁచు కొన్నాను. కాఁబట్టి వోటర్లందఱు నీక్రింది విజ్ఞాపనమును శ్రద్ధతో జదివి తమవోట్లు విధిగా నాకిచ్చి యితరులచేత నిప్పించి తమ యర్హ కృత్యములను చక్కగా నెరవేర్చుకొందురు గాక యని కోరుచున్నాను.

నన్ను మీవార్డుకు కమీషనరుగా నేర్పరచుకున్నపక్షమున యీయెలక్షను సమయములో నేతప్ప మఱియెన్నడు మీ వార్డులోకి నేను రాను అని ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. మీరందఱు పెం డ్లాము బిడ్డలతో కాపురము చేయుచున్నారుగదా. మీకెన్నో యిబ్బం

దులుండవచ్చును. న న్నేర్పరచుకొన్నపక్షమున మీ కేయిబ్బంది లేకుండ పనిచేసెదను. ఎట్లనఁగా మీ యిండ్లలోనుండి మురికినీళ్ళు రాత్రిగాని పగలుగాని యెన్నిసారులు వీధిలోనికి వచ్చినను మీకు ప్రాసిక్యూషను అన్నమాట లేకుండా చేసెదను. మీ రెప్పుడైనా మునిసిపల్ స్థలము కలుపుకోవలసిన అవసరము వచ్చినప్పుడు నేను మీ పక్షముననేయుండి రాత్రికి రాత్రి ఆస్థలము మీకు కలిపి గోడ కట్టించి తక్కిన మునిసిపల్ కమీషనర్లు యేదైనా తగాదా చేసినపక్షమున నేను మీతో కలిసి "యీగోడ వీరిదే 25 సంవత్సరములనుండి నే నెఱుఁగుదును." అని గట్టిగా వాదము చేసి నాపత్రిజ్ఞయంతయు వినియోగించి ఆస్థలము మీకు దక్కునట్లు జేసెదను. ఒకవేళ నే నెన్ని ప్రియత్నములుచేసినను ఆస్థలము మునిసిపల్ వారు మీ కియ్యనిపక్షమున నేను మీచేత మునిసిపల్ వారిమీద వ్యాజ్యములు తెప్పించి నేను మీతరపు సాక్ష్యమిచ్చెదను. క్రొత్తగా అరుగులు వేసుకోదలచినవారికి అరుగులు వేయించెదను. మారులు పెంచుకోదలచిన వారికి తప్పకుండా శాంక్షను యిప్పించెదను. ఘాటీపాకలు మొదలయినవి వేలముచేయునపుడు నాపక్షమున నున్నవారికి తక్కువపాటకు కొట్టివేయుటకై నాయావత్తుశక్తి వినియోగించి నేను కొట్టివేయించెదను. మునిసిపల్ రోడ్డుకంట్రాక్టర్లు మొదలగువారలందఱు నాతరపున యీయెలెక్షనులో తప్పక పనిచేయవలయునని కోరుచున్నాను. నాకు వారీయుపకారము చేసినయెడల వారికిఁగూడ సాధ్యమయినంత యుపకారము చేసెదను. నేను వారికిజేసెడు యుపకారమేమనగా కంట్రాక్టర్లు రోడ్డుమీద యెంత పనికిమాలిన కంకర తెచ్చిపోసినను అది మొదటిరకం కంకరని వాదించి చెల్లునట్లు చేసెదను. రోడ్డువేయుట కెంతకాల మాలస్యముచేసినను అతని కేవిధమైన యిబ్బంది రానియ్యను. పరి... రెండుసారులు

వార్డులోనికి నెళ్ళి విజ్ఞాపీగునట్టి తెలివితక్కువ కౌన్సిలర్లు కొందఱు రోడ్లు బాగు లేవని మిషోలు వగయిరాలు పెట్టినప్పుడు నాబుద్ధియంతయు నే నుపయోగించి కౌన్సిలర్లను తప్పవారిని బెట్టి వాళ్ళమాట చెల్ల కుండ జేసెదను. నేను చేసిన యుపకారములకు వోటర్లుగాని కంట్రాక్ట ర్లుగాని తక్కిన వార్డులలోనుండు జనులుగాని సంతోషించి నాకు యిటుక సున్నము లేక రొక్కము బహుమానములుగా నియ్యదలచిన పక్షమున కొందఱు అవకతవక కౌన్సిలర్లవలె "నాకు లంచమిస్తావా నేను లంచము పుచ్చుకుంటానా" అని బడాయిమాటలు చెప్పక తెగనీలగక వోటర్లమనస్సులకు సంతోషము కలిగించుటకై వారు తెచ్చిన బహుమానమును శిరసావహించి నేను పుచ్చుకొందును. ఈపైన జెప్పిన యుపకారములేగాక యింకను కౌన్సిలర్లు వోటర్లకు చేయదగిన యుపకారము లెన్నోయున్నవి. ఆరహస్యములన్నియు నిక్కడవ్రాయుటకు వీలులేదు. ఏవిధముచేత వోటర్లుగనుండుటకు వీలులేనివారు, వోటర్లు కాదలచిన పక్షమున యేదోయొక యుపాయము పన్ని వారిపేర్లు జాబితాలో పడునట్లు నేను ప్రయత్నము జేసెదను. అట్లు వారిపేర్లు పడినతరువాత వారివోట్లు తప్పక నాకే యివ్వవల యును. నాకు వోట్లియ్యదలచినవారు సరే మీచిత్తము తప్పక మీకే యిస్తాము అని చెప్పినంతమాత్రముచేత చాలదు. నాకియ్యదలచిన వారు నాచేతిలో చేయి వెయ్యవలయును. రామాయణము భారతము నెత్తిమీద బెట్టుకొని ప్రమాణము జేయవలయును. బ్రాహ్మణులు కోమట్లు మొదలగువారు గాయత్రిసాక్షియని జందెముమీద ఒట్టు బెట్టుకొనవలెను. పిల్లల తలకాయలమీద చేయిపెట్టి ప్రమాణము జేయవలయును. అన్నము తినుచున్నప్పుడు మీవద్దకు వోట్లడుగుటకు వచ్చితినా, అప్పుడన్నముమీద ప్రమాణము చేయవలెను. ఇట్లు చేయకపోయినపక్షమున మీమాట నా కంతమాత్రమును నమ్మకముం

డదు. ఇట్లుచేయని వారు నాకు వోట్లు ఇయ్యలేదని యే నేను తలంచె దను. ఎంతరహస్యముగా వోట్లు వేసినప్పటికి ఎవరు యెవరికి వోట్లిచ్చి నారో తెలిసికొనుటకు నాదగ్గర అద్భుతమైన శక్తియున్నది. కాబట్టి అది తెలిసికొని నేనే కౌన్సిలరునైన పక్షమున వారిపాట్లు వారికి బెట్టె దను. ఇంక నాకు వ్యతిరేకముగా వచ్చి కౌన్సిలరుపనికి ప్రయత్నము చేయునట్టి వారిసంగతి కొంత చెప్పెద వినండి. నాప్రతిపక్షులందఱు దుర్మార్గులు. నీతిమంతులమని వారు పైకి విఱ్ఱవీగుచుందురే కాని వారు నిజముగా జనులకు ఘాతకులు, ఉపకారశూన్యులు, ఆపక్షమువా రెవరైనను కౌన్సిలర్లుగా వచ్చినపక్షమున మీకర్మము కాలినదన్న మాటే. ఏమనగా వీధులు శుభ్రముగా నుండవలెనని పిచ్చివారలవలె కేకలువేయుచుప్రతిదినమువార్డులో రెండుమూడుసార్లుతిరిగి మీకొంపముల లోనుండి యొక్క నీళ్ళచుక్కయైనా వీధులోనికి రానియ్యరు. ఒక్క జానెడు స్థలము కలుపుకొనుటకు వీలులేదు. ఒక్క అరుగు పెంచు కొనుటకు వీలులేదు. మాకు వోట్లిచ్చినవారిలో బీదవారికి మేము లంచముక్రిందగాక వాళ్ళపేదసంసారములుచూచి జాలిపడి నాలుగు మూడు రూపాయ లిచ్చుచుందుము. మాప్రతిపక్షులు, శూన్యహస్తు లు శుష్కప్రియాలు గలవారు గావున నొక్కదమ్మిడీయైన్వ లెన్నడు నీయరు. మీదుమిక్కిలి మావంటి సధర్ములెవరైనను పేదవారి కిటు వంటి దానములు చేసినప్పుడు అవి యాగీచేసి లంచము లిచ్చుచున్నారు లంచములిచ్చుచున్నారని అడ్డమైన కాఱుకూతలు కూయుదురు. కా బట్టి పైసంగతులన్ని మీమనస్సులో చక్కగా ఆలోచించుకొని మను ష్యుల కుపకారములు చేయుటను కంకణముకట్టుకొన్న మాపక్షము వారినే నమ్ముకొని నాకు మీవోట్లు ఇయ్యవలసినదని యిందుమూల ముగా మఱి మఱి గోరుచున్నాను. చిత్తగించవలెను.

1937 సం॥ మార్చినెల 33 తేది } ఇట్లు మీవిధేయుడు
రామ్నువర్గం భగేశ్వరం } జంబుకేశ్వరావు.

# తోకచుక్క మహిమలు

తోకచుక్కలవలన గలిగిన మహాద్భుతములు వర్ణించుటకు వీలుగానన్ని యున్నవి. ఇవి ప్రపంచమంతటను గలవుకాని మన ప్రాంతములయందు జరిగిన యద్భుతములను గొన్నింటి నీక్రింద నుదహరించుచున్నాము. లోకమందు జరిగిన చిత్రములనన్నింటిని బ్రకటించుట యెవరికితరముగాదు కావున స్థాలీపులాకన్యాయముగ గొన్నిటిని మాత్రమే ప్రకటింపవలసివచ్చినది.

— : చిత్రములు : —

అప్రయోజకులైన పెండ్లికొడుకులుగూడ 1116 రూపాయలు వరదక్షిణ అడుగుట. బహిరంగముగా వైభవముతో జరుగవలసిన వివాహములు రహస్యముగ జరుగుట. గ్రామములలోనున్న ముఖ్య వర్ణములవారిలో నొకరికొకరికి కొందఱు బుద్ధిమంతులు వివాదపెట్టుట. ఆమాటలనమ్మి, ఆవర్ణములవారు, ఆరని వైరములు పెట్టికొనుట. మునిసిపల్ చెయిర్మనులకు, చెల్లవలసిన వోట్లు చెల్లకుండ జేయవలయునను బుద్ధిగలుగుట. కొన్నికచ్చేరీలలో జనులిచ్చుకొన్న అర్జీలు మొదలైన కాగితములు రికార్డులు కావలసివచ్చినప్పుడు కనబడకపోవుట. వోటర్లుగానుండదగిన వారిపేరులు జాబితాలలో లోపించుట. ఏవిధముచేత ఓటర్లు కాగూడనివారిపేరులు వాటిలో నగుపడుట. నాలుగేండ్ల క్రిందట చచ్చిపోయినవారు క్రొత్తగా ఈసంవత్సరము ఓటర్లగుట. ఒకవార్డులో ఓటర్లుగానుండదగినవారు మఱియొకవార్డులోని కెగిసిపోవుట. లంచములు పుచ్చుకొనునట్టివారియెడనే ప్రజలకు మిక్కిలి ప్రీతియు న్యాయవర్తనముగలవారిమీద తక్కువ ప్రీతియు గలుగుట. ఉద్యోగస్థులు రాత్రి జాముప్రొద్దుపోవువఱకు కచ్చేరీలు చేసి ప్లీడర్లను పార్టీలను బాధపెట్టుట. [illegible] వేయకుండా

వేసినట్లునటించి వోటుకాగితము కేబులో పెట్టుకొని పారిపోయినవారికి యేవిధమైన భంగపాటు రాకపోవుట. బహిరంగముగ కలహమాడుకొని పాదరక్షప్రయోగములు చేసికొన్నవారు ఆప్యాయనముగ నొకరి నొకరు కౌగలించుకొని ప్రాణస్నేహితులగుట. స్థలవిశాలము లేక దొడ్ల లోనుండి నీళ్ళు వీధిలోనికి తూములదారిని విధిలేక విడిచిపెట్టినందున గృహస్థులను ఛార్జిచేసి అరుగులకు అరుగులు వేసి స్థలముకలుపుకొన్న వారిని వదిలివేయుట.

—ః కారణములు ః—

ఈవిచిత్రములు పొడగట్టుటకు కారణము లేమనియడుగగా, అనేకులనేకవిధముల చెప్పినారు. జ్యోతిశ్శాస్త్రవేత్తలమని చెప్పకొను చున్న సిద్ధాంతులు కొందరు విపరీతమైన హేతువులను చెప్పినారు. ఆహేతువులు నమ్మతగియుండనందున అవి యిక్కడ వివరింప మానితిమి. మాయూరిలో పుట్టువెంట్రుకలు దీయుటకు పునస్సంధానములు చేయుటకు మఱియు యితరచిన్నచిన్న శుభకార్యములకు ముహూర్తములు పెట్టుటలో అసమానపండిత శిఖామణియని బిరుదుపొందిన భాస్కరసిద్ధాంతి భట్టాచార్యులవారు, ఆయనదగరనున్న పంచాంగపు కట్టలన్నియు తిరుగవేసి బోర్లవేసి పైకి క్రిందికి యెగాదిగాజూచి వేళ్ళు మణచి లెక్కపెట్టి నోరు మెదిపి కొంచెమాలోచించి యీక్రిందికారణము సెలవిచ్చినారు. తోకచుక్క యీసంవత్సరము మునిసిపల్ ఆఫీసులమీదుగా వెళ్ళినది. వోటర్లజాబితాలు వోట్లువేసే పెట్టెలు తోకచుక్కయొక్క తోకచివరలో బడినవి. కనబడకపోయిన వోటర్లపేర్లు తోకనంటుకొని పోయినవి. తోకచుక్కయొక్కతల వోటర్ల తలకాయల మీదుగా, అక్కడినుండి అయిమూలగాదిరిగి కొంతసేపు రోడ్డుమీద ప్రయాణముజేసి అక్కడినుండి క్రొత్తగావేసిన గోదావరిగట్టుమీదికి వెళ్ళి అక్కడనుంచి జారి తొలకరివానకు గోదావరిలో కొట్టుకొనిపోయినది. అందుచేత నిట్టి విడ్డూరములు కలిగినవి.

# విచిత్రమైన మరణశాసనము

ఒకసన్యాసి ఈక్రింది మరణశాసనమును వ్రాయించెను, శ్రీమత్సకలలోక పూజితుడగు విశ్వేశ్వరస్వామివారికి నిలయమైన శ్రీ కాశీనగరమున వర్తమాన వ్యావహారిక చాంద్రమానమున ప్రభవనామసంవత్సర శ్రావణశుద్ధదశమీశనివారము నాడు పగలు మూడు జాములు దిరిగినతరువాత నాలుగవజాముయొక్క ప్రథమభాగమున భూమ్యాకాశంబులు సూర్యచంద్రులు సమస్తదేవతలు సాక్షులుగ, పూర్వాశ్రమమందు సచ్చిదానంద తర్కాలంకారునకు మూడవకుమారుడనై యీసన్యాసాశ్రమమందు పరమహంస పరివ్రాజక పదవాక్య ప్రమాణ పారావారపారీణ బ్రహ్మానందభారతీ వేదాంత తీర్థస్వాములవారని పూర్ణనామముగలిగి వేదాంత తీర్థులని లోకమందు వ్యవహరింపబడుచు అరువదిమూడు సంవత్సరముల పదకొండుమాసముల యిరువదిఆరుదినములవయస్సుగల నేను, చిరకాలమనేక పుణ్యస్థలములు తిరిగి సంపాదించిన నాయాస్తి నాకిష్టములేని యితరులచేత బడునను భయముచేతను నాయనంతరమందు నాశిష్యులాయాస్తినిమిత్తము వివాదపడుదురను భయముచేతను నేనుసంపాదించిన యమూల్యవస్తువులు సద్వినియోగము కావలయునను తలంపుచేతను ప్రస్తుతము నాదేహారోగ్యము చక్కగానున్నప్పటికి శరీరములసత్యములగుటచేత నెప్పుడేవిధముగా మరణమాగంతుకముగా వచ్చునో మనము ముందు జాగ్రత్తపడుట మంచిదని మంచి యుద్దేశముతో సంపూర్ణవ్యక్తితో నిండు శాంతితో వైరాగ్యముతో ఈ మరణశాసనము వ్రాయించుచున్నాను. నాయనంతరమందు నాయాస్తి నేనీక్రింద ఏర్పాటు చేసినప్రకారమ [illegible] నాయాస్తి

యీమరణశాసనప్రకారము జరుగక నాస్వాధీనములోనే యుండవలయును. వెనుక పరాభవసంవత్సర చైత్రమాసమున నేకాదశినాఁడు తెల్లవారుజామున శిష్యసమేతముగా గంగకీనదిలో నేను స్నానము చేయుచుండగా నాయదృష్టవశమున నాకుదొరకిన సువర్ణముఖి సాలగ్రామములు రెండింటిలో చిన్నది పూర్వాశ్రమమునందు నామూఁడవమేనత్తయొక్క సవతికుమారుఁడైన నారాయణశర్మకు మేనల్లుఁడైన గోవిందశర్మయొక్క రెండవ యల్లుని తమ్ముఁడు కేశవభట్టునకు చెందవలయును. ఆరెండు సాలగ్రామములలో పెద్దది యీయాశ్రమమునందు నాప్రియశిష్యుఁడును బ్రహ్మజ్ఞానసంపన్నుఁడును లోకమందఱు మెచ్చఁదగిన మహిమగలవాఁడును నగు శంకరానందమునకుఁ జెందవలయునేగాని మరి యెవ్వరికిని జెందఁగూడదు. వెనుక ప్రయాగలో గంగాయమునసంగమప్రదేశమందు ఒకనాఁడు మధ్యాహ్నము రెండుజాముల వేళ వేసవికాలములో నేను నాశిష్యులుఁగలసి మఱ్ఱిచెట్టుక్రిందఁ గూర్చుండి కొబ్బరిచిప్పలతో నీళ్ళు తాగుచుండఁగాఁ జూచి నాయందపరిమితభక్తిగలవాఁడై యొక కుమ్మరి వెంటనే గ్రామమునకుఁజని నాకుసమర్పించినట్టిదియు నాకు చిరకాలమునుండి చల్లనినీళ్ళు దాహము నిచ్చుచున్నట్టిదియు నాహస్తమున కలంకారమైనట్టియు ననేకుసారులు నాచేతిలోనుండి నేలబడినను పగిలిపోక యుండినదియు నగు మట్టికమండలము క్రొత్తగా నావలన నుపదేశముపొంది యీనడుమనే సన్యసించి నాశాటి ఉదికి యారవేయుచు రాత్రులు నాపాదములొత్తి నాకుపచారము చేయుచు నన్నే దైవమని నమ్ముకున్న బాలభారతికి చెందవలయును. నాకు బ్రహ్మవిద్యోపదేశము చేసిన పరమగురువులు యోగానందపరబ్రహ్మస్వాములువారు పుత్రవాత్సల్యముచేత శిష్యులందరికంటెను నన్నెక్కువ గారవించి నన్ననుగ్రహించి నాకుదయచేసినదియు బదరికావనమున పూర్వ పారాయణము గంపశను చెంచువానిచేత నీయఁబడినదియు

నాకు ముప్పదిసంవత్సరములనుండి కూర్చుండుటకు పీటనై పండుకొనుటకు పానుపై చలికాలమందు కప్పుకొనుటకు దుప్పటియై యెన్నో విధముల నుపచరించినదియు ప్రాతదగుటచేత నక్కడక్కడ నాలుగైదు చిన్నచిన్న బొత్తలుగలదియు ఒకనాడు చలిమంట కాగుచుండగా కొంచెము చివర యంటుకొనుటచేత కాలినమానవాలు గలిగినదియునగు కృష్ణాజినము, గయలో నేనున్నకాలమున నాశరీరయలో మిక్కిలి జబ్బుచేయగా నాకుమిక్కిలి భక్తిశ్రద్ధలతో మందులిప్పించి పథ్యపానములు సమకూర్చి సకలలోపచారములు జేసిన వామనశరయను బ్రాహ్మణునకు బ్రతికియున్నపక్షమున ఆయన కీయవలయును ఆయన జీవించియుండనిపక్షమున ఆయన కుమారునిగానికి లేక అయన సంతతివారికిగాని చెందవలసినదేగాని యన్యాక్రాంతముగా గూడదు. నాశిష్యులందరు పరస్పరమైత్రిగలిగి కాశీలో కరతలభిక్షులచేత జీవింపవలయును. నేను సిద్ధిపొందిన యనంతరమున నాకళేబరమునునాలుగు కుండలుగట్టి పడవమీదబెట్టి గంగాప్రవాహము యొక్క మధ్యకుదీసికొనిపోయి యక్కడ యేటిలోముంచి వదిలివేయవలయును. పైనుదహరించిన నాయాస్థి నాశిష్యులకు సమానముగా విర్వివాదముగానిష్పక్షపాతముగా బంచిపెట్టుటకు విశ్వేశ్వరస్వామివారి యాలయములో తపస్సుచేసికొనుచున్న విరూపాక్షస్వాములవారును మణికర్ణికాక్షేత్రమున దిగంబరుడై మౌనదీక్షపట్టిన కపాలకుండల స్వాములవారును దశాశ్వమేధ ఘట్టమందు నేకపాదముమీద నిలచి ఊర్ధ్వబాహుడై పంచాగ్నిమధ్యమందుతపస్సు చేయుచున్న చండీనందనస్వాములవారును ధర్మకర్తలై యుండవలయును. ఇట్లునాయిష్టప్రకారము నాయాస్థివారు పంచిపెట్టకపోయినను నాశిష్యులనుభవించకపోయినను వారందరు దేవాలయములేని యూరిలోనున్నవారు రజస్వలయైనపిదప కూతురికి వివాహముచేసినవారు గోమయము నిందించినవారు పాండురోగిని జూచినవారు పోయిన నరకమునకుబోదురు, ఇదినాసమ్మతిని వ్రాయించిన మరణశాసనము.

వేదాంత తీర్థస్వామివార్లు,

# పెండ్లి కొడుకుల ధరలు

ఆడపిల్లలను గనుటచేత దురదృష్టవంతులని చెప్పదగిన కొందఱు పెద్దమనుష్యులు తమ కూతులను సంబంధము కుదర్చవలసినదని మమ్ము తరుచుగా నడుగుచుండుటచేతను మాకప్పుడప్పుడు జాబులు వ్రాయుచుండుటచేతను వారికందఱకు స్పష్టముగా దెలియునిమిత్తము మాకు దెలిసిన వివాహసంబంధము లీక్రింద సవిస్తరముగ వ్రాయుచున్నాము. ఈసంబంధములు చేసికోదలచినవారు పురోహితులను బంపి ప్రధానములు చేసికొనవచ్చును. తగపుల తారకబ్రహ్మంగారి కుమారుడు విశ్వనాథము. ఈయనకు వయస్సు పదునెనిమిది సంవత్సరములు. ఈయన క్రిందటి సంవత్సరము అయిదవఫారముపరీక్ష తప్పిపోయినాడు. పిల్లవాడు బక్కపలుచగా నల్లగా నుండును. మీదిపళ్ళు కొంచెమెత్తుగా నుండును. చిన్నతనమందు బాలపాపచిన్నె రాగా, అప్పుడు కాల్చినమచ్చ అగరుబొట్టువలె మొగముమీద గనబడుచుండును. ఈపిల్లవానికి రు 1116 లు కట్నము కావలయును. విశ్వాపుతాలి లాంచనములక్రింద రెండునూరుల రూపాయ లిచ్చివేయవలెను. వెండిచెంబు వెండిపళ్లెరము బెట్టి కాళ్ళు కడగవలెను. నాగవల్లినాడు పెండ్లికొడుకునకు బరంపురం పట్టుపంచ లియ్యవలెను. పెండ్లివారితో వచ్చినవారి కందఱకు బట్టలు పెట్టవలెను. కట్నముసొమ్ము ముహూర్తమునకు బయలుదేఱి రాకముందే పెండ్లికుమారునితండ్రికి చేరవలెను. ఆసొమ్ములో కొకరూపాయ తక్కువైనను మంగళసూత్రము మాత్రము ముడివడదు.

పెండ్లికుమారునికున్న ఆస్తి.

యేలూరితాలూకా ఒంతలపూడి డివిజన్‌లో చిన్నతిరుపతి కవతల శ్రేష్ఠమైన భూమి యిరవై యెకరములు కలవు.

2 తెగనీలుగుల దేవయ్యగారు. ఈయనకుమారుడు భద్రయ్య. ఈపెండ్లికుమారునకిరువది సంవత్సరము లున్నవి. ఈయన పెద్దభార్య కుమారుడు. ఈపిల్లవానికిద్దరన్నదమ్ములు. దేవయ్యగారి రెండవభార్యకు ప్రస్తుత మిద్దఱు కుమారులు గలరు తండ్రిగారికి కరిణీకము. జీతము నెల మీదిరూపాయలు వచ్చును. పైన రెండునందల రూపాయలు దొరకును. నాలుగైదువందల రూపాయలు భూములమీద వచ్చును. దేవయ్యగారి పెద్దకుమార్తె పెండ్లికి కొంచె మప్పుచేసిరి కాని ఆయప్పు బాధించదు. ఎందుకనగా భూములు తనఖా యిచ్చినారు. ఈపిల్లవానికి పదిహేను వందల రూపాయలు కట్నము గావలయును. నగలు వారికి తోచినన్ని వారు పెట్టుదురు. ఒకవేళ పెట్టకపోయినను పెండ్లికూతురువారు మాటయెత్తగూడదు వియ్యపురాలికిఅయిదురోజులు అయిదుపెద్దకాసు లీయవలెను. ఆడబడుచుల కరకాసు లీయవలయును. ఈ పెండివారికి మంగళహారతిపళ్ళెము మొదలయినవి మామూళ్ళు లేవు తాము ఆడ పెళ్ళివారిని యింటికి మనుగుడుపునకు వచ్చుటయేగాని, ఆడపెళ్ళి వారిని తమయింటికి మనుగుడుపునకు దీసికొనివెళ్ళుట వీరికి సాంప్రదాయము లేదు. ఈపిల్లవాడు నల్లగా లావుగా నుండును.

3 అవకతవక అచ్చయ్యగారి కుమారుడు పిచ్చయ్య. ఇతడు జువ్వలాగున పొడుగుగా నుండును. ఇతడు నాలుగవఫారము జదువుచున్నాడు. ఇతనికి పెండ్లికూతురు మిక్కిలి చక్కనిది కావలయును. ఆపిల్లచదువుకొన్నది కావలయును. ఊరక చదువుకొన్నంత మాత్రమున సరిపడదు. సంగీతము రావలయును. ముందుగా పెండ్లికొడుకు పెండ్లికూతురును చూచుటకు వచ్చును. ఆవచ్చినప్పుడు పెండ్లికూతురు అతని యెదుట పుస్తకము చదువవలెను, కొన్నిపాటలు పాడవలెను. సిగ్గుపడగూడదు. ఇతనికి కట్నము రొక్కముపూర్వకముగా నక్కఱలేదు. నాలుగెకరముల [illegible] వరదక్షిణక్రింద యీయవలెను. పెండ్లి

కొమారుడు కొంచెము గిడసగానుండును పెండ్లి తిరుపతిలోనే చేయవలెను. కన్యాప్రదాత పెండ్లికొడుకునకు రానుపోను ఖర్చు లీయవలెను. వీరికి గృహప్రవేశము సదస్యము మొదలయినవి ఆనవాయితలు లేవు. శాస్త్రివణపట్టీలు తెచ్చుట సాంప్రదాయము లేదు. కన్యాప్రదానకాలమందు పిల్లకు బాలతొడుగుక్రింద రు 500 లు గాని అంత కిమ్మతుగల వస్తువుగాని యిచ్చివేయవలెను. పెండ్లికుమారునకు మంచి యాస్తిగలదు. బెండమూరులంకలో య 25 ల యీనాము కలదు. హుకుంపేట ఆవలో య 30 లు కలదు. ఇదిగాక, యీయన మాతామహుని యనంతరమున యెనిమిది యకరముల భూమి కలియును. పినతండ్రిగారికి పిల్లలు లేకపోవుటచేత ఆయన ఆస్తియంతయు నీయనకే వచ్చును. ఇదిగాక యీయన అమ్మమ్మవద్ద చాల డబ్బున్నది. అదంతయు నీయనకే యిచ్చును. పెండ్లివారికి సన్నబియ్యము అన్నము వండించి కూరలు పిండివంటలు నేతితో చేయించవలెను.

4. ఆశల అంబయ్యగారి రెండవకొడుకు గంగయ్య. ఈయనకు కట్నమక్కర లేదు. పిల్ల యెనిమిదేండ్ల దైననుసరే. మెట్రిక్యులేషను క్లాసులో చదువుకొను చున్నాడు. ఈయన బియల్ పరీక్షవరకు చదువుకొనుటకు మామగారు మధ్యవర్తులవద్ద నాలుగువేల రూపాయలు నిలవ యుంచవలెను. పెండ్లికుమార్తెకు వేయిరూపాయల నగలు తండ్రియే పెట్టుకొనవలెను. ఉభయకర్చులు పెట్టి పెండ్లిజేయవలెను. పెండ్లివారికి ప్రయాణపు కర్చులలో నొకటిమాత్ర మీయవలెను. బోగము మేళము తప్పక పెట్టవలెను. దానికర్చులు కన్యాప్రదాతయే యిచ్చుకొనవలెను.

5 కోతల గోపాలరావు. ఈయన బియల్ చదువు చున్నాడు. తండ్రిలేడు. ఈయనకు ద్వితీయవివాహము. ఈయన రెండవతరగతి ప్లీడరీ

చేయుచున్నాడు. వయసు 30 ఈయన సంఘసంస్కర్తయగుటచేకట్న మడుగడుకాని తల్లిగారియొక్కయు, అన్నగారియొక్కయు బలవంతముచేత యెంతో అయిష్టంమీాద విధిలేక కట్నము యిచ్చేవారి పిల్లనే చెసుకుందురు. కట్న మెంతయిచ్చినను పుచ్చుకొందురుగాని వేయిరూపాయలకు తక్కువ యియ్యగూడదు. ఈసంబంధమునుగూర్చి నేమి మాటలాడ దలచుకొన్నను పెండ్లికుమారుని అన్నగారితోనేగాని పెండ్లికుమారునితో మాటలాడగూడదు.



## వోట్లకై తిరుగుట

(జంబుకేశ్వరావుగారు, చిదంబరరావుగారు ప్రవేశించుచున్నారు.)

జంబు—చిదంబరరావుగారూ! మనమిద్దఱమేవెళ్ళి వోట్లడుగుట బాగుండదు. వోటర్లకంటికి నదరుగా నుండేటట్లు బిలబిలలాడుచు పదిమందివెళ్ళవలెను. ఈవోటర్లసంగతి మీాకు తెలియదు. వీళ్ళు మాయలెఱుగనివాళ్ళు. మనము వీళ్ళను మాటలుచెప్పి టోపివేసి వోట్లు సంపాదింపవలెను. ఈసరియాయను నాతో మీారుండి ఒకుపులన్ని చూచి, ఇంకొకమాటు యెలెక్షనుకోసము మీారు ప్రయత్నము చేయండి. ఇదిగో ఈయిల్లు రామచంద్రయ్యగారిది. ఈయన పెద్ద బ్రాహ్మణుడు, లోపలకురండి. (అని లోపలికివెళ్ళి) రామచంద్రయ్యగారూ (అనిపిలుచును)

రామ—(వచ్చి) అయ్యా దయచేయుండి. తమరు గావడంవల్ల నాగృహము పావనమైనది. ఏమి సెలవు.

జంబు—ఈమునిసిపల్ యెలెక్షనుగాదండివచ్చినది. కొందరు

కట్టువాళ్ళు నేను పాతవాడనగుటచేత పనికిరానని చెప్పుచున్నారు. పాతచింతకాయపచ్చడి, పాతయుసిరికాయపచ్చడి పథ్యమునకు పనికి వచ్చి యెంతో యుపకారముజేసినట్లే పాతవాళ్ళుకూడా చాలాపనికివస్తారని వాళ్ళెరుగరు.

రామ — సరి సరి యెంతమాట. వాళ్ళకూతలశేమి. నేను తమ సెలవుప్రకారం నడచుకొంటాను.

జంబు — సరేగాని మీ పెద్దబ్బాయి యిప్పుడు ఏమి చేస్తూన్నాడండీ. పనిపాటలేమైనా నున్నవా?

రామ — ఏమీ పనిలేదండి. అధికారుల అనుగ్రహంలేదు.

జంబు — అయ్యయ్యో! నాతో యెందుకు చెప్పలేదండి! ఈమధ్య మూడుపనులు కాళీవచ్చినవి. మనవాళ్ళెవరులేకపోవడంచేత ఆపనులు పైవాళ్లకిప్పించినాము, ఎంతపొరబాటు చేసినారండి. మీవాడిసంగతి నాతో చెప్పవద్దూ. ఇప్పుడైనా మించిపోయినదిలేదు. ఒక గుమస్తాపని కాళీయున్నది. మీవాడిచేత తక్షణందరఖాస్తుపంపించండి నేను రేపుదయం చేర్మెనుగారివద్దకు వెళ్ళి మాట్లాడి మీకుఱ్ఱవానికి యిప్పిస్తాను, మావంటిపాతవాళ్ళున్నందువల్ల యివేలాభాలు. ఇప్పటి వాళ్ళు మీమొగమేచూడరు దరఖాస్తు పెట్టించండి. మేము సెలవు పుచ్చుకొంటాము.

రామ — చిత్తము. మాపిల్లవాడు మీపిల్లవాడే.

జంబు — సందేహమేమీ (అని వీధిలోనికి వచ్చుచు)

చిదం — (కొంతదూరమునడచి) ఏమండి గుమాస్తాపనులు మునిసిపల్ ఆఫీసులో యేమీకాళీలేనట్లున్నాయి. వీరిపిల్లవానిని దరఖాస్తుపెట్టుమన్నారెందుకు.

జంబు — కాళీలేదన్నమాట నేనెఱుగనటయ్యా. ఎలెక్షనంటే యేమిటీ? ఈలాటి గమ్మత్తులే. ఈ యెఱుమీద యీబాబ్రహ్మాడు మనకు

తప్పకుండా వోటువేస్తాడు. ఎలెక్షను అయినదాక యీయాశ పెడతాను. ఆతరువాత నాపరుగందుకోమంటాను.

చిదం—ఎలెక్షను చిత్రములు మిక్కిలి అద్భుతముగానున్నవి. మీగుసాతొత్తు కలిపురుషులంతే వారండి.

జంబు—ఇవిమాయ కేరోజులు. రండీ యిదిగో గంగరాజుగారి యింటి కెడదాము. ఈయనపెద్దకోమటి.

గంగ—(ఎదురుగావచ్చి) దయచేయండి జంబుకేశ్వరరావుగారు. ఎలెక్షనుకోసమే వచ్చారా యేమిటి.

జంబు—మిమ్మలిసి నేను వోటడగడానికి వస్తానా; మిమ్ము కూడా వోటడిగితే యింక నాయెలెక్షనెందుకు? సూర్యుడు పడమట పొడిచినా మీరునాకు వోటివ్వక మానరని నాకు తెలుసును. ఈ చిత్రంచూసినారండి. తిరుమలరావుగారు నాకువ్యతిరేకముగా కౌన్సిలరుపనికి దరఖాస్తుపెట్టినారు. ఆయనకు 10 వోట్లు వచ్చేను 11 వోట్లు వచ్చేను అంతకన్న ఎక్కువరావు.

గంగ—అవునండి! ఆయన నెవరెరుగుదురు? కాకపోయినా తమయిది తమసంగతి యెవరికి దెలియదు!

జంబు—తిరుమలరావుగారు ప్రతిచోటికివెళ్లి మీకోసట్లను అడ్డమైనతిట్లుతిడుతూన్నారు. ఎందుకో తెలుసునా? మీరందరునాకు వోట్లిస్తూన్నారని. అయితేనేమిలెండి యెక్కడకువెళ్ళితె అక్కడ నలుగురు చీచీ అంటున్నారు. ఆతని మొగముచూచి వోట్లిచ్చేవారెవరండి? మీకు వేరే నేచెప్పనక్కరలేదు. నన్నేర్పరుచుకుంటే నేను మీవార్డు లోకికిరాను. అరుగులు పెంచుకోండి, చూరులుపెంచుకోండి, నేను చూడను కోరినయుపకారమల్లా చేస్తాను. వాళ్ళయితే కోతికి కొబ్బరికాయదొరకినట్లస్తమానం వార్డులో తిరుగుతూంటారు.

గంగ—అన్నీ నేనెరుగుదును. నేను తప్పకుండా తమకేయిస్తా

ను. అయితేవారొచ్చినపుడు కూడాసరే మీకేయిస్తాను. వెళ్ళండంటా నుగాని, అమాటలుమీరు నమ్మవద్దు. ఏలాగైనా వోటు మీకివ్వడం ప్రధానంకదాండీ ఎన్నిమాటలైతేనేందుకు?

జంబు—సరే ఆలాగే చెప్పవచ్చును. వోటుమాత్రము నాకి య్యండి మేము వెళ్ళుతున్నాము (అని పోవును.)

గంగ—(కొంచెముసాగనంపి) చిత్తము నేను సెలవుపుచ్చుకుం టాను. మీరెవరెన్ని చెప్పినా మరొకలాగనుకోనద్దు (అని వెళ్ళును.)

చిదం—తిరుమలరావు కోమట్లను తిడుతూన్నాడా యేమిటండి

జంబు—తిట్టడంలేదు తిమ్మడంలేదు. ఈడాబుడాబితేనేగాని వీళ్ళకునసాళంఅంటి తిరుమలరావుగారిమీద కోపమురాదు. నీకు కీసా బాసా తెలియదు. ఈచమత్కారాలన్నీ జరిగితేనేకాని యెలెక్షనుకాదు రండి యీలాగునరండీ నాగరాజింటికివెళ్ళుదాము. ఈతడుకమ్మవాడు వీనికిప్రపంచవ్యవహారమే తెలియదు. (గుమ్మములోనికివెళ్ళి)నాగరాజూ

నాగ—(వచ్చి) చిత్తం బాబయ్యా! ఏలినవారు దయచేశా రెందుకండి?

జంబు—నీకువోటుంది. అదిమాకివ్వాలి.

నాగ—చిత్తం. మంచీబుగోరు యెల్లా పల్కమంటే ఆలాగు పలుకుతానండి. తమచిత్తమెల్లాగో ఆలాగె చేస్తానండి.

జంబు—సరేమాకిస్తానని అవతలవారికిచ్చావంటేనీపనిపడతాం ఎవరికిచ్చింది మాకు తప్పక తెలుస్తుంది. ఈకవర్లన్నిటిని కలక్టరుగారు విప్పిచూచి యెవరు యెవరికి వేశారో తెలియ జేయవలసినదని గ్రా మమునసబుదగ్గరకు చేర్మెనుదగ్గరకు పంపుతారు. మొదటరహస్యగా వేసినా చివర తెలియకపోవు. కాబట్టి కపడ్దార్.

నాగ—అయితే యీకవర్లు మళ్ళీ మీదగ్గర కొత్తాయండి.

అవతలవారు మొన్నరొచ్చి కవరెవ్వరు చూడరు. కలకటేరు కచేర్లో రాచ్చెంగా వుంటాయని చెప్పారేమునండి.

జంబు — చూశావా యెల్లాంటి అబద్ధాలు చెప్పతూన్నారో వాళ్ళు తమఅవసరం గడుపుకొని నీకొంప తీయడానికి అల్లాంటి మాటలు చెపుతూన్నారు అయితే నీయింటికి పన్నెంత ?

నాన—ఆఋనూపాయ లేశారుండి.

జంబు—అర్జీ పెట్టాతగ్గిస్తాము. పాపమునీకింత పన్నెక్కువేమిటి.

నాగ—చిత్తము. చిత్తము బాబయ్యా ఈయుపకారము చేయించుండి.

జంబు—సరే ఇకనీవు వెళ్ళు. (అని వానినిబంపి తానువెళ్ళును.)

చిదం—పన్నులుకట్టి యిప్పటికి రెండేండ్లయినది గదా! ఇప్పుడు పన్నులు తగ్గిస్తారా ?

జంబు—నీవెక్కడో శుద్ధవైదికిలాగున్నావు. ఇప్పుడు పన్నులు కొట్టివేయుటకు వీలులేదన్నమాట నాకు తెలియకపోలేదు. వీడిని టోపీవేయుటకు యిదేమార్గం. మరొకటి వీడివద్ద పనికిరాదు. ఎలెక్షను అయినతరువాత వీడిపని లబాయిలు దిబాయిలు అన్నమాట యెఱుగుదును సరే యీవేళకు తిరగడం చాలును. ఇంటికి వెళదాముగండి. మీరు నావిషయమై చాలా పనిచేస్తూన్నారు గనుక మీకు కొన్ని సంగతులు చెప్పుచున్నాను వినండి. అవతల వాళ్ళమీద కావలసినన్ని చెడ్డవాడుకలు వెయ్యవలెను. ఎలెక్షనురోజున మనకు వోటువేసేవాడిని వెయ్యనివాడిని కూడా కౌగిలించుకొని లోపలికి తీసుకువెళ్ళవలెను. అందువలన అందఱు పెళ్ళవాళ్ళేయని తక్కినవోటర్లకు తోచును. ఆరోజున మనవారు పదిమంది మునిసిపల్ ఆఫీసు మొదలు బజారుదాకా మాధ్యమధ్య రోడ్డుమీద సిద్ధముండి జంబుకేశ్వరావుగారికి అవుతుంది,

తిరుమలరావుగారి కొక్కవోటైన రావడంలేదు. అని వచ్చేపోయే వాళ్ల తో చెప్పుచుండవలెను. ఆలాగున చెప్పడంవల్ల మొదట వాళ్ళకు వేయ దలచుకొని వచ్చినవాళ్ళుకూడా యీదొంగవార్తలు నమ్మి ఒకప్పుడు మనకు వేయగలరు. ఓటర్లలో చాలామంది మంచి ఆలోచన గల వాళ్ళు కారు. మాయమాటలు దొంగవార్తలు నమ్మి బందలో పడి పోదురు. ఇవియేకావు. ఇంకా చాలాసంగతు లున్నాయి. అవియన్ని క్రమక్రమముగా చెపుతాను. ప్రస్తుతం పోదాము రండి.

(అని యిద్దరు నిష్క్రమింతురు.)



రెండవరంగము.

(అపుడు మాధవరావుగారు ప్రవేశించుచున్నారు.)

మాధ—ఏమండోయి కేశవాచార్యులగారూ మీవోటు మా తిరుమలరావుగారి కిప్పించవలెను. మాపక్షము న్యాయపక్షమని మీకు తెలుసునుగదా!

కేశ—చిత్తము. తిరుమలరావుగారుకూడ ఇదివరకు రెండు సారులువచ్చి సెలవిచ్చినారండి. మీపక్షము న్యాయపక్షమన్నమాట యెరుగుదును. మీరు సధర్ములన్నమాట యెరుగుదును. కాని నాకిందులో ఒక బాధయున్నది. మీప్రతిపక్షులలో కొందరు చెడ్డ వాళ్ళున్నారు. వాళ్ళకు వోటివ్వకపోతే ఈవీధిలో నిలవడానికే వీలు లేదు. నాయింటిమీద రాళ్ళు వేస్తారు. మా ఆడవాళ్ళను వీధివెంట నడవనియ్యరు. నేను గృహస్థధర్మముగా మీతో ఉన్నయదార్థస్థితి మనవిచేసుకొంటూన్నాను. కాబట్టి నన్నుక్షమించి వదిలివేయండి. మీరుయోగ్యులు గనుక మీతో నిజముచెప్పుకుంటే మీరు వదిలి వేస్తారని నాకు ధైర్యమున్నది.

మాధ.—సరే యీవిషయములో మిమ్ము నేను బాధపెట్టను. (అని కొంతదూరము వెళ్లి) ఏమండోయి రాజరత్నంగారు మీరుమాకు వ్యతిరేకముగా పనిచేస్తూన్నారని తెలిసినది.

రాజ—వ్యతిరేకముగా యేంచేస్తూన్నానండి.

మాధ—అవతలపక్షమున మీరు తిరుగుచున్నారటగదా.

రాజ.—తిరిగితేనేమండి నావోటు మీకేయిస్తాను.

మాధ—మాకు వోటివ్వవద్దని అందరితో చెప్పుచున్నారట గాదూ ?

రాజ—చెపితేనేమండీ నావోటు మీకిస్తాను.

మాధ—వారినామినేషనుమీదకూడా మీరు దస్కతు చేసినారట గాదండీ !

రాజ—చేస్తేనేమండి వోటు మీకియ్యదలచుకొన్నపుడు?

మాధ—అన్నిపనులు వారికిచేసి వోటు మాకిస్తామనిచెపితే యేమినమ్మకము కలుగుతుందండీ.

రాజ—కలగకపోతే నేనేమిచెయ్యనండి! వారిమొగమాటము వల్ల ఆలాగున తిరగవలసివచ్చినది. కావలిస్తే యీవేళ మీతోగూడ తిరుగుతాను.

మాధ— ఇద్దరితోను తిరగడంవల్ల యేమీలాభము లేదు. ఎవరికిని నమ్మకముండదు. మనిషి యేదోఒకపక్షమున ఉంటే మరియాదగా నుండును గాని యిటొకకాలు అటొకకాలుపెట్టి మనసులో ఒకమాట పైకొకమాట కలిగియుండడం కేవలం అప్రశస్తం. కాబట్టి మీరాలోచించుకొని మీయిష్టమువచ్చినట్లు చేయండి. (అని కొంతదూరం వెళ్ళి) గంగరాజుగారూ! నేను మీకోసమే వస్తూన్నాను. వోటుమాట యేమిచేసినారు ?

గంగ—నావోటు తమదేయని యిదివరకే మనవిచేయలేదు? అవతలవారు వచ్చినప్పుడూరికే వారికి తప్పకుండాయిస్తానని అంటూ వుంటానుకాని అంతర్యంలో మాటయేమిటనగా, నావోటు మీది.

మాధ—మొన్న జంబుకేశ్వరరావుగారు వచ్చినప్పుడు వారితోను యీలాగునే చెప్పినారట.

గంగ—చెపితేనేమండి నూరుమాటలు చెపుతాము. అవన్నీ మీకు లెక్కయెందుకు. క్రియా, సంగతి, కమాయిషు చూచుకోవాలికాని.

మాధ—సరే! మీమాట నమ్ముకుంటాము రేపుదయము తక్కినవాళ్ళను తీసికొని మళ్ళీవస్తాము. (అని వెళ్ళును.)

---

# యమధర్మరాజుకచ్చేరి

(యమధర్మరాజు, చిత్రగుప్తుడు ప్రవేశించుచున్నారు.)

యమ—అవునోయి చిత్రగుప్త నిన్న సాయంకాలము నీవు ఏవో కొన్ని ధర్మసందేహముల నడుగదలచి నావద్దకు వచ్చితివి. అప్పుడు నేను నారదమహాముని తో మాట్లాడుచుండుటచే తీరుబడి లేకపోయినది. ఇప్పుడు తీరికగానున్నది. అడుగవచ్చును.

చిత్ర—చిత్తము. ఇదిగో అడుగుచున్నాను. భూలోకములో హిందూదేశమందు మునిసిపల్ కౌన్సిలులోను తాలూకా డిస్ట్రిక్టు బోర్డులలోను సభికులగుటకు చాలమంది దరఖాస్తులుచేసి వోటర్లవద్దకు వెళ్ళి వోట్లుయిమ్మని ప్రబతిమాలుచున్నారు. వోటర్లు యెవరువచ్చిన వారికే యిస్తామని దరఖాస్తుదారులందరికిఁగూడ నమ్మకము పుట్ట

బలుకుటయేగాక చేతిలో చెయివేసి తల్లివర్తన, అమ్మతోడు, బాబుతోడు, గాయత్రీసాక్షి, చండాలుడేసరి, నాబిడ్డలతోడేసరి, అన్నంసాక్షి, రామదేవుడు పాదాలుసాక్షి, దైవసాక్షి మీపాదాలతోడేసరి, అని వొట్లుపెట్టుకొని భాగవతము భారతము రామాయణము నెత్తిమీద పెట్టుకొని ప్రమాణములుచేసి తాముచేసిన ప్రమాణములు దప్పి మరియొకలాగున వర్తించుచున్నారు. వెనుక ధర్మరాజు "అశ్వత్థామ హతఃకుంజరః" అని ఒక్క అబద్ధము ఆడినందులకే ఆయనకు యమలోకదర్శన మయినదిగదా. ఇప్పుడు ఈఘోరమైన ప్రమాణములు చేసి తప్పిన యీమహానుభావులకు యేమినరక మేర్పరచినారో నాకు తెలియకున్నది. ఒక్కొక్కవోటరు యిద్దరు దరఖాస్తుదారులవద్ద ప్రతిదినము జేయుచున్న ప్రమాణములు పెట్టుకొనుచున్న వొట్లు వ్రాయలేక మాచేతులు మాగుమాస్తాలచేతులు పడిపోవుచున్నవి. ఒక్కొక్క యెలెక్షనుకు ఒక్కొక్కవోటరు నాలుగుమూడువందల పరియాయము లైన బ్రమాణముచేయును. ఈప్రమాణములకు పాటియున్నదాలేదా? ఉన్నపక్షమున యేనరకములో వీరిని వేయవలసినది. కొందఱువోటర్లు యిదివరకే చచ్చిపోయి బ్రతికివచ్చియున్నారు.

యమ—ఇదిగొప్ప గడ్డుప్రశ్నయే ఇందుకు పాతనరకము లేవియు బనికివచ్చునని నాకుదోచుటలేదు. వోటర్లుచేయునట్టి ఘోర ప్రమాణములు వినువారికి ఉక్కిలి భయంకరముగానున్నది. అట్టివి తప్పినందున నేదైనా క్రొత్తనరక మొకటి ప్రత్యేకముగా వీరి కేర్పరచవలసినదని బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో నేను మాటాడెదను. అంతవరకు వీరిని, అబద్ధములాడినట్టివారిని సంపించే నరకములోనికి పంపుచుండవలెను.

చిత్ర—వోట్లు వేయవలసినవిధముగా పెట్టెలలో వేయక యెత్తుకొని వచ్చినట్టువంటివారు దొంగతనము చేసినవారగుదురాలేదా?

ఇది ఆస్తికాదుగనుక దొంగతనముకాదని కొందరనుచున్నారు. మీ యభిప్రాయము సెలవియ్యవలెను.

యమ — అది తప్పక దొంగతనమేయగును. అట్టివారు వోట్ల దొంగలు. ఆస్తిదొంగలించుటయొక్కటే దొంగతనముకాదు. దురుద్దేశముతో ఏది యెత్తుకపోయినను అది దొంగతనమేయగును.

చిత్ర—వోటర్లు వోటువేసినందుకు దరఖాస్తుదారులవద్ద పుచ్చుకొనునట్టి సొమ్ము బహుమానములక్రిందికి వచ్చునా ?

యమ—అవి బహుమానములుకావు. లంచములే. వారందరు మనలోకమునకువచ్చినప్పుడు లంచములు పుచ్చుకొన్నవారిని విచారించినట్లే మనము విచారింపవలయును.

(అంతట ఇద్దఱు యమదూతలు చచ్చిపోయిన ఒక
వోటరును తీసికొనివచ్చుచున్నారు)

యమ— ఎవడురా వీడు ?

దూతలు—వీడొక బ్రాహ్మణుడండి.

చిత్ర—వీడుకూడా ఒకవోటరేనండి.

యమ—వీడి పాతరికార్డు తీయించండి.

చిత్ర— వెనుకటిదంతా వ్రాసి సిద్ధముగానే యుంచినాము. క్రొత్తగా యీమధ్య జరిగిన యెలెక్షనులో జరిగిన దుర్మార్గములు మాత్రము ఆవర్జావేయు లేదు. చిట్టాలో మాత్రము జేర్చినాను.

యమ — మొన్నటి యెలెక్షనులో నీవేమి దుర్మార్గములు చేసినావయ్యా బ్రాహ్మణుడా ?

బ్రాహ్మ—(గజగజ వణకుచు) అంతా చెబుతాను మహాప్రభూ ! భూలోకములో నారహస్యము దాగినదికాని యేలినవారివద్ద దాగదుకదా. నేను నావోటు దరఖాస్తుదారులకిద్దరికీ కూడ యిస్తానని వాగ్దానము చేసినాను, నన్ను నమ్మరేమో యనుభయముచేత యిద్ద

అవద్ద ప్రమాణములు చేసినాను. కాని మనసులో న్యాయపక్షము వారికే యివ్వవలయునని తలంచితిని. కాని అంతలో నాకొకచిక్కు తటస్థించినది. నేను నాలుగుసంవత్సరములనుండి యొక చాకలిదానిని యుంచుకొన్నాను. ఒకనాడురాత్రి వానియింట్లో నేనుండగా, ఒకదుర్మార్గుడు తాగివచ్చి ఉతగయెత్తి తలుపుదీసి దానిని నన్ను చావగొట్టినాడు. ఆకిందిరోజున యీచాకలిది వానినేమో తిట్టినదట. అందు కోసము నాడీపని జేసినాడు. ఆగాత్రి వాడు నమ్ముల్నిద్దఱను తన్ని అంతటితో తృప్తిపొందక నన్ను వీధిలోనికి లాగుకొనివచ్చుటకు ప్రయత్నము చేయగా నేను వాని రెండుకాళ్ళుపట్టుకొని నాపరువు బయట పెట్టవద్దని బ్రతిమాలుకొంటిని. వానిపేరు గురయ్య. ఈయెలెక్షనులో అవతలిపక్షమువారు, ఆగురయ్యను నావద్దకు పంపినారు. వాడు నా దగ్గరకువచ్చి నీవోటు నేను చెప్పినట్లు యిస్తేనే యిచ్చావు, లేకపోతే నీబుఱ్ఱపగులగొట్టివేస్తానని అన్నాడు అందుచేత అలాయిచ్చినాను.

చిత్ర—నీవు ఉంచుకొన్నది మంగలిదని లెక్కలలో వ్రాసియున్నది. చాకలిదని చెప్పినావు. నీవు మావద్దకూడా అబద్ధాలాడదలచుకొన్నావా? నీమాటలు నమ్మి మోసపోవుటకు మేము మునిసిపల్ దరఖాస్తుదారులము కాము.

బ్రాహ్మ—లేదు మహాప్రభూ! పొరబాటుచేత చెప్పినాను.

యమ—చిత్రగుప్తుడా వీనిసంగతి రేపు విచారణచేయవచ్చును. వీనినవతలకు పంపివేయుడి. వీడుకూడా క్రొత్తనరకములో వేయవలసినవాడే. (అని పంపివేయుదురు) (అప్పుడు మరియిద్దరు దూతలు మఱియొక వోటరును తీసికొని వచ్చుచున్నారు).

చిత్ర—వీడెవడురా?

దూతలు—వీడొక వోటరండి.

యమ—చిత్రగుప్తుడా! వీడీ యెలెక్షనులోచేసిన చిత్రమేమి టోయి?

చిత్ర—వాడిచేతనే చెప్పిస్తానుండండి. చెప్పవోయి.

వోటరు—నేను చేసిన వెనుకటిపాపములన్నీ మీకు జాహీరే కదా? నేను ఎలెక్షనులో ఒకపక్షమువారితరపున దిరిగి వోటు రెండవపక్షము వారికిచ్చితిని. ఇట్లుచేయుటకు కారణమేమనగా చిట్టచివర యెలెక్షను సమయమునకు రెండవపక్షమువారు నాబాకీదార్లచేత నామీద వాజ్యములు వేయించి వారంట్లు తెప్పిస్తామని బెదరించినారు, అందుచేత నేనట్లు చేయవలసివచ్చినది.

యమ—పాపము వీడు పరువునష్టమగునన్న భయముచేత చేసినాడు. కాబట్టి వీడికంత ఘోరమైనశిక్ష విధింపగూడదు.

చిత్ర—ఇదిగో మనదూతలు ఇంకొకనిని దీసికొని వచ్చుచున్నారు. వీడికి యెలెక్షనులో ఒకపక్షమువారు కడుపునిండా సారాపోయించగా త్రాగి వొళ్ళుతెలియక తాను వోటువెయ్యదలచుకొన్నవారికి వేయలేకపోవడమే గాకుండా అతి త్రాగుడువల్ల గొంతుకార్చుకొని పోయి ఆరాత్రియే చచ్చినాడు.

యమ—వీడికిప్పటికైనా వొళ్ళుతెలిసినదా లేదా? వీడు మనతోగూడ స్మారకము తెలియక మాట్లాడుతాడేమో చూడండి. భూలోకంలోనిషా యమలోకంలోకి వచ్చినా దిగదు. వీడిని సారాగూనలో నానేసినట్టు తోస్తుంది.

చిత్ర—వీడిని రేపువిచారించవచ్చునులెండి. ఒరే వీడిని తీసికొని పోండిరా.

(అని అందఱను పంపివేయుదురు)

(అందరు నిష్క్రమించుచున్నారు.)

రెండవరంగము

(యమధర్మరాజు చిత్రగుప్తుఁడు ప్రవేశించుచున్నారు).

యమ—చిత్రగుప్తుఁడా! భూలోకములో జరుగుచున్న యెలక్షను చిత్రములు, ఇంకా వినవలెనని కుతూహలమున్నది. మన లోకమునకువచ్చిన వోటర్లింకా యెవరైన ఉన్నారా?

చిత్ర—వాళ్ళు రాకపోయినా మన లెక్కలనుబట్టిచూచి సంతసింపవచ్చునుగాని వాళ్ళుకూడా చాలామంది వచ్చినారు. మన దూతలప్పుడే యే డెనమండ్రుగురను దీసికొని వచ్చినారు. వాళ్ళు చేసినచిత్రములు వాళ్ళ నోళ్ళనుండే వినవచ్చును. ఎవడురా అక్కడ! ఏలినవారి వద్దకు, ఆ వోటర్ల నొక్కొకరినే తీసికొనిరండి.

యమదూత—చిత్తము బాబూ! ఇదిగో వీడొక ముసలి వోటరండి. ఓరీ నీకథ చెప్పరా యేలినవారు వింటారు

3. వోటరు — చెప్పుచున్నాను. వినండి. బాబయ్యా. నా పేరు గోపయ్య. మావార్డు వోటర్లజాబితాలో పాపయ్య అనే మనిషిపేరు వోటరుగా వేయబడియున్నది. ఒకపక్షమువారు నాకు వరహాసొమ్మిచ్చి అవతలపక్షం తిరిగిపోకుండా రాత్రి నాలుగు జాములు నన్నొక గదిలో పెట్టి తాళమువేసి నాపేరే పాపయ్య అనిపించి నాచేత వోటు వేయించినారు. పాపయ్య అదివరకే చచ్చిపోయి పదేళ్ళయినదట. నీ పేరు గోపయ్య కాదాయని యెవడో యొక రడుగగా నేను ఖంగారుపడక యెంతో ధైర్యముతో నేను పాపయ్యనేయని జవాబు చెప్పితిని.

యమ—నీవు నిజముగా పాపయ్యవేరా? నీ మొగమున పాపములు వ్రేలాడుచున్నవి. చిత్రగుప్తుఁడా! యితర పాపములమాట తరువాత విచారించెదముగాని ముందుగా యీ దోషమునకు శిక్షింతము. ఇనుపగూపాయ [illegible] కట్టండి.

వోటరు—బాబో, బాబూ క్షమించండి క్షమించండి.
(అని యేడ్చును)

యమదూత—ఏడవకు నడు, (అని గెంటుకొనిపోవును.)

చిత్ర—మఱొకనిని పంపించండి.

యమదూత—మీరు మఱియొక వోటరండి. చెప్పవయ్యా నీ సంగతి.

4 వోటరు—చిత్తము మహాప్రభూ! ఏలినవారిని చూస్తే భయమేస్తూంది. ధర్మప్రభువులు. బహు కుటుంబీకుడ నగుటచే కడుపు కక్కుఱితి గలిగి చేయరాని పనుల చేసినాను. రక్షించండి.

చిత్ర—రక్షణకేమి లే. కథకానీ.

వోటరు—చిత్తం మహాప్రభూ! నేను యెలెక్షను వచ్చినప్పుడు ప్రతి పరియాయము కొంతసొమ్ము సంపాదించే యలవాటుగలిగియున్నాను కొన్ని పరియాయములు, ఇద్దఱిదగ్గరా పుచ్చుకోవడం అలవాటు గలదు. ఈమధ్య జరిగిన యెలెక్షనులలో ఒక పక్షమువారువచ్చి అడిగినప్పుడు అవతలవారు నాలుగురూపాయ లిస్తానన్నారు. మీరేమియిస్తారని యడిగితిని, వారు ఆఱురూపాయ లిస్తామని చెప్పిరి. అప్పుడు రెండవవారి వద్దకువెళ్లి వారు ఆఱిస్తామన్నారు, మీరేమిస్తారని యడిగితిని. వారు ఎనిమిదిరూపాయ లిస్తామనిరి ఆసంగతి మొదటివారికి చెప్పగా వారు పది రూపాయ లిస్తామనిరి. ఈ ప్రకారం పోటీలు పెట్టి నా వోటుకు ధర యెక్కించి మొదటివారి దగ్గర పదిరూపాయలు రెండవ వారిదగ్గర యెనిమిదిరూపాయలు పుచ్చుకొని వోటు వేస్తానని యిద్దఱి దగ్గర ప్రమాణముచేసి చివర కిద్దరకు వోటు, ఉపయోగం లేకుండా అడ్డంగా నాలుగుగీతలుగీసి కాగితముపెట్టెలో వేసివచ్చితిని. వెనుక నొక పరియాయము నా మీద రెండు పక్షముల వారికి నమ్మకం లేక యిద్దఱు గూడచెరిరెండు రూపాయలను నా చేతిలో బెట్టి ఊళ్లో

లేకుండా పోమ్మన్నారు, ఈ ప్రకారం యెలెక్షనులు పండుగులు మోస్తరుగా వెంచుకొని యింతడబ్బు గుంజుకుంటూ ఉండేవాడను.

యమ—గనుసుదనమునగా నీదిరా వీలైతే నీవు మమ్ములను గూడ టోపీ పెట్టగలవాడవే! వీడి సంగతి, అలోచించవోయి చిత్రగుప్తుడా.

చిత్ర—వీడి ఒంటినిండా చింతనిప్పులవలె కాలిన యినుప రూపాయలు పెట్టండి. తీసికొనిపొండి.

వోటరు—అయ్యో! ఇంతవరకు వచ్చునని యెఱుగక చేసినాను బాబూ. (అని యేడ్చుచుబోవును.)

యమదూత—ఇదిగో యీ మహానుభావుడింకొక వోటరండి. వీనికథ మఱీ చిత్రమండి. చెప్పవయ్యా.

౮. వోటరు—నా చిత్రకథ చిత్తగించండి. చేసిన పాపము చెప్పిన పోవును. మా యూరిలో బోగముదాని నుంచుకొన్నవాని కెక్కువ గౌరవము. ఊళ్లో యెక్కడనో ముండనుంచుకొన్న వానికంటె యింటియెదుట నుంచుకొన్నవాడు మిక్కిలి గొప్పవాడు. ఇంటియెదర నుంచుకొన్న వానికంటె యింట్లోనే బోగముదాని నుంచినవాడు మఱీ గొప్పవాడు. అట్టివాడూరందఱికి పెద్ద, ఇది మాయూరి మరియాద. నేనొక బోగముదానిని నాయింటిలోనే యుంచుకొన్నాను. నేను నా వోటు ఒక పక్షమువారికిస్తానని ప్రమాణము చేసితిని. రెండవ పక్షము వారిలోగూడ బోగముదాని నుంచుకొన్న వారొకరున్నారు. ఆయన తన బోగముదానిని నాబోగముదానివద్దకు పంపించి వోటు తనపక్షమున నిప్పించుమని బ్రతిమాలించినాడు. నా బోగముది, వోటాపక్షము వారికియ్యనియెడల తాను వెంటనే లేచిపోదునని నన్ను బెదిరించినది. అది వెళ్ళిపోతే నాకు భూలోకమే అక్కఱలేదు. అందు

చేత నేను ఆడినమాట తప్పినా భోగముది చెప్పినట్లు రెండవ వారికే వోటిచ్చినాను.

యమ—పాపమా భోగముదానిని వదిలిపెట్టి యిక్కడి కేలాగునవచ్చినావో తెలియకున్నది.

చిత్ర—ఓరీ వీడిని తీసికొనిపోయి కాలిన యినుప స్తంభములకు కాలిన యినుప గొలుసులు పెట్టి కట్టివేయండి.

యమదూత—స్వామీ! వీడింకొక వోటరండి. నీ గొడవ చెప్పవయ్యా!

౯. వోటరు—మహాప్రభూ! ఎలెక్షనుకు యిద్దరు దరఖాస్తు దారులలో ఆపనికి దగినవాడు మా యిరుగుపొరుగుననే యున్నాడు. మిక్కిలి మంచివాడు. అయినను నేనింత, అప్రయోజకుడనై యుండగా యీతని కెందుకీపని కావాలీయని యోర్వలేమితనముచేత నష్టము కలుగజేయదలచి నావోటిస్తానని చేతిలో చేయివైచి కూడా రెండవ వారికిచ్చినాను. నేను తమపక్షమే యనుకొని మొదటివారు నా యెదుట కొన్ని రహస్యములు చెప్పుకొనుచు వచ్చిరి. ఆమాటలు విని జాగ్రత్తగా అవి రెండవ పక్షమువారితో జెప్పుచూ వచ్చితిని.

యముడు—చాలు చాలు నీ చరిత్ర. ఓరీ వీని చెవులలో యినుపముక్కుల కాకులచేత బొడిపించండి. చిత్రగుప్తుడా యీ వేళకు దర్బారు చాలింతము.

(అందఱు నిష్క్రమింతురు.)

# దంభసన్యాసిప్రహసనము

ఇందువచ్చు పాత్రలు.

వరదరాజు — దైవభక్తిగల బ్రాహ్మణుడు

పేరిందేవి — వరదరాజుభార్య

నరసింహాభారతి. — కలియుగనారదుడని బిరుదుపొందిన సన్యాసి.

## మొదటిరంగము.

[వరదరాజు, పేరిందేవి ప్రవేశించుచున్నారు.]

వరద — సరే! ఈసంసారపుగోడవ లెప్పుడునున్నవే. ఈస్వాములవారి విషయమై చేయవలసిన యేర్పాటుల చేసినావా? ఈయన పదిహేనుదినములనుండి మనయింట్లో ఉన్నారుగదా? ఈయనకు వేరే గది, ఇంకాసర్ది సిద్ధియలేదేమి? ఈయనను, ఈయూరినుండి వెళ్ళనీయకుండా మనయింట్లోనేయుంచి ఆయనపాదము లాశ్రయించి ధన్యుల మగుదాము.

పేరిం — అవును. ఈస్వాములవారు మహానుభావుడు. మనకు పిల్లలులేకుగనుక మనయాస్తి యటువంటిసన్యాసులకు పూజలుచేయడం క్రింద వినియోగించడమే మంచిది. ఈయనను మరెక్కడికి వెళ్ళనీయవద్దు. అన్నియుపచారములు మనమిద్దఱమే చేయుదము. ఆయన తండ్రివంటివాడు. వేదాంతములో నింతవారు లేరని మనరామశాస్త్రిగారు మొన్న నెవరితోనో చెప్పుచుండగా నేనువిన్నాను. ఈయనవల్ల మనగృహపావన మైనది.

వరద — సందేహమా! నీమనసులోగూడ నిటువంటి భక్తియుండుటచేత నేనెంతో యదృష్టవంతుడను. బ్రాహ్మణులు, ఏకాభి

ప్రాయముకలిగియుంటె సరిగా నడుస్తుంది. నేను బజారునకు పోయి వచ్చెదను. ఆయనకు గదిసర్ది యిచ్చివేయి.

(అని యిద్దఱు నిష్క్రమింతురు)

---

## రెండవరంగము.

[నరసింహభారతీస్వాములవారు ప్రవేశించుచున్నారు.]

నర—(తనలో) ఆహావా ! నాప్రయత్నము నేటికి సఫలమయ్యెటట్టు కనబడుచున్నది. నేను భార్యమీద కోపగించి జందెమును తెంపుకొని సన్యసించిన అపాత్రుడనని యిక్కడివారికెవరికి తెలియదు. ఏదో విధముగ రూపాయలు సంగ్రహించి నాపెండ్లాము బిడ్డలకు పంపుటకై యీ వేషము నిక్కిలి యుపయోగించుచున్నదన్నమాట యిక్కడివారికసలే తెలియదు. కాబట్టి నేను మిక్కిలి ధన్యుడను. ఈయింట్లో నా దావాయము చక్కగా పారుచున్నది. ఈయజమానుడు వెఱ్ఱివాడు. భార్య, అంతకన్న వెఱ్ఱిది. ఈయిద్దఱు మూర్ఖతచేత నాకల్లవైరాగ్యపు మాటలునమ్మి నన్నే దైవముగ భావించుచున్నారు, ఇంతనమ్మకము నామీదకుదిరినందుకు, ఈదంపతుల కిద్దఱికి విరోధము పెట్టెదను. వరదరాజును నాస్వాధీనము జేసికొని వానిచేత సాలుసకు పండ్రెండువందల రూపాయలువచ్చే అశనియాస్తి వేదపాఠశాలలు శాస్త్రపాఠశాలలు పెట్టిస్తానని చెప్పి నాపేర వ్రాయించుకుంటాను. అప్పుడు నావ్రతము సంపూర్తి యగును. ఏయుపాయముచేత వీరికిద్దఱకు విరోధముబెట్టుదు చెప్పుమా!

(అని యాలోచించును.)

[అప్పుడు పేరిందేవి ప్రవేశించును]

పేరిం—స్వామీ! నీళ్ళుకాగినవి. ఇవిగో పాంకోళ్ళు తెచ్చినాను ధావళీ లెండినవి. తమరు స్నానమునకు దయచేయవలెను.

నర—వరదరాజుగారు వచ్చినారా ?

పేరిం—మీస్నానము జపము అయ్యేటప్పటి కాయనవస్తారు. మీరు ముందులెండి,

నర—సరే (అని వెళ్ళును. ఇద్దఱునిష్క్రమింతురు)

---

మూడవరంగము.

వంటయిల్లు.

[నరసింహ భారతియు పేరిందేవియు ప్రవేశింతురు.]

నర—అమ్మా ! ఆయనయింకను దయచేయలేదేమి ?

పేరిం—ఏమో తెలియదు మీరుముందు భిక్షకానియ్యండి మీకు పొద్దుపోయినది.

నర—వద్దు. వద్దు. ఆయనను రానీయి. సన్యాసులకు ఆకలేమిటి దప్పికఏమిటి శరీరము నిలవదేమోయని నాలుగు కబళములు తింటాము కాని మాకు ఆకలియున్నదా ? ఈలోపుగా యేవైనాకొన్ని పురాణగాథలు చెపుతానువిను.

పేరిం—స్వామి ! గాథలకేమిగాని, ఒకటడుగుతాను చెప్పండి. పూర్వజన్మములో, ఏమనుష్యులెవరైయుండిరో మీరుచెప్పగలరని యందరు అంటున్నారు. పూర్వజన్మములో నేనెవరో మావారెవరో కొంచెము సెలవియ్యవలెను.

నర—(తనలో) మంచిసమయము చిక్కినది. ఇదే దివ్యమైన యదను. (ప్రకాశముగా) అమ్మా ! నీవు పూర్వజన్మమందు కాశ్మీర మహారాజు కూతురవు. అప్పుడు క్షత్రియకన్యవై యెందరో బ్రాహ్మణులను బూజించుటవలన నీజన్మములో బ్రాహ్మణస్త్రీవైతివి. ముందు

జన్మములో దేవతాకన్యవగుదువు. నీభర్తమాత్రము....(అని యూరకొనెను)

పేరిం—ఊరకుండి రేమి ? ఆయన యేమగు? చెప్పండి చెప్పండి.

నర—పోనిస్తూ! ఆగొడవెందుకు. చెప్పినట్టయితే చాలాచిక్కులున్నవి.

పేరిం—ఏమీచిక్కులు లేవు. చెప్పండి. చెప్పకపోతే నన్ను చంపుకుతిన్నట్లే.

నర—ఒట్టుకూడా పెట్టినావు. ఇక నేను చెప్పక తప్పదు. కాని నీ వేమనుకుంటావో యనిచెప్పుటకు నోరురాకున్నది.

పేరిం—నేనేమి యనుకోను, పూర్వజన్మస్థితి ఉన్నదిఉన్నట్లు మీరు చెప్పుచున్నారు గాని యిందులో కల్పించుటకేదీ లేదుగదా. నేనను కొనుటకేమున్నది. కాబట్టి మీరు చెప్పండి.

నర—సరే, ఇక తప్పనిసరివచ్చినది గనుక చెప్పుచున్నాను విను. నీమగడు పూర్వజన్మమందు కొండవీడులో ఉప్పరివాడు. అప్పుడతడు గోచిపెట్టుకొని తట్ట పార చేతబట్టుకొని చెరువులు గుంటలు త్రవ్వుచుండెడివాడు అప్పటివాడిపేరు ఎల్లిగాడు.

పేరిం—రామరామా! నాది యెంతదిక్కుమాలిన బ్రతుకైన దండీ.

నర—ఇందుకనె నేనుచెప్పనన్నాను. ఇకనన్నడగబోకు.

పేరిం—పరవాలేదు చెప్పండి. వినవలసినదేదో విన్నానుకదా! కథ మొండికోకలాగున చేయక సంపూర్తి చేయుండి.

నర—అప్పుడతడు బ్రాహ్మణులనిమిత్త మొక యూరిలో స్వాయముగా ధర్మార్థమొకచెరువు త్రవ్వి యిచ్చినాడు. అందుచేత బ్రాహ్మణుడైనాడు. ఇదినిజమని నేను ఋజువుచేసాను. ఈరాత్రి అతను పండు

కొన్నప్పుడు నీనాలుకతో అతనివీపు నాకిచూడు ఉప్పగానుండును. అప్పుడుప్పరివాడని నీకు తెలియును.

పేరి—సరె తప్పక ఆలాగే యీరాత్రిచేసిచూస్తాను.

(అంతట వరదరాజు ప్రవేశించును)

వర—స్వామి నాకోసము కనిపెట్టుకొనియున్నారేమిటి? ఇదిగో స్నానం చేస్తాను.

(అని స్నానమునకు వెళ్ళివచ్చి స్వామితో గలసి భోజనముచేయును.)



నాల్గవ రంగము.

(అప్పుడు నరసింహ భారతియు, వరదరాజు ప్రవేశించుచున్నారు).

వరద—స్వామీ! ఈరోజున నామూలముగ మీకు భోజనమునకు పొద్దుపోయినది. ఏదో పాడువ్యవహారము ఒకటి వచ్చి నేను వెళ్లవలసివచ్చినది.

నరసిం—ఏమంత పొద్దుపోయినది? ఈమాత్రముపొద్దు పోకుండ సన్యాసులకు జాము ప్రొద్దెక్కేటప్పటికి వండి వడ్డించేవాళ్లెవరు? అయినను నీభార్య అడిగిన ప్రశ్నలవల్ల నాకు ప్రొద్దుపోయినట్టే కనబడలేదు.

వరద—ప్రశ్న లేమిటండోయి. అది శుద్ధవెట్టిమొద్దు. దేవరవారిని అవకతవక ప్రశ్న లేమి అడుగ లేదుగదా?

నర—అబ్బే! అవకతవక ప్రశ్నలుగావు. ఆవిడడిగినవి తెలివైన ప్రశ్నలే. నేను నాభర్తగారు క్రిందటిజన్మలో ఎవరము అని యడిగినది. ఇందులో అవకతవకేమున్నది. తెలివైనప్రశ్నయేగాదా?

వరద—దాని ముగం తెలివి! ఏమి తెలివి లెండి! అయితే మీ రేమి సెలవిచ్చినారు?

నర—ఏదో నాకుదోచినవి రెండుముక్కలు చెప్పాను.

వరద—ఆలాగుకాదు. చెప్పుదురు. నేనెవరిని పూర్వజన్మమందు?

నర—ఇటువంటి వడిగితే దీనిలో అసాధ్యాలు చాలాఉన్నాయి. ఊరుకోండూ, నామాట విని.

వరద—ఊరుకోను. మీరు నాముద్దు చెల్లించాలి. నే నెవరినో చెప్పండి ముందు.

నర—అయితే చెప్పతా విను. నీవు పూర్వజన్మమందు సౌరాష్ట్రదేశ మేలిన మహారాజువు. ఆజన్మలో యుద్ధములుచేసి చాలమందిని చంపితివి. ఒకసారి బ్రహ్మదేవుని గురించి తపస్సుచేసి నీవు బ్రహ్మ ప్రత్యక్షము కాగ రాచపుట్టుకలో హింసచేయవలసి యుండును కాబట్టి నాకు ముందు బ్రాహ్మణజన్మ ఇయ్యవలసినదని యడిగితివి. బ్రహ్మ సరేయని నీకు బ్రాహ్మణజన్మ నిచ్చెను. ఈసంగతులే నీభార్యకు చెప్పితిని,

వరద—(సంతోషముతో) మీయనుగ్రహమువలన నాకుత్తమ జన్మయే కలిగినది. పూర్వజన్మములో నాభార్య యెవరు?

నర—అదే అడగవద్దు.

వరద—అదికూడా తమరు సెలవిచ్చి తీరవలెను.

నర—అందువల్ల మీమనస్సునకు బాధ కలుగుతుంది నేను చెప్పను.

వరద—ఏమీ బాధలుకలుగవు. సందేహించకుండా చెప్పండి.

నర—ఇంత బలవంత పెట్టితె నేమిచేయుదును. చెపుతా విను. నీభార్య క్రిందటి జన్మలో అబ్బా! చెప్పుటకు నోరురాకున్నదయ్యా; ఏమని చెప్పను. క్రిందటి జన్మలో ఆవిడ కుక్క.

వరద—(తనలో) దిక్కుమాలిన జన్మ (ప్రకాశముగా) దానికి బ్రాహ్మణస్త్రీజన్మ యెట్లు కలిగినదండి?

నర—చెప్పుతాను విను. ఆకుక్క గ్రామములో పులియాకులు నాకి యెక్కడెక్కడనో తిరిగి ఒక దేవాలయములో రాత్రులు పడు కునేది కొందరుదొంగలా దేవాలయములో దేవుడుతాలూకు నగలు సొమ్ము హరించవలయునని రాగ యీకుక్క గట్టిగా మొరిగి దొంగ లను నిలవబెట్టెను. అంతలో గ్రామములోని వారందఱు లేచి దొం గలనుతరిమివేసిరి. ఈపుణ్యకార్యము చేయబట్టి దానికిబ్రాహ్మణస్త్రీజన్మ కలిగినది. నామాట అబద్ధము కాదు. అది కుక్కగనకనే ప్రతిదినము నిద్రపోవునపుడు నీవీపు నాకును. యీ వేళ మేలుకొని చూడుము.

వరద—ఆలాగే చేసెద. అబ్బా! ఈకుక్కతో మాట్లాడడ మంటేనే అసహ్యమేస్తూన్నదండి.

నర—ఇదిగో అటువంటి మాటలనకు. నామూలాన్ని నీకీబాధ కలిగినది. నాకు తప్పక నరకం వస్తుంది.

వరద—మరేమీ భయము లేదు. (అని వెళ్ళును).

(ఇద్దరు నిష్క్రమింతురు).

---

అయిదవ రంగము—పడకటిల్లు.

(వరదరాజు పెరిందేవి పండుకొనియుందురు).

పెరిం—(లేచి కూర్చుండి) స్వాములవారు చెప్పినట్లీయన ఉప్ప రివాడగునో కాదో నిజము తెలిసికొనుటకై యీయన వీపు నాకి చూచెదను. ఈయన మేలుకోలేదు గద (చూచి) లేదు లేదు అదిగో నిద్రపోవుచున్నారు.

వరద—(తనలో) ఇది యేమిచేయునో చూచెదను. (అని నిద్రనటించుచుండు)

పేరిం—(మెల్లగా మగనివీపు నాకి) స్వాములవారు చెప్పినట్లీయన పళ్ళుప్పగానే యున్నది. ఈయన తప్పక ఉప్పరివాడే.

నరద—(లేచి) ఛీకుక్కా అవతలకు పో!

పేరిం—ఛీ! ఉప్పరివాడా అవతలకు పో!

నరద—ఇంకా సిగ్గులేక మాట్లాడుతావేమి.

పేరిం—నేనేమి సిగ్గుపడనక్కరలేదు. నీవా తలవంచుకోవాలి.

నర—(లేచి తనలో) ఈకేకలేమిటి చెపుమా! నేను వేసిన విత్తనము చెట్టై ఫలించినట్లు తోస్తుంది. అని (తలుపువద్దకు వెళ్ళి) వరదరాజుగారూ! ఏమిటాగడబిడ యివతలకు రండి. (అప్పు డిద్దరు తలుపు తీసుక యివతల పడుదురు.)

నర—ఏమిటయ్యా! ఈయ డావిడి?

వరద—ఇది నేను నిద్రపోవుచున్నప్పుడు నావీపు నాకుతున్నది. ఇది క్రిందటి జన్మాన్ని కుక్క, ఈకుక్క పెండ్లాము నాకు వద్దు. దీనితో నేను కాపురము చేయును. ఇదిగో సన్యాసులలో గలియుచున్నాను. నాఆస్తి అంతా మీపేర వ్రాసియిస్తాను. మీరేదో మఠము కట్టించండి. (అని జంధెములు తెంపుకొనును).

పేరిం—ఈయన క్రిందటి జన్మాన్ని ఉప్పరివాడు. ఇన్నాళ్ళు యీయనతో కాపురముచేసినదే చాలును. సిగ్గు సిగ్గు. నే నిప్పుడే నాపుట్టినింటికి వెళ్ళిపోవుచున్నాను. ఈమగడు నాకు వద్దు. యీసంసారంవద్దు. నానగలన్నీ మీకిస్తాను. మీరేదైనా ధర్మకార్యం చేయించండి. (అని నగలాయన కిచ్చును.)

నర—అయ్యో! పండువంటి కాపురం చెడగొట్టుకోకండి. మీ దాంపత్యం చూస్తే నాకెంతో ముచ్చటవేసేది. మీరు చిలకా గోరింకలవలె వుంటారనుకొన్నాను. నామాటవిని తొందరపడకండి బాబూ!

(అని యేడ్చును).

వరద—మీరు లక్షచెప్పండి యీకుక్క నాకు వద్దు. ఇదిగో నాయాస్తి మీకిప్పుడే ధారాదత్తము చేయుచున్నాను. రేపుదయం యిక్కడ భోజనంచేస్తే చండాలుడేసరి. సత్రములోనికి వెళదాము పదండి. (అని స్వామినిలాగికొని వీధిలోకి పోవును.)

పేరిం—స్వామీ! తెల్లవారినతరువాత యిక్కడ ఒక గడియైనా ఉండను. ఇక ఈయన మొగము చూడను. (అని గదిలోనికివెళ్ళి తలుపు వేసికొనును).

న—(తనలో) ఇప్పటికి నాసంకల్పము సంపూర్ణముగా నెరవేరినది. ద్వాయము సరిగా పారినది. సన్యాసియైన యీవరదరాజును యేమతంలోనో కాస్త మాత్రవేసి చంపి యీవేయిరూపాయలఆస్తి నా బిడ్డలకు యిచ్చెదను. ఇంతకు వాళ్ళు అదృష్టవంతులు.

(అని అందఱు నిష్క్రమింతురు).



# ముష్టిప్రహసనము



(అప్పుడొకవీధిలో కామయ్య, రామయ్య, భీమయ్య ప్రవేశించుచున్నారు.)

కామ—భీమయ్యా! నీవు తెలియనివాడవు తెలియునట్లుండవు. అన్నిసంగతులు నాకే తెలుసునని సర్వజ్ఞత్వము తెగపలుకు నీకెక్కువ మాణిక్యముశాస్త్రుల్లుగారు ఆలాగున చెప్పుచుండగా నేను విన్నాను మొఱ్ఱోఅంట్టూంటే నీవు నమ్మవేమి ?

భీమ—మాణిక్యముశాస్త్రుల్లుగారు అంతమూర్ఖుడు కాడని నా నమ్మకం. ఈవిధంగా ఆయన చెపుతాడనేనమ్మకం నాకు లేదు. ఇంత అధికంగా ఆయన చెప్తాడా.

కామ—ధర్మమేమిటోయి శాస్త్రము చెప్తూంటేను. ఆయ నను మించిన పండితులీలోకములో యెక్కడాలేరు.

భీమ—పాండిత్య మెవరికి కావాలి. శాస్త్రములుకూడా లోకాచార ప్రకారముండవలెను. కాని లోకవిరుద్ధముగావుంటే యెవరొప్పుకొంటారు.

కామ—మనకీ వివాదమెందుకు? ఇప్పుడే వెళ్లి మాణిక్యము శాస్త్రుల్లుగారిని కనుక్కుందాముండా మన సందేహం తీరిపోతుంది.

భీమ—అదే యుత్తమపక్షము.

(అని యిద్దరు బయలుదేరి మాణిక్యముశాస్త్రిగారి యింటికి వెళ్ళుదురు)

కామ—శాస్త్రుల్లుగారు ! నమోనమః.

భీమ—నమస్కారమండి ! శాస్త్రుల్లుగారు.

మాణి—దీర్ఘాయుష్యమస్తు దయచేయుండి. ఊరక రారు మహాత్ములన్నట్లు తమరేదో పనిలేకుండా దర్శనమీయరు. ఆపనేదో సెలవీయవలెను.

కామ—పనేమిటిలెండి! ఊరికే దర్శనముచేసి వెళ్ళవలెనని వచ్చినాము.

భీమ—అదేమి మాటలండీ! కొంచెము పనిమీదకూడా వచ్చినామండి. మాకిద్దఱకు నొకధర్మసందేహంవచ్చింది. ఆవిషయము తమ దగ్గర నివారణచేసికొందామని వచ్చినాము

మాణి—అదేదో సెలవియ్యండి నాశక్యమయితే సందేహం తీరుస్తాను.

కాము—మనవి చేస్తూన్నాను వినండి. గుడ్డివాళ్ళకు కుంటి వాళ్ళకు ముష్టిపెట్టడంవల్ల పాపమా పుణ్యమా? ఇదియే మాధర్మ సందేహం. పుణ్యము వస్తుందని భీమయ్య వాదము. పాపము వస్తుందని నావాదము. మీరీ సందేహము తీర్చవలెను.

మాణి—ఇది గొప్పసందేహమే. ఈవిషయమై వెనుక నేనొక సారి యుపన్యాసమిచ్చి అందులో యేమిచేయవలెనో స్పష్టముగా చెప్పినానే.

కాము—అవును! అప్పుడు మేమందఱము విన్నామండి.

భీమ—నేనప్పుడూళ్లో లేను వినలేదండి.

మాణి—అలాగైతే మళ్ళీ మనవిచేస్తాను. గుడ్డివాళ్ళు కుంటి వాళ్ళు మూగవాళ్ళు కుష్ఠువాళ్ళు మొదలైనటువంటి అనాథలందఱు దేవుని కాగ్రహపాత్రులు. వారేదో మహాపాతకము చేయబట్టి వారిని దండింపుటకై భగవంతుడు వారికావిధములైన రోగములు తెచ్చిపెట్టి నాడు. రోగములు తెచ్చిపెట్టుటయేగాక యీవిధముగా అన్నములేక మలమల మాడమని కూడా యేర్పరచినాడు. దేవునిచేత శిక్షింపబడ్డ వారిని మనము రక్షింపదలచినయెడల మనమీద దేవునికి తప్పక కోపమువచ్చును. అందుచేత వాళ్ళకు మనము ముష్టివగయిరాలు పెట్ట కూడదు. మరియేవిధమైన సహాయము చేయకూడదు. ఇట్లెందుకు చేయగూడదో మీకు స్పష్టముగా చెపుతాను వినండి. ఒకదేశమును పరిపాలించు రాజున్నాడనుకోండి. ఆయన కొందరు దొంగలను జైను లో పెట్టిస్తాడు. ఆదొంగలకు మీరు పరుపులువేసి పిండివంటలతో భోజనములుపెట్టి సంరక్షణ చేస్తామంటే రాజు ఒప్పుకుంటాడా? రాజు నకు కోపంరాదా? అలాగే భగవంతుడుకూడా తనచేత యెవరు శిక్షింపబడ్డారో వారికి సహాయముచేసిన వారిమీద తప్పకుండా కోపగించును.

శామ—తమరు శెలవిచ్చినది యుక్తియుక్తముగా ఉన్నది వెనుక ఉపన్యాసములో కూడా ఇదే తమరు శెలవు యిచ్చినారు.

భీమ—శాస్త్రులుగారూ! తమరు చాల చదువుకొన్నవారే కాని మీమాటలు కొన్ని యుక్తియుక్తముగా లేవు. ఇది కేవలమన్యాయము. మీమాటనుబట్టి నడచుకుంటే యే ఆపత్తులో ఉన్నవారికిఁగూడ సహాయము చేయగూడదన్నమాటే.

మాణిక్య—సందేహమేమి? ఆపత్తులు మనముచేసిన పాపములనుబట్టి భగవంతుడు విధించినశిక్షలు. కాబట్టి ఆపత్తులున్నవారి కేవిధమైన సహాయమును చేయగూడదు.

భీమ—ఇది మిక్కిలి బాగున్నది. ఇంత లోకవిరుద్ధమైనశాస్త్రము చెప్పినవారు మీరొక్కరే.

శామ—ఆయన మాటమీద నీకువిశ్వాసముంటే సరే, నమ్మకములేకపోతే మాట్లాడకూరుకో. కాని ఆయననేమి అనకు.

భీమ—సరే! (అని లేచిపోవును)

(అందరు నిష్క్రమింతురు.)

---

రెండవరంగము.

(మాణిక్యశాస్త్రిగారి యిల్లు.)

[అప్పుడు మంచముమీద పరుండి మాణిక్యముశాస్త్రిగారు ప్రవేశింతురు.]

మాణి—ఎవరావచ్చేవారు?

భీమ—నేను భీమయ్యనండి. తమకు కొంచెముసుస్తీగా నున్నదని విని చూచిపోవలెనని వచ్చినాను.

మాణి—చిత్తము అనుగ్రహమున్నది గనుక నచ్చినారు. నేనీ వేళకు పదిలంఘనములు. నా భార్య నేటికి మూడు లంఘనములు. మా అత్తగారు లోపలికి రావడానికి వల్లలేదు. నాభార్యకు యీ వేళ ప్రొద్దుట నుండి పరాకుమాటలు వచ్చుచున్నవి. మాపిల్లను పంపించుమని దాని మామగారికి ఉత్తరంవ్రాసినాను. ఇంకా అక్కడనుండి జవాబురాలేదు. మంచి వైద్యుని యెవరినైనా మీరు తీసుకొనివచ్చి నాకు నాభార్యకు మీరు వైద్యము చేయించవలెను. ఇదిగాక మీరొక యేబదిరూపాయలు నాకిప్పించవలెను. ఈరెండు సహాయములు తమవల్లకావలెను.

భీమ—సహాయము చేయుట కేమికాని నాకొక పెద్దభయము పట్టుకొన్నది. మీరాపత్తులోనున్నారు. ఆపదలోనున్నవారిమీద భగవంతునకు కోపముగానుండునని అట్టివారికి సహాయము చేసినవారిమీద కోపమువచ్చునని మీరు సెలవిచ్చినారు. అందుచేత మీకు సహాయము చేసినపక్షమున భగవంతునికోపమునకు పాత్రుడనై యేనరకమునకుబోదునోయని భయమగుచున్నది కాబట్టి మీకు వేయినమస్కారములు. నన్ను నరకములోనికి పంపకండి.

మాణిక్య—(తెల్లబోయి కొంతసేపు మాటాడలేక) భీమయ్యగారూ! నామాట నాకు చక్కగా వప్పగించినారు. అప్పుడెందుకు చెప్పినానో చెప్పినాను ఆమాటలు మీరు మనసులో నుంచుకోవద్దు. ఈయాపత్సముద్రమును దాటించవలెను.

భీమ—మీరుభయపడకండి. నరకములోనికి బోయిననుసరే నేను మీకు సహాయము చేసెదను. ఆపదలోనున్న వారందరవసరములు మీయవసరములవలెనే ఉండును గనుక అటువంటి పిచ్చి యుపదేశములు లోకమునకు చేయకండి. ఇదిగో నేనువెళ్లి వైద్యునిదీసికొని సొమ్ముపట్టుకొనివస్తాను.

(అందరు విస్మయింతురు).

# శవవహనము

## 1 వ రంగము

(అప్పుడు సీతాపతిగారు నీలకంఠముగారు కనకయ్యగారు రామచంద్రయ్యగారు ప్రవేశించుచున్నారు.)

నీల — సీతాపతిగారూ! మీ నాయనగారు చనిపోయినారని మీరు విచారింపవలసిన పనిలేదు. ఆయన చాలా పెద్దలు. అదృష్టవంతులు. మీచేతిలో వెళ్ళడ మల్లా మంచిది.

కన — నిజమే? ఈ మాయరోజులలో కుమాళ్ళ చేతిమీదుగా తలిదండ్రులు వెళ్ళుటంటె ప్రశస్తమేమియు లేదు. ఇది మనము పెళ్ళి లాగున దలచుకోవలెనుగాని చావులాగున దలపగూడదు.

రామ — ఆయనకేమండి సహస్రమాసజీవి. మహారాజులా వెళ్లిపోయినారు.

సీతా — విచారించవలసిన పని లేదు కానండి, నా కుమారుని పెండ్లి చూడకుండా వెళ్లినాడని నాకు విచారముగానున్నది. మా పిల్లవానికి పదియువయేడు. "ఈ మనుమడికి పెండ్లియైతే బొమ్మల పెండ్లి లాగుంటుంది కన్నులారా చూస్తాను. త్వరగా పెండ్లిచెయ్యి నాయనా" యని నన్ను మా నాయనగారు తొందరపెట్టినారు. ఆ పని నేను చేయలేకపోయినాను (అని కన్నులనీరు పెట్టుకొనును.)

నీల — ఇంతకు ఘటనలేకపోయినదిగాని మీ నాయన ముచ్చట తీర్చదలచుకొన్నారుగదా, విచారించకండి. ఇంతకు నక్షత్రంమంచిదేనా?

సీతా — మంచిదికాదండి. ధనిష్ఠాపంచకాలు. అందు చేతనే వొడ్డి గుమ్మముదగ్గర వీధిలో రెండుతడికెలడ్డముకట్టించి అక్కడ పెట్టించినాను.

కన—అవును యెక్కడైతేనేమండి అంతా ఆయనదే.

రామ—మంచిపని జేసినారు. ఈ పిల్లామేక దూడదుడికి యెక్కడికి తీసికొనిపోయి మనము వేరే కాపుర ముండగలము?

(అప్పుడొక పురోహితుడు ప్రవేశించుచున్నాడు)

పురో—సీతాపతిగారూ! చాకలివాడు తేవలసిన వస్తువులు తెచ్చినాడు. అన్నీ తయారైనవి. తమరులేచి స్నానము చెయ్యాలి. నీలకంఠముగారూ! శవము ఇవతలపడే మాటేమిటి? మీరంతా కావలసిన వాళ్ళుగదా.

నీల—నిజమే! యింతకంటె విధాయకమైనపని యేమున్నది? కాని మా యింట్లో కొంచెము అనుపపత్తిగా ఉన్నది

పురో—ఏమనుపపత్తి?

నీల—మా యింటివానికి నెలతప్పినదని రెండవ మాసమని మా వాళ్ళు చెప్పుకొనుచున్నారు. భార్య గర్భిణిగానున్నప్పుడు శవము మోయగూడదుగదా.

పురో—సరే! దానికి మీరేమిచేస్తారు గనుక. పాపము కన కయ్యగారు! తమరేదైనా కొంచెము ఇందులో—

కన—తమరు నన్నడగవలెనా వేరే వీలుంటే నేనే చేస్తును గాదూ. మానాయనగారు బాగున్నారన్న సంగతి మీకు తెలియదూ!

పురో—అన్నట్లు మరచిపోయినాను. నిజమే! రామచంద్రయ్య గారూ, తమమాట యేమిటి?

రామ—నాకు వేరే యభ్యంతరమేమున్నది గనుక. నిన్న శని వారం గనుక నా వ్రతప్రకారం ఏకభుక్తం చేసినాను. అందుచేత కాకచేసి చాలనీరసంగా ఉన్నది. బొత్తిగా ఓపిక లేదు. లేకపోతే మరో మాట చెప్పేవాడినా? ఏమిటి? మేము నాయుడుగారి కొల్లలో నున్నాము.

సీతా—(పురోహితునితో) వాళ్ళకోసం కబురంపించండి. చిక్కొచ్చినప్పుడేమి చేస్తాము మరి.

పురో—చిత్తము. ఓరే పిచ్చిగా నీవు పేటలోనికి వెళ్లి రావువారి కొట్లలో విస్సయ్య, దేవయ్య, అని యిద్దరుంటారు. వాళ్లిద్దరితో సీతాపతిగారియింట్లో జరిగిన సంగతిచెప్పి నలుగురిని వెంటనే తీసుకొనిరా.

పిచ్చి—చిత్తము (అని వెళ్ళును.)

---

## 2 రంగము

(సీతాపతిగారు పురోహితుడు ప్రవేశించు చున్నారు.)

పిచ్చి—ఇదిగో వచ్చారండి, ఆ యిస్సయ్యగారు నేనెళ్లేతప్పటికి మాచముమీదనుండి లెగనే లేదండి. ఆయనుంచుకున్న ముండ బలమంతాన్ని లెగ్గొట్టి పంపిందండి. ఆయన మోమైనా తిన్నగ కడుక్కోకుండా వచ్చాడండి, ఈ రెండో ఆయన గుడిసేటిదానింట్లో నేనెళ్లేతప్పుడికి సద్దికూడు తింటూ వున్నాడు. నన్నుచూచి తలుపు చాటుకు వత్తిగిలిగంజి తాగి చెయికడుక్కొని వచ్చినాడు. ఆ! మొత్తముమీద నలుగురు వచ్చినారండి.

సీతా—ఆ గొడవలన్నీ మనా కెందుకు! వాళ్ళింటిదగ్గర యేమి యేడిస్తే మనకెందుకు. ఇల్లారమ్మను.

(అప్పుడు విస్సయ్యతో పిచ్చిగాడు ప్రవేశించును.)

పిచ్చి—ఇదిగోనండి వచ్చినారు. మన బాబయ్యగారికి జబ్బెక్కువయినప్పటినుండి మన యింటిచుట్టు తిరుగుచుండేవాడండి.

విస్స—ఛీ! నోరుముయ్యి. ఈ యింటిచుట్టు తిరిగేటందుకు నాకేమిపని? ఏలినవారు కబురంపితే వచ్చినానుకాని, ఇంతకుముందీయిల్లే యెరుగనండి నేను.

సీతా—ఊరుకోరా పిచ్చిగా, ఇప్పటి మాటేమిటో చెప్పండి, మీ రేమిపుచ్చుకుంటారు?

విస్స—ఏలినవారికి తెలియనిదేమున్నదండి. మనము మనము ఒక వూరివాళ్ళము కదండి. ఆట్టేనురాశకుపోతే బాగుండదు. కొమ్మకు వరహా చొప్పున నాలుగు నాలుగులు పదహారురూపాయలు దయ చేయించండి.

సీతా—ఇదేమి గోరకలయ్యా! పదహారు రూపాయలు రేటెక్కడాలేదు. మా బాబయ్యగారి వంట్లో రక్తమాంసాలే లేవు, ఇద్దరే మోసికొని పోవచ్చును.

విస్స—ఇద్దర మెక్కడ మోయగలమండి. రెండు మైళ్ళెళ్ళాలి. దాని కష్టసుఖాలు తమకేమి తెలుసు. తమరెప్పుడైనా శవాలు మోశారా. ఏమైనానా?

సీతా—నన్ను శవాలుకూడా మోయమంటావు.

విస్స—అది కాదండి నాకష్టంమాట మనవి చేశాను కాని తమరిని అంత మాటంటానాండి!

సీతా—ఏదో ఒకటి చెప్పు త్వరగాను

విస్స—చెప్పడాని కేముందండి అసలే ఇది నీచపుపని గదండి బ్రాహ్మణజన్మమెత్తి పీనుగుల మోయుటకంటె తప్పేమున్నదండి. పొట్టకోసం యీవృత్తి చేస్తున్నాం. ప్రతంచెడ్డా ఫలము దక్కాలి

సీతా—ఎక్కడాలేని మామూలుటయ్యా మరి?

విస్స—లేకేమండి. దాని వడుపుకొద్దీ యీలా పుచ్చుకొంటూనే యుంటాము. మున్న కన్నయ్యగారు పోయినప్పుడు 24 రూపాయలు పుచ్చుకొన్నాను, కామప్పశాస్త్రుల్లు పోయినప్పుడు 20 రూపాయలు పుచ్చుకొన్నాము. దాని వడుపుకొద్దీ అడుగుతాము. కాక

పోయినా ఎప్పుడైనా నూటి కొకటి వస్తుందికాని తమవంటివారిళ్ళలో తరుచుగా రావుకదండీ!

సీతా—ఛీ! మాయిళ్ళల్లో యిటువంటివి తరుచుగా రావలెనని కూడా కోరుచున్నావు,

విస్స—అదికాదండి నా యభిప్రాయము. ఏలినవారు తప్పట్టుకో వద్దు. మాకిదేవృత్తి. మరియొక శుభకార్యాలలో మీరు దరికి జేర నియ్యరు. ఎప్పుడో నూటికొకటి వచ్చినప్పు డందులో తక్కువచేస్తే మే మెల్లా బ్రతకమని మనవిజేస్తూన్నానండి.

సీతా—మూడువరహాలు పుచ్చుకొని కార్యము కానిచ్చెయ్యి

విస్స—బాబు యీ పరియాయము నేను మనవి చేసినట్టు పోనియ్యండి. ఇప్పుడు వ్యవహారం రద్దీగానుంది. మాకు నాలుగు డబ్బు లొచ్చేరోజు లివ్వేనండి. వూళ్ళోకలరా ప్రవేశించినది. అవతల మూడు వరహా లిస్తామని ఒకరు కబురుపంపుతే వెళ్ళక తమ కబురు మీద యిక్కడికి వచ్చినాము. ఈ పరియాయం యీలా కానియ్యండి. మీ యింట్లో మరియొక పరియాయము చవుకగా పనిచేస్తాను.

సీతా—(కోపముతో) ఛీఛీ! నోరుముయ్యి నిర్భాగ్యపుముండా కొడకా, మా యింట్లో మరియొకసారి చవుకగా పనిచేస్తావా? నీకోసము యింటిల్లపాదిని చావమంటావా యేమిటి?

విస్స—బాబయ్యా తమ రాగ్రహపడవద్దు. పసి రద్దీమూలాన్ని వీలులేదని మనవిచేశాను. కాని మరియొకటి కాదండి. మావల్ల లోపా లోపములుంటే తమరు క్షమించాలి.

సీతా—పిచ్చిగా! మన పురోహితుడుగారు కామశాస్త్రుల్లు గారు దొడ్లో యున్నారు. పిల్చుకొనిరా.

పిచ్చి—చిత్తము. (అని ఆయనను తీసుకొనివచ్చును.)

పురో—ఏమి శెలవు, పిల్పించిన దేలాగ్గా?

సీతా—ఈ నిర్భాగ్యులతో నేను మాట్లాడను. మీ రవత లకు తీసుకొనివెళ్లి మాట్లాడి తేల్చండి.

పురో—విస్సయ్యా! ఇల్లారా (అని అవతలకు తీసుకొనిపోయి ఏదో చప్పన తేల్చు. ప్రొద్దెక్కుచున్నది.

విస్స—ఏమి తేల్చునండి! ఈలాటి గొప్ప స్తలములలో మాకు వచ్చేది మీరు చెడగొట్టవద్దు. ఈ లాంటిది మీ యింట్లో అయితే వూరికే మోసినా మోసినవాళ్ళమే. ఒక్కవరహాకు మోసినా మోసినా మోసినవాళ్ళమే.

పురో—నారాయణ నారాయణ. ఇంతదిక్కుమాలిన నోళ్ళేమి రామీవి. మా యింట్లో యిటువంటిది రావాలని, చవుకగా పనిచెయ్యా లని మీ కోరికలా? సరే నీ యిష్టముప్రకారం చేయిస్తాను. ఇక మాట్లాడకు. (అని లోపలికివెళ్లి) నా మనవి చిత్తగించి వాళ్ళుచెప్పి నట్లు వప్పుకోండి. వాళ్ళు పచ్చి కసాయి ముండాకొడుకులు. ఏమీ వప్పుకొనుటలేదు. పైగాను మీ యింట్లో వస్తే చవుకగా చేస్తా మన్నారు.

సీతా—సరే రమ్మనండి. కర్మగోదావరివస్తుసే చేద్దాము.

(అంతట సీతాపతిగారు నిప్పుపట్టుకొనగా విస్సయ్య మొదలగు నలుగురు బ్రాహ్మణులు పాడెపట్టుకొని పోవుచున్నారు.)

(అందరు నిష్క్రమించుచున్నారు.)



# కాండూరి జానకిరామయ్యగారి పెండ్లి

## రంగము. 1

[జానకిరామయ్యగారు జగన్నాథంగారు భైరవసిద్ధాంతిగారు
ప్రవేశించుచున్నారు.]

జగ—జానకిరామయ్య బావగారూ! పెద్దకాలంలో తమకు చాలా కష్టము వచ్చినది. ఈవయస్సులో తమకు కళత్రవియోగం కావడల చాలా బాధకరం. అది యెంత బాధకరమో కొంతకాల మను భవించినవాడిని నాకు తెలుసును, భగవంతునికి తెలుసును.

భైర—సందేహ మేమండి. నాకుగూడా యీమధ్య నిటువంటి చిక్కే తటస్థించుటచేత పదిహేనువందల రూపాయిలకు నాయిల్లు అన్నీ తాకట్టుపెట్టి పదేళ్ల రండ నొకదాన్ని కట్టుకొన్నాను, ఇన్నాళ్ళు బ్రతికి ఆఖరికి అపత్నీకుడనై చావనాయను ఆభిమానముచేత తంటాలు పడ్డాను. ఏపెళ్ళిలో సదస్యమునకు వెళ్ళినా అపత్నీకుడికి తాంబూలం యివ్వమంటూ వచ్చినారు. అందుచేత ఆలా చేయవలసివచ్చినది.

జాన—(నిట్టూర్పువిడిచి) తమరు సెలవిచ్చినట్లు యిటువంటి బాధ మఱియొకటి లేదండి. కొంప గుండం వేసుకొనిపోయినదికాదండి? జిహ్వ చచ్చిపోయినది, కుడిభుజము పడిపోయినదండీ. ఆరోజు మొదలు కొని నాయిల్లు చీకటికోణమయినది. ముందుదారి నాకేమి పొడగట్టడంలేదు.

భైర—మీకేమండీ మహారాజులు. తమకు కొడుకులు కోడళ్లు మనుమలు మనుమరాండ్రు పెళ్ళమని సుర్యోధనసంపత్తిగానుంది. తమరు జరుగుబాటు [illegible]

జగ—భైరవసిద్ధాంతిగారూ! మీకుగూడపిచ్చాయేమిటి. ఈ పిదపకాలంలో యెక్కడికొడుకులు యెక్కడికోడళ్ళు యెక్కడి జరుగుబాట్లు? అవిపూర్వపుమాటలు. కొడుకులకా మాతాపితృభక్తులు? కోడళ్ళకా అత్తమామల భక్తులు? మునుపటికాలంలోనే అంతరించినవి. కాస్త తల్లిదండ్రిమీద భక్తియున్నవాళ్ళం మనమేగాని యీనాటివాళ్ళకు లేదండి. ఈనాటి కోడళ్ళు ముసిలిముండావాళ్లకేసిచూస్తారా! వాళ్ళవెకవెకలు వాళ్ళ పకపకలు పోకులు అవ్వేకాని వాళ్లకు కళ్ళు కనబడతాయండి?

జాన—మీకడుపుచల్లగా నిజం చెప్పారండి జగన్నాథంగారూ! మనము సుఖపడాలంటే మనవస్తు వుండాలండి; మనవాళ్ళు కానైతే మంచివాళ్ళేకాని అయితేనేమండి భార్యాదారివేరు, బిడ్డలు కోడళ్ళు దారి వేరు.

భైర—(తనలో) ఈయనకు డబ్బదియేండ్లున్నప్పటికి పెండ్లి చేసుకోవలెనను గట్టిసంకల్పము కలిగినది. అందుచేతనే కొడుకులు కోడళ్ళు యీయనకెన్నో యుపచారములు చేస్తూన్నప్పటికి జరుగుబాటు లేదని పెండ్లికోసము దొంగయెత్తులు వేస్తూయున్నాడు. (ప్రకాశముగా) తమరు శెలవిచ్చినది సత్యమేనండి.

జగ .. కనకనే ముందుదారి నేనుచునవిచేస్తూన్నానండి. మీరు వివాహము చేసుకొండి.

జాన—సరిసరి, నాకిప్పుడు వివాహమేమిటి? బావగారూ! నాకు పిల్లనిచ్చేవాడెవడు?

జగ—ఇచ్చేవారుంటే చేసుకుంటారా! ఇవ్వకేమి నాకివ్వలేదా, పురుషోత్తమరావుగారి కివ్వలేదా? బుచ్చిరాజుగారి కివ్వలేదా, ఈభైరవసిద్ధాంతిగారి కివ్వలేదా.

భైర—సరి సరి నామాటకేమి. నేను జానకిరామయ్యగారి కంటె చాలా చిన్నవాడిని.

జాన—ఇదొకటా కొత్తవింత. మీరు బాగా పదిపద్ధాలు వెళ్ళివచ్చి షోడశబ్రాహ్మణార్థాలు చేస్తూండేటప్పటికి నేను గోచీ పెట్టుకొని అప్పుడప్పుడే బడిలోనికి వెళ్ళుచుండేవాడిని.

జగ—వయస్సుల కేమిలెండి, ఉన్నన్ని ఉన్నాయి లేనన్ని లేవు దానికేమి. నేనడిగిన మాటకు సమాధానం చెప్పండి. ఇచ్చేవారుంటే మీరు పెండ్లాడుతారా?

జాన—మీరంతా యీలా బలవంత పెడుతూంటే నేను మీలాగే చేస్తే బాగుంటుందామని. కాని నలుగురు నవ్వుతారేమో యని భయమేస్తూంది.

జగ—ఎవడా నవ్వేవాడు. కుక్కలు మొఱిగితే ఏనుగు పరువు తేమి పోతుంది చెప్పండి. మనమేమైనా కానిపని చేసూన్నాము కనకనా నవ్వేటందుకు. పడిపోయిన కొంప నిలబెట్టుకుంటూన్నాము. అదీ తప్పేనా!

జాన—ఈ పేపర్లొకటున్నాయిగాదండీ. ఈ పేపర్లఘుండా వాళ్ళకి కావలసినదీ అక్కరలేనిదిలేదు.

జగ—వెధవపేపర్ల మాటెందుకు. నేను పేపర్లెప్పుడు చూడనే చూడను. ఈనవనాగరికులన్నా పేపర్లన్నా నాకుమంట. నవ్వడమెందుకు. మనభీమరాజుగారికి 65 వ యేట పెండ్లి అయినది. ఆఱుగురు పిల్లలు పుట్టినారు. మనం పెండ్లిచేసుకొన్నామని ఆక్షేపించే యీపడుచు నిర్భాగ్యులలో కొందరికి పిల్లలేలేరు. వాళ్ళకూతలు లెక్కేమిటి. ఇకనేను సెలవు పుచ్చుకుంటాను. నాకవతల పనియున్నది. తక్కినసంగతులు మనభైరవసిద్ధాంతిగారు రేపు మాట్లాడుతారు. లేవండి. మీకూ భోజనానికి ప్రొద్దుపోయినది.

(అని అందఱు నిష్క్రమింతురు.)

రెండవ రంగము.

(అప్పుడు జానకిరామయ్యగారు భైరవసిద్ధాంతిగారు
ప్రవేశించుచున్నారు)

జానకి—సిద్ధాంతిగారూ! మీరేవో మాట్లాడుతారని మొన్న జగన్నాథంగారు వెళ్ళేటప్పుడు సెలవిచ్చినారు. ఆ విశేషాలేమిటో సెలవియ్యండి.

భైర—సెలవిచ్చుట కేమున్నది. తమ వివాహవిషయమే. నే నొక సంబంధం కుదుర్చుకొని వచ్చినాను. పిల్ల పండ్రెండేండ్లది. లక్షణంగా నుంటుంది. సాంప్రదాయానికి వేరే లోటులేదు. అన్నోదకాలికి లోపములేదు. ఆ బ్రాహ్మణుడు తదన్నం తద్రసంతిని గౌరవముగా కాలక్షేపము చేయుచున్నాడు.

జానకి—ఎవరాయనపేరు చెప్పరేమి?

భైర—మరెవరుగారు. మన మొడవిల్లి మంగయ్యగారు.

జానకి—ఆయనా, సరిసరి. ఇవ్వడాని కొప్పుకొన్నాడూ! పిల్ల లక్షణంగానే యుంటుంది చూచినాను. మొన్న శ్రావణమాసములో మా యింటికి తల్లీ కూతురు పేరంటమునకు వచ్చినారు. అయితే కన్యాదానమే చేస్తాడా? ఏమైన అపేక్ష యున్నదా?

భైర—అతఁడు కానైతే కన్యాదానంచేసే సాహసం గలవాఁడే కాని స్థితిగతులు కొంచెము తక్కువ. పైగా ఋణగ్రస్తుఁడైయున్నాడు అందుచేత నీ సంగతి మీతో మనవిచేయుమన్నాడు.

జానకి—ముసుగులో గుద్దులాటెందుకు స్పష్టంగా చెప్పండి యేమి కావలెనో.

భైర—పెండ్లికూతురుతల్లి పన్నెండువందల రూపాయలు కావలె నంటుంది. అందులో వెయ్యి రూపాయలు అప్పు తీర్చుకొంటారట, తక్కిన రెండువందలు [illegible] తీసికొంటుందట.

జానకి—సొమ్ముకేమి. అది లెక్కలేదు. రహితపరచుకొని వస్తురూ. అల్లాగే యిస్తాను.

భైర—రహితమున కేమున్నది. తల్లిదండ్రు లిద్దఱు వప్పుకొన్నారు. పిల్లదాని తాతయున్నాడు. అనగా తల్లితండ్రి. ఆయనకు మీ వయస్సే ఉంటుంది. ఆయన పండువంటి పిల్లదాన్ని కాటికి కాళ్ళుజాపుకొన్న ముసలి ముండా వాడికిచ్చి గొంతుక కోస్తారుటత్రా యని వాళ్లను తిట్టుతూ ఉన్నాడు. అందుచేత వాళ్ళు తటపటాయిస్తూన్నారు. ఆయన రెండురోజులలో ఊరికి వెళ్లిపోవుచున్నాడు. ఆయనగారే నన్ను మీ వయస్సెంతో కనుక్కొని రమ్మనమన్నాడు.

జానకి—ఇదోగడ్డొచ్చిందీ మళ్లీ. ఆ ముండాకొడుకు మొగాన్ని కూడా వందరూపాయలు పారవేస్తే వూరుకోడూ?

భైర—వాడికాగోడవలున్నట్టు కనబడదు.

జానకి—అయితే మీరోపని చేయండి. నాకు ఏభైయో యేభైయైదో యున్నట్టుగా నొక జాతకం తయారు చేయండి. అది ఆయనకు చూపెడదాము.

భైర—మీరు పించను పుచ్చుకొనే అయిదేళ్లయినదిగదా ఏభై యేళ్ళంటే ఆ ముసలవాడు నమ్ముతాడా?

జానకి—నమ్మకేమండి మసిబూసి నేరేడుకాయచేసి యేదో జాతకంమీరు వ్రాస్తురూ. అది ఆధారముచేసుకొని మనము యేభై యేళ్ళ అందాము.

భైర—మీ పెద్దకొడుకే ముప్పైయైదు యేళ్ళున్నట్టు కనబడతుంది.

జానకి—వానికి ముప్పదియైదెక్కడున్నాయి. మొన్నటి కుఱ్ఱాడు కాకపోయినా పదహారోయేట పిల్లలు పుట్టినవాళ్ళు లోకంలో లేరూ.

షైర—లే కేమి ఆగయ్యాళి ముండాకొడుకు నమ్మడుగాని ఇది గాక మరోయిబ్బందికూడ ఉందని చెప్పకుంటూన్నారు. ఆ పిల్లయేమో ఆడపిల్లల స్కూల్లోకి వెళ్లి చదువు చున్నదట. ఆ చిన్నదేమో నాకీ ముసలిమగడక్కర లేదంటూన్నదట

జానకి—(కోపముతో) ఏడిశింది అవకతవక పిల్ల దానిష్టమేనా యేమిటి. యిప్పుడొచ్చాయి వెధవస్కూళ్ళు, వెధవచదువులు ఆడపిల్లలకి. వంటపొయిదగ్గర కూర్చుని యింతవుడకేసి చాకిరీలు చేసేవాళ్ళకి చదువెందుకయ్యా. వీళ్ళుద్యోగాలు చేస్తారా; ఊళ్ళేలుతారా? చదువుచెప్పిస్తే యేమంటుంది మగడేవద్దంటుంది.

షైర—పిల్లముండ. దానిమాటకేమిలెండి అదెల్లాగో ఒకలాగు సొసాయిస్తాము. దాని యిష్టమా యేమిటి. రెండవ జాతకం వ్రాయడానికి తమజన్మ సంవత్సరం చెప్పండి.

జానకి—అసలు పరాభవలో పుట్టినాను. ఇప్పుడు సాధారణ సంవత్సరంకదా! నిజానికి అరవైయైదేళ్ళున్నాయి. పదోపన్నెండో తగ్గించి మీ యిష్టమువచ్చిన సంవత్సరములో జననం వేసి జాతకము వ్రాయండి. నాకు యేభైయేళ్ళున్నాయన్నా నమ్ముతారు నాది కాయశరీరం.

షైర— నా పాట్లేవో నేను పడతాను. ఎల్లాగో సొసాయిస్తే సరిగదా మీ కెందుకు.

జానకి—మీకిందులో ఒకయేభై రూపాయలు ముట్టచెప్పాలని యున్నది.

షైర—ఆమాట తలపెట్టకండి. వెధవసొమ్ము సొమ్ముకేమి. మీ యవస్థచూస్తే నాకు కడుపు దరిగోసుకుపోతూయున్నది. మిమ్మలినొక యింటివాడిని చేసి మాటదక్కించుకోవలెనని యున్నది. దైవఘటన యేలాగున నున్నదో తెలియదు.

జానకి — సిద్ధాంతిగారూ! మీరు పూర్వకాలము మనుష్యులు కనక స్నేహధర్మం కలిగి నా విషయమై యింత పరితాపము పడు చున్నారు. ఈ కాలపువాళ్ళకిటువంటి స్నేహధర్మా లున్నాయా? అయితే చూడండీ! పిల్లనిచ్చేటట్టుగా తల్లిదండ్రులతోటి మూడువేల రూపాయలు నగలు పెడతారు. బంగారిపుజడ, కట్టు కాసులపేరు, మొహారీలపేరు అన్నీ పెడతారని చెప్పండి! దక్షిణాది చీరలు పునహా చీరలు బనారసు చీరలు రెండు పెట్టెలతో నున్నాయి. అవి అన్నీ యిస్తారని చెప్పండి. హాయిగా మేడమీద నుండవచ్చునని చెప్పండి.

భైర — చెప్పడానికేమి. అన్నీ చెబుతాను. కుదుర్చుకొని వస్తాను. నాకుచాలా అవుసరముగా నున్నది. ఒక్కపాతిక రూపాయలు బదులిస్తారూ నెల్లాళ్ళలో యిస్తాను.

జానకి — సరి దీనికి బదులెందుకండి పుచ్చుకోండి. (అని సందు వాతాళముతీసి సొమ్మిచ్చును.)

భైర — బదులైతేనేగాని నేను పుచ్చుకొనే పుచ్చుకోను. సెలవుపుచ్చుకొని రేపువస్తాను. ముహూర్తమే కుదుర్చుకొనివస్తా.

(అని లెక్కపెట్టుకొని రొంటిని దోపును.)

(అందఱు నిష్క్రమింతురు.)

---

మూడవరంగము — మంగయ్యగారియిల్లు.

[ఎడవల్లిమంగయ్య, భైరవసిద్ధాంతి ప్రవేశించుచున్నారు.]

మంగ — కట్నులమాటయేమిటి. నాకాయనిచ్చే సొమ్మంతా నాఅప్పులకిందే పోతుంది. రెండువందల రూపాయలైనా యుంటేనే గాని యింత పప్పూఅన్నంపెట్టి నలుగురు బందుగులను పంపడంకాదు. ఇదికూడా పెండ్లికొడుకు దగ్గరనే పుచ్చుకొనవలెను

భైర—ఆయనతో జెప్పి నేనిప్పిస్తాగాదూ. సత్యా నీమామ గారి పోరాటము వదుల్చు ముందు ఆయన బొత్తిగా పిల్లనేయివ్వడానికి వల్లకాదంటూన్నాడుకాదూ.

మంగ—అవకతవక ముండాకొడుకు. ఆయనతో యేమిటి పోనిస్తూ. రాత్రి మేమిద్దరము దెబ్బలాడుకున్నాము. ముసలివాడికి పిల్లనియ్యవద్దని ఆయన, యిస్తానని నేను పట్టింపులు పట్టుకొన్నాము. చివరకు మాటమాటావచ్చి ఆయనజందెము తెంపుకొని అన్నంమానుకొని లేచిపోయినాడు. కాకపోయినా నాపిల్లకు వాడెవడయ్యా ? మాపిల్లను మాయిష్టమువచ్చినట్టు చేసికొంటాము.

భైర—నిజమే. ఆయన వెళ్ళిపోవడంవల్ల సుముహూర్తము తప్పకుండా జరుగుతుంది. మనమిప్పుడు జానకిరామయ్యగారి యింటికి వెళ్లి తాంబూలాలు పుచ్చుకొని ముహూర్తము రహితముచేసికొని వద్దామురండి ఆయనదగ్గరమాత్రము మీరు మరొకమాట అనవద్దు. ఎందుకంటే ఆయనను మంచిమాటాడితే నీయిల్లు బంగారమైపోతుంది. ఎందుకంటే ముసలిముండాకొడుకునకు పెండ్లాముదొరికినా పిల్లవాడికి గుడ్డపేలికిదొరకినా వదిలిపెట్టడని యొకసామెత యున్నది. అదినిజము. నీకూతురుకాపరానికి వెళ్ళనిస్తూ. వాడింట్లో యున్న సొమ్మంతా నియింట్లో పడుతుంది. ఇప్పుడునాలుగు వేలరూపాయలు నగలుపెడతాడు

మంగ—నగలుపెడితే మనకేమి వస్తుందయ్యా. అందులోది యేమైనా మనము ముట్టుకొనుటకు వల్లా యేమైనానా ?

భైర—ఆయన అయిదువేలరూపాయలకు భీమాచేయించినారు ఆభీమాసొమ్ము కూడా యీపిల్లపేర ట్రాన్సుఫరు చేయిస్తాడు. ఇది గాక నాలుగువందలో యూడువందలో వచ్చేభూములు మీపిల్లపేర వ్రాయిస్తాను. పిల్ల కాపరానికి రానిస్తూ. ఈముండాకొడుకు కుక్కలాగు మీరుచెప్పినట్లు వింటాడు. ఇన్నిమాటలెందుకు మంగమ్మబావా !

ఒక్కమాట చెబుతానువిను. నేను అమంగళం పలికినానని నన్ను తిట్టకు. ఈ ముండాకొడుకునకు, అతి మూత్రము రోగమున్నది. మహా బ్రతికితే అయిదేళ్ళుబ్రతికేను ఆరేళ్ళు బ్రతికేను. ఏరాచపుండో వేసి చస్తాడు. నీకు అమాంబాపతు పాతికి వేలరూపాయల ఆస్తి కలుస్తుంది. ఇంతకు నీపిల్లలజాతకం మంచిది.

మంగ— ఆమాటెందుకు పోనిస్తూ. వాళ్ళు పదికాలాలపాటు బ్రతికియుండాలని నాకోరిక. నడవండి వెడదాము వారింటికి.

(అని యిద్దరు నిష్క్రమించుచున్నారు.)



4 వ రం గ ము.

(జానకిరామయ్యగారి యిల్లు)

(భైరవ సిద్ధాంతి మంగయ్య గుమ్మముముందర నిలచుచున్నారు.)

భైర— మంగయ్యబావా! నీవు కొంచెము సేపు యీయరుగు మీద కూర్చుండుము. నేను కొంచెము సేపు జానకిరామయ్యగారితో పెండ్లికర్చులసంగతి మాట్లాడి నిన్ను పిలుస్తాను. అప్పుడు నీవు మేడ మీదికి రావచ్చును.

మంగ— సరే! యిక్కడే కూర్చుంటాను.

(అని అరుగుమీద కూర్చుండును.)

భైర— (లోపలికివెళ్ళి మేడయెక్కి) జానికిరామయ్యగారూ! ఎక్కడనున్నారు?

(అప్పుడు తివాసీమీద కూర్చుని ప్రవేశింతురు)

జాన— ఇలాదయచేయండి. ఇక్కడ. ఇక్కడ.

భైర— [illegible] పెండ్లికర్చు [illegible] తగాదా

వచ్చినది. ఆయన పెట్టుకోలేనంటూన్నాడు అవికూడా మీరేవహిం చాలట.

జాన—ఎంతవుతుంది ?

భైర—రెండువంద లవుతుందన్నారు.

జాన—సరే యిచ్చివేస్తాను. కాని నేనీరొక్కమిచ్చి పిల్లని కొన్నట్లు పెండ్లికర్చులుకూడా యిచ్చినట్టు లోకంలో యెక్కడా తెలి యనీయకండి. నాకు అప్రతిష్టగా నుంటుంది.

భైర—నయమింకా. ఈసంగతి రెండవవారికి తెలియనిస్తానా.

జాన—అయితే ఆముసలాయన యేమంటున్నాడు? పిల్ల యేమంటూన్నది? సంగతేమిటి ?

భైర—ముసలాయన అలుకుతో తగాదాపడి లేచిపోయినా డు. పిల్ల యింకా గుణుస్తూందట. పిల్లరండ దానికేమిటి. పిల్లముండకు చదువు చెప్పించడం ఒక అనర్థకం; రెండవది పండ్రెండేండ్లు వచ్చినదాక పెండ్లి చేయకుండావుంచడం వొక అనర్థకం చిన్నప్పుడే పెండ్లిచేస్తె యీ బాధ లుండవు.

జాన—నిజమే అందుకే మన పెద్దలు చిన్నతనములో పెండ్లి చేయుమని ఆడవానికి చదువుకూడదు అంటారు.

భైర—మీమామగారువచ్చి క్రిందకూర్చున్నారు. ముహూర్త ము స్థిరపరచుకొనేందుకు వచ్చినారు. ఆయనను కేకవేస్తునా

జాన—రమ్మనండి.

భైర—(మేడవసారామీదికి వెళ్ళి) మంగయ్యగారూ! దయ చేయండి.

మంగ—(పైకి వెళ్లి) నమస్కారము జానకిరామయ్యగారు.

భైర—వద్దు వద్దు. నీవాయనకు నమస్కారము చేయకూడదు నీవు మామగారూ, ఆయన అల్లుడు వరుసలో ఆయన చాలాపెద్ద

లైనా వానికి నీవు పెద్దవాడవు గనుక నీవు నమస్కారము చేయగూడదు. జానకిరామయ్యగారూ! మంగయ్య కాట్టే వయస్సులేదు. మీ పెద్దబ్బాయి యీడువాడు. ఈమనభార్యయైనా మీపెద్దమ్మాయి యీడుది.

జాన—నాకైనా వయస్సాట్టే లేదండి. త్వరగా పించనుపుచ్చుకొన్నాను గనుక పెద్దవాడిలా కనబడతాను.

మంగ—ఫరవాలేదు. ఈవయస్సు కేమండీ. మిమ్మల్నిమళ్ళీ వకయింటివారిని చేయడంవల్ల నాకెంతో పుణ్యము వస్తుందని మీకు పిల్లనిస్తూన్నాను. మీవయస్సొకలెక్కా? మీకంటె రెట్టింపు వయస్సుగలవాళ్లు పెళ్లాడుచున్నారు. నాపిల్లదాని అదృష్టము బాగుంటె మీరు వేయేళ్ళుకీ వర్ధిల్లగూడదూ?

భైర—సందేహమేమిటి. ఈయనే నూరేళ్ళుబతికి మీపిల్లదానివల్ల కొడుకులను కూతుళ్ళను కంటారుచూడు. ముహూర్తము స్థిరపరచండి. మళ్లీ బుధవారము మంచిముహూర్త మున్నది. ఆముహూర్తము పంచకరహితమై యున్నది. తారాబల చంద్రబలములు సరిపోయినవి.

జాన—సరే బాగానేయున్నది. అది నాకిష్టమే.

భైర—అనుకున్నట్టు మంగయ్యగారికి సొమ్మొయిప్పించివేయండి

జాన—మీకు కాసులిస్తాను పుచ్చుకోండి. అమాంబాపతు నూరుకాసులుయిస్తాను. అనగా పదిహేనువందల రూపాయలగును.

(అని లోపలికివెళ్ళి యెంచి తెచ్చియిచ్చును.)

మంగ—(లెక్కపెట్టుకొని మూటగట్టుకొని) ఇక నేను సెలవు పుచ్చుకుంటా.

భైర—నేనుకూడా సెలవుపుచ్చుకుంటాను. యిప్పటికి నేను కృతార్థుడనైనాను.

జాన — చిత్తము. నేను నాప్రయత్నం మీదుంటాను.

(అందరు నిష్క్రమింతురు).

—○○—

5 రంగము.

(జానకిరామయ్య భైరవసిద్ధాంతి ప్రవేశించుచున్నారు.)

జానక — సిద్ధాంతిగారూ! ముహూర్త మీరాత్రియేగదా మీరు సాయంత్రము పెందరాళేవచ్చి మాయింటిదగ్గర కూర్చుండండి. మనమంతా కలిసి తరలివెళ్ళుదము.

భైర — పల్లకీ భజంత్రీలమాట యేమిచేసినారు కుదిర్చినారా?

జాన — పల్లకీవద్దు భజంత్రీలు వద్దు. సుముహూర్తము వేళకు మాత్రము డోలుసనాయి తెప్పిస్తాను. రెండవపెళ్లివాడికి పల్లకీ యెందుకు? భజంత్రీ లెందుకు?

భైర — అల్లాఅనకండి. తమకు రెండవపెళ్లికాని పిల్లకు రెండవ పెళ్లి కాదుగదా? పిల్లకు ముచ్చటాఅచ్చటా తీరవద్దా? పెద్దవారు పల్లకీ యెక్కరని యెవరో అనుకుంటూండగా విని పెళ్లికూతురు యీవెధవ పెళ్లి నాకొద్దేవద్దని యెంతో యేడ్చిందట.

జాన — నిజమవును. పాప మాచిన్నదాని ముచ్చటకూడా తీరవలసినదే. పోనీ యేదైన పల్లకీ కుదర్చండి. పాలనిమిత్తం రాయిమోయ్యాలన్నట్టుగా పిల్లనిమిత్తం నేను పల్లకీ యెక్కుతాను.

భైర — ఆపని చాలాబాగావుంది. అది అందరు మెచ్చుకొనే పని. ఎందుకంటే యిదివరకే అందరు పెళ్ళికొడుకు పెద్దవాడు పెద్దవాడని పిల్లని ఉడికిస్తూఉన్నారు. అందుకు తోడుగా పల్లకీ యెక్కకపోతే మరీ అభాసుగా వుంటుంది.

జాన—కిట్టనివాళ్ళు చెబుతారు. వీటలమీద పెళ్ళిళ్ళు చెడ గొట్టే మహానుభావులు లేరుగనకనా? అయినప్పటికి నేను సాధ్య మయినంతవరకు పడుచువాడులాగుండుటకే ప్రయత్నము చేస్తూన్నాను. ఈను.హూర్తము నిశ్చయమయినప్పటినుండి తలమీదనున్న తెల్లవెం ట్రుకలకు నల్లరంగు వేసుకుంటూన్నాను. ఇప్పుడు నావెంట్రుకలు జేడి గింజలుకన్న నల్లగాఉన్నాయి. ఈమధ్య సంపెంగనూనెతోనే తల దువ్వుకుంటున్నాను. నేను సహజంగా బక్కపలచగా రివటగానుండుట చేతను కాయశరీరంపసపినగుటచేతను నాకరవయియేళ్ళున్నా—కాదు కాదు యాభైయేళ్ళున్నా ముప్పయియేళ్ళు వాడిలాగే కనబడతాను. పెళ్ళికూతురిదినవఅకెప్పుడూ చూడకపోవడంచేత భ్రమపడుతోంది కాని చూస్తే అంత బెంగపెట్టుకోదు.

భైర—ఆనాలుగు తలంబ్రాలు నెత్తిమీద పడేవరకు యేవో మాయోపాయములుచేసి మీరు కాలంగడపండి. పిల్ల చాలా తెలివైనది. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టును. అయినా మీరుపెట్టే బంగారపుజడ, కట్టుకాసులపేరు చూస్తే నగలసంబరంమీద యీవిచారం మరచిపోతుంది లెండి. సరి ప్రస్తుతం నేనింటికి వెళ్ళి సాయంకాలము వస్తాను. అందరముకలసి వెళ్ళుదాము.

జానకి—చిత్తము.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు).

## 6 రంగము.

(కామయ్య భీమయ్యయను ఇద్దరు బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

కామ—ఏమోయి భీమయ్య ఏమిటి విశేషాలు?

భీమ—ఉన్న విశేషము వక్కటే. మనజానకిరామయ్యగారికి రాత్రి వివాహమైనది. మొంగ్యోత్సవములుగా జరిగినది.

కామ—ఏమిటాశోభ ? శాస్త్రి నా చెవినిగూడా వేస్తూ.

భీమ—శోభన్నశోభా! పెళ్ళికూతురు కన్యాదానపువేళ హోరున యేడుపట. పెండ్లికొడుకువారి తరుపువారు యెందుకేడుస్తూందిఅని అడిగితే పొద్దుటినుండి ఉపవాసము గనుక ఆకలిచేత యేడుస్తూందని తల్లిదండ్రులు సర్ది చెప్పారు.

కామ—చాలా పసందుగా నున్నది. ఇంకోచిత్రముకూడా జరిగినదట యేమిటి? మంగళాస్నానాలికి వెళ్ళినప్పుడు పెళ్లికొడుకు నూతి దగ్గర జారి పడ్డాడట యేమిటి. చట్ట నెప్పిపట్టినదట.

భీమ—అప్పుడే నీదాకా వచ్చినదీ యీసంగతి. పెళ్లికొడుకు ముసలివాడైనందుకు ముసలివాడులాగ నడవక పడుచువాడులాగ గబగబ నడవపోయినాడు. లేనిపోని గోటు తెచ్చిపెట్టుకుంటే యేమవుతుంది? పడ్డాడు చట్ట విరిగింది. త్రోమడానికి చీకటితోటే కుమ్మరాడిని తీసుకువెళ్ళుచున్నారే.

కామ—ఆయన కట్టించుకొన్న దంతపుపళ్ళూడి క్రింద పడలేదుకదా.

భీమ—పడలేదు కాని, యీ నాలుగురోజులలోను యింకా యెన్నిఅభాసులు జరగాలో అన్ని జరుగుతాయి. నీచెవులతో నీవే వింటావు. ఏడుకట్లసవారీ యెక్కవలసిన ఆయన పల్లకీ యెక్కుచున్నాడు. దినవారాలు జరగవలసిన యీడులో పెళ్ళి జరుగుచున్నది.

కామ—సరే నాకు పనియున్నది. నేను వెడతాను. రేపు కలుసుకుందాము.

(అని యిద్దరు నిష్క్రమింతురు).

7 రంగము

(అప్పుడు జానికిరామయ్యగారు విస్తరిముందరపీటమీద కూర్చుండి ప్రవేశించుచున్నారు)

జాన—భైరవసిద్ధాంతిగారూ! మాపురోహితుణ్ణి రామావధానులుగారిని యిల్లాపిలవండి.

భైర—చిత్తము పంపుతాను. (అని వెళ్ళును.)

(రామావధాని ప్రవేశించును.)

జాన—రామావధానిగారూ! యిల్లాదయచేయండి నాకు విస్తరివేసి వడ్డించి అరగంటయినది. పెండ్లికూతురు నేనుగలిసి భోజనము చేయవలెను గనుక కనిపెట్టుకొని యున్నాను. పెండ్లికూతురు యెంతసేపటికి రాదేమి? మీరు వెళ్లికనుక్కోండి. నాప్రాణము చాలి వస్తూంది. నేను నల్లమంచు ముండావాడినన్నమాట తెలియదు. పెండ్లివారికి బొత్తుగా యింగితజ్ఞానం లేదు. మరియాద తెలియదు.

రామా—చిత్తము. ఇదిగో నేనువెళ్ళి కనుక్కొని తెలుసుకొని వస్తాను. (అని వెళ్ళును.)

(అప్పుడు లోకగదిలో ఏడ్చుచున్న పెండ్లికూతురు తల్లి దండ్రి మఱికొందరాడవాళ్లు ప్రవేశించుచున్నారు.)

తల్లి—అమ్మాయి. పన్నెండేండ్ల పిల్లవు. చెపుతే తెలుసుకోలేవేమి సుఖంమల్లే యేడవకూడదు. లే. అన్నాని కాయన కనిపెట్టుకున్నారు.

తండ్రి—అమ్మాయి లే. అమ్మా లే. దబ్బునవెళ్లు.

పెండ్లికూతురు—నేనువెళ్లను. నాకన్నముక్కరలేదు. మీరాయింట్లో రూపాయలసంచులు పడ్డాయిగదా. నేను అన్నము తింటేనేమి తినకపోతేయేమి?

తల్లి—ఛీ అవకతవక మాటలాడకు. పిట్టకొంచెము కూతీ

ఘనము అన్నట్టు పెద్దపెద్దమాటలాడుతా వేమిటి. పెద్దవాళ్ళము మేము మాయిష్టమువచ్చినట్లు నీమంచికోరి గొప్పసంబంధము తెచ్చినాము. కూటికి గుడ్డకి లేని కుఱ్ఱముండాకొడుక్కి కట్టిపెట్టమన్నా వేమిటి. కావలసినంతభాగ్యం నిండానగలు పెట్టుకొని అనుభవించేభాగ్యం నీకు లేదేమో కాని అంతాఅదృష్టవంతురాలవంటున్నారు. కాకపోయినా ఆయనమాత్రమేమంత పెద్దవాడు.

పెండ్లికు — అవును. చిన్నవాడే. మాతాతయ్యయినాడువాడు.

తండ్రి — ఛీ నోరుముయ్యి ఎవరైనవింటే నవ్వుతారు.

పెండ్లికూ — నవ్వనియ్యి నాకేమి భయములేదు. నేనురాత్రి విస్తరిముందర కూర్చున్నప్పుడు వడియాలు అప్పడాలు కొరుకలేక పోయినాడు. నాకుదగ్గర కూర్చుంటే ముసలికంపేస్తుంది. నేనురాను.

తల్లి — ఓసీ నీయమ్మకడుపు గాలిపోయురిగడే దిక్కుమాలిన ముండా నీమూలాన్ని అప్రదిష్ట వస్తూందేనాకు (అని ఒక్కచరుపు వేయును.)

పెండ్లికూ — అమ్మయ్యో చంపివేశావే. (అని యేడ్చును)

తండ్రి — ఓసీమోటముండా. పెళ్లికూతురే. దాన్నిప్పుడుకొట్టకు. ఈనాలుగురోజులు మాటదక్కించవే.

తల్లి — కొడతానా చంపుతానాదీన్ని. దీనిమొగముమండాయనలు గుగులోను దీనిమూలాన్ని నాకు తలవంపులుగానున్నది.

(అప్పుడు రామావధానులు ప్రవేశించును.)

రామా — మంగయ్యబావగారూ. అవతల పెండ్లికుమారుడు గారు భోజనమునకు కనిపెట్టుకొనియున్నారు. ఆయన పదిగంటలకు భోజనంచేశేవారు. ప్రొద్దుపోయినదాక నుండలేరు. ఇప్పుడు పన్నెండు గంటలయినది. పిల్లని త్వరగా పంపించండి.

తండ్రి — దీనికేదో శనిపట్టినదండి. అప్పట్నుంచి యేడుస్తూ

కూర్చుంటుంది. నా కేమీ పాలు పోవడం లేదు. అన్నానికి వెళ్ళమంటే వెళ్ళదు.

రామా—ఇదియేమైన గ్రిహబాధయేమో చూచారూ.

తల్లి—నాకునిజంగా గ్రిహబాధలాగే తోస్తుంది. ఇదివరకెొక్క నాడైనా పెంకితనంచేసి యెరుగదు నామాట కెదురుచెప్పి యెఱుఁగదు. ఇప్పుడు నేను చెప్పినట్టు వినదు. ఇది గ్రహబాధే.

ఒకస్త్రీ—(చేతులు తిప్పుకొనుచు ముందుకువచ్చి) వదినే! అదేనిజము. నిన్నరాత్రి పందిట్లో నేను చాపవేసుకొని పడుకొని నిద్రించుచున్నప్పుడు యెవరో ఒక ఆడది నల్లచీరగట్టుకొని నగలు బెట్టుకొని అల్లావెళ్ళిన జాడయైనది. పిలిస్తే పలక లేదు. పెళ్ళివారితాలూకు మనిషియేమో అనివూరుకొన్నాను.

తల్లి—అదితప్పకుండా దయ్యమే. మాయింటావంటా యెక్కడా చచ్చినపునిస్త్రీలు లేరమ్మా.

ఒకస్త్రీ—పేరేమిటమ్మా. దానిసవతి లేదూ? ఈ పెళ్లిఆవిడ కిష్టంగా నుంటుందా?

తల్లి—నిజమేనమ్మా బాగాచెప్పావు.

తండ్రి—గట్టిగా అనకండి. ఆమాట బాగుండదు.

రామా—సాయంకాలము నేనుదయ్యాల మంత్రగాడిని తీసుకొని వస్తాను. అందాకామీరు గప్చిప్పుగా వూరుకొనండి.

పెండ్లికూ—నాకుదయ్యము కాదర్రోయి. నన్ను కొట్టి బాధ పెట్టకండి.

ఒకస్త్రీ—ఆమాటలు దయ్యపుమాటలే. ఈపిల్లమాటలుగావు. తన్నుకొట్టి మారణహోమము చేస్తారనే భయంచేత మనలనందఱను మోసము చేయుటకాపిల్లచేత అల్లా పలికిస్తూంది.

(అప్పుడు పందిట్లో గడబిడ వినబడును)

రామా—ఆగడబిడ యేమిటి చెపుమా!

(అప్పుడు వంటబ్రాహ్మణుడు ప్రవేశించును.)

వంట—అయ్యో అయ్యో పెండ్లికుమారుడుగారు పీటమీద పడిపోయినారు. రండి రండి.

(అందరు పరుగెత్తుచున్నారు.)

(అప్పుడు పీటమీద జానకిరామయ్యగారు పడియుందురు. చుట్టుజనులుందురు.)

మంగ—చెవులు మూయ్యండి. చెవులుమూయ్యండి.

రామా—అథవా ప్రాణ సన్నిధా అన్నారు. కొడుకును దగ్గరకు పిలవండి.

వంటబ్రా—శోష వచ్చిందయ్యా అన్నం మజ్జిగలో పిసికి నోట్లోపొయ్యండి.

(అంతట జానకిరామయ్యగారి కూతురు ప్రవేశించును.)

కూతురు—(చూచి)నాన్నోయి. ఈదిక్కుమాలిన పెండ్లియెందు కొచ్చినదోయి.

(అని యేడ్చును)

మంగయ్య—పెండ్లిపందిరిలో యేడ్వకమ్మా సీకావోగాయిత్వము తెలియదు ఏమీ తెలియదు.

కూతు—ఇంకేమి వోగాయిత్వమోయి తండ్రి మానాన్న మాకు దూరమైనాడు.

వంట—(జానికిరామయ్యగారి నోట్లో మజ్జిగఅన్నముపోయును)

జాన—(కొంచెము తెప్పిరిల్లి) భయములేదు ఖంగారు చేయకండి.

(అని మెల్లగాబలుకును)

(అంతట నలుగురు మనుష్యులు సాయముపట్టి జానికిరామయ్య గారిని గదిలో బంధుకొనబెట్టుదురు.)

(అందరు నిష్క్రమించుచున్నారు.)

---

౭ వ రంగము.

కామయ్య భీమయ్య ప్రవేశించుచున్నారు.

కామ—ఏమోయి భీమయ్యా. మనమంగయ్యగారింట్లో వివాహము ముగిసినట్లున్నది.

భీమ—ఆహా! ముగిసినది. ముగియక యెన్నాళ్ళుంటుంది?

కామ—విశేషాలు చెప్పవేమి. ఆనాడు కాలువిరగబడి పెండ్లికొడుకు కుమ్మరివానిచేత తోమించుకొనువరకు విన్నాము. తరువాత కథయేమిటి?

భీమ—కథలకేమున్నాయి. నాలుగవరోజున ఊరేగింపు జరిగినది విన్నావా?

కామ—అరవయి యేళ్ళ ముండాకొడుకు సిగ్గులేక యెల్లాఊరేగినాడయ్యా!

భీమ—అంత మాత్రమునకే ఆశ్చర్యపోదు నీవు. అందులో విశేషమున్నది. పెండ్లికుమారునకు అతిమూత్రవ్యాధి ఉన్నదట. అందుచేత ఆయనగారు మాటిమాటికి పల్లకి దింపుమని బోయిలను బాధలు పెట్టి లఘుశంకకు వెళ్ళుచు వస్తూయుండేవాడు. బోయివాళ్ళు ఒకసారి దింపుటకు కొంచెము ఆలస్యముచేయగా వాళ్ళమీదబడి కొట్టబోయినాడు. అప్పుడందరు ఆపివేసినారు.

కామ—బాగావున్నది. ఊరేగింపునకు మీరుస్వయముగా వెళ్లి యీమహోత్సవమంతా చూచినారాయేమిటి?

భీమ — వెళ్లినాను. ఇటువంటి ఉత్సవములు చూడకపోతే కన్ను లున్న లాభమేమి.

కామ — నాకబలి, దండాడింపు అన్నీ అయినవా? దండాడింపులో పెండ్లికొడుకు నెవ రెత్తుకొన్నారు?

భీమ — పెండ్లికూతురును జానకిరామయ్యగారి వంట బ్రాహ్మ ణెత్తుకొన్నాడు. పెండ్లికొడుకును రామన్నగాడు ఎత్తుకొన్నాడు.

కామ — ఏ రామన్న పీనుగులు మోసే రామన్నే?

భీమ — అవునువాడే. వాడు ఆయనను యెత్తుకోకమునుపు మెల్లిగా నాచెవిలో యీలా గన్నాడు. "ఎప్పటికైనా యీయనను నేనే మోయవలసిన వాడను గనుక యెంతబరు వున్నాడో నేను చూచు కుంటాను." అని చెప్పి యెత్తుకున్నాడు.

కామ — దండాడింపులో ముచ్చట లేమైనా జరిగినవా?

భీమయ్య — లేకపోవడమేమి. చిన్న ముచ్చటొక టున్నది. పెం డ్లికూతురు తెలిసే చేసినదో తెలియకే చేసినదో చెప్పలేముకాని బుక్కా-బగ్గుండ పెండ్లికొడుకు కన్నులలో కొట్టినది. దండాడింపు అయి నది మొదలుకొని ఆయనతిన్నగా కన్నులు తెరవలేకుండా నున్నాడు. ఇకముందు కండ్లవైద్యము కూడా చేయించుకో వలసి వస్తుంది.

కామ — అప్పగింతలు బాగా జరిగినవా?

భీమ — ఆఁ జరగకేమి. పెండ్లికొడుకును రామన్న కప్పగించారు. పెండ్లికూతురును వంటబ్రాహ్మడి కప్పగించారు.

కామ — ఆదేమి టల్లా అంటున్నావు?

భీమ — పెండ్లి కూతురుకు అత్తమామలు బావమరదులు, ఆడ బిడ్డలు లేరుగనుక అత్తవారి తరఫు వంట బ్రాహ్మడె సమస్త బంధువు గనుక ఆతనికే అప్పగించినారు.

కామ — నిజంగా అప్పగించారా యేమిటోయి?

భీమ—నిజముగా చేయి పాలల్లో వేసి అప్పగించ లేదు కాని పెండ్లికూతురు తల్లీ తండ్రిమాత్రము వంటబ్రాహ్మడిని పిలిచి నాయనా పిల్లనిప్పటినుంచి మీయింట్లో నే యుంచుతాము జాగ్రత్తగా చూడాలి. అన్నిటికీ నీవే సుమాయని చెప్పినారు.

కామ— అందుకువంట బ్రాహ్మ డేమన్నాడు?

భీమ—ఏమంటాడు ! ఏవిధమైన లోటుపాటు లేకుండా అన్నిటికి నేనేయై సంరక్షణ చేస్తానని చెప్పినాడు.

కామ—ఈలాటి పెండ్లి సాధారణముగామనము చూడము. పెండ్లికుమారుడు గారికి మీరెన్నాళ్ళు వేశాగు ఆయుర్దాయం?

భీమ—ఎవడు చెప్పగలడు మీవంటివాళ్ళ ఆశీర్వచన ప్రభావంచేత ఆయన పదికాలాలు బ్రతక గూడదు? ఆచిన్నదాని కడుపున పదికాయలు కాయగూడదా?

కామ—లేకపోతే వితంతు శరణాలయంలోనికి వెళ్లీ హాయిగా పెండ్లి చేసుకోగూడదా?

భీమ—ఛీ ఊరుకో, సుఖమన్లే ఆయన పెండ్లిచేసుకుంటే దిక్కుమాలిన మాటలాడుతావు.

కామ—దిక్కుమాలిన మాటలు కావు. నీచెవులతోనీవే వింటావు. రా, పోదాము.

(అని యిద్దరు నిష్క్రమించుచున్నారు.)

---

# చిత్రసంభాషణము

[ హరిశాస్త్రి శంకరశాస్త్రి సంభాషింతురు. ]

హరి — ఈవీధి యెక్కడికి వెడతుందండి?

శంకర — ఈవీధి యెక్కడికీ వెళ్లదు. నాచిన్నతనమునుండి నేను చూస్తూన్నాను. యిది యిక్కడనే వుంటూన్నది.

హరి — యింవూళ్లో చెరువుగట్టుకు యేలాగు వెడతారండీ?

శంకర — అందరుమనుష్యులు వెళ్లినట్టే రెండుకాళ్లతో నడిచి వెడతాము కాని మరియొక లాగు విపరీతముగా వెళ్లము.

హరి — మీయింట్లో కూరలు యీరోజున యేమిచేసినారండి?

శంకర — యేమిచేస్తాం తిన్నాం.

హరి — మీవూళ్లో సత్రం సరిగా జరుగుచున్నదా?

శంకర — ఒకఅంగుళమైనా జరుగుటలేదు. మునుపున్న చోటనే యున్నది.

హరి — మీరీరోజున యేమి యెక్కివచ్చినా రండీ?

శంకర — ఏమెక్కి? ప్రొద్దెక్కి ఎండెక్కివచ్చినాము.

హరి — మీరంగయ్యగారు యీమధ్యను పోయినారట. ఏమివచ్చిపోయినారండి?

శంకర — కాలమువచ్చి పోయినారు.

హరి — మీకు భూములు మాన్యములేమైనా ఉన్నవా?

శంకర — భూములూవున్నవి మాన్యములూ వున్నవి.

హరి — పంటపొలములా? తోటలా?

శంకర — పొలములూగావు, తోటలూగావు. నాకున్న భూములు రుద్రభూములు, బహిర్భూములు, మాకున్న మాన్యములు సామాన్యములు.

హరి.—మీవూరు రాజులలో గొప్పరాజెవరు?

శంకర—పోతరాజు.

హరి—మీరు యేనీళ్లు తాగుతారు చెరువునీళ్లా? నూతినీళ్లా?

శంకర—అదియేమి మాకు తెలియదు. మేము మంచినీళ్లు తాగుతాము.

హరి—మీవూళ్లో ధనవంతులు చాలామంది యున్నారటండి!

శంకర—ఆహా! మావూళ్లో ఒక్కొక్కడి దగ్గర పదికోట్లున్నవి.

హరి—అందరు భాగ్యవంతులు యేగా్రిమమందు లేరు మీరు అబద్ధము చెప్పుచున్నారేమో?

శంకర—అబద్ధముకాదు. నిజమే ప్రమాణంచేసెదను. నేనెంతో బీదవాడను కదా నాదగ్గరే నాలుగుకోట్లున్నవి. రెండు పట్టుకోట్లు రెండు అల్పాకాకోట్లు మొత్తం 4 కోట్లు.

హరి—వారములలో ఏవారం మంచిది. యేవారం చెడ్డది ?

శంకర—యీదినములను బట్టిజూడగా యాయవారం మంచిది. దినవారం చెడ్డది.

హరి—రోజులలో యేరోజు మంచిదండి?

శంకర—నవరోజు చాలా మంచిది.

హరి—అన్నిదానములలో ఏదానము ఉత్కృష్టమైనది?

శంకర—నిదానము

హరి—ఏపాలు పుచ్చుకొన్న మనము చెడిపోదుము ?

శంకర—పాపాలు, కోపాలు.

హరి—ఏమనువు హిందువుల కిష్టములేనిది ?

శంకర—మారుమనువు.

హరి—మాఅమ్మాయికి వివాహం చేయదలచుకొన్నాను. పెండ్లికి ముఖ్యముగా నెవరెవరిని పిలువవలెనో [illegible] చెప్పండి?

శంకర— చెప్పుచున్నాను వినండి. పెండ్లికి ముఖ్యముగా యుండ వలసిన వారుపేరు. అన్నంభట్టువారు, కందులవారు, శనగపల్లివారు, పెసరగంటివారు, పప్పువారు, నేతివారు, వుప్పువారు, కందావారు, వంకాయలవారు, బీరకాయలవారు, చెమ్మకాయలవారు, పోకలవారు, పొగాకువారు, చల్లావారు, పందిలివారు, పాకలవారు, నూతివారు, చెరువువారు.

---

# సప్తగ్రహకూటము

క్రిందటి నెల 31 వ తేదీని సప్తగ్రహకూట మగుననియు అందువల్ల ప్రపంచమున కనేక కష్టములు సంభవించునయు లోకులు తలంచిరి. ఈ గ్రహ కూటములవల్ల జరిగిన వైపరీత్యములు కొన్ని మాకు తెలిసినంతవఱ కీక్రింద నుదహరించుచున్నారము:—

అత్తవారియింటి యల్లుళ్ళు కన్యారాశిలోను మిధునరాశిలోను నుందురు. తులారాశి సరుకులమ్ము వర్తకుల స్వాధీనమయి పోవును. (తుల అనగా త్రాసు.) చిన్నపిల్ల లాదయ మేషగంటలకు, ఉద్యోగస్థులు పదిగంటలకు, తక్కినవారు రెండు జాములకును కుంభరాసిలో బ్రవేశించుచుందురు. ఆసమయము లందు శూద్రాదుల యిండ్లలో మీనరాశి కుంభరాశిసమీపమున చేరుచుండును. వృశ్చికరాసి ఆకాశమండలము వదిలి కన్నముల పాలగును. (మేషంమేక) ఈరాశి గొల్లల పాలగును. వృషభరాశి మెడలమీాద నాగలికాడిబండి యెక్కును. మకరరాశి నదులపాలు సముద్రములపాలు నగును. (మకరమనగామొసలి) ధనుర్రాశి కోయవాండ్రచేతిలో నుండునగయు సింహరాశి అడవుల

పాలగునని యు కర్కాటకరాశి బొరియలలో దూరియుండు ననియు వేరుగ జెప్ప నక్కఱలేదు. ఈ రాసు లటుండగ, అతివర్షములు కురిసినచోట ధాన్యపురాసులు తగ్గును. కాని సర్కారున కీయవలసిన శిస్తురూపాయల రాసులు మాత్రము తగ్గవు. ఉద్యోగస్థులకు తాబేదారులు చేయవలసిన సప్లయివస్తువుల రాసులు యథాప్రకారముగానే యుండును. లంచములు పుచ్చుకొనువారికి సొమ్మురాసులు పెట్టెలలో జేరును, ప్లీడర్లఫీజు రాసులు విసుగురాసులు ఎక్కువగనుండును. శ్రద్ధరాసి పసిరాసి చాలమంది దగ్గఱ కనబడదు. ధాన్యాదులు అపర దినుసులు రాసులు రాసులుగ నిలవపోసిన వర్తకులకు దండుగరాసి దుఃఖరాసి కొందర కేర్పాటైయున్నది. లంచము పుచ్చుకొని ఆర్బతునాటు కంపెనీలో దాచుకొన్న కొందఱు ఉద్యోగస్థులయొక్క ధనరాసి నాసిమైనది. గనుక వారు తిరిగి ప్రజలమీద సొమ్ము వసూలుచేసి పెద్దరాసి చేయుదురు. ఈ సప్తగ్రహ కూటమువల్ల వచ్చిన పౌర బాట్లు వైపరీత్యములుగొన్ని యీ క్రింద నుదహరించుచున్నాము:—

అదివరకు రెండుమూడు సంవత్సరములనుండి యొకచోటనున్న యుద్యోగస్థులు యింకా కొంత కాలము తామక్కడ నుందుమనుకొని తమదగ్గఱ దాఖలైన కేసులలో లంచములు తెప్పించి పుచ్చుకొనిరట. పాపము వారి కకస్మాత్తుగా బదిలీయై పోయినదట. పాపమా యుద్యోగస్థులు వీరితో జెప్పకుండగనే వెళ్లిపోయిరి. అడుగుటకు వీలైన యంశము కాదు గావున నోరుమూసికొని యూరుకుండిరి. ఈ గ్రహకూటమువల్ల ఆయుద్యోగస్థులకు వీరిసొమ్ము వీరికిచ్చుటకు వీలు లేకపోయినది. రాజమహేంద్రవరము పాలఘాటు మునిసిపాలిటీల గతసంవత్సర పరిపాలనను గురించి గవర్నమెంటువారు విమర్శన చేయునపుడాయా మునిసిపలుచేర్మెనులయొక్క పరిపాలనము చక్కగా నున్నదనియు కౌన్సిలర్లదే లోపమనియు కేవలము పొరపాటుగా వ్రాయుట

కీసప్త గ్రహకూటమే కారణము. న్యాయబుద్ధియు సమదృష్టియు గల గవర్నమెంటువారికిసయితమీపాడు సప్తగ్రహకూటము పొరబాటభిప్రాయమును గలిగించినదిగదా. దీనికిఁబుపు కాల! దీనియందెంతశక్తియున్నదో చాలచోట్ల ఈసప్తగ్రహకూటమువల్ల ముండనుంచుకొన్నవాడు జూదగాడు. త్రాగుబోతుబూతులు తిట్టువాడు లంచగొండి మోసగాడుకొండెగాడు ఈ యేడుగురు అతిమైత్రిగలిగి ప్రవర్తింతురు. ఆ సప్త గ్రహకూటముల కెంతమైత్రి యుండునో వీరిలో వీరికినంత మైత్రియుండును. సాధారణముగ వీరందఱు నొకచోటనే చేరియుందురు. ఆకాశమందున్న సప్తగ్రహకూటమునకు పోటీగా వీరు భూలోకసప్తగ్రహకూటమై ఆకాశగ్రహములకంటె ఎక్కువకీడు సేయుచుందురు. ఆకాశగ్రహములకు యేవైన కొన్ని శాంతులు చేసినపక్షమున అవి శ్రమించును. ఈ గ్రహముల కెంతశాంతి చేసినను క్రూరదృష్టియే గాని దయాదృష్టి లేదు. ఇవి యన్నియు సాధారణముగ నీచ గ్రహములే కాని కాలవశముచేత గొప్ప రాసులలోనికి వెళ్లి ఉచ్చదశకు వెళ్ళుచుండును. ఈగ్రహములలో అప్పుడప్పు డొకదానితో నొకటి పోరాడుచుండును. కాని అన్నియు సమానబుద్ధికలవగుటచేత త్వరలోనే కలియుచుండును. ఆకాశముమీదనున్న సప్తగ్రహకూటము త్వరలోనే విడిపోవును. గాని యీగ్రహకూటము విడిపోవునట్లుతోచదు ఇదియే సప్తగ్రహకూటఫలం.

---

# గొప్ప వైద్యుడు

ఒకానొక ఘనవైద్యుడు తన ప్రజ్ఞనుగురించి మాపత్రికలో ప్రకటన జేయవలసినదని కోరినందున యీక్రింది ప్రకటనమును మేము లోకులకు దెలియచేయుచున్నాము. ఇది ప్రకటించుటవలన లోకమున

కుపకారము జరుగును గాన మేము దీనిననుచితముగానే ప్రకటించుచు న్నాము.

ఆంధ్రమహాజనులారా! నేను లోకోపకారార్థమై వైద్యము చేయుచున్నాను. నాదగ్గర లేని మందులేదు. నేను కుదర్చలేని జాడ్య ములేదు. నేను మందిచ్చినపక్షమున సమస్తరోగములు తప్పక కుదు రును ఒకవేళ యీజన్మములో నారోగము కుదరకపోయినను నామం దుప్రభావమువల్ల ముందుజన్మములో నారోగము రాదు. నేను వైద్య ముచేయుట కొప్పుకొన్నపక్షమున నేయింటిలో వైద్యముచేయుదునో, ఆయింటిలోనే రాత్రిపగలు నివాసము చేయుదును. అక్కడనే భోజన ముచేసి యక్కడనే పండుకొందును. ఇట్లుచేయుటకు గారణము నేను సదుపాయముగ, అన్నముతిని బసచేయవచ్చునని కాదు. నేను దూర ముగా బసచేసినపక్షమున రోగియొక్క బంధువులు నన్ను పిలుచుటకై నాలుగుమూడు సారులు రావలసియుండునుగద. వచ్చినపక్షమున వారి కాళ్ళు నొప్పిపెట్టును. కాలమువ్యర్థమగును. నేను వారింట్లోనే బసచే సెడుపక్షమున రోగిబంధువుల కీబాధలుండవు. ఒకసారి ఒకరియింట్లోనే వైద్య మొప్పుకొందును గాని యేకకాలమున దిద్దఱియిండ్లలో నేను వైద్య మొప్పుకొనను. మొదట ఒప్పుకొన్న చోట నేదో సంగతి తేలినతరువాత రెండవచోట ఒప్పుకొందును. నాదగ్గర నలుగురు శిష్యు లున్నారు. వారు నలుగురు నాలుగుసత్రములలోను బసచేసియున్నారు. సత్రములలో బసచేయుటచేత వారికి జీవనాధారము లేదని మీరుతలం చవద్దు. మార్గస్థు లనేకులు సత్రములలో బసచేసి జబ్బుపడుచుందురు. అట్టివారిని నావద్దకు తీసికొనివచ్చి వైద్యముచేయించుటకై వారిన్ని సత్ర ములలో నుండుమని నేనేయాజ్ఞాపించినాను. ఆశిష్యులు నేను వైద్యము చేయునట్టి యింటికివచ్చి కావలసిన మూలికలు వస్తువులు మొదలయి నవి యిచ్చుచు ... వల్ల ... ప్రమయుండదు.

మందులు మొదలయినవి వాళ్ళే నూరుచుందురు. ఇందుకు వాళ్ళ కేవిధ
మైన ప్రతిఫలము నీయనక్కరలేదు. ఒకవేళ నావైద్యమువలన రోగము
కుదరక రోగి మరణముపొందుట సంభవించినయెడల ఆయింటివారు
శవమును మోయుటకై వాహకులు నిమిత్తము వెదకనక్కఱలేదు.
నాశిష్యులు నలుగురు ఏవిధమైన యాటంకములేక శవమును మోయు
దురు. ఒకవేళ నాశిష్యులలో నెవడైన యేకారణముచేతనయినా రాక
పోయినపక్షమున ఒకకొమ్ము గాని అవసరమైనపక్షమున రెండుకొ
మ్ములుగానిపట్టుట కేవిధమైన యభ్యంతరము నాకులేదు. నేను చిన్న
తనమందు శ్రాద్ధమంత్రము చెప్పుకొన్నాను. ఆముక్క లిప్పటికి నాకు
గట్టిగావచ్చును. కాబట్టి దినవారములు చేయించుటకై వేరే మంత్ర
బ్రాహ్మణులకోసమై వారు తడుముకోనక్కరలేదు. నేనే కర్మ యథావి
ధిగా జరిగించగలను నాశిష్యులే పదకొండోదినమందు పన్నెండోదిన
మందు షోడశసాపిండములలో భోక్తలుగా గూర్చుందురు. కాబట్టి
భోక్తలకోసము వారు వెతుకనక్కఱలేదు. రోగము కుదిరినతరువాత
నాకు బహుమాన మీయవచ్చును. కుదరకపోయినపక్షమున నేనుపడు
శ్రమకు డబ్బియ్యనక్కఱలేదు. గోదానము నాకిచ్చి వారికితోచినంత
మంత్రదక్షిణ యిచ్చినపక్షమున నేను సంతోషపడుదును. ఈ పైయుప
కారములేగాక ప్రజలసముపాయముకొఱకు నేనింకొక పనికూడ చేయ
దలచుకొన్నాను. మందులు పోయగలనుగాని ఆయువుపోయలేనుగదా.
అందుచేత నేను వైద్యముచేయు స్థలమందు దైవవశముచేత రోగి
పోవుట తటస్థించినయెడల గృహయజమానులు తరువాత కర్మలకు
యిబ్బందిపడకుండా ఒక కఱ్ఱలఅడితీయు ఒక కుండలదుకాణము పెట్టించ
దలచుకొన్నాను. గంధపుచెక్కలు సైనుబట్టలు పురికొస చొక్కనార
చీపుళ్ళు మొదలయినవి కూడా అక్కడనే దొరకును. నన్ను వైద్యము
నకు పిలిచిన యింటివారికే నా[illegible] తదితరులకు నేనీ సరకుల నమ్మను.

ఇదివఱకు లోకములో వైద్యముచేయునట్టివా రనేకులున్నారుగాని యిన్నిసదుపాయములు చూపించి వైద్యము చేయునట్టివారిదివఱకు లోకములో లేరు. ఈపట్టణవాసులయొక్క పూర్వపుణ్యముచేతనే నీగ్రామమువచ్చి చేరితిని. కాబట్టి అశుభశూచక మనుకొనక వాగాయిత్య మనుకొనక అన్నిలాభముల జూచుకొని యెవరింట్లో జబ్బుగానున్నను నన్నే పిలువవలయునని కోరుచున్నాను.

ఇట్లు
విన్నవించు విధేయుడు,
పిండాల రామనాథయ్య.



# మహజరు

మహారాజరాజశ్రీ గోవిందరాజపురం కొత్వాలువారి సముఖమునకు—మాపట్టణములోనున్న విటసంఘముయొక్క ప్రధానకార్యదర్శి కోడెగాల కోనేటిరావు, సభాధ్యక్షుడు దివాలా దిగంబరరావు, ఉపసభాపతి దండుగుల దామోదరరావు వ్రాసి దాఖలుచేసిన మహజరు అర్జీ.

అయ్యా! ఈనెల 35వ తేదీ రాహువారమునాడు అర్ధరాత్రి అష్టవంకరల అంబుజాక్షిగారి కొంజావసారా అరుగుమీద జరిగిన విటసంఘముయొక్క బహిరంగసభలో, ఈక్రిందితీర్మానము అవకతవక ఆనందరావుపంతులుగారిచేత ప్రపోజు చేయబడి కొరకంచు గోవిందరావుగారిచే సెకండుచేయబడి రొమ్ములవారిచేత నంగీకరింపబడెను. "ఈపురమందలి పడమటివీధిలో సంసారులను లేవగొట్టవలసినదని మనము కొత్వాలుగారికి మహజరు వ్రాయవలెను." ఈపైతీరుమానము

సభకు విజయం చేసినవా రందఱిచేతను, ఐకకంఠ్యముగ నంగీకరింపఁ బడినది ఈ తీరుమానముయొక్క అర్థము ఏలినవారికి సంపూర్ణముగ దెలియుటకై యీక్రింది సంగతులు మీావిశదంబుత్తం తెలియజేయు చున్నాము — మేము రమారమి పదిసంవత్సరములక్రిందట మహారసికుల కందఱకు వినియోగమగునటుల విటసంఘము నొకటి స్థాపించి నాము. ఇది లోకోపకారార్థమై స్థాపింపఁబడినది. ఎట్లనగా పూర్వకాలమునందలి యుద్యోగస్థుడు ప్రతివాడు, ఒక్కొక్క భోగముదానిని చేరదీసి యెంతో పోకేలాగా కాలము వెళ్ళబుచ్చేవారు. అందుచేత భోగమువాళ్ళకు, సానెవాళ్ళకు, గుడిసెవేటువాళ్ళకు అన్నవస్త్రములు లోటులేకుండ గౌరవముగ కాలక్షేపము జరుగుచుండేది. ఇప్పుడు నవనాగరికులు బయలుదేఱి పూర్వమరియాదలు పాడుచేసి "అవశ్యం పితురాచార" మన్నమాట మరచిపోయి మే మేకపత్నీవ్రతస్థులమని సింగినాదమని జీలకఱ్ఱయని తెగనీలిగి పెద్దపోకలబోయి గొప్పకబురులు చెప్పి భోగమువాళ్ళ నుంచుకొనుట మానివేసినారు. అంతతో బోక భోగముమేళముల గూడ చూడమని ప్రమాణము చేయుచున్నారు. ఎక్కడనో మెత్తమనసుగల మంచిమహానుభావు లట్లు ప్రమాణములుచేసియు యేచాటుననో వీలైనప్పుడు భోగముమేళములుచూచి వాళ్ల కొంపలలో దూరుచున్నప్పటికి మొత్తముమీద యీనవనాగరికుల చెడ్డనడతలవల్ల భోగమువాళ్ళకూడు పడిపోయినది. సరిగా అన్నవస్త్రములున్నభోగముదే యిప్పుడు కనబడదు. భరతఖండముయొక్క గొప్పయంతయు భోగమువాళ్ళలోనే యున్నది. ఊర్వశీ రంభ మేనక లేకపోయినపక్షమున స్వర్గలోక మేపరికారముగ పాడైపోయి దిబ్బయగునో ఆప్రకారముగానే వేశ్యాంగనలు లేకపోయినపక్షమున భరతఖండము నిస్సారమై రసహీనమై శ్మశానమై కనబడును. వేశ్యలు లేకపోయినచో శృంగారరసము చెడిపోవును. సంగీతము సమసిపోవును.

అభినయమడుగంటును, నాట్యము నష్టమగును. కాబట్టి భూతదయచేత జూచినను సంగీతాభినయశాస్త్రముల వృద్ధిఁబట్టి చూచినను పురుషుల ఆయుర్వృద్ధి తలచి చూచినను సర్వవిధములచేతను మనము వేశ్యల నాదరింపవలసియున్నాము. ఈ గొప్పయుద్దేశమును మనసులో పెట్టుకొని లోకము తీతువుపిట్టలవంటి యీనవనాగరికులతోనే యున్నదా యని తెగించి మమ్ము నాదరించువారే కోటానకోట్లు తప్పక యుందురని నమ్మి ఈ విటసంఘము లోకోపకారార్థముగ దేశోపకారార్థముగ స్థాపించితిమి. స్థాపించినది మొదలుకొని మీదయవల్ల నానాటికి మెంబర్లు విరివిగా జేరుచున్నారు. ఇప్పటికి రిజస్టర్లమీదనున్న మెంబర్లు నూరుగురు. ఈసంఘములో జేరి, అప్పటప్పట గ్రహచారము చాలక మరణముచెందిన మెంబర్లు 230. రిజస్టరులో పేరు వేసికొనవద్దు మీసంఘములో మెంబర్లుగ జేసుతాము అని చెప్పి చేరినవాళ్ళు ఇప్పటికైదువందలమంది. ఇది శుక్లపక్షచంద్రునివలె నానాటికెంతో అభివృద్ధిపొందుచున్నది. ఇప్పు డేలినవారికి మేము మనవిచేసికొనునట్టి ప్రార్థన యేమనగా ఈవిటసంఘములో కొందరము గోవిందరాజపురములో పడమటవీధిలోనున్న సందులో వేశ్యాంగనల నుంచుకొన్నాము. మేము అర్థరాత్రివేళ అపరాత్రివేళ ఆవీధులలో తిరుగుచుందుము. ఒకప్పుడు మేము ఒళ్ళు తెలిసిఉంటాము. ఒకప్పుడు ఒళ్ళు తెలియక ఉంటాము. మానిమిత్తము బోగమువాళ్ల నిమిత్తము పెద్దమనుష్యులుకూడా అనేకమంది వస్తూవుంటారు. పైన చెప్పబడిన వీధిలో మాతోపాటు సంసారులుకూడా కొందరు కాపురమున్నారు. ఈ సంసారు లీవీధిలో నుండుటవల్ల మాకున్ను మాబోగమువాళ్ళకున్ను చాలా యిబ్బందిగానున్నది. మే మెప్పుడైనా ఒళ్ళు తెలియకుండా వచ్చినపక్షమున ముసుగులు వేసికొని రాత్రులు సానెకొంపలలో దూరునట్టి పెద్దమనుష్యులను యీసంసారులు అనవసరముగ ముసుగులెత్తి

చూచి ఫలానివారు అక్కడికి వెళ్ళినారు ఇక్కడికి వెళ్లినారని గ్రామములో వాడుకలు వేయుచున్నారు. మేమెప్పుడైనా రాత్రిలు ఒళ్లు తెలియక కొంచెము నోటమాటలతో దెబ్బలాడుకొన్నపక్షమున ఇక్కడ సంసారస్త్రీలున్నారు బూతుమాట లాడవద్దని మమ్మును యిబ్బంది పెట్టుచున్నారు నెలుక నూరురూపాయలు జీతము పుచ్చుకొనునట్టి పెద్దమనిషి యొకడు ముసుగు వేసికొని యొకరాత్రి సానెయిల్లనుకొని సంసారియింటి తలుపువద్దకు వచ్చి కమలాక్షీ కమలాక్షీ యని పిలవగా యజమాని లోపలినుండివచ్చి జుట్టుపట్టుకొని చెప్పుతో గొట్టి పంపెను. సంసారులమధ్య నుండబట్టి మాకిట్టి చిక్కు లప్పుడప్పుడు తటస్థించుచున్నవి. కాబట్టి ఏలినవారు ధర్మఖామందులు గనుకను వారుకూడా స్వయముగ మహారసికులుగనుకను అర్జీదారులందఱు ముండలముతాకోరు లనుకొనక సంసారులను ఆవీధిలోనుండి లేవగొట్టి మాకున్ను వేశ్యకాంతలకున్ను సంపూర్ణమైన స్వేచ్ఛ సౌఖ్యము కలుగజేయుదురని ప్రార్థించుచున్నాము. ఈఘనకార్యము సరసులైన మీ యధికారములోనే జరుగవలెనుగాని మరొకరి యధికారములో జరుగదు.

దివ్యచిత్తానకు తేవలెను,
ఇట్లు, విన్నవించు విధేయులు,
దివాలా దిగంబరరావు వగైరాలు.

---

# వైదికవిలాసము

(గణపతిశాస్త్రి కామశాస్త్రి ప్రవేశించుచున్నారు).

గణపతిశాస్త్రి—నాయనా కామశాస్త్రీ! నారోజులు బాగున్నవికావు. నారోజులన్నమాట యేమిటి! మన వైదికంలో పుట్టినవాళ్ళందరకు రోజు

లు బాగు లేవని చెప్పవచ్చును. నాకాసంగతి తలచుకొన్నపుడల్ల కడు పులో పెద్దబెంగ బయలుదేరుతుంది. తిన్న అన్నం వంటపట్టటం లేదు. రాత్రి సరిగా నిద్రపట్టదు.

కామ—గణపతితాతగారూ! మీ కేవిషయమై బెంగపట్టినది. ఆసంగతి యేమిటో చెప్పకుండా విచారిస్తారేమి. అచ్చ వైదీకమంటే యిదేకాబోలు.

గణ—ఏమని చెప్పనోయినాయనా! నానోట్లో మన్నుపడే కాలం వచ్చింది. ఇంతకూ తోకచుక్క, సప్తగ్రహకూటం వచ్చినసం వత్సరం ఊరికే పోతుందా? ఓసిఃతోకచుక్కా! నీకడుపుకాలా, యెంతపని చేశావే! ఇంతకు నాగ్రహచారం బాగులేదు. ఒకరి ననేదేమిటి.

కామ—తాతగారూ! మీప్రసంగంచూస్తే మీకు వెఱ్ఱో పిచ్చో అనుకుంటారు. ముక్కుమూలంలేని యేడ్పు యేడిస్తే నవ్వుతారు. సంగతేమిటో చెప్పండి.

గణ—నాయనా నీవు యెరుగవు. అయితే చెప్పుతా విను. మాయింట్లో ఏడుతరములనుండి షోడశకర్మలు చేయించే సాంప్రదాయమున్నది. మాతం(డీదర్భాసనపు తాళ్ళు పుచ్చుకొని పీపు చిట్ల గొట్టి స్మార్తంముక్కలు నాకు ఘట్టిగా చెప్పివేశాడు. వివాహోపనయనములేమి శ్రాద్ధములేమి నేను చేయించినంత జల్దీగా ఎవరూ చేయించలేరు. యీవృత్తిచేత నాపెళ్ళాం బిడ్డలు హాయిగా దైన్యం లేకుండా జీవిస్తూన్నాము. ఆహాహా! నాయింటినిండా పీటలేకదా, యిల్లల్లా చెంబులేకదా, బియ్యంగూనలతో నిలవగదా, గోదానములువల్లనిత్యం రెండావుల పాడిగదా. చీరలకు అంగవస్త్రాలకు సైనుగుడ్డలకు లెక్కే లేదుగదా. రెండామడలలోపుగా, కర్మ నావలె చేయించేవాడు లేక పోవడంచేత నాపని మరీమరీ బాగున్నది. నేటికాలానికి దీనికంతకు విచ్ఛిత్తు వచ్చినది కాబోలు. (అని యేడ్చుచున్నాడు).

కామ—తాతగారూ! మీ యేడ్పు చూడగా నాకు ప్రాణం విసుగోస్తున్నది. మీ ఐశ్వర్యమునకు యిప్పుడు విచ్ఛిత్తి ఎందుకు వచ్చినది?

గణ—నాకు వచ్చిన ఆపద చప్తాను విను. నేను చిన్నప్పటి నుండీ నియోగులయిండ్లలో పౌరోహిత్యములు చేసికొని జీవించుచున్నాను. యికమీద నియోగులు స్మార్తము నేర్చుకొని షోడశ కర్మాధికారులై వైదికవృత్తి నవలంబింతురని అంతా చెప్పుకొంటున్నారు. ఇది నిజమైతే నానోట్లో కరక్కాయే కదా! ఇక నా మొఖ మెవరు చూస్తారు. ఇదిగాక నియోగులు మంత్రిములు చెప్పుటకు బ్రాహ్మణార్థములు చేయుటకు వాళ్ళవాళ్ళనే పిలుచుకొందురుగాని మనవాళ్ళను పిలవరట. యిది నిజమయితే నాకొంప కూలిపోతుంది. నాకు చిట్టెడు ఉప్పు దొరకదు.

కామ—పోనీ, నియోగులిళ్ళల్లో మీకేమి దొరక్కపోతే వైదికుల ఆశ్రిమాలు సంపాదించుకొనరాదా.

గణ—ఓయి వెర్రివాడా! వైదికులలో చాలమంది నావలె షోడశకర్మాధికారు లున్నారు. నాచేత కర్మలు చేయించుకునే వారెవరు? జోగిజోగి రాసుకుంటే బూడిదరాలినట్టుంటుంది.

కామ—అయితే మీ అభిప్రాయం వైదికుల కికమీద వృత్తులు చెడిపోతాయి అనేనా?

గణ—నిస్సందేహముగా నాప్రాణాలు ప్రాణాలలో లేవు.

కామ—గణపతి శాస్త్రిర్లుగారు! ఈవిషయమై మీరు అట్టే ఆలోచించకండి. ఈవిషయములో నేను తగినసమాధానం చెప్పి మీకు బ్రదుకుదెరువు మరివకటి ఏర్పాటు చేయగలను. ఆవృత్తివల్ల మీకిప్పటికంటె యెక్కువరాబడి వచ్చును.

గణ— నాయనా ఆవృత్తి ఏమిటో త్వరగా చెప్పు. ఈవృత్తి వదులుకొని పెందరాళే అందులో పడతాను.

కామ— నియోగులు స్మార్తము వేదము చెప్పుకొనుటకు ప్రారంభించగానే, వైదికులు ఇంగ్లీషుచదువు ప్రారంభించండి. నియోగులు పౌరోహిత్యము లారంభించగానే వైదికులు కరణీకములకై ప్రయత్నములారంభించండి. నియోగులు మీసములు తీయించుకొనగానే వైదికులు పెంచుకోండి. వారు దర్భలు చేత్తో పుచ్చుకోగానే మీరు కలములు చేత్తో పుచ్చుకోండి. వారు పంచాంగములు చేతబట్టినతోడనే మీరు పత్రములు దస్తావేజులు చేతబట్టండి. మీ వైదికవృత్తి వారు పుచ్చుకొన్నప్పుడు వారి లౌకికవృత్తి మనము పుచ్చుకొంటే మనజీవనం చక్కగా జరుగుతుంది

గణ— నాయనా మంచిపని చెప్పినావుగాని నాకొడుకులకు ఇంగ్లీషుచదువు వస్తుందా! పదిపదునాలుగుతరములనుండి మంత్రములు అలవాటయిన నోళ్లకు ఇంగ్లీషుముక్కలు స్వచ్ఛంగా వస్తాయా?

కామ— రాకేమి, ఏడుమూడు పురుషాంతరములనుండి లౌక్యవృత్తివల్ల జీవించేవారికి వేదశాస్త్రములు నోటపట్టుతున్నాయా లేవా. ఆలాగే మనకూ౯డాను.

గణ— మంచిఆలోచన చెప్పినావు. రేపటినుంచి మాపిల్లలను యిస్కూలికే పంపిస్తాను. కాని జాతివారిభాష చదువుకోడం శిష్టసాంప్రదాయంకాదేమోయని భయమేస్తున్నాది.

కామ— అలాటిసందేహం మీరు పెంచుకోవలసినపనిలేదు. ఏమంటే లౌక్యులు వారిశిష్టసాంప్రదాయంవదలి క్రొత్తపద్ధతికి దిగినారు. వారు వేదకర్మలు స్వయంగా చేసుకొనడమే శిష్టసాంప్రదాయంగాని ఒకరియింట్లో చేయించుట శిష్టాచారంకాదు. వారొకవిధమైన క్రొత్తపుంతతొక్కినారు గనుక మనముకూడ క్రొత్తపుంత తొ

క్కండి. నేటికాలానికి మనకళనివదలిపోయి లౌక్యులమీద పడిపోతుం దని సంతోషించండి. వందలకొలది యేళ్ళనుండి పాత్రల్లనూటలు మోసిమోసి బుజాలు శిరస్సులు వీపులు కాయలుకాసినవి దర్భలు పట్టిపట్టి చేతులరిగిపోయినవి. మంత్రాలు చెప్పిచెప్పి నోరుకాయకాసి నది. ఈకలియుగంలో వైదికుల మొగములమీద వర్ఛస్సుపోయి పేతకళలు దిగినవి. ఇవి అన్నీ మనకు ఎప్పుడైనా వదలిపోవునాయని చూస్తూయున్నాను. నేటికాలానికి యివన్నీ పుచ్చుకుంటామని యెవరో ఒకరు వచ్చినప్పుడు సంతోషపూర్వకముగా యిచ్చి వారికోరిక తీర్చ డమే మనపని. అంతేగాని బెంగపెట్టుకొని చావనద్దు. ఇకమీద మనం హాయిగా కోట్లు కమీజులు వేసుకొని తెల్లనిచలువ మడతలు కట్టుకొని జరీతలగుడ్డలు చుట్టుకొని నీమాజామా వేసుకొని నీటుగా గోటుగా కచ్చేరీలకు వెళ్ళుతూ వేళపట్టుకు పదిగంటలకు హాయిగా భోజనము చేస్తూయుందాము. కాబట్టి మీరు విచారించక మీవాళ్ళకు ఇంగ్లీషు చెప్పించండి.

గణ—శభాష్! బాగా చెప్పినావు. నీవు అపరసృష్టిచేసే విశ్వా మిత్రుడవు. నీ ఆలోచన పసందుగా నున్నది. లౌక్యులను వైదికులను, వైదికులను లౌక్యులను చేయగలవాడవు. చిన్నవాడవయినా నీవు చెప్పే ఆలోచన బాగున్నది. నీవు చెప్పినట్లే నడుస్తాను.

(అని యిద్దరు నిష్క్రమించుచున్నారు.)

---

# ఒడంబడికలు

స్వస్తిశ్రీ ప్రమాదినామసంవత్సర జేష్ఠబహుళ అమావాస్యా శనివారమునాడు రాత్రి రెండుజాములవేళ మూలానక్షత్రయుక్త వృ

శ్చికలగ్నమందు భూమ్యాకాశంబులు సాక్షులుగ సూర్యచంద్రరాజులు సాక్షులుగ అనంతకోటినక్షత్రములు సాక్షులుగ సమస్తదేవతలుసాక్షులుగ బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సాక్షులుగ చ॥ నరహసింహరాయుడుగారు గో॥ రామకృష్ణారావుగారు పె॥ నారాయణరావుపంతులుగారు కేశవరాజుగారు మొదలగు తెనుగుదేశమందలి నియోగులును య॥ పుల్లావధానులుగారు, కో. వాసుదేవసోమయాజులుగారు, మ. భద్రాచలదీక్షితులుగారు సి రామచంద్రశాస్త్రిల్లుగారు మొదలగు తెనుగుదేశమందలి వైదికులును, యేకస్తులై వ్రాసుకొన్న యొడంబడికలు.

1 మనలో పూర్వకాలమునుండి ఆంధ్రకవిత్వ సంపన్నులై మంత్రులై వ్యవహారవేత్తలై ఉద్యోగస్థులై ప్రభుధర్మముల నడుపుచున్న నియోగిబ్రాహ్మణులకు వైదికకర్మలు స్వయముగా జేసికొనుట యేగాక చేయించుటకును అధికారము కలిగియుండగలందులకై షోడశకర్మలు నిరాఘాటముగ చేయించవలెననే కుతూహలము కలిగియున్నది గనుకనున్ను వైదికులనేకవేల సంవత్సరములనుండి యీయధికారము తామేవహించి నియోగుల కీయకపోవుటచేతనున్ను వైదికులొక్కరే యీమహాద్భాగ్యము ననుభవించుటచేతనున్ను మేముకూడ సంపూర్ణముగ ననుభవింపవలెనను యిచ్ఛతో షోడశకర్మాధికారమును వైదికులమగు మాకు వదిలివేయుటకు నిర్ణయము.

2 ఇకమీదనుండి నియోగులమైనమాకు మహారాజశ్రీ యని వ్రాయుటమాని యజనయాజనాధ్యయనాధ్యాపక దానాదాన ప్రతిగ్రహషట్కర్మ నిరతులైన శ్రీవేదమూర్తులయిన బ్రహ్మశ్రీ యని వ్రాయవలెను. అట్లు వ్రాయనిచో శివాలయములేని గ్రామములో కాపురముచేసినంతదోషమువచ్చును. ఇదిలగాయతు నియోగులందఱును తమలోతమకున్ను తదితరులకున్ను యీలాగు వ్రాయవలసినదని రిజస్టరీ

నోటీసులు వ్రాయనలెను. అట్లు వ్రాయని చో కోర్టులో పరువునష్టముల క్రింద దావాలు తేబడుట విధాయకము.

3 ఇది మొదలుకొని కర్మలు చేసికొనుటకు తీరుబడియుండదు కాబట్టి నియోగులందఱును తమతమ కర్ణీకములు వైదికులకిచ్చి వేయ వలసినది.

4 ఇందులకు ప్రతిఫలముగా నియోగులందరును కలములు కాగితములు సిరాబుడ్లు మల్లుపంచలు మీసాలు పెంచుకొనేయధికార ము తివాసులు జంబుకాణాలు కోట్లు బూట్సు మొదలయినవి, గిర జాలు జునపాలు పెద్దజుట్లు పెంచుకొనే యధికారమును యిప్పుడే వైదికులకు వదిలిపెట్టివేయడమయినది.

5 ఇకమీదట నియోగులకెవరికిని రావు, రాయుడు రాజు, పంతులు మొదలయిన పేళ్ళు పెట్టగూడదనిన్ని, శాస్త్రిల్లు, అవధానులు, దీక్షి తులు, సోమయాజులు, చేనులు భొట్లు శర్మ మొదలయిన పేర్లే యుండ వలసినదనిన్ని యీరావు రాయుడు రాజు పంతులు మొదల యినపేళ్ళు తప్ప వైదికులలో యెవరుగాని అవధానులు చేనులుపేళ్ళు పెట్టుకొనగూడదనిన్ని నిర్ణయం. ఇందుకు ప్రతిపద్ధాగా వైదికులమయిన మేము మీకు మనస్ఫూర్తిగా వ్రాయించియిచ్చిన వడంబడిక.

ఇదివరకు అనేక వేల సంవత్సరములనుండి మాస్వాధీనభుక్త ములో నున్నటువంటిన్ని, ఇదివర కెన్నడు యేవిధముగా నన్యాక్రాంత ము కానటువంటిన్ని శ్మశానభూములును అందులోనుండే కాకులు గద్దలు మొదలయిన జీవజంతువులున్ను దర్భలు మొలిచే బీళ్ళున్ను అందులో యిప్పుడున్నటువంటిన్ని ముందు మొలిచేటటువంటిన్ని దర్భ దుబ్బులున్ను మోదుగుచెట్లున్ను పంచాంగపుకట్టలున్ను దర్భాసన ములు కృష్ణాజినములు రుద్రాక్షతావళములు దేవతార్చన పెట్టెలు వి భూతిపండ్లు [illegible] పుస్తకములు [illegible]ములకదుళ్ళు

శ్చికలన్నమందు భూమ్యాకాశంబులు సాక్షులుగ సూర్యచంద్రాజులు సాక్షులుగ అనంతకోటినక్షత్రములు సాక్షులుగ సమస్త దేవతలుసాక్షులుగ బ్రహ్మావిష్ణుమహేశ్వరులు సాక్షులుగ చ॥ నరహసింహరాయుడుగారు గో॥ రామకృష్ణారావుగారు పె॥ నారాయణరావుపంతులుగారు కేశవరాజుగారు మొదలగు తెనుగుదేశమందలి నియోగులును య॥ పుల్లావధానులుగారు, కో. వాసుదేవసోమయాజులుగారు, మ. భద్రాచలదీక్షితులుగారు సి రామచంద్రశాస్త్రిల్లుగారు మొదలగు తెనుగు దేశమందలి వైదికులును, యేకస్థులై వ్రాసుకొన్న యొడంబడికలు.

1 మనలో పూర్వకాలమునుండి ఆంధ్రకవిత్వ సంపన్నులై మంత్రులై వ్యవహారవేత్తలై ఉద్యోగస్థులై ప్రభుధర్మముల నడుపుచున్న నియోగిశిఖామణులకు వైదికకర్మలు స్వయముగా జేసికొనుట యేగాక చేయించుటకును అధికారము కలిగియుండగలందులకై షోడశకర్మలు నిరాఘాటముగ చేయించవలెనని కుతూహలము కలిగియున్నది గనుకనున్ను వైదికుల నేకవేల సంవత్సరములనుండి యీయధికారము తామేవహించి నియోగుల కీయకపోవుటచేతనున్ను వైదికులొక్కరే యీమహాద్భాగ్యము ననుభవించుట చేతనున్ను మేముకూడ సంపూర్ణముగ ననుభవింపవలెనను యిచ్ఛతో షోడశకర్మాధికారమును వైదికులమగు మాకు వదిలివేయుటకు నిర్ణయము.

2 ఇకమీదనుండి నియోగులమైనమాకు మహారాజశ్రీ యని వ్రాయుటమాని యజనయాజనాధ్యయనాధ్యాపక దానాదాన ప్రతిగ్రహషట్కర్మ నిరతులైన శ్రీవేదమూర్తులయిన బ్రహ్మశ్రీ యని వ్రాయవలెను. అట్లు వ్రాయనిచో శివాలయములేని గ్రామములో కాపురముచేసినంతదోషమువచ్చును. ఇదిలగాయతు నియోగులందఱును తమలోతమకున్ను తదితరులకున్ను యీలాగు వ్రాయవలసినదని రిజిష్టరీ

నోటీసులు వ్రాయవలెను. అట్లు వ్రాయనివో కోర్టులో పరువునష్టముల క్రింద దావాలు తేబడుట విధాయకము.

3 ఇది మొదలుకొని కర్మలు చేసికొనుటకు తీరుబడియుండదు కాబట్టి నియోగులందఱును తమతమ కరిణీకములు వైదికులకిచ్చివేయ వలసినది.

4 ఇందులకు ప్రతిఫలముగా నియోగులందరును కలములు కాగితములు సిరాబుడ్లు మల్లుపంచలు మీసాలు పెంచుకొనేయధికార ను తివాసులు జంబుకాణాలు కోట్లు బూట్సు మొదలయినవి, గిర జాలు జునపాలు పెద్దజుట్లు పెంచుకొనే యధికారమును యిప్పుడే వైదికులకు వదిలిపెట్టివేయడమయినది.

5 ఇకమీద నియోగులకెవరికిని రావు,రాయుడు రాజు,పంతులు మొదలయిన పేళ్ళు పెట్టగూడదనిన్ని, శాస్త్రిల్లు, అవధానులు, దీక్షి తులు, సోమయాజులు, చేనులు భొట్లు శర్మ మొదలయిన పేర్లే యుండ వలసినదనిన్ని యీరావు రాయుడు రాజు పంతులు మొదల యినపేళ్ళు తప్ప వైదికులలో యెవరుగాని అవధానులు చేనులుపేళ్ళు పెట్టుకొనగూడదనిన్ని నిర్ణయం. ఇందుకు ప్రతిపద్ధాగా వైదికులమయిన మేము మీకు మనస్ఫూర్తిగా వ్రాయించియిచ్చిన వడంబడిక.

ఇదివరకు అనేకవేల సంవత్సరములనుండి మాస్వాధీనభుక్త ములో నున్నటువంటివ్ని, ఇదివర కెన్నడు యేవిధముగా నన్యాక్రాంత ము కానటువంటిన్ని శ్మశానభూములును అందులోనుండే కాకులు గద్దలు మొదలయిన జీవజంతువులున్ను దర్భలు మొలిచే బీళ్ళున్ను అందులో యిప్పుడున్నటువంటిన్ని ముందు మొలిచేటటువంటిన్ని దర్భ దుబ్బులున్ను మోదుగుచెట్లున్ను పంచాంగపుకట్టలున్ను దర్భాసన ములు కృష్ణాజినములు రుద్రాక్షతావళములు దేవతార్చన పెట్టెలు వి భూతిపండ్లు [illegible] అంధ్యములకదుళ్ళ

ఆసంధమయిన బుట్టలు కొబ్బరికాయచిప్పలు తాలుపుబిళ్లలు తత్సమం
ధమయిన పత్రిచెట్టు జారీచెంబులు యాయవారపు చెంబులు పిల్ల
జుట్లు కొల్లాయిగుడ్డలు తర్జనీయుంగరములు మీసాలుగొరిగించుకొనే
యధికారము మొదలయిన సమస్తవస్తువులున్ను ఆవుపేడ సహితముగ
మీకిపుడే స్వాధీనము చేసి రసీదు పుచ్చుకొనడమయినది. ఇందును
గురించి జ్ఞాతిసామంతాద్యవరోధములు ఎప్పుడైనా వచ్చేయెడల వాని
ఖర్చులను మేమే వహించి మీకీహక్కులు నిరాటంకముగ ఆచంద్రా
ర్కము జరపగలవారము. ఇకమీద వివాహములకు వెళ్ళినపుడు సద
స్యములలో సంభావన లియ్యనప్పుడు తోరణములు మీరే తెంపవలసి
నదిగాని మాకేమిసంబంధము లేదు. మరిన్ని షోడశబ్రాహ్మణార్థములు
నూ శివాయనపు ముత్తయిదువలు, నగ్నప్రచ్ఛాదనలు నీరుకాసులు
మీలో మీరే యేర్పాటుచేసికొని దాని ప్రతిఫలమును పొందుచుండ
వలెను. ఇందుకు మేముగాని మావారసులుగాని మాస్తానే వచ్చువారు
గాని యేవిధమయిన తగాదాలు పెట్టువారముకాము. గ్రామపౌరో
హిత్యములు, సభాపత్యములు మీరే వహించిచేసికొనుటకు మేమంగీ
కరించినాము. మీరు మీకరిణీకపుహక్కులు వదులుకొని మారోజునే
మాస్వాధీనము చేయడము నిర్ణయము. మాకు ఇకమీదనుండి మహా
రాజశ్రీ అనిన్ని రాజమాన్య రాజపూజితులనిన్ని వ్రాయుటకు నిర్ణ
యము ఆలా వ్రాయనట్లయితే క్రమప్రకారము మేము పరువునష్ట
మునకు చేసేదావాకు మీరు బాధ్యులై యుండవలెను. కలములు
కాగితములు కలందానులు మావద్దనే యుండవలెను. మీయిండ్లలో కన
బడేయెడల దానినష్టమును మీవద్దనుండి పుచ్చుకొందుము. ఇకమీద
మీపిల్లలను మీరుస్మార్త పాఠశాలలకే పంపవలెను. కాని యింగ్లీషు
పాఠశాలలకెంతమాత్రముపంపగూడదు. మాపిల్లలెవరైనస్మార్త పాఠశా
లకు వెళ్లిన [illegible] యిండ్లలో

పైనవ్రాసిన దర్శలు మొదలయిన పరికరము లుంచుకోన్న పక్షమున మాపిల్లలు యింగ్లీషుచదువు ... నిన పక్షమున బహిష్కారము చేసి యీ షరతులకు ఒప్పుగొని నడుచునట్లు చేయగలము. ఈ యేకుషరతులు యేడుయేడుపద్దాలుగు జన్మాలకున్న మనలో ఎవరముపడితే వారము జవాబుదార్లమయి ఒకరికొకరు జకుపుకొనుట నిర్ణయము ఇది ఉభయులసమ్మతిని వ్రాయించిన యొడంబడిక.

---

# ఆకాశ విశ్వవిద్యాలయము

ఇంద్రవారము 37 వ డిశంబరు 19763 వ సంవత్సరము. కాలము అసురసంధ్యవేళ గం. 7-5 ని మొదలు గం 7-6 ని. వఱకు

విషయము—గణితము.

1 ఒకగ్రామమునసబు తనపైయధికారులు వచ్చినప్పుడు వెన్న మీగడ పాలు కోళ్లు మేకలు గుఱ్ఱములకుగడ్డి మొదలగునవి సప్లయి చేయగా నతనికి నూరురూపాయలు కర్చయ్యెను. అధికారి బిల్లుచేయమనగా మునసబు అయినంతసొమ్ముకు బిల్లు చేసినపక్షమున కోపము వచ్చునని రు 35-11-8 పైసలకు బిల్లుచేసి తక్కినసొమ్ము అయూరిలో నున్న 89 గురు రయితులను దామాషాయిని యిచ్చుకొమ్మని చెప్పెను. అందు 19 గురు రయితులు మేమిచ్చుకోమని తిరుగుబాటు చేయగా మునసబే పెట్టుకొనెను. ఒక్కొకరయితు పెట్టుకొన్న దండుగయెంత? మునసబు పెట్టుకొన్న దండుగయెంత ?

2 × 2½ వెడల్పు × 100 ట పొడుగు గల యొక వీధికి కంకరవేయవలయును. కంకర వేసిన రెండువారములకు గోతులు పడునట్లు,మూ

డువారముల కడుగుననున్నమట్టి బయలుపడునట్లు, నాలుగువారములకు వేసిన ఆనవాలే కనబడకుండనుండునట్లు తేలికయైన కంకర అంగుళములో నెనిమిదోవంతుమెత్తున కంట్రాక్టరుకు యెస్టిమేటుసొమ్ములో నూటికి 95 వంతులు మిగులునట్లు వేయుటకెంతసొమ్ముపట్టును?

3 అప్పుడప్పుడు కేసులలోదొరికిన రు 3750 లు ఒకకానిస్టేబిలు, ఒకహేడ్డు, ఇద్దరుయినస్పెక్టర్లు అనునలుగురకు [?]పంచిపెట్టుడు. కాని స్టేబిలుకంటె రెండు రెట్లుహేడ్డునకును హేడ్డుకంటెరెండురెట్లు ఇనస్పెక్టరునకును రావలయును.

4 విష్ణుపురమను గ్రామములోనున్న బందెలదొడ్డిమీద అధికారముగల గ్రామమునసబు ఆసంవత్సరము గ్రామవాసులు బందెకు త్రోలుకొని వచ్చిన 793 పశువులకును, పశువు 1కి 0—4 – 0 ల చొప్పున సర్కారుకు చెల్లవలసినసొమ్ము మిజుమలె మునసబు సర్కారుకు 73-4-0 లు జమ కట్టించెను. మునసబుగారు లెక్కవ్రాయకుండా యెన్నిపశువులతాలూకు బందెసొమ్ము తాంబూలపుకర్చుక్రింద వినియోగించినారు?

5 చెన్నపట్టణముగొల్లవాడొకడు ఇంటింటికి ఆవునుదూడను తీసికొనివచ్చి పాలుపిదకదలచి పాలుచేపుదలనిమిత్తము ప్రతియింటివద్ద దూడను ఒక్కసారి తల్లితోగలిపి వెంటనేయీవల కీడ్చుచువచ్చును. అతడావిధముగ ప్రతిదినము 12 యిళ్ళకు పాలిచ్చుచువచ్చెను. ఒక్కొక్కయింటివద్ద నొక్కచుక్కపాలు దూడత్రాగినపక్షమున వారమునకెన్ని చుక్కలుపాలుదూడత్రాగును?

బి. నూరుచుక్కలు ఒకగిద్దెడుగా లెక్కచూచుకొన్న పక్షమున దూడకడుపులో సోలెడుపాలు పడునప్పటికెంతకాలముపట్టును?

6 నూరురూపాయలు జీతముపుచ్చుకొనునట్టి యొకయుద్యోగస్థుడు ప్రతిదినమువుడైరీ వ్రాయుటకు బద్ధకించి ముప్పది దినములూరకుండగా

పైయధికారి యేదినీడైరీ చూపుమని యడిగినప్పుడు త్వరగా, త్వరగా డైరీవ్రాయుట కెన్నిగంటలకెనికిపట్టును? పుట 1 కి 20 పంక్తులుండును పంక్తి 1 కి 25 అక్షరములుండును.

7 ఒకసత్రముగుమస్తా రోజు 1 కి 50 బ్రాహ్మణులకు 30 యితరవర్ణస్థులకు అన్నముపెట్టవలసి యుండెను. ప్రతిమనుష్యునకు 0-2-0 ల చొప్పున సత్రపుఅధికారులు లెక్కచూచి యతనికిప్రతిదినము సొమ్మిచ్చుచుండిరి. నెల 1కి 30-0-0 ల చొప్పున అతడు సత్రము సొమ్ము లోనుండి లాభముతీసుకొన్న పక్షమున ఈగుమస్తా ప్రతిదినము యెంత మందికడుపు కాల్చవలెను.

8 రాజమహేంద్రవరములో గోదావరిఒడ్డున వేసినగట్టుమీద నుండి మెట్లమీదగా గోదావరిలోనికి డెబ్బదిసంవత్సరముల ముసలమ్మ యెక్కితే కాలుజారినపక్షమున యెన్ని పిల్లిమంత్రములు వేసి నీళ్ళలో పడును?

ఈప్రశ్నలలో నొకటిమైన వ్రాయకయూరికే కూర్చున్న కొంద రు పరీక్షలో కృతార్థులగుదురు. వ్రాసినవారుతప్పిపోదురు.

---

# పెండ్లికొడుకుల లక్షణములు

ఒక బ్రాహ్మణుడు తన కూతునకు వివాహయోగ్యమైన వయస్సురాగా తనకు సంబంధము కుదిర్చిపెట్టుమని మరియొక బ్రాహ్మణు నాశ్రయించెను. ఆ బ్రాహ్మణుడు సరేయని యంగీకరించి కొంతకాలమిట్టటుదిరిగి యొక సంబంధము గుదుర్చుకొనివచ్చి పెండ్లి కూతురు తలిదండ్రులతో నీ విధముగా జెప్పెను.—

"నేను కుదుర్చుకొని వచ్చిన సంబంధము మీ యదృష్టము వల్ల లభించినదని చెప్పవచ్చును. వారి యింటిపేరు భాగ్యమువారు; గోత్రము భారద్వాజస గోత్రము, మీకును వారికిని ఋషులు కలియరు. కులగోత్రముల కేమిలోటు లేదుగదా. ఆగ్రామములో వారు మిక్కిలి ప్రసిద్ధులు. పెండ్లికొడుకు పేరు ధనరాజు. వారి యింట్లో కావలసినన్ని యెలుకలు పిల్లులు నల్లులు పేలు నున్నవి. వారియిల్లు చాల విశాల మైనది. కావలసినంతగాలి వెలుతురు వచ్చును. వెలుతురు మాట చెప్ప వలసి వచ్చినప్పుడు సూర్యచంద్రులను యింటిలో కట్టివేసినారనియే చెప్పవచ్చును వారిది స్వంతకమతము. వారికి కావలసినన్ని ధాన్యము పండును. ఆయూళ్ళో వారికి కావలసినన్ని భూములున్నవి. పెద్ద సంసారము. పదిమందికలవాళ్ళు. బంధుసముద్రులు. దొడ్డినిండా యెప్పుడు చూచినా కావలసినన్ని పశువులు. వారికెంత మాత్రము గర్వములేదు. పాడియున్నది. పెండ్లికొడుకు పచ్చగా దబ్బపండువలెనుండును. నిజముగా చూడకన్నులు లేవని చెప్ప వలసినదే. అతనిదర్జా యెటువంటి దనుకొన్నారు. అతడు వీధులలో సంచరించునపుడు రాజువలె సంచరించును. అనగా యీప్రక్కనొకమనిషి ఆప్రక్క నొకమనిషి యతని కెల్లపుడు నుండవలసినదే అధమపక్షము ఒకమనిషియైనకూడా ఉండక పోతే యతడిల్లు బయలుదేరడు అతని దస్తూరీ మోస్తరుగా యెవరిది యుండదు. ఆయింటినా రేవస్తువు నిమిత్తము వీధిలోనికి వెళ్ళవలసిన పనియుండదు. ఒకరి దగ్గరవారు బదులు తెచ్చుకోరు. ఒకరికి వారివ్వరు. పెండ్లికొడుకెంత సుకుమారుడో వినండి. ఒకరుతనకు గొడుగుపట్ట వలసినదేగాని తాను స్వయముగ గొడుగు పట్టుకొనడు. జోడు తొడుగు కుంటే కాళ్ళు కందిపోవునని యతడు జోడైనా సరిగా తొడగడు. మెత్తని పరుపుమీద పండుకొన్నను అతనియెముకలు నలిగి పోవునని చెప్పవచ్చును. ఎండకన్నెరుగని సుకుమారుం డనగా నతడె. అతడు

యిల్లు కదిలి యెక్కడికి వెళ్ళడు. తన పొలములోనికైన తా నెప్పుడు వెళ్ళడు. అతని కేపని కావలసిన యింట్లోవాళ్ళు పయివాళ్ళుకూడా గబగబ వచ్చి చేసి పెడతారు. కాబట్టి యీ సంబంధము సర్వవిధముల చేయతగ్గది.

ఆ యనమాటనుబట్టి పెండ్లికూతురు తలిదండ్రులు పెండ్లికొడుకును చూడకయే వారియిల్లు వాకిలినైన దర్శింపకయే సంబంధము నిశ్చయించుకొని ముహూర్త మేర్పరచిరి. పెండ్లివారు ముహూర్తము నాటికి తరలివచ్చిరి. పెండ్లిసమయమున పెండ్లికొడుకు కన్నులు కనబడని వానివలె ప్రవర్తించెను. ఆకారముమట్టుకు బాగుండెను గుడ్డివానివలె నున్నాడది యేమిటని పెండ్లికూతురు వారడుగగా పెండ్లికొడుకుకు కన్నులు కలిగినవని, అందుకు నిప్పులు యెంత చూడలేడని పెండ్లి కుదుర్చుటకు వచ్చిన బ్రాహ్మణుడు జవాబుచెప్పెను అదివిని పెండ్లి కూతురు వారొక విధముగ సగము బెంగతో నుండిరి. పెండ్లికొడుకు గుడ్డివాడనియు వారు మిక్కిలి పేదవారనియు దెలిసి మిక్కిలి గోల పెట్టి సంబంధము కుదిర్చిన బ్రాహ్మణునిమీదపడి యేడ్వగా నతడీ విధముగా జెప్పెను. "నా మాటలర్థము చేసికొనుటకు మీకు తెలివితేటలు లేకపోయినవిగాని నేనొక్కమాటయైనా యబద్ధము చెప్పలేదు. చిత్తగించండి! నేను చెప్పిన కులగోత్రములలో అబద్ధము లేదుకదా. ఇంటినిండా యెలుకలున్నాయని చెప్పినాను. ఆ మాటలనుబట్టి ఇంటినిండా ధాన్యమున్నాయనుకొన్నారు. అదితప్పు. ఇల్లు బే మరమ్మతులో నుండటంవల్ల విశేషముగా యెలుకలున్నవి ఎలుకలబాధపడలేక వారీమధ్య కొన్నిపిల్లులను పెంచుచున్నారుగనుక పిల్లులున్న మాటనిజము. పరిశుభ్రము లేని మనుష్యులగుటచేత వారికున్న రెండు నులకమంచములు నల్లులతో నిండియుండడమున్ను తలలు చీడపేలు పట్టియుండడమున్ను నిజము ఇం[illegible] (సూర్య చం.ను)

లింటిలో కట్టివేసినట్లే యున్నారు అటువంటి యింటికి కావలసినంత గాలి వెలుతురు నుండుటలో నబద్ధమేమున్నది. దొడ్డికి గోడలు లేక పోవుటచేత ఊరివారి పసువులన్నియువచ్చి అక్కడనే యుండెడివి. అందుచేత దొడ్డిలో నెల్లప్పుడు పశువు లుంటాయియన్నమాట యబద్ధ ములేదు. సాలుకు వారికి కావలసిన ధాన్యం మూడుపుట్లు అవిపండే భూములు మూడెకరాలున్నవి. అందుచేత వారికి కావలసినంత ధాన్యం పండుననియున్ని కావలసినన్ని భూము లున్నవనియు జెప్పుటలో నబద్ధము లేదు. వారికి స్వంతకమత మున్నదనుట అబద్ధముకాదు. ఒకచోట తెచ్చుకొన్న బదులు తిరిగి తీర్చరు గనుక వారి కెవ్వరు బదులియ్యరు ఒకరికి బదులిచ్చుటకు వీరివద్ద యేమీ లేనే లేదు. పెండ్లికొడుకు పచ్చ గానున్నాడన్నమాట నిజమేకదా. చూడ రెండుకన్నులు లేవని నేను మొదటనే చెప్పితిని. అందుచేతనే యెల్లప్పుడు యిద్దరు మనుష్యు లత నికి సాయముండ వలయునంటిని. రాజులు యెల్లప్పుడు నౌకర్లమీద చేతులు వేసికొని నడచునట్లు యీ పిల్లవాడుకూడా స్వయముగా నడవలేక పోవుటచేత ఒకరిమీద చేతులు వేసికొని నడచును. ఇత డెప్పుడు అంధుడగుటచేత ఇల్లు కదలడు. అశక్తుడగుటచేత అతనిపనులు యింట్లోవాళ్ళు పయివాళ్ళుకూడా వెంటనేచేసిపెట్టుదురు. అతడు వ్రా సిన అక్షరములు అష్టవంకరలతో నుండును. గనుక ఆతనిదస్తూరీవత్తె మరెవరిది యుండదనుట నిజము. గర్వము లేదన్నమాట నిజము నెత్తి మీద గడ్డిమోపు బుజముమీద నాగలి పెట్టుకొని వారి మగవారు పొలము నుండి యింటికి వత్తురు. అతను స్వయముగా గొడుగు కొను క్కోలేడు కనుక మరియొకరతనికి గొడుగు పట్టవలెనే గానిస్వంతగొడుగు లేదు. ఇదివరకెన్నడు జోడు తొడుగుకొనుట పరుపుమీద పండుకొను ట, అలవాటులేదు, గావున ఆరెండూ సమకూడినపుడతనిశరీరము కం దిపోవునని నేను చమత్కారముగా చెప్పితిని. నేనెంతో చాతుర్యము

గా జెప్పితినిగాని అబద్ధముచెప్ప లేదు. మీరు గ్రహించుకొనే తెలివితే టలు లేకపోయినవి. ఇంతకు బ్రహ్మదేవుని ఘటన ఆప్రకారముగా నున్నది. మీరు తప్పించగలరా నేను తప్పించగలనా! ఇంతకు పిల్ల ప్రారబ్ధము ఆప్రకారముగా నున్నది. విచారించిన కార్యము లేదు."

ఆమాటలు వినగానే తల్లిదండ్రులు మిక్కిలి చింతిల్లిరి. పెండ్లి కూతురు తలిదండ్రులు పెండ్లికొడుకును వారియింట్లు వాకిళ్ళును స్వయముగా జూచుకొనవలసినదేకాని మధ్యవర్తులు చెప్పినమాటల నమ్మి సంబంధములు నిర్ణయించుకొనువారికి యిటువంటి చిక్కులే తటస్థించునని చూడవచ్చినవా రందరు తమలో తామనుకొని వెళ్లిపోయిరి.

# జనాభా నాటకము

(నాంది)

గీ. ఒక్కమట్టి సిరాబుడ్డి యొక్కచేత
దస్తరాలు రెండవచేత దాల్చుకొంచు
తిరుగు నెనుమ్యామరేటర్ల దీర్ఘమైన
వగరపులువిసుపులు మిమ్ముకాచుగాత !

(నాంద్యంతమున సూత్రధారుడు తెరవంకజూచి)

పారిపార్శ్వకా! నీవుకూడ నెనుమ్యామరేటరుగా నేర్పడితివా యేమి! నాటక ప్రారంభమున కాలస్యము చేయుచున్నావు ?

పారి— అవును. నేను మాలపల్లిలో వేయబడితిని. అందుచేత స్నానముచేసి భోజనముచేసివచ్చునప్పటి కింతప్రొద్దుపోయినది. ఇప్పుడు సెలవేమి ?

సూత్ర—విష్ణుపురమండలి మెన్యూ్యమశేటర్లు సూపరవైజర్లు కొందరు గృహస్థులు యీరాత్రి యేదైన అపురూపక నాటకము ప్రయోగింపుమని నన్ను కోరుటచే జనాభానాటకమను గొప్పరూపకము నీరాత్రి ఆడదలచుకొన్నాను.

పారి—ఇది యేమహాకవిచే రచియింపబడినది ?

సూత్ర—అన్నో్య! ఆయుననే యెఱుగవా నీవు. ఆయనకీర్తి—

గీ. మంగ్గువలె బాతువలె మఱిబుగ్గివలెను
సీమసున్నమువలె చల్లచెలువమునను
నెరసినట్టి వెంట్రుకలట్లు యెముకలట్లు
గూడకొంగలవలెనొప్పు గొప్పగాను.

ఆయనపేరు వెలవెలపాటి విస్సన్న మహాకవిసార్వభౌముడు. ఈయనకు కవిగండ భైరవుండనియు, ఆంధ్రకవీంద్ర చక్రవర్తి శిఖామణియనియు, దుష్కవి భల్లూక నిష్పుపెట్టెయనియు, ప్రతివాదభయంకర దుడ్డుకఱ్ఱ ధారియనియు, అనేక మహారాజులు బిరుదులిచ్చిరి.

పారి—ఆబిరుదులిచ్చిన మహారాజు లెవరు ?

సూత్ర—చెప్పెద వినుము. చతుస్సముద్రముద్రితమహీమండలమంతయు బాలించుచున్న శ్రీమద్రాజాధిరాజ భూమండలాఖండల కాటేరిడుగారు, గుమ్మాల తమ్మన్నదొర, సీమచింతల చిక్కయ్యరెడ్డి మొదలగు చక్రవర్తులిచ్చిరి.

పారి—సరే తెలిసినది. అతివిస్తరమెందుకు. మనము కథాప్రారంభము చేయుదము. మహాళాల అమావాస్యనాడు బ్రాహ్మణార్థము వప్పుకొన్న బ్రాహ్మణుని మొగమువలెనే మటమటలాడుచు బుచ్చిరాజను మెన్యూ్యమశేటరు ప్రవేశించుచున్నాడు. మన మిక పోవుదము,

ఇది ప్రస్తావన.

## మొదటియంకము.

(అప్పుడు బుచ్చిరాజు, అచ్చిరాజు అను యిద్దరు మెన్యూమ
రేటర్లు ప్రవేశించుచున్నారు.)

బుచ్చి — ఏమోయి అచ్చిరాజు! ఎక్కడనుండి వచ్చుచున్నావు?

అచ్చి — ఎక్కడనుండి యననేల? నాబ్లాకులోనుండి. ఈజనా భా నాప్రాణముమీదికివచ్చింది. ఆసూపరువైజరు ముండాకొడుకు కలి యుగరామణాసురుడు. వాడు నాయెముకలు కటకట కొరుకుచున్నా డు. నాలెక్కలలో తప్పులున్నవట. నన్నతడు ప్రాసిక్యూషను చేయించి జెయిలులోనికి పంపుతాడట. చేతగాని ముండాకొడుకును యెందుకు వేశావురాయని ఆయధికారి నడిగే దిక్కులేదుకద! ఇంతకు నాకర్మ మని మొత్తుకొనుచున్నాను.

బుచ్చి — నీవు మొత్తుకొనకు. ఈలోపము స్థానికాధికారులది కాని సర్కారుది కాదు. సర్కారు ఉద్దేశము మంచిది. వారిచట్టము మంచిది. జనాభాలోకోపకారమైనది, దీనికి మనమందరము చేతులు కట్టుకొని పనిచేయవలయును.

అచ్చి — చేయుచున్నాముకాదటయ్యా. చేతకానివాళ్ళను వేసిన యెడల వాళ్ళెట్లు చేయుదురు?

బుచ్చి — దానికేమిగాని నేను నీకు సహాయము చేసిపెట్టెదను. ఇదివరకు వ్రాసినచిత్తు సరిగా యున్నదేమో యిళ్ళకువెళ్లిచూచివా?

అచ్చి — మహాప్రభో! రక్షించినావు. ఇదిగో యిళ్ళకువెళ్ళి సరి చూచెదను

(అని యిద్దరు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

1. రంగము.

(తిరుకచ్చినంబిఅయ్యవార్లుగారియిల్లు)

అచ్చిరాజు—(గుమ్మములోనికి వెళ్ళి) అయ్యవార్లంగారూ!

తిరు—ఎవరువారూ? ఇదిగో వచ్చుచున్నాను. (అని తలుపు దీయును)

అచ్చి— నేనండి! ఎన్యూమరేటరు అచ్చిరాజును.

తిరు—తిరిగి యెందుకు వచ్చినారు మీరు? మొన్నవచ్చినారు కాదూ! నేను యింట్లోనున్నపుడు లేనపుడూకూడా మావాళ్ళను పేరు చెప్పుమని చంపుతున్నారట యేమిటి?

అచ్చి—లేదు స్వామీ! లేదు. మొన్నవ్రాసికొనివచ్చిన చిత్తు సరిగానున్నదేమో మీకొకసారి వినిపించెదను వినండి.

తిరు—వినిపించండి వింటాను.

అచ్చి— తిరుకచ్చినంబి అయ్యవార్లంగారు, వయస్సు 45 బ్రాహ్మణులు.

తిరు—అట్టెట్టె! ఆగు. నీపాడునైజము నీవు కనబరచుకొన్నావు కాని మానలేదు. మనకిద్దరికి కోవెలలో ప్రసాదాలదగ్గరవచ్చినతగాదా మనసులోనుంచుకొని నన్నీవిధముగా పరాభవము చేస్తావా?

అచ్చి—(తెల్లబోయి) యేమి పరాభవమండీ! స్వామీ!

తిరు—ఏమి పరాభవమా. యింతకంటె యేమి కావాలి. ఎరి గుండీ నంగనాచివలె నటిస్తావా? చూడు నలుగురిచేత నీనోట్లో గడ్డి పెట్టించి పరాభవ మేమిటో చెపుతాను. మంగరాజుమామగారూ! మీరిల్లా దయచెయ్యండి పీడిదౌర్జన్యము చూతురుగాని.

సంగ—(వచ్చి) యేమిటండోయి అది! కాకపోయినా యీ యెన్యూమరేటర్లు బొత్తిగా పొగరబోతులండీ.

అచ్చి—సంగ తివినకుండా పొగరబోతులంటా రేమిటండీ! నేను చేసిన పరాభవమేమిటో చెప్పవయ్యా బాబు చంపక.

తిరు—మామగారూ చూడండీ! వీడిరాతమండా. నన్ను బ్రాహ్మణుడని వ్రాసినాడు. నేను బ్రాహ్మణ్ణిట. ఈచచ్చుయుద్యోగము నీకయిందని యింత కన్నులు నెత్తికిరానా? నేను బ్రాహ్మణ్ణా?

అచ్చి—వేదము చదువుకొన్న మహానుభావులు. మీరు బ్రాహ్మణులుకాక యెవరౌతారు. శూద్రులగుతారా? కోమట్లగుతారా? రాజులగుతారయ్యా?

తిరు—అదుగో మళ్లీ ఆకూతే కూస్తావు. నేను బ్రాహ్మణ్ణి అవడానికి నేనేమి పౌత్తర్లుపడతాననుకొన్నావా, నీరుకాసులు పడతాననుకున్నావా? అడ్డమైనవాళ్ళచేత కాళ్ళుగడిగించుకొంటాననుకొన్నావా?

అచ్చి—ఆపనులు చేసేవాళ్లైనా బ్రాహ్మణులంటే? మీరు తప్పకుండా బ్రాహ్మణులని నాయభిప్రాయము. నేనల్లా వ్రాస్తాను.

తిరు—అల్లాగే వ్రాస్తావు? నలుగురిలో బెట్టి యీడిపిస్తాను. రాయికావలస్తే. నీబాబు బ్రాహ్మణుడు, మీతాత బ్రాహ్మణుడు, మీముత్తాత బ్రాహ్మణుడు.

అచ్చి—ఆమాటకు నాకు కోపము లేదు. మావాళ్ళంతా బ్రాహ్మణులే. మిమ్మలిని యేమివ్రాయాలో చెప్పవయ్యా తుడుపెట్టి వ్రాస్తాను.

తిరు—శ్రీవైష్ణవుడు అనివ్రాయవలెను. ఇప్పుడైనా బుద్ధికలిగి, ఆప్రకారమువ్రాయి.

అచ్చి—(పకపకనవ్వి) ఇదిటయ్యా! నీపిచ్చకూల. శ్రీవైష్ణవులుమాత్రము బ్రాహ్మణులు కారటయ్యా. మెడలోనివి జందెములు కావూ? మీరు దేవతార్చన చేసికోరూ మీరుభయవేదాంతప్రవర్తకులు కారూ!

తిరు—ఆసొదంతా నీకెందుకు! నేనుచెప్పినట్టు వ్రాయి. లేక పోతే నేను బ్రాహ్మణుడన్నది కొట్టివేసి తహసీలుదారుగారికి కలక్టరు గారికి అర్జీయిస్తాను,

మంగ—పోనీ ఆలాగే వెయ్యరాదటయ్యా. నీసొమ్మేమిపోయినది.

అచ్చి—ఈతగాదాలు ప్రతీయింట్లోను వస్తూన్నాయండోయి, మొన్న కరణం సుబ్బరాజుగారిని బ్రాహ్మణుడని వ్రాస్తే నన్ను కొట్ట బోయినాడు. మీరుచెప్పినట్లు వ్రాయమని మారూల్సులో లేవు. మా సూపరవైజరు ముక్కలుకోరికేవాడు. ఆయనవ్రాయమంటేవ్రాస్తాను లేకపోతే లేదు,

(అని వెళ్ళుచున్నాడు)

తిరు—మామగారూ చూచారా వీడిదౌర్జన్యము! సరే కా నివ్వండి. (చేతులు పట్టుకొని) ఇవి కాళ్ళుగాని చేతులుకావు. తమరు నాకొక సహాయము చేయించాలి.

మంగ—ఏమిసహాయము చెప్పండి చేస్తాను,

తిరు—తాలూకాకచేరీలో జనాభాపని చూసే గుమాస్తాపేరు జనార్దనరావు. ఆయన మీకు స్నేహితుడు. ఆయనతో శిఫారసుచేసి బ్రాహ్మడిపేరు తీయించెయ్యాలినాకు.

మంగ—స్నేహితుడే! ఎక్కడైనా బావగాని వంగతోటదగ్గర బావకాడు. ఇందులో యేమయినా హిరణ్యార్థము పుచ్చుకుంటేనే గాని పనిచెయ్యడు.

తిరు—పోనీ! ఒకరూపాయ డబ్బులు పారవేద్దాము. ఈయప్ర తిష్టపడేకంటె రూపాయపోతేనేమి?

మంగ—సరే రూపాయితెండి నేనువెళ్ళి మాట్లాడి పని చేయిస్తాను

తిరు—(లోపలికి వెళ్లి రూపాయి తెచ్చియిచ్చి) యిది విూకారట్టి ముక్రింద మెంచుకోవాలి సుమండి

మంగ—సందేహమేమి ? అల్లా చేయిస్తాను.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

---

రెండవ యంకము.

1వ రంగము.

కాపుల వీథి.

(అప్పుడు నరసంభట్టను మెహ్యామరేటను ప్రవేశించుచున్నాడు.)

నర—(తనలో) అమ్మయ్యా! ఈ వేళ 10 దవ మార్చి. ఈరాత్రితో వీర్లు గుండాన్నిపడును. ఒక్కొక్కయింటికే వెళ్ళి యిదివరకు పేర్లు వ్రాసినవారున్నారో లేదో కనుగొని త్వరగా ముగించుకొని పోతాను ఏకుక్కలు కరవకుండా యేనయ్యాలు విూదపడకుండా దాటితినా అదృష్టవంతుఁడను. ఇదిగో మొదట యీయింటికి వెళ్లెదను. (ఒక యింటికి వెళ్లి) ఎవరండీ లోపల తలుపుతీయండి.

ముసలమ్మ—(లోపలనుండి) వొవరారూ?

నర—నేనండీ.

ముస—నే నంటోవరు?

నర—ఎవరూ లేదు. నేనే.

ముస—పేర్లేనా. ఊర్లేనా. నేనేనని అరుత్తావెందుకూ!

నర—మరెవరు లేరు నేనమ్మా తలుపుతియ్యి.

ముస—నీ నేను నుండిపోనూ పేరుచెపుదూ.

నర—నన్నెరగనట్టే మాట్లాడుతా వేనమ్మా, నేనంటేనూ.

ముస — గొంతుకు బద్దలయ్యేటట్టు అరు. నేను తలుపుతియ్యను. అద్దం శేతిరికాడొొచ్చి అరుత్తావెందుకు నువ్వొవ్వరవో నాకేంటి.

నర — నేను. నరసంభట్టును.

ముస — నరసంబొట్టొవరు? నీకు మాకాడేం పనుంది?

నర — పేర్లు వ్రాసికోవాలి తలుపుతీయ్యి.

ముస — (ఏడ్చుచు) అయ్యో నీజిమ్మడ్లో: మల్లావచ్చావంట్రో (అని తలుపు తీయుచున్నది).

నర — (తెల్లపోయి గుమ్మముదిగి క్రిందికి వెళ్ళును).

ముస — నీ రాతమండిపోను. నాకొంపతీసిమల్లీ వచ్చావా, నీకళ్ళు కాలిపోనూ. యేయేలప్పుడొచ్చావో, యే యేలప్పుడు సూసావో, యే న్యేలప్పుడు రాశావో నీ రాత నట్టేట్లో గలిశిపోనూ. మాణిక్యమంటి పిల్లోణ్ణి నీపొట్టపెట్టుకొన్నావుకందా! మాయిబాపనోడ. నీ లెక్కలు నేలమడ.

నర — ముసలమ్మా! అల్లా తిడతావేమిటి. నే నేమిజేశాను. ఏమిజరిగింది?

ముస — ఏంజరిగిందని మల్లా అడుగుతావా? చేసినపనిచేసి (అని యేడ్చుచు) నీవు పేర్లురాసుకెల్లిన మూడోనాడు మూడేళ్లపిల్లోడు బంగారమంటోడు తిరుగుతా తిరుగుతా యిట్టే సచ్చిపోయినాడు. నాయినోయి! నాయినా! నీజీవానికీపేర్లెక్కడొచ్చినాయిరోయి నాతండ్రీ! ఈబాపనోడు నీజీవనాని కెములోడయినాడురోయి నాయనా! నాతండ్రీ! నాబుల్లోడ! ఈడుపేరు రాసుకోకపోతే మాకేళ్ళబతికే బతుకురా నీది.

నర — పిల్లవాడాయుర్దాయము లేక పోయినాడు. పేరు వ్రాసుకొంటే పోతాడా? మీయింట్లో ఎందరున్నారో అందరిపేర్లుచెప్పు. వ్రాసుకొనడానికి వచ్చినాను. పిల్లలెందరు? పెద్దలెందరు?

ముస—ఆరిబాపనోడ! నిన్ను పూవిళ్ళమ్మేనుకుపోనూ. నీకేం దురుబుద్ధిపుట్టిందిరా. ఆణ్ణిచంపి యీళ్ళనుకూడా చంపాలనివొచ్చావా? నన్ను చంపినాసరే బిడ్డలపేరుచెప్పను. యేమిచేస్తావో చెయ్యి.

నర—జాగర్త. చెప్పకపోయినావంటే నిన్ను పాసిక్యూషను చేయిస్తాను. జుర్మానా వేయిస్తాను. జైలుకు పంపిస్తాను. జాగ్రత్త.

ముస—యేంటీ? పోసుకోసంయేయిత్తావు. పోసుకోసంయేంట్రా నీపిండాకూడా. పిల్లోణ్ణిచంపి పోసుకోసం యేయిత్తావు? ఎల్లా యేయిత్తావో పోసుకోసంయెయ్యి. రోకలుచ్చుకొని రొమ్ములోమొదుత్తాను. ఉండు నీజిమ్మడ. అక్కడుండు. (అని లోపలికి వెళ్ళుచున్నది.)

నర—ఉండు, పోలీసువారిని తీసుకొనివస్తాను. (అని పోవుచున్నాడు).

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

---

## 2 వ రంగము.

### గురుమూర్తిదీక్షితులుగారియిల్లు.

గురు—(అరుగుమీద కూర్చుండి వేదము చదువుకొనుచుండును).

నర—(గబగబవచ్చి) శాస్త్రీగారూ! మీయింట్లో జనమంతా యెందరో చెప్పండీ.

గురు—అయితే నరసంభట్టుగారూ! యీపేర్లువ్రానుకొనుట యెందుకు? తలకు రూపాయి పన్నుకడుతారట. పన్నుకట్టడం కోసమట. నిజమేనా?

నర—అబ్బెబ్బే! శాస్త్రిల్లుగారూ, అబద్ధమండీ. ఎందరు జనమున్నారో లెక్కపెట్టుటకొరకుగాని పన్నుకట్టుటకుగాదు.

గురు—కాదనకపోతే సర్కారుమనిషివి నువ్వెవునంచావు? సర్కారేదోమెచ్చి నీకేదో కప్పుచారని అభిమానంకోసం పడేడుస్తూన్నావు. నిజంచెప్పు. నాకెందుకు పన్ను కట్టిస్తావు. కరువుకాలం పన్నిచ్చుకోలేము. గనుక మాయింట్లో అట్టేమంది లేరని వ్రాయి. చిరకాలమునుంచి యెరిగినందుకు నాకీమేలు చెయ్యవోయి. బ్రాహ్మణ్ణిగదా. నాకు నిష్కారణంగా పన్నుకట్టిస్తే నీకేమివస్తుంది.

నర—శాస్త్రిగారూ! మీరు వేదం చదువుకొన్నమాటేగాని మీకు ప్రపంచజ్ఞానము లేదు. మీరు ఫూల్సు. నేను ప్రైమరీ ప్యాసై ఫస్టుఫారము చదివాను. నాకన్ని సంగతులు తెలుసును. తెలియకపోతే నోరుమూసుకొని యూరుకోండి, కాని యిల్లాంటి అవకతవక మాటలనకండి, పన్నులు లేవు బందెలు లేవు.

గురు—నీడాబులు కట్టిపెట్టు. నేను ఆవలిస్తే పేగులు లెక్కపెట్టేవాడిని. మొన్నమొన్నటి లొట్టకాయవు నీకేమి తెలుసును. పన్నులు కట్టడంకోసం కాకపోతే యేయింట్లో యెందరు జనముంటే వాళ్ళకెందుకు? వాళ్లేమి వెఱ్ఱివాళ్లై లెక్కపెడుచున్నారనుకొన్నావా యేమిటి. చంటిపిల్లవాళ్ళదగ్గర చెప్పినట్టు చెపుతావేమిటి నాదగ్గర.

నర—అవన్నీ యెందుకు మీయింట్లో యెందరున్నారో చెప్పండి.

గురు—(తనలో) చెప్పితే తప్పకుండాపన్నుపడుతుంది. కాబట్టి మాయచెయ్యవలెను. (ప్రకాశంగా) మావాళ్ళందరూ పుట్టింటికి వెళ్ళినారు, నేనొక్కడనే అత్తిసరుపెట్టుకొని తినుచున్నాను.

నర—దీపాలవేళ మీభార్యపిల్లలు వెంకప్పసోమయాజులుగారింటికి పేరంటమునకు వెళ్ళి నాకు కనబడ్డారు. లేదని అబద్ధమాడుతారేమి?

గురు — ఎవరినిచూచి ఎవరనుకొన్నావో వాళ్ళుకారు.

నర — అయితే నేనీసంగతి సూపరువైజరుగారితో రిపోర్టు చేస్తాను.

గురు — సరే చెయ్యి. (తనలో) వీడు మోటనిర్భాగ్యుడు అంతపనిచేస్తాడు. నేను వెళ్ళి సూపరువైజరుగారికాళ్ళుపట్టుకొని యీ ఆవత్తు తప్పించుకొంటాను.

(అని యిద్దరు నిష్క్రమింతురు.)

---

## మూడవ యంకము.

### రంగము.

(భోగము రంగసాని యిల్లు)

అంతట ఎన్యూమరేటరు నరసింహము ప్రవేశించుచున్నాడు.

నర — (తనలో) ఎన్యూమరేటరుపనిని నేను సంతోషముగానే చేయుదలచుకొన్నానుగాని నాకర్మముకాలి యీభోగమువాళ్ళయిళ్ళు నాపాలబడుటచేత నాకుమిక్కిలి కష్టముగనున్నది. పూర్వకాలపుభోగమువాళ్ళు పెద్దమనిషిని యెవరినైనా చూస్తే లేచి దండముపెట్టేవాళ్ళు. ఈకాలపుసానులు కుర్చీలమీదకూర్చుని లేవనేలేవరు. అడిగినమాటకు సమాధానముచెప్పరు. అవన్నీ అటుండగా యీరాత్రివేళ వీళ్ళు తలుపు తీస్తారోతియ్యరో తియ్యలేదనిచెపుతే సూపరువైజరూరుకోడు. నాకిందులోనక్కచావునచ్చినది ఇదిగో రంగసానియింటికి వచ్చినాను. దీన్ని పిలుస్తాను. (ప్రకాశము) రంగసానీ! రంగసానీ! తలుపు తలుపు.

(అప్పుడు రంగసానియు మరియొక పురుషుడు లోపలగదిలోనుందురు)

రంగ — ఎవరువారు?

పురు__ఓసీ పలకకు మాటాడకు.

రంగ—పలకకపోతే యెల్లాగండీ, హారేదేనా రిపోర్టుచేస్తే తంటావస్తుంది.

పురు—జీలకర్రతంటా ఏంతంటావస్తుంది. తంటావస్తేనే లేనూ?

రంగ—మీరెందుకు గాత్రులు మాకొంపల్లోదూరి, అడ్డమైన గడ్డితిని పగలు పెద్దపెద్దవారివలె సంగనాచులై భోగమువాళ్ళపేరు చెపితే తిడతారు. పైగా మాతరపున వకాల్తునామాయైనా పుచ్చుకోరు. మిమ్ము నమ్ముకొంటే గంగలోదిగినట్టే.

పురు—ఆమాట కేమిగాని నీవు తలుపుతీస్తే వాడువచ్చి నన్ను చూస్తాడు. వాడిక్కడచూచి పరాభవము చేయగలడు. పైగానానోరు వాసనవేయుచున్నది.

రంగ—ఆయన యిక్కడిలోనికిరాడు. ఆయనఅడిగిన మాటలకు సమాధానము చెప్పి వెంటనేపంపివేస్తాను. మీరు భయపడకండి.

పురు—నామాట వినవే. తలుపుతియ్యకే. ఎందుకైనా మంచిది. ఈవేళ యింట్లోకూర్చోవలసినవాడను పొరబాటుచేత బుద్ధి నేరక వచ్చినాను. నేను నీయింటికి వస్తూయున్నసంగతి నెవ్వరుయెఱుంగరు. పరాభవముచెయ్యకు

రంగ—ఏమీ పరాభవములేదు; ఊరుకోండి.

నర—తలుపుతియ్యమంటే తియ్య రేమిటి,

రంగ—వస్తూన్నానుండవయ్యా. (అని తలుపుతీయును.)

నర—రంగసానీ! నీవు మీయమ్మ మీదాసీది నీపెంపుడు కూతురుగాక మరెవరైనా క్రొత్తగావచ్చినారా ?

రంగ—ఇద్దరుచుట్టాలు మాయింటికి వచ్చినారండీ.

నర—వాళ్ళపేరేమిటి?

రంగ — కనుక్కొని వస్తాను. ఇక్కడకూర్చొండి (అని బల్లచూపి వెళ్ళును)

నర — (తనలో) ఈలోపుగ ఊరికే కూర్చుని యేమిచేస్తాను. వ్రాసినవన్నియు సరిచూస్తాను. దీపం లేదే, అదిగో గదిలో నున్నది. అక్కడకు వెళ్ళిచూస్తాను. (అని గదిలోనికి వెళ్ళు చున్నాడు.)

(అంతటగదిలో మంచముమీదకూర్చుండి తిరుపతిరావుగారు ప్రవేశించుచున్నారు.)

తిరుపతి — (నరసింహామును చూచి మొగముమీదబట్ట వేసుకొని మంచము క్రిందదూరుచున్నాడు.)

నర — తిరుపతిరావుగారా యేమిటి? దూరకండి దూరకండి. మంచముక్రింద దూరకండి.

తిరు — (తనలో) అనుకొన్నంతపని జరిగినది, ఈ పాడుముండ నేను చెప్పినట్లు విన్నదికాదు. పిలిచినప్పుడు పలుకకపోతే ప్రాణం విసికి వాడేపోవును. ఇప్పుడేమిచెయ్యను? బైటికివచ్చుటకూ వీలులేదు. రాక పోవుటకూ వీలులేదు.

గంగ — ఏమిటండీ మీరునాగదిలోనికివచ్చారు. ఈగదిలోనికి మిమ్మలి నెవరురమ్మన్నారు. మీరువచ్చినపని చూచుకోవలసిన దేకాని యీగొడవలన్నీ మీకెందుకు? మిమ్మన్ని యీగదిలోనికిరమ్మని రూల్సు న్నాయా?

నర — మమ్మలిని రమ్మని రూల్సు లేవు. తిరుపతిరావుగారంతటి వారు రావచ్చునని రూల్సున్నాయి. సరే ఈరాత్రి రెవరుయెక్కడ నుంటే వారక్కడ నున్నట్టు వ్రాసుకోమని రూల్సున్నాయి. కాబట్టి తిరుపతిరావుగారు మీయింట్లోనున్నట్టు వ్రాస్తాను.

తిరు — (ఈవలకువచ్చి) అయ్యా మీపేరెవరండీ. ఎన్యూమరేటరుగారా? మీదర్శన మెప్పుడూ చేయలేదు.

నర—నాదర్శనము తమరుచేయుటకు నేనెంతవాడిని. మీ దర్శనమునకే నేను వెనుక రెండుసారులు ఉద్యోగము యిప్పించుమని అడుక్కుందామని వచ్చినాను కాని దర్శన మయినదికాదు. తమవంటి వారి దర్శన మెప్పుడయినా యీలాంటిచోట కానలసినదేకాని యిళ్ళ దగ్గరకాదు

తిరు—అప్పుడేదో పనితొందరమీదుండి దర్శనము కాలేదు. దానికేమికాని యిప్పుడుమీరు కొంచెము శాంతించండి కోపగించకండి

నర—తమరు కొంచెము దూరముగానుంచుని మాట్లాడండి. మీనోరు వాసనేస్తూంది. ముక్కు బద్దలైపోతున్నది.

రంగ—ఏమిటయ్యా, పెద్దాపిన్నా యెరుగకుండా నోటమ్మట యెంతమాటవస్తే అంతిమాట అంటావా ?

నర—నాకేం భయమా యేమి? ఆయనచెడతాగి మాట్లాడు తోంటే నోటి వాసన భరింపలేకుండావున్నాను. ఆయనకులేని కోపము నీకొస్తుందేమి? నాలుగు రూపాయలకోసం నీవేవాసనయినా భరిస్తావు నేనల్లా భరించలేను.

తిరు—ఊరుకోవే తగాదాలు పెట్టకు. ఎన్యాయ రేటరుగా రూ! మీరు నాపేరిక్కడ వ్రాస్తానంటున్నారేమిటి?

నర—అవును యెక్కడుంటే అక్కడవాయవలసినదనే మా రూల్సున్నాయి.

తిరు—రూల్సుకేమిగాని కొంచెము గృహస్థధర్మ మాలోచిం చండి. మనమంతా ఒకవూళ్ళోవుండేవాళ్ళము. తెల్లవారిలేస్తె మొగ మొగాలు చూచుకోకమానము. నలుగురిలో తలయెత్తుకొని తిరుగు తున్నాను. పొరబాటుచేతనో, బుద్ధినేరకనో, యీరాత్రి యిక్కడకు వచ్చినాను. ఇంతమాత్రముచేత మీరీప్రకారముగా చెయ్యగూడదు. నాకీయుపకారము మీరు చెయ్యవలెను.

నర — నాకుగాల్సు లేవుచేయడానికివీలున్నట్టుగనబడదు. ఇప్పుడు సూపర్‌వైజర్‌గారు కూడా వస్తారు. ఆయన చూచినట్టయినా నా ప్రాణంమీదికి వస్తుంది.

తిరు — ఒసే వీధితలుపు గట్టిగాగొళ్ళేము పెట్టిరా అయనకూడా చూస్తే మరీపరాభవము.

నర — మీరు తలుపుగొళ్ళేము పెడితే నేనెప్పాకోను. మీరు లోపలబెట్టి చావగొట్టించాలన్న యభిప్రాయమా యేమిటి?

తిరు — ఇదోతంటావచ్చింది. సరే ఈయుపకారం నాకుచెయ్యండి మీకు ప్రత్యుపకారము చేస్తాను.

నర — ఏముపకారము చేస్తారు?

తిరు — మాయిలాకాను పదిహేనురూపాయిలపనొకటుంది అది యిప్పిస్తాను. రేపుఉదయమే ఆర్డరువేస్తానుస్తాను.

రంగ — ఇరవయి దరఖాస్తులుపెట్టి ఆరుమాసములు ఆశ్రయించి సంపాదించుకోలేనిపని యీయనగా రరగంటలో సంపాదించుకొన్నాడు.

నర — చిత్తము మీసెలవుప్రకారము నడుస్తాను మీమాట మీరు నిలబెట్టుకోవలెను.

తిరు — మాటతప్పు తేచండాలుడేసరి. మీరుకూడా నేనిక్కడున్న సంగతి యెవరితోను చెప్పనని ప్రమాణం చెయ్యండి.

నర — నాప్రిమాణంగా నేనుచెప్పను. నేను సెలవుపుచ్చుకుంటా

తిరు — ఓసీ త్వరగా వెళ్ళి తలుపు వేసెయ్యవే మళ్లీయెవ్వరూ రాకుండా.

రంగ — (తలుపు వేయును.)

నర — (వీధిలోనికి వెళ్ళి తనలో) ఈయడా కిడిలో రంగసానీ యింట్లోకివచ్చెద ప్రొత్తవా ఫుచేరు [illegible] చూచిపోయినాను

పోనీలే. అన్ని లెక్కలు సరిగానుండి యేడుస్తాయా యేటి. ఏలాగో పది హేనురూపాయలపని సంపాదించుకొన్నాను.

(అని వెళ్ళుచున్నాడు.)



## నాలుగవ అంకము

### 1 రంగము.

(అప్పుడు రహిమాన్ ఖాన్ అను ఎన్యూమరేటరు ప్రవేసించు చున్నాడు)

రహి—(ఒకయింటివద్దకువెళ్ళి) ఈ యింటి ఖామందుయెవర్ ?

రామమూర్తి—ఈ యిల్లు వెంకట్రామయ్యగారిది.

రహి—వరే! రాసికుతాం. ఉండు (అని వ్రాయుచున్నాడు.)

రామ—ఇదియేమిటయ్యా వెంకట్రామయ్య అని వ్రాయడమునకు వెంటుకురామయ్య అని వ్రాస్తూన్నావు.

రహి—మాకీవస్తాదిలాగు రాస్తాం. నీకీ పూచీలేదు. నీకి మా అతిక్కారికావు. పేర్లుబోలో.

రామ—ఆయన పెద్దకొడుకు రమణయ్య

రహి—ఏమ్టి మర్నయ్యా?

రామ—మర్నయ్యకాదు. రమణయ్యా.

రహి—అరే యేమిపేరువోయి. నామర్దాపేర్.

రాము—అదేమిటయ్యా సాహేబు! మరణయ్య అనివ్రాస్తావు

రహి—అరే మాకి కోపం వస్తాది. నీకి యెవడువోయి మాకి వస్తుంది మళ్లేరాస్తాం కపడ్దార్. అరే నీకీ పేరుచెప్పు.

రామ—నన్ను అరేవొరే అనకు. ఆనక బాగా జరగదు.

రహి—అరే. ఇందులో తప్పేమివోయి.

రామ—మళ్ళీ అరే అంటావు,

రహి—వూంగోకాబే. తగాదాకీ కాల్ తవ్వతావేమి వోయి? మీకీ, మాకీ తప్పు పిల్చాం? మీకీ అరే అంటే తప్పా అరే అల్లా! కాఫరుపేర్లు బలే తమాషావోయి. (నవ్వుచున్నాడు.) నీపేరేమిటి రామమూర్తి?

రామ—అన్నీ తప్పులే వ్రాయుచున్నావు ఎమైనాఅంటే మీాద పడతావు.

రహి—అరే: ఆ మాట వద్దు. మీకీ జనానాపేర్లు సెప్పు.

రామ—నరసయ్య.

రహి—అరే ఆడది? మొగది?

రామ—ఏమిటయ్యా! అదిఅంటావు.

రహి—అదిఅంటే తప్పేమిటివోయి. మాకీ ముండా అన్నా మా: అమ్మీఅన్నామా. ఏమితిట్టాం అది ఆడది మొగది?

రామ—ఆడదేనయ్యా.

రహి—ధూ. నీది జూటామాట అదిమగది పేరు. ఆడది అయితే నరసమ్మ చెప్తారుకాదు మీకీ అదిఏవరు? నీకీయేమి కావాలా?

రామ—ఆవిడ మాయమ్మ.

రహి—నీకీ జూటాబాత్ చెప్తాన్నావు మాకీ తప్పుల్ రాయిం చాల్నీ. మీా యమ్మాకీ ముగుడూ వచ్చిన తర్వాత ఆతన్కి దరియాప్తు చేసి సరిగా రాస్కాపోతాం. సలాం

రామ—హిందువులయిళ్ళకు తురకనివేసినందుకు ఆ యధికార్లది బుద్ధి తక్కువ కాని నీదికాదు. నాయనా? తురకలయిండ్లకు వేయక నిన్ను హిందువుల యిండ్లకు వేయడమే ఏట్టి.

రహి—ఆచ్ఛాబాత్ సెప్పావోయి నీకి. మాకీ సస్తావున్నాం మీాశాఫరు పేర్లకీరాసో్క లేక. మాకీ హింధూలకీ కొంపల్ వద్దుమంటే ఆ తహసిల్ దారు మా మాట యిన్క మ్మమల్ని గోతుల్పడేశాడు భాయి (అని వెళ్ళుచున్నాడు.)



## రెండవ రంగము,

(రామశాస్త్రిగారియిల్లు రహిమాన్ ఖాను ప్రవేశించుచున్నాడు.)

రామ—సలాం. సాహేబుగారూ దయచేయండి.

రహి—అజీ పండత్ మీాకీపేరు సెప్పండి. రాసుకుతాం

రామ—నా పేరు రామశాస్త్రిఅంచారు.

రహి—రామశాతి అంచారూ.

రామ—ఏమిటయ్యా నాపేరు సరిగా వ్రాయవయ్యా. "అంచారు" అనేది పేరుకాదు.

రహి—శాకోప్తే మెల్లా సెప్పావువోయి. ఇదేం తమాషా అనుకున్యావ్. మీాకీ పెళ్ళాము పేరు సెప్పు

రామ—నా పెళ్లాముపేరు చెప్పకూడదు.

రహి—నీకీ పెళ్ళాముపేరు సెప్కపోతే మరికోడి పెళ్ళాం పేరు సెపుతావు. ఏమ్ హింధూలోయి మీాకీ.

రామ—మాలో యెవరిపెళ్ళాముపేరు వారు చెప్పకూడదు సాయిబూ

రహి—ఎవరిపెళ్ళాముపేరు వారు సెప్కబోతే ఇంకోర్కి పెళ్ళాము పేరు సెపుతారువోయి? మీా హింధూల్లో బలే తుంటరి యాసంవోయి

రామ—అల్లాంటిమాట లనకండిమీారు

(అప్పుడు రత్నమ్మయను నామె ప్రవేశించు చున్నది.)

రహి—అది యెవరు పండత్.

రామ—ఆవిడ మా యింట్లో కాపురమున్నవారి భార్య.

రహి—నీ పేర్ ఎవరమ్మా

రత్తమ్మ—నా పేరు రత్తమ్మంచారు.

రహి—(నవ్వుచు.) రక్తమ్మా? అరే రక్తంపేరు యెవరూ పెట్కోరువోయి. ఎంతకాఫర్లువోయి మీకీ?

రామ—రక్తంకాదు. రత్నం.

రహి—సాలువోలు. నోరుకీ మూస్కో మీకి పేర్లనూస్తే మాకి డోకువస్తాది. అమ్మానీకీ ముగుడు పేర్ సెప్పు.

రత్న—(ఊరుకొనును)

రహి—అరే ఊరుకుతావేమిటి? మాట చెప్పవు. మాతో మీకి యేలాకోలం యేమ్టి.

రత్న—అవేమ్మాటలండీ. వేళాకోళం యేమిటి మాకుమీకూ మా వారు వింటే బాగుండదు కూడాను.

రహి—కాకోపితేయేమ్టి ముగుడు పేరుల్ సెప్నమంటే సెప్పవు

రత్న—చెప్పగూడదు

రహి—నీ ముగుడుపేరు సెప్కాపోతే యింకోదాని ముగుడు పేరు శెపుతావునీకి

రత్న—అల్లాంటి కూతలు కుయ్యకు బాగుండదు బుద్ధి చెప్పించేను

రామ—ఊరుకోవయ్యా కోపపడకు మాలో పేర్లు చెప్పగూడదల్లాగ

రహి—సెప్కపోతే లెకల్ తగిల్ పెట్టుండి కుల్లాగ్ సెప్కా

ఆట్టే గడబిడ్ సేస్తే మాకీ రిపోర్టు తగిలిస్తాం మీకి మీద తగిల్పిచా మంటే పర్గుల్ పెట్టాలా మీకి గదిలో

రామ—బాబూ ఊరుకో ఆవిడ మొగుడు పేరు సీతయ్యగారు నాప్రుకు వెళ్ళు

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

మూడవ రంగము

సాంబయ్యగారి యిల్లు

(రహిమన్ ఖాను ప్రవేశించుచున్నాడు చావడిలో

నొక ముసలి వితంతువు మరియొక పడుచు పిల్ల

ప్రవేశించు చున్నారు)

రహి—ముసిలిఅమ్మా! నీపేరేట్టి ఆ పిల్లాకి పేరేట్టి

ముస—నాపేరు మంగమ్మ పిల్లపేరు సీతమ్మ

రహి—దాని ముగుడు పేరేట్టి

ముస—(ఏడ్చుచున్నది)

రహి—అరే యేడుస్తావేఇటివోయి ముగుడుపేరు సెప్మంటే.

ముస—(ఏడ్చుచు) నాయనా ఆధీనం తప్పింది నాయనా.

రహి—ఆదీనం తప్పిందీ? ఎవరికీ ఆదీనంలో పుంటే మాకి యేం. ముగుడు పేరు సెప్పు

ముస.—(ఏడ్చుచు) తలచెడ్డపిల్ల నాయనా?

రహి—తలా సెడిందీ? దివానా యెట్టి పిచ్చియెత్తిందీ అయితే యేమ్ మగుడుపేరు చెప్తానియేమ్?

ముస—కాదు నాయనా మొగుడు లేడు వెధవపిల్ల

రహి—ఛీ జూటామాటల్ చెప్తావు నీకి ముగుడు వుంటే లేడని సెప్తావేమి? ముగుడు లేకోపోతే బుర్తా గొరిగించవ్వోయి

ముస—కాదు నాయనా శివరాత్రికి కోటిపల్లి వెళ్ళవలెనని చూస్తున్నాము చిన్నపిల్లలకి కొన్నాళ్ళు తీయించకుండా వుంచుతారు బొట్టులేదు అదే ఆనవాలు వెధవపిల్లలకు

రహి—అరే అల్లా! హమ్కి తెల్‌స్తాదిలేదు బొట్టు లేకోపోతే మెదవాపిల్లా సరే తెల్తాంది

(అప్పుడు రంగమ్మయను 16 యేండ్ల పుణ్యస్త్రీస్నానము చేసి బట్టతో పిడప పెట్టుకొని వచ్చుచున్నది)

రహి—ఈయమ్మాకి పేరేమిటి

ముస—రంగమ్మ నాయనా?

రహి—అరెమిూలో మనుసుల్కి రంగం మోల్మేన్ పేర్లుకూడా పెడతార్ బడాతమాష్వోయి

ముస—మేము రంగం మోల్మేను వెళ్ళేవాళ్ళము కాము నాయనా అల్లా అనకు.

రహి—అరే ముశలమ్మా! పాపం ఈ పిల్లా నీకేమి కావాలా!

ముస—వీళ్లిద్దరు నాకూతుళ్ళునాయనా.

రహి—రంగమ్మాకి ముగుడుకూడా పోయినాడూ యెన్నాల్లయింది? అరే యిద్దరు కూతుల్కి మెద్వల్ నీకి.

ముస—రామరామా. అల్లా అనకండీ సాహేబుగారూ! శుక్రవారంపూటా

రహి—మాకి అబద్దం సెప్పాంబే

ముస—దానిమొగుడున్నాడు నాయనా? అల్లా అనకండి

రహి—గడియకి ఒకమాట సెస్తావు బొట్టు లేకోపోతే మెద్వాపిల్లానాన్నావు దీన్కి బొట్టులేదు ఇది మెద్వాపిల్లకౌనుకాదూ

ముస — నాయనా తలంటుగుంది. ఇంకా బొట్టు పెట్టుకోలేదు. అంతేకాని మరియొకటికాదు.

రహి—అరే ఏం బలేతమాషాలు వోయి మీకొంపల్లో మాకి పోతాం సలాము మీకి అరే హిందూల్ పేర్ల లిఖోమని మాకి తహసిల్ దారు సంపియేశ్నాడు వోయి. మాకి సస్తావున్నాం.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

నాటకము సమాప్తము.

---

# గ్రంథ ప్రకటనము

చూడుడు ! చూడుడు !

చదువుడు ! చదువుడు !

చూడలేనివారు చదువలేనివారు వినుడు. వినలేనివారు తెలిసికొనుడు. తెలిసికొనలేనివారు మీమీ దురదృష్టములకు మిమ్ము నిందించుకొనుడు. మీ రదృష్టవంతులైతే, మీజన్మము సఫలమగు యోగము మీకుంటే, మీ పెద్దలందరు తరించు భాగ్యము మీకు గలిగితే, వెయ్యేల, మీరు ధన్యాత్ములైతే మాపుస్తకములు మీరు చదువుదురు. ఈ పుస్తకము కొననివారి డబ్బువ్యర్థము. చదువనివారి బ్రతుకు వృథా. విననివారి చెవులు దొప్పలుగాని చెవులు కావు. మాగ్రంథములలో మొదటిది.

వెట్టిపప్పీయము.

ఇది 93 ఆశ్వాసముల మహాప్రబంధము. ఇందలి కథానాయకుడగు వెట్టిపప్పుగారికి ఆమనప్రియురాలగు పోలేసుదేవిమీద మోహము

గలిగినపుడు వర్ణింపబడిన శృంగారరసముయొక్క రుచి వారంతటి వారే గాని సామాన్యులు గ్రహింపజాలరు. ఈశృంగారరసము చదివినవారికి తప్పక పిచ్చియెత్తక మానదు. ఇందలి జాలిరసము విన్నవారు యింటి వారిమీదను పొరుగువారిమీదను పడి గోలుగోలున యేడువగలరు. వీరరసముయొక్క వర్ణన జదివినపుడు మనుష్యులావేశముగలవారై శరీరముల మరచి తలలు విరియబోసుకొని కత్తులు కఠారులు-అవి దొరకనపుడు కత్తిపీటలు, గరిగమ్మలు పుచ్చుకొని శత్రువులెవరు కనిపించనపుడు యింటివారిపై బడి మర్దింతురు. హాస్యరసము విన్నపుడు వీధులందుబడి దొర్లి, పొర్లి డొక్కలో నొప్పివచ్చునట్లు, కడుపులో పోట్లు వచ్చునట్లు పొట్ట ఉబ్బునట్లు తిన్నయన్నము వెళ్ళబోసికొనునట్లు, గుండెలు బద్దలగునట్లు, వర్షకాలమున నూతులు బోదురుకప్ప లొకసారి యరచునట్లు వెకవెక, పకపక నవ్వినవ్వి తబ్బిబ్బై తారుమారగుదురు. ఇది ప్రతిగృహమందుండదగిన పుస్తకము. శైలి మిక్కిలి సులభమై, మృదువై, లలితమై, సరసమై, శ్రావ్యమై, గంభీరమై, భీకరమై భయంకరమై, యుండును. ఇందుకొన్ని యాశ్వాసములు గోదావరీజలపాకము. అనగా గోదావరిజలమట్లే కష్టమక్కఱలేకుండ గడగడ గ్రహించవచ్చును. కొన్నియాశ్వాసములు అత్తెసరుపాకము. అనగా అత్తెసరులోని గంజి లోపల యినికి హరించునట్లే, యిందలి భావము పైకిచెదిరిపోకుండ లోపల యిమిడియుండును. అత్తెసరు మెతుకులట్లు అక్కడక్కడ పద్యములుబిరుసుపదునుగ నుండును. మరికొన్ని యాశ్వాసములు స్వయంపాకము. వేఱొక కొన్ని యాశ్వాసములు స్వహస్తపాకము. వెయ్యేల! చదువుకొనువారి పూర్వజన్మపరిపాకము చేయుటకే యీయు గ్రంథము బయలుదేరినది. ఇది ప్రస్తుతము యక్షిణీముద్రాక్షరశాలలో ముద్రణమగుచున్నది. రాక్షస సం||ర ఆషాఢశుద్ధ అమావాస్య కొత్త మంగళవారములోపుగ కొనదలంచినవారికి దీని ఖరీదు. 6 పైసలు.

ఈసొమ్ము మనిఆర్డరుగాపంపించవచ్చును ఆతారీఖుదాటినతరువాత కొన దలచినవారికి ఖరీదు, రు 9-4-0 ప్రస్తుతము కొద్దిగా 3 లక్షల 42 వేల 532 ప్రతులుమాత్రమే వేయించినాము, గనుకనున్ను, దాదాపుగ అన్నిపుస్తకములకు యిదివరకే ఆర్డర్లువచ్చియున్నవిగనుకను, ఆశాభంగముకలుగకుండ కాలమునింపకుండ దరఖాస్తులు త్వరగాపంపుకొనవలెను.

అరడజను ప్రతులొక్కసారికొనువారికి డజనుప్రతు లుచితముగ నీయబడును. వర్తకులకు నూటికి రు. 3-2-0 కమీషనీయబడును.

ఈగ్రంథమురచించిన మహాకవిగారు వెక్కిరింతల వెంగళప్పగారు. ఈయన పపంచమంతట ప్రశిద్ధికెక్కిన మహాకవీశ్వర సార్వభౌమ శిఖామణిచక్రవర్తి దూర్వహులగుటచేతను, ఈయన నిమిషమునకు 732పద్యముల చొ॥న ఆశుధారాకవిత్వము చెప్పగల మహాసమర్థులగుటచేతను, ఈయనకు మహారాజులు, చక్రివర్తులు, లాటుగారు పతకములెగాక అప్పుడప్పుడు వెండిబిళ్ళలు, సబ్బుబిళ్లలు, అర్ధణాబిళ్ళలు, డబ్బుబిళ్ళలు కూడ బహుమానమొసగి యుండుటచేతను, ఈయన నింతవారంతవారని యెంతవారును చెప్పలేకపోయినను, యీయన గ్రంధమునుగూర్చి మహాత్ములిచ్చిన అభిప్రాయములు కొన్ని యీక్రింద పొందుపరచుచున్నాము.

మహామహోపాధ్యాయ కొంకనక్క గురులింగశాస్త్రిగా రిట్లు వ్రాసినారు:—'మీవెఱ్ఱిపప్పీయమును నేను సమగ్రముగా జూచితిని. కాళిదాస, భవభూతి, మాఘు, మయూర, వ్యాస వాల్మీకుల కవిత్వములకంటె యిందలికవిత్వము వేయిరెట్లధికముగ బాగున్నది. ఇందలిపద్యములు గారిముక్కలవలె యెంతో రుచిగనున్నవి. దీనికి అల్లపుపచ్చడివలె చిన్నవ్యాఖ్యానమును కూడ గ్రంధకర్తగారె రచియించియుంచినందున సర్వజనగ్రాహ్యమైయున్నది. ఇట్టిగ్రంధము జన్మమెత్తి చూచి

మెరుగను. ఇకముందు చూడబోను. ఇంకొకజన్మమునకూడ చూడగల నని నమ్మకములేదు. ఇందలి వీరరసపద్యములు రెండు చదువగానె నాకావేశమెత్తి గొడుగుకామతో నాభార్యను మెత్తగా మర్దించితిని. మీగ్రంధమందలి పైరెండుపద్యములను నేను చదువుచుండగా దగ్గర నుండివిన్న మానీళ్ళబ్రాహ్మణుడుకూడ ఆరసముగ్రహించి, కావిడిబద్ద తిరగవేసి నన్ను వెన్నుపూస విరుగునట్లుకొట్టెను. కాబట్టి ఈగ్రంథమం దరు కొనదగినది

యమ్. ఏ. డి బి. యే. డి; యస్. ఏ. డి; పి. ఏ. డి. మొద లగు గొప్ప పరీక్షుల నిచ్చి యుద్యోగము చేయుచున్న నీరసాల నీలా చలంగారిట్లభిప్రాయమిచ్చిరి:—

,వెంగళప్పగారు దయతో పంపిన వెట్టిపప్పీయమును వందనపూ ర్వకముగ నందుకొంటిని. ఈగ్రంధకర్తగారు మనపూర్వులవలె అవకత వక గ్రంధప్రబాధములు, పుక్కిటిపురాణములు వ్రాయక, దేశచరిత్ర గ్రంధములు, వ్రాయునభిలాషతో వెట్టిపప్పగారి చరిత్రమును రసవం తముగ వ్రాసి యీదేశమునకు, పరదేశమునకుగూడ మహోపకారము చేసినారు గనుక, ఈదేశస్థులు, పరదేశస్థులు ఈలోకమువారు, పరలో కమువారుకూడ వారియెడలకృతజ్ఞులైయుండవలెను. ఇందలిజాలిరసపుప ద్యములుచదివి నేను యింటబడి యేడ్చుచుండగా పొరుగువారందరు నాకేదోయాపదవచ్చినదని పరుగెత్తికొనివచ్చిరి. ఇందలి హాస్యరసము న్నకథపట్టు నేనుచదివినప్పుడు నాకు డొక్కలో నొప్పి, గుండెల్లోపోటు బయలుదేర క్రిందబడి దొర్లుచుండగా మహారోగమువచ్చినదని వారం దరు వైద్యుని తీసికొనివచ్చిరి. కాబట్టి యీగ్రంథమందరు కొనవలెను. ఇంకనునిట్టి యభిప్రాయములు లక్షలకొలదియున్నవి గాని గ్రంధవిస్తర

భీతిచే ప్రకటింపబన్నిలేదు. పైగ్రంథము కావలసినవారు యీక్రింది యడ్రస్సుకు వ్రాయవలెను.

మేనేజరు,
చాపూలమ్మ డిపో,
దయ్యాలపేట, ప్రేతపురము.

---

## గొట్టాలమ్మ తాఖీదు

గొట్టాలమ్మఅని, పిశాచిఅని, కలరాఅని, నానావిధములైన బిరుదునామములుగల మేము మాపాదసేవకులై, పరమభక్తులై, అత్యంతప్రియులై, మొదటినుండియు మాయందు విశ్వాసముగలవారై మాకుసేవలు, జాతరులు, ఉత్సవములు మొదలైనవి విరివిగాచేయుచున్న మాపరమాప్తులకందరకు అనగా స్త్రీలకు పురుషులకు, బాలురకు, వృద్ధులకు, పేదలకు భాగ్యవంతులకు అన్నివర్ణములవారికి, అన్నితెగలవారికి, అన్నిశాఖలవారికి యీక్రింది తాఖీదును మేము ప్రియపూర్వకముగా పంపుచున్నాము. గనుక దీనినిమీరు శిరసావహించి, మాయాజ్ఞమన్నించి మాముద్దు చెల్లించి యెప్పటి భక్తిప్రపత్తులను మాయందు చూపవలెనని కోరుచున్నాము. మాయందుమీరట్టి భక్తిప్రపత్తులను చూపకుండురని మాకేవిధమైన సందేహమును యెన్నడును మనోవాక్కాయ కర్మలందులేదు. ఏలయనగా మీరందరు ఆస్తికులు పెద్దలయాచారప్రకారము నడుచువారు, బుద్ధిమంతులుగనుక మామీదమీకు మాతృవాత్సల్యము కలదన్నమాట లోకవిదితమే. అయినను యీమధ్య

యీదేశములో తెల్లవారువచ్చిపూర్వాచారములకు విరుద్ధముగా ఆరో గ్యములనిగీరోగ్యములని కొన్నికొన్ని లేనిపోనిదుర్బోధలు జేయుటచేతను. అర్థములేని అవకతవక క్రొత్తశాస్త్రముల కొన్నిటిని కనిపెట్టి యీదేశములో అనవసరముగా ప్రవేశపెట్టుటచేతను ; ఆపాడు దుర్బోధలు వినియు ఆపాడుశాస్త్రములు చదువుకొనియు మీలో కొందరు తెలివితక్కువవారు మమ్మాసమధ్య అనాదరణము చేయుచున్నట్లు మాకప్పుడప్పుడు కర్ణాకర్ణిగా వినబడుటచేతను, వారిదురాలోచనలువిని, వారిదుస్సహవాసదోషమున కొందరు హిందూదేశపు స్త్రీలుకూడ చెడిపోవుచున్నారని మాకుభయము కలుగుటచేతను, సామాన్యముగ మీరెంత చదువుకొన్నను ఎంతజ్ఞాన తేజస్సు మీలో ప్రవేశించినను మమ్ము మాత్రము విడిచిపెట్టరని గట్టినమ్మకము ఉన్నప్పటికిన్నీ దేశకాలపాత్రములబట్టి 'కః కాలః కోధర్మః' అను పెద్దలవాక్యమును జ్ఞాపకము తెచ్చుకొనియెందుకైన మంచిదేయని మీవిధిధర్మములను మీకొకసారి జ్ఞాపకము చేయుటకై మేమీతాఖీదును ప్రత్యేకముగ నిపుడు లిఖితరూపకముగా మీకుపంపవలసిన యగత్యము కలిగినది. ఈతాఖీదు మాపరమభక్తులైన వారెల్లరుచూచుకొని చదువుకొనవలసినదే కాని, నాస్తికులకు, పాషండులకు, పరమేశ్వరుడు తప్ప యితర దేవతలు, యితరమంత్రములు యితరసాధనములు పనికిరావని తెగనీల్గెడు నిర్భాగ్యులకు, తెల్లవారికి యిదియెప్పుడు చూపించగూడదు. చదివి వినిపించగూడదు. అట్లుగాక మాఅధికార తిరస్కారముచేసి యీతాఖీదు పైజెప్పినవారికి చూపించినవారు నకలిచ్చినవారు చదివివినిపించినవారు ఏవిధముగాగాని తెలియజేసినవారు కబురుపంపించినవారు, మరియింకా ప్రత్యక్షముగా గాని పరోక్షముగాగాని, గూఢముగాగాని బహిరంగముగాగాని యిటువంటి వారితో సహవాసముచేసినవారు మాఆగ్రహమునకు విశేషముగా పాత్రులగుదురు [illegible]యిందువలనమాల

ముగా తెలియపరచగోరుచున్నాము. ఇంగ్లీషు చదువుకొన్నవారిలో ఎక్కడో వెయ్యికిద్దరుతప్ప తక్కిన వారందరు మాకుపరమభక్తులై మాపాద పూజార్థము వారిగిటనుండు వెధవముండలచేతను, పునిస్త్రీలచేతను యెరిగి కొందరు యెరుగక కొందరు ఏదోయొక విధముగ మాకునైవేద్యములను బంపుచున్నారుగనుక వారుమాఆగ్రహపాత్రులు కాజాలరు. మహమ్మదీయులు మతాంతరులైనను, మనహిందువులు వారిపీర్లపండుగలలో వేషమువేసి మ్రొక్కులు మొక్కుకొని పిల్లలను పకీరులు జేసి భక్తిశ్రద్ధలజూపుచుండుటచే వారిలోకొందరుకూడ చాటున నైవేద్యములు పెట్టి మ్రొక్కుచున్నారు గనుక వారినిగూడ మాభక్తకోటిలో చేర్చుకొన్నాముగనుక వారికీసంగతి తెలియ జేసిన చేయవచ్చును. ఇకస్వదేశక్రైస్తవులలోగూడకొందరు బుద్ధిమంతులు యీపాటిమీద బుట్టినవారైయు కొంతకాలమునమ్ము కొలిచి తరువాత వేరుకారణములచేత క్రైస్తవులై పైకి ధనియాల్ (డేనియాల్), యిసిమిత్తు (స్మిత్తు) పెడరెక్కలు (పెరిటరిక్కు) సగ్గు (స్నగ్గు) మొదలగుపేరులు పెట్టుకొనియున్నప్పటికి కలరా మశూచిరోజులలో మాశరణమే జొచ్చుచుండుటచేత వారినిగూడ మాభక్తగణములో జేర్చుకొన్నాము. అందుచేత యీతాఖీదు వారుగూడ చూడదగినవారే. కానియెన్నడు యీతాఖీదు మాత్రము కలలోగాని,పొరబాటునగాని, వేళాకోళముగగాని దొరలకు మాత్రము చూపించకూడదు. ఎందుకనగా వారుమనకులస్థులు కానందున మాయందు భక్తిశ్రద్ధలు లేనివారుకావున అట్టివారు చూడకూడదు. లోకములో తమయెడల భక్తిగలవారిమీదప్రేమ కలిగియుండుట న్యాయముగనుక మాకుజాతరులు ఉత్సవములు చేయుచుండెడు భక్తులయింటనే మేము సాధారణముగా బసచేతుము. మేమేగ్రామమైనా రాదలచుకొన్నప్పుడు ముందు ప్రకటగా మమునుండిభక్తులద్వారామా రాక తెలియజేయుదుము. మేము వచ్చేరోజులలో మాభక్తులెవరు తమ

యిండ్లకు వెల్లలు వేయకూడదు. వీధులలో చక్కగ నేల తడిసి చల్లగా యుండగలందులకు తూములనుండివచ్చు నీరు జీవనదులవలె యథేచ్ఛముగా ప్రవహించుచుండవలెను. ఇండ్లముందు పెంటపోగులు మా జమాబందీ పూర్తిగాఅగువరకు కదపగూడదు. ఒకవేళ పట్టణములలో మ్యూనిసిపల్‌వారు తెలివితక్కువచేత ఆపోగులను కదిపి తీసికొని పోవు పక్షమున వారికి కనపడకుండా యెంతచిన్నదొడ్లున్నా ఆదొడ్ల లోనే దాచుకోవలెను. ఇళ్లకు గచ్చులు, సిమెంట్లు చేయించకూడదు. ఇండ్లు యెప్పుడు పేడపూతలతో నిండియుండవలెను. పశువులపాకలు, మరుగుదొడ్లు, పడకటిండ్లకు, వంటయిండ్లకు సాధ్యమైనంత దగ్గరగా నుండవలెను

మాసంస్థానములో దోమలను, యీగలను, సంగీతపుపాటకులుగ నేర్పరచి, వాటి పోషణనిమిత్తమై పాలకొల్లు, రాజమహేంద్రవరము, కొల్లేరు మొదలైనవాటిని మా నౌకరీచేసినంత కాలము పుత్రపౌత్రపారంపర్యము దానవిక్రయాధికారము లేకుండా మొఖాసాలుగ అనుభవించుటకై పట్టా లిచ్చి వేసినాము గనుక మేమువచ్చేటప్పటికి వారితోకూడ కలిసి మాకెదురుసన్నాహముచేసి మమ్ము తీసికొనివెళ్లి మేమున్న దినములలో వారిచేత సంగీతము పాడించడమేకాకుండా, మేము వెళ్లినతరువాతను, మేము రాకమునుపును వారి సంగీతము వింటూయుండవలసినది. ఇది తండ్రి తద్దినమువలె తప్పనిది. అత్తరు, పన్నీరు, హారతికర్పూరము, పచ్చకర్పూరము, కస్తూరి మొదలగు సుగంధవస్తువులు మేమున్నంతకాలము మాచుట్టుప్రక్కలనైనా తీసుకొనిరాకూడదు. ఎందుచేతననగా వాటినిచూచినతోడనే మాకు వెలపరము పుట్టి తలనొప్పి, డోకు, అసహ్యము బయలుదేరును. మేము మీగ్రామములు ప్రవేశించేటప్పుడు పైనచెప్పిన దుర్గంధవస్తువులమ్మే దుకాణములనుండి వాటి వాసన బయలుదేరి మాకు బాధగలిగించునని భయ

మగుచున్నది. గనుక మాకెదురుగావచ్చే భక్తులు వారికి లభ్యమైనన్ని పేడతట్టలతోవచ్చి ఉభయపార్శ్వము లందు విడువక మాదగ్గఱగానే యుండి ఆపేడవాసన పైవాసనను చంపివేసేలాగున నుండునట్టు యేర్పాటుచేయవలెను. మాభక్తులు తెల్లబట్టలు కట్టుకొనరాదు. ఒకవేళ మేములేనప్పుడు కట్టుకున్నను, మేమున్నరోజులలో ముఖ్యముగా అట్టి బట్టలతో మాకంటబడగూడదు. తోటకూర, గోంగూర, ఎలకజీడికూర, తూటికూర, చామ, బెండకాయ మొదలయినవి తిని వాటితో నేమాకు విందుచేయవలెను. ఈవిధముగా లేనికొంపలు మేమెన్నడు తొక్కి చూడము. మాకుమధ్యాహ్నము ఫలహారములు క్రింద తోమనిపళ్ళెములోపోసి కుళ్ళుగుడ్డ పైనిగప్పి, వీధులదుమ్ముతో నిండునట్లు అమ్మకము నకుతెచ్చే తాలింపుసెనగలు, నాలుగుదినములక్రిందటచేసిన పాత పెసరట్లు, ముక్కిపోయిన అటుకులు, మాగికుళ్ళిపోయిన పండ్లు, చలివాసనవేసే పేలపుండలు, సెనగవుండలు, మితకకంపుగొట్టే పులియూర పటుకులు, యినుపపళ్ళకైనా నములుటకు స్వాధీనముకాని జీళ్ళు ఆరగింపుచేసి మాభక్తులందరు ఆప్రసాదమును కడుపునిండా తినవలెను. కాఫీకొట్టులలోబడి వెక్కసముగా తినేవారిని, పై వస్తువులుతిని బ్రతికే వారిని మాబిడ్డలుగాయెంచుకొని పెంచుకొని దత్తహోమము చేసికొనుచున్నాము. మేమువచ్చేముందర, మాకుబిక్షుచేసేటప్పుడు తెల్లవార్లు మేలుకొనవలెను. మేము దొరలయిండ్లకు వెళ్ళక మీయిళ్ళేనమ్ముకొనియున్నాము. గనుక మీతండ్రితాతలుచేసినట్లు మీరుకూడా మమ్ము గౌరవించి మీగ్రామమునుండి మమ్ముకవెంటనే వెళ్ళగొట్టక, పదికాలములపాటుంచి యేటేటా తిరిగిరప్పించుకొని బిక్షులుసేయుచు భక్తిశ్రద్ధలను చూపించుచుండవలెనని కోరుచున్నాము

ప్రస్తుతము భద్రాద్రిమకాం. ఇట్లు ఆజ్ఞాపించు మీనెత్తిమీదదేవత,
చైత్రశుద్ధ శ్రీరామనవమి. గొట్టాలమ్మ,

# బ్రహ్మదేవునికి పూజ్యత యెందుకు లేకపోయెను ?

[ఒకనిద్దురపోతు, ఒకతిండిపోతు, ఒకతాగుబోతు, ఒకతిరుగుబోతు, ప్రవేశించుచున్నారు.]

తిరు—ఒరే! విష్ణుమూర్తికి సాంబమూర్తికి లోకములో ఇన్ని వేల ఆలయములుండి యెంతో వైభవముతో పూజలు కైంకర్యములు సేవలు జరుగుచుండగా పాపము బ్రహ్మదేవునికి ఒక్కచోటనైనా ఆలయము లేకపోవుటకు గారణమేమి ? మీరందరు బుద్ధిలో బృహస్పతులుగదా? కాబట్టి యీవిషయమై చక్కగా ఆలోచించి చెప్పండి. ఇది చాలా ముఖ్యమైన విషయము. వీటివిషయమై ఆలోచించి పరియవసానము దెల్పుటకు మనకంటె సమర్థులైనవారు లోకములో నెవ్వరును లేరు. అనేక పండితులు చిరకాలమునుండి యీసందేహముచేత బాధపడుచు సందేహనివృత్తి చేసికొనలేక చాలాతంటాలు పడుచున్నారు. ఈకీర్తి మనకే దక్కవలెను. పరోపకారార్థ మిదంశరీరమన్నాడుగనుక మనము మిక్కిలి పాటుపడి యీవిషయము తేల్చి లోకమునకుపకారము చేయవలెను. మనయభిప్రాయము ఒక పుస్తకముగా అచ్చువేయించి ఉచితముగా పంచిపెడదాము.

నిద్ర—ఒరే నీవువేసిన ప్రశ్న చాలా బాగున్నది. నాకుగూడ చిరకాలమునుండి యీసందేహమే యున్నది మనము యీలోకములో మూడునాళ్లు బ్రతికే బ్రతుకుగదా ? అంతకన్న నెక్కువలేదు. ఏదో యిటువంటి శాశ్వతమైన యుపకారము లోకములో చేసిపోతిమా మన పేరుండిపోతుంది. కాబట్టి యీవిషయమై మనఅందరి అభిప్రాయములు సరుసగా చెప్పుదాము.

తిరు—సరే ముందుగా నీయభిప్రాయముచెప్పు. బ్రహ్మదేవుని కెందుకు పూజ్యత లేకపోయినది?

నిద్ర—నామీదనే పెద్దరికముపెట్టి ముందు నన్నే అడిగి నారు గనుక చెప్పుచున్నాను వినండి. బ్రహ్మదేవుడు ముసలివాడగుట చేత మతిలేక తెలివితక్కువ పనులు చాలా చేసినాడు. అందులో ముఖ్యమైన తెలివితక్కువ నేను చెపుతానువినండి. రాత్రిభాగము నిద్ర పోవలసినదని యేర్పాటుచేయుట మొట్టమొదటి తెలివితక్కువ. ఇతడు చేయవలసిన దేమనగా రోజుకు ఎనిమిది జాములుకాకుండా 20 జాములు చేయవలసినది. అందులో 18 జాములు కేవలము హాయిగా నిద్రపోవుట కేర్పరచిన మిక్కిలి బాగుండును. అన్నము తినుటకు నిద్ర మేలుకొని రానక్కరలేకుండా యేదైనా యొక్క యేర్పాటు చేయ వలసినది. అనగా అన్నము తినుటకై వేరేప్రయత్నము చేయనక్కర లేకుండా మంచముమీద పడుకున్నపాళమున నోటిలో ముద్దలువచ్చి పడునట్లు—అవి మనుష్యుడు నిద్దరలోనే నమలనక్కర లేకుండా జీర్ణము చేసుకొనేటట్టు యేర్పాటులుండవలెను. ఉదయం మేలుకొనవలయు ననే నియమమవుండగూడదు. నిద్రయేలాయుండవలెననగా సాధారణ మైన చప్పుళ్ళకు కేకలకు పిలుపులకు మెలకువ రాకూడదు ఇదిగాక ఇంతకన్న నెక్కువ సదుపాయమొకటికూడా చెప్పుతాను. మనుష్యు డు నడుస్తూ నిద్రపోయేటట్టు బ్రహ్మదేవు డేర్పాటు చేయవలెను. ఈవిధమైన యేర్పాటు చేయకపోవుటచేత బ్రహ్మదేవునకి పూజ్యతలేక పోయినదని నాయభిప్రాయము.

తిండి—నీయభిప్రాయము నాకంతగా నచ్చలేదు. ఎల్లకాలము నిద్రయే పోయినపక్షమున బ్రహ్మదేవుడు సృష్టించిన పదార్థముల తిను టకేవ్యవధి యుండదు. అవి మనము తినకపోతే వాటిపని యేమికాను? అందు చేత నీవు చెప్పినయభిప్రాయము బాగుగాలేదు. నేను చెప్పబోయే సబ

బులు వింటివా నీవేగాక మీరందరు నాతో నేకీభవింపక మానరు. బ్రహ్మదేవుడు తినుటకై సృష్టించిన పదార్థము లనేకములుగ నున్నవి. మనుష్యునకు పెట్టినపొట్ట మిక్కిలి చిన్నదిగానున్నది. ఎక్కువతిందా మన్నను పొట్టపట్టదు. ఇదియే బ్రహ్మదేవునియొక్క ముఖ్యమైన తెలివి తక్కువ. మనుష్యునిపొట్ట యేలాగుననుండవలెననగా ఒక పెద్ద సొరంగ మువలె నుండవలెను. వేళపాళ లేక రాతిరనక పగలనక మితిమేర లేక యెన్నెన్నివస్తువులు తిన్నప్పటికి యెక్కసముగా నుండగూడదు ఆయా సము కలుగగూడదు. డోకు రాకూడదు. అజీర్ణమన్నమాట చేయ కూడదు. ఏవస్తువైనా లోపలపడగానే వెంటనే జీర్ణమైపోవలెను. అది కాక బ్రహ్మదేవు డిప్పుడు జీర్ణకోశము కడుపులోనే పెట్టినాడు. అది ఆలాగున ఒక్కచోటనె యుండగూడదు. రాసులకొలది తిన్నప్పటికి అరిగిపోవునట్లు శరీరమంతటా జీర్ణకోశ ముండవలెను. అనగా కాళ్ళ లోను, చేతులలోను, వీపులోను, తలలోనుగూడ జీర్ణకోశములేయుండ వలెను. ఇదిగాక వస్తువులయొక్క రుచిని తెలిసికొనుటకై యొకనాలు కనే యేర్పరచినాడు. అనంతకోటివస్తువులరుచి ఒక్కనాలుకతో తెలిసి కొనుట కష్టముగా నున్నదిగనుక రుచులు తెలిసికొనుటకై యింకా అనేక అవయవములకు శక్తులియ్యవలెను. పెద్దపెద్దపుడ్లు అన్నపుముద్ద లు అమాంతముగా ఒక్కసారి మింగుటకై యిప్పుడున్ననోరుకంటె పదిరెట్లు పెద్దనో రియ్యవలెను.

త్రాగు—మీయిద్దరి సబబులుకూడా నాకంతగా నచ్చలేదు. బ్రహ్మదేవుడు కల్లు సముద్రములు, సారాయి సముద్రములు, చేపల గుట్టలు, మాంసపుపర్వతములు నిర్మింపక ఉప్పునీళ్ళసముద్రములు, మంచినీళ్ళనదులు, యెందుకుపనికిరాని రాతికొండలు, సృష్టించుటవల్ల అతనికి పూజలేకపోయినదని నేను ప్రమాణముగా చెప్పగలను. ఉప్పు నీళ్ళసముద్రములు నిష్ప్రయోజనముగ ప్రపంచమున కేమియుపయోగమని

బ్రహ్మదేవుడు సృష్టించినాడు చెప్పండి? కల్లుసముద్రము లున్నపక్షమున బీదలు సాదలు డబ్బుపెట్టి కొనవనక్కరలేకుండా యిష్టమువచ్చినప్పుడు యిష్టమువచ్చిన ముంతలతో ముంచుకొని తాగి, అందులోనే స్నానముచేసి దానిమీదగాలే పీల్చి హాయిగా నుందుముగదా! అట్లుచేయకపోవుటచేతను సారాకు దుర్వాసనపెట్టుటచేతను పానకమువలె దానికి రుచిపెట్టకపోవుటచేతను బ్రహ్మదేవునిమీద లోకులందరికి అసహ్యము పుట్టినది.

తిరుగు—మీయుక్తులు సరియైనయుక్తులుకావు. బ్రహ్మదేవుడు వ్యర్థమయిన వృక్షము లనేకములు లోకములో సృష్టించినాడు. ఈలాటిచెట్లు కోటానకోట్లు సృష్టించి లోకము పాడుచేయుటకంటె వక్క రూపాయలచెట్టు, ఒక డబ్బులపాదు సృష్టించినపక్షమున ప్రపంచములో మనుష్యులు తమయిచ్చవచ్చునట్లు వ్యభిచారాదిదోషముల పాటించక సుఖలోలులై తిరుగవచ్చునుగదా! అట్లుచేయకపోవుటచేత బ్రహ్మదేవుడు వట్టి అవకతవక నిర్భాగ్యుడైనాడు. అందుచేత పూజ లేకపోయినది.

తిండి—ఒరే! మనలో మన మేకీభవించలేదు. మనయభిప్రాయము లచ్చువేసి లోకులందరికి పంపుదాము. ఎక్కువమంది యెవరిదంగీకరిస్తే వారిది సరియైనట్లు.

అందరు—సరే.

(అని నిష్క్రమించుచున్నారు.)



# దంపతుల ముచ్చటలు

(కనకమ్మయు రామచంద్రరావుగారు ప్రవేశించుచున్నారు.)

రామ—ఎన్నిపిలిచినా పలుకవేమిటి. ఏమిచేయుచున్నావు. ఎక్కడనున్నావు ?

కన—(మెల్లగ) ఇక్కడనేయున్నాను. ఎందుకు ?

రామ—గొంతుకంత సన్నగించినదేమి ? అంతమెల్లగా పలికితే ఎవరికి వినబడుతుంది? ఏమైనా కొంచెము కోపము చిత్తగించావాయేమిటి? మాట సన్నంగా వస్తూంది.

కన—నాకేమికోపము. నామాట ఒకప్పుడింతకన్న గట్టిగా నుండా యేమిటి.

రామ—ఆమాటలోనే యున్నది. కోపమువచ్చినట్లు మొగము కూడ మటమటలాడుచున్నది కాని యెప్పట్లా లేదు.

కన—మటమటలాడక ఒకప్పుడుమాత్రం మీకంటికి కలకలలాడుచు కనబడినదా యేమిటి ?

రామ—అదంతా నాకు తెలియదుగాని వ్యవహారము మామూలుగా లేదు. మామూలుగానున్నట్టయితే యెవరితోను మాట్లాడకుండగా యీచీకటియింట్లో యెందుకు పడుకుంటావు. చాకలివాడు దీపము వెలిగించలేదా యేమిట ?

కన—మీనెవొకర్లు నేచెప్పినట్లు వింటారా యేమిటి?

రామ—వినకపోతే నాతో చెప్పరాదూ.

కన—మీరుమాత్రము నేచెప్పినట్లు వింటారా యేమిటి?

రామ—కూసంవిడిచిన తాచుపాములాగ మాటిమాటికి, ఆవిధంగా కన్నుబున్నుమంటావేమిటి. నీమనసులో నున్నసంగతేమిటో చెప్పరాదు. ఆబాధ యేమిటో తీర్చివేస్తాను.

కన—నాకు బాధ లేమున్నాయి. నేను బతికుండడమే మీాకందటికి బాధగాని నాకేమీా బాధలులేవు.

రామ—మనసులోనున్న దేమిటో చెపుమంటే చెప్పక సణుగుతావేమిటి! వెధవసణుగు. నీకర్మం అలాగైతే నేనేమిచెయ్యను.

కన—నాకర్మమన్నమాటనాకూ తెలుసును. కాకపోతేవెఱ్ఱివాడి పెళ్లాము వాడకల్లా వదినన్నట్లు నాటకపువాళ్లదగ్గిరనుంచి నన్నింత లోకువెందుకుచేస్తారు. కర్మంబాగుంటే అందరు డిప్టీకలక్టరు పెళ్లాలులాగూ నేనూ ఉందును. నేను అయినూవందలరూపాయలు జీతంపుచ్చుకొనే డిపిటీకలకటరు పెళ్ళాన్నన్నమాటేగాని నామాట యెంతమాత్రము వూళ్ళోవాళ్ళు వినడమేలేదు. మీాయింట్లో పట్టెడన్నము మీా దాసీది తింటున్నది, నేను తింటూన్నాను.

రామ—ఈసోదంతా యెందుకొచ్చిని నాటకుల కేమిటి, లోకువవడమేమిటి? టికెట్లకోసము నీవు ఏమైనా వర్తమాన మంపినావా యేమిటి?

కన—అవును. బుద్ధిపొరబాటువచ్చి మనవంటబ్రాహ్మణుని, హరేరామసింగుని టిక్కట్లకోసము పంపించినాను.

రామ—వాళ్ళువెళ్ళి యేమనిఅడిగినారేమిటి. నీపేరుపెట్టడిగారా, నాపేరు పెట్టడిగారా?

కన—నాపేరుపెట్టి అడుగమంటానా? మీాపేరుపెట్టే అడిగారు. డిపిటీకలక్టరుగారు వారింట్లో ఆడవాళ్ళు పిల్లలు నాటకానికి వస్తారని చెప్పుమన్నారని మనవాళ్ళక్కడ చెప్పినారట. చెప్పగానే గడగళ్ళాడుతూ దయచేయవలసినదని చెప్పక, నాటకానికి వారువస్తే

మా అభ్యంతర మేముందని ఆమేనేజరన్నాడట. కాందండి టికెట్లు కావాలని మనవాళ్ళడిగినారట. వాడిపోగరు పొడిచెయ్యా! ఆమేనేజరప్పుడు, టిక్కెట్లు కావలిస్తె కొనుక్కుంటే వస్తాయి, అన్నాడట. నాటకా లాడుకునే వెధవల కంతపొగరా? వెనక నూరు నూరురూపాయల మేస్త్రీటుపని తహసిలుదారుపని చేసెటప్పుడే రామపురంలోను గంగపురంలోను అక్కడికి నాటకాలాడడానికి వచ్చేవాళ్ళందరు మనకు కావలసినన్నిటికెట్లు పంపించేవారు. అప్పుడు నాటకాలకు మనయింట్లో వెళ్ళినంతమంది వెళ్ళగా మన వీధులోనున్న ఆడవాళ్ళనందరిని తీసుకుపోయేదానిని. ఇప్పుడు వాళ్ళు మన కేటికట్లు లేకుండా చేసినారు? వీళ్ళకింత గీర్వాణమా? ఇంతకూ కూర్చున్న గుడ్డి ముండ లేవకుండా మీా యధికార మిల్లాగున్నది.

రామ — ఇవ్వనన్నారుగా? అయినా అప్పటిరోజులు వేరు. ఇప్పటిరోజులు వేరు. పయిగా ఆవిపల్లెటూళ్ళు ఇదిబస్తీ.

కన — పల్లెటూరేమిటీ బస్తీయేమి. ఇంతకూ ఆసకదు లేదు. మా మేనమామ రివిన్యూయిన్స్పెక్టరు చేస్తూ తాబూకా అంతా గడగడలాడించాడు. పగడుంటే వాళ్ళకల్లా అనేందు కెన్నివేలగుండెలున్నాయి. మనచిన్నబ్బాయి వడుగుకు నూరుకావిళ్ళ పెరుగు రావలసినది. అయిదుకావిళ్ళా రావడం? డిప్టీకలక్టరీచేస్తూ కూరలుమనంకొనుక్కోవాలా! ఏమి యుద్యోగమయ్యాయిది? జీతమురాళ్ళగొప్పేనా అన్నపూర్ణయ్యగారు డిప్టీకలక్టరీలో లక్షరూపాయలు సంపాదించాడు మీారుజీతంగాక పాతికవేలు సంపాదించేటప్పటికి బ్రహ్మాండం బద్దలయింది. అందులో పదివేలు కంపెనీ దివాలాలో గంగపాలైనాయిగదా. ఇంతకు నాటకపు వాళ్ళకు బుద్ధిచెప్తారా లేదా?

రామ — చెప్పనూ? డొక్కచీరించేస్తాను. వాళ్ళకు యిన్కంటాక్సుకట్టించి మచ్చమాపుతాను. (ఇద్దరు నిష్క్రమింతురు.)

# అపూర్వ యాచకుడు

(అప్పుడు దామోదరయ్య అను బ్రాహ్మణుడు
ప్రవేశించుచున్నాడు.)

దా—(తనలో) ఈగ్రామములో నే నేరూపకముగా యాచన చేయవలెనో తెలియకున్నది. ఏలూరులో యజ్ఞము చేస్తానని యాచించితినిగదా! నరసాపురములో కుమారుని యుపనయనమని, కాకినాడలో కూతురును కన్యాప్రదానము చేస్తానని, అమలాపురంలో చెంబు గుడ్డలు దొంగలెత్తుకు పోయినారని, చేసిన యాచనలు, అంత సఫలం కాలేదు. కొందరు వెఱ్ఱిముండావాళ్ళు నామాటలు నమ్మి కొంతసొమ్మిచ్చినప్పటికి మిత్తము మీద ద్వ్యాయము తిన్నగా పారినదికాదు. ఇప్పుడు రాజమహేంద్రవరములో ఏపన్నాగముమీద యాచించుట బాగుండును చెప్పుమా? అన్నసత్రం వేసినానని బొంకుదునా? ఇది యంతగా పొసఁగదు. దేవాలయం కట్టిస్తానని బొంకుదునా? మావూళ్ళో దేవాలయం యిదివరకే యున్నది. అందుచేత డబ్బురాదు. కాబట్టి మావూళ్ళో దేవాలయము ముందర గోపురము కట్టిస్తానని నేను బయలుదేరుతాను. (బ్రాహ్మణాళ్ళదగ్గరకు వెళ్ళితినా ఒక్కడబ్బైనా పుట్టదు. నాలుగు డబ్బులసొమ్ము దొరికితే తక్కిన వర్ణాలవాళ్ళ దగ్గరే నొరకాలి. ముఖ్యముగా ఆడవాళ్ళదగ్గర, అందులో వెధవముండల దగ్గర నామొత్తు పారినట్టు మరెక్కడా పారదు. వెయ్యేళ్ళకు వెధవముండలు దేశంనిండా చల్లగా నుండవలెను. గుళ్ళన్నా గోపురాలన్నా పిచ్చనమ్మకం వాళ్లకుంటుంది గనుక యింతడబ్బు పారేస్తారు. ఆడబ్బుపెట్టి నేను పెంకుటికొంప కట్టుకొని, హాయిగా కాపుర ముంటాను. నాయిల్లే గోపురము. నేనే దేవుడను. ఇదిగో నా

కెదురుగుండా పెద్దయిల్లు కనబడుచున్నది. ఆయింట్లో యెవరో భాగ్యవంతులే యుండి తీరవలయును. ఇదిగో లోపలకు వెళ్లి గోపురమువంక బెట్టి అడుగుతాను. (అని వెళ్ళుచున్నాడు)

(అంతట లింగరాజుగారు ప్రవేశించుచున్నారు).

లింగ—(తనలో) నాకర్మమేమో కాని నాసొమ్మంతా తక్కువవడ్డీకె తిరుగుచున్నది. నూటికి రూపాయ తొమ్మిదణాలకంటె, ఎక్కువ యిచ్చేవా డెవడు దొరకలేదు. వాళ్ల అదృష్టమేమోకాని, ఆరాయన్నగారికి, నందయ్యగారికి తనఖామీద నూటికి మూడురూపాయలచొప్పున వడ్డీకి పట్టుకువెళ్ళేవారు దొరుకుతారు. ఇంతకు నాఅదృష్టము తిన్ననయినది కాదు. ఎవడి దగ్గరైనా ఖరాఖండీగా వసూలు చేదామంటే పెద్దమనుష్యులమని పేరుపెట్టుకుని తుంటరిముండావాళ్ళు కొందరు నాదగ్గరకు వచ్చి "పాపము వాడు పేదవాడు. ఏభైరూపాయలు మాని వెయ్యి. నూరురూపాయలు మానివెయ్యి" అని లేనిపోని సిఫారసులు చేస్తుంటారు. నావద్దకు వచ్చి చెప్పకపోతే వీళ్లపుట్టేమి మునిగిపోయినది? ఆపైన ఈధర్మకార్యములకు చందా వెయ్యమని పెద్దమనుష్యులు చందాజాపితా పంపుతారు. పైగావచ్చి పీక్కుతినే యాచకులు వందల కొలదిగదా! అయినా నే నెప్పుడూ వీళ్ళకు దమ్మిడీ యిచ్చేవాడను కాను. అయినప్పటికి మంచిమాటలతో వీళ్ళను సాగనంపాలి కాని కసిరి కొట్టినట్టయితే వీళ్ళంతా అర్జీలిచ్చి యిన్కంటాక్సు కట్టిస్తారు.

(అప్పుడు దామోదరయ్య ప్రవేశించుచున్నాడు).

దా—"నమోనమో భవతి భవతి జయ మానోహ్నే"

లింగ—(కోపముతో) ఎవరువారు? ఏమిటి చెవికోసిన మేకలాగు అరుస్తావు. ఆ సోదేమిటి. ఏయూరు నీది. ఎందుకు వచ్చావు?

దా.—చిత్తము. మాది కృష్ణాతీరం. నేను ఘనాపాఠిని.

లింగ—ఘనాపాఠీ ఫినాపాఠీ నాకు తెలియదు. మీరెందుకు వచ్చారో చెప్పండి?

దా—తమరు ఆగ్రహించక సావధానముగా చిత్తగించండి. మాగ్రామములో దేవాలయములో నేనొక గోపురము కట్టించుచున్నాను, దానికి అయిదారువేలు రూపాయలు కావలెను. అందుకోసం నేను యాచనకు బయలుదేరినాను. ఇది నాకుటుంబ రక్షణకోసంగాదు. దేవుని కార్యం. ఈయూరు తహసిల్దారుగారు, ప్లీడర్లు తమకు దోచిన సాయముచేసినారు. నాభోజనము నిన్నాటి యీవేళకూడా తహసిల్దారుగారి యింట్లోనే.

లింగ—(తనలో) వీరు తహసిల్దారు గారింట్లో భోజనంగదా, నామీద యేమైనా తహసిల్దారుగారితో చెప్పినట్లయితే ఆయనకు కోపము వస్తుందేమో. కనుక వీనిమీద కోపము చెయ్యకూడదు. (ప్రకాశముగా) అయ్యా! తమరు మహానుభావులు. తమవంటివారు కొందరుండబట్టి భూమిమీద వానలు పంటలు గలిగియున్నాయి. తమరు చేసేపని చాలామంచిది. తమ సెలవుప్రకారం నేనుకూడా నడచుకుంటాను.

దా—(తనలో) ద్రావిడయంపారినది. ఈయన యేదైనా దిట్టముగానే యిస్తాడు. (పైకి) తమవంటి ధర్మాత్ములుండబట్టే లోకమర్యాద జరుగుచున్నది. దేవబ్రాహ్మణపక్షపాతం గల గృహస్థులు తమవంటివారు పదికాలాలపాటుంటేనే మా మహానుభావత్వాలు కనబడతాయి. దీని కేదైనా విరివిగా యిప్పించాలి.

లింగ—(తనలో) వీడిని నోరెత్తకుండా పంపించే యుపాయమేమిటి చెపుమా?

దా మో—(తనలో) యేదో ఆలోచిస్తూన్నాడు. ఎంత సొమ్మియ్యనా అని ఆలోచిస్తూన్నాడు.

లింగ—అయ్యా! తమరు తలపెట్టిన కార్యము గొప్పది. దీనికి యేభై, నూరు యిస్తే సరిపోదు. బాగా యెక్కువగా యివ్వవలెనని నాకున్నది.

దామో—(తనలో) వహావా, వహావా, చేప వలలో పడినది.

లింగ—కాబట్టి తమరు ఎన్నిఅంతస్తుల గోపురం కట్టిస్తారో చెప్పండి?

దా—ఆరంతస్తులండి.

లింగ—సరే! బాగుంది. నేనొక అంతస్తే కట్టించి వేస్తాను.

దా—అయితే మొదటి అంతస్తుకే తమరు సొమ్మియిప్పించండి. వెయ్యిరూపాయలవుతాయి.

లింగ—ఆలాకాదు. అయిదంతస్తులు కట్టించి మీగు నాపద్దకు రండి. ఆపిమ్మట ఆరవ యంతస్తు నేను దగ్గరనుండి కట్టిస్తాను.

దా—(తనలో) ఈలోభిముండాకొడుకు నాకొంప తీసినాడు. అయిదంతస్తులు నేను కట్టించడంలేదు. ఆరోఅంతస్తు వాడు కట్టించడం లేదు. ఈగడుసుముండాకొడుకు నన్ను నోరెత్తకుండా చేసినాడు. గడుసుతనమనగా ఏడిదిరాబాబు. ఏడిదానం మండా. వద్దనడానికి వీలులేదు. పుచ్చుకొనడానికి వీలు లేదు. (పైకి) చిత్తము. తమరుచేసిన దానం చాలా బాగా యున్నది. మధ్యాహ్నము మీదర్శనము చేస్తాను.

లింగ—(తనలో) వీడి రోగము దప్పగా కుదిర్చినాను.



# అపూర్వ స్వయంవరము

రంగము 1

(రామదాసుగారు భావరాజుగారు ప్రవేశించు చున్నారు.)

భావ—రామదాసుగారూ! మీ యభిప్రాయమేమిటో స్పష్టముగా చెప్పండి.

రామ—భావరాజుగారూ! చల్లకువచ్చి ముంతదాచడ మెందుకు చెప్పాచ్చున్నాను వినండి. మన నాగరాజుగారి కీమధ్య భార్యానియోగమైనది. ఆయన పెద్ద యుద్యోగములో ఉన్నారు. ఆయనకు ప్రథమ కళత్రము తాలూకు కొడుకు కొమార్తె యెవరులేరు. వెనక దిక్కు కూడా ఆయనకాస్తే యున్నట్లు కనబడను. మా పిల్ల పదమూడేండ్ల వయసు గలది గనుక నాగరాజుగారికిచ్చి వివాహము చేయించండి. మీ మాటంటే ఆయనకెంతో గురి. మా పిల్ల యెత్తరికూడాను. త్వరగా కాపరాని కొస్తుందని ఆయన తప్పకుండా వప్పుకుంటారు.

భావ—ఆయన అసలే పెండ్లి చేసుకొననంటున్నాడే ఇదెల్లాగ?

రామ—తమరు గట్టిగా చెపుతే ఆయనవింటాడు. మనమంతా పోగై యెల్లాగో ఒకలాగ మెడలు విరిచి ఆయనచేత వప్పించాలి.

భావ—ఇంటివాడు గొడ్డుగేదె అంటే పొరుగువాడు పాడిగేదె అన్నట్లు, ఆయననాకు పెండ్లివద్దు మొర్రో అంటూంటే చేసికొనక తప్పదని మన మెల్లాగ చెప్పమండి? ఆయనకు లేని బాధ మధ్య మన కెందుకండి! అదిగాక మీరు పదమూడేండ్లుపెంచి పిల్లను శుభ్రమైన కుఱ్ఱవాస కెవ్వరికైనా యివ్వక, ఏబదియేండ్లు దాటి అరవయ్యోపడిలోనున్న వానికిస్తా మంటా రేమిటి. పిల్ల సౌఖ్యము చూడవద్దా!

రామ—పిల్ల సౌఖ్యపడకేమండీ. డిస్ట్రిక్టు మునసబు పని చేస్తూన్నారు గదా. కావలసినంతమంది నౌకర్లు చాకర్లు వంట బ్రాహ్మణులు. ఒంటినిండా నగలు యింటినిండా వస్తువులు. పైగా ఆయనకు 45 ఏండ్లకంటె ఎక్కువలేవు.

భావ—ఇప్పుడు మీ యల్లుడు కాబోతాడు కనక వయస్సు తగ్గిందేమోకాని, ఆయనకు వయస్సు 55 సం॥రములు. ముందు మార్చి నెలలో పించనుకు దాఖలు చేయబోవు చున్నారు. ఇంటినిండ వస్తువులు ఒంటినిండా నగలేకాని మనసునిండా సంతోషము మాత్ర ముండదు. ఇంతకు మీరు నాకు ముఖ్య స్నేహితులుగనుక నేను ఆయనతో చెబుతాను. ఈ సంబంధ మైతే మీరేలాగైనా అదృష్టవంతులే. నాగరాజుగారు పది కాలాలపాటు బ్రతికితే పిల్ల అదృష్టవంతురాలు. లేక త్వరగా కడతేరితే మీ రదృష్ట వంతులు. పదండి పెండ్లి మాటలకు వెడదాము.

రామ—చిత్తము మీ రెఱుగని దేమున్నది కనుక మీదయ పదండి.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

రంగము 2 నాగరాజుగారియిల్లు

(నాగరాజుగారు కుర్చీమీద కూర్చుందురు.)

నాగ—ఓరీ చాకలీ? ఈపూట మందు తెచ్చినావా లేనా? వైద్యుడుగా రేమన్నారు?

చాక—మామూలు లన్నం తినోద్దన్నారండి. గోదుమన్నం తిన మన్నారండి. పనద్దార బెల్లం ఒద్దే పుచ్చుకోద్దన్నారండి.

నాగ — ఈయన యెప్పుడూ అతిమూత్రపు వాళ్ళకు గోధుమ అన్నమే పెట్టిస్తాడు, పాలు పంచదార వల్లకాదంటాడు. ఈ పత్యము చేత మలమల మాడి చావాలి. ఇక పించను పుచ్చుకొన్నటనే మంచిది

(అప్పుడు రామదాసుగారు భావరాజుగారు ప్రవేశించుచున్నారు.)

నాగ—ఒహోహ్హొహో! భావరాజుగారా దయచెయ్యండి. వారెవరు?

భావ—వీరు రామదాసుగారని మనవాళ్ళే. వీరి యన్నగారిని బహుశా మీరెఱిగియుందురు. వెనుక మీ కోర్టులో అమీనుగా యుండేవారు రంగదాసుగారని. ఆయన తమ్ముడే యీయన.

రామ—రంగదాసుగారు సాక్షాత్తు మా అన్నగారేనండి.

నాగ—అల్లాగా! పాపము ఆయన చాలా మంచివాడే. పాపము అయన పోయినాడు గాదూ? ఆయన కూతురునే కాబోలు మూర్తిరాజుగారికి మూడవ కళత్రముగా ఇచ్చినారు. పాపము ఆయన పెండ్లిఅయిన మూడు నెలలకే పోయినాడు.

రామ—చిత్తము చిత్తము. ఏదో దాని దురదృష్టమల్లాగనున్న దండి

భావ—మీ వంట్లో కొంచెం నెమ్మదిగా నున్నదాండి?

నాగ—ఏమి నెమ్మదండి! ఈ యతి మూత్ర మొకప్పుడు నెమ్మళముగా నుంటుంది. ఎల్లాగో దినములు గడుస్తున్నాయికదా? ఇక పించను పుచ్చుకుంటాను. పనిచెయ్యడాని కోపిక లేదు.

భావ—కళత్రవియోగమైనప్పటినుండి మీకు బాధ మరింత యెక్కువగానున్నట్టు కనిపిస్తూన్నది

నాగ—అవును మఱి ఏమి చెయ్యను? ఈశ్వరేచ్ఛ ఆలాగున్నది.

భావ—మీతో ఆ విషయమై నేను మాటలాడడానకే వచ్చి నాను. మన రామదాసుగారిదగ్గర పదమూడేళ్ళ పిల్లయున్నది ఆయన ఆ పిల్లను తమకియ్యవలెనని ఆలోచిస్తున్నారు. దీనికి మీ రంగీకరించ వలెనని నా కోరిక.

నాగ—(చిఱునవ్వుతో) బాగా సెలవిచ్చారు భావరాజుగారు. ఇప్పుడు నాకు పెండ్లేమిటండీ! అతి వృద్ధాప్యము బలమైనది

సూలశంక ముప్పదియేండ్లనుంచి యున్నది. కొంచెము దగ్గుకూడా యిప్పుడు బయలు దేరుచున్నది. పిల్లను నాకిచ్చేకంటె గంగలో దింపితే మంచిది

భావ - అవ్వేమిమాటలు? ఆలా సెలవియ్యకండి. జబ్బుగా నున్నారు గనుకనే తమకుముఖ్యంగా వివాహము చేసికోవాలి. ఏమంటే మీకు భోజన సదుపాయము వగయిరాలు గృహస్థాశ్రమంలో ప్రవేసిస్తేనేకాని జరుగవు.

నాగ—వంటబ్రాహ్మణుని పెట్టుకుంటే కావలసినన్ని సదుపాయములు జరుగుతాయి. ఇంతకు రామనానుగారూ! మీరు నాకేయుద్దేశముచేత పిల్ల నిస్తున్నారో చెప్పండి. నేను పడుచు వాడనా స్ఫురద్రూపినా యేమిటి మీ యాలోచన?

రామ—చిత్తము నాకు మరేయుద్దేశములేదండి. తమరు బంధు సముద్రులు. తమకు వెనుక మా అన్నగారికి మీ కోర్టులో అమీనా పని యిచ్చి మా కుటుంబ పోషణ చేసినారు. ఆ విశ్వాసంచేత నేను మీ వంశము నిలపదలచి మీకు పిల్ల నిస్తున్నాను.

నాగ—నా వంశం పోతే నాకే విచారము లేనప్పుడు మధ్య మీకెందుకు? రాములవారి వంశము ధర్మరాజుగారి వంశము లేనప్పుడు నా వంశము లేకపోతే భూమికి లోటా? ఇది కేవలము దొంగవేషము కాని నిజము కాదు.

రామ—దొంగవేషము కాదండి. నిజమే. వంశము నిలిపితే పుణ్యమని యిల్లాచేస్తున్నాను.

నాగ—పుణ్యమైతే పెండ్లివద్దు మొర్రోఅనే నా వంశం నిలపకపోతే పెండ్లి కావాలని యేడ్చే పడుచుపిల్లవాళ్ళు పేదవాళ్ళు అనేకమంది యున్నారు. వాళ్ళ వంశములు నిలపండి. పిల్లవాడి

దగ్గర చెప్పినట్లు నాకీమాటలెందుకు చెపుతారు? పిల్ల నెందుకిస్తారో నాకు తెలుసు.

రామ—నేను పిల్లను మీకుతప్ప యింకెవ్వరికి నియ్యను. మీ చిత్తం.

భావ—రామదాసుగారూ, ప్రస్తుతం సెలవు పుచ్చుకుందాము రండి. మరల దర్శనము చేద్దాము. సెలవు పుచ్చుకుంటాము.

నాగ—తర్వాత మాటలాడుదాము రండి. రేపు దయ చెయ్యండి

(అందఱు నిష్క్రమించుచున్నారు)

---

రంగము. 3

(అప్పుడు నాగరాజుగారు, భావరాజుగారు, రామదాసుగారు ప్రవేశించుచున్నారు.)

నాగ—భావరాజుగారూ! శనిగ్రహంలాగు నన్ను పీక్కుతినుట కు మళ్లీ వచ్చినారా? ఆయన పిల్లను ఆయన యిష్టమువచ్చినవారి కి చ్చుకోమని చెప్పండి. నాకక్కర లేదు.

భావ—తమ రాలాగున సెలవిస్తే పనికిరాదు. ఆయన పిల్లను మీకిచ్చి మీయిల్లు నిలపదలచుకొన్నారు. ఇందులో నేను మిమ్మను మొగమాటపెట్టక మానను.

రామ—నాగరాజుగారూ! నాదొక్క మనవి చిత్తగించండి. మీరు గొప్పవారగుటచేత మీవంశం నాశనమగునంటే నాకెంతో వా గాయిత్యంగానుండి మీవంశం నిలపాలని నేను యీపని సంకల్పించు కొన్నాను. వంశం నిలిపిన పుణ్యంవంటిది మరొకటిగాదు. మీరు చ

దువుకొన్నవారు ఎక్కువయుక్తులు చెప్పి వారివంశం నిలపరాదా వీరివంశం నిలపరాదా అంటే నేనుమనవిచెయ్యాజాలను. పసుచువాళ్ళకు ఎవరుపడితే వారే పిల్లనిస్తారు, కాస్త వయసు ముదిరినవారికి యెవరూ పిల్లనియ్యరు. కాబట్టి అటువంటివాళ్ళకు యియ్యడమే యియ్యడం దానివల్లనే పుణ్యం ఉంటుంది.

నాగ—(నవ్వుచు) మీయుక్తులు మాచిత్రంగానున్నవి. ఈ యుక్తిని బట్టి లోకంలోనున్నవాళ్ళందరు తమపిల్లలను ముసలివాళ్ళకే యిచ్చి పుణ్యము సంపాదించాలి.

భావ—ఏదో ఆయనకు తోచిన యుక్తిచెప్పినారు మీరు ఆ ట్టే ఖండించక అంగీకరించండి.

నాగ—మీరింత సంతోషముగా నాకు పిల్లనిస్తానంటూన్నారు గాని పిల్లమట్టుకు మనసులో చాలా ఖేదపడుతుంది

రామ—అది పొరబాటండి. తమరాలాగ సెలవియ్యగూడదు. మా పిల్ల 13 సం॥ ములు వయసుగలది రేపు వినాయకుడు చవితినాటికి పదమూడేండ్లు వెళ్ళిపోతివి. పిల్ల ఉతారుగానుంటుంది గాని గిడసకాదు. పైగా కొద్దో గొప్పో చదువుకుంది. నిజంగా మీరు చెబితే నమ్మరు. అదేమిచిత్రమో, తమపేరు ఫలమో, దానిపుణ్యమో కాని తమరినే కాని మరొకరిని వినాహమాడనంటూందది. దానికి తమసంగతి యెవరుచెప్పారో యేమిటో. చండాలుడేసరి నేనెప్పుడు చెప్పలేదునుమండి, మీపాదాలు సాక్షి.

నాగ—(నవ్వి) ఇదేమి చిత్రమండోయి. ఇది ప్రకృతి వ్యతిరేకముగా నున్నది. ఇది కలికాలధర్మం లాగుంది. పదమూడేండ్లపిల్ల చదువుకొన్నది. తోటివాళ్ళందఱు పడుచుపిల్లకాయలను పెండ్లాడుచుండగా చూస్తూకూడా ముసలివాళ్ళనేకానితాను పెండ్లాడనంటూన్నదా? ఈ విడ కలియుగగాంధారిలాగున్నది. రామదాసుగారూ, మీమాటలు

మీకు బాగుండవచ్చును గాని యీమాటలు లోకంలో యెవరైనా నమ్ముతారాండి. ఇం తన్యాయముంటుందయ్యా.

భావ—వినడాని కాశ్చర్యముగానేయున్నది. కాని అది సత్య మని ఆయనఅంటూన్నాడు.

రామ—పోనీ! నామాటలు నీకంత నమ్మకంగా లేకపోతే ఒక్కదాఖలా చిత్తగించండి తమరు రేపు సాయంకాలమప్పుడు షికారుగా మాయింటికి దయచెయ్యండి. పిల్లయొక్క కోరిక అప్పుడు స్వయంగా తమరే చిత్తగింతురుగాని.

భావ—అవును. ఒకమాటు పిల్లను చూచినట్లూ ఉంటుంది. శేషాకమాటు అల్లా వెడదాముపదండి.

నాగ—ఆమహోత్సవ మేమిటో చూస్తాను. రేపు వస్తాను పదండి.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

రంగము. 4

రామదాసుగారి యిల్లు.

(అప్పుడు మాణిక్యము, రామలక్ష్మి, అన్నపూర్ణ అను ముగ్గురు పిల్లలు ప్రవేశించుచున్నారు.)

రామ—అన్నపూర్ణా!విన్నావటే. ఓతాయలగారిని ముసలి మొగుడు కిచ్చి పెండ్లి చేస్తారట! ఎన్నోనగ లున్నాయట.

అన్న—ఎవరికే ముసలి మొగుడు?

రామ—(నవ్వుచు) ఏమో నాకు తెలియదు. మాణిక్యాన్ని అడుగుదాము. ఏమే మాణిక్యం! యెవరికే ముసలి మొగుడు?

మాణి—(కోపముతో) ఇల్లాంటి మాటలు నాదగ్గరనకండి అమ్మాయి. మాఅమ్మతో చెబుతాను.

రామ—అందరుఉండగా నీకంతకోపమెందుకే. నిన్నేమైనా ముసలాడి కిస్తామన్నారా యేమిటి నీవాళ్లు?

అన్న—నాగరాజుగారు పెళ్లి చేసుకుంటారట. నిన్నిస్తారా యేమిటే?

మాణి—(ఏడ్చుచు) నిన్నిస్తారు కానలిస్తేను. ఇల్లాటి వెధవ మాట లనకండి (అని లోపనికి వెళ్లి) చూడవే అమ్మా వీళ్ళంతా నన్ను ముసలి మొగుడుకిచ్చి పెండ్లిచేస్తారని ఉడికిస్తున్నారు.

తల్లి—ఉడికిస్తే నీవెందుకుడకాలి? ముసలి మొగుడయితే భయం లేదులే. వాళ్ళందరి మొగుళ్ళకన్నా నీ మొగుడెక్కువయేళ్ళే బతుకుతాడులే ఊరుకో. (అందఱు పోవుదురు.)

---

రంగము. 5

(రామదాసుగారు భార్యా ప్రవేశింతురు.)

రామ—నాగరాజుగారు కొంచెము మెత్తపడ్డారు. మనపిల్లను తప్పక చేసుకుంటాడు.

భార్య—ఏమో. అంతదృష్టవంతులము అవాలికదా. మీరు మొన్నరాత్రి అన్నట్టు ముండామూటాకూడా త్వరగానే దక్కుతాయి.

రామ—అల్లా గట్టిగా అనకు. ఇది పిల్లచెవినిబడ్డా అది పెళ్ళాడనంటుంది. నే నాయనతో మీమెనుటే మాపిల్ల మిమ్మలిని పెండ్లాడుతానని చెబుతుంది అని చెప్పివచ్చినాను. రేపు సాయంత్రం ఆయన వస్తారు. వచ్చినప్పుడు ఇద్దఱుముగ్గురు పడుచుపిల్లవాళ్లనుగూడా ఆయన సరసను నుంచోబెట్టి మనము మనమ్మాయి నడగాలి. అడిగితే మనపిల్ల నాగరాజుగారినే పెండ్లాడుతానని అనేట్టు చెయ్యాలి.

భార్య—అదిమనం చెప్పినట్లు ఆలాగే అవుతుంది. నేను దాని చేత అనిపిస్తాను. ఆవిషయమై భయంలేదు, అనకపోతే మెరగదూ: నాచేత్తాడు దెబ్బలు చీపురుకట్టదెబ్బలు దానికి జ్ఞాపకము లేవుగనకనా. వంటయినది. లెండి బోజనానికి, దానిచేత యేమనిపించాలో మధ్యాహ్నాము ఆలోచిద్దాము.

(అందఱు పోవుదురు.)

—•—

## 6 రంగము.

## రామదాసుగారి యిల్లు.

[రామదాసుగారు, భార్యయు, కూతురు మాణిక్యమును ప్రవేశింతురు.]

రామ—అమ్మాయీ! మాణిక్యము. నీ యదృష్టము మంచిది. పదనూరేండ్లు పెంచినందుకు పశువుగల సంబంధము గొప్పసంబంధము తీసుకువచ్చినాను. అన్నిసుఃఖ్ఖటలు నీకు తీరుతాయి. ఒంటినిండా ఒంటెడు నగలు పెట్టుకొనవచ్చును.

భార్య—దానదృష్టముతో పాటు మన అదృష్టముకూడా ఉంది. బిడ్డ ఒంటినిండా ఒంటెడునగలు పెట్టుకొని తిరుగుతూంటే చూచేభాగ్యము మనకుగూడ నున్నదిగదా.

రామ—అవునుమనముకూడా అదృష్టవంతులమే. అమ్మాయీ నిన్ను మన నాగరాజుగారి కివ్వడానికి నిశ్చయముచేసినాను. ఆయనకు నెలకు నాలుగువందలరూపాయలు జీతము.

మాణి—నాకీపెల్లి వద్దు. వీధిలోకి వెడితే ముసిలిమొగుడును చేసికొన్నానని అన్నపూర్ణా రామలక్ష్మీ అంతా ఆక్షేపిస్తారు. నాకు సిగ్గేస్తుంది.

భార్య—ఆక్షేపిస్తే వాళ్ళని చెప్పుతీసు కొట్టిస్తాను. నిన్నాక్షే పించేటందుకు వాళ్ళెవళ్ళు? వాళ్ళ మొగుళ్ళు పశువువాళ్ళన్నమాటే గాని చస్తే మనవర్తికి దిక్కులేదు. వెధవ యింగ్లీషుముక్కలు నాలుగు చదువుకుంటూన్నారని కూడుగుడ్డలే కుట్టుకుంకలి కిచ్చారు. చదువు కుంటే మాత్రము యీ వెధవలికి నాలుగువందల రూపాయల యుద్యోగాలయి యేడిశాయా యేమిటి.

రామ—అమ్మాయీ! నీవు పిల్లదానవు. నీకు తెలియదు. అయిదు వేలరూపాయల నగలు పెడతారు. నీకు మొహారీలపేరుకూడా చేయిస్తారు. కావలసినన్ని సవారీలు గుఱ్ఱబ్బళ్ళు యెక్కి తిరుగవచ్చును. ఇంకా కావలసినన్ని లాభాలున్నాయి.

మాణి—నగలెందు కేమిటి నాకు. అంతా నవ్వుతారు. నాకొద్దీపెళ్ళి.

భార్య—దిక్కుమాలినదానా. నీకు వెధవపెంకితనము మహా బలిసినది. చావగొట్టేస్తానుచూడు, వెధవముండా.

మాణి— అవును వెధవముండను చెయ్యాలనే నీయాలోచన. అందుకే యీపెళ్లి.

రామ—(భార్యతో) ఊరుకోవే పాడుముండాపిల్లను బెదర కొడతావేమిటి ముందుగా, నువ్వవతలకుపో కాస్సేపు.

భార్య—నాకెందుకు నేపోతాను. రెండుచరుపులేస్తే జేద్దేవరా యని చెప్పినట్లు వింటుంది. అమ్మ పెట్టేవి రెండు పెడితేనేగాని దాని రోగం కుదరదు. పిల్లముండగదా. యేసంబంధము కుదురుస్తే దీనికెందుకు? పెద్దవాళ్ళ యిష్టమేదో అది చేస్తాము. ఈమాయచదువు లొచ్చిన తరువాత పిల్లముండలంతా పెంకితనాలు బలిసి పాడైపో తున్నారు.

రామ — నీయమ్మ కడుపు కాలా నీసవతల కొళ్లవే.

భార్య—మీరు, అది గంగలో దిగండి. నేవెడతాను.

(అని వెళ్ళుచున్నది.)

రామ—అమ్మాయీ! నామాట విను. కాస్త ప్రాజ్ఞతవచ్చిన దానవు. పైగా చదువుకొన్నావు. తండ్రిమాటా తల్లిమాటా వినాలి కదా. మనము వెయ్యిజన్మాలుతల్లక్రిందుగా తపస్సుచేసినా వారి సంబంధం దొరకదు. వారితో వియ్యంపొందామంటే గొప్పున్నది. ఆయన యీసంబంధము చేసికొననంటూన్నారు. అనేకమంది తమ పిల్లలను తీసికొనివచ్చి ఆయన కాళ్లమీద పడేస్తున్నారు. అయితే మాపిల్ల మిమ్మలిని పెండ్లిచేసికొనుటకు కోరుచున్నదని నేనొక బూటకము చెప్పివచ్చినాను ఏలాగుననైన మనసంబంధము చేసికోవాలసి. అయితే పిల్లచేత ఆమాట నాయెదుట అనిపించండి నేను చేసుకుంటాను అని నాగరాజుగారన్నారు. సరే అల్లాగే చేస్తుందన్నాను, ఈసాయంకాలము వారు మనయింటికి వస్తారు. వచ్చినప్పుడు మనశాఖవాళ్లనే అందమైన వాళ్ళని పడుచువాళ్లని యిద్దరిని ఆయనసరసను నుంచోపెడతాను. పెట్టి నీవెవ్వని పెండ్లిచేసుకుంటావని నిన్ను నే నడుగుతాను. అప్పుడు వేలుపెట్టి నాగరాజుగారిని చూపించాలి. నాగరాజుగారెల్లాగుంటారో ఆనవాలెరుగుదువా ?

మాణి—ఎరక్కేమి చప్పిదవడలు ముగ్గుబుట్టలా తలా ఆయన నెవరెఱుగరు?

రామ—అమ్మా! అల్లా యీసడింపుగా అనకుమరి. మాయమ్మా, మాతల్లి, నామాటదక్కించు. తీరా మాటిచ్చి వచ్చాను.

మాణి—సరే నీయిష్టం. నాకర్మంనాది. (అనిపోవును.)

రాము—(భార్యను పిలిచి) ఓసేవు అది వప్పుకుందే. నీ వెధవ మాటలుగూలంగా కాని లేకపోతే అది మొదటే వప్పుకోనును. ఇక లేచి దానికి కాస్త తలదువ్వు.

(అని యిద్దరు పోవుచున్నారు.)

—ంంంం—

7 రంగము. రామదాసుగారియిల్లు.

(అప్పుడు నాగరాజుగారు, భావరాజుగారు, చంద్రరావు, సూర్యారావు ప్రవేశించుచున్నారు.)

రామ—దయచెయ్యండయ్యా! మాగృహపావనమైనది. (అని అందఱను కుర్చీలమీద కూర్చుండబెట్టును.)

నాగ—కొంచెం పనియున్నది. త్వరగా వెళ్లాలి.

భావ—రామదాసుగారూ! ఆపనేమిటో త్వరగాకానియ్యండి.

రామ—చిత్తము (అని లోనికివెళ్ళి కూతురుచెయ్యిపట్టుకొని) అమ్మాయీ! వారు వచ్చారు. నామాట దక్కించాలి తల్లీ. యెవరిని పెండ్లిచేసుకుంటానన్నప్పుడు వేలుపెట్టి నాగరాజుగారిని చూపించాలి. అక్కడ చంద్రరావు సూర్యారావు అని పడుచువాళ్ళిద్దరున్నారు. కొంపతవ్వి వాళ్లను చూపించకునుమా అమ్మా! (అని చావడిలోనికి తీసికొనివచ్చును.)

భావ—(రహస్యముగా) అదిగోనండోయి పిల్లవచ్చుచున్నది. పెండ్లికొడుకుగారు జాగ్రత్తగా కూర్చుండండి.

(రామదానుగారు, కూతురు ప్రవేశింతురు.)

రామ—అమ్మాయీ! నీవీ కూర్చున్నవారిలో నెవరిని పెండ్లి చేసికుంటావు వేలితో జూపించూ? (అని ఆమె వ్రేలు సాగతీసి నాగ రాజుగారివైపు తానే పెట్టుచున్నాడు.)

చంద్రి--(తనలో) నహహా! రామదాసుగారే పెండ్లికూతురై నరించుచున్నారు

సూర్యా--(తనలో) ఇది చిత్రమైన నాటకము. ఇదిబలాత్కార వివాహపరిహాసనము.

నాగ—ఇదేమిటండోయి రామదాసుగారూ! ఆపిల్లచెయ్యి మీరేపెట్టి చూపిస్తూన్నారు? ఆపిల్ల కిష్టము లేదుగాబోలు!

రామ—సరిలెండి సిగ్గుగాదటండీ. చిన్నపిల్లాయెను. పదిమంది లోనికివచ్చి చెప్పడమూయెను.

భావ—అగునవునండీ. సిగ్గుచేతనేకాని మరొకటికాదు. ఇష్టము లేకపోతే చెయ్యి మరివకరి కేసే తిప్పును.

నాగ—ఇది అపూర్వస్వయంవరము. తీసికొనివెళ్ళండి పిల్లను.

రామ—(పిల్లనులోపటికి పంపి) రేపు బుధవారము మంచి ముహూర్తమున్నది. ఆవేళ కానిచ్చెయ్యండి.

భావ—చాలా బాగానున్నది. ఆలాచెయ్యండి.

నాగ—అది నాకూ సంతోషమే కాని బాజాభజంత్రీలు వల్ల కాదు. తోరణాలు కట్టగూడదు పురోహితుడు తప్ప యితర బ్రాహ్మణులను లోపలకు రానియ్యగూడదు. ఇంతకూ యీపెళ్ళి నేకోరినది కాదు. మీరు బలవంతపెట్టబట్టి నేచేసుకొంటున్నాను. ఇందులో నాదోష మేమీ లేదు.

భావ—దోషం నేపంచుకుంటాను. సుఖం మీరనుభవించండి.

రామ—తమ యిష్టప్రకారము నేను జరిగిస్తాను. ప్రయత్నము చేయించండి.

(అందరు నిష్క్రమింతురు)

---

## రంగము 8

(అప్పుడు నరసమ్మ, గవరమ్మ, శరభమ్మ ప్రవేశించుచున్నారు.)

నర—వోవిడా గవరమ్మో మదినే! విన్నావా నాగరాజుగారు పెళ్ళాడారట?

గవ—పెళ్లి యెంతశోభగావుండాలో అంతశోభగావుంది.

శర—ఆశోభేమిటి చెప్పు వింటాము.

నర—పెళ్లికంటాముందు పెళ్ళికూతురు, పెళ్లికొడుకుని యెరుకోడంవచ్చింది కాదుటమ్మా! లోకంలో చిత్రం. సీతామ్మవారు, సత్తిభామాలాగా నేటికాలాని కీయన్నాయి బయలుదేరినది యేసుకోడానికి. యింతకంట విడ్డూరం లోకంలో లేదు. అదెంత కలికాలప్పిల్లోగాని ముసలాడినేకాని పెళ్ళాడనని పట్టుపట్టినదటమ్మా!

గవ—పట్టూలేదు. నామొగం లేదు. తల్లితండ్రి చావగొట్టి దానిచేత సరేఅనిపించారు. వాళ్ళన్నమాటకి అదిగంగిరెద్దులాగ తలాడించింది ఆపిల్లని తీసుకొచ్చి ఆముసలాయనయెదుటపెట్టి నీవెవరిని పెళ్ళాడుతావో చూపించుమని దాన్ని అడిగారు. అడిగితే అది మొద్దులాగున ఊరుకున్నదికాని చూపించలేదు.

శర—మనసులో లేందే దాని కెల్లావస్తుందమ్మా పైకిమాత్రం. అదిజ్ఞానమెఱిగిన పిల్లామెను.

గవ—అదెంతసేపటికి చూపించకపోతే తండ్రి దానివేళ్ళు పట్టుకు లాగి తానే చూపించాడు.

నర—ఈ పెళ్ళికొడుకు దాని మొగుడుకాడు. దానితండ్రి మొగుడు. ఎందుకంటే తండ్రే తప్పదారా యేమి చేసుకున్నాడు గనుక

గవ— అతరవాతకథవిను. పెళ్ళికొడుకు గుమ్మానికి పసపురాసి తోరణం కట్టనియ్యలేదు, బాజాలు వాయించనియ్యలేదు,

శర—తోరణంగట్టి బాజాలు వాయిస్తేమి?

గవ—ఆయనకు మొదటిభార్య పోయినవిచారమట! అందుకు వల్లకాదట!

శర—ముప్పయియేళ్ళు కాపురముచేసిన పెళ్ళాము చచ్చి పోయినతరువాత మళ్ళీ పెళ్ళిచేసుకోవడానికి విచారము లేదుకాని తోరణంగట్టి బాజాలు వాయిస్తె విచారమా యీయనకు? ఎంత మాయవాడేఅమ్మా!

నర—నిక్షేపమంటి పన్నెండేండ్లపిల్లని అరవయియేళ్ళ ముసలి తొక్కముండావాడు పెళ్ళాడ్డం విచారములేదుకాని తోరణంవిచారము వచ్చినదీ యీయనకు? అదికాదె కారణం. లోభిముండావాడు తోరణం చూచినా బాజాలువిన్నా పదిమంది వస్తారు. సంభావన యివ్వవలసి వస్తుందని భయము.

శర—ఆయనకసలు పెళ్ళే యిష్టములేదుగాదు మరి.

గవ—ఊరుకుందూ. అదో వేషం ఇష్టంలేకపోతే పెళ్లెందుకు చేసుకోవాలి, ముసలాడికి పెళ్ళేమిటని పదిమందీ నిందిస్తారని యిదో వేషం వేశాడు. బలవంతాన్ని పదిమంది జబ్బలుపట్టి కూర్చోపెట్టారా యేమిటి?

నర—పెళ్ళిసోద్దాలు వినండి. మధ్య మాటలు పెట్టకండి. కన్నె ధారకు తీసుకువచ్చేటప్పుడు పెళ్లికూతు రేడుస్తూవచ్చినదట. ఎందు కేడుస్తూందని యెవరో అడిగితే, వచ్చేటప్పుడు గడప కాలికి తగిలినది. అందుచేత యేడుస్తూందని తండ్రి చెప్పినాడట.

శర—శాబాసు నీ అమ్మా! వాడెంతకైన సాహసుడే వా. డెక్కడితండ్రే అమ్మా మాయతండ్రి! దీనిపాలిటి యెములాడు.

నర—చుట్టా లెవరైనా వచ్చారా ?

గవ_చుట్టాలూ లేరు. పక్కాలు లేరు. పెళ్లికొడుకు ెవరిని పిలవ కూడదన్నాడు.

నర—ఇదేమి పెళ్ళేఅమ్మా. దొంగపెళ్లి చాటుపెళ్ళిలాగుంది. ఇంతకంటె వెధవముండలపెళ్ళిళ్ళు బాగాజరిగాయి మనవూళ్ళోను. పెళ్ళుమని రామడోళ్లతో టి ఊరేగింపులతో టినీ.

శర_ఇంతకంటా ఆపెళ్లిళ్ళైనయమ్మ.

గవ—తరువాత యింకో చిత్రం విను. మొన్నపొద్దున్న పెండ్లయిపోయింది కాదా. నిన్నపొద్దున్న పెండ్లికూతురు తల్లి కూతురుకు పెట్టిన నగలన్నీ తాను వంటినిండా పెట్టుకొని కులుకుతూ పేరంటానికి పిలవడానికి బయలుదేరినది.

శర—దాని కెంతసిగ్గులేదే అమ్మా.

నర_ఇంతకూ ఆవిడ అదృష్టవంతురాలు. ఈనగలెప్పటి కీవిడ మెడలో నే ఉంటాయి.

శర_ఈ వేళ పాకెన్నా యేమిటి?

గవ_వారింట పాకెన్న మామూలు లేదట.

శర_వారింట ముసలితనములో పసుచుపిల్లలను పెళ్ళాడటమే మామూలుకాని తక్కిన మామూళ్ళేవి లేవుకామోసును?

గవ_ఇల్లాంటి అవకతవపెళ్లిచూస్తే ఊరందరికి లోకువ.

నర_అప్పుడే యింటిపెత్తనమంతా మామగారు వహించి యింట్లో వాళ్ళనితిట్టి లేచిపొమ్మంటూన్నాడట.

శర_నడిమంత్రపుసిరి నరంమీద పుండూ అన్నారు.

గవ—నాలుగేళ్ళు మనం బ్రతికున్నామంటె అన్నీ చిత్రాలు వింటాము. రండి వెళదాము. పొద్దెక్కినది.

శర — అవుతే ఊరేగింపుందిటో. అడగటం మరిచిపోయినాను.

గవ — ఇక ఒకటే ఊరేగింపు. మధ్యమధ్య ఇన్ని ఊరేగింపులు లేవు పోదాంపద.

(అందరు నిష్క్రమింతురు.)

# స్వగౌరవరక్షణము.

## రంగము 1.

(ఆంజనేయులుగారు ప్రవేశించుచున్నారు.)

ఆంజ — (తనలో) ఆత్మగౌరవము ప్రతివాడు నిలుపుకోతగినది ఆత్మగౌరవము కావాలి కావాలని ఉపన్యాసము లిచ్చేవారేకాని సమయమువచ్చినపుడు నిలుపుకొనేవారెవరు లేరు. నేనీరోజున తప్పకుండా నిలుపుకుంటాను. ఇంటిలో తిరిగేటప్పుడు గొప్పవాళ్ళంతా పాంకోళ్లు తొడుగుకుంటారుగదా యని నేనుకూడా పాంకోళ్లజత చేయించుకొన్నానుగదా! మునసబుగారు తహసిల్‌దారుగారు సిరస్తదారుగారు షికారు వెళ్ళేటప్పుడు ఎడమభుజముమీద చెన్నపట్టణపు రుమాలు, కుడిభుజముమీద కండువా వేసుకుంటారు గనుక నేనుకూడ చెన్నపట్టణపురుమాలు దుకాణముమీద అరువుతీసికొని వేసికొంటున్నానుగదా, డిప్టీకలక్టరుగారిలాగ చేతిలోనికి వెండిపొన్ను కఱ్ఱ సంపాదించినానుగదా. దిక్కుమాలిన నాకు జీతము పదిరూపాయ లైపోయినదిగాని తక్కిన అన్నివిషయములలోను డిప్టీకలక్టరుగారు తహసిల్‌దారుగారిలాగె యున్నాను. పెద్దాపురపు బుట్టపైజాళ్లు తొడుగుకొని చేతిలో పట్టె [illegible] ట్టు టకటక

లాడుతూ నడిచివెళ్ళుచున్నానంటె కూరలమ్ముకొనేవాళ్ళు గొల్లవాళ్ళు గడ్డికావిళ్లమ్ముకొనేవాళ్ళు హడిలిపోయి యీయనెవరో గొప్పవార నుకొని పక్కపక్కకి వత్తిగిలుతారుగదా. నేను డబ్బుకూరకొన్నను డబ్బుమల్లెపూవులు కొన్నను కూలివాడిచేతే తెప్పిస్తానుగాని నేను ముట్టుకోనుగదా. ఆత్మగౌరవమంటె యీలాగె నిలబెట్టుకోవడం. గణపతిరావుగారి కూతురువివాహము యీవేళకు నాలుగోరోజు. ఈవేళ రాత్రి అందరిని భోజనమునకు పిలిచినారు. సుబ్రహ్మణ్యంపంతులు గారు భోజనానికి జోడుకాగడాలు వేయించుకొనివస్తారు. మహాదేవ రావుగారు ఒంటికాగడా వేయించుకు వస్తాడు. తక్కిన పెద్దమనుష్యులు చాలమంది లాంతరులు వేయించుకొని వెడతారు. నేనుకూడా యీ వేళ లాంతరువేయించుకొనే వెడతాను. ఈవిధంగా ఆత్మగౌరవము చూపించుకొనకపోతే మనమీద యెవరికీ గౌరవముండదు. ఆత్మగౌరవముండాలని చెప్పేవారియొక్క అభిప్రాయమంతాకూడా యిటువంటిదే యైయుంటుంది. అయితే మాయింట్లో లాంతరు లేదు. లాంతరు యెరువడుగుతే బాగుంటుందా? ఛేస్సి యెరువడుగకూడదు. ఒకటికొంటేనే మంచిది. ఈలాంటిపనులకు తరుచుగా అక్కరకువస్తుంది. చేతిలో డబ్బులేదు. ఏమిచెయ్యను? నర్సయ్యమామగారిని బదులడుగుదాము పోనీ. ఇయ్యకపోడు. నర్సయ్యమామగారు!

నర్స—ఏమి ఆంజనేయులుమామగారు

ఆంజ— నాకు జరుగురుగా ఒక్కరూపాయ బదులుకావలెను.

నర్స—ఏమి అంతజరుగు రేమివచ్చినది?

ఆంజ—తరువాత మనవిచేస్తాను. ప్రాణావసరమువచ్చినది. వెనుక బదులుయిచ్చిన రెండురూపాయలు చాలాఆలస్యముగా యిచ్చినానని మీరు మనసులో నుంచుకొనవద్దు. త్వరగా యిస్తాను.

నర్స—రేపు సాయంత్రములోపుగా యివ్వాలి. (అని ఒక రూపాయ యిచ్చును.)

ఆంజ—(పుచ్చుకొని) తప్పకుండా యిస్తాను. మనమిద్దరము ఒకయింట్లో కాపురమున్నందుకు మీరుమాత్రము సాయమప్పుడప్పుడు చేస్తుండాలి.

నర్స—సరే దానికేమి (అని వెళ్ళుచున్నాడు)

ఆంజ—(తనలో) రూపాయ దొరకినదిగదా. పావలాలాంతరు బేడలాంతరుకొంటే నాదర్జాకి సరిపోదు. అందుకుచేత మూడుపావలా లుపెట్టి పెద్దలాంతరు—అందులోకి ఒకణావొత్తి కొంటాను. తక్కిన మూడణాలు లాంతరువేసినవాని కూలికింద వినియోగిస్తాను, ఇప్పుడే దీపాలు పెట్టినారుగదా! ఇంకా లాంతరు దుకాణములుంటాయి. ఇప్పుడేవెళ్ళి ఒకలాంతరు కొనుక్కొనివస్తాను. లాంతరు తెచ్చేటందుకు కూలి వాడు దొరుకుతాడా? దొరకడు. లేకపోతే చీకటిగదా. చంకలోపెట్టు కొని పైన బట్టకప్పుకొని నేనే తెచ్చుకుంటాను. చీకటిచాటు గనుక యెవరికి తెలియదు. (అని నిష్క్రమించును).

---

## రంగము 2.

(ఆంజనేయులు ప్రవేశించుచున్నాడు.)

ఆంజ—(తనలో) లాంతరు మంచిదే కుదిరినది. కావొత్తి కూడా కుదిరినది. ఇక చాకలివాడు కావలెను. మాచాకలివానియిల్లు యిస్నీనుపేటలో నున్నదిగదా. అది యిక్కడికి మైదూలురములో నున్నది. ఇంటికి వెళ్ళినప్పటికి వాడక్కడ దొరకడు. వాడు చాకిరేవు లోనే యుంటాడు. కాబట్టి చాకిరేవుకు వెళ్ళడమే వుచితము. ఏలాగైనా పది మంది పెద్దమనుష్యులతో పాటు లాంతరు వేయించుకొని

భోజనానికి వెళ్ళి ఆత్మగౌరవమును నిలబెట్టుకొనడమే ప్రధానము. పొందాతనము. పామేదాతనము మనము తెచ్చుకుంటే వస్తాయిగాని లేక పోతేరావు. జీతంకొద్దయినా నేను ఆరిందాలలో చేరవలసిన వాడను గనుక చాకలివానిని తెచ్చి తీరవలె. లాంతరు వేయించుకొని తీరవలె. చాకిరేవయినా అట్టెదూరము లేదు. గోదావరివద్దనుంచి ఎట్టిరాళ్ళపక్కం మ్మటే వెళ్ళితినా చాకిరేవునాలుగడుగులు ప్రయాణము, అక్కడవాడు తప్పకుండా వుంటాడు, వుండకపోతే మరియొకచాకలివాడినైనా విధిగా తీసుకురావచ్చును. ఇప్పుడేడుగంటలయినది. భోజనాలు తొమ్మిదిగం టలకుగాని కావు. కాబట్టి చాకలివానిని తీసుకురావలెను. ఆత్మగౌర వమా? మజాకా?

(అని పోవును.)

---

## రంగము 3.

### ఇసుకతిప్పదరి చాకిరేవు.

(అప్పుడు ఆంజనేయులు ప్రవేశించును)

ఆంజ—(తనలో) మాచాకలాడెంత వెదకినా కనబడలేదు. పోనీ మరొకడిని కుదుర్చుకుంటాను. (అని యొకచాకలిని చూచి) ఒరీ నీపేరెవరు?

చాక—నాపేరెందుకండీ. పేరాలిస్తేగాని నన్నుగీనేమన్నా శే త్తారేంటుండి. ఏంతప్పు శేశానండి రాన్కుందుకు?

ఆంజ—ఓరే నిన్నేమైనా చేయడంకోసంగాదు నిన్నడిగినది. కొంచెము పనియున్నది. నీవు మాయింటికి రాగలవా?

చాక—ఏవుండి బాబూ మీయింట్లో వొవరైనా పోయినారేం టుండి?

ఆంజ—ఛీ ఛీ, దౌర్భాగ్యుడా పాడుపేలాపన పేల్తావు. నాకు లాంతరు వెయ్యాలి. నీవు వెయ్యగలవా?

చాక—అయ్యబాబూ. తిడతారేంటుండి. యాలగానియాలొస్తే వోవరైనా పోయినారనుకున్నాను. పోనిండి లాంతరు కావాల్తే లాంతరేత్తాను. నాపేరు పోతిగాడు.

ఆంజ—సరే! వేశినందు కేమిపుచ్చుకుంటావు, మొదటే బేరము ఫయిసలు చేసుకుంటే మంచిది.

చాక—లాంతరేశి గెల్లి మిమ్మక్కడ దిగబెట్టడమేనాండి. మీరొచ్చిందాక అక్కడ కూకోవాలాండి?

ఆంజ—అహా అక్కడ కూర్చోవలసినదే. యేమడుగుతావో అడుగు.

చాక—పావళా దైసేయుంచుండి.

ఆంజ—పావలా యేమిటి? ఈకాస్తపనికి పావలా? ఆఖరుమాట మూడణాలిస్తాను.

చాక—శిత్తం. అల్లాగే యిప్పించుండి. ఇల్లిదిగో యీమూటయింట్లో మా రేశి మీ వెనకాలొత్తాను. మీరింటి కెల్లుండి. మీయిల్లెక్కడుండి. తమపే రెవరుండి?

ఆంజ—నాపేరు ఆంజనేయులు. మాయిల్లు మార్కండేయులు వీధిని. నీ వాలస్యము చేస్తే పనికిరాదు. ఇప్పుడు రమారమి 8 గంటలు కావచ్చినది. 9 గంటలకు భోజనాలవుతాయి, త్వరగా రా. అయినా మీయిల్లెక్కడ?

చాక—రావోరికొట్లమూలుండి.

ఆంజ—సరే. నేయింటికి వెళ్ళుచున్నాను. త్వరగారా. మార్కండేయులు గుడిదగ్గరకు వచ్చి ఆంజనేయులుగారి యిల్లేదంటే చెపుతారు.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

## రంగము 4.

ఆంజనేయులుగారి యిల్లు.

ఆంజ—(తనలో) ఈచాకలిముండాకొడుకింకావచ్చినాడుకాడు. రమారమీతొమ్మిది కావచ్చినది. ఇదివరకప్పుడే రెండుమాట్లు భోజనానికి రమ్మని పిలిచివెళ్ళినారు. ఆలస్యమయిపోతుందని భయమేస్తూంది. భోజనమైనామానివెయ్యాలి కాని లాంతరు లేకుండా వెళ్ళగూడదు.

(అంతట సోమన్నయను బ్రాహ్మణుడు ప్రవేశించుచున్నాడు.)

సోమ—ఏమండోయి ఆంజనేయులుగారు! మనవాళ్ళందఱు వచ్చినారు. త్వరగా దయచెయ్యండి. వడ్డన లయిపోయినాయి. మీకు, రామచంద్రరావుగారికీ తరువాయి.

ఆంజ—ఇదిగో మీవెనకాలే వస్తూన్నాను. పదండి.

సోమ—చిత్తము (అని వెళ్ళును)

ఆంజ—(తనలో) చాకలివెధవ యింకావచ్చినాడు కాడు. వాడికోస మెవ్వర్నైనా పంపుదామంటే యింట్లో మనిషిలేడు. పోనీ రావువారి కొట్లకేసి నేనే యొకసారి వెళ్ళివస్తాను. నవవగల మగవానికి నాలుగడుగుల ప్రయాణం.

(అని వెళ్ళును.)



## రంగము. 5

చాకలివీధి.

ఆంజ—పోతిగాడి యిల్లెక్కడ?

స్వామి—లోనరారు. ఆంజనేయులుగారా యేమిటి

ఆంజ—ఎవరువాడు స్వామిగాడా యేమిటి? నేనేరా.

స్వామి—ఏముండి బాబూ యిల్లాగొచ్చారు?

ఆంజ—కొంచెము పనుండివచ్చాను. లాంతరువేసూలినాకు. నీవువస్తావాపోనీ.

స్వామి—ఒత్తాపదండి. పొద్దోద్దా యేంటుండి.

ఆంజ—ప్రొద్దుపోను, త్వరగారా. మాయింటిచాకలివి నీవేదా రకినావుగనుక చాలాసంతోషముగానున్నది.

(అని వెళ్ళుచున్నారు.)

---

రంగము 6 ఆంజనేయులుగారియిల్లు

పోతి—ఆంజనేయులుగారూ! (అని కేక వేయును) (ఆంజనే యులు స్వామిగాడూ ప్రవేశించుచున్నారు,)

ఆంజ—ఇంత ప్రొద్దుపోయివస్తే యెవరికికావాలి నీకోసము కనిపెట్టుకుని కూర్చుండి ప్రాణము విసికి యింటిచాకలి తీసుకువచ్చి నాను.

పోతి—ఏమన్న పెద్దమడిశివయ్యానువ్వా? నన్ను రమ్మనిశెప్పి యింకోణ్ణి పిలుత్తావా? పావళా అక్కడ మెట్టి కదులు.

ఆంజ—ఛీ త్రాగుబోతు వెధవా! నోరుముయ్యి.

పోతి—మాటలు మిగుల కాట్టేను. అంటేమళ్లీ అంటాను. రమ్మనడం యెల్లమనడం నీయిష్టమే. (అని ఆదారినివెళ్ళునట్టియిద్దరిని పిలిచి) అయ్యా సూడం ఈపెద్దమణిశి, సాకిరేవులో కొచ్చి లాంత రెయ్యాలని నన్ను పిలుకొచ్చి యిప్పు డెల్లమంటాడు.

ఆంజ—నాడిమాటలు మీరు నమ్మకండి (అని లోపలికివెళ్లి మూడణాలు తెచ్చి వాడికిచ్చి) అక్కట్టే అల్లరిచెయ్యక అవతలకు లేచిపో పెద్దా పిన్నా యెరుగవు తుంటరి వెధవా.

పోతి—నోవ్వేరుగుదువటయ్యా సుశేనా?

(అని పోవుచున్నాడు.)

ఆంజ—స్వామిగా యీలాంతరు వెలిగించు.

స్వామి—(లాంతరు వెలిగించును.)

(ఆంజనేయులు లోపలికివెళ్ళి స్నానముచేసి పట్టుపంచలు కట్టుకొని పావుగంటలోనచ్చును.)

ఆంజ—స్వామిగా లాంతరుచ్చుకొని ముందునడూ.

స్వామి—చిత్త (మని నడచు చున్నాడు)

ఆంజ—(కొంతదూరము వెల్లిన తరువాత) స్వామిగా, అక్కడాగు. ఆచప్పుడేమిటి? భోజనాలయి చేతులు కడుగుకుంటూన్న చప్పుడా యేమిటది.

స్వామి—కామోనుండి. సూశిరానా యేటుండి.

ఆంజ—చూచిరా త్వరగా.

స్వామి—(వెల్లిచూచివచ్చి) బాబయ్యా! భోజనాలయి పోయి నాయుండి. శెంబులుచ్చుకు కొందరలా గెల్లిపోతూన్నారు. కొందరిల్లా గొత్తూన్నారు. కొందరు తాంబోళాలునమలుతున్నారు

ఆంజ—ఓరేయి చప్పుచప్పున యింటికి వెళ్ళుదాము రా. భోజనాలు అయిపోయినాక అక్కడికి వెళ్లడము గౌరవము కాదు.

(అని యిద్దరు యింటికివచ్చుచున్నారు.)

భార్య—అల్లాదూరంగా వెళ్ళండి

ఆంజ—ఏమి వెలప లున్నావా యేమిటి?

భార్య—అవును! నే నింట్లోకి రాగూడదు. మీరు భోజనము చేయకుండా వచ్చినారేమి?

అంజ—ఇల్లాటి పరువు తక్కువ వాళ్లింటికి వెళ్ళడము నాదె బుద్ధితక్కువ. ఇక జన్మజన్మానికి వాళ్ళగుమ్మము త్రొక్కిచూడను. నన్ను భోజనానికిపిలిచి నేను వచ్చినదాకా కనిపెట్టు కుండక ముందు భోజనాలు చేశినారు.

భార్య—అయ్యో! ఇప్పుడు మనయింట్లో వంటచెయ్య డానికైనా వీలు లేదే. భోజనానికి వెడతారని వంట చెయ్యలేదు. మధ్యాహ్న పన్నముంటే నే తిన్నాను. పోసి పోలెడు బియ్యము అత్తెస రేసు కుంటారా?

అంజ—ఆ పాట్లు నేపడలేను. కడుపులో కాళ్ళెట్టుకుని చల్లగా పరుంటాను. ఆత్మగౌరవము కలవ ళ్ళకి రోజులు కావివి.

భార్య—ఏమిరోజులో పెళ్ళివారిల్లు మనయింటికి పట్టుమని పది బారలు లేదు. ఇక్కడకు లాంతరు కావాలని చాకిరేవులోకి వెళ్ళి చాకలి పేటలోకివెళ్ళి వచ్చేటప్పటికిపుణ్యకాలముకాస్తా వెళ్ళిపోయినది.ఎవరైనా వింటే తలవంపులు ఇద్దరు చాకలాళ్ళకి కూలిదండుగ, ఈ రాత్రి యుప వాసము, ఇన్నివచ్చాయి. ఏమయినా అంటే మీరు కోపపడతారు.

అంజ—ఛీ నోరుముయ్యి. పశువా. బోడిముండా! పేడచేసుకు నే ముండకి నీకు ఆత్మ గౌరవ మేమి తెలుస్తుంది. ఇల్లాంటి అవక తవక పేలాపన పేలకు చెప్పుదెబ్బలు తినేవు.

భార్య—నా కెందుకు! బుద్ధితక్కువ వచ్చిలన్నాను. ఆత్మగౌరవపు లాభము మీరే అనుభ విస్తూన్నారుకదా ?

అంజ—స్వామిగా నీవు పొద్దున్నేరా నీ డబ్బు లిస్తాను,

స్వామి—చిత్తము

(అనిఅందరు నిష్క్రమించుచున్నారు.)

# దివాలదేవి వ్రతకల్పము

బ్రహ్మలోకమునకు నారదుడు వెళ్ళి బ్రహ్మకు నమస్కారము చేసి యిట్లనియె—"మహాత్మా, బ్రహ్మదేవుఁడా! భూలోకమునందు మనుష్యులనేకులు ధనము లేక యిబ్బంది పడుచున్నారు. కొందఱు ధనము చాల సంపాదించి యైశ్వర్యములతో దులతూగు చున్నారు. ధనములేని యా పేదవా రందఱు విస్తారము కష్టపడకుండా ధనవంతులగుటకు ఏదైన యుపాయ మున్నదేమో, ఆన తియ్యవలయును. ఆ యుపాయము మీరు సెలవిచ్చిన పక్షమున నేను సకలలోకములు సంచరించు చుందును గనుక మీరు చెప్పిన యుపాయము నా మనుష్యులకు బ్రకటించి వారందరు సుఖపడునట్లు చేసెదను" ఆ మాటలు విని బ్రహ్మదేవుడు మిక్కిలిసంతోషించినవాడై నారదమహామునితో నిట్లనియె—

"ఓయినారదా! నీ వడిగిన ప్రశ్నము మిక్కిలి మంచిది. దానికి తగిన యుపాయ మొక్కటి యున్నది. ఆయుపాయము భూలోకములో ప్రతిమనుష్యునకును నీవు చెప్పగూడదు. ఎవ్వరు దానికి తగుదురో వారికే ఆయుపాయము చెప్పవలయును. ఇది పరమ రహస్యము. అతిగోప్యము. మితముగా ధనము వాడుకొను వారికి గౌరవము కొరకు దేవులాడు వారికి, జాలిగలవారికి ఈ రహస్యమును నీవు తప్పి జారియైన నెఱిగింప గూడదు. ఈ నిబంధనలకు నీ వొప్పుకొందువేని, ఆ విషయము నీకు సంపూర్తిగా నెఱింగించెదను."

నారదుడు చెప్పుచున్నాడు—

మహాత్మా మీరు సెలవిచ్చినట్లుగానే దానిని పరమ గోప్యము గానే యుంచెదను కాబట్టి నాకు దానిని తక్షణ మెఱిగింపవలయునని

కోరు చున్నాను. అది వినుటకు నా మనసు మిక్కిలి తత్తరపడు చున్నయది.

బ్రహ్మ చెప్పుచున్నాడు.

అట్లైన యో నారదా శ్రద్ధగా వినుము, దివాలదేవి వ్రతమను పేర నొక వ్రతము కలదు. ఇది గొప్పవ్రతము. ఈ వ్రతమును శ్రిద్ధా భక్తులతో ఆచరించి ఆ దేవిని నిష్ఠతో గొలిచినవారి యింట లక్ష్మీదేవి ప్రత్యక్షమై ధింధిమ్మని తాండవమాడు చుండును.

నారదుడు పల్కుచున్నాడు —

దేవా! ఈ వ్రతము అపూర్వమైనదని తోచుచున్నది. ఇదివరకు కన్నది విన్నది గాదు. ఇది యే పురాణములోనిది? ఈ దివాలదేవి యెక్కడ నుండును? ఆమె నే మాసమం దేతిథినాడు ఏ వారమునా డారాధింప వలయును? ఏ విధముగా పూజింపవలెను, ఈమెకు నై వేద్య నేమి పెట్టవలెను? పూజ సేయునట్టి వారు యెటువంటి నిష్ట గలిగి యుండవలెను? ఈ వ్రతము మిక్కిలి లోకోప కారమైనది. కాబట్టి దీనిని మీరు సమగ్రముగా నా కెఱింగింప వలయును.

బ్రహ్మదేవుడు పలుకుచున్నాడు—

నారదా! నీవన్నట్లిది యపూర్వ వ్రతమే. నేనువెన్నడు విన్నది కన్నది కాదు. దీని విధాన మంతయు మిక్కిలి స్వల్పము. తక్కిన వ్రతములవలె దీనికి మడి స్నానము మొదలయినవి విశేషముగా అక్కర లేదు. ఈ వ్రతము నే జాతివాడైన నాచరింపవచ్చును. దీనికి విఘ్నే శ్వరపూజ పుణ్యాహవాచనము మొదలయిన మంత్రములతో బ్రసక్తి లేదు. సంకల్పము మాత్రమున్నది కాని బ్రాహ్మణులువచ్చి ఆ సంక ల్పము చేయింప నక్కరలేదు. ఎవడిమట్టుకు వాడే ఆ సంకల్పముచేసి కొనవచ్చును. ఈవ్రత మాచరించువాడు దానిని పరమ రహస్యముగా ఆచరింప వలయునుగాని రెండవవానికి చెప్పకూడదు. ఈ వ్రతము

కలిపురాణములో జెప్పబడియున్నది. దివాలదేవియను దేవత కలిపురుషుని మూడవకూతురు. కలిపురుషుడు కమ్కూర్తి అను మహాదేవిని పెండ్లిచేసుకొనగా వారిద్దరికిని యీ దివాలదేవి జన్మించినది. ఈ దివాలదేవి కిద్దరు తమ్ము లున్నారు 1 లోభుడు 2 ద్రోహుడు దివాలదేవి యెక్కడనుండునో వీరిద్దరును అక్కడ ప్రత్యక్షమై యుందురు. దివాలదేవి ఆశ్రితులయందు మిక్కిలి వాత్సల్యముగల దేవత. ఈ దేవతను మనస్సులోనే నిల్పుకొని ప్రార్థింప వలసినదేకాని విగ్రహములు చేసి పూజింప నక్కరలేదు. ఈమెను కొలుచుచున్నట్లు రెండవ మనుష్యుడు తన కెంత యాప్తుడైనను సరే తెలుపకూడదు వెయ్యేల! దేవీ ప్రసన్నము పుట్టుచివర అగువరకు తన భార్యతోగాని, కొడుకుతోగాని, అన్నదమ్ములతోగాని చెప్పకూడదు. కలలోనైన నోరుజారకూడదు. అట్లు నోరు జారి తెలియ జేసిన యెడల దివాలదేవి ఫలమియ్యదు సరేగదా, మీదు మిక్కిలి నష్టిఅణచును. దీని విధానము సంగ్రహముగా జెప్పుచున్నాను వినుము—

ఈ దేవి నారాధించి భాగ్యవంతుడు కాదలచినవాడు కష్టపడకూడదు. ఒకరి దగ్గర నౌకరీ చేయకూడదు. శరీరము నొచ్చునట్టి కూలి పని మొదలగునవి చేయకూడదు. వేషము ఎక్కువగా వేయవలెను వేషముడాబు ఎంత యెక్కువగా నుంటే ఆదేవత కంత యిష్టము మొట్టమొదట యేదో వ్యాపారముగాని వర్తకముగాని పెట్టవలెను. అందు నిమిత్తమై తెచ్చినట్లు అప్పులువిశేషముగా తెచ్చుచుండవలెను. లోకులు అందరు యిచ్చేవడ్డీకంటె యెక్కువ వడ్డీ యిచ్చుచుండవలెను ఎఱకు చేపలు పడినట్లు వడ్డీ యెక్కువ అనగానే, అదివరకు భూమిలో డబ్బుపాతిపెట్టుకొన్నవాళ్ళు పాతులు పెల్లగించి అతనికే బనులిత్తురు. ఆవరకు తక్కువవడ్డీల కిచ్చుకొన్న వాళ్ళు ఆసామ్ము తీసుకొని యీయ

న కేయిత్తురు. వితంతువులు తమ తాలూకు నగలమ్ముకొని యీయన కే సమర్పింతురు.

ఈప్రకారముగా ధదమందరిదగ్గర బదులుపుచ్చుకొనుచుప్రతి నెలవడ్డీ ఆనెల ముప్పదియవ రోజుకే వెండిపళ్లెములో బెట్టి బదులిచ్చినవారి యిండ్లకు కొంతకాలమునరకు పంపుచుండ వలెను. నమ్మకము కుదిరిన తరువాతవడ్డీసరిగా యివ్వనక్కరలేదు. ఈలోపుగా భూములు యిండ్లు కొని భార్యపేరనో అత్తమామల పేరనో వ్రాయించవలెను. గుల్లవస్తువులు కాకుండా బంగారపు కడ్డీనగలు భార్యకు బిడ్డలకు విశేషముగా చేయించవలెను. ఈలాగున వస్తువులు విశేషముగా భార్యకు బిడ్డలకు చేయించిన యెడల దేవికి కనులపండువుగా నుండును. అట్టి వారి మీద దేవికి అనుగ్రహము హెచ్చు. కొట్టులో సరకు తక్కువ యుండవలెను. ఋణ ప్రదాత లిచ్చిన సొమ్మంతయు నగల రూపకముగా గాని కాసుల రూపకముగాని యింట్లోనె యుండవలెను. అప్పు తక్కువగా నున్నపు డొక గుఱ్ఱపుబండి, అప్పు లెక్కువైనప్పుడు జోడు గుఱ్ఱాల బండి యుండవలెను. వ్యాపారము క్షీణించిన కొలది గుమస్తాలు డాబు హెచ్చుగా నుండవలెను. చాటుగా దాచిన రూపాయలు, నగలు యీదేవికి రోజూ నైవేద్యము పెట్టవలెను. దానములు ధర్మములు యెక్కువగా చేయుచుండవలెను. దేవాలయములలోకి తరుచుగా వెళ్ళి కైంకర్యము లెక్కువగా చేయవలెను. మాటలు తేనె తేటలుగా నుండవలెను. శాంతము వినయము నెక్కువచూపవలెను తాను సత్యసంధుడులాగున కనబడుటకై అదివరకప్పు లెగబెట్టిన వాళ్ళను గట్టిగా తిట్టుచుండవలెను. ఇట్లుండగా యీతనిపని క్షీణించు చున్నదని వాడుకపుట్టును. పుట్టగానే అప్పులవాళ్ళువచ్చి యిల్లుచుట్టవేయుదురు. వెంటనే దివాలా దేవత వచ్చి యీయన నావహించును. ఆవహించి యీయనచేత ముద్దినుసు

పలుకులు పలికించును. అప్పులవాండ్రను గౌరవింపక రెండుకాళ్ళుచాపు కొని యీయన కూర్చుండవలయును. ఆ దేవిని చూడగానే అప్పులవాళ్ళుభయపడి గొల్లుమందురు. అప్పుడు జంకక వెనుదీయక మొగమాటపడక సిగ్గుపడక "నాయనా దైవ వశముచేత యీలాగు వచ్చినది. కొట్లోసరకులు మీస్వాధీనము చేసికొని పంచుకోండి" అని చెప్పి సరకులు చూపవలెను. అందుకు వారు వప్పుకోనిపక్షమున ఆమర్నాడే కోర్టుకు వెళ్ళి యిన్సాల్వెన్సీ పిటీషను దాఖలు చేయవలెను. ఇది దివాలాదేవి మహాత్మ్యము. ఇది రామబాణమువలె అమోఘమైనది ఇందుకు సిగ్గు బిడియములు ముందుగానే పడిచివేయ వలెను. దొంగయేడ్పులు యేడ్వవలయును. ఇట్టివి చేతకాని వానియింట దివాలాదేవి అడుగుపెట్టదు. ఈవ్రతము లోకములో రహస్యముగా నుపదేశము చేయుము.

నారదుడు పలుకుచున్నాడు—

మహానుభావా యీవ్రతము అన్ని వ్రతములలో నుత్తమమైనది. ఈలాగ ప్రత్యక్ష ఫల మిచ్చే వ్రతము మరియొకటి లేదు. దీనిని తప్పక యుపదేశించెదను.

---

# చమత్కారసంభాషణ

సోమరాజు—కామరాజుగారూ మీవయసిప్పు డెంతండీ?

కామ—ముప్పదియైదు సంవత్సరములండి.

సోమ—అయిదుసంవత్సరములకిందట మీరు మాయింటికి వచ్చినపుడు మీవయస్సు యెంత అని నేను మిమ్ము అడిగినాను.

కామ — అడిగితే అప్పుడెంతని చెప్పినాను!

సోమ — అప్పుడుకూడా ముప్పదిఅయిదు సంవత్సరము లేయని సెలవిచ్చినారు, అప్పుడు యిప్పుడుకూడ ముప్పదియైదు సంవత్సరము లెట్లుండును. ఆమాటైనా అబద్ధంకావాలి, యీమాటైనా అబద్ధం కావాలి.

కామ — ఏమాటా అబద్ధంకాదు.

సోమ — మీమాటలు మిక్కిలి చిత్రంగా ఉన్నాయి.

కామ — నేను అందరిలాగు అప్పుడొకమాట యిప్పుడొక మాట చెప్పేవాడినికాను. ఎప్పుడూకూడా ఒకమాటమీదేయుండే వాడిని. కనుక ఆలాగుననే చెప్పుచున్నాను.

సోమ — (నవ్వి) మీసత్యసంధత చాలాపసందుగానున్నది. మీకు కలియుగ హరిశ్చంద్రులని బిరుదిచ్చిన చాలా బాగుండును.

కామ — బిరుదులిచ్చేవారు లేరుగాని యిచ్చినపక్షమున నాకంటె తగినవాడెవ్వడు?

సోమ — అయితే మీరిప్పుడీగ్రామ మెందుకు వచ్చినారు?

కామ — కోర్టులో సాక్ష్యమునకువచ్చినాను.

సోమ — మీగ్రామమునుండివచ్చే ప్రతివ్యాజ్యములోను మీరే సాక్షిగావస్తారేందుచేతను?

కామ — మాగ్రామములోకల్లా నేనొక్కడనే గరాణామనిషిని. అబద్ధమాడకుండా సత్యముపలికేవాడినికూడ నేనొక్కడనే. అందు చేత నాయందు గౌరవముగలిగి గ్రామములోనున్నవాళ్ళందరూ, ప్రతి వ్యవహారములోకి నన్నే తీసుకువెడతారు. ఆకారణంచేత నాకు ప్రతి వ్యవహారములో సాక్ష్యమువస్తుంది.

సోమ — అంతేనా ! మీరుడబ్బుపుచ్చుకొని యెరిగినవ్యాజ్య ములోను యెరుగని వాజ్యములోను కూడా కూటసాక్ష్యమునకు వస్తారని ప్రజలు చెప్పుకొనుచున్నారు.

కామ.—అది కేవలం కిట్టనివాళ్లు వేసిన వాడుక కాని నిజంకాదు.

సోమ—మీసాక్ష్యము నమ్మగూడదని వెనుకటిమునసబుగారు గట్టిగా వ్రాసినారట.

కామ—నాసాక్ష్యమన్నమాటేమిటి! బోనులో కెక్కినవాళ్ళందరికి యీపాట్లున్నవే, రెండుపక్షములసాక్ష్యము నమ్మకుగదా? ఏదో యొక్కపక్షమునమ్మి రెండవపక్షము అబద్ధమనకతప్పదు. అంతేకాని మాసాక్ష్య మెప్పుడునిజమే.

సోమ—సరేదానికేమిగాని కామరాజుగారూ మీరు కాశీవెళ్ళినారుకాదా?

కామ—కాశీమాకుటుంబమంతా కలసివెళ్లినాము.

సోమ—కాశీవెళ్లినవారు మిక్కిలి ప్రియమైనవస్తువులేవైనా రెండువదిలిపెట్టి రావలెనట. మీరేవస్తువులు వదలిపెట్టినారు?

కామ—అబద్ధమాడకుండా నిజంచెప్పమన్నారా?

సోమ—అయ్యో! తప్పక నిజమేచెప్పవలెను. అబద్ధమాడమన్నా మీరాడరుకాదూ.

కామ—చెబుతావినండి. నేనుకాశీలో సిగ్గుబిడియములురెండు వదలివేసినాను.

సోమ—మీపెద్దన్నగారు ఏమి వదలివేసినారు?

కామ—మాపెద్దన్నగారు దయాదాక్షిణ్యాలు వదలివేసినారు.

సోమ—మీచిన్నన్నగారో.

కామ—ఆయన పరువుమరియాదలు వదలివేసినారు.

సోమ—మీపెద్దతమ్ముడేమి వదలివేసినాడు?

కామ—వాడు మానాభిమానములు వదిలివేసినాడు.

సోమ—మీచిన్నతమ్ముడు?

కామ—మాచిన్నతమ్ముడు కాశీలో పెళ్ళాముబిడ్డలను వదిలి వేసినాడు ?

సోమ —మీతండ్రిగారేమి వదలివేసినారు?

కామ—మాతండ్రిగారు ప్రాణాలేవదిలివేసినారు.

సోమ—మీతోకూడా కాశీయిందెవరో వచ్చినారట. వారేమి వదిలివేసినారు.

కామ—ఆవచ్చినవారిలో ఒకావిడ మగనినివదిలివేసినది.

సోమ—బాగున్నదండి! కాశీమహాక్షేత్రము వెళ్ళి మిక్కిలి ప్రియమైనవస్తువులు మీలాగున వదిలివేసినవారెవ్వరు లేరు. మీచరిత్ర అద్భుతము. మీయన్నదమ్ములైదుగురిని చూడగా పంచమహాపాతకములు మగరూపము ధరించినట్లు కనబడుచున్నవి.

కామ—ఏమోయిదంతా మీదయ. మేము నిజము చెప్పబట్టి యూరికే మాపేరు వెల్లడగుచున్నదన్నమాటకాని నూటికి తొంబది తొమ్మండుగురు మావంటివాళ్ళే అయినా అబద్ధమాడనివాళ్ళు లోకంలో లేరు, ఇప్పుడు మీచేత అబద్ధమాడిస్తాను చూడండి.

సోమ—ఏదీ యేలాగు ఆడిస్తావో చూతాము.

కామ—నాతోగూడరండి. ఇక్కడికి రాఘవపుర మెంతదూర మున్నది?

సోమ—ఇక్కడికి క్రోశెడున్నది.

కామ—సరే! (అని మరియొకవీధివెళ్లి) ఇక్కడికి రాఘవపుర మెంతదూరమున్నది?

సోమ—క్రోశెడున్నది.

కామ—అదిగో మీరబద్ధమాడుచున్నారు. ఇందాక క్రోశెడున్నదన్నారు. అక్కడినుంచి యిక్కడికి రెండువందల గజములు నడిచి

వచ్చి నాము. ఇక్కడికి కోశెడున్నదా? కొంతదూరము తగ్గలేదా? ఈస్వల్పవిషయములో మీరెందు కబద్ధమాడుచున్నారు ?

సోమ—మీసత్యసంధత్వము బాగున్నది. ఇది లోకములో కనివిని యెరుంగని సత్యసంధత.

కామ—స్వల్పవిషయమైనా అబద్ధమే కాబట్టి మీరు మేము అంతా ఒకటే.

రామ—మీయోగ్యత చాలామంచిదికాని నడవండిపోదాము.



# గోసాయి చిట్కాలు.

నా పేరు కోతలకోనయ్య. కోతలనుటచేత బడాయిమాటలు చెప్పువాడనని మీరనుకొనవద్దు. మాపూర్వులు పూర్వము, అనేక సంస్థానములలో సేనాపతులై మహాపౌరుషవంతులై శౌర్యరాసులై ధైర్యపుపాతరలై రోషపుగాదెలై యుత్సాహపుగోతులై శత్రువులను యుద్ధరంగములలో పట్టిగొంతులు కోయుటచేత మాయింటిపేరు కోతలవారని పౌరుషముచేత గలిగినదని కొందరు పెద్దలు చెప్పుచున్నారు. ఇదిగాక! మరియొక కారణముగూడ కలదు. మాపూర్వులలో నొకరు యజ్ఞములు చక్కగాచేయించుట నేర్చికొని ప్రతిదినము అనేక యజ్ఞ పశువుల గోయుటచేత కోతలవారని మాకుయింటిపేరు కలిగినట్లు మరి కొందరు పెద్దలు చెప్పుచున్నారు. ఎట్లైననేమి కోతలవారన్నది మాకు పౌరుషనామమే. నాకు చిన్ననాటనుండియు వైద్యమునం దభిమాన ము గలదు కావున నేననేకమంది గోసాయీల నాశ్రయించి బహువిధ ములైన చిట్కాల నేర్చికొంటిని. కడచిన ఆదివారమునాడుపట్టి

సూర్యగ్రిహణకాలమందు మహానుభావుఁడైన యొక గోసాయి నాకు మార్కండేయక్షేత్రమున ప్రత్యక్షమయ్యేను. ఆయన నాకంటికేగాని మరియొకరికి కనబడలేదు. ఆయన యెంతసేపు మాటలాడినను నాకొక్కనికేగాని యితరులకు వినబడలేదు ఆయన ఆదినమందే యిక్కడను కోటిపలిలోను కాశీలోను కనబడెను. ఆయనకు ఎనిమిదివందల సంవత్సరములు వయస్సు. ఆయన గోళ్ళు యినుపగునపములంత పొడుగుగా నున్నవి. ఆయన గడ్డము జడలు జనపనారవలె తెల్లనై పాదములను సీలమండలను తాకుచున్నవి. శరీరము పదియారవవన్నె బంగారు చాయగానున్నది. కన్నులకు చత్వారము లేదు. చెవులకు చెవుడు లేదు. పండ్లపటుత్వము తిప్పలేదు. నడిచినాడంటే పదామడైనా అలసటపడకుండ నడుస్తాడు. తిన్నాడంటే ఒక్కమాటునాలుగుశేర్ల బియ్యపన్నము లకోటాకుమెతుకు లేకుండా కొట్టివేస్తాడు. ఆయన యీకాలపు మనుష్యుల నెవ్వరిని యెఱుఁగడు. రాజరాజనరేంద్రుని కాలములోనున్నట్లు చెప్పినాడు. సారంగధరుని నన్నయ్యభట్టును పావులూరి మల్లన్నను బాగుగా నెఱుంగుదునని చెప్పి వారివారెవరైనా యున్నారా యని అడిగినాడు. ఈనడుమ పావులూరి మల్లన్న కాలమును గురించి సందియపడి తగవులాడుచున్నారు. అట్టి సందియములు కలవారీయన దర్శనముచేసి పావులూరి మలన సంగతి అడిగిన బాగుండును. చిత్రాంగి పెళ్ళినాటికీయనకు యిరువదిమూడు సంవత్సరముల ఆరుమాసముల వయస్సట. సారంగధరునితండ్రి, కాళ్ళు చేతులు నరికించినప్పుడు మళ్లీ మొలచుటకై మీననాథమహాముని వ్రాసిన పసరులు, వేళ్ళు యీయనస్వయముగ నెఱిఁగియుండుటచేత వైద్యశాస్త్రములో నీయన కపారపాండిత్యము గలదు. చచ్చిపోయినవారి నీయన బ్రతికించగలడు. బూడిదయైనతరువాత మాత్ర మీయన బ్రితికించలేడు. బూడిద వేడిగానున్న పక్షమున కొందరిని బ్రితికించ

గలడు. ఈయన మీననాథమహామునికి సాక్షత్తు శిష్యుడు. రాజనరేంద్రుడుగారి యింట్లోను దగ్గు రొంప పట్టినప్పు డీయన వైద్యము చేయుచుండెడివాడు. ఈయన ప్రజ్ఞలు ఈక్రింద చిట్కాలవల్లనే సంపూర్ణముగ తెలియగలవు. ఈచిట్కాలు పరమరహస్యములయినవి గనుక, ఉపదేశముపొందనివా రెవ్వరికి జెప్పగూడదు చెప్పినపక్షమున మహాపాతకము పొందుదురు.

—చిట్కాలు.—

1 చిడుముకు చిట్కా—చిడుమురోగమునకు యిటువంటి ఔషధము లోకములో లేదు. పూర్వము భేతాళునకు శరీరమునందు జిలపుట్టినప్పుడు ధన్వంతరి యీచిట్కానే ప్రయోగించెను. ధన్వంతరి చరకునకును, చరకుడు శుశ్రుతునకును, శుశ్రుతుడు వాగ్భటునకును, అతడుమాయోగికిని క్రమముగా నుపదేశించిన చిట్కాయిదియే. ఈజిలకు నాలుగు దివ్యౌషధములుగలవు. మొదటిది పొడుగై దిట్టమై మంచి వాడిగలిగి నూరకత్తి వంటిగోరు. దానికనుపానము సలసల్లా రెడు వేడినీరు. ఈరెండు ఒక్కాలి మైత్రిగలవి. ఏదిలేకపోయినను కుదురదు.

దీనికిపత్యము:—సిగ్గువిడుచుట, సభలోనైన సందేహింపకగోకుట. దీననుపశాంతికాని పక్షమున అనగా అదితామరకింద తేలినపక్షమున చక్కని యిచుపకోరముగాని, గరిగమ్మకాసి, చౌరచేపపొలుకగాని, యివిదొరకనప్పుడు హంసపాదు కాగితముతో తశ్శాంతి చేసికొనవచ్చును. అదియుదొరకనప్పుడు పెద్దతాటి నాశ్రయింపవలెను. గచ్చుగోడలు బొత్తిగా పనికిరావు. ఈచిట్కా కొంతకాలమువరకు ప్రయోగించి చిడుముగలవా రది యెంతవరకు పనిజేసినదో మాకు సమగ్రముగా తెలియజేసినయెడల వారికి తక్కినచిట్కాలన్నియు కరతలామలకముగ నుపదేశించి మహోపకారము చేయుదుము. కాని,

కవరులో మాత్రము ఒక అణాబిళ్ళ పెట్టి పంపించవలెను. అణాబిళ్ళలు పెట్టనియుత్తరములు మంజూరి చేయబడవు. ఇట్లనుటచేత అణాబిళ్లకై మేము వ్రాసితిమనుకొనవద్దు.

ఇట్లు,
కోతల కోనయ్య.

మొలగజ్జి మూలయ్యగారి పైవిలాసము చిత్తగించి కోతల జలగయ్య గారి కుమారుడు కోనయ్యగారికి యిప్పించవలెను.

దురదలూరుపోష్టు, గోకవరం.

కడచినవారమున మాగోసాయిచిట్కాలలో ఒకటియైన చిడుముమందును గూర్చి ప్రకటింపగానే బుద్ధిమంతు లనేకు లామందును సమగ్రముగా ప్రయోగించి దాని పటుత్వమును పరీక్షించి చూచి యటువంటి ప్రశస్తమయినమందు మరియొకటిలేదని మాకు జాబులు వ్రాసిరి. అందొక జాబు నీక్రింద బ్రకటించుచున్నాము—

"మహారాజశ్రీ కోతల కోనయ్యగారి దివ్యపాదారవిందసన్నిధికి:—

లోకోపకారపరాణులై మీరు ప్రకటించిన దివ్యౌషధమును గూర్చి నేను చదువుకొని సంతోషించి దానిని ప్రయోగించి చూచితిని. నాశరీరముమీద చిడుముగాని తామరగాని లేనిస్థలము ఒకఅంగుళమైనను లేదు. తామర ఏలాటిదనగా మాబావమరదులు గేదితామర యని, అంగుళము దళసరియున్నదని నన్ను వేళాకోళము చేయుచుందురు. సాధారణముగా గోళ్ళు తీయించుకొను నలవాటు నాకులేనందున నాగోళ్లన్నియు పారలవలె పదునై పొడుగుగా నున్నవి. మీ యౌషధమునుగురించి చదువగానే నేను సలసలలాడునట్లు నీళ్ళు కాపించి యథావిధిగా మీరుచెప్పినట్లు చేసితిని. అహహా! ఆసౌఖ్యమేమని చెప్పుదును. బ్రహ్మానందమనగా అదియే బ్రహ్మానందము.

కాని స్నానమైనతరువాత రక్తము కాలువలుకట్టినది. శరీరమంతటను భగ్గున మంట బయలుదేరినది. శరీరమంతయు నెఱ్ఱనిగాయములతో నిండుటచేత పుష్పలగుత్తులతో నిండిన తురాయిచెట్టువలె నేనగపడితిని. ఈమంటమాత్రము లేకుండా మీరేదైనా సాధన మాలోచించినపక్షమున మీామందువంటిమందే లేదు. కాబట్టి మాయందనుగ్రహించి తక్కిన గోసాయిచిట్కాలుకూడా ప్రకటింపవలయునని కోరుచున్నాను.

చిత్తగించవలెను,
గేదితామర కిచ్చయ్య,
బరుకులపాలెం.

మేము మహాయోగి నాశ్రయించి నేర్చికొన్న మందుల పటుత్వము శోధించి చూచునట్టి బుద్ధిమంతులు కొందరు దేశమందుండుటచేత దేశము బొత్తిగా గొడ్డుపోలేదని తెలిసికొని మేము చాల సంతసించుచున్నాము. ఇటువంటి మహనీయు లిచ్చుచున్న ప్రోత్సాహముచేత మేము మరింత పూనికగలవారమై తక్కిన గోసాయిచిట్కాలను గూడ లోకోపకారార్థమై ప్రకటింప సాహసించితిమి చిట్కాలలో మొదటిది చిడుముమందుకదా.

రెండవ గోసాయిచిట్కా ధవళకేశనాశిని. ఈమాయకలికాలమందు, అనేకులకు బాల్యమునందే తలవెంట్రుకలు నరయుచున్నవి. మన్మథుడైననుసరే నరసినవెంట్రుకలుండెనా యతనిమీద నసహ్యము పుట్టును. అందుచేత పడుచువారియందరభిప్రాయములను మేము కనిపెట్టి లోకములో తెల్లవెంట్రుకల యాపద లేకుండ చేయవలయునని సంకల్పించి మాగురువైన మహాయోగియొక్క యుపదేశముచేతను మాస్వబుద్ధికౌశలముచేతను, చిరకాలలోకానుభవముచేతను కలిగిన ప్రజ్ఞ అంతయు సమ్మేళనముచేసి బహుదినములు కష్టపడి సోధించు

తెల్లవెంట్రుకలు నాశనముచేయునట్టి యొకగొప్పసాధనమును కనిపెట్టి తిని. ఈపరమహంసక్రియ యేగ్రామములోనైనను దొరకును. కర్చు విశేషములేదు. అది ప్రయోగించినప్పుడు కొంచెము నొప్పిగానుండును గాని రవంతసేపు ప్రాణము లుగ్గపట్టుకొని ఆబాధ సహించినపక్షమున తరువాత మంచిసుఖము కలుగును. కష్టపడినప్పుడేకదా ఫలముదక్కుట! ఈపరమహంసక్రియ యేదనగా తెల్లవెంట్రుకలుగల మనుష్యుడు రెండణాలుపెట్టి ప్రశస్తమైన పటుత్వముగల తంటసము నొకదానిని కొన వలెను. కొనుక్కొని అద్దము ఎదుటపెట్టుకొని తెల్లనివెంట్రుకను గురి చూచి పట్టిదానిని లాగవలయును. తాను స్వయముగా చేసికొనలేని పక్షమున మంగలివానిచేత తీయించవలెను. అబ్బా అనకూడదు. అమ్మా అనకూడదు. అయ్యో అనకూడదు. దీనిని మించినమందు మరియొకటియుండదని మేము పందెమువేసి చెప్పగలము. తక్కిన మందులన్నియు ధనాకర్షణముచేయునట్టి మాయమందులు

మూడవ గోసాయిచిట్కా.

దోమనివారిణి—ఈకాలమునందు పట్టణములలోను పల్లెలలోను ప్రతిగృహమందు దోమలు విశేషముగా నున్నవి, వీటి కాటువల్ల మనుష్యులకు నిద్రపట్టకపోవుటయేగాక మన్యపుజ్వరములు మొదలయినవి వచ్చుచున్నవని గొప్పగొప్ప వైద్యులు చెప్పుచున్నారు. అందుచేత మనమందరము సుఖముగా నిద్రపోయి బ్రతుకవలెనంటే దోమలబాధ నివారణచేసికొనుటవిధి. ఇందుకు మాయోగీశ్వరుడుగారు గొప్ప చిట్కాను కనిపెట్టిరి. అదియేదనగా దోమలున్న గదిలో పండుకొన్న మనుష్యులందరును రెండుమూడురాత్రిలు తెల్లవారువరకు మేలుకొని కుట్టుటకువచ్చిన దోమలనన్నిటిని చేతితోబట్టుకొని ఒకొక్కదానిఒక్కొక కత్తిరపుచ్చుకొని జాగ్రత్తగా వాటిరెక్కలను కత్తిరించివేయవలెను.

ఈరెక్కలమూలముననే అవి యెగిరి మనుష్యులమీద పడుచున్నవి. ఎగురుటకు శక్తిపోగానే ఉన్నచోటునుంచి కదలలేకపోవును. అప్పుడు మనకెంతమాత్రము బాధ కలుగదు.

నాలుగవ చిట్కా.

నల్లులనాశః:—ఈమందుకూడ సకలజనులకు అత్యవసరమే. మంచమున కసలే నల్లులుపట్టకుండ నొకటరెండు విధానములు కలవు. అవి ముందుగా విపరించుచున్నాము. ఇంటిలోనున్న మంచములమీద మనుష్యులు పండుకొనకుండ క్రింద పడుకొన్నపక్షమున మంచములకు నల్లులు పట్టవు. ఇదియొకటి. మంచముతాలూకు కుసులన్నియు నూడ గొట్టించి అటకమీద వేసినపక్షమున అసలేపట్టవు. ఇదిరెండవవిధానము. ఈవిధానము అంగీకరింపక కొందరు మంచముమీద పండుకొన్నపక్ష మున నల్లులు విశేషముగా కుట్టెనా దానికీక్రిందివిధానము చేయ వలెను. మత్కుణమారియని మే మొకరకము తయారుచేసితిమి. మంచ ముమీదనున్న ప్రతినల్లిని పట్టుకొని దానినోరు పగులతీసి సూదిమొన తో నీయరకము రెండుచుక్కలు దానినోటిలో వేసినయెడల అది తక్ష ణమే చచ్చిపోవును. చావకపోయినయెడల ఒకచుక్కయయిన ఖర్చు పెట్టకుండా మామందు మాకు పంపిస్తే బుడ్డికరీదు ఎనిమిదణాలు తిరిగి మీకిచ్చి వేయుదుము. ఈబుడ్డి పోష్టులో వచ్చునప్పుడు మందు వలికి పోయినను బుడ్డి పగిలిపోయినను నష్టము మీ రేయిచ్చుకొనవలెను.

అయిదవ చిట్కా.

పేలకు పిల్లల పిడుగు—ఈమందు ప్రస్తుతము మగనాళ్ళకు మాత్రమే ఉపయోగింప దలచుచున్నాము. సంవత్సరమునకు మూ డణాలు కర్చుపెట్టినయెడల పేలబాధ వదలిపోవును. వెలతక్కువ, ఫల మధికము. కాబట్టి యీచిట్కా నందరు గమనించవలెను. నెలకొకసారి

ప్రతి పురుషుడు తల నున్నగా శుభ్రముగా చలిమిడిముద్దవలె నుండు నట్లు గొరిగించుకొనవలెను. వేలుపుట్టకుండ నుండుట కింతకంటె గొప్ప మందు లేదు ఈవిషయమై యింకా సందేహము లున్నవారు ఈ క్రిందివారికి వ్రాసి తెలిసికొనవచ్చును.

ఇట్లు
కోతుల కోనయ్య
దురదలూరు, గోకవరంపోస్టు,
తామరాడ తాలూకా.

---

# చిత్రమైనతంతివార్త.

రంగము.

రంగపురమునం దొక యిల్లు.

(అప్పుడు జానకమ్మ కనకమ్మ సుభద్రమ్మ ప్రవేశించుచున్నారు)

జాన—కనకమ్మప్పా! మీతమ్ముడుగా రేయూ రెళ్ళారమ్మా! పాపము, సుభద్రమ్మనదినె మాయన్నగారింకా రాలేదని బెంగపెట్టుకొన్నట్లున్నది.

సుభ—నీవు వేళాకోళముగా అన్నావుకాని నాకు మావారు రాలేదని నిజంగా బెంగగానే యున్నది. వెళ్లినపని కాలేదని పైగా సుస్తిగా నున్నదని ఉత్తరము వచ్చినది.

కన—మరేనమ్మా! బొత్తిగా తోచడంలేదు.

జాన—ఏమయ్యాను వెళ్ళారు ఏమిసుస్తీ చేసినది?

కన—బరంపురం వెళ్ళాడు.

జాన—ఏమిపనిమీద వెళ్ళారు?

కన—ఏదో వ్యవహారంమీద వెళ్ళాడు.

జాన—ఏమిసుస్తీ చేసినది?

కన—గ్రహణివల్ల బాధపడుచున్నాడట.

జాన—ఏమైనా కొంచెము నింపాదిగానున్నదా?

కన—నింపాదిగానున్నదనే ఉత్తరమువచ్చినది. కాని దూర భారంకబురు. మేము బెంగపెట్టుకుంటామని నిమ్మళముగానున్నట్టు వ్రాశాడేమో!

సుభ—అందుచేతనే బొత్తుగా తోచడము లేదు. ఈతోచకపోవడానికి సాయం యేవో వెధవపీడకలలు కూడా వస్తూంటాయి. అందుకుచేత మనను మనసులో లేదు,

జాన—పరవాలేదమ్మా జడియకండి నిమ్మళముగా నుంటుంది. వెళ్లినది కొత్తయూరు గనుక నీటిపల్లడిచేసి కొంచెము సుస్తీచేసినది.

సుభ—నీనోటివాక్యాన్ని పెందరాడే నెమ్మళముగా నుండాలిక దమ్మా! చెపితే నమ్మవుగాని జానిక మ్మొదినా, ఒక్క మెదుకు సహించడంలేదు. విస్తరిముందర కూర్చోడంలేవడం ఆయన యెప్పుడొచ్చి కంటపడతానా యని యెంతో బెంగగా నున్నది.

(అని కంట తడిపెట్టును.)

జాన—ఛేశి ఊరుకో వదినే. పునిస్త్రీపడుచువు శుక్రారంపూటా కళ్ల నీళ్ళు పెట్టుకోకూడదు ఆయనకేమి మహారాజులా చక్కా వస్తాడు. ఊరుకోండి. ఇంతకు నెమ్మళముగా నున్నదికదా?

కన—ఊరుకోవే అమ్మా సుఖంమల్లే యేడువకూడదు.

జాన—వెంకటేశ్వర్లుకు మీదుకట్టి మొక్కుకోండమ్మా ఆయన సుంఖంగా వస్తారు.

కన—దానిచేతి కంకణంతీసి మొన్న ఉత్తరం వచ్చినరోజున నే మీాదు కట్టాను.

జాన—అయితే భయమేమున్నది. తప్పకుండా నింపాదిగా ఉంటుంది.

(అప్పుడొక బంట్రోతు టిల్లిగ్రాఫు తీసికొనివచ్చును.)

బం—ఇదిగోనుండమ్మా మీాకు టిల్లిగ్రాఫొచ్చినది.

కన—ఎవరికి నాయనా యెవరికి?

బం—మీాకేనండీ మీాపెద్దబ్బాయిగారికి రంగారావుగారికి వచ్చినది.

సుభ—ఏయూరునుంచి నాయనా యేయూరుండి.

బం—బరంపురాన్నుంచవి తోస్తుంది.

కన—బరంపురాన్నుంచే. అయ్యొ నాతమ్ముడో అయ్యొ నాతమ్ముడో ఇంకేముందర్రా.

సుభ—అయ్యో! నేనేమిచేతునోయి తండ్రీ (అని చదికిలబడుచున్నది.)

కన—అయ్యో తమ్ముడా!బరంవురం యిందుకోసం వెళ్ళావుట్రా నాయనా?

సుభ—కడసారం చూడడానికేనా ప్రాప్తి లేకపోయిందే అమ్మా.

బం—అయ్యో టెలిగాఫు పుచ్చుకోండమ్మా యెవరైనాను.

కన—ఇంకా పుచ్చుకోవడ మెందుకోయి తండ్రీ. సంగతి తెలిసేపోయిందినాయనా.

సుభ—టెలిగ్రాపులో యేముందో మొగంమీాదే తెలుస్తోందోయి నాయనా! నావొళ్ళు దడొస్తోంది నన్నెవరైనా పట్టుకోండోయి అమ్మా. (అంతలో కొంద రమ్మలక్కలు చేరుచున్నారు.)

జాన—అదేదో విప్పి చదవించుకోండర్రా!

సుభ—చదివించడ మెందుకమ్మా వదినా! కొంప మునిగిపో యింది. నావరహాలచెట్టు పడిపోయింది.

కన—ఎంతపాపిష్టి వేళ బయలుదేరాడే అమ్మా! వెళ్ళేటప్పుడు యెవరోకాని తుమ్మారు. కొంచెంసేపు ఆగుమంటే రైలుమించిపోతుం దని వెళ్ళాడు. దాని తుమ్ము నేలబడా, ఎంతపని జరిగిందే అమ్మా!

(అని పెద్దపెట్టున యేడ్చెను.)

కన—బాబ్రమ్మాడెంతమంచివాడె అమ్మా! నేనంటే పంచప్రాణా లుకదా ఇంతకు ఆబ్రామ్మాడి కావూళ్ళో నున్నది మట్టి

సీత—ఆమృత్యు దేవత జుట్టుపట్టుకొని లాక్కెళ్లిందమ్మా ఆవూ రు. ఎవళ్ళకాపదవచ్చినా తన ఆపదలా జూచుకొనేవాడుకదా.

జాన—వీధులోనుంచి యింటిలోకి వస్తూన్నాడంటే ఆడవాళ్ళం తా గజగజ కదా. ఎంతఖాయిదా.

బం—టెల్లిగ్రాపు పుచ్చుకొండమ్మా నేవెళ్లాలి.

జాన—సుభద్ర మొగాని కీపాడు రాత యెక్కడ రాశిందోకాని కలకల లాడుతూ వుండేది. ఆనాలుగు గుల్లలు పెట్టుకొని పసుపు కుం కం రాసుకుంటే మహాలక్ష్మి లా గుండేది.

(అప్పుడు రంగారావు పరుగెత్తుకొని వచ్చుచున్నాడు.)

రంగ—ఏమిటత్రా యింఖంగారు, ఎందుకేడుస్తారు?

కన, సుభ—(రంగారావును కౌగలించుకొని) నాయనా! కొంప మునిగిందిరా యింకేముందిరా బరంపురానుంచి టెల్గ్రాపు వచ్చిందిరా!

రంగా—ఏముంది టెలిగ్రాఫులో? ఏది ఏదీ.

బం—ఇదిగోనండీ టెనిగ్రాపు చింపి చూచుకోకుండానే యేడు స్తూన్నాగు వీరు.

రంగా—ఊరుకోండి. ఊరుకోండి చూస్తూన్నాను టెలిగ్రాపు. ఊరుకోండి.

(అని చదువుకొనుచున్నాడు)

కన—ఎప్పుడు నాయనా పోతా! నిన్నా యీవేళా?

రంగా—ఛీ వూరుకో నీతొందర తగలెయ్యా! ఏమీ భయములేదు. అంతా నింపాదిగానున్నారు.

కన—నింపాదిగా వున్నాడూ నాయనా! నింపాదిగా నున్నాడూ

సుభ—అయితే టెల్లిగ్రాపు యేమిటో చదువు.

రంగా—అందరు సుఖముగా నున్నారు. మనఅమ్మాయికి మంచిసంబంధం కుదిరిందని నాన్నగారు టెలిగ్రాపు యిచ్చారు. సాలుమూలం తెలియక ముందుగా యేడు పారంభించినారు.

కన—జబ్బుగా నున్నమీాదట టెల్లిగ్రాపు వస్తే అదే అనుకొన్నాము.

సుభ—టెలిగ్రాపు అలాంటప్పుడేకాని యివ్వరని నేననుకొన్నాను,

జాని—నే చెప్పలేదటమ్మా నిమ్మళంగా నుంటుందని.

రంగా—చాలు యీాపాటికి: ప్రయోజికత్వముచేశా రూరుకోండి సిగ్గుసిగ్గు.

(అందఱు నిష్క్రమింతురు.)



# ధర్మపరిపాలనసభ

## సభావృత్తాంతము.

ఉత్తమోత్తములైన మన పురాతనధర్మము లన్నిటిని నిలుపుటకును, బొమ్మచెముడుడొంకలవలెను దూలగొండ చెట్లవలెను, పల్లేరు కాయలవలెను దేశములో బయలు దేరుచున్న నవనాగరిక పద్ధతులను ముక్కముక్కలుగా ఖడించి నిర్మూలనము చేయుటకును, ఈసభ జన్మించినది. ఈ సభకు చాదస్తపు చెలయమ్యగారు అగ్రాసనాధిపతిగాను, అప్పవేడ అన్నంభట్లుగారు, ఉపాగ్రాసనాధిపతిగాను, వెఱ్ఱితలల వెంకటదాసుగారు కార్యదర్శిగాను, ఉన్నారు. ఇందులో చర్చింపబడునట్టి విషయము లనేకములు కలవు. ఈసభకు బ్రాహ్మణులేకాని మరొకరు ప్రతినిధులుగా రాగూడదు. ప్రతినిధులు చొక్కాలు కోట్లు మొదలయినవి తొడుగుకొనగూడదు. జాబరాబట్టలుగాని, చిరివేరురంగు వేసిన బట్టలుకాని ధరింపవలెను. తాటియాకుల పుస్తకములేగాని అచ్చువేసిన పుస్తకము లీసభకు పట్టుకురాగూడదు. అవి తెచ్చినపక్షమున, అచ్చుపుస్తకములు వెంటనే చలిమంటలో పారవేయబడును. గోష్పాదమంత జుట్టున్నవారేకాని యిందులోనికి రాగూడదు. గిరజాలుకాని, జునపాలుకాని, పెద్ద జుట్టుకాని యున్నపక్షమున వెంటనే సభలో గొరిగించివేయబడును. ప్రతినిధులుగా వచ్చువారికి మీసము లుండగూడదు. ధర్భాసనములు కృష్ణాజినములు జారీచెంబులు తప్పక తెచ్చుకొనవలయును. ఈసభవారందరు చాపలమీద కూర్చుండవలయునేకాని కుర్చీలమీద బల్లలుమీదకూర్చుండగూడదు ప్రతినిధులకు కావలసిన సదుపాయములన్నియు మేముచేయుచుందుము. ఈసంవత్సరముసభ యెరుకలపాడులో జరుగును. అక్కడన్ని యేర్పాటులు చేయ

బడినవి స్నానమునకై చెరువులేర్పాటు చేయబడినవి-బసలకు విశాలమై నవీధియరుగులేర్పాటు చేయబడినవి, భోజనసదుపాయమునిమిత్తమై అక్కడకువచ్చునట్టిప్రతిమనుష్యుడు అర్ధశేరుబియ్యము, ఉప్పు, మిరపకాయ, చింతపండు ఇంటిదగ్గరనుండి మూటకట్టి తెచ్చుకోవలెను, పూటకు సోలెడుబియ్యముకుకునట్టి యిత్తడిపాత్రగూడ తెచ్చుకోవలెను. అత్తెసరుచేసికొనుటకు పొయ్యిమేము సప్లయిచేయగలము. ఈగ్రామములో పుల్లలుదొరకుటకష్టము-గనుక ప్రతినిధులు వచ్చునప్పుడు త్రోవలో చెట్లనున్న యెండుచిదుకులు వెంటదెచ్చుకొనుటమంచిది. అంట్లు శూద్రులుతోముటచేత స్వహస్తపాకుల ఆచారమునకు భంగముగావున యెవరియంతటవారు తమతప్పేలాలను తోముకొనవలయును. సభజరుపుటకై యొక పెద్దదొడ్డి నేర్పరచినాము. పందిళ్ళువేసినపక్షమున దుర్మార్గులెవరైన సభమీద కిట్టక నిప్పుపెట్టుదురేమో యను భయమున పైనపందిరి వేయక యుంచినాము. సభవిరోధికృన్నామసంవత్సర మార్గశిరబహుళ అమావాస్యనాడు జరుగునుగనుక ప్రతినిధులందరు ఒకరోజుముందుగానె రావలయును. ఎందుకనగా, సభజరుగవలసినదొడ్డి గోతులతోను ముండ్లచెట్లుతోను నిండియున్నది. గనుక అదివారుస్వయముగానె బాగుచేసికొనవలెను- సన్మానసంఘమువారు శూద్రాదిసేవకులచేత బాగుచేయించకలరుగాని బ్రాహ్మణోత్తములు కూర్చుండుస్థలము అపవిత్రమయిపోవునని బాగుచేయించలేదు. మరియు ప్రతినిధులలో స్వార్థత్యాగము కలవారెందరుందురో పరీక్షించుటకుగూడ సన్మానసంఘమువారాపద్ధతి నేర్పరచినారు. మా సభకు వ్యతిరేకముగా మాటలాడదలంచినవారాయూరు రాగూడదు. ప్రతినిధులుచాలమంది వత్తురుగనుక ఒక్కొక్కరు ఒక్కొక్కనిమిషముకంటె మాట్లాడగూడదు. సభవారియిష్టమైనచో అంతకంటె నెక్కువసేపుగూడ మాట్లాడవచ్చును. సభవారియిష్టములేకుండ నొకవేళ

మాట్లాడినపక్షమున అట్టివారు కాళ్ళు చేతులుపట్టుకొని క్రిందకులాగి వే యబడుదురు. సాయంకాలమైనతరువాత సభాభవనమందు పాములు తేళ్ళు జెఱ్ఱులుమొదలయిన దుష్టజంతుసంచారము లుండునుగనుక సూర్యాస్తమయమునకుపూర్వమే సభముగించవలెను.

కార్యక్రమము— మొదటిదినం.

ఉదయం గం 4, 5, ల వరకు నిద్రమేలుకొనుట. 5 మొదలు 5-10 నిమిషములవరకు పాదములుపీల్చుకొనుట 5-11 మొదలుకొని 5-35 లవరకును బహిర్దేశముపోవుట. 5-35 మొదలుకొని 5-40 వర కుధంతధావననిమిత్తమై చెట్లనుండి పుల్లలువిరుచుట 5-41 మొదలు కొని 5-55 వరకు ముఖప్రక్షాళనము 5-55 మొదలు 6వరకు బసలు చేరుట, 6 మొదలు 6-10 వరకు, ఆప్రపేకకొఱకుముల్లీలుతిరిగితెచ్చు కొనుట.

6-10 మొదలు 6-20 వరకు పోయి లలుక్కొనుట, 6-20 మొదలు 6-40 వరకు పుల్లలుకూడా తెచ్చుకొననివారు వంటచెఱుకు తెచ్చుకొనుట. 6-40 మొదలు 6-45 వరకు పిడకల్లో నిప్పు తెచ్చు కొని పోయి రాజేసుకొనుట. పిదప 7 గంటలవరకు స్నానము మడి బట్టలారవేసికొనుట. 7 మొదలు 10 వరకు జపము, వంటచేసికొనుట, శిష్యులు ఊరువెంట మజ్జిగకొఱకు బయలుదేరి తిరుగుట. మరికొం దఱు శిష్యులు పాదము చేయుట. 10 మొదలు 12 వరకు భోజనములు చేయుట. 12 మొదలు 1 గంటవరకు అట్లుతోముట. 1 గంట మొదలు 2 వరకు బసలలోనుండి బయలుదేరి సభదొడ్డికి వెళ్ళుట. 2 మొదలు 4—35 వరకు వెంట్రుకపరీక్ష. అనగా ప్రతినిధులందరు సరిగా గోష్పాదమంత జుట్టుంచుకొని వచ్చినారో లేదో యని శోధిం చుట. ఈశోధన నిమిత్తమై యొక చిన్నయుపసంఘము మేర్పడినది. ఆసు

ఘమువారే యీపరీక్షం జేయుదురు. ఈసభముయొక్క కార్యదర్శి వద్ద అంగుళములగుర్తు వేయబడ్డ యొక కొలపుత్తా దుండును. ఈతా దుతో ప్రతివానిజుట్టును గోష్పాదమంత యుందో లేదో పరీక్షించి చూతురు. గోష్పాదముకంటె యెక్కువ యున్నపక్షమున తక్షణమే యెక్కువయున్న భాగము గొరిగివేయించబడును. 4½ మొదలు 5½ వరకు యీవిధమైన క్షురకర్మ. 5 మొదలు 6½ వరకు అకాలమందు అనగా భోజనానంతరమందు క్షురకర్మ చేయించుకొన్నందుకు ప్రాయశ్చిత్తములు చేయించుకొనుట. ఈప్రాయశ్చిత్తము నిమిత్తము నాలుగుతట్టలఆవుపేడయు రెండుకడవలగోమూత్రమును సిద్ధముచేసి యుంచుదురు. ఇదిబహుప్రయాసముమీద స్వధర్మపరిపాలన నిమిత్తము సంపాదించి సన్మానసంఘమువారుంచినందుకు వారికి ప్రతినిధులు అనేక కృతజ్ఞతావందనముల జేయవలయును. తక్కిన దినముల కార్యక్రమము కూడ నిందుమించుగ నిల్లే యుండును. వెంట్రుకపరీక్ష మొదటి దినమందే మైపోవును గనుక ఆకాలమందు సభ జరుగును.

ధర్మపరిపాలన సభ వెనుక చెప్పబడిన ప్రకారము మొదటి దినమున కార్యక్రమము జరిగించి రెండవనాడు మధ్యాహ్నము రెండు గంటలకు కలిసెను. సభ కలియవలసిన దొడ్డిలో చాలచోట్ల యెండ విశేషముగా నుండుటచే కొందరు సభికులు తాటియాకు గొడుగులు వేసికొనియు కొందరు దర్భాసనములు, కొందఱు కృష్ణాజినములు నెత్తి మీద వేసికొనియు నిలిచియుండిరి. నీడయున్న పట్టున కొందఱు కూర్చుండిరి. ఒకమూలనున్న ఉసిరిక చెట్టుకింద దర్భాసనము వేసి అగ్రాసనాధిపతిగారిని దానిమీద కూర్చుండబెట్టిరి. చల్లబడిన తరువాత క్రమక్రమముగా సభికులు కూర్చుండ జొచ్చిరి. అందఱు సమావేశమైన తరువాత సమ్మానసంఘాధ్యక్షులైన నంగినోటి నారాయణప్పగారు మహా ప్రౌఢిత్ సిట్లుపన్యసించిరి-

ఓధర్మపరిపాలన పరులైన సోదరులారా !

మీకందఱకు స్వాగతము. మీ జారీచెంబులకు మీ కొల్లాయి గుడ్డలకు స్వాగతము. మన పూర్వాచారములకు మన గోమయము నకు మన చాదస్తమునకు పూర్ణమైన ఆయుర్దాయము కలుగుగాక! మహానుభావులైన మీరందరును ధర్మబుద్ధితో బహువ్యయప్రయాసల కోర్చి యింత దూరము వచ్చినందులకు నేను చాలా సంతోషించు చున్నాను. మీకు స్నానములనిమిత్తము, బసలనిమిత్తము, భోజనముల నిమిత్తము అష్టకష్టములబడి తగిన యేర్పాటులన్నియు చేసినాను. మేము చేసిన యేర్పాటులలో నేవిధమైన లోపము లేదు. కాని, ఒకవేళనున్న పక్షమున దానిని క్షమించవలయునని కోరుచున్నాము. ఇక మీసభా కార్య నిర్వాహము చేయుటకై మీఅధ్యక్షుడుగారిని యెన్నుకొనుడు.

అని యుపన్యాసముచేసి ముగించగానే తప్పుల దామోదరయ్య గారును, వంకరమాటల వరదయ్యగారును, నోటివట్టపు నూకయ్య గారును గంభీరభాషణములతో చాదస్తపు చలమయ్యగారి గుణములు వేయివిధముల వర్ణించి, ఆయననగ్రాసనాధిపతిగా నుండుమని కోరిరి. అంతట చాదస్తపు చలమయ్యగారు సభికుల జయజయధ్వనులమధ్య అగ్రాసనాధిపత్యము వహించి యిట్లుపన్యసించిరి—

ఓఅన్నలారా! ఓతమ్ములారా!

నాకంటె యెక్కువ చాదస్తము యెక్కువపట్టుదలగల మహా నీయు లెందరోయుండగా యీగొప్ప గౌరవము నాకుమీరు జరిగించి నందుకు మీకందఱకు వందనములు చేయుచున్నాను. మన ఆచారము లన్నియు అడుగంటి పోవుచుండుటచేత మనధర్మములు నిలుపుటకే యిటువంటిసభ చేయవలసిన యవసరము నేటికివచ్చినది. ఏమిపాపిష్ఠి కాలము వచ్చినదో కాని ఆవుపేడంటే అందరికీ అసహ్యముకదా! ఆవు మూత్రం నెత్తిమీద చల్లుకోవడమే లేనపుడు లోపలకుపుచ్చుకోవడం

లేదని వేరే చెప్పవలయునా ? వీళ్ళిల్లు మాసిపోను. ఈదిక్కుమాలిన నవనాగరికులు కొందఱు పోగై ఆడపిల్లలను అమ్ముకోవడం తప్పని, ఆవుపేడ తినడం కూడదని అతిబాల్యవివాహాలు చేయరాదని వితంతువులకు తలవెంట్రుకలు తీయగూడదని స్త్రీ పునర్వివాహములు కావలెనని యిష్టమువచ్చినట్లల్లా పేలుతూన్నారు. పేలి దేశము పాడుచేస్తూన్నారు. ఆభగవంతు డెక్కడున్నాడో ఇంతమందికి మరిడిజాడ్యములు వస్తాయి. వీళ్ళకు రాగూడదూ? (వినండి, వినండి) పూర్వకాలంలో లంకలో పుట్టినరాక్షసు లందఱూ గూడ జన్మాంతరములెత్తి యీ ప్రకారము నవనాగరికులై పుట్టినారు. వీళ్ళందరికి మీలో మంత్రశాస్త్రములు నేర్చిన మహనీయు లెవరైనాయున్నయెడల ప్రయోగములు చేసి కడితేరిస్తే యెంతో లోకోపకారము జరుగును. వీళ్ళు తేళ్ళు పాములవంటివాళ్ళు గనుక వీళ్లకి హానిచేసినా పాపం లేదు. (వహావా వహావా) ఈనవనాగరికులు చెప్పే మాటలన్నీ మనము తోసిపారవేసి మనము పూర్వధర్మములు నిలపవలెను. సోదెకు వెళ్ళడము తప్పట. అమ్మవారికి మేకలను కోళ్లను బలియియ్యడం పాపమట. ఆడవాళ్ళకు చదువులు కావాలట. నానోటికి తిన్నగా రాప్రుగాని పోయి దగ్గర కూర్చుని వంటేడిశే ముండలకు చదు వెందుకయ్యా ! (వినండి, వినండి) వీళ్ళుద్యోగాలు చేస్తారా, ఊళ్ళేలుతారా? ఇదియెంత పిదపకాలమో కాని ఆడవాళ్ళుకూడా తగుదునమ్మా అని చదువులకు సిద్ధమగుచున్నారు. వీళ్ళ చదువులుతగలెయ్యా! (భళీ, భళీ చెపులొగ్గి వినండి) స్వాములవారి పాదతీర్థము గోచితీర్థము త్రాగడము అసహ్యమట. ఈలాగున గురుధిక్కారం చేసినందుకు వీళ్ళనోళ్ళు పుచ్చిపోవద్దా. కలియుగం కనక వాళ్ళపాపం యింకా పండడంలేదు. ఎప్పటికైనా పండకపోదు. మనవుసురు వీళ్ళకు తగలకపోదు. వివాహములలోను దేవుడు వూరేగింపులలోను బోగము మేళములు పెట్టగూడదట. బోగంమేళం

లేని పెళ్లి యేమిపెళ్ళి. అవకతవక పెళ్లి. ఇంకా యిటువంటి యుత్తమ ధర్మము లనేకము లున్నవి. వీటినన్నిటిని మనము కాపాడవలెను. కొన్ని ధర్మముల పరిపాలించడంలో మనశక్యంగాదు గనుక మనము గవర్నమెంటువారిని సహాయ మడుగవలెను. మనలో నున్నటువంటి అన్నిశాఖలకు అన్నిసభలు ఏఏటా వేసుగా జరిగేటట్లు యేర్పాటు చేయవలెను. ఏలాగనగా, ఆరువేల నియోగులకు ఆరువేల నియోగి మహాజనసభ, నందవరీక నియోగులకు నందవరీకనియోగి మహాజనసభ ఇట్లే తెలగాణ్యపునియోగి మహాసభ, ప్రథమశాఖ నియోగిమహాజన సభ, ప్రథమశాఖవైదికమహాజనసభ, వెలనాటిసభ, వేగినాటిసభ, కాసలనాటిసభ, ములికినాటిసభ, ఆరామద్రావిడసభ, కోనసీమ ద్రావిడిసభ, దివిలిద్రావిడిసభ, పుదూరిద్రావిడిసభ, వైష్ణవులలో వడహాలిమహాసభ, తెంగలిమహాసభ, గోలుకొండవ్యాపారి మహాసభ మాధ్వులలో, మాధ్వమహాజనసభ, కరణీకమ్మవ్యాపారి మహాసభ, ఉండునట్లేర్పాటుచేయవలెను. ఇంతియేగాక క్షత్రియులలో, వైశ్యులలో, శూద్రులలో ఎన్నెన్ని అంతర్భాగములైన తెగలున్నవో అన్నిటికి మహా జనసభలుండు నట్లేర్పాటులుచేసి మనమగ్ర జాతివారమైనందుకు సహా యము చేసి నడిపింపవలయును. వెయ్యేల! దేశమంతటను, వల కెన్ని కన్ను లుండునో శరీరమున కెన్నిరోమ కూపము లుండునో అన్నిసభలుండ వలయునని నాయభిప్రాయము అట్లుండినపక్షమున, ఏశాఖవారి కాశాఖవారుతగిన యేర్పాటులు చేసికొనవచ్చునని నాయభిప్రాయము. ఒకతెగవారు మరియొకతెగవారిని శుభములకుగాని అశుభములకు గాని భోజనములకుగాని తాంబూలములకుగాని పిలవగూడదు. ఇట్లు పిలుచుటవలన ఒకరిచెడ్డ ఆచారములు మరియొకరికి సోకమైలపడిపోదురు, అంతట ధర్మములు చెడిపోవును. కాబట్టి యీసంగతులన్నియు గట్టిగా ఆలోచించి విశాతీర్మానములలోనికి తీసుకురావలయును. ఓమహాత్ము

లారా! భారమాతకడుపున మీరందరు పుట్టినందుకు యీధర్మముల మీరందఱు పరిపాలించి యీసభ వృద్ధిలోనికి దెచ్చి భ్రష్టులుగాక మీరందఱు స్వర్గమును చూరగొనుడు, దూషణ భూషణ తిరస్కారములు శరీరమునకుగాని పరమాత్మకు చెందవుగనుక ఎమ్మెలిని యెవరేమన్నను తిట్టినను పాడుపత్రికలలో వ్రాసినను మొగముమీగ ఉమ్మి వేసినను తుడుచుకొని సిగ్గుభిడియముల వదిలిపెట్టి యీధర్మముల తప్పక కాపాడవలయును.

(అందఱు జయాజయాయని తప్పట్లు కొట్టుచున్నారు.)



# తీరుమానములు



ఈతీరుమానములు సభవారి యెదుట ప్రవేశపెట్టునపుడు, ఆయా పెద్దమనుష్యులు చేసిన యుపన్యాసములను గ్రంథవిస్తరభీతిచే వ్రాయజాలక వట్టితీర్మానములు మాత్రమే వ్రాయుచున్నాము. ప్రతినిధులు విశేషముగా వచ్చుటచేత సందడి హెచ్చెను. అందుచేత నుపన్యాసకుల మాటలు వినబడవను భయముచేత, తీర్మానములను గురించి మాటలాడినవారున్నతాసనమెక్కి మాటలాడిన బాగుండు నని ప్రసిడెంటుగారి ప్రక్కనున్న యొక మొండిగోడ నెక్కిమాటలాడిరి. ప్రతి తీర్మానమును గురించి యుపన్యాసములైన తరువాత సభాధ్యక్షుడు లేచి యిది మీకందఱకు ఇష్టమేనా, యిష్టములేనివారు చేతులెత్తండి యని యడుగగా, అందరు కరతాళధ్వనులతో నైకకంఠ్యముగ సమ్మతించిరి.

## మొదటి తీర్మానము.

కలియుగకాలము పిదపకాలమగుటచేత, ఆడపిల్లలు పదిసంవత్స రములకే యుక్తవయసును చాలచోట్ల పొందుచున్నారు. గావున, ఆ డపిల్లలను ఎక్కువవయసు వచ్చినదాకా ఉంచక రెండుసంవత్సరముల వయసు లోపుగానే వివాహములు చేయవలసిది. మాటలు వచ్చినతరు వాత వివాహము చేసినపక్షమున తలిదండ్రులు యేవంకరటింకర మగ నికి కట్టిపెట్టదలచినను వప్పుకొనక ఈమగడునాకువద్దు, ఈమగడునాకు కావాలి యని ఆటంకములు చెప్పవచ్చును గనుక అట్టిభయములేకుం డా, ఆడపిల్లలకు మాటలు రాకుండా వివాహములుచేయుట ఈసభ వారి ముఖ్యోద్దేశము.

ఈ తీర్మానమును గూర్చి అబద్ధాల అన్నయ్య దీక్షితులుగా రుపన్యసింపగా పచ్చిబూతుల బలరామావధానులుగారు ధృవపరచిరి.

## రెండవ తీర్మానము.

కన్యాశుల్కములు వరశుల్కములు పుచ్చుకొనుట, యిచ్చుట కొన్నిశాస్త్రములచేత దూష్యమైనను తరతరములనుండి పెద్దలాచరిం చుట చేత శిష్టాచారమైపోయినది గనుకను శాస్త్రముకంటె, ఆచార మే బలవత్తరమగుటచేతను, కన్యాశుల్క వరశుల్కములు యిష్టమువ చ్చినవారు యథేచ్ఛముగా బుచ్చుకొనవచ్చును, యివ్వవచ్చుననియు అట్టివారిని ఆక్షేపించినవారిని స్వాములవారితో జెప్పి వెలివేయించవల సినదనియు ఈసభవారి యభిప్రాయము.

ఈ తీరుమానవిషయమై చాల చర్చ జరిగినది. శుల్క మెంతపు చ్చుకోవలెను, అని చర్చవచ్చెను. అనేకులు, అనేకవిధముల అభిప్రాయ మును చెప్పిరి, మొత్తముమీద ఆడపిల్లలకు నెలకొకవంద రూపాయ లు పుచ్చుకోవలెనని చెప్పిరి. అనగా అయిదునెలల పిల్లలకైదువందలు 6 నెలల పిల్లల కారువందలు 10 నెలల పిల్లలకు పదివందలు శుల్కము

పుచ్చుకోవలెననియు మగపిల్లవానికి వరశుల్కముగా ఏడాదికి వందరూపాయలు, అనగా అయిదేండ్ల పిల్లవానికైదువందలు ఏడేండ్లవాని కేడు వందలు పుచ్చుకోవలెనని చెప్పిరి.

ఈతీర్మానమును గూర్చినీతిమాలిన సీలాచలంగారుపన్యసింపగా స్వలాభపుసన్యాసయ్యగారు బ్రుపరచిరి.

మూడవ తీర్మానము

హిందూదేశములో విధవల సంఖ్యఅధికమైపోయి ప్రయాణములు చేసేవారందరికి సరిగా మంచిశకునములు కుదరకపోవుటచేతనున్ను ఈవితంతవు లనుభవించే ఆస్తి వాళ్ళ వాళ్ళజ్ఞాతులకు చిరకాలమునకుగాని సంక్రమించకపోవుటచేతనున్ను, మనదేశములో జనసంఖ్యఅతివిస్తారము అయిపోవుటవల్ల కరువులు మొదలగునవి వచ్చుచున్నవి గావున జనసంఖ్య తగ్గించవలసిన భారము మనపైనున్నది గనుకనున్ను రమారమినూరు సంవత్సరముల క్రిందట దేశద్రోహియైనరామమోహనరాయలు, అతని కుట్రలో కలిసిన యింగ్లీషుఅధికారులును గలసి అన్యాయముగ, అధర్మముగ మాన్పివేసిన సహగమనమును తిరిగి మాదేశములో స్థాపించవలసినదని గవర్నమెంటువారిని పార్లమెంటువారిని యీసభవారువినయవిధేయపూర్వకముగా కోరుచున్నారు.

ఈతీర్మానమును గూర్చి రాతిగుండెల రాజన్నగారును, బండమనసు పల్లయ్యగారును మాట్లాడిరి.

నాలుగవ తీర్మానము.

ఒకనేళ దొరతనమువారు మన అదృష్టలోపముచేత సహగమనమును తిరిగి స్థాపించుటకు వప్పుకోనిపక్షమున "సకేశాంవిధవాందృష్ట్వా సచేలం స్నానమాచరేత్" అని యున్నది. గనుక, అనగా తలవెంట్రుకలతోనున్న విధవను చూచినప్పుడు వెంటనే స్నానముచేసి బట్టలు తడుపుకోవలెననియున్నదిగనుక, ఇప్పుడు వి శేషముగాతలవెంట్రుక లుంచుకొ

నుచున్న యీవితంతువులనుచూచి మాటిమాటికిమనము స్నానముచేయ లేక చచ్చిపోవుచున్నాము గనుకనున్నూ, తలవెంట్రుకల విధవలు వంటలు మొదలైనవి చేయగూడదు గావున శిష్టులైనవారిగృహములలో వంటలు మొదలైనవాటికి ఇబ్బంది గలుగుచున్నది గనుకనున్ను స్త్రీవితంతువు కాగానే, ఎనిమిదేండ్ల వయసున్నా సరే 15పళ్ళ వయసున్నాసరే వెంటనే తలవెంట్రుకలు తీయించివేసివెయ్యవలసినదని ఒకచట్టము గవర్నమెంటువా రేర్పరచవలసినదని యీసభవారును తక్కిన హిందువులును మహజరియ్యవలసినది.

ఈతీర్మానమును గూర్చి మొండివాదముల మూలయ్యగారు ఉపన్యసింపగా తుమరాల జగ్గయ్యగారు ధ్రువపరచిరి.

అయిదవ తీర్మానము

మా దేశములో ఆడవాళ్ళకు చదువుచెప్పుట, అధర్మము. అనవసరము. శిష్టాచారమునకు విరుద్ధమునగుటచేత, ఇకముందుగవర్నమెంటువారు బాలికాపాఠశాలల స్థాపించవలదనియు వెనుక స్థాపించిన పాఠశాలలన్నియు నష్టము గలిగించుచున్నవిగావున క్రమక్రమముగా నెత్తివేయవలసినదనియు గవర్నమెంటువారికి మనమందరము మహజరుల యిచ్చి యీవిషయమై గవర్నమెంటువారు శాసననిర్మాణసభలో గట్టిపనిచేయవలసినదని ఆనరబుల్ సర్ దార్ బహదూరు తిక్కపట్టు తిరుపతిరావుగారికి అర్జీ యివ్వవలసినది.

ఈతీర్మానమును గూర్చి ఆకాశరామన్నగారున్ను, అజ్ఞానపు అంబయ్యగారును మాట్లాడిరి.

6 వ తీర్మానము.

మనుస్మృతి మొదలయిన ధర్మశాస్త్రములలో శూద్రులు బ్రాహ్మణులకు సేవచేయవలసినదే కాని, అంతకంటె మరియొక వృత్తి

యేమీ చేయగూడదని స్పష్టముగా జెప్పియున్నది గనుకను, శూద్రులు బ్రాహ్మణులతో సమానముగాకూర్చుండ కూడదనియు కూర్చున్న పక్షమున కఠినమైన శిక్ష చేయుమనియు నున్నదిగనుకను, శూద్రులకు బ్రాహ్మణులకంటె తక్కువ ఉద్యోగములే గాని యెక్కువ యుద్యోగము లీయగూడదనియు బ్రాహ్మణులు ప్రత్యేకముగా ప్రయాణము చేయుటకై బ్రాహ్మణ రైలుబండ్లుకొన్ని వేయించవలసినదనియు, ఈ సభవారు గవర్నమెంటువారికి విజ్ఞాపన పంపించ వలసినది.

ఈతీర్మానమును గూర్చి కయ్యాల కామయ్యగారును నోటిదుడుకు నూకయ్యగారును మాటలాడిరి.

7వ తీర్మానము.

ఒకవేళ సర్కారువారు ఏకారణము చేతనయినా ప్రత్యేకము రైళ్ళు వేయించక పోవే పక్షమున శూద్రాదులు కూర్చున్న అపవిత్ర స్తలములలో బ్రాహ్మణోత్తములు కూర్చుండుటకు శాస్త్రమొప్పదు గనుక అటువంటి స్థలములలో బ్రాహ్మణులు కూర్చుండుటకు ముందు వాటిని శుద్ధిచేసి కొనుటకై ప్రతిబండిలోను శిందెడు నీళ్ళు, తట్టెడు ఆవుపేడ పడ వేయించ వలసినదని యిందుమూలముగా కోరుచున్నాము.

ఈతీర్మానమునుగూర్చి చాదస్తపు చలమయ్యగారి తమ్ముడైన చెల్లయ్యగారును, ఆచారపు అన్నయ్యగారి తమ్ముడైన అక్కయ్య శర్మగారును మాట్లాడిరి.

8వతీర్మానము.

మాలవాళ్ళను వీధులవెంట ఇప్పుడిప్పుడు మనవాళ్ళు తెనుగు మీరి వెళ్లనిచ్చి నందుకును, నడవనిచ్చి నందుకును మేమెంతో అంత విచారిస్తూండగా, ఇప్పుడిప్పుడు కొందఱు దుర్మార్గులైన నవనాగరికులు ఒయలుదేరి వాళ్ళకి పాఠశాలలు పెట్టించి చదువులు చెప్పిస్తా మం

టూన్నారని కర్ణకఠోరమైన వార్తమాచెవిని బడినది. ఇది నిజమేయైన పక్షమున, ఆలాగు ప్రయత్నములు చేసేటటువంటి వర్ణభ్రష్టుల నంద రిని ద్వీపాంతర వాసమునకు పంపించివేయ వలసినదని యీసభవారు వినయ విధేయతతో సర్కారువారికి మనవిచేసికొను చున్నారు. అలా గు చేయని పక్షమున యీసభవారు, పుత్రమిత్ర కళత్రముగాను, సకుటుంబ పరివారముగాను కృష్ణా గోదావరీ నదులలో దిగదలచుకొ న్నారు గనుక మమ్మలిని ఆత్మహత్యల క్రింద చార్జీలు చేయవద్దని కోరుచున్నాము.

ఈ తీర్మానమును గూర్చి ఉసుకుబోతుతనపు ఉళ్ళక్కిగారును, సాహసము శంకరప్పగారును మాట్లాడిరి.

9 వ తీర్మానము.

ఈసభలోచేరిన ప్రతిమనుష్యుడున్నూ తానుప్రతిదినము ఉద యమునందు ఇష్టమైనపక్షమున నిమ్మకాయంతగాని అధమపక్షము గచ్చకాయయంతగాని కుక్షిపావనం నిమిత్తం తప్పక ఆవుపేడ పుచ్చు కొనితీరవలసినది. గోబ్రాహ్మణేభ్యో అన్నారుగనుక యిదియందరికి ముఖ్యకర్తవ్యము. అదిఒకవేళ వెగటుగానున్నపక్షమున తానుపుచ్చు కోదలచిన ఆవుపేడముద్దంత చింతకాయపచ్చడికాని ఉసిరికాయపచ్చ డికాని కలిపిపుచ్చుకొనవలెను. పెద్దవాళ్ళయినతరువాత యిదిపుచ్చు కొనుట వెగటుగాతోచును గనుక మనపిల్లలకు యికముందుపుట్టేపిల్ల లకు నల్లమందుమాత్రంత గోమయము ప్రతిదినము అలవాటుచేయ వలసినది. ఆవుపంచితముకూడా కుక్షిపావనమేగనుక అది సభలోచేరిన వారందరును ప్రతిదినము ఉదయమునందు ఒకగిద్దెడు పుచ్చుకొనవలెను. వెగటుగానున్నపక్షమున ఈనాటి నవనాగరికపుటుద్యోగస్తులు మును పెప్పుడు అలవాటులేని వెగటు కాఫీలో పంచదారవేసిపుచ్చుకొన్న

ట్లుగానే దీనిలో గూడ పంచదార వేసి పుచ్చుకోవలెను. చిన్నపిల్లలకు గోమయం విధంగానే దీనినికూడ ఉగ్గులో కలిపి పట్టవలెను.

ఈతీర్మానమునుగూర్చి గోతల రుద్రయ్యగారు, చొల్లునోటి సుందరయ్యగారు, చిడుము సీతయ్యగారు ఉపన్యసించిరి.

10 వ తీర్మానము.

దేవాలయములలోను వివాహములలోను వేశ్యాంగనలు కూడదని కొందరు నవనాగరికులు బ్రహ్మరాక్షసులవలె పోట్లాడుచున్నారు. అటువంటివారి మాటలు మన మతిరస్కరించి బోగము వాళ్ళు యీనాడు ఆనాడు పుట్టినవాళ్ళుకారుగనుకను కృతయుగంనుంచి ఉన్నారుగనుకను వాళ్ళని ఆదరించడం శిష్టాచారమనియు దిక్కుమాలిన ఆజాతివారిని పోషించుట భూతదయయనియు ఈసభవారు అభిప్రాయపడుచు వేశ్యాంగనలను దేవాలయములోనికి రప్పించిన్ని పెండ్లింళ్లలో మేళము లోనికిపిలిచిన్ని వాళ్ళను ఉంచుకొనిన్ని యీసభవారందరు వాళ్ళని గౌరవించి ప్రోత్సాహము చేయవలసినది. ఏగ్రామములోనైనా బోగం వాళ్ళు లేనిపక్షమున ఆగ్రామమునకు అప్రదిష్టగావునఆయప్రదిష్ట పోగొట్టుటకై ఆగ్రామంలోవాళ్ళు యితరగ్రామములలోనున్న బోగమువాళ్ళను తీసుకొనివచ్చి వాళ్ళకు విద్యలుచెప్పించి కొందఱు పెద్దమనుష్యులు వారిని ఉంచుకొని మాన్యములిచ్చి వాళ్ళని సర్వవిధములచేత కాపాడవలసినది.

ఈతీర్మానమునుగురించి జులాయి సూరయ్యగారు, పోకిరీ పున్నయ్యగారు తుంటరి దుర్గప్పగారు మాట్లాడిరి.

11 వ తీర్మానము.

మన ప్రసిడెంటుగారైన చాదస్తపు చెలమయ్యగారు లోకోపకారార్థమై అనేక సంవత్సరములు కష్టపడి బహుశాస్త్రముల శోధించి మనకందరకు నత్యంతోపకరమైనట్టియు మోక్షసాధనములైనట్టియు

రెండు మహాగ్రంథములరచియించినారు. అవియేమనగా. వెంట్రుకల మీమాంస ఆవుపేడీయమునను గ్రంథములు, ఇందు వెంట్రుకలమీమాంస జైమినిముని వ్రాసినపూర్వ మీమాంసకంటెను వ్యాసమహాముని రచియించిన ఉత్తర మీమాంసకంటెను ఎక్కువయుపయోగమైనది, ఎక్కువమంచిది. దీనికి నిరక్షరకుక్షి శుంఠయ్యగారు గొప్ప వ్యాఖ్యానము వ్రాసివారు. ఇందు మీసములు తలవెంట్రుకలు ఉంచుకొనుట పెంచుకొనుట మొదలయిన విషయములు గూర్చియు క్షురకర్మ యెప్పుడెప్పుడే యేవిధముగా ఎంతెంతసేపు చేయించుకొవలసినదో ఆవిషయములనుగూర్చియు బహువిరళముగాను విపులముగాను చర్చింపబడి యున్నది. ఆవుపేడీయమందు గోమయముయొక్క మాహాత్మ్యమున్ను అది యేయేకాలములయం దెవరెవ రేయేవిధముగా నెంతెంత పుచ్చుకొవలెనో ఆవిషయమును గూర్చియు చెప్పబడియున్న ఈపుస్తకము లచ్చువేయించుటకై పదివేలరూపాయలు పట్టును గనుక యీసభవా రందరును దేశమువెంట చందాలకు బయలుదేరి పోగుచేయవలసినది.

ఈతీర్మానమునుగూర్చి నిశానిసీలపరాజుగారు, మందబుద్ధి మారెయ్యగారు, ఏమీరాని యెఱ్ఱంరాజుగారు మాట్లాడిరి.

ఈతీర్మానములతో సభ ముగిసెను. చాదస్తపు చెలమయ్యగారు పడినశ్రమకు, ఆయన పాండిత్యమునకు, ఆయనస్వార్థత్యాగమునకు ఆయనలోకోపకారబుద్ధికి అనేకులు పొగడి సభ ముగించిరి. ముందుసంవత్సర మీసభ ముష్టిపురాగ్రహారములో జరుపుట కాగ్రామవాసులు కోరిరి. సన్మానసంఘమువారు చేసిన సదుపాయములకు యేర్పాటులకు చాలమంది వారికి వందనములజేసి సభ ముగించిరి.



# యమలోక వర్ణనము.

(అప్పుడు నారదుడు, వామనశర్మయను బ్రాహ్మణుడు ప్రవేశించుచున్నారు.)

వామన——నారదమునీంద్రా! నమస్కారము. మీ రెక్కడనుండి దయచేయుచున్నారు?

నార—కళ్యాణమస్తు. నేను యమలోకమునుండి వచ్చుచున్నాను.

వామ—మీవంటి మహనీయులుకూడ యమలోకమునకు వెళ్ళవలసిన అవసరమున్నదా ?

నార—దైవానుగ్రహమువలన మేము యమలోకమునకు వెళ్లవలసిన యవసరములేదు. కాని చూడ వేడుకపుట్టి వెళ్ళినాను. పూర్వము ద్వాపరయుగములో యమలోక మొకసారిచూచినాను. అప్పటికి ఇప్పటికి భేదమేమున్నదో తెలిసికొనగోరి యిప్పుడొకసారి వెళ్ళి చూచి వచ్చినాను.

వామ—యమలోక మేలాగున నున్నదండీ?

నార—ఏలాగుననున్నదని చెప్పను. అన్నివస్తువులు మహాభివృద్ధి పొందుచుండవలయుగదా అందుచేత యమలోకముకూడ మిక్కిలి వృద్ధిలోనున్నది.

వామ—వృద్ధిలో నున్న దేమండి. అదిపట్టణమా పల్లెయా?

నార—పల్లె కర్మమేమి. అదికూడ కలకత్తా, లండను, బొంబాయివంటి గొప్పపట్టణమే.

వామ—అబ్బా! అంత పెద్దపట్టణమా?

నార—అంతా యికనంతా! పూర్వము కృతయుగములో చిన్నపల్లె. ఒక నూరుమంది లోపుగ నుండెడివారు. త్రేతాయుగములో రమారమి వేయిమంది యుండెడివారు. ద్వాపరయుగములో రమారమి లక్షజనము. ఈకలియుగములో యమలోకమంతా దురాత్ములతో నిండిపోయినది. నివేశనములు చాలక యెన్నోపేటలు కట్టినారు. చుట్టుప్రక్కల పల్లెటూళ్ళు దానిలో కలిపివేసినారు. ఎన్నివందలో క్రొత్తవీధులు బయలుదేరినవి. ఇంటిమీద యిల్లున్నది. మనుష్యునిమీద మనుష్యుడున్నాడు. ఇప్పటికీ బొత్తిగా చాలుటలేదు.

వామ—అయ్యా! యమలోకపు జనాభా యెన్నడైన తీసినారా?

నార—తియ్యకేమి! అక్కడజనాభా మీ భూలోకపు జనాభావలె పదిసంవత్సరముల కొకసారితీయరు. అక్కడ సంవత్సరమున కొకసారి తీయుదురు

వామ—ఈయేడు జనాభాతీసినారా?

నార—ఆహా తీసినారు. మొన్ననే చైత్రశుద్ధపాడ్యమినాడు తీసినారు.

వామ—ఎంతజనాభా యున్నది?

నార—మీభూలోకములో గతసంవత్సరము ఎంతమంది మనుష్యులు చచ్చిపోయినారో ఇంచుమించుగా అంతమందిమనుష్యులు యమలోకములో నున్నారు. మీరుగాక, అదివరకు ప్రతిసంవత్సరము చచ్చిపోయిన జనమందరిసంఖ్యకూడ చేర్చినపక్షమున యమలోకజనసంఖ్య లెక్కపెట్టుటకు వీలు లేకయున్నది.

వామ—మునీశ్వరా! మీరు అతిశయోక్తులకు ప్రసిద్ధి. అందుచేత మీమాట నమ్మజాలకున్నాను. యమలోకములో అంతజనాభా యున్నదా?

నార—నేను నిశ్చయమే చెప్పుచున్నాను. అతిశయోక్తికాదు. చిత్రగుప్తుడు, అతనిగుమాస్తాలు లెక్కపెట్టలేక నానావస్థలు పడి యేలాగో జనాభా తేల్చినారు.

వామనశర్మ—పూర్వకాలము మీ రెప్పుడైన వైకుంఠము చూచినారా?

నారదుడు—చూడ కేమి. యెన్నోసారులు చూచినాను. అప్పుడు వైకుంఠము పుణ్యాత్ములతోనిండి క్రిక్కిరిసిపోయియుండినది.

వామ—అది యిప్పుడేలాగున నున్నది?

నార— ఇప్పుడు వైకుంఠములో పట్టుమని పదిమందియైనను లేరు. పట్టణమంతయు పాడుగొట్లాడుచున్నది.

వామ—మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. అయితే యమ లోకములో ఎవరెవరు మీకు కనబడినారు?

నార— ఎవరనిచెప్పుదును! అయినను ముఖ్యులను గొందరిని చెప్పుచున్నానువినుము. బంగారు కిరీటముధరించిన మహారాజాధిరాజులు చక్రవర్తులు అందఱు నక్కడనె యున్నారు. రాజ్యచక్రములను తమ చేతులలో బెట్టుకొని గారడివాండ్రవలె త్రిప్పజాలిన మహామంత్రు లనేకులక్కడనున్నారు. గొప్ప గొప్ప యుద్ధరంగములలో శత్రువులని పేరుపెట్టి లక్షలకొలది మనుష్యులను సంహారముచేసిన సేనాపతు లక్కడనె యున్నారు.

వామ—అన్నన్నా! మహారాజులందఱు అక్కడనేయున్నారా? "రాజ్యాంతే నరకం ధ్రువం" అనుమాట నిజమైనదే. కాని పాపము వారెన్నెన్నో దానములుచేసినారు. అగ్రహారము లిచ్చినారు. ఎందరికో వివాహములు చేసినారు. సత్రములు వేయించినారు. ఆ పున్నె మేమై పోయినదో.

నార — వెఱ్ఱివాఁడా! ఒకగోవునుజంపి, పెద్దపులి తాను తిన్నంత మాంసముతిని మిగిలిన దానితో నూరు నక్కలను పోషించును. ఆ రాజులధర్మములు నట్టివే. కాకులనుగొట్టి గ్రద్దలకు వేయుట వలన పుణ్యము కలుగునా?

వామ — చిత్తము. మీరు శెలవిచ్చినది నిజమే. ఇంకను యమ లోకములో మీ కెవరు కనబడినారో సెలవిండు.

నార — పెద్దపెద్ద న్యాయవాదులమని పేరుపెట్టుకొని మత వద్దకు వచ్చిన కక్షిదారులను నాశనముచేయునట్టి ప్రముఖులు వేల కొలది కనబడినారు. ఎక్కడనో యిద్దరు ముగ్గురు తప్ప ఉద్యోగస్థు లందఱు అక్కడనేయున్నారు.

వామ — ఎన్నిమారులు చూచినను సౌఖ్యలేకాని కర్మిష్టులు మొదలయినవారు మీకక్కడ కనబడ లేదని తోచుచున్నది.

నార — (నవ్వుచు) పిచ్చివాడవు. కంటికి నదరుగా కనబడినవారే కర్మిష్టులు. బైరాగులు, వేదాంతులు, సన్యాసులు, బావాజీలు, గోసా యీలు, సాధువులు, యోగులు, బ్రహ్మచారులు అని లోకములో విఱ్ఱవీగిన మహానుభావులందరు యమలోకమునే యలంకరించినారు.

వామ — ఏమి చిత్రము. అట్లయిన కుండలములు వేసికొని శాలు వలు కప్పుకొన్న బ్రాహ్మణోత్తము లెక్కడ నున్నారు?

నార — ఈ బైరాగులపక్కనే వారున్నారు.

వామ — సరే, వీరందరిమాట కేమిగాని వైకుంఠములోనికి వెళ్ళినప్పుడు మా తాతగారు మీ కక్కడ కనబడ్డారా?

నార — మీ తాతగారు నా కక్కడ కనబడలేదు.

వామ — మరెక్కడ కనబడ్డారు కైలాసములోనా?

నార — కైలాసములోనుగాదు యమలోకములోనేకనబడ్డారు.

వామ—అయ్యయ్యో! ఆయన మిక్కిలి బాధపడుచున్నారు గాబోలు.

నార—ఆయన బంధువర్గమంతతోను గలిసి యుండుటచే నంత బాధపడుటలేదు.

వామ - అయ్యయ్యో! బంధువులందఱుగూడ అక్కడనే యున్నారా?

నార—ఆయన పితృపితామహులు పదితరములవరకును గల వారందరు వానితో గలిసియే యున్నారు.

వామ—వాండ్రు తెలివితక్కువవల్ల యమలోకములోనికి వెళ్ళి నారు గాని మేము యమలోకములో బ్రవేశించము

నార—నిజమే, మీరా యమలోకములో ప్రవేశింపదగినవారు కారని అక్కడ కొందరు చెప్పుకొనుచున్నారు.

వామ—ఎవరు చెప్పుకొనుచున్నారు?

నార—చిత్రగుప్తుడు మొదలయినవా రందరు చెప్పుకొను చున్నారు.

వామ—అట్లయిన మాకీనరకప్రాప్తి లేదు గాబోలు!

నార—అవును మీ నిమిత్తమై క్రొత్త నరకములు క్రొత్త యమలోకములు సృష్టింపవలెను గాని యిప్పుడున్న యీ నరకములు యీ యమలోకములు పనికిరావు.

వామ—(తెల్లబోయి) ఏమండీ యీలా గనుచున్నారు.

నార—అనేకము మీరు చేయుచున్న మహాపాతకములకు పాతనరకములు పాతయమలోకములు పనికివచ్చునా? అందుచేత నట్లంటిని

వామ—అట్లయిన నాగతియేమి?

నార—నీ గతి దుర్గతియే.

(అని నిష్క్రమించు చున్నాడు)

వామ—(తనలో) ఈమనమాట నిజ మగునా? ఈయన మాత్రము యమలోకము చూచి వచ్చినాడా? ఈయన కలహామ:లు పెట్టుటకు పెట్టినదిపేరుగదా. అందుచేతనే బెదిరించుటకు నాలుగు కోతలు కోసి యుండవచ్చును. అందువలన నాకు భయములేదు. కాబట్టి నా వ్యాపారము నేను యెప్పటియట్లు సాగించుకొనుచు సుఖముగా నుండవచ్చును.

(అని నిష్క్రమించుచున్నాడు)

---

# అపూర్వనరకము.

## యమధర్మరాజు సభ.

[అంతట యమధర్మరాజు, చిత్రగుప్తుడు పీఠముల పై గూర్చుండి ప్రవేశించుచున్నారు.]

(వారి ఎదుట నొక పురుషునియాత్మ నిలిచియుండును.)

యమ—చిత్రగుప్తుండా? ఎవడు వీడు?

చిత్ర— ఇతండేధనగుప్తుడు. భూలోకములో మధురాపురము వీని కాపురము.

యమ—ఓహో! వీనికథలేనా పరిపరివిధముల చెప్పుకొని మన కింకరులు కడుపులు పగులునట్లు నిన్న నవ్వుకొనుచున్నారు.

చిత్ర—చిత్తము. ఇతడేనండి ఈ మహానుభావుని గాథలు వ్రాయగలవారున్న పక్షమున భారత భాగవతములంతంత గ్రంథము లగును.

యమ — భూలోకములో నీ మహానుభావు డెందుకు ప్రసిద్ధి కెక్కినాడు?

చిత్ర—ఈతడు సకలగుణాభిరాముడు. అన్నిటికిని ప్రసిద్ధికెక్కినాడు?

చిత్రి— ఈతడు సకల గుణాభిరాముడు. అన్నిటికిని ప్రసిద్ధి కెక్కినాడని చెప్పవచ్చునుకాని ముఖ్యముగా లోభత్వమునకు పేరు మోసినాడు. ఈయన పిసినిగొట్టులలో మహాచక్రవర్తి. వారిలో అగ్రతాంబూల మీయనకే యియ్యవలసియుండును.

యమ—అబ్బా! అంత పిసినిగొట్టా.

చిత్రి—ఎంత పిసినిగొట్టో నేను దేవరివారితో మనవి చేయజాలను. ఈ సంగతినిబట్టి గ్రహింపుడు. ఈతడు మృతినొందుటకు ముందు పదునేను దినములక్రిందటనే తన సొమ్మున్న గదిలో తన్ను పండుకొనబెట్టుమని కొడుకులను పీడించి ఆ గదిలో పండుకొనెను. ఆ దినములలో నితని కన్నద్వేషము కలిగినది మంచినీళ్ళు పాలు మాత్రమే త్రాగి జీవించెను. ఈతని రోగము చూడగా గొప్పది. అట్టిరోగముతో నాహారము తినకుండ యెట్లు జీవించెనాయని వైద్యులాశ్చర్యపడి ధనకాంక్షచేత చూచిచూచి ప్రాణములు వదిలిపెట్టలేక అంతకాలము జీవించెనని యభిప్రాయపడిరి.

యమ—గట్టిప్రాణము కాబోలు మంచినీళ్ళతో బ్రతుకుట కష్టముకాదా?

చిత్రి— అతడు త్రాగినవి కేవలము మంచినీళ్ళుకావు మహాప్రభూ! తనపెట్టెలలోనున్న సొంతనగలు, తాకట్టుపట్టిన నగలు, వెండి బంగారు నాణెములు, తన యెదుటకు తెప్పించి యవి కడిగించియానీళ్ళొకపంచపాత్రిలో బోయించి తనకు దాహమైనప్పుడెల్ల నొక్క యుద్ధరిణాడు నీళ్ళు పోయించుకొని త్రాగుచువచ్చెను.

యమ—ఆహా! ఈతని లోభత్వము మిక్కిలి యాశ్చర్యకర మైనది. ఇట్టిలోభిని నేనెన్నడు చూడలేదు. ఇతడు దేవతాసేవల నెన్న డు చేయింపలేదా ?

చిత్ర—చేయకపోవుటయె గాదు. ఒకదేవాలయమునకు ధర్మ కర్తలలో నొకడై కొంతసొమ్ము హరించినాడు.

యమ—సరే, ఇతని చరిత్రముత్తరోత్తరచిత్రముగా నున్నదే. సత్రములైన వేయించ లేదా ?

చిత్రి—సత్రములలో రాళ్లు వేయించలేదా యని యడుగుడు. ఆతడన్నదాన మెన్నడు చేయించలేదు సరిగదా ఒకడు చేయుచున్న వార్త వినుటగూడ నతని కసహ్యమే. ఈతడేడాదికి రెండుసార్లుమాత్రి మన్నదానము చేసెను అవియెప్పుడనగా తల్లిదండ్రుల తద్దినములకు.

యమ—ఆదినములలో సంతర్పణములు చేసెనా?

చిత్ర—సంతర్పణములుకావు. పితృతర్పణములు. ఇద్దరుబ్రాహ్మ ణులకుభోజనము.

యమ—ధనధాన్యవస్త్రదానాదులు చేసినాడా యని వేరలడు గనక్కఱలేదు,

చిత్రి—ఆదానములలో కొంతవరకుచేసినాడు. ఎట్లనగా, అప్పు లు పుచ్చుకొన్నవారు కొంతమంది యెగబెట్టుటచేత ధనదానఫలము కొంత దక్కినది. చాకలివాళ్ళపహరించిన బట్టలచేత కొంతవస్త్రదాన ఫలము దక్కినది. రయితులు మక్తాలో సీయలేక మానుకొన్న ధాన్య మువల్ల ధాన్యదానము దక్కినది.

యమ—(నవ్వుచు.)అట్లయిన నగలుచేయించినపుడు కంసాలి యపహరించిన స్వర్ణలేశముచేత నితనికి స్వర్ణదానముకూడ దక్కి యుండును. ఇతనికి దారపుత్రులున్నారా?

చిత్ర—ఉన్నారు. వారికొక నాడైనా కడుపునిండ అన్నము పెట్టలేదు. కట్టుకొనుటకుగుడ్డ లియ్యలేదు. వెయ్యేల ! వీడు తాను తినలేదు. ఒకరికి పెట్టలేదు. ఒకరినితిననియ్యలేదు

యమ—వీనియందు జారత్వచోరత్వాది దోషములు కలవా ?

చిత్ర—చోరత్వమునకు సందేహములేదు. కాని జారత్వములేదు. ఎందుచేతననగా దానికై కొంతసొమ్ము వ్యయముచేయవలయునని యావృత్తిమానుకొన్నాడేకాని కాంక్షలేకకాదు.

యమ—పోనీ లోభత్వముచేతనైనను వీని కేకపత్నీవ్రతము దక్కినది.

చిత్ర—ఈవిధముగా నితనికి చాల ఫలములు దక్కినవి. ఇతని పిసినిగొట్టుతనమునుగురించి పలుమాటలు చెప్పనక్కరలేదు. ఇతడు చనిపోవుటకుముందొక మరణశాసనము వ్రాయించెను. అదిచూచిన పక్షమున వీనియౌదార్యము తేటపడగలదు.

యమ—ఏదీ ఆమరణశాసనము. ఇటువంటివాడు వ్రాయించినది చిత్రముగానుండకపోదు.

చిత్ర—ఇదిగో చదువుచున్నాను. వినండి. "వర్తమానవ్యవహారిక చాంద్రమాన ప్రభవనామసంవత్సర చైత్రశుద్ధ పంచమిబుధవారం మధురాపుర నివాసియైన ధనగుప్తుడు తెలివితేటలతోను మంచి స్పృహతోను వ్రాయించిన మరణశాసనము.— నేను వడ్డీవ్యాపారముచేతను మరియితరవ్యాపారములచేతను సంపాదించిన రొక్కము రెండు లక్షల యిరువదియైదువేలు. ఈసొమ్ము నాకుమారులు నలుగురుసమానముగ పంచుకొనవలెను. ఈసొమ్ము లోకులకు నూటికి రెండురూపాయల వడ్డిచొప్పున బదులుయిచ్చియున్నాను గనుక ఆబదుళ్ళు త్వరగా యివ్వనియెడల వాళ్ళకొంపలమ్మించి చెఱసాలలకు పంపించి వసూలు చేసుకొనవలెను. నావద్ద అప్పులు పుచ్చుకొనవాళ్ళకు, ఒకగుడ్డిగవ్వ

మైన నేను మూనివేయుట నాకలవాటులేదుగావున నాకొడుకులు
కూడా బాకీవారులు యివ్వవలసిన సొమ్ములోనుంచి యొకదమ్మిడీయైన
మానగూడదు. మూనినపక్షమున వాళ్ళు పరమదుర్మార్గులై నాకు,
నావంశమునకు అపకీర్తి తెచ్చినవారగుదురు. ఇవ్వవలసిన సొమ్ములో
కొంతమానివేయుట నా యింటవంట లేనియాచారముగనుక యిదిమొ
దలుకొని నాకొడుకులు చేయకూడనిపని. నేను చనిపోవునట్టిసమయము
నకు నాకుపూర్తిగస్పృహయున్నపక్షమున ఇల్లుమైలపడిపోకుండ నేనే
యేలాగునోడేకి వీథిలో అరుగుక్రింద కూర్చుందును. నాకొకవేళ
స్పృహలేకపోయినపక్షమున నాకొడుకులును నాభార్యా నన్ను సాయ
ముపట్టి యింక రెండుమూడుజాములకు చనిపోదుననగానే దొడ్డిలో
నున్న పశువులపాకలోగాని లేక వీధియరుగుక్రింద తడికకట్టిగాని
దానిలోనన్ను పండుకోనబెట్టవలసినది, అంతేకాని యిల్లు మైలపరచ
వద్దు. నక్షత్రము మంచిదికాదని యిల్లువదిలిపెట్టవద్దు. నాది గ్రుక్కెడు
ప్రాణము. ఎక్కడపోయినను పోవచ్చును ఇంటిలోచచ్చినవాని గొప్ప
యేమిటి? అరుగుక్రిందచచ్చినవాని తక్కువయేమిటి? ఇట్లేలనుచు
వ్రాయుచున్నాననగా నక్షత్రము చెడ్డదైనపక్షమున నిల్లువదిలిపెట్ట
వలెను. వదిలిపెట్టినపక్షమున మనసామానంతయు తరలించుకొని మరి
యొకరింటికివెళ్ళవలెను. వెళ్ళినపక్షమున మనవస్తుసామానులు మన
సరుకులు చూడగానే కన్నుకుట్టును. మనగుట్టూమట్టూ బయలుపడు
ను. డబ్బిచ్చి శవవాహకులచేత నన్ను మోయించవద్దు. వాళ్ళు నాలు
గువరహాలో, యైదువరహాలో పుచ్చుకొందురు గనుక వాళ్ళను పిలవనే
వద్దు. బంధువులుకొందరు వచ్చి ఉచితముగానే శవము మోయుదు
మందురు. అదికూడ అంగీకరించవద్దు. ఏలయనగా ఇట్లుచితముగా
మోసినవారు మరియొకప్పుడు సాయముచేయుమని నాకొడుకులను
మొగమాటపెట్టుదురు. అందుచేత నాశవమును మరియొకరిచేత మో

యించక నాకొడుకులు నలుగురిలో పెద్దవాడు నిప్పుపుచ్చుకోగా మిగిలినముగ్గురు కష్టపడి యేలాగో యొకలాగు మోయవలసినది. దానములు విశేషముగా ఇయ్యవద్దు. ఒక్కగోదానముమాత్రము చేయవలెను. ఏలాగోయొకలాగు దానివల్లోక దొరకబుచ్చుకొని వైతరణీ నదిదాటి ఆవలపడతాను గోదానంనిమిత్తమై నేనొకగోవును జాగ్రత్త చేసియుంచినాను. అది గడ్డి యెక్కువతిని పాలు తక్కువయిచ్చే కోటు తన్నుగల పసరముని దానిని మనయింట్లో నుంచక నేను మనకు సొమ్ము బాకీయున్న యొకగొల్లవానియొద్దకుపంపి దానిని మేపుమని చెప్పినాను. వాడుచితముగా మేపుచున్నాడు. వానినడిగి తెచ్చి ఆయావును గోదాన మియ్యవలెను. నగ్నప్రచ్ఛాదనమిచ్చునపుడు పట్టిమంచములు దూదిపరుపులు నియ్యక నులకమంచము, జమ్ముదూదిపరుపు, పాతయిత్తడిరేకుచెంబు, యియ్యవలెను. సంతర్పణ లెప్పుడు చేయించవద్దు. నాకు వైద్యము చేసిన వైద్యునకు మీరేమియు నియ్యనక్కరలేదు. ఏమనగా నాకు కుదరలేదు గనుకను, వేరుముక్కలతోను కషాయము తోను మందులిచ్చుటవల్ల అతనికి కర్చులేదుగనుకను, వానికియ్యవసిన దేమియు లేదు. రాజగోపాలస్వామివారి యాలయమున కీయవలసినదని యొకముసలమ్మ నాచేతికి నాలుగువందలరూపాయలిచ్చినది. ఈసొమ్ము దేవునకిచ్చినపక్షమున తినువారు పూజారులేకదా, మనము దేవునిబిడ్డలమే మనముమాత్రమేల తినకూడదని యాసొమ్ము నావద్దనేయుంచి దానివడ్డీతో అప్పుడప్పుడు దేవునికి కైంకర్యములు చేయించుచుంటిని. నాకొడుకులుకూడా ఆప్రకారమే పులిహోరమీద ధ్యానముపోయిన పుడు సాలుకు, ఒకరూపాయకుమించకుండా కైంకర్యము చేయించవలెను. నాదగ్గర సొమ్మునదాచుకొన్నామని కొందరువచ్చి నాకొడుకుల నడుగవచ్చును వారువచ్చినపుడు పత్రములు చూపించుడని నాకొడుకు లడుగవలెను. పత్రములులేనివారికి దమ్మిడీయివ్వవద్దు. పత్రములున్న

వారికి లెక్కచూచి, అంత మొత్తము నొకసారియియ్యక అప్పుడో నాలుగు అప్పుడో నాలుగు చేతిలో బెట్టి బాకీలేదనిపించవలెను. తాకట్టు మీద, తనఖామీద నేగాని అప్పులీయవద్దు. నూటికి రెండు రూపాయలు తక్కువవడ్డి వేయవద్దు. తిండికింద బట్టలక్రింద విశేషముగా సొమ్ము ఖర్చుపెట్టవద్దు. చుట్టములు వచ్చినపుడు తప్ప కూరలు కొనకూడదు.

యమ—అహాహా! ఇటువంటి మరణశాసనము వ్రాసినవా డెవడు లేడు ఇతని కొడుకులు, ఇతని యాస్తినే పంచుకొన్నారా యితని గుణములగూడ పంచుకొన్నారా?

చిత్ర—ఈతని ధనము మాత్రమే కొడుకులకు సంక్రమించినది కాని గుణములు పూర్తిగా కొడుకులను సంక్రమించలేదు.

యమ—సరే! ఈతని విషయములో వినవలసినదంతయు విన్నాము. తెలియవలసినదంతయు తెలిసినది. ఈతని నేనరకములో మన ము పడవేయవలసియున్నదో యాలోచింపవలయును.

చిత్ర—మన లోకములోనున్న పాతనరకము లేవియు వీనికి పనికిరావు. ఈతని కేదైన అపూర్వమైన నరకము మనము కల్పించ వలయును.

యమ—ఆనరకమేదో నీవే యాలోచించి చెప్పుము.

చిత్ర—అదే యాలోచించుచున్నాను.

యమ—నీబుద్ధి కేదైన తోచకట్టినదా?

చిత్ర—ఆహా యొకటి తోచకట్టినది.

యమ—అది యేదో త్వరగా చెప్పు. నేను వినుటకు కుతూహలపడుచున్నాను.

చిత్ర—([illegible])

యమ—(నవ్వి) వహవ్వా! ఇది మిక్కిలి బాగున్నది. ఇంత కంటె పనికి ఘోరమైన నరకము వేరే యొకటి యక్కరలేదు. వీని యాత్మను త్వరగా భూలోకమునకు మనకింకరులచేతికిచ్చి పంపు.

చిత్ర—ఓరి కింకరులారా! ఈలోభివానియాత్మను మరల వానియింటికి గొనిపోయి కొంతకాల ముంచుడు. ఇది ధర్మరాజుగారి సెలవు.

కింక—చిత్తము.

(అందరు నిష్క్రమించుచున్నారు.)



రంగము 2.

(మధురాపురము—లోభివానియిల్లు.)

(అప్పుడు లోభివానియాత్మ, యమకింకరులు ప్రవేశించుచున్నారు.)

ఆత్మ—(తనలో) ఏమిది! ఈయిల్లు నాయిల్లేనా? నేను చచ్చిపోయి యిప్పటికింకా సరిగా నెల కాలేదుగదా. ఇంతలోనే యీయింటికింత క్రొత్తసూపేలరావలెను. పరమనిర్భాగ్యులైన నాకుమారులు పదిపది హేనురూపాయలు కర్చుపోయి దీనికంతకు వెల్లవేయించి నారు కాబోలును. అందుచేతనే దీని కీక్రొత్తకళ వచ్చినది. పాడుపోకులు నిర్భాగ్యులకు. నెలలో పదిపది హేనురూపాయలు తగులబెట్టిన యీ నిర్భాగ్యులెన్నడైన బాగుపడుదురా? వీళ్లు అడుక్కుతినిపోదురు. ఛీ! పరమదౌర్భాగ్యులు. గోడలు తెల్లగానుంటేనేమి నల్లగానుంటేనేమి. నేనీయింట్లో అరవయిసంవత్సరములు కాపురముచేసినాను. వెల్లవేయకుండా బ్రతికినాను. ఈగాడిదలకు యింతలోనే వెల్ల కావలసివచ్చినది. నాకడుపున యెంతనిర్భాగ్యులు పుట్టినారు. ఇదిగో ఈగదిలో నా పెద్ద

కొడుకు కూర్చుండి యెవరితోనో మాట్లాడుచున్నాడు. నేను బ్రతికి యుండగా నావద్ద, అప్పుపుచ్చుకొన్న కాంచనవర్మ తానీయవలసిన అసలీఫాయిదాలు తెచ్చి యిచ్చుచున్నాడు. ఆహాహా సొమ్ముచూచి యెంతకాలమైనది. నాకన్ను లిప్పుడెంత చల్లగా నున్నవి. అహాహా! రూపాయల చప్పుడు విని యెంతికాలమైనది. ఏమి టామాటలేమిటి చెప్పుమా ? నూటికి రూపాయ వంతున వడ్డీ పుచ్చుకొమ్మని వాడు బ్రతిమలాడుచున్నాడు. నాకొడు కేమనునోగదా? నేను నూటికిరెండు రూపాయల చొప్పున వడ్డీ వ్రాయించితిని. నాకొడుకు మెత్తబడు చున్నాడు. అయ్యో, అదిగో రూపాయికాడికి యెంచి పుచ్చుకొను చున్నాడు. ఛీ! నిర్భాగ్యుడా ఛీ పాపాత్ముడా! ఛీ పితృద్రోహీ! వీడు నాకొడుకుగాడు. అయ్యో నాసొమ్మా! అయ్యో నాధనమా! అయ్యో నాలక్ష్మీ, కాళ్ళుచేతులూవచ్చి యెగిరిపోవుచున్నావటే. అయ్యో నేనిది భరింపజాలను. అయ్యో! కింకరులారా నన్ను తీసికొనిపొండి. అయ్యో! ఆ యమధర్మరాజు నన్నెనరకములోనైన బడవేయక యిక్కడికెందుకు పంపినాడు. ఆనరకము లన్నిటికన్న నాకిదే బాధగానున్నది. ఇదే మహా నరకము. అయ్యో నన్ను రక్షించండి. రక్షించండి. కింకరులారా. కట కటా! అదిగో నారెండవకొడుకు గుఱ్ఱపుబండి యెక్కి వచ్చుచున్నాడు. రెండువేలు కర్చుపెట్టి బండి కొన్నాడు. ఈయపాత్రునకు బండి కావ లెనా! ఈయపాత్రుడు నిష్కారణముగా నెలకు నలుబదిరూపాయల వడ్డీ పోగొట్టినాడు. ఛీ వీడికడుపు కాలా? ఇదిగో నామూడవ కొడుకు వంటయింట గూర్చుండి మామిడిపండ్లతో పిండివంటలతో భోజనము సేయుచున్నాడు.

ఆహాహా! జొన్నసంకటి గోంగూరపులుసు తినక వీడికింత సం కటమేమి? వీడాగర్భ శ్రీమంతుడా! వీడికి రుచులు కావలెనా? వీడికి మామిడిపండ్లతో భోజనమేమి. పిట్టపికులు నెట్టైక యింతసింగా

రము యిన్నిరుచులు కావలెనా? ఇంతగంజికూడు చాలదా? వంద యెనిమిదిరూపాయలు పెట్టి మామిడిపండ్లా. అయ్యోయో నేనెంతని ర్భాగ్యుడను. ఇదిగో నానాలుగవ కొడుకు, ఓహో యేదోధర్మకా ర్యము నిమిత్తము నాలుగువందలు చందాయిచ్చుచున్నాడు. నాలుగు వందలే! నాలుగువందలే చందా? నీధర్మముమండిపోను, నీచేతులుపడి పోను, ఈలింగశరీరముతో నేనుండుటచేత వీరితోమాటలాడుటకు వీలు లేదు కాని లేకపోతే, ఆచేతులు విరుగగొట్టుదునుకదా? నేనుబ్రతికి యుండి నాకొడుకులు నలుగురు చచ్చినయెడల నాసొమ్మంత్రోజాగ్ర త్తగానుండి నాకొంపయెంతో బాగుపడునుకదా! అల్లాజరిగినదికాదు. దైవము ఓర్చినాడుకాడు. అయ్యోయ్యో! నేనిక్కడనిలువజాలను. ఈయి ల్లుఅగ్నిహోత్రముకంటె ఎక్కువవేడిగానున్నది. నాకొడుకులలో నొక రికైన నాగుణములబ్బినవికావు. అయ్యోయ్యో! ఈగుమ్మముముందర ముష్టివేయుటకొక నౌకరునుబెట్టి బియ్యము కర్చుచేయుచున్నారు. అయ్యో! ఇంటినిండ నౌకర్లు వంటలక్కలు. ఓరీ దర్భాగ్యపుముండకొ డుకులారా! ఇంతమంది లోకములో చచ్చిపోవుచున్నారు. మీకుచావు వచ్చినది కాదురా. సింహపుకడుపున లేళ్ళుపుట్టినట్లు నాకడుపున మీరు పుట్టినారు కింకరులారా నన్నుగొనిపొండు నేనిక్కడ నిలువజా లను.

కింక—(తమలో) లోభివానికి తనసొమ్ముకర్చగుచుండగా చూచుటయే నరకమనుభవించుట. అందుచేత నేవీని నేనరకములోను పడవేయక వీనికొడుకులు చేయుకర్చు వీనికిచూపించినపక్షమున వీడుమ హానరకమనుభవించినట్లు బాధపడునుగనుక అదియే వీనికి శిక్షయని చిత్రగుప్తులుగారు యమధర్మరాజుగారితో రహస్యముగా సెలవిచ్చి నారు. ఇదే అపూర్వనరకము. కాబట్టి మనము వీనిని యమధర్మరాజు గారిసన్నిధికి మరల తీసికొని పోగూడదు. ఇక్కడనె కొన్నివత్సరము లుంచవలయును.

సమాప్తము.

# విచిత్ర గోదానప్రహసనము

(అప్పుడు రామనాథుడనుగ్రామాధికారి ప్రవేశించుచున్నాడు.)

రామ—(తనలో) ఈ యూరికి నేను గ్రామాధికారినైనందున నన్నుజూచినను గ్రామదేవతను చూచినను ప్రజలకు సమానభయమే. గ్రామదేవతకన్న యొకవాసి నన్నుజూచినప్పుడె భయమెక్కువ. ఇంత చండశాసనుడనైన నాకు నేటికాలమునకు నిష్కారణముగ నొక కూపాయ దండుగవచ్చుచున్నది. ఈ దండుగ నేనెట్లు పోగొట్టు కొందును చెపుము? ఈదండుగ లేకుండ చేసికొనుటయే నా ప్రయోజ కత్వము.

(అప్పుడు గోపీనాథుడు ప్రవేశించుచున్నాడు)

గోపి—నాన్నగారూ! ఏమిటివిచారించు చున్నారు. ఆవును గురించియేనా? ఆవు బ్రతుకదు. మెడ వాలవేసి పండుకొన్నది. పొట్ట ఉబ్బిపోయినది. చొంగలు కార్చుచున్నది. ఇంతకు మనకు ప్రాప్తము లేదు. "ఋణానుబంధరూపేణ పశుపత్నిసుతాలయాః" అన్నాడు గనుక ఋణము తీర్చుకొన్నది దానికి మనకు ఋణము చెల్లిపోయినది. విచారించకండి.

రామ—నాయనా! గోవుకోసము నేను విచారించుటలేదు. ఏమనగా దీనిని నేను డబ్బుపెట్టి కొనలేదు. గొల్లరంగడుగాడిని బెదరించి యుచితముగా దెచ్చినాను. దీనిమేతవిషయమై నేనొక్క డబ్బ యినా యెన్నడు కర్చుచేసి యెఱుగను. ఉలవలు వీరిశెట్టి నెత్తికొట్టి పుచ్చుకొన్నాను. చిట్టు తవుడు దంపుళ్ళవాళ్ళను బెదిరించి లాగినాను. గడ్డి రయితులమీద వంతువేసి తెచ్చినాను. ఈయావు పోయినయెడల మరియొక ఆవును రేపు ఉదయమున తేగలను.

గోపి—నాన్నగారూ! అయితే మీ కింత విచారమెందుకు? పాపము గోవు బాధపడుచున్న దనియా?

రామ—గోవుబాధ నేను చూచినానా యేమిటి. నా బాధ నేను పడుచున్నాను.

గోపి—ఆ బాధయేమిటో చెప్పండి. రేపటినుండి పేడనీళ్ళకు ఆవుపేడయుండదని బామ్మ చాలా దుఃఖపడుచున్నది. మీ దుఃఖము యేమిటో సెలవియ్యండి వింటాను.

రామ—ఇదిగో విను చెప్పుచున్నాను మన మీ గ్రామమున కధికారుల మగుటచేత యెవరియింటనయినను గోవు చచ్చిపోయినప్పుడు దానిని వెట్టివాళ్ళచేత మనము ఈడిపించినందుకు చచ్చిపోయిన గోవుయొక్క యజమాని మన కొక్క రూపాయ కట్న మిచ్చుట మామూలై యున్నది. గోవు మనయింటనే పోవుచుండుటచేత, మనకు రూపాయ యిచ్చువారెవరు లేరు. చచ్చిన ప్రతి యావుకు మనకొక రూపాయవంతున రావలెనుగదా. ఈ యావుకు రావలసిన రూపాయ పోయినదిగదా యని నాకు మిక్కిలి విచారముగా నున్నది. ఈ యావు పోతే పోయినదిగాని రూపాయి వచ్చేసాధనము కనబడకున్నది. నీబుద్ధి కైదైన పొడగట్టునేమో చూడు.

గోపి—నిజముగ నిది మనము విచారింపవలసిన విషయమె. పెద్దలు తమకే తోచనపుడు, ఈ యుపాయము నాకు తోచగలదా? అయినను నాకీ యుపాయము తోచుచున్నది. బాగున్న పక్షమున మీ రుపయోగింప వచ్చును. (అని చెవిలోఁ జెప్పుచున్నాడు.)

రామ—వహావా! భేషైన ఉపాయమురా? నా కొడుకు వైనందుకు నన్ను మించినవాడవైనావురా! "పుత్రాదిచ్ఛే త్పరాజయం" అనుమాట నీ యందు సార్ధకమైనదిరా? వెంటనే పిలిపించు.

కాదుకాను. నీవే వెళ్ళి తీసికొనిరా? ఎందుకంటే చెప్పను. నీవు వచ్చే లోపున నేను స్నానముచేసి కూర్చుంటాను

గోపి—సరే యిప్పుడేవెళ్ళివస్తాను,

(ఇద్దరు నిష్క్రమింతురు.)

---

## రంగము 2.

(అంతట గోపినాథుఁడు, నరసింహదీక్షితులు ప్రవేశింతురు)

గోపి—నరసింహదీక్షితులుగారూ! ఒడ్డుమెరక పల్లముగా నున్నది. మెల్లిగా మెట్లెక్కండి. పెద్దలు. కాళ్ళు తడబడగలవు.

నర—మెల్లిగానే అడుగులు పెడుచున్నాను. భయంలేదు. కొంచెం చత్వారమన్నమాట గాని పటుత్వముతప్పలేదు. ఏరీ మీ బాబయ్యగారేరి?

గోపి—అదిగో మడిగట్టుకొని కూర్చుండి యున్నారు. మీ నిమిత్తమే యెదురుచూచు చున్నారు.

రామ—దయచెయ్యండి నరసింహదీక్షితులుగారూ! నమో న్నమః.

నర—అఖండైశ్వర్యాభివృద్ధిరస్తు. ఎందుకో సెలవయిందవు. కార్యమేమో చెప్పుమంటే అబ్బాయిగారు సెలవిచ్చినారుకారు. మా మీదేదో అనుగ్రహమే అనుకుంచున్నాను.

రాము—ఈ గ్రామమంతలోను తమవంటిపెద్దలు సాధులు లేరు. తమకు గోదానము చేయవలయునని బుద్ధిపుట్టినది. తమరు స్నానము చేసి వచ్చినారా?

నర—చేసివచ్చినాను. చేసివచ్చినానండి. అహాహా! ఏమి తమ యోగ్యత. తమ కీర్తి చంద్రప్రకాశమునలె లోకములో వెలుగుచున్నది

గదా. సాక్షాత్తు రాములవారివంటివారు. దానకర్ణులు. నన్ను పోషించు చున్న ప్రభువులేమీరు. అందుకనే యింత దయ.

రామ—ఆవు దొడ్డిలో నున్నది. దానిని యిక్కడికి తీసికొని రావడమెందుకు. సంత్రము చెప్పండి. ధారాదత్తము చేసెదను.

నర—అక్కరలేదండి. (అని మంత్రము చెప్పను.)

రామ—(చేతిలో నీళ్ళు వదులుచున్నారు.)

నర—గోవు నొకసారి చూడనా?

రామ—చూడ నక్కరలేదు. నే నిప్పుడే మీ యింటికి పంపించెదను. మీరు వెళ్ళండి నల్లమందు వేళ యైనది.

(అందరు నిష్క్రమింతురు.)

---

## రంగము 3

(నరసింహదీక్షితులు, రామనాథము ప్రవేశించుచున్నారు.)

నర—రామనాథంగారూ! చిన్నమనవి. ఎందుచేతనోగాని మీరుదానముచేసిపంపినగోవు మెడవాల వేసి పడిపోయినదండీ. కడుపు వుబ్బినదికూడాను దానివాలక మెంతమాత్రము బాగుగలేదు.

రామ—భయపడకండి కాస్సేపటికో కూస్సేపటికో తగ్గిపోతుంది. ఉదయమున మావాళ్ళు చిట్టు విశేషముగా పెట్టినారు. అందుచేత కడుపునొప్పివచ్చి ఆలాగున భాధపడుచున్నది. అంతియెగాని మరి యొకటిగాదు. అదెంతో మంచిగోవు. పోట్లు తన్నులు లేవు.

నర—మంచిదేగానండి, అది మరణవేదన పడుచున్నట్లు తోస్తుందిగాని నాకు జబ్బువచ్చినట్లు తోచడంలేదు.

రామ—పిచ్చిమాటలాడకయ్యా వెంటనేవెళ్ళి గొల్లనుబ్బడిని పిలిచి చికిత్స చేయించండి.

నర—(తనలో) ఈమహానుభావుడేదో కుత్రిమముచేసినాడు. గట్టిగా మాటాడుదామంటే గ్రామాధికారిగనుక భయము. (ప్రకాశముగా) చిత్తము అలాగేచేస్తాను. (అని వెళ్ళును.)

రామ—(తనలో) సరే. ఈబ్రాహ్మణునివల్ల మనకు నూపాయి తప్పకుండావస్తుంది. అబ్బాయీ గోపినాధము యిల్లారా!

గోపి—(ప్రవేశించి) ఎందుకు బాబయ్యా?

రామ—మాదిగవాళ్ళకోసము కబురంపించు.

గోపి—ఆవు చచ్చిపోయినదా యేమిటి.

రామ—పోలేదు సిద్ధమైనది.

గోపి—పోకుండా నేనా ప్రయత్నమంతాను.

రామ—నీవు వాళ్ళను పిలిపించే లోపు నేపోతుంది.

గోపి—అయితే నేనేవెళ్ళి పిలుచుకొనివస్తాను. వర్తమానము పంపుటకు మనుష్యులెవ్వరూ లేరు. (అనివెళ్ళును.)

(అప్పుడు విచారముతో నరసింహదీక్షితులు ప్రవేశించుచున్నారు.)

నర—(తనలో) ఈముండాకొడుకు తనయింట్లో గోవు చచ్చిపోవుట కిష్టములేక చావునకు సిద్ధముగానున్న యవస్థలో దానిని నాయింటికి పంపించినాడు. నాకొంపకు వచ్చినతరువాత జామైనా బ్రతుకలేదు.

రామ—ఏమి దీక్షితులుగారూ! ఎల్లాగున్నది గోవు?

నర—(కన్నీరుతో) పోయిందండీ.

రామ—ఎంతసేపైనది?

నర—ఇప్పుడిప్పుడే.

రామ—గొల్లసుబ్బిగాడిని తీసికొనివచ్చి మీమైనా వైద్యము చేయించినారా లేదా?

నర—లేదండి. వెళ్ళవలెనని అనుకుంటూవుండగానే పోయినది.

రామ—(కోపముతో) ఎవడు చెప్పినాడయ్యా నీకు. ఆలస్య మమృతంవిషం అన్నమాట యెరుగవు. మాణిక్యమువంటి గోవును నిష్కారణముగా చంపివేశినావు.

నర—నేనాండి నేనాండి చంపినవాడిని. చిత్తం చిత్తం. తమరు అల్లా సెలవిస్తే నేనేమి మనవి చేయును. అది నాయింట్లో గడ్డిపోచ కైయెన కొరక లేదు. గుక్కెడు నీళ్ళయిన తాగ లేదు.

రామ—తినకపోతేమాత్రం శుభ్రమైనగోవును నేనునీకుదాన మిచ్చితిని. మేతయెక్కువై దానికి కడుపునొప్పివస్తే గొల్లవాడికి పావలో బేడో యివ్వవలసివస్తుందని వైద్యముచేయించక దానిని నిష్కారణముగ చంపి యీకామాట్లాడుతావు. ఇంతికక్కరితి బ్రాహ్మణుడ వని తోస్తే దానము నీకియ్యక మరియొకరికిస్తును.

నర—ఎంతమాట యెంతమాట. గోవు మావాకట్లో చచ్చిపోయినందుకే విచారిస్తుంటే యీయపనిందకూడానా నామీద. గొల్లవాడిని తీసికొనివచ్చుటకైన వ్యవధి లేనిదే నేనేమి చెయ్యనండి.

రామ—మీరు బ్రాహ్మణులన్న పేరేకాని పచ్చికసాయిల వంటివారు. మీకు జంతువంటే దయాదాక్షిణ్యములు లేవు.

నర—ఇంతకు నారోజులు బాగుగ లేవు. మీచిత్తమువచ్చినన్ని అనండి. పాపము పుణ్యము పరమాత్ముడు పాలించగలడు. తమరధికార్లు గదా. తమరేమన్నసరే. దాన్ని అవతల పారవేయించండి యేలాగో.

రామ—రూపాయ యివ్వండి పారవేయిస్తాను.

నర—(తెల్లబోయి) రూపాయా. ఇం తన్యాయమెక్కడనైనా యున్నదండి.

రామ—అవకతవక ప్రసంగాలు చేయకు. డొక్కబద్దలుచేసేను ! అన్యాయమా! కామధేనువువంటి గోవును చేతులార చంపి మామూలుగా...

నర—ఒక్కపూట పాలైన త్రాగలేదుగదా! రూపాయ నిష్కారణము నాకు దండుగపెట్టించడం న్యాయమా.

రామ—మామూలు తప్పించడం న్యాయమా. ఈవేళ నీకు మానితే రేపుఊరందరికి మానవద్దా. నీకుమానుటకు నీగొప్పయేమిటి

నర—గొప్పయేమీ లేదు. మీవాకట్లో చచ్చిపోవలసినగోవు మాహాకట్లో చచ్చిపోయినది.

రామ—ఆమాటంటే జాగ్రత్త! తగినట్లు బుద్ధిచెప్పిస్తాను.

నర—పోనియ్యండి పెద్దవాడిని పిల్లలుగలవాడిని గనుక వదలి వెయ్యండి.

రామ—ఊరంతా పెద్దవాళ్లే. ఊరంతాపిల్లలుగలవాళ్ళే.

నర—అషైతే యేంజెయ్యవని సెలవు.

రామ—రూపాయి తెచ్చియివ్వమని సెలవు. రెండోసెలవు లేదు.

నర—రూపాయిఉంటే వారంరోజులు నాకు నాపిల్లలకు బియ్యమువస్తాయి. నన్నుక్షమించి మాసివెయ్యండి

రామ—ఆమాటలు తీసివెయ్యండి ఇంటికివెళ్ళి రూపాయ పంపండి.

నర—(లేచితనలో) నారాయణ నారాయణ ఇంతఘోరకలి ఇంతదుర్మార్గము యెక్కడాలేదుగదా. వీడురాక్షసుడుగానిమనుష్యుడు గాడు. ఇప్పుడుచెంబో మఃంతో తాకట్టుపెట్టి రూపాయ వీడియొచాన్ని పారవెయ్యాలి. (అని వెళ్ళబోవును)

రామ—దీక్షితులుగారు రూపాయి పంపుతారాలేదా?

నర—చిత్తము ఇప్పుడేవెళ్ళి బదులు తెచ్చి పంపుతానండి. (అని వెళ్ళును.)

రామ—(తనలో) ఇక్కడను పంకల్పసిద్ధుడనైనాను.

(అప్పుడు గోపినాధుడు ప్రవేశించును.)

గోపి—బాబయ్యా నూదిగవాళ్ళు వచ్చినారు.

రామ—సరే రూపాయిపంపగానే దీక్షితులుగారింటికి వెళ్ళి దాన్ని తీసుకొనిపొమ్మను.

గోపి—ఆలాగే చేస్తాను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

రంగము 4. యమలోకము.

(యమధర్మరాజు, చిత్రగుప్తుడు, రామనాథముయొక్క ఆత్మ, కొందరు కింకరులు ప్రవేశము.)

యమ—చిత్రగుప్తుడా వీడెవడు?

చిత్ర—దేవా! ఇతడు భూలోకములో రామనాధమనుపేర బరగిన యొక బ్రాహ్మణుడు. పాపములపాడను గ్రామమున కధకారి.

యమ—వీడుచేసిన పాపపుణ్యములు చూచినావా?

చిత్ర—దేవరవారు పాపములేయని సెలవియ్యవలెను. వీడున్న చోట పుణ్యములమాట తలపెట్టకూడదు. పాపము.

యమ—ఓరీ! నీవేమి చెప్పుకొనియెదవు?

రామ—నేనడిగిన ప్రశ్నకు మీరు ముఖ్యముగా జవాబుచెప్పవలెను. నీవు పాతయముడవా కొత్తయముడవా?

చిత్ర—(తెల్లబోయి) ఇదియేమిప్రశ్నరా మూర్ఖుడా.

యమ—(ఆశ్చర్యముతో) యమలోక సృష్టియైనతరువాత, ఇటివంటి ప్రశ్నవేశిన దిట్టరియెవడు లేదు.

చిత్ర—యుగయుగంబులనుండి నేనిక్కడ నుద్యోగముచేయుచున్నానుగాని యింతవాని నెన్నడు పొడగట్టి యెఱుగను.

యమ—ఓరీ నీమాట కర్థమేమి ?

రామ—మీ యధికారములో అన్యాయము లెక్కువ జరుగు చున్నందున మిమ్ము నుద్యోగమునుండి తీసివేసి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు క్రొత్తయమధర్మరాజు నేర్పరచినారని వినియున్నాను. అందుచేత నీవు క్రొత్తయముడవో పాతయముడవో తెలియ జేయవలయు. అంతవరకు మీకు విచారణచేయుట కధికారము లేదు.

చిత్ర—అందుకిప్పు డేమని యెదవు ?

రామ—ఏమందునా ? బ్రహ్మ విష్ణు మహేశ్వరులను పిలిపించి వారియెదుట ఈయనయే నిజమైన యమధర్మరాజని ఋజువుచేయిం చవలెను.

యమ—అంతవరకు నిన్ను మేము విచారింపగూడదా ?

రామ—ఎంతమాత్రము వల్లగాదు. మీరు బలవంతముగ శిక్షించిన పక్షమున అది యన్యాయపుశిక్ష యగును.

చిత్ర—(యమునితో) మన మెవ్వరిని యన్యాయముగ శిక్షింపగూడదు. కాబట్టి మనమిప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులవద్దకు వెళ్ళి యీవివాదమును పరిష్కరించుటయే మంచిది.

రామ—ఏలినవా రాపరికారముగా న్యాయము దయచేయవలెను.

యమ—సరే! మనముముగ్గురము వారిసన్నిధికి వెళ్ళుదము రండు.

చిత్ర—వారి ముగ్గురను మన మెక్కడ చూడగలము ?

యమ—ఇప్పుడు సాయంకాలము కావచ్చినదికదా ? సాంబమూర్తివారు ప్రదోషకాలమున కైలాసపర్వతముమీద తాండవనృత్యము చేయుదురు. అదిచూచుటకై బ్రహ్మ విష్ణు లక్కడకు దయచేయుదురు, అప్పుడు వారిని మన మేకముగ చూడవచ్చును. రండు. (అని పోవుచున్నారు.)

రంగము 5. కైలాసపర్వతము.

(అప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు యమధర్మరాజు చిత్రగుప్తుడు గామనాథము ప్రవేశించుచున్నారు.)

విష్ణు— యమధర్మరాజా! చిత్రగుప్తుడును ఒకపురుషుని యీయాత్మయు వెంబడింపగా నీవిందేల వచ్చితివి? నీవేదో పనిమీదనే వచ్చినట్లు గనపట్టుచున్నది.

బ్రహ్మ— పనిలేకుండ తనపని చెడగొట్టుకొని యితడిక్కడి కేల వచ్చును?

యమ— చిత్తము పనిమీదనె వచ్చి యున్నాను. ఈపురుషుడు మహాపాపి. వానిపాపములకై నేను శిక్షింప దలచుకొనగా నీవు నిజమైన యముడవుకావు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నిన్నుద్యోగమునుండి తప్పించినారు. అది తేలువరకు నన్ను విచారణ సేయవద్దు అని పలికినాడు.

బ్రహ్మ— ఏమి వీనిసాహసము.

విష్ణు— నిన్నెవ్వరును తీసివేయలేదు.

మహే— ఈపురుషు డపూర్వ సృష్టికర్తలాగున కనబడుచున్నాడు.

చిత్ర— వీడపూర్వసృష్టికర్తయే. వీడు చేసిన తప్పుసృష్టులు వందల కొలది గలవు.

యమ— ఓరీ వినుచున్నావా? నాయధికారము వారు తొలగించలేదట. నేనే నిన్ను విచారణ చేసెదను.

విష్ణు— ఈనిర్భాగ్యునిమాటనమ్మి నీవు పనిచెరుపుకొని యింత దూరము రావలయునా? ప్రతివాడు లేనిపోని వంకలేవో పెట్టుచుండును. నీవొక్కపూట యధికారము సేయుగలవా?

యమ—అన్యాయము చేసినవాడ నగుదునేమోయను భయమున నిట్లుచేసితిని. ఇక ముందు చేయను.

రామ—(యమునితో) చిత్తము మీరే విచారణ చేయండి. (తనలో) ఇప్పుడే దైన గట్టియుపాయ మాలోచించవలెను.

యమ—చిత్రగుప్తుడా ! వీనిపుణ్యపాపముల లెక్కవేసిచదువు.

చిత్ర—పాపములేగాని పుణ్యములులేవని యిదివరకే మనవి చేసినాను. సెలవైనచో జాబితా చదివెదను.

రామ—అన్యాయము చేయవద్దు. నేనొక పుణ్యముచేసినాను. గోదానం చేయలేదా ?

చిత్ర—ఓరీ నీగోదానమండా! బ్రాహ్మణునియొద్ద రూపాయ లాగుటకై వచ్చిన గోవును దానముచేసినావు.

రామ—ఏదైనా గోవుదానము అగునా కాదా ?

యమ—ఛీ వీనితో వాదమెందుకు తీసికొనిపోయి మహానరకములో పారవేయుడు.

రామ—మహాప్రభూ మనవి మనవి. చిత్తగించండి. చిత్తగించండి.

విష్ణు—వినుచున్నాము నీమనవిచెప్పుకో.

రామ—చిత్తగించండి మహాప్రభువులారా ! బ్రహ్మ విష్ణు మహేశ్వరులగు త్రిమూర్తులలో నొకరి దర్శనము చేసినను బ్రహ్మహత్య గోహత్య గురుహత్య స్త్రీహత్య శిశుహత్య మొదలగు మహాపాపములు నశించి జన్మరాహిత్య మగునని పురాణములు ఘోషించుచున్నవి. అట్లుండ త్రిమూర్తుల దర్శనము ఏకకాలమున జేసిన నాకు మరల నరక ముండవచ్చునా ?

బ్రహ్మ—ఇది నిజమే.

విష్ణు—వీనియుక్తి మిక్కిలి బాగున్నది.

మహే—దొంగలకు టక్కరులకు ఈవిధమైన యుక్తులు సహజమే.

చిత్ర—ఏమి సెలవు?

యమ—ఈధర్మసందేహము త్రిమూర్తులే తీర్చవలయును.

త్రిమూర్తులు—వీనికి నరకము లేదు. మోక్షమే.

చిత్ర—పరమపాపాత్ముడు తప్పించుకొనిపోయినాడు.

రామ— నా యుక్తియే యమలోకములో గూడ నాతల కాపాడినది.

బ్రహ్మ—నోరున్న తలగాచును. ఇకపోదము రండు.

(అందరు పోవుచున్నారు.)

---

# కనకయ్యపంతులు కంతి

(అప్పుడు దామోదరయ్యగారు, గంగాధరుడుగారు ప్రవేశించుచున్నారు.)

దామో—గంగాధరుడూ' నీవు చెప్పినట్లు చిన్నప్పటి రోజులే రోజులు.

గంగా—అటువంటి రోజులు మళ్ళీ మనజన్మములో రావోయి. కనకయ్య పంతులుగారు చదువు చెప్పడం మనము చదువుకోడం బలే షోకుగా వుండేదికాదూ.

దామో—మన పంతులుగారు కంతి గోకుకోవడం తోటే కాలము వెళ్ళబుచ్చేవారుగాని మనకు చదువు చెప్పుటకు తీరికలేక బాధ పడేవారు.

గంగా—(నవ్వుచు) అవును పాపము. నడుము దగ్గర నిమ్మ కాయంత కంతి యుండేది. కుడిప్రక్కను పొదుము కాయంత యెడమ ప్రక్కను పొదుముకాయంతకంతి యుండుటచేత రెండు ప్రక్కలను రెండు పొదుముకాయలు దోపుకొనినట్లు లోకులు భ్రమపడుచుండేవారు.

దామో—కంతి నిమ్మకాయంత కాదు. వెలగకాయకంటె పెద్దదిగానుండేది.

గంగా—కాదబ్బాయి. నిమ్మకాయకంటె పెద్దదికాదు. ఏ మాత్రమో చూపువాసి తక్కువే యనుకోవచ్చును.

దామో—సరిలే. నీవు తిన్నగా యెప్పుడూ చూచినట్లు కన బడదు.

గంగా—చూడలేదూ? బాగా చెప్పావు. కంతి వులార మెత్తి నప్పుడు గోకిగోకి తన చేతులు నొప్పిపెట్టగా నాకు పెద్దగోళ్ళున్నవని నన్ను పిలిచి నాచేత గోకించుకొనేవాడు. నే నెఱగనూ?

దామో—చాలుచాలు లే. నేనుమాత్రము గోకలేదూ? ఎంతో, అసహ్య పడుచూ విధిలేక గోకపోతే చిల్లరతాడు వుచ్చు కొని వీపు చిట్లకొడతాడని భయముచేత ఏలాగో గోకేవాడిని. బాగా పట్టెడు కంతి, వెలగకాయకంటె ఏమాత్రమో చూపువాసి పెద్దగాని చిన్నగాదు. రెండు నిమ్మకాయలంత కంతి యుండేది.

గంగా—ఓరే నీ వాదనలు మొదటినుండి యీలా అడ్డదిడ్డము గానే యుంటాయి. అంతా అద్వయితమే నీ వాదము. యతంటే ప్రతి.

దామో—అడ్డ దిడ్డ వాదన నాదా నీదా! ఎరగనివాడవు యెరగనట్టుండకుండా పెద్దపెద్ద కోతలు కోస్తావు. నీకోతలు నా దగ్గర పనికి రావు.

గంగా—మరే నీదగ్గర కోతలుకోస్తే పెద్ద బహుమాన మొస్తుందని కోస్తూన్నాను. వెధవ వేలాపన పేలకు.

దామో— వెధవ పేలాపన? నీవే వెధవవు పదిమాట్లు.

గంగా—నీవు వెధవన్నర వెధవవు. నోరు మూయి. చెంప కాయలు తినేవు.

దామో—చెంపకాయలా! ఎవడురా కొట్టేవెధవ. ఎడం కాలు చెప్పుచ్చుకొని కొడతాను మళ్ళీపేలు ఆ పేలాపన.

గంగా—కొట్టకపోతే నీవు బ్రాహ్మణుడవుకావు కొట్టరా. నిర్భాగ్యపు ముండాకొడకా,

దామో—బ్రాహ్మణార్థాలుచేసి వాళ్ళ కొవ్వెక్కి ఉన్నావు. కొవ్వుతీస్తానురా, యిపతలకురా!

గంగా—నేను దొంగసాక్ష్యాలిచ్చి డబ్బు సంపాదించుకొనడం లేదు. సిగ్గుమాలిన వెధవ. కోర్టులో నలుగురూ ఛీ ఛీ యని నీ మొగముమీద దుమ్మేశారెరగవూ.

దామో—నేనేమి గోడలు దుమికి చెంపకాయలు తినలేదు. పదిమంది ఆ వేళరాత్రి మెవరిమీద ఉమ్మి వేశారో తెలుస్తూనే యుంది. మన పరువు ప్రతిష్టలు వేరే చెప్పుకో నక్కరలేదు.

గంగా—నీ పరువు ప్రతిష్టలు మాత్రము మెక్కువ మండి పోయినాయా యేమిటి! నీ వంశముకొద్దీ వస్తున్నాయి నోటమ్మట మాటలు

దామో.—ఓరీ భడవా! వంశము జోలికి వెడతావురా (అని గుద్దు చున్నాడు.)

గంగా—గుద్దుతావురా తుంటరి ముండా కొడకా! (అని మరల గుద్దుచున్నాడు)

దామో—(కరచు చున్నాడు)

గంగా—(రాయితో పన్నూడ గొట్టుచున్నాడు.)

(అప్పుడు పదిమంది చేరి వదిలించుచున్నారు.)

గంగా—(వగర్చుచులేచి) కుక్కముండాకొడుకు చూడండి యెల్లా కరిచాడో.

దామో—నీకన్న కుక్కయినా నయమే. నా పన్నూడ గొట్టినావు. రక్త మొస్తూంది. నే చార్జీ యిస్తాను.

గంగా—నన్ను కరిచావు. నెత్తురొస్తోంది. మనిషికాటుకు మందు లేదన్నారు. నేను చార్జీయిస్తాను. జందెములు తెంపినావు. నేను వెళ్ళి జందెములు వేసికోవాలి.

(అని నిష్క్రమించు చున్నారు.)

రంగము 2.

(అప్పుడు దామోదరుడు, సదాశివుడు ప్రవేశించుచున్నారు.)

దామో—ఒరే సదాశివుడూ! ఈవిషయములో నీవు నాకు గట్టి సహాయము చేయవలెను. గంగాధరుడుగాడు చాలా పొగరెక్కియున్నాడు. వాడి పొగరు మనమంతా కలసి అణచివేయవలెను నేను గంగాధరుడుమీద చార్జీ యిచ్చినాను గనుక నీవు నాతరపున సాక్ష్యం పలుకవలెను. నీఋణం నేనుంచుకొనను.

సదా—ఋణానికేం గాని మీరు సెలవిచ్చిన తరువాత మరి యొకలాగు చేస్తానా? గంగాధరుడుకూడా తనతరపు సాక్ష్యమునకు రమ్మని నన్ను చాలా మొగమోట పెట్టుచున్నాడు.

దామో—వాడి మొగమోటము మీ కేమున్నది.

సదా—అంతచేటు లేదుకాని కొంచె మున్నది. వాడి దగ్గర వెనక పదిరూపాయలు చేబదులు పుచ్చుకొన్నాను. అది యివ్వలేక పోయినాను. ఆ మొగమోటముచేత నేను వాడిమాట కడ్డుచెప్పలేకుండా యున్నాను.

దామో — ఇంతేకదా చచ్చుసంభావన. పదిరూపాయలేకదా ఇదిగో ఈపదిరూపాయలు పట్టుకొనివెళ్ళి వాడిమొగాన్ని గిరగిర త్రిప్పి పారవెయ్యి.

సదా — అమ్మయ్యా! ఈ దెబ్బతో నేను స్వేచ్ఛగా నుంటాను. వెధవ ఋణంచేత వాడు కనబడితే భయము వేస్తూండేది. ఇప్పుడా భయములేకుండా నుంటాను. (తనలో) వెధవది తెలివితక్కువచేత పదిరూపాయలే బాకీయని చెప్పినాను. ఇరువది రూపాయలని చెప్పి నప్పటికి, ఈజోరుమీద వీడు పారవేశేవాడే. ఇంతకు నా నాలుకమీద దరిద్రదేవత కూర్చున్నది. సరే యీ కేసయేలోపుగా యింకో పది రూపాయలు వీడిదగ్గర గుంజ లేకపోతానా?

దామో — నేను ప్లీడరుగారిని కుదుర్చుకుందుకు వెడతాను. ఇంతలో ఆసొమ్ము వాడి కిచ్చివేసి నీవు మాయింటికిరా?

సదా — చిత్తము. (అని వెళ్ళుచున్నాడు.)

దామో — (కొంతదూరము వెళ్ళి) ఏమోయి రంగారావుగా రున్నారా లోపల? (అని లోనికివెళ్ళును.)

రంగా — ఒహో దామోదరయ్యగారా! దయ చెయ్యండి. ఏంపనిమీద వచ్చారు?

దామో — గంగాధరుడు నన్ను పన్నాడగొట్టి తిట్టి అవమాన పరచినాడు. వాడిమీద నేను చార్జీ యిచ్చినాను. మీరు నాతరపున ప్లీడరుగా రావాలి.

రంగా — చార్జీయే యిచ్చావూ! డాక్టరుసర్టిఫికెట్టు కావాలి దీనికి; తెచ్చావా?

దామో — తెచ్చాను. డాక్టరు గుమాస్తాకు అయిదురూపాయ లిచ్చి డాక్టరుగారికి [illegible] ఆయనకో పదిరూపాయలిచ్చి మధ్య

జెన్సిసరిగారికో అయిదు రూపాయిలిచ్చి మొత్తముమీద డాక్టరుసర్టి ఫికెట్టు సంపాదించినాను.

రంగా—భేషు మంచిపనిచేసినారు. అదిమంచి ఆధారము. అయితే నాకు ఫీజేమి యిస్తారు ?

దామో—ఒక పాతికరూపాయ లిచ్చుకుంటాను.

రంగా—(నవ్వుచు) పాతికరూపాయ లిస్తావా ! పాతికరూపాయలకు వచ్చేవాళ్ళు లేరు. నూరురూపాయలకు తక్కువైతే నేను రాను. అప్రతిష్టకూడాను. పైగా ఒకరహస్యము చెబుతానువిను. నన్ను పెట్టుకొనుటవల్ల నీకొక లాభమున్నది మేజిస్ట్రీటుగారు నేనూ చిన్నప్పుడొకబళ్ళో చదువుకున్నాము. నేను పట్టిన కేసంటే ఆయన సాధారణంగా కొట్టివేయడు.

దామో—అందుకునేగాదూ నేను మీ దగ్గరకు వచ్చానుమరి. ఏదో విధముగా నన్ననుగ్రహించండి. ఏభైరూపాయ లిచ్చుకుంటాను. దయచెయ్యండి.

రంగా—నీవు నాకు ముఖ్య స్నేహితుడవు గనుక చెపుతూన్నాను. డెబ్బదియైదురూపాయలు ముందుగాయియ్యి. కేసు నెగ్గితే తక్కిన పాతికరూపాయలు యిస్తుగాని.

దామో—చిత్తము. సదాశివుడు మన తగువు సాక్ష్యము వస్తానన్నాడు. వాడేం చెప్పాలండి. నిష్కారణంగా వీధమ్మట వెడుతూంటే నన్ను పిలిచి కొట్టినాడని వాడు చెపుతాడు. అది సరిపోతుందాండి.

రంగా—సాక్ష్యాని కేమి! వాళ్ళేంచెప్పాలో హియరింగునాడు నేను చెపుతాను కాదు. ఇందులో మెంతపని చెయ్యాలనుకున్నావేమిటి. అడ్డసవాళ్ళు వేసి గంగాధరుడుగాడి సాక్షులను బోనులోపెట్టి గడగడలాడించేస్తాను. వీడి పుట్టుపూర్వోత్తరం అంతా యెత్తుకొని వస్తాను. అంతపని చెయ్యాలి.

దామో—పుట్టుపూర్వోత్తరం యెత్తనచ్చునండీ. వీడి పరువంతా కడిగెయ్యాలండి కోర్టులో పెట్టి.

రంగా—చూస్తూ యెంతపని చేస్తామో. కాని యిందులో చిన్నరహస్య మున్నది. ఈ మేజిస్ట్రేటు గాడు కక్కుర్తి ముండా కొడుకు. వాడి మొగాన్ని ఒక యేబదిరూపాయలు పారేస్తివా కుక్కలాగు పని చేసి గంగాధరుడుగాడి కొంపముంచక తగలేస్తాడు.

దామో—(ఆతృతతో) పుచ్చుకుంటే నూరండి పోనీ. అప్పో సప్పోచేసి పారేస్తాను. మనకు కక్షే ప్రధానం. ఏమైనా కేసు నెగ్గాలి. ఖైదౌతుందా వెధవకు ?

రంగా—ఖైదౌతుందాంటా వేమిటి. డంకామీద దెబ్బకొట్టి మరీ ఔతుంది. నాకీని బుజ్జగొరిగించి సెంట్రలు జెయిలుకు పంపించక పోతే అప్పుడను.

దామో—(సంతోషముతో) మేజిస్ట్రేటుగారి దగ్గరకు యెవరిద్వారా వెళ్ళాలి?

రంగా—ఎవరిద్వారా అక్కర లేదు. నేనే పట్టుకొనివెళ్ళియిస్తాను.

దామో—సరే యికనేమి. నేను సాయంత్రం సొమ్ముపట్టుకొని వచ్చి మీకిస్తాను. ఎల్లుండి హీరింగు. ఈరాత్రియె మాట్లాడండి.

(అందరు నిర్గమించుచున్నారు.)

---

## రంగము 3

[అప్పుడు గంగాధరుడు, నారాయణప్ప ప్రవేశించుచున్నారు.]

గంగా.—ఒరే, నారాయణప్ప! ఈవిషయములో నీవు సహాయము చేయకపోతే యికనే గంగాప్రవేశము కావలసినదే. తేల్చినా ముంచినా నీకొప్పున్నది సొవ్యవహారము. దామోదరుడు గాకి పాగ

రణచకపోతే యికమనబ్రతుకెందుకు. గుడ్డిగవ్వ నెత్తిమీదపెడితె గుడ్డి గవ్వచెయ్యసి వెధవకంత పొగరా? కనకయ్యపంతులు కంతిమాటెత్తి నాతో పోట్లాడి నన్ను కొడతాడా.

నారా—కొట్టడమే! ఎంతమాట. చెడిబ్రతికిన ముండాకొడుకు మొదటనుంచి. నడిమంత్రపుసిరి నరము మీద వుండో యన్నారు పెద్దలు. ఈనాటికి నాలుగు వేళ్ళూ లోపలికిపోతున్నాయి గనుక వాడికి తల తిరిగింది. మీా శెలవేమిటి. ఏమి చెయ్యమంటే అదేచేస్తాను.

గంగా—వాడు నన్ను కొట్టినసంగతి నీవు ఎరుగుదువుకదా. నీవు నాతరపున సాక్ష్యము పలకాలి, ఛార్జీ యిదివరకే యిచ్చివేశాను. సాక్షుల జాబితాలో నీపేరిదివరకే వేశేశాను.

నారా—నాతో చెప్పకుండా యెందుకువేశావు. నేనారోజున వూళ్ళోనే లేనే?

గంగా—ఊళ్ళో ఉండేదేమిటోయి. ఏకూత కుయ్యమంటే ఆకూత కుయ్యవలసినదేగాని రెండ్రోజోలి నీకెందుకు?

నారా—అలాంటి వాణ్నేగాని హీరింగునాటికి వూళ్ళో ఉంటానో ఉండనో సందేహం. తప్పకుండా జల్లిసీమ వెళ్ళవలెను. అక్కడ దాసరి వీరాస్వామి భాగోతం వేస్తూన్నాడు. నేను కృష్ణవేషం వెయ్యవలెను. అక్కడ నాల్గు కీర్తనలు చేయిస్తాడు. నాల్గు వరాలసొమ్ము నాకు దొరుకుతుంది. ఈతెల్లవారగట్ల బయలుదేరి వెళ్లిపోవలెను.

గంగా—ఓరీ వెఱ్ఱిముండాకొడుకా! ఆభాగోతంకన్న యీభాగోతం బాగా నడుస్తుంది. ఆనాల్గు వరాలసొమ్ము నేను నీకు యివ్వలెనా? యిదివఱకు యివ్వలేదా! ఎప్పటికప్పుడే పరగడుపా.

నారా.—మఱచిపోలేదండి. ఎదో కరువుకాలంకదా. పిల్లమేకతో గడవక చాలా వేగిపోతూన్నానండి.

గంగా—ఆనాలుగువరాలు నేను యిస్తానులే. వుండిపో.

నా రా—చిత్తం. ఆవేళ యేమిజరిగిందో సాయంకాలము నాతో చెప్పితె నేను అతికి యేలా చెప్పాలో ఆలా చెబుతాను.

గంగా—సరే నీవు యింటికివెళ్లి సాయంకాలము మాయింటికి రా. నేను ప్లీడరుగారియింటికి వెళ్లివస్తాను.

(అని కొంతదూరము నడచి)

వామనరావుగారు యింట్లో వున్నారా?

(అని లోపలికి వెళ్ళుచున్నాడు.)

వామ—అదిగో గంగాధరుడుగారా దయచెయ్యండి. ఏం విశేషములు. మీకు దామోదరుడుకు యీమధ్య తాతా మనుమలవరుస జరిగిందిదేమిటి?

గంగా—ఆ జరిగినమాట నిజమేనండి. కనకయ్యపంతులుగారి కంతిని గురించి వాడునాతో దెబ్బలాడినాడు.

వామ—(నవ్వి) యిదేమి విపరీతమయ్యా. కనకయ్యపంతులు కంతి యెంతని మాట పట్టింపులు పెట్టుకొని చార్జీలు యిచ్చుకున్నారా? నలుగురు నవ్వరూ.

గంగా—సరి నవ్వడానికేగాని ఎవళ్ళ పిచ్చలు వాళ్ళకే యున్నవి మీరు నాతరపున ప్లీడరుగ రావాలి. నేనప్పుడే చార్జీ యిచ్చివేసినాను.

వామ—ప్లీడరుగా రావడానికేమిగాని. పైసాలో బలిహ్నదేవు డున్నాడు. డబ్బుయిస్తే వస్తాను. డబ్బిస్తేరాకేమి. మీవంటి తెలివి తక్కువవాళ్ళు యీలాంటి అవకతవకపట్టింపులు పెట్టుకొని పోట్లాడుకోకపోతే మేముబ్రతికేది యేలాగు. ఒకమహానుభావుడు చిల్లిచెంబులో భాగంనిమిత్తం అన్నగారితో పోట్లాడి వెయ్యిరూపాయిలు వ్యాజ్యాల నిమిత్తం తగులబెడతాడు. మరియొకబుద్ధిమంతుడు బోడిగోడలనిమిత్తం బూతులాడి మూడుకోర్టులు తిరుగును. మీవంటివాళ్ళుంటే మాకు రూపాయిలపంట. మీరు రెండువందల రూపాయిలివ్వండినాకు.

గం—ఏమిటండి ఇంతఘోరకలి. ఈచిన్నచార్జికి రెండువందలా? సుబ్బారావుగారు రు 50 లకు వస్తారు.

వా—సుబ్బారావుగారు ఏబైకిరావడమేమి! పద్మనాభరావుగారు పాతికకే వస్తారు. మరొకరుపదిరూపాయలకేవస్తారు. దామోదరుడుకి తప్పకుండా శిక్షపడాలంటే రెండువందలిచ్చి నన్ను తీసుకొనివెళ్ళు.

గం—దీనికి శిక్షపడుతుందాండి జుర్మానాపడుతుందా?

వా—శిక్షపడడం చేశేవాదనలోవుంది. శిక్షపడుతుందీ అంటే శిక్షపడిచూపిస్తుంది.అందరు వాదిస్తే పడుతుందీ? దాని యిగమతు నేను చేస్తాను. తమాషా చూస్తుగాని.

గం—ఏమియిగమతుచేస్తారో శెలవివ్వండి ఎంతసొమ్మయినా ఖర్చు చేస్తాను. వాడికిశిక్షపడడమే నాకు కావలసినది.

వామ—వకాల్తనామా యియ్యవయ్యా! తర్వాత చెప్తాను సంగతి.

గం—నాప్రమాణంగా మీ కేసకాల్తానామా యిస్తాను. ఆయిగమతు చెప్పండి సంతోషిస్తాను.

వామ—శెక్షనులో వుందయ్యా. వాడునన్ను చంపవలెనని ప్రయత్నించినట్లు శెక్షను మార్చివేస్తాను. పైగా రెండోమార్గం మేజస్ట్రీటువారికి కొంత మేతవేస్తినా అన్నికార్యములు సఫలయిఅవుతాయి.

గం—పుచ్చుకుంటారాండి మేజస్ట్రీటుగారు? అయితే యెంత యివ్వాలి?

వామ—ఎంతేమిటి రెండువందలకు తక్కువపుచ్చుకోడు. ఏదో కల్లబొల్లిమాటలల్లి వాడికి శిక్షవెయ్యాలిమరి.

గం—సరే మీరు నూరురూపాయిలు ఫీజుపుచ్చుకోడానికి అంగీకరించండి. సాయంకాలం మీఫీజు మేజస్ట్రీటుగారి ముడుపుకూడా పట్టుకువస్తాను, అయితే యెవరిద్వారా యివ్వాలి అనాగారము?

వామ — ఒకరిద్వారా ఎందుకయ్యా! మేజస్ట్రీటు నేను ఒకటే శాఖవారం. కానులపొట్లంకట్టి చేతిలో పెడతాను. కాని నాఫీజుచాలదు. ఇందులో ఎంతపని చెయ్యాలనుకొన్నావు.

గం — గెలిస్తే యింకో యాభై రూపాయిలిస్తాను లెండి.

వామ — అయితే నీతరఫుసాక్ష్యం బలంగావుందా? ఎవరెవరు సాక్షులు?

గం — సాక్ష్యాని కేమి. నారాయణప్పగాడొకడు, సుందరప్ప నొకడిని వేశాను. ఇద్దరుచాలరూ?

వామ — సరే. వాళ్ళిద్దరు దిట్టమైనవాళ్ళే. సరి యికనువ్వువెళ్ళి రాత్రిసొమ్ము తీసుకురా.

గం — గట్టిపని చెయ్యాలిమరి. శెలవుపుచ్చుకుంటాను.

(అని వెళ్ళుచున్నాడు.)

వామ — (తనలో) ఈగోజు లేచినవేళమంచిది. రెండువందల రూపాయిలు లాభము. కొంపనమిత్తం బాకీవున్న అద్దె యీదెబ్బతో తీరిపోతుంది. వందరూపాయిలు నాఫీజు మేజస్ట్రీటుగారికియిస్తానన్న రెండువందల్లో వందరూపాయిలు నేనుపుచ్చుకుని, వంద మేజస్ట్రీటుగారికి స్తాను. ఇలాంటి పేచీకోర్లు నలుగురుండి యీమేజస్ట్రీటుగారు యింకో రెండేళ్ళుంటే నెలకునాలుగువందలచొప్పున సంపాదించగలను. ఇంతకీ అదృష్టమేలాగుందో తెలియదు. సరి కచేరీవేళఅయింది స్నానంచేస్తాను (ప్రకాశముగా) గుమాస్తాగారు. మీరుయింటికివెళ్లి పెందలకడే భోజనము చేసిరండి.

గుమాస్తా — చిత్తం. పొద్దుణుంచి ఒకపార్టీఅయినా రాలేదండి. డస్కుదగ్గర కునుకిపాట్లుపడుతూ కూర్చున్నాను. నడుము నొప్పిపెట్టుచున్నది. శెలవుపుచ్చుకొని వెడుతాను.

(అని వెళ్ళుదురు.)

రంగము, 4 మేజస్ట్రీటుగారి గృహము.

(మేజస్ట్రీటుగారు, రంగారావు ప్రవేశించుచున్నారు.)

మేజ—రంగారావుగారు! ఏమి రాత్రి దయచేశారు. మాకేమైనా శుభవర్తమానం తెచ్చినారా యేమిటి?

రంగా—తమ దయవుంటే శుభముల కేమి లోపం.

మేజ—ఏమిటి విశేషాలు శెల వియ్యండి? మనకిదే కొత్త కాదుకదా! మనం పూర్వపరిచయులమే కదా?

రంగా—మనవిచేస్తా. దామోదరుడు, గంగాధరుడు తగవులాడుకొని ఒకరి నొకరు కొట్టుకున్నారు. ఒకడు రాయి పుచ్చుకొని రెండవవాడిప న్నూడ గొట్టినాడట. ఇంకొకడు కఱచినా డట. ఇద్దరు డాక్టరు సర్టిఫికెట్టులు పుచ్చుకొని చోర్జి పారవేశినారు. తగాదా స్వభావం మిక్కిలి విచిత్రమైనది.

మేజ—తగాదా స్వభావానికేమి లేస్తురూ! కాకితాలుచూస్తే స్వభావమే తెలుస్తుంది. ముందు తమ రొచ్చినపని చెప్పుదురూ.

రంగా—నాకు దామోదరుడు వకాల్తనామా యిచ్చినాడు. కేసు ఎల్లుండి హీరింగు. అందుచేత తమదర్శనం నిమిత్తం వచ్చినాను.

మేజ—చల్లకువచ్చి ముంత దాచడం ఎందుకు. భయంలేదు. చెప్పివెయ్యండి.

రంగా—దామోదరుడు చాలా పెద్దమనిషి. పిల్లలు కలవాడు. వాణ్ణి అక్రమంగా గంగాధరుడు కొట్టినాడు. అందుచేత గంగాధరుడుని తమరెల్లాగైనా శిక్షించి న్యాయం దయచెయ్యాలి. (అని చెయ్యిపట్టుకుని ఒక పొట్లం చేతిలో పెట్టుచున్నాడు.)

మేజ—దానికేమిలెండి (అని పొట్లం విప్పిచూచి) ఏమి పెద్ద కాసులు తెచ్చారా! ఇందులో రెండువందల రూపాయిలకు తక్కువ పుచ్చుకోవడం నాకు యిష్టంలేదు. న్నీతముచెడ్డా ఫలం దక్కాలి.

గడ్డితిన్నా కాని కడుపు నిండాలి. నాది కుటుంబం పెద్దది జీతం చాలదు. అందుచేత ఏదో కొంత కక్కుర్తి పడుచున్నాను. అదేనా మీరు తెచ్చి యిచ్చినప్పుడే కాని మరొకచోట చెయ్యి చాచటం లేదు. నా మనవి విని తక్కిన సొమ్ముకూడా తెప్పించండి.

రంగా—వాడు బీదవాడు. అట్టే యిచ్చుకోలేడు. ఇక్కడకే గుడ్లు మీదకి వచ్చినాయి. ఏదో కష్టవచ్చిందికదా యని యింతవఱకు దిగేడుకాని సామర్థ్యంపట్టికాదు. తమరేలాగోలాగు అనుగ్రహించాలి. ఏదో చంద్రుడికో నూలుపోగన్నారు.

మేజ—ఏం అనుగ్రహించడం. వెధవది డబ్బు తిన్నానని పేరున్నా చూస్తే ఏమిలేక పోవడమున్నా.

రంగా—అల్లాగాదు. ఈ కేసు రాలేదనుకోండి. మీరీకేసులో పుచ్చుకోలేదనుకోండి.

మేజ—అనుకుంటే అన్నీ అనుకోవచ్చు. సరే మీరేదో విధంగా తెచ్చేరు గనుక పుచ్చుకుంటాను. తిరిగి యిచ్చివేసినట్లయితే మీరు చిన్నబోతారు. మీరు చిన్నపోవడం నాఅభిప్రాయంకాదు.

రంగా—చిత్తం మన మిద్దరం చిన్నప్పుడొక క్లాసులో చదువు కున్నాం గనుక మీరీఅభిమానం ఉంచినారు. తమరొచ్చి నప్పటినుంచి నా కింత అనుకూలముగా జరుగుతోంది.

మేజ—మీరెల్లాగో బాగుపడడం నాకు కావలశింది. మీరు బాగుంటే మేము బాగున్నట్టే.

రంగా—చిత్తం అలాటి అనుగ్రహం ఉంచవలసిందనే. ఇక నేను సెలవు తీసుకుంటా. (అని వెళ్ళుచున్నాడు.)

మేజ—(లోపలికివెళ్ళి) ఏం జేస్తూన్నావు ఇల్లారా! నీవు శ్రావణ శుక్రవారంపూజ చేసుకుంటావా?

భార్య—(ప్రవేశించి) పూజచేసుకోకేమి! కాసు యిస్తేసరి పూజ చేసుకుంటా.

మేజ—ఇదుగో ఒక కాసుకాదు. ఏడుకాసులివిగో (ఏడుకాసు లిచ్చుచున్నాడు.) ఏడుసంఖ్యపనికిరాదాఏమిటి? ఒక కాసుయిల్లాయియ్య.

భార్య—డబ్బు విషయంలో ఏడుసంఖ్య పనికివస్తుంది. మరో దాన్లో పనికిరాదు.

మేజ—ఆడవాళ్ళకు డబ్బుదగ్గర నగలదగ్గర చాదస్తాలు లేవు.

భార్య—ఉండండి. ఎవరో పిలుస్తున్నారు మిమ్మల్ని.

మేజ—ఎవరువారు? (అని సావడిలోకివచ్చి) ఓహెూహెూ! వామనరావుగారా, ఊరక రారు మహాత్ములు. ఏమి ఇల్లా దయచేశారు.

వామనరావు—(ప్రవేశించి) ఊరికేనే మీ దర్శనం చేయడానికి వచ్చాను. (అనికూర్చుండును.)

మేజ—(కూర్చుండి) ఏమిటి విశేషాలు. ఏలాగుంది తమ ప్రాక్టీసు? బాగుందా!

వామ—ప్రాక్టీసుకేమిటి, ఏదో రోజు వెడుతూంది. అంత సంచులు కట్టిపడేయ్యటంలేదు. నిత్య కృత్యానికి లోపము లేదు. ఎవరేనా తెలివితక్కువ వాళ్ళు లోకంలో వుంటే మా పని బాగా వుంటుంది. కనకయ్యపంతులుకంతి పెద్దదా చిన్నదా అని దామోదరుడు గంగాధరుడు దెబ్బలాడుకుని చార్జీ లిచ్చుకున్నారు గంగాధరుడుగాడు నాకు వకాల్తనామా యిచ్చినాడు. ఏదో నూరురూపాయిలు ఫీజు గుంజుకున్నాను. నెల్లాళ్ళదాకా తిండికి భయంలేదు.

మేజ—భేషు బాగావుంది. మీ కొక్క కేసులో నా నెలజీతం వచ్చినది. అదృష్టవంతులయ్యామీరు.

వామ—మీ అనుగ్రహంవుంటేనే మా అదృష్టం శోభిస్తుంది. లేకపోతే గుడ్డిగవ్వకు పనికిరాదు. మీరు మా శాఖవారు, మా బంధువులవుటచేత నాకు మాప్రాణ పోకట వచ్చింది.

మేజ—ఇదేమి చిత్రం. మీ కాపత్తేమిటి?

వామ—ప్రతివాళ్ళు మా దగ్గరకువచ్చి మేజస్ట్రీటుగారు మీ బంధువులుకదా. మా విషయమై మీరు కొంత శిఫారసు చేస్తురూ అంటారు. చేస్తే మీకు కోపమువస్తుంది. చెయ్యకపోతే వాళ్ళకు కోపము వస్తుంది.

మేజ—ఇప్పుడెవరు మిమ్మల్ని ఆలాగు బాధపెట్టేది?

వామ—ఎవరైతే ఏంలెండి, పేరెందుకు.

మేజ—భయంలేదు. చెప్పండి ఫరవాలేదు. రహస్య కృత్యంలో అనుకున్నవి బయలు పెడతానా ఏమిటి?

వామ—సరి సరి, ఎంతమాట తమరు బయలు పెడతారా! ఈ గంగాధరుడునాడే తమతో ఒకసారి మనవి చెయ్యమని నన్ను బలవంత పెట్టుచున్నాడు.

మేజ—శిఫారసు చెయ్యడానికేనా ఇపుడొచ్చారు? మేజస్ట్రీటు గారు ఊరికే సిఫారసు వింటారా అని చెప్పండి వాడితోటి.

వామ—ఊరికే కనమని నేనుమాత్రం మనవి చేస్తానా?

మేజ—వట్టిసిఫారసు కాకపోతే మేము వింటాము.

వామ—ఊరికే గాదండి. యథాశక్తిగా మంత్రపుష్పంతోనే దేవతారాధన చెయ్య వలెనని వున్నది. దేవుడైనా మంత్రపుష్పంతో వుంటేనేగాని వరం యివ్వడు.

మేజ—మనసులో వున్నది చెప్పేయండి! భయంలేదు.

వామ—ఒక శతమానం మట్టుకు వాడు నా చేతికిచ్చినాడు. తమ రనుగ్రహించి వాడి కేసు నెగ్గించి దామోదరుడుపొగ రణిగించాలి. నేను పట్టిన కేసులు నాలుగైదు నెగ్గించేరంటే యిక నాకు పార్టీలు వస్తారు.

మేజ—శతమానంతో గాదండి. రెండు శతమానములతో కాని కాదు. అసలుపుచ్చుకోవడమే పాడుపని. పుచ్చుకున్నప్పుడు పూర్తిగా పుచ్చుకోవాలి.

వామ—పూర్తెక్కడికి, కేసు చిన్నది దెబ్బలాట కేసు.

మేజ—ఏ చిన్న కేసైనా చేతులారా అన్యాయం చెయ్యాలా? అవతల వాడికేదో చురక తగిలించాలా? ఆగాలి యీగాలి పోగుచేసి వాడు నేరస్థుడని పది దొంగకారణాలు వ్రాయాలా?

వామ—నిజమే శ్రమ చాలానే వుంది. వాడినేదో అనుగ్రహించి దీనితో సంతోషపడాలి. మరో కేసులో దీనికంటె అధికంగా యిచ్చి తమరిని సంతోషపెడతాను.

మేజ—మీరు నాకు ముఖ్య బంధువులు, సమాన శాఖవారు అగుటచేత మీరు బలవంత పెడితే నేను పుచ్చుకోవలసి వచ్చిందికాని లేకపోతే పుచ్చుకోవలసిన పనిగాదు. ఇదివర కెప్పుడు చెయ్యి చాచిన వాడను గాను. వెధవది యీమధ్య మా కుఱ్ఱవాడి చదువు చెన్నపట్టణంలో చదువుకోవడం, దానికి ఖర్చుచేత ఏదో కొంచెం మెత్తపడ్డాను. సర్కారు జీతం తింటూ యీపని చెయ్యటం నాకెంతో సిగ్గుగా వుంది.

వామ—నిజమేనండి. బి. ఏ బి. ఎల్ ప్యాసులయి వెధవది లంచా లిప్పించడం నాకు మాత్రం ఏంప్రతిష్ఠ. పొట్ట జరగక ఏదో యీలా చేస్తున్నాము,. వెధవదని నాకుమాత్రం తెలియదూ.

మేజ—నిజమే శలవు పుచ్చుకుంటా. పొద్దుపోయింది. మీరు కూడా వెళ్ళండి.

వామ—చిత్తం వెళ్ళుచున్నాను (అని మేజస్ట్రీటు చేతికి నూరు రూపాయిల పొట్లంయిచ్చి వెళ్ళును)

మేజ—(లోపలికివెళ్లి) ఏం జేస్తూన్నావు? నిద్రపోతూన్నావు?

అప్పుడే నిద్ర. ఇదుగో ఈ నూరు రూపాయిలు బీరువాలో పెట్టు.

భార్య—ఇదేమిటి ఫిర్యాది ముద్దాయి లిద్దరిదగ్గర పుచ్చు కున్నారా ఏమిటి కొంపతన్నీ?

మేజ— ఊ నీకేమి తెలుసు? రూపాయిలు తీస్తూ పుచ్చుకోవడం యిద్దరిదగ్గర తీసుకున్నాను. దీనిలో ఏలా తీర్పు చెపుతానో అదేచిత్రం చూద్దుగాని.

భార్య—ఒకడిదగ్గరనుంచిలంచముపుచ్చుకుంటే నేలపాయంవుంది. రెండోవాడు కోపంచేత పైయధికార్లకు తెలియజేయవచ్చు. ఇద్దరిదగ్గర తీసుకుంటే ఎవడూ చెయ్యడు.

మేజ—రెండు పార్టీలదగ్గర తీసికొంటేనే గడుసువాడి లక్షణం దాచు. పద. నిద్రవస్తూవుంది. పడుకుంటాను.

---

## రంగము 5.

(మేజస్ట్రీటు, రంగారావు, వామనరావు, దామోదరయ్య, గంగాధరుడు ప్రవేశించుచున్నారు.)

మేజ—ఇక్కడికి సాక్ష్యవిచారణ అయిపోయినది. ప్లీడర్లిద్దరు చేయవలసిన వాదములుకూడ చేసివేశినారు. కేసు సమాప్తమయిపో యినది.

రంగా—తీర్పెప్పుడు శెలవిస్తారు?

మేజ—రేపు చెప్తాను తీర్పు.

దామో—(రహస్యముగా రంగారావు చెవులో) తీర్పేమిచేస్తా డని మీయభిప్రాయమండీ?

రంగా—(రహస్యముగా) ఏంచేస్తాడంటావేమిటి. వాడికి చుఱక తగిలిస్తాడు చూస్తూవుండు.

వామ — రేపు మేమంతా రామాండి.

మేజ—మీయిష్టమైతే రండి. ఇందుకైతే రానక్కరలేదు.

రంగా—(వామనరావు చెవులో) మనతరపుతీర్పవుతుందాసి.

వామ—(మెల్లగా) సందేహమేమిటయ్యా వాడు జెయిల్లోపడి మట్టికొట్టలు మోస్తాడు. చూస్తూఉండు, కేసు యెంత ఫగడ్బందిగా నడిపేనని నీయభిప్రాయం! చూడు దేబియుండాకొడుకులాగ దామోదరుండు యెల్లా చూస్తూన్నాడో చూడు వాడికర్మం కాలింది. చూడు. కత్తివాటేసినా మొగాన్ని నెత్తురులేదు.

దామో—(రంగారావుతో మెల్లగా) ఏమిటండి! వామనరావుగారున్నూ గంగాధరుడున్నూ గుసగుసలాడుతూ ఖుషాసా గావున్నారు.

వామ—(మెల్లగా) ఏడవలేక నవ్వుతూన్నారు, రేపుమధ్యాహ్నం తెలుస్తుంది నీకిపస. అగ్రహారప్రవేశం చేయిస్తాను వీణ్ణి.

మేజ—బంటోరుతు ! దుమ్ములపిల్లికేసు పిల్వవోయి.

ప్లీడర్లు—మేము శెలవుపుచ్చుకుంటామండి.

(అని నిష్క్రమింతురు.)

---

రంగము 6

(రంగారావు, దామోదరుడు ప్రవేశించుచున్నారు.)

రంగా—ఏమయ్యోయి. తీర్పు చెప్పేడా ?

దామో—(విచారముతో) ఏమితీర్పయ్యా నీకమ్మకడుపుకాలా కేసు తగలేసి వదలిపెట్టాడు.

రంగా—ఏమి ఏంజేసేడేమిటి ?

దామో—ఏమిజేసేడనిచెప్పను బాబూ ! మాయిద్దరికి చెరి అయిదుపాయలు జుల్మానా.

రంగా—నీకుకూడ వేశాడా జుర్మానా. ఏంఆశ్చర్యం. వాడిని తప్పకుండా ఖైదులోకిపంపిస్తాడని, నీవిషయమై బాగా రాసి నిన్ను వదలిపెట్టేస్తాడని అనుకున్నాను. ఇంతవిపరీతంగా చేశేడేమిటి. డబ్బు చ్చుకున్నాడా యింత ద్రోహం చేశేడేమిటి. ఛీ, ఛీ, ఛీ బొత్తిగా నీతి లేదు.

దామో—ఇంత అన్యాయ మెక్కడా చూడలేదండి. జుర్మానా వేసినవాడు మనదగ్గరసొమ్మెందుకు పుచ్చుకోవాలి? విశ్వాసఘాతుకముండాకొడుకండి వీడు. లంచగొండివాళ్ళకి నీతుంటుందా? అయితే యింతకు సొమ్ము వాడికిముట్టిందా? సొమ్ము వాడిచేతిలో నే బెట్టేరా!

రంగా—సరిసరి. ఏడుకాసులు తీసుకువెళ్లి పొట్లంకట్టి వాడి చేతిలో బెట్టేనయ్యా. ఇదొకటికూడానా ?

దామో—మీ మాటలు నేనమ్మనయ్యా బాబు. ప్లీడర్లు మై రావణులు. డబ్బు ముట్టియుంటే నాకు యిల్లా జుర్మానావేస్తాడా యేమిటి? వాడికిపిచ్చా యేమిటి.

రంగా—నే ప్రమాణంచేసి చెబుతానయ్యా సొమ్ము నే పట్టుకువెళ్లి యిచ్చాను.

దామో—ప్రమాణాలు గిమాణాలు నాకు జాంతానై. అయిందేమిటో అయిపోయింది. నేను నోరుమూసుకు కూర్చుంటాను. నా ప్రాయిశ్చిత్తము ఇంతకన్న నేననుకోవలసిన దేమీ లేదు.

రంగా—నేను చెప్పవలసిన దేముంది. ఇది నమ్మకముమీద వెళ్ళవలసినదిగాని యింకొకటికాదు. లంచము యిప్పించవమనే నీచపు పనికి వొడబడినందుకు నాకు శాస్తి కావలసినందే.

దామో—మీకు కాదు నాకయింది శాస్తి, ప్రాయశ్చిత్తము.

(అసిపోవుచున్నాడు.)

—:o:—

## రంగము 7.

(వామనరావు, గంగాధరుడు ప్రవేశించుచున్నారు.)

వామ—గంగాధరుడుగారూ! ఈమాయయేమిటో నాకు తెలియకుండా వున్నది. మేజస్ట్రీటు మీకు రు 5 లు దామోదరుడుకు రు 5 లు జుర్మానా వేశినాడట.

గంగా—అయ్యో నాఖర్మంకాలా. ఆముండాకొడుకుని రు5లుతో వదలి వేయడంకాకుండా నాకు రు 5 లు జుర్మానా వేశాడా. ఎక్కడేనా వుందా. అయిన కాడికి రు 200 లూ మింగి నాకొంపతీస్తాడా?

వామ—కేకలెయ్యకయ్యా బాబు. అల్లరిచెయ్యకు. చెప్పకుంటే తంటా.

గంగా—అల్లరి చేస్తానా మరీఅల్లరి చేస్తానా. ఇంతద్రోహమా ఈవూళ్లో యీమేజస్ట్రీటుగాడిని ఏకియేకి వదలిపెడతా నుడండి.

వామ—అపాదిష్ట. పైగా మనము చిక్కుల్లో పడడంకూడా వస్తుంది. నోరుమూసుకో!

గంగా—కొంప తాకట్టుపెట్టి రెండువందలు తీసుకువచ్చి పీడి మొదాన్ని పోశానయ్యా బాబు! నాకడుపు రగిలుకుపోతూంది.

వామ—రాత్రి నేవెళ్లి మేజస్ట్రీటుగారిని కనుక్కొంస్తాగాని నా పరువుకూడా తీసెయ్యకు.

(అని నిష్క్రమిస్తూన్నాడు.)



## రంగము 8.

మేజస్ట్రీటుగారి యిల్లు.

(మేజస్ట్రీటు, వామనరావు, ప్రవేశించుచున్నారు.)

వామ—తమరీలాగున చేసినందుకు గంగాధరుడు చాలా యేడుస్తూన్నాడు.

మేజ—గంగాధరుడుమీద నేరం చాలా రుజువైనది. వాడికి ఖైదు వెయ్యవలసినది. ఈలంచ మివ్వబట్టి రు 5 లు జుర్మానా వేశి వాడిపరువు కాపాడినాను.

వామ—దామోదరుడుకు శిక్ష వెయ్యలేదేమి ?

మేజ—వాడిమీాదేమి రుజువుకాలేదు, అయినప్పటికి యీ మొహమోటంచేతనే రు 5 లు చురుకు తగిలించినాను.

వామ—ఏమైనా వాడు చాలా యేడుస్తున్నాడు పాపము.

మేజ—ఏడిస్తే నేనేమిచెయ్యను.

(అప్పుడు రంగారావుగారు ప్రవేశించుచున్నారు.)

వామ—నేను శెలవుపుచ్చుకుంటాను. (అని వెళ్ళును)

రంగా—ఏమండి, దామోదరుడుకు కూడా రు 5 లు జుర్మానా వేశి పైగా గంగాధరుడుని చులాకా వదలివేశారు?

మేజ—దామోదరుడిమీాద కేసు బాగా ముకర్దమాగా రుజువైనది. వాడికి ఖైదు వెయ్యకుండా రు 5 లు తో వదలి వేశాను. గంగాధరుడు మీాద కేసు రుజువు కాలేదు. అయినప్పటికి వీడు యేడ్చి పోతాడని వాడికికూడా చురకవేశినాను.

రంగా—డబ్బుపోయి జుర్మానాపడిందనివాడు యేడుస్తున్నాడు.

మేజ—ఏడవనియ్యండి వెధవలని. కనకయ్యపంతులుకంటె పెద్దదా చిన్నదా అని పోట్లాడుకుని కోర్టుకెక్కిన వెధవలు యేడవ వలసిందే. ఇప్పటికైనా బుద్ధివస్తే మంచిది.

రంగా—చిత్తం నేశెలవు పుచ్చుకుంటాను.

మేజ—మంచిది.

రంగా—(వెళ్లును)

మేజ—ఏంచేస్తున్నారు మీారు [illegible] రం?

భార్య—మీ చమత్కార మంతా నే గోడప్రక్కనుంచి వింటూన్నాను. ఉభయులదగ్గర పుచ్చుకున్నందుకు ఉభయులకు బరువు లేకుండా ఉభయులకు వాతబెట్టునట్లుగా తీర్పుజేసినారు. మీటక్కరితనం బాగానుంది. ఎంతటక్కరితనంవున్నా ఎప్పుడో అప్పుడు గోతులో పడకమానరు.

మేజ—పడ్డప్పుడు చూతాము లెద్దు. ఈటక్కరితనం లేకపోతే నీకు కంటెలు కాసులుపేరు యేలావస్తాయి? జీతం భోజనానికే సరి గదా. పదపద భోజనమునకు వేళ అయింది.

(అని వెళ్ళుదురు.)

---

# లండను సంకల్పము.

మహాజనులారా! సోషల్, రిలిజియస్ ఆచారము లెల్లయెడలను వ్యాపించుచుండు నిక్కాలంబున సైతము తమ కింకపట్టువదలని పూర్వాచారపరాయణ(శ్రోత్రి)యాకర్మిష్ఠు లనేకులు కలరు. అట్టివారు కార్యావసరములలో రాజధానియగు లండనునగరమున కేగవలసివచ్చెనేని కర్మభూమికాకుండుటచే వెళ్ళక మానుచున్నామని యందురు. వారి కా సంశయ మక్కర లేదు. లండనుకు వెళ్లినను అక్కడ థేమ్సునదియందు స్నాన మాచరించుచో పఠించదగు సంకల్ప మీక్రింద వివరించితిమి.

ఆచమనము —లండన్ వేస్వాహా-జూళసేస్వాహా-క్రైస్తవేస్వాహా-ఇంగ్లండ్-స్కాట్లండ్-ఐర్లండ్ తత్క్రైస్తోర్వరేణ్యం-జూహోవాదేవస్యధీమహి-ధీయోయోనః ప్రచోదయాత్-మమఉపాత్త-ధనవ్యయ

ద్వారా-కాంటినెంటల్‌టూర్- సంప్రాప్త్యర్థం- సమ్యగశిక్షితాంగేయ భాషాసంశయనివారణార్థం-హేట్బూట్సుప్రముఖ వివిధవేషసంధారణోత్కంఠాపరిపూర్త్యర్థం- పల్లీగ్రామేణతాసంజనితా, అనాగరికతానివృత్తిసిద్ధ్యర్థం- టేబిలూపరిసోపానత్కవచోష్ణీషాదివేష చిరప్రార్థితిభోజనమనోరథసంపాదనార్థం-భూమేః, పూర్వగోళార్ధే, యూరప్ఖండే, రష్యా, జర్మనీ, ఫ్రాన్సు, స్పైన్, పోర్చుగల్, ఇటలీ, నార్వే, స్వీడనేత్యాది మహాదేశానాం పశ్చిమప్రాంతే-చతుస్సముద్రముద్రిత గ్రేటు బ్రిటన్నామక మహాద్వీపే-ఛవియట్పర్వతస్య దక్షిణదిగ్భాగే-వేల్సుదేశస్యాగ్నేయభాగే-బ్రిస్టలఛాన్నెల్యాయాః ప్రాగ్దేశే- మహానాగరికప్రదేశే-సెంట్పాల్సుకెథీడ్రల్ వెస్టుమినిస్టరబ్బేత్యాది మహాదేవాలయవిరాజితే-హైడ్పార్కు, గ్రీన్పార్కు, రీజంటుపార్కునామకమహోద్యానవిభూషితే-టవర్బ్రిడ్జి, లండన్బ్రిడ్జి, వెస్టుమినిస్టర్బ్రిడ్జినామక, బ్రిడ్జిత్రయవిచిత్రితే-ట్రాఫాల్గర్ స్క్వేరంతస్థితనెల్సన్సుమాన్యుమెంటిత్యాదిమహాద్భుతస్థలాలంకృతే — భూమ్యంతర్జంగమ్యమాన ధూమశకటమార్గమహాద్భుతే-గ్యాస్లైటెలక్ట్రిక్లైట్నామక దీపావళీదేదీప్యమానే-ఆర్చిబిషప్లండన్నామక మహారుష్యాశ్రమస్థలపవిత్రితే- సీవాయ్హోటల్ప్రాంతే,హౌసెస్సాఫ్పార్లమెంటు తీర్థే-క్లియోపాట్రర్సునీడిల్సన్నిధౌ-పురోహితీభూత, సెంటుమస్కుల్కాండ్సన్నామక థేమ్సుపుత్రిసదావలంబితే-సదాసన్నితాగ్నిహోత్రే-శ్రీమల్లండన్నామక మహాక్షేత్రే-అస్మిన్వర్తమానవ్యావహారికహూణమానేన- క్రీస్తోరనంతరంవింశతితమశతాబ్దే...వత్సరే...మాసే...దినే,తత్కాలసమ్మిళితనానాదేశసమాగతానేకధూమనౌకాస్తంభ సంభారసంభృత వైదేశికారణ్యభ్రాంతిమహాపథ్యాం-అఖండథేమ్సునద్యాం వీరభద్రశర్మాహం జ్ఞానస్నానంకరిష్యే.

# అద్భుతసంతర్పణ ప్రహసనము

## రంగము 1.

(అప్పుడు కేశవభట్టు, నారాయణ సోమయాజి, మాధవశర్మ, గోవిందశాస్త్రి ప్రవేశించుచున్నారు.)

కేశ—ఒరే సోమయాజులు! ఓరి శర్మ, ఓరి శాస్త్రి, యీవేళ మనమంతా నక్కను త్రొక్కి వచ్చినాము. మనమంతా గంగాపుత్రుల మయినందుకు గంగకు మనమీద చాలా దయయున్నది. ఈవేళ పెద్ద గొడ్డే పడినది.

నారా—ఎక్కడరోయి బాబూ. చెప్పు చెప్పు. ఈమధ్య నాలుగుమూడు దినములనుండి చస్పుముండాకొడుకులేగాని తీర్థవాసులలో గొప్పవాడెవడు లేడు. ఈవేళ గొప్పవాడొచ్చాడని నీవు చెప్పిన మాటవల్ల ప్రాణము లేచివచ్చినది.

మాధ—ఎవడొవచ్చినవాడు, తూర్పువాడా, హైదరాబాదు వాడా ?

గోవిం—మారువాడీ అనుకుంటాను. సత్రములో యెవరో గొప్పమారువాడీ వచ్చి బసచేశాడట.

కేశ—గోవిందు డప్పుడే జాడకట్టేడు. మారువాడీవాడే. వీడు కోటీశ్వరుడట, హైదరాబాదునుండి వచ్చినాడు.

నారా—స్నానం చేశాడా?

కేశ—స్నానమయినది. ఇప్పుడే చేయించివచ్చాను.

మాధ—ఏమిచ్చాడురా స్నానము చేయించినందుకు?

కేశ—నాకో పెద్దకాసిచ్చాడు. చేరిన బ్రాహ్మణులకు తలొకరూపాయ యిచ్చినాడు.

మాధ—మాకు కబురంపించావు కావేమిరా? సంభావన మాకేది.

కేశ—ఇంత పిందలకడే స్నానముచేస్తాడనుకోలేదు. లేకపోతే వత్తును. నాపెద్దకాసులో ఒక్కొక్కడికి నాలుగవవంతు భాగము రానేవస్తుందికదా. పైగా గంగాపుత్రులింకా ముగ్గురున్నారని ఆయనతో మనవిచేసినాను. మధ్యాహ్నము మీసంభావనయిస్తానన్నాడు.

నారా—నీవుసాధారణముగా వదిలిపెడతావూ. వీలుగానున్నంత గుంజుతావుగాని.

మాధ—ఇంతేనా వాడినల్ల మనకేమైనా లబ్ధియున్నదా?

కేశ—లేకపోతే పెద్దగొడ్డుపడిందని యెందుకంటాను. చెప్పేది వినండి! ఏభైమంది బ్రాహ్మణులకు సంతర్పణచేయించుమన్నాడు. ముప్పైమైదురూపాయలు నాచేతికిచ్చినాడు.

నారా—(గుండెకొట్టుకొని) ఏభైమందికి ముప్పైమైదురూపాయలిచ్చాడురా? ఆరిపీడిభక్తికూలా. బ్రాహ్మణులచేత బంగారము తినిపిస్తాడా యేమిటి! నూటికి మంచి సంతర్పణకు యిరవదిరూపాయలు చాలును. ఏభైమందికి పదిరూపాయలే చాలును.

మాధ—ఒకేవాడుమత్తరాదివాడురా. విస్తరిరూపాయచేసేటట్టు భోజనంపెడతాడు,

గోపిం—రూపాయా! విస్తరి వరహాకూడా చేస్తుంది. మనవైపు భోజనమా వెధవతోటకూరా దొగ్గలికూరతోను.

కేశ—అవును. అల్లాగే చెప్పాడు. నాలుగుపిండివంట లుండాలన్నాడు. చీనాలడ్డు అమృతజిలాబి బాదంహల్వా క్షీరాన్నం చేయించుమన్నాడు ఇంకా బ్రాహ్మలు పైనైతే వాళ్ళని వెళ్ళగొట్టక అన్నం పెట్టుమన్నాడు. పైసొమ్మునుగూడా యిస్తానన్నాడు. భోజనంచేసిన బ్రాహ్మణులను తనదగ్గరకు తీసికొని రమ్మన్నాడు, వాళ్ళకు సంభావన కూడా యిస్తాడట.

నారా—సరే యిక కర్తవ్యమేమిటి?

కేశ—ముందుపనేమున్నది మన మామూలుప్రక్రియచేద్దాము

మాధ—సంతర్పణ చెయ్యకుండా చేశాననడమే.

గోవిం.—బాగుండదురా. పదిరూపాయలు కర్చుపెట్టి మామూలు సంతర్పణైనా చేదాము అంతా దొబ్బేస్తే అల్లరవుతుందేమో యని భయం.

కేశ—ఓరి పిరికివెధవా! నోరుమూయరా. నీవు మాకు శని వెధవవు. వెనకాలుండి దిగలాగుతావు. శకునపక్షిలాగ యెప్పుడు అశుభమే పలుకుతుంటావు. సంతర్పణా లేదు, గింతర్పణా లేదు. ఈ ముప్పదియైదు పంచుకుందాము. ఇంకొక్కయాభైమందికికూడ పెట్టామని చెప్పి మరొక ముప్ఫైయైదురూపాయలు పుచ్చుకుందాము. మన జట్టు బ్రాహ్మలొక యేబదియరవదిమంది ఉన్నారుగదా. వాళ్ళకు కబురంపించు. వాళ్ళకు సంభావన యిప్పింతాము. వాళ్ళుభోజనము చేశామని సంతర్పణ బాగాయున్నదని ఆమారువాడీతో మాత్రము చెప్పవలెను. ఏమేమి పదార్థములు తిన్నారని యొకవేళ మారువాడీ యడిగితే అవిమాత్రము వాడితో తొణుకు బెణుకు లేకుండా చెప్ప గలందులకై కూరలు పదార్థాలు పాఠముచెప్పించు'

నారా—మనవాళ్ళందులో గట్టివాళ్ళే. వేరేపాఠము చెప్ప నక్కఱ లేదు. చూపిస్తే అందుకుపోతారు ముండాకొడుకులు.

మాధ—అయితే వీళ్ళందరికి తలొకరూపాయ ఆయన సంభావన యిస్తాడుగదా. ఈసంభావన వాళ్ళకుచితముగా మనము యిప్పించినందుకు రుసుముక్రింద ఒక్కొక్కడిదగ్గర మన మర్థరూపాయనైనా యాడెయ్యాల. ఇది మనకు మామూలేగాదూ.

గోవిం—మామూలేగాని దురాశ దుఃఖానకుచేటు. ఈరుసుము పుచ్చుకోవడంచేత కడుపుమండి యేముండాకొడుకు బయటపెడతాడో యని నాకు భయం.

కేశ—నీభయం మండిపోయిరి. అక్కుపక్షి వెధవా. ఎప్పుడూ యిలాగే హడులుతూంటావు. ఈవేళ ముత్తముమీద మనము నూరు రూపాయలు కిళ్ళజూడాలి. నలుగురము నాలుగు పాతికలు పంచుకోవాలి. వెనక నాగపూరునుంచి వచ్చిన తారాజీయనే మాగు వాడీవద్ద యిల్లాచేసి మన మాత తలోపది పంచుకోలేదటరా ?

మాధ—సరే కానీగా బాధలేదు. ఇదో లెక్కా యేమిటి మనకు.

గోవిం—గంగాపుతురిలమంటే మనమే గంగాపుత్రులముకాని మరిమొకరు కారురా !

నారా—ఓరే యీవేళ నే నిక్కడకు వస్తూండగా పునిస్త్రీ పదుచు యెదురుగుండా వచ్చినదిరా! నేనప్పుడే యనుకొన్నాను యేదో లాభ ముంటుందని.

కేశ—సరే మనమంతా తలోమూలకువెళ్లి తలోపదిమంది బ్రాహ్మణులను కొట్టుకువద్దాము. వాళ్ళందరు భోజనము చేశామని నూరువాడితో చెప్పవలెను. ఆబ్రాహ్మలిని యొక్కొకరిని యజమాని దగ్గరకు వెళ్ళనియ్యకండి మీ రెవరైనా యుంటెకాని—

మాధ—సరే.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

రంగము 2.

(అప్పుడు మాధవశర్మ పదిమంది బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

మాధ—ఒరే! కొండుభట్టు! రామావధానులూ సుబ్బన్న దీక్షితులు మీ రందరు భోజనములుచేశామని చెప్పాలి. పిడివంటల పేర్లు జ్ఞాపకమున్నాయా?

కొండు—జ్ఞాపకము లేకేమ ట్యా! ఇందాకటినుంచి వీళ్ళందరిని కూర్చుండ పెట్టిపాఠము చెప్పినాను. చిన్నప్పటినుంచి అలవాటైనపని. ఇంతలో తేలిపోతారా మనవాళ్ళు!

మాధ—రండినాతోగూడ. అదిగో మారువాడీ తివాసీమీద పరువు పరుపుమీద జముఖానా వేసికొని మహారాజులా కూర్చున్నాడు.

(అప్పుడు మారువాడీ ప్రివేశించు చున్నాడు.)

మారు—రాండి. రాండి. కూచోండి. భోజన్ ఆయింది.

కొండు—చిత్తం. చిత్తం. అహాహా. ఏమిభోజనం. ఏమిభోజనం. ఇటువంటి భోజనం మా జన్మమెత్తిన తరువాత నెన్నడు చేయ లేదు విస్తరి వరహా కిమ్మనైతుగదా. మీ వంటి ధర్మాత్ములీ దేశ మెప్పుడురాలేదు. ఇంత వైభవంగా సంతర్పణ మెన్నడు చేయలేదు.

మాధ—బ్రాహ్మణులు మరియేబైమంది అయినారండి. ఇంకో ముప్పైయెదు రూపాయలు కూడా అయినవి. అవి తెపురుదయచేయిం చాలి.

మారు—వహావ! బ్రాహ్మణ్ భోజన్కు ఎంతఆయింది అంత యిస్తాం. అందుకు భయంలేదు. భక్ష్యం ఏమేమి చేసినార్?

కొండు—లడ్డూవుండలు చేయించారు. ఏమిరుచిగా వున్నాయి. యేమిరుచిగా వున్నాయి.

దీక్షి—కేసరిభాతు అమృతజిలేబీ చేయించారండి. మూ షసం దుగా వున్నాయి.

మారు—ఒకరు లడ్డూఅంటారు ఒకరు కేసరిభాతు, అమృత జిలేబీ అంటారు, యింనులో యేదిచేయించారు?

మాధ—(తనలో) ఈ ముండాకొడుకులు జ్ఞాపకములేక తప్పు దారిని పడ్డారు. కొంపమునుగుతున్నది (ప్రకాశముగా) చిత్తము

కొందఱు బ్రాహ్మణులు లడ్డూకావాలంటే అవి యిపేకూడా చేయించా నండి.

మారు—సరే. అందుకే ఖర్చు ఎక్కువాఅయింది.

(అప్పుడు నారాయణసోమయాజులు పదిమంది బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

మారు—రాండి. బొమ్మాజీ. లడ్డూవుండ బాగుందా?

నారా—లడ్డూ చేయించందేనాండి. తమరు వద్దని చెప్పారు గనుక మానేశాను.

మారు—అరే! ఆయన లడ్డూ చేయించానంటే మీరు లేదం టారేమి? ఏమయ్యా! జూటా మాటా చెప్పావుమాకు.

మాధ—చిత్తం. చిత్తం. జూటాకాదండి. అదిచేయించి కావా లన్న బ్రాహ్మలికి మాత్రమే వేశామండి. జూటాకాదు.

మారు—అరే! మీ మాటలు షూస్తే మాకు షందేహాం వస్తావుంది. (అని నారాయణ సోమయాజులతో వచ్చిన బ్రాహ్మణు లనుచుచి) మీరు యేంభక్ష్యం తిన్నారుస్వామీ?

ఒకడు—బొబ్బట్లు పూరీలు చేయించారండి. మహా రుచిగా నున్నాయి మహాబాగున్నాయి.

నారా—(తనలో) వీళ్ళమ్మకడుపుకాలా వీళ్ళు జ్ఞాపకములేక తగలేస్తూన్నారు.

మాధ—(తనలో) కొంప మునిగి పోయింది. పరాభవము జరుగుతుంది.

మారు—(ఆశ్చర్యముతో) ఆరే ఇదేమి చిత్రమయ్యా, మీరు తమాషా బ్రాహ్మలు. ఒకరు చెప్పినమాట ఒకరు చెప్పరేమిటి? ఒకడు లడ్డూలంటాడు. ఇంకొకడు బొబ్బట్లంటాడు. ఇంకొకడు పూరీలంటాడు మీరు షూస్తే [illegible] చెయ్యలేదని

తోస్తాంది. నేను కాశి గయా హరిద్వార్ గోకుల్ బృందావన్ వెళ్ళి నాను. అక్కడ గంగా పుత్రులున్నారు, ఇంతానీచం ఇంతామోసం ఎక్కడా లేదు. ఇంతాజూటాబొమ్మళ్ మనదేశంలో లేరు, తూ నామర్ధా బొమ్మల్ మీరు అరేమీమోగంపూస్తే పాపంవస్తుంది మాకు. డబ్బు దొబ్బడాన్కి దొంగటక్కరు వేశినారు మీరు మీ పని పట్టించవాలా కాని ఊర్కోకూడదు. మీరు అందరిసీ యీలాగే మోసం చేస్తార్ అరే కోనేరి జవాన్ కాలేఖాన్ అబ్దుల్ఖాదర్ ఇదరావురే.

కాలే—క్యా హుకుంజీ

మారు—అరే పోలీస్కూ బులావ్

కానే—జీ (అనివెళ్ళును)

మాధ—(భయముచేత వణుకుచు) చిత్తం చిత్తం క్షమించాలి. క్షమించాలి. మారువాడిగారు బుద్ధిపొరబాటొచ్చింది క్షమించాలి.

నారా—మారువాడిగారూ రక్షించండిరక్షించండి. ఇకెప్పుడూ బుద్ధిపొరబాటుపని చెయ్యరు

మారు—అరే మీబుద్ధి కుక్కబుద్ధి ఇప్పుడీలాగంటార్ రేపు కొంపల్తీస్తార్. ఈలాగున మీ రెంతమందిని మోసంచేశారో అన్నం పెట్టకుండా పెట్టామని కడుపుల్కాల్చి అబద్దాల్ చెప్పి డబ్బు సంపాదిస్తార్ మీరు. కపడ్దార్!

మాధ—(చేతులుపట్టుకొని) బుద్ధిసేరక చేసినామండి, యిక ఎప్పుడూ చెయ్యం. మీరే తల్లి తండ్రి.

మారు—ఛీ. నన్ను ముట్టుకోకు. కుక్కన్ ముట్టుకోవచ్చు. పందిన్ ముట్టుకోవచ్చు కాని నిన్ను ముట్కోకూడదు. మీరు బొమ్మల్. అని చెప్తే నామర్ధా.

నారా—ఇదివరకు యెప్పుడూ చెయ్యలేదండి. అందుచేత ప్రధమతప్పిదంక్రింద క్షమించాలి.

మారు—నేనుకాదు. పోలీసువారు క్షమిస్తారు మీకు అరే అబ్దుల్ ఖాదర్! ఆ పెద్ద గంగాభేటీ ఉన్నాడే కేశవభట్ ఆయన్గారిని తీస్కరా. అయన్కకూడా పోలీస్క అప్పగించాలి.

మాధ—తమ స్వామ్మి తమకు దాఖల్ చేసుకుంటాము. రక్షించండి.

మారు—మరో యేభైమంది అయినారు. ఇంకా ముప్పై యైదు రూపాయల్ ఇమ్మన్నావు కాదువోయి నీవు! మీకు పోలీసు వారు మేశ్రీటు బుద్ధిసెప్పాలి. పోలీసురానీ.



రంగము 3.

(మారువాడి, పోలీసుహెడ్డు, ఒకకనిష్టీబిలు, నారాయణ సోమయాజులు, మాధవశర్మ ప్రవేశించుచున్నారు)

మారు—రాండి, హెడ్డుగారు దయచెయ్యండి! ఈబ్రాహ్మలు సంతర్పణచేస్తామని నాదగ్గర ముప్పైయైదు రూపాయలు వుచ్చుకొని ఆరూపాయిలు హరించినారు. పట్టుకొనిదరియాప్తు చెయ్యండి.

హెడ్డు—ఓ! ఈబ్రాహ్మలా వీళ్ళు బద్మాషీలు. వీళ్ళందరికి టోపీలు పెడుతున్నారు. రండి నాతో కూడరండి బ్రాహ్మలు!

మారు—ఈబ్రాహ్మల్ జట్టుకి మేళనాయకుడున్నాడు. వాడి పేరు కేశవభట్. వాడికి పట్టుకోండి.

హెడ్డు—చిత్తం. వీళ్ళందరికి బుద్ధిచెప్పిస్తా.

మారు—ఈబ్రాహ్మలంతా భోజనం పెట్టలేదని సాతులు. వీళ్ళనికూడా తీస్కపోండి.

హెడ్డు—చిత్తము. రండయ్యా అందరురండి!

(అప్పుడు మారువాడీ తప్ప తక్కిన వారునడుచుచున్నారు)

హెడ్డు—(కొంతదూరము వెళ్ళినతరువాత) ఎక్కడయ్యా కేశవ భట్టు యిల్లు, చూపించండి?

నారా—చిత్తం చిత్తం. ఆకనపడీ వెలగచెట్టున్న యిల్లేనండి.

మాధ—అడుగోనండి యీలాగే వస్తూన్నాడు.

హెడ్డు—రానీయండి. వెతకక్కరలేకుండా వెంట నేదొరకినాడు.

(అప్పుడు కేశవభట్టు చేతులతో నాలుగుపొట్లములు పుచ్చు కొని ప్రవేశించుచున్నాడు.)

కేశ—(తనలో) ఇది యేమిటిచెపుమా! పోలీసువారు బ్రాహ్మ లిని వెంటబెట్టుకొని వస్తూన్నారు. మన నారాయణుడు మాధవుడుకూడా యున్నారేయిందులో.

హెడ్డు—(సమీపించి) ఏమండీ కేశవభట్టుగారు తమరెక్కడికి వెళుచున్నారు? ఆచేతిలోనిది యేమిటి?

కేశ—చిత్తం చిత్తం. ఈవేళ మారువాడీ యొకరు సంతర్పణ చేయించినాడండి. ఆసంతర్పణప్రసాదం తనకు పెట్టుమని నాతో చెప్పినాడు. అందుకని ఆపిండివంటలు పొట్లాలుకట్టి పట్టుకొని వెళ్ళు చున్నాను.

హెడ్డు—సంతర్పణ యెక్కడ చేయించినారండీ తమరు!

కేశ—ఘంటసాలవారి సత్రములో చేయించినామండి. వంద మంది బ్రాహ్మణ్యం లేచినారు.

హెడ్డు—అల్లాగునటండి! ఇవన్నీ అక్కడ చేయించిన పిండి వంటలేనాండి?

కేశ—(తెల్లబోయి) చిత్తం చిత్తం. అవేనండి.

హెడ్డు—బూటక్కరితనం బయలు పడినది. మీరు సంతర్పణ చెయ్యకుండా డబ్బుదొబ్బినారని చార్జివచ్చినది పదస్టేషన్కుపద.

కనిస్టేబిలు—ఏమయ్యా బ్రాహ్మడా! ఇందాకా కొండయ్య కొటులో నాలుగణాలిచ్చి నాలుగు పొట్లాలు కట్టించలేదూ? ఇది సంతర్పణలో పొట్లాలేయని మారువాడికిచ్చి మోసంచేస్తావా? తుంటరి. పద స్టేషనుకు పద.

హెడ్డు—మీకందరికి బుద్ధిచెప్పితేనేకాని బొత్తిగా అన్యాయముగానున్నది. ఇంతఘోరకలా! సంతర్పణకని డబ్బిస్తే దొబ్బేస్తారయ్యా మీరు?

క్లేశ—ఆ సంతర్పణ చెయ్యలేదని మీకెవరు చెప్పారు? నేను సంతర్పణ చేసినాను.

హెడ్డు—అబ్బా తెగనీలు గెక్కువగా నున్నదే. తీసికొనివెళ్ళి యీయనను స్టేషనులో లాకపు చెయ్యవోయి కనిస్టేబిలు.

నారా—హెడ్డుగారూ మావాడు తెలివితక్కువవాడు. తొందరపడ్డాడు. తమరనుగ్రహించాలి.

మాధ—ఓరీ కేశవుడూ మనగుట్టు బట్టబయలైనది. నీవాట్టే బుకాయించక వారికాళ్ళట్టుకో. లేకపోతే తరణోపాయము లేదు మనకు.

కేశ—నావల్ల పొరబాటొచ్చింది. తమరు రక్షించాలి.

హెడ్డు—మేమెక్కడ రక్షించకలమండీ మిమ్మల్ని! మీరుగొప్ప బ్రాహ్మలు. సంతర్పణ చేయించినవారు.

నారా—తమరలాంటే యెల్లాగండీ మరి. తమరుక్షామందులు.

కని—మాధవశర్మగారూ! యీలా దయచెయ్యండి. (అని కొంచెముదూరము తీసికొనిపోయి) ఏమయ్యా! హెడ్డుగారి కేమైన యింత పారేయ్యండి. లేకపోతే స్టేషనులో కూర్చుండపెడుతాడు.

మాధ—ఏమిమ్మంటారో చెప్పు?

కని—ఏదో మీరాలోచించుకొని చెప్పండి.

మాధ—ఓరే నారాయణ సోమయాజులు, ఓరే కేశవభట్లు, మీరిద్దరు రిలారండి. మాటచెపుతాను.

నారా—ఎందుకు ?

కేశవ—ఇదిగో వస్తున్నాను.

మాధ—ఒరే మనము మాచెడ్డచిక్కులలో పడిపోయినాము రా. చూస్తుండగా గోతిలో దిగినాము. పైగా అప్రతిష్టపాలైనాం. ఈహెడ్డుముండాకొడుకు కర్కోటకుడు. తీసికొని వెళ్ళి కొట్టులో పెట్టిరా అప్రతిష్టకూడాను. కాబట్టి యేదైనా యిచ్చి విడిని వదలించుకొందాము పట్టు.

కేశ—ఏమిమ్మన్నావు చెప్పు?

నారా—మాదువాడిదగ్గర మనముపుచ్చుకొన్న ముప్పైయైదు రూపాయలు వీడికి పారవెయ్యి. ఆపాపిద్రవ్యము మనకువద్దు.

కేశ—ఆ! ముప్పైయైదురూపాయిలిస్తానేమి ?

నారా—ఇవ్వకపోతే కోట్టులోకూర్చో. నీమూలాని మేము కూడా చస్తూన్నాము.

మాధ—బాబూ నామాటవిందూ, ఇచ్చేస్తూ.

కేశ—సరే మీయిష్టమువచ్చినట్లు తగలెయ్యండి.

మాధ—కనిస్టేబుగారూ యిల్లా దయచెయ్యండి.

కని—(సమీపించి) ఎందుకు ? ఏదైనకుదిర్చారా ?

మాధ—ఇదిగో మాదువాడిదగ్గర మేముపుచ్చుకొన్న ముప్పైయైదురూపాయలు మీకిస్తాము, పుచ్చుకొని మమ్మలిని కరుణించండి.

కని—సరే హెడ్డుగారితో ఆలామనవిచేస్తాను. (అని హెడ్డు దగ్గరకు వెళ్ళి మాటలాడి తిరిగివచ్చి) అయ్యా! హెడ్డుగారు వప్పుకోనంటూన్నారండి. వ్రతంచెడ్డా ఫలందక్కాలి అంటున్నారు. ఈముప్పైయైదూగాక నలుగురు నాలుగైదులిరువయి రూపాయ లిస్తే వప్పుకుంటారట.

కేశ—ఏమైనా సరేకాని నేనెక్కడమ్మిడీ యియ్యను.

కని—అసలీవ్యవహార మింతమట్టుకు ముదరింది నీమూలా న్నే. నీవు బుకాయించకపోతే ఆయనకింత కోపము రాకపోను.

మాధ—నీయమ్మకడుపు కాలా వప్పుకోరా! కొంపమునిగిపో తున్నది. గంగలో దింపినవాడ వేనీవు.

నారా—అయ్యా! వాడియ్యకపోతే నేనిచ్చుకుంటాను గాని వ్యవహారము సొసాయించండి.

కని—సరే. పట్టుకువచ్చి యియ్యండి. మేమిక్కడుంటాము

(అప్పుడు నలుగురు యిండ్లకువెళ్లి సొమ్ము తెచ్చి యిచ్చుచున్నారు)

హెడ్డు—(సొమ్ముపుచ్చుకొని కనిస్టేబిలుతో) ఈవేళ మా మంచి వోడుహొచ్చింది. ఈపిరికి బాపనోళ్ళు గోతులో పడ్డారు.

కని—ఈవేళ మనను నక్కనుతొక్కి వచ్చాము.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

---

# వింతవిందు

(అప్పుడు రైలుబండిదిగి భగవంతరావుగారు ప్రవేశించుచున్నారు)

భగవం—(తనలో) ఇది కొత్తగ్రామము. ఈవూళ్ళో యెవరి మొగం నేనెఱుగను. ఎక్కడికిపోయి బసచేయుదును చెపుమా! అయినా యీస్టేషనునాటి వెళ్లేటప్పటికి యెవరితోనైనా కాస్తపరి చయం కలగకపోతుందా. (అని నడచుచున్నాడు)

(అప్పుడు సదాశివరావు సీలకంఠయ్య అను నిద్దరు కాఫీహోటలు యజ మానులు ప్రవేశించుచున్నారు)

సదా—అయ్యరువాళ్. ఇంగవాయ్యా ఇంగిరా

భగవం—(తనలో) ఎవరో పిలుచుచున్నారు. (ప్రకాశముగ) ఎవరయ్యా నీవు?

సదా—నాను కాఫీహోటల్ పంతులు. మాహోటల్కు రా అయ్యా.

నీలం—అయ్యా. మాకొట్టుకు రండయ్యా.

భగవం—నీవెవరు?

నీల—నేనుకూడా కాఫీహోటలు యజమానుడనే.

భగవం—నీవు తెలుగువాడవు. ఆయన అరవవాడునా? సరే బాగున్నది.

సదా—నా హోటల్కు రా అయ్యా! నల్లయిడ్లి నల్లకాపీ నల్ల ఉపమా.

భగవం—నల్లకాపీ యేమిటి? నల్లయిడ్లి యేమిటి?

సదా—నల్లఅంటే మననోరుండ్లే. ఆనోర్కి లోపల వేస్తే రంబ రంబ రుచిగా వుంటుంది.

నీల—అయ్యా. మాహోటలులో పులిహోర, మినపరొట్టె బొబ్బట్లు, పూరీలు సమస్తము వున్నాయి. మీరుతప్పక మాహోటలుకే దయచెయ్యాలి.

సదా—నాహోటల్కు రా అయ్యా!

నీల—అరే నాహోటలుకు వచ్చేవారిని నీవు తీస్కుపోతావేమోయి!

సదా—అరే పోడామట్టాడా. నేను నూస్తిని వాడిని మొదల

నీల—ఆయనచాలా పెద్దమనిషి. వాడినిగీడిని అంటావేమిటి నోరు సంబాళించుకో. నీవు మొదట చూడడమేమిటి. నేనే చూశాను.

సదా—అరే నీవు తప్పుడువాడివిరా. నేను సూస్తే నీవు సూశావు?

నీల—అట్టేవేలకు. చెప్పుదెబ్బలు తినేవు.

సదా—అరెపోడా. చెప్పుదెబ్బలు ఎవుండిద కొడతావునీవు. నీపై చార్జీయిస్తా.

నీల—నీదిక్కున్నచోట చెప్పుకో పో. రండయ్యా (అని చెయ్యి పట్టుకొనుచున్నాడు)

సదా—అయ్యరువాళ్! మీరు సూస్తున్నారుగదా వీడికూత పోలీసువాళ్ళకు నానుపో క్రేన్.

నీల—నీకొళ్ళుగాలా నీయిష్టము వచ్చినచోట చెప్పుకోరా?

భగవం—మీపుణ్యమయిరి మీరిక్కడ కొట్టుకోకండి. నేను మధ్యను సాక్ష్యము రాలేక చావాలి.

నీల—తమరు మాయింటికి దయచేస్తురూ. సాక్ష్యము అక్కర లేదు గీక్ష్యము అక్కరలేదు. అరసవాడినంట తమకు ససిపడదు కూడాను.

భగవం—సరే పదండి మీయింటికేవస్తా. ఎక్కడ మీయిల్లు?

నీల—ఇదిగోనండి ఆకనబడ్డె బంగాళా. దయచెయ్యండి. తమ మూటయుంటే యిలా యియ్యండి పట్టుకువస్తాను.

భగవం—బాబు! మీరు బ్రాహ్మలు, మీచేత మూట మా యించనా?

నీల—పరవాలేదు. ఇల్లాయిప్పించండి.

భగవం—(తనలో) రైలుదగ్గరనుంచి యీమూట మోయుట కెవడైనా రెండబ్బులు పుచ్చుకుంటాడు. అదిఅక్కరలేకుండా సమకూడినది.

(అని యిచ్చుచున్నాడు)

(కొంత నడచి యిద్దరు యిల్లు ప్రవేశించుచున్నారు)

నీల— తమరీకుర్చిమీద దయచెయ్యండి పంతులుగారు,

భగవం —సరే (అని కూర్చున్నాడు)

నీల— తమ కేమి కావాలి కాఫీవుంది. ఉపమావుంది. యిడ్డెన యుంది. పులిహోర బొబ్బట్లు బాదముహల్వా యేమికావలస్తే అవి యున్నాయి.

భగవం—అన్నీకూడా తీసుకురండి.

నీల—(అన్నివస్తువులు తెచ్చి యెదుట పెట్టుచున్నాడు)

భగవం—(ఒక అరగంటసేపు కూర్చుండి అన్నివస్తువులు హాయిగ తినుచున్నాడు

నీల—చాలునాండి యింకేమైనా పెట్టించనా? సోడావుంది కావలెనా?

భగవం—సోడా అక్కరలేదండి. కాఫీ తాగినాను గనుక యిక దాహము లేదు.

నీల—వస్తువులన్నీ బాగున్నాయాండి?

భగవం—ఓ. చాలాబాగున్నాయండి. ఇటువంటివస్తువులెప్పుడు నేను తినలేదు.

నీల—(తనలో) మొత్తము ఎంతయినదో లోపలకువెళ్లి లెక్క వేసికొని వస్తాను. (అని లోనికి పోవును.)

భగవం—(తనలో) కడుపు పూర్తిగా నిండినది. సాయంకాల ముదాకా భోజనముకూడా అక్కరలేదు. ఇక మనదారిని మనము వెళ్ళవచ్చును.

(అని మూటపుచ్చుకొని వెళ్ళుచున్నాడు)

నీల—(వచ్చిచూచి) అరే. ఏడీ ఈయన. (అని తొందరతో వీధిలోనికివచ్చి) వెళ్లిపోవుచున్నాడు. వెళ్ళిపోవుచున్నాడు. ఏమండోయి

ఓపంతులుగారూ పంతులుగారూ. ఓమూటపట్టుకువెళ్ళేపంతులుగారూ

భగవః—(వినిపించుకొనక) గొంతుకు బద్దలయ్యేటట్టు చించుకో ముండాకొడకా. (అని విసురుగా నడచుచున్నాడు)

నీల—(వెనుక పరిగెత్తిపోయి వగర్చుకొనుచు) ఏమిటండీ పిలుస్తూంటే పలకరేం?

భగవం—నన్నా పిలుస్త మీరు? ఎవరినో అనుకున్నాను? ఎందుకుపిలిచారు?

నీల—ఎందుకంటా రేమిటి. సొమ్మియ్యకుండా వెడతా రేమి

భగవం—సొమ్మెందుకు?

నీల—మీరిప్పుడు మా హోటలులో తిన్నవస్తువులకు.

భగవం—ఏమిచిత్రమయిన మనుష్యులయ్యామీరు? సొమ్ముకా మీరు నాకిప్పు డీవస్తువులు పెట్టినది. ఊరికేనే మీరు ధర్మసత్రం వేశారనుకొన్నాను.

నీల—సత్రంవేశానని యెల్లా అనుకుంటారయ్యా! మాహోటలుకు రండంటే మా హోటలుకు రండని నేనును సదాశివరావు దెబ్బలాడుకొంటిమి.

భగవం—అవన్నీ నాకు తెలియవు. డబ్బులుచ్చుకుంటానని నీవు నాతో చెప్పలేదు. ఆషరతు మనకు జరుగలేదు.

నీల—ఆషరతు జరుగనిమాట నిజమే. వచ్చేవాళ్లతో ముందు షరతులు మాట్లాడుతామా మేము?

భగవం—మాట్లాడకపోతే యియ్యవలసిన రూ లెక్కడున్నది.

నీల—అయితే యెగపెడతావా?

భగవం—ఎగబెట్టడమేమిటి యియ్యవలసిన అవసరమే లేనప్పుడు.

నీల—(నోరు బాదుకొనుచు) అయ్యో అన్యాయమా అయ్యో అన్యాయమా. ఇంత పచ్చిఘోరకలి యున్నదా. చూడండయ్యా చూడండీ యీచిత్రం. పైగా మహాడబ్బిచ్చీవాడిలాగే అన్నివస్తువులూ చెడతిన్నాడండి.

భగవం—నీయిష్టమువచ్చినట్టు నెత్తినోరు బాదుకో! నీయిష్టము వచ్చినట్టు తిట్టుకోగింజుకోవచ్చు. నేనొక్క దమ్మిడీయివ్వలిచ్చేవాడిని కాను

నీల— నారాయణ నారాయణ! యింతపాపమెక్కడా చూడ లేదండి. పదణాల డబ్బులు పోయినాయి. సదాశివరావుగాడూ నేనూ మాలోమాకు కలిసికట్టుతనంలేక పోటీలుపడి దెబ్బలాడుకొన్నందుకు నాకు తగినశాస్తి జరిగినది. ఇకెప్పుడూ పోటీలకు వెళ్ళకూడదు. బుద్ధి వచ్చింది.

(అని యేడ్చుచు పోవును.)

భగవం—(తనలో) ఈలాటి వెధవలు నూరుమందయినారు. ఈరోజుకు అవసరం తీరిందిగదా. రేపు యింకోవ్వూళ్ళో టోపీవేస్తాం.

(అని పోవుచున్నాడు)



# పిశాచవిలాసము

## 1 రంగము

(అప్పుడు దయ్యాలదాసు ప్రవేశించుచున్నాడు.)

దాసు—(తనలో) అన్నివిద్యలలోకి నావిద్య బాగున్నది. కచేరీకి వెళ్ళనక్కరలేదు. అంగరకాలు తలగుడ్డలు ధరించనక్కరలేదు.

ఒకడిఆజ్ఞలో నుండనక్కఱలేదు. ఎవడికి లోబడియుండనక్కఱలేదు. ఏమిలక్కఱలేకుండానె నెలకొక తహసిల్‌దారు జీతము సంపాదించు చున్నాను. పైత్యభ్రమగల నిర్భాగ్యులు లోకములో ఉన్నంతకాలము నాఆట సాగుతుంది. నేను దయ్యాలమంత్రగాడిననే బిరుదు నాకుం టుంది. చేతిలో ఖంగుఖంగుమని కావలసినన్ని రూపాయలు పడ తాయి. నా కుంకుమబొట్టు, నాయెఱ్ఱగుడ్లు, నాగడ్డము మీసములు చూచినవారు నన్ను తప్పక దయ్యాలమంత్రగా డనుకొందురు. ఈ గ్రామములో వేషము సాగినన్నాళ్ళు ఇక్కడ వేస్తాను. తరువాత ముందూరు తలాయిస్తాను. అదిగో! యెవడో వస్తూన్నాడు. సత్యసూరి గాబోలు! వీడి తలపండుపగలా వీడ్లాకడు నాకిక్కడ పోగైనాడు. దయ్యములున్నవని, వాటిని నేను వదులుస్తానని, నేనిక్కడ కోతలు కోస్తూంటే దయ్యాలులేవు మొర్రోయని వీడు బయలుదేరినాడు. వీడు నాకూట్లో మట్టిపోస్తాడో యేమిటో. అయినా వీలాంటి అవక తవకవాళ్ళ నెందరిని తకాయించినానుకాను.

(అంతట సత్యసూరి ప్రవేశించుచున్నాడు).

సూరి—దాసుగారూ! నమస్కారము.

దాసు—దయచెయ్యండి. భోజనమయినదా?

సూరి—ఆహా! తమదయవల్ల. మఱి నామాటేమిచేశారు?

దాసు—మీమాటేమిటి?

సూరి—దయ్యాలను నాకు చూపించడంమాట. నాకోరిక మొదటినుండి అదేకదా.

దాసు—నీవు మాచెడ్డతగాయిదా మనిషివయ్యా. దయ్యాలవి చూపించడమంటే సామాన్య మనుకున్నారా యేమిటి పిశాచాలిని మీరు చూడగలరా. పేగు సాగిపోతుందే! మీరు మూర్ఛపోతారు చూస్తే.

సూరి—నేను మూర్ఖపోను. నాకేమి భయములేదు. నే నర్ధ రాత్రివేళ అనేకపరియాయములు శ్మశానంలోకి వెళ్ళాను. వాళ్ళు జల్లుమనైనా అనలేదు.

దాసు—మీరు శ్మశానమునకు వెళ్లినప్పుడు మీకు కనబడక పోవచ్చును. కాని నే నిప్పుడావాహనచేశానంటే చెట్లుమీదనుండి కొండముచ్చులు దిగినట్టుగా చింపిరితలలు బానకడుపులు వంకరకాళ్ళు నిప్పులగ్రుడ్లు గాకపిడతనోళ్ళు చేటచెవులు వేసికొని దయ్యాలు నందలువేలు లక్షలు మీయెదుర వచ్చి నుంచుని తెయ్యియని ఆడుతాయి. అప్పుడు గాబరాయెత్తి కలరాజాడ్యమువచ్చినవాడులాగ నీవు సకల అభస్మారము అవుతావు చచ్చిపోతావు. నాకు మరో సందేహమేమీ లేదుగాని నీవు స్వచ్ఛమైన బ్రాహ్మడవు. నీవు నామూలాన్ని చచ్చి పోతే నీపెళ్ళాము బిడ్డలు నాకోసము యేడుస్తారే, ఏలా చూపించను వీడికి దయ్యాలు ? అని సందేహిస్తూన్నాను.

సూరి—ఆలాటి సందేహము మీకక్కఱలేదు. నాపెళ్ళాము బిడ్డలు మీప్రాణానికి యేడవరు. నాదిపూచీ.

దాసు—వాళ్ళు యేడవకపోవడానికి నీపూచీ యేమిటయ్యా? నీవు చచ్చిపోతే వాళ్ళేడవరా యేమిటి. ఒకవేళ యేడవరనుకో. నేను వేదశాస్త్రాలు చదువుకొని యింతవాడినై చూస్తూ చూస్తూ బ్రహ్మ హత్య చెయ్యనా? బ్రహ్మహత్యకంటె పాతకమున్నదా? నాచేతుల తో నే నెల్లాచెయ్యనటువంటిపని.

సూరి—ఇందులో బ్రహ్మహత్య యేమున్నదయ్యా.

దాసు—నీవు బ్రాహ్మడవు. నిన్ను చంపితే బ్రహ్మహత్య కాదటయ్యా.

సూరి—నాకోరికమీద చేస్తావు. అందులో పాతకమేది.

దాసు— చంపుమని కోరితేమాత్రం చంపవచ్చునా? అది యేలాగైనా బ్రహ్మహత్యే.

సూరి—నియంతట మీరు చంపితేతప్ప పాతకంరాదు.

దాసు—సరే పాతకం రాదనుకో! మీరు చచ్చిపోతే నాకు చరోచిక్కొస్తుందే.

సూరి—ఆచిక్కేమిటి. మీబుద్ధికుశలతకొద్దీ చిక్కులు వందల కొలది మీకు తోస్తూన్నాయి.

దాసు—ఆచిక్కేమిటో చెపుతా విను. అది అన్నిటికన్నా గొప్పది. నీవు చచ్చిపోతే పోలీసువారువచ్చి నన్ను పట్టుకుంటారు కొట్టులో వేస్తారు. ఇన్నాళ్లూ బ్రతికి యింటివెనకాల చచ్చేరా యన్నట్లు చివరకు నీమూలాన్ని ఖైదులోపడనా?

సూరి—మీరు ఖైదులోపడితే వదిలించుకోవడం మీచేత కాదా?

దాసు—చేతగాకేమి. నాలుగు దయ్యాలను పిలిచి మాట లాడినానంటే అర్థరాత్రివేళ వచ్చి కావలియున్న జవానులకు నాలుగు కర్చుకిచ్చి చప్పుడుకాకుండా తలుపులు పగులగొట్టి ఖైదులోనుంచి నన్ను వదిలించి నన్ను యెత్తుకు తీసికొనివెళ్ళి మాయింట్లో పరుపు మీద పడుకోపెట్టకలవు. అయితే అంతపనెందుకని. దేశమల్లా గోల యిపోతుంది. పైగా ఖైదులో పడ్డానన్నమాటే అప్రతిష్ట నాకు.

సూరి— వెంటనే వదిలిపచ్చినప్పుడు అప్రతిష్టయేముంటుంది?

దాసు—వదిలించుకురాగానే ఆమరునాడు ప్రొద్దున్నే ఖైదులో పడతారు. నేను ఖైదులోసికి వెళ్ళడం దయ్యాలు వదిలించడం యిదే పనా? ఇదిగాక యింకో గొప్పచిక్కుంది చూడండి. నేను ఖైదులో పడితే లోకాని కపకారం. ఏమంటే యిప్పుడు దయ్యాలుపట్టి బాధ పడేవాళ్ళ కందరికీ నేను వాట్టిని వదిలిస్తూ ఉపకారము చేస్తూన్నాను.

నేను లేకపోతే వాటిని వదిల్చేవారుండరు. ఎన్నికుటుంబాలకో హాని కలుగుతుంది. అదిగాక నేను గొప్పమంత్రగాడినగుటచేత దయ్యాలాట్టే పేట్రేగి మనుష్యులమీద పడుటలేదు. నేను ఖైదులోపడితే అవి పేట్రేగి మనుష్యులమీద పడి లోకమును నాశనం చేస్తాయి. అందుచేత నేను ఖైదులో పడడం యిష్టంలేదు.

సూరి—ఆలాగైతే మీరు ఖైదులో పడకుండాయుండే యుపాయం నేను చెపుతా వినండి. దయ్యాలపరీక్ష నిమిత్తం నాఅంతట నేనే దయ్యాలని చూపించమన్నానని మీతప్పులేదని నేను స్వదస్తూరీతో ఉత్తరం వ్రాసియిస్తాను. అది మీదగ్గర పెట్టుకోండి. మీకు భయము లేదు.

దాసు—(తనలో) పీడమ్మకడుపుకాలా పీడువదిలేవాడుకాడు. ఎన్నిదొంగయెత్తులు వేసినా యెత్తుకు పైయెత్తువేసి తనమాటే పైగా వుంచినాడు. ఇక వప్పుకోక తప్పదు. ఇక నాకేమీయుక్తి తోచడం లేదు. కానీ గతేమాతుందో అవుతుంది

సూరి—ఏమి టాలోచిస్తూన్నారు. జవాబు చెప్పరేమి?

దాసు—ఆలోచన యేమీ లేదు. పాపము మీమువస్తే ఆలోచిస్తూన్నాను. దయ్యాలు ఒకసారి వచ్చాయంటే ఆహారం పడితేనే కాని వెళ్ళవు. భయపడి మీరేనా చస్తారు. లేకపోతే అవైనా విరుచుకుతింటాయి. అవి పేట్రేగుతే నేనైనా ఆపలేను. కొరివిదయ్యాలు బాలింతదయ్యాలు ముసలిదయ్యాలు పడుచుదయ్యాలు పిల్లదయ్యాలు పెద్దదయ్యాలు శాకినీలు ఢాకినీలు కామినీలు భూతములు భేతాళములు యక్షిణీలు బ్రహ్మరాక్షసులు వచ్చి నిన్ను చుట్టుముట్టి నోట్లోనుంచి మంటలు, చెవుల్లోనుంచి జెర్రెలు, ముక్కులోనుంచిపాములు బయలుదేరుతూంటే, శవాలని పీక్కుతింటూ, పుర్రెలలో నెత్తురు పోసుకు తాగుతూ తలలు విరియబోసికొని తెయ్యని ఆడుతూంటే,

నే నెల్లాఆశనా వాటిని, నీ వెల్లాబ్రతుకుతావా యని నాకు గంపెడు బెంగ పట్టుకొన్నది. ఆపైన అవి గ్రామంలో పడి యేమికొంపలు తీస్తాయో యని భయంగావుంది.

సూరి — తమరంటే వాటికి గడగడకదా. అందుకుచేత గ్రామానికి భయంలేదు. నేను పోయినా నాకు విచారంలేదు. అందుకుచేత చూపించండి.

దాసు—సరే! మీ కర్మమునకు నే నేమిచేయను! ఎవరిపారబ్ధ మెలాగున్నదో అల్లాగాతుంది, బ్రహ్మలిఖిత మెవ్వడు తుడిచివేయగలడు. గీకు దయ్యాలచేతిలో చావుంది. మీజాతకరీత్యాకూడా మీకు మారకదశ ఉన్నది రేపుశనివారంరాత్రి చూపిస్తాను. నాతో శ్మశానమునకు రండి.

సూరి—తప్పక వస్తాను.

(అందఱు నిష్క్రమింతురు.)

---

## రంగము 2. శ్మశానభూమి.

(అప్పుడు దయ్యాలదాసు సత్యసూరి ప్రవేశించు చున్నారు.)

దాసు—సూరిగారూ! శ్మశానభూమిలో ప్రవేశించినాము. ఇక మీ యదృష్టములోనున్నది.

సూరి—భయములేదు. మీ మంత్రములవలననే దయ్యములు మనకు కనబడి వెనుకకు వెడలి పోవును.

దాసు—(తనలో) ఈ ముండకొడుకు మూలమున నాకు చావువచ్చినది దీపములు పెట్టిన తరువాత నే నిల్లుకదలలేను. కదిలితే చేటుభయము. అయినప్పటికి వీడు నాకు సాయమున్నాడు గనుక భయ ముండకూడదు. ఏమైనాసరే దుష్పనో సూచించి వీడికి, అదే

దయ్యమని చెపుతాను. వీడు మొండిబండలాగున్నాడు. వీడికి భయము లేదు ఏమీలేదు.

సూరి—దాసుగారూ! చెప్పులు తొడుగుకు వచ్చినారా? లేకపోతే యెముకలు మేకులు కుండపెంకులు వెదురుపేళ్ళు కాళ్ళలో గుచ్చుకోగలవు.

దాసు—తొడుగుకొనేవచ్చినాను (తనలో) నాకు భయము వేయుచున్నది. ఈయన చేయి గట్టిగా పట్టుకుంటాను. (ప్రకాశముగా) సూరిగారూ! మీచెయ్యి నా మీదవేసి నన్ను గట్టిగా కౌగలించుకోండి. మీరుభయపడి మూర్ఛపోతారేమో.

సూరి—నాకేమీ భయము లేదయ్యా!

దాసు—అలాగు కాదు. నామనవి చిత్తగించండి ఎందుకయినా మంచిది.

(అని ఆయన చెయ్యి తనమీద వేసికొనుచున్నాడు)

సూరి—దాసుగారూ! మీ శరీరము వణుకుతూన్నట్టుందేమి?

దాసు—(తనలో) నేను భయముచేత వణకడం వీడుగ్రహించి నట్టున్నాడు! దీనిని నేను సమర్థించుకోవలెను. (ప్రకాశముగా) నేను మంత్రాలన్నీ యిప్పుడు పునశ్చరణ చేయుచున్నాను. అందుచేత శక్తులు, దేవతలు అన్నీ వచ్చి నన్నావహించుచున్నవి. శక్తు లావహించినప్పుడు వొళ్ళు కంపమెత్తదా మరి?

సూరి—సరే! పదండి. (అని ముందుకు చూచి) అదేమిటండో దాసుగారూ! ఆ దుబ్బు ప్రక్కనుంచి యెవరో లేచుచున్నారు?

దాసు—(గడగడ వడకుచు) ఏడీ యేడీ! ఎక్కడ?

సూరి—అదిగో చూడండి దక్షిణంగాను!

(అప్పుడొక విగ్రహము ప్రవేశించుచున్నది.)

విగ్ర—(తనలో) తప్పకుండా నా యెదుట కనపడుచున్నవి దయ్యములే ఈ రెండు దయ్యములు నన్ను చూచిన పక్షమున తప్పక నామీద పడి చంపగలవు.

దాసు—సూరిగారూ! అది తప్పక దయ్యమే. నేను యెన్ని విధాలో మీతో చెప్పినాను. దయ్యములు కనబడతవి రావద్దయ్యా అని చెప్పినాను. నా మాట మీరు విన్నారు కారు. ఈ దయ్యము మిమ్మలిని నన్ను గూడ మింగి వేస్తుంది. దీనికి సాయంగా యింకా కొన్ని దయ్యాలుకూడా రావచ్చును.

సూరి—రానియ్యండి. భయములేదు.

దాసు—భయములేదని మీరంటే సరా? నాకు భయము గానేయున్నది.

సూరి—మీకే భయమా? భయముచేత నేను చచ్చిపోతానని మీరు చెప్పినారే. ఆలాటిది మీరే భయపడుచున్నారా?

దాసు—ఈవేళ యేమోకాని నా మంత్రముల పునశ్చరణ పనికిరావడంలేదు. మన యెదుటనున్న యీ దయ్యము మంత్రశాస్త్ర మంతా వచ్చిన బ్రాహ్మణ దయ్యములాగున్నది. అందుచేతనే నా మంత్రములు పనిచెయ్యక నాకు భీతి పుట్టినది.

సూరి—నేనున్నాను మీకు భయములేదు. నన్ను కౌగిలించు కోండి. ఏమి! మీ వొళ్ళంతా చెమటపడుతూంది. ధైర్యము తెచ్చు కోండి. ఆ విగ్రహము మనకేశే వస్తూంది.

దాసు—(భయముచేత మాటరాక) మీ మీ మీ నీ మూలాన్ని నే నే నే నే చచ్చిపోతున్నాను. చూడండి ఆ దెయ్యం మనమీద కొస్తూంది. అదిగో దాని కాళ్ళు వంకరగా నున్నవి. అది దయ్యమే.

విగ్ర—(తనలో) ఈ దయ్యాలు నన్ను చంపక మానవు ఇప్పుడేమిగతి. గట్టిగా కేకవేస్తాను. పొలములలోనున్న వాళ్ళెవరైనా నాకు సాయమువస్తారు. (అని) అంతా రండర్రోయి.

(అని కేక వేయుచున్నాడు.)

సూరి—(తనలో) ఏమీ యీ యాశ్చర్యము. దయ్యమా మనుష్యుడా యెవడు వీడు? దాసు చెప్పినట్లు దయ్యములే వచ్చుచున్నవా? ఇతడు ధైర్యముగా నున్నపక్షమున నేను ధైర్యముగా నుందును. ఇతడు మట్టిముద్దలా చదికిలబడుటచేత నా ధైర్యముగూడ చెడిపోయినది ఇప్పుడేమిగతి.

దాసు—సూరీ! నన్నొదిలిపెట్టవయ్యా! నే నిక్కడ నిలవలేను. ఆదయ్యము తక్కిన దయ్యాలనికూడా రమ్మని రండర్రోయి యని పిలుస్తూంది. అవన్నీ వచ్చిన తరువాత మనము బ్రతకనేలేము. ఇప్పుడే పారిపోదాము రా. నీవు రాకపోతే నేను వెళ్ళక మానను. నన్ను వదిలిపెట్టు.

(అని చెయ్యివదిలించుకొని పరుగెత్తుచున్నాడు)

సూరి—ఇక నిక్కడ నే నెందుకు.

(అని వాని వెనుక పరిగెత్తుచున్నాడు.)

విగ్ర—రండర్రో రండరోయి.

(అని వారి వెనుక పరిగెత్తుచున్నది.)

కాపులు—(పొలము విడిచి) ఎక్కడ ఎక్కడ. ఏమిటి ఏమిటి?

(అని వీరి వెనుక పరిగెత్తుచున్నారు.)

దాసు—(కొంతదూరము పరుగెత్తి, ఆయాసముచేత) చచ్చానర్రో. (అని క్రింద పడుచున్నాడు.)

సూరి—దయ్యాలురోయి బాబో దయ్యాలు.

(అని దాసుమీద పడుచున్నారు.)

విగ్రి—ఇక నే పరిగెత్త లేనగ్రోయి.

(అని వాళ్ళమీద పడుచున్నది.)

కాపులు—దీపం దీపం.

(అని యొకదీపము తెచ్చి చూచుచున్నారు.)

కాపు—(పై విగ్రిహాము లేవదీసి) వొవడవురా నువ్వు మడిశివా దయ్యానివా?

విగ్రి—(వగర్చుచు) కోంపడకండి చూపగ్రిబూ! నేను సాకలి సరివిగోణ్ణండి. ఆ దాసుగోరు దయ్యాలని సూపిత్తానని చూరిగారితో చెపుతావుంటే యిని దయ్యాలెల్లాగుంటాయో సూద్దారని ఎల్లి యీరిద్దరే దయ్యాలనుకొని యిల్లాపరిగెత్తుగొచ్చాను.

సూరి—ఏమిటి చాకలి సరివిగాడవటరానువ్వా నీవు దయ్య మనుకొని మే మిద్దరము పరిగెత్తుకొచ్చాము. దాసుగారూ! లెండి దయ్యము గాదు. చాకలి సరివిగాడు.

దాసు—(మెల్లగా) నీమాట నేను నమ్మను. అది దయ్యమే కాని మనిషికాదు. ఒకప్పుడు పిశాచాలు మనిషివేషము వేసికొని యిల్లా మోసం చేస్తుంటాయి.

చాకలి—బాబయ్యా! నేను దయ్యాన్ని కానుండి సరివిగాణ్ణండి చవారీలు మోసిన కాయ లియిగోనుండి.

దాసు—చాకలిదయ్యాలికి బుజాలమీద కాయలుంటాయి.

కాపు—లేవయ్యా యిప్పాటికి దయ్యాల్లేవు గియ్యాలులేవు. మా గొప్పమంత్రగోడివొచ్చావుపూళ్ళోకి. ఇల్లా దద్దిల్లి పారిపోయే వోడవు నీవేమిదయ్యాలోదులుత్తావు. నడునడు.

దాసు—బాబూ యీవేళకి బ్రతికాను. ఇక నెప్పుడు దయ్యాల మంత్రాలు చెప్పను. రండి వెడదాము.

(అందరు నిష్క్రమింతురు.)

# తుంబుర నారద సంవాదము

తుం—మహాత్మా నారదా! నీవు బ్రహ్మమానసపుత్రుడవు. నీకు తెలియనివిషయములు త్రిలోకములయందు లేవు. నాకు కొన్ని ధర్మసందేహములు కలవు. వానిని నీవు దీర్పవలయు.

నార—మిత్రుడా తుంబురా! నీవు నాసీడవలెనె యేకాల మందు సన్ననుసరించి తిరుగుచుందువు నీసందేహములుబాపుట నాకు ప్రథమవిధి. అవియేవో చెప్పుము.

తుం—చిత్తము. మహాప్రసాదము. కలియుగములో నధికార ములుగల కొందరు మనుష్యులు వెన్నెలలోగూడ సేవకులచేత లాంత రులు వేయించుకొని నడచుచుందురు సకలజగంబునకు చంద్రుడు దేవుడిచ్చిన గొప్పలాంతరుగదా అట్టి గొప్పలాంతరు వెలుగుచుండగా దానివెలుతురున సమస్త వస్తువులు కనబడుచుండగా లాంతరుదీపముతో నేమిప్రయోజనము. ఈసందేహము నాకు దీర్పవలయు.

నార—(నవ్వి) ఆహాహా! గొప్పసందేహమే కాని యీవిష యమున నీవు శంకానివృత్తిచేసికోవలసినదే? ఇదిగో కారణముచెప్పు చున్నాను వినుము. అధికారముగలవారిలో పెక్కుమందికి కన్నులు మునుపున్నచోట నుండవు. కన్నులు నెత్తికి వచ్చును ఆకారమాత్రము చేత కన్నులు మునుపున్నచోట నున్నను దృష్టి మునుపున్నచోట నుం డదు. అందుచేత కొందరధికారులకు కన్నులు తిన్నగగనబడవు. కన్ను లు పొరలుగప్పిపోవును. అధికారమదము దృష్టికడ్డమువచ్చును అట్లాక విధమైన గుడ్డితనము కన్నుల నావరించుటచే సరిగా కనబడక వెన్నెల లోగూడ లాంతరులు వేయించుకొందురు.

తుం—మహాత్మా చంద్రుని వెలుతురువల్ల కన్నులు గనబడని వారికి లాంతరు వెలుతురుపయోగించునా?

నార—కొంతవర కుపయోగించును. చత్వారము రేజీకటి యున్నవారికి సన్నదీప ముపయోగించనప్పుడు పెద్దవత్తివేసి దీప మెక్కువ కాంతిగలదిగ జేయుదురు. వట్టికన్నులు కనబడనప్పుడు సులోచనముల దృష్టివల్ల చక్క బడునట్లు చంద్రకాంతి కనబడకున్నవానికి లాంతరువెలుతురువచ్చి మునుపటిదానికి తోడుపడి కొంతకనబడవచ్చును. ఇట్లు కనబడక పోవుటచేతనే అధికారి నడచునప్పుడేమనుష్యుని మీాద పడునోయను భయముచేత బంటోతులు వానికంటె ముందు నడచి తొలగండి తొలగండియని బాటసారులను దొలగించుచుందురు.

తుం—భళీభళీ. మీారుచెప్పినది మిక్కిలి చక్కగా నున్నది. అయితే నిట్టియధికార్లకు ఏవస్తువులూ సరిగా గనబడవా?

నార—కనబడకేమి. వారికి కొన్ని చక్కగా గనబడును. తాబేదార్లయందు తప్పులు త్వరగా కనబడును. లోకుల బాధించుటకై క్రొత్తదార్లు క్రొత్తపుంతలు వేగముగ గనబడును. తమ యనుగ్రహము సంపాదించుకొనుట కాశ్రితులు తెచ్చినకట్నములు కానుకలు హిరణ్యాశ్రార్థములు చీకటిలోనైన కనుబడును. పైయధికారుల మెప్పించు నుపాయములు మఱిమఱి కనబడును.

తుంబు—మునీంద్రా! అధికారుల కన్నులయందేనా దోషముండుట, లేక మఱియితర అవయవములయందుకూడ దోషముండునా? వారికి చెవులు సరిగ వినబడునా మనసు సరిగనుండునా?

నార—మిత్రుడా! నీవడుగుచున్న ప్రశ్నములు మిక్కిలి మంచివి. నీప్రశ్నల కన్నిటికి దగిన యుత్తరములం జెప్పుచున్నాను వినుము. సందేహములు బాపికొనుట పురుషలక్షణము అట్లుచేయుటచేత నాకు మిక్కిలి సంతోషముగ నున్నది.

తుంబు—మీావంటివారి దర్శనము లభించినప్పుడె సందేహములు తీర్చికొనకపోయిన పక్షమున నూవంటివారి సందేహములు

తీర్చుకొనుట యెప్పుడు. అందుచేత నేనిప్పుడు మిమ్ముల్నొక్కటి యడుగు చున్నాను.

నార——సరే ఆకర్ణింపుము. అధికారుల కన్నులయందు దోష మున్నట్లె చెవులలో గూడ గొంతదోషముండును.

తుంబు——దేవా! ఆదోషమెట్టిది?

నార——ప్రజలు సాధారణముగ జేసికొనునట్టి మనవిసనవులు చప్పున వినబడవు. వారు కంఠము లెత్తి యరచినను ఒకప్పుడు గోల యెత్తుచున్నను అవి వినబడవు. పూర్వ స్నేహితులు పేదచుట్టాలు మొదలగువారి మాటలుగూడ వారికి తరుచుగా వినబడవు.

తుంబు——ఎందుచేత వినబడవు? చెవుడా?

నార——కేవలము రోగసంబంధమైన చెవుడు గాదుగాని యిది యొకవిధమైన చెవుడే.

తుంబు——ఈవిధమైన చెవుడున కవుషధము లేదా?

నార——ఈచెవుడురోగము వైద్యుల సహాయమువలన కుదురు నదిగాదు. మందులవలన మానునదిగాదు. దీనికి గొప్ప యౌషధ మొకటే యున్నది. " అధికారాంతమునందు జూడవలలెగా నాయయ్య సౌభాగ్యముల " అనువాక్యమునుబట్టి యుద్యోగమునుండి తొలగింప బడుటయే యాచెవుడునకు గొప్పమందు. ఇది యమోఘమైన యౌషధము. తక్కిన యౌషధము లొకప్పుడు పనిచేయును ఒకప్పుడు పని చేయవు. కాని యీయౌషధము మాత్ర మట్టిదిగాదు. దీనిశక్తి యమోఘమైనది.

తుంబు——స్వామీ! అధికారములో నున్నపుడు వారికేవి విన బడుచుండును?

నార——కొన్ని తప్పక వినబడుచుండును అవి యేవనగా కొండె ములు తప్పక వినబడుచుండును. కట్నములు కానుకలు ధాన్యము

కూరలు పాలు పెరుగు నెయ్యి పండ్లు మొదలగునవి పంపుదుమని తమకు లోబడిన మనుష్యులు చెప్పినట్టి మాట లెంతమెల్లగా జెప్పినను స్వచ్ఛముగ వినబడును. అందులో నొక్క యక్షరమైనను వినబడకపోదు. తమకు బహుమానముగదెచ్చిన రూపాయలు మంచివో కావో యని తెలిసికొనుటకై మోగించినప్పుడు కలుగు ధ్వని చక్కగా వినబడును. భార్య నగలుపెట్టుకొని ఘలుఘల్లుమని తిరుగుచున్న చప్పుడు హాయిగా వినబడును. తనకుగిట్టని మనుష్యులు ఏమూలలనో గూర్చుండి చెప్పుకొనిన చాటుచాటు మాటలన్నియు గట్టిగా వినబడును. ఇన్కంటాక్సు మొదలయిన పన్నులు గట్టుటకు ఉన్నసంగతులు లేనట్లు లేనిసంగతు లున్నట్లు వినబడును. మనుష్య లోకసంగతి చెప్పుకొన్నపుడు మరియొక సంగతి వినబడును. ప్లీడర్లొకవాదముసేయగా వీరిచెవులకు మరియొకవాదము వినబడును.

తుంబు—మహాత్మా మీయుపదేశమువలన ధన్యుడనయితిని.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



# మెట్ట వేదాంతము

(అప్పుడు బలరామస్వామిగారు, నీలకంఠముగారు ప్రవేశించుచున్నారు.)

నీల—బలరామస్వామయ్యగారూ! ఇది పూర్వజన్మవాసనో యీజన్మవాసనో నే నెరుగనుగాని మీరు మాసావిట్లోకి రాగానే గుప్పున వాసన కొట్టుచున్నది.

బల—మీరు పూర్వజన్మవాసన యీజన్మవాసన రెండు కూడా లేనివారు. మీరు సౌఖ్యపడలేరు ఒకరు సౌఖ్యపడుతూంటే చూడలేరు.

నీల - నీకు నీసౌఖ్యమునకు వెయ్యి నమస్కారములు. నాకు యీ తాగుబోతుసౌఖ్యము వెయ్యి జన్మాలకైనా వద్దు. నా కేకాదు నాశత్రువులకైనా వద్దు.

బల—కావలెనంటే మాత్రము వస్తవా. తనకు ధైర్యముండవలె, ఓర్చుకొనేశక్తి యుండవలె. మీవంటి అప్రయోజకులకు యిటువంటి శక్తులు రావు.

నీల—రాకపోతే మానెగాని నాదొక్క మనవున్నది. చిత్తగించండి.

బల—ఏమిటో ఆమనవి చెప్పండి కొంచెము సేపు చిత్తగిస్తాము.

నీల—మీరు పట్టపగలు మాత్రము మద్యపానము చేయవద్దని నా మనవి.

బల—రాత్రి చేయవచ్చునా యేమి ?

నీల—రాత్రి చేయకూడదు.

బల—రాత్రి చేయకూడదు. పగలు చేయకూడదుగదా. రాత్రి చేయవచ్చునని మీరు యేలా చెప్పుచున్నారు. పాపమైనప్పుడు పగలు చెయ్యకూడనిది రాత్రి చేయవచ్చునా ?

నీల—పాపమన్నమాటకు సందేహము లేదు. పగలు త్రాగ వద్దన్నదానికి కారణము వినుడు. రాత్రిలు మీరు మీయింటివద్దనే యుందురు. మీకంపు మాకు, మీబంధువులకు యింపుగానుండును. పగలు త్రాగివచ్చినపక్షమున యీకంపు మేము భరింపలేకుండ నున్నాము. పైగా పగలు మీ రనేకవ్యాపారములమీద పోవుదురు.

ఒళ్ళు తెలియక పడిపోయిన చాల ప్రమాదము సంభవించును. అప్ర తిష్టవచ్చునన్నమాట నేను చెప్పగలను. ఏలననగా యింతకంటె యప్ర తిష్ట యిక వచ్చుటకు వీలు లేదు.

బల — మీరేదో పాపమనుచున్నారు. పాపములు పుణ్యములు జాంతానై. యజ్ఞములో బ్రాహ్మణుడు మేకను చంపితే పుణ్యము. కసాయివాడు మేకను చంపితే పాపమా? మేము వేదాంతులము. నల్లిని పేనును చంపితే యెంతో ఆవును మేకను చంపితే అంతే. మని షిని చంపినా అంతే. అన్నీ జీవములే. అన్నీ ప్రాణములే. ఉద్యోగము లలో చేరినవారు సర్కారువారి ఆర్డరుప్రకారం కుక్కలను చంపించు చున్నారా లేదా? అందువలన పాపమా పుణ్యమా? లోకములో పాపము లేదు. పుణ్యము లేదు. ఏదో ప్రతిష్ట అని సెలవిచ్చేరు. ప్రతి ష్టేమిటి అప్రతిష్టేమిటి పిచ్చమాటలుగాని. లోకులందరు చేరి వాడు తాగుతాడని చెప్పుకొన్నంతమాత్రమున వాడికివచ్చిన నష్టమేమి? ఈ చెప్పుకోవడమువల్ల వాడికి సారాయి దొరకడం లేదా? అప్పులవాళ్ళు బదుళ్ళివడము లేదా? ఆస్తి ఉన్నంతమట్టుకు మంచివాడికి చెడ్డవాడికి అప్పులిస్తారు. ఆస్తి లేనప్పుడు శుద్ధశ్రోత్రియుడికి అప్పు లియ్యరు, తాగుబోతుకు అప్పులియ్యరు. మీరందరు ఏమనుకుంటే నాకేమి? నన్ను మెచ్చుకునేవాళ్ళు నన్ను మెచ్చుకుంటారు. తాగుటకు డబ్బు లేనివాళ్ళెందరో కాళ్ళులాగి నడుముపీకి, మతిలేక నావద్దకు వత్తురు. వచ్చినప్పుడు నేను వాళ్ళ నాదరించి ప్రతివాడికి త్రాగినంత సారా పోయిస్తాను. అప్పుడు వాళ్ళు సంతోషించి మహారాజా! నీవు వెయ్యే ళ్ళు బ్రతుకు. నీవు ధర్మరాజవు! నీవంటివాడికి జమీలు రాజ్యాలు యివ్వక దిక్కుమాలిన భగవంతుడు పిసినిగొట్టుముండావాళ్ళ కిస్తాడు. నీచేతిలో రాజ్యాలుంటే కల్లుచెరువులు, సారాసరస్సులు, బ్రాందీ కాలువలు [illegible] అని నన్ను స్తోత్రము చేస్తారు.

చేగోడీలువంటి కుండలాలు చెవులకు తగిలించుకొని చిరుగుల శాలు వొకటి మీద కప్పుకొని చెవులు తడికెలు కట్టునట్లు ఏవో రెండుపన సలు చదువు అవధానిగారికి ఏవో బేడడబ్బులిస్తే ఇంద్రుడవు చంద్రు డవని స్తోత్రములు చేస్తాడు. నీ మెప్పుకి నామెప్పుకి భేదమేమిటి ?

నీల — ఓరిబాబు యిదేమి వేదాంతమయ్యోయి. మెట్టవేదాం తములాగున్నది.

బల — మెట్టవేదాంతమో పల్లపువేదాంతమో నాకు తెలి యదు. త్రాగుడు మంచిది. దేవతలుత్రాగే అమృతమేమిటి? అది సా రాయే. యజ్ఞములలో చేసే సోమపానమేమిటి? అది సారాయే. సారా అమృతరసాయనము, దేవతలు త్రాగుబోతులు, మునులు త్రాగు బోతులు, ప్రపంచమంతా తాగుబోతులు. తాగుట వైద్యశాస్త్ర రీత్యా చాలామంచిది. ఒంటికి హుషారీయిస్తుంది. మనస్సుకి మరవ రాని ఆనందము ఉత్సాహము కలిగించును.

నీల — ఇక నీతో వాదించేవాడు లోకంలో లేడు.

బల — వాదములన్నిటిలోకీ శిరోభూషణ మింకొకటియున్నది విను. తాగుడు లోకోపకారము. నావంటివాళ్ళు లోకంలో యెం దరో వుండబట్టికదా సారావర్తకులు బాగుపడుచున్నారు. నావంటి వాళ్ళని నమ్ముకునేకదా యిజారాదార్లు పాటపాడుచున్నారు. నావం టివాళ్ళు లేకపోతే వాళ్లందరు యేమికావలసినది? ఉపకారముట్లుండగా త్రాగవద్దనుట గొప్పనేరము. ఏమనగా తాగవద్దంటే సర్కారుకి గొప్పనష్టము కలుగజేయుడమన్నమాట. నీమాటలువిని అందరు త్రా గకపోతే సర్కారుకి కోట్లకొలది నష్టముకదా ! ఇటువంటి మాటలు చెప్పేవాళ్ళు దుర్మార్గులు. సర్కారుకు నష్టము కోరేవాళ్ళు. నీమొఖం చూడకూడదు.

నీల — బాబూ, నీతో మాట్లాడినందుకు నాదే బుద్ధితక్కువ. పాపము పుణ్యము లేదన్నవానితోను ప్రతిష్ట అప్రతిష్ట లేదన్నవానితోను, పైగా మావంటివాళ్ళు సర్కారుకు నష్టము కలుగజేస్తారు అనేవాళ్ళతోను మాట్లాడడము చాలాకష్టము. యుక్తికి యుక్తి చెప్పగలముగాని మొండివాదమునకు జబాబు చెప్పలేము. నీవంటివాళ్ళని నమ్ముకొని సారాయిజాతాదార్లు పాటపాడుచున్నారు. నీవంటివాళ్ళను నమ్ముకొని భోగమువాళ్ళు పడుచుపిల్లలను పెంచుకొనుచున్నారు. నీవంటివాళ్ళను నమ్ముకొని కసాయిదుకాణపువాళ్ళు మాంసపుదుకాణములు పెట్టుచున్నారు. ఇటువంటివాళ్ళందరిని పోషించుటకై మహానుభావుడవు అవతారమెత్తినావు. నీకు వేరేజన్మము లేదు.

బల — నాకు జన్మము లేనిమాట నిశ్చయము. నీ వెన్నివేల పర్యాయములో పుట్టి చచ్చుచుందువు.

నీల — నీకు పిశాచ జన్మమేగాని మనుష్యజన్మలేదు.

(అని నిష్క్రమింతురు).

(అప్పుడు రామస్వామి, క్రిష్ణస్వామి, ప్రవేశించుచున్నారు)

రామ — ఇందులో తప్పు నాకేమికనుపడదు.

కృష్ణ — లంచములు పుచ్చుకొనుట తప్పేకాదా? అట్లయిన గవర్ణమెంటువారిది గొప్ప నేరముగ నెంచి, లంచగొండులకు శిక్షలేల వేయుచున్నారు?

రామ — గవర్మెంటువారు తెలివితక్కువశిక్షలు వేయుచున్నారు వారికి దీనిలోనున్న పరమార్థము తెలియదు.

కృష్ణ — లంచముపుచ్చుకొనుటలో పరమార్థముకూడనున్నదా?

రామ — ఎంతపరమార్థమున్నదో నీకేమి తెలియును? లంచము పుచ్చుకొనుట అనగా పరోపకారము చేయుట. లంచము పుచ్చుకొనినవాడు పరోపకారమేమిటో జన్మమధ్యమందెరుగడు. ఇద్దరు తగ

వులాడి నేను మేజస్ట్రీటును గనుక నావద్దకు వస్తారు. వచ్చినప్పుడు ఒక రివద్ద లంచము పుచ్చుకొని వానికుపకారముచేయుచున్నానా! లేదా?

కృష్ణ— ఈలంచమువల్ల రెండవవాని కపకారము చేసినావా! లేదా ?

రామ—ఓయి పిచ్చవాడా! రెండవవానికి ఎప్పుడుకూడా అపకారము జరిగి తీరుతుంది. ఒకరిమీద నొకరు చార్జియిచ్చినప్పుడు అధికారి ఇద్దరితరఫు తీర్పు చేయలేడుగదా! ఎవడో ఒకడితరపె తీర్పు చేయును. అందువల్ల ఒకడికుపకారము. ఒకడికపకారము జరుగును. లంచము పుచ్చుకొన్నవాడుకూడ ఆప్రకారమే ఎవడో ఒకరితరపునే తీర్పుచేయును. ఎవడికో ఒకడికే అపకారము జరుగును.

కృష్ణ—ఓరి! నీతెలివి తగలబెట్టా. న్యాయమయిన అధికారి తీర్పుచేయునపుడు నేరస్థులకు శిక్షకలుగును నేరములేనివాడికి గౌరవము జరుగును. లంచగొండులు తీర్పుచేసినపక్షమున నేరస్థుడు శిక్షలేకుండ తప్పించుకొని పోవును.

రామ—ఇదా నీగొప్ప సందేహము? సరిలే! పిచ్చిపుల్లాయవలె నున్నావు. నేరస్థుడు శిక్షలేకుండ తప్పించుకొనిపోవుట మంచిది కాదనుచున్నావా? నేరస్థుడు పాపము! తెలియక ఏదో అవకతవకపని చేస్తాడు. అందుకువానిని జైలులోనికి పంపితే వానిపెండ్లాము బిడ్డలు గోలుగోలుమని ఏడవరా! వాడు జైలులో మట్టితట్టలు మోసి అవమానముపాలు గాడా? వాడిని వదిలివేయుటవల్ల వాని కవమానము తప్పించి వానికి, వానికుటుంబమునకు, ఎంతోఉపకారము చేయుట కాదా? వాళ్ళవాళ్ళెంత సంతోషిస్తారు? ఇదంతా పరోపకారము కాదా?

కృష్ణ—ఇదిఅంతా పిరియాదికి అన్యాయము కాదా? పిరిమాదికి ఇందువల్ల రెండు అపకారములు జరుగును. మొదట్ల నేరస్థుడు

వానినికొట్టిమో, తిట్టిమో అపకారము చేసినాడు. వాడు చేయగా మిగిలిన అపకారము కేనుకొట్టివేయగా మీరుచేస్తారు. ఇక లోకము లో న్యాయమే లేదన్నమాట.

రామ—న్యాయములేదా? ఎవడో ఒకడు కష్టమనుభవించ వలసిన దేనా! పిరియాదితరపుతీరుపు చేస్తే ముద్దాయికినష్టము, ముద్దాయి తరపు తీర్పు చేస్తే పిరియాదికినష్టము. ఎవడికో ఒకడికి నష్టము కలుగు తూనే వుంటుంది. ఇందులో మన కెవరిమీాద ఇష్టమో వారికి ఉపకా రం చేస్తుంటాము. ఇదికాక ఇంకొక సంగతి చెస్తాను. పిర్యాదిముద్దా యిల యిద్దరిని విచారించి, ఎవరితరపు న్యాయమో వారితరపే తీర్పు చేయ నిశ్చయించుకొని వానిదగ్గరనుంచే లంచము పుచ్చుకొనునెడల తప్పేముంది? ఇందువల్ల పిర్యాదీకి న్యాయము జరుగును. నేరస్థుడు శి క్షింపబడును. మాకు లంచము దొరుకును. ఇందులో పాపమేమి? తప్పేమి?

కృష్ణ—నీకు పాపము తప్పు తెలియుడము లేదా! సర్కారువారు నీకు జీతమిచ్చుచున్న దెందుకు? ఎవరివల్లను లంచము పుచ్చుకోకుండా న్యాయము చేయవలసినదనికాదా?

రామ—సర్కారు ఏర్పరచడానికేమిలే! ఇన్నిమాటలెందుకు నేను వేదాంతముచెప్తాను? లంచము చాలమంచిదిగనుకనే దేవతలు కూడా లంచము పుచ్చుకొంటారు. దేవుడికిచేసే సేవలు ఉత్సవములు లంచములుకావా? దైవస్తోత్రములేమిటి! లంచములుకావా? యో గములు నోములు ఏమిటి! దేవతలను మెప్పించుటకు కావా? వెంక టేశ్వర వ్రతములు, సత్యనారాయణ వ్రతములు లంచములుకావా? దేవతలు మనకు జబ్బులుచేయించడము, మనచేత మొక్కులు పుచ్చు కోవడము, అప్పుడు జబ్బులుపోగొట్టడము, దేవతలకే దిక్కులేనప్పుడు

ఉప్పు పులుసు తినేమనకా ? పైగా అద్వైతపరికారము లంచమిచ్చే వాడు లేడు, పుచ్చుకొనేవాడు లేడు. అంతామాయ అంతామిథ్య.

కృష్ణ—నీవేదాంతము మెట్టవేదాంతము ఇది న్యాయమార్గం లో వెళ్ళేవాడికి పనికిరాదు.

రామ—న్యాయము న్యాయమని గుంజుకుంటావు. న్యాయమే మిటి ? లోకములో న్యాయము, అన్యాయము అనునవి లేవు. అవి పిచ్చివాళ్ళు పెట్టిన భేదము. నీకు న్యాయమైనది నాకన్యాయము; నాకు న్యాయమైనది నీకన్యాయము.

కృష్ణ—ఈ మొండివాదములు చేసేవాళ్ళతో మాట్లాడేది కష్టము. అందుచేతి నీతో వాదించ తలచుకోలేదు.

రామ—పోనీ యీవిషయమై వాదము కట్టిపెట్టి మరియొకవిష యమడుగుతాను చెప్పు.

కృష్ణ—నీవిషయము లన్నియు విషములవంటివే. చెప్పుటకు వినుటకుగూడ బాధకరములైనవి.

రామ—మమ్ము తిట్టదలచుకొన్నపక్షమున ఏకముగా అన్నిటికి నొక్కసారియె తిట్టవచ్చునుగాని ముందుగా చెప్పేది వినుము.

కృష్ణ—అడిగేదేమిటో త్వరగా అడుగు.

రామ—అబద్ధములాడుటవలన లాభమున్నదా లేదా ?

కృష్ణ—నీవంటి దుర్మార్గులకు లాభమే. లోకమునకు నష్టము.

రామ—లోకమునకు నష్టము లేదు, లాభమే.

కృష్ణ—ఒకరికి నష్టము లేకుండ మరియొకరికి లాభ మెట్లు వచ్చును ?

రామ—ఒకరికి నష్టము లేకుండ ప్రపంచములో నెన్నడు నుం డదు. కాని యబద్ధములవలన గొప్పయుపకారములున్నవి. అవి చెప్పెద వినుము. "అశ్వద్ధామ హతఃకుంజరః" అని మెల్లగ నొక చిన్న

యబద్ధమాడుటవలన ధర్మరాజున కెంతలాభము కలిగినదో చూడు! ఎందరెందరో మహావీరులకయిన చంపుటకుశక్యముగాని ద్రోణాచార్యులు క్షణములో చచ్చిపోయినాడు. ధర్మరాజునకు నరకమువచ్చి సత్యము సత్యమని మొత్తుకొనే మీయందరకు పుష్పకవిమానము లెదురు వస్తాయా యేమిటి? ఎన్ని యేడిచినా మీకు నరకకూపా లేగాని మరి యొక యేడుపులేదు. చంద్రహాసకథలో విషయయనే పిల్ల తప్పుసృష్టి చేసినందువల్ల చంద్రహాసుడు బ్రతికినాడు. ఆమె యాపని చేయని యెడల చంద్రహాసుడు చచ్చిపోవును గదా?

కృష్ణ—నీకు వాళ్ళచరిత్రలే జ్ఞాపకముకు వస్తాయిగాని బలిచక్రవర్తి హరిశ్చంద్రుడు మొదలగువారి చరిత్రలు నీకు జ్ఞాపకము రావుగదా.

రామ—జ్ఞాపకము రాకేమి! తనపట్టిన కుందేటికి మూడేకాళ్ళని సత్యము సత్యమని వీరులాడి యెదవన్నరయెదవలయి రాజ్యము పోగొట్టుకొని అడ్డమయినవాళ్ళ కాళ్ళు పట్టుకొని చెడిపోయిన భ్రష్టులు వీళ్ళేకదా యని నాకు జ్ఞాపకము వచ్చుచుండును. హరిశ్చంద్రనాటకము విన్నప్పుడు, ఆడినప్పుడు, అది విని చూచిన మన కుఱ్ఱనిర్భాగ్యులు, ఆ తెలివితక్కువముండాకొడుకులవలె చెడిపోతారేమో యని నా ప్రాణాలు పీచుపీచుమంటూంటాయి. ఇటువంటి పుస్తకా లచ్చువేయకుండా గవర్నమెంటువారు రూలు ప్యాసుచేస్తే బాగుండును. ఎవరైనా కవీశ్వరులు బయలుదేరి శుక్రాచార్యులవారి చరిత్ర నాటకముగాను పురాణముగాను వ్రాస్తే యెంతో బాగుండును. ఈపాడు కవీశ్వరులు పలిలేనిమంగలి పిల్లితల గొరిగినాడన్నట్లు అవకతవక పుస్తకాలు వ్రాయకపోతే ఆ మహానుభావుని చరిత్ర వ్రాయరాదూ? పుణ్యము పురుషార్థము కూడాను. అమ్ముకుంటే గోనిసంచెకు రూపాయలు వస్తాయి. అహాహా! ఆ మహానుభావు డెన్ని చెప్పినాడయ్యా! చచ్చి స్వర్గాన్ని

న్నాడు, చల్లని వేళ జ్ఞాపకానికి వచ్చినాడు. "వారిజాక్షులందు వైవాహికములందు। ప్రాణవిత్తమానభంగములను చకితగోకులాగ్ర జన్మరక్షణములం బొంకవచ్చు నఘముబొందదధిప॥" అన్నాడు. అహాహా! అక్షరలక్షలుగదా యీమాటల కీమ్మతు.

కృష్ణ—శుక్రుని మెచ్చుకొనుటచే అతని శిష్యులైన రాక్షసులలో పుట్టవలసినవాడవు నీవు.

(రామస్వామి కృష్ణస్వామి ప్రవేశము.)

రామ—మేము శుక్రాచార్య శిష్యులైన రాక్షసులలో జేరనివారమంటివి. రాక్షసులైనంత మాత్రమున మాకప్రతిష్ఠ లేదు. రాక్షసులలో నన్నంతపరిజ్ఞానంతులు మరెక్కడ లేరు. మీదేవతలకంటె ఆరాక్షసులే మంచివారు. రావణాసురుడు మీదేవేంద్రునికంటె దేనిలో తక్కువ? దేవేంద్రునియొక్క సత్ప్రవర్తనము అహల్యచరిత్రమువలన తెలియును. బలిచక్రవర్తివంటిదాత మీదేవతలలోగని రాజులలోగానికలడా! రాక్షసులలోనుండే పరాక్రమవంతులు మూడులోకములలోను లేరు. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు తారకాసురనరకాసురులు వృషపర్వవజ్రనాభులు ఎంతెంత పరాక్రమవంతులో మీమునిముండాకొడుకులు వ్రాసినపుస్తకములలోనె తెలియును. రాక్షసులమీద గిట్టకయీాగడ్డాలపోతులైన ఋషులు వాళ్ళను గురించి యెన్నెన్నో యబద్ధపుగాథల వ్రాసినారు. వాళ్ళుదుర్మార్గులట. స్త్రీఘాతకులట. దొంగలట. యీదేవతలలోను మునులలో నపాతురెందరో గలరు.

కృష్ణ—రాక్షసులే మంచివాళ్లైన పక్షమున రావణాలయము తారకాలయము అనిపేరిడి కొన్ని గుళ్ళుగోపురములు కట్టించు. దానివలన నీకు పుణ్యము పురుషార్థము పేరు ప్రతిష్ఠ వచ్చును

రామ—నాదగ్గర డబ్బున్నపక్షమున ఇప్పుడున్న రాములవారు కృష్ణమూర్తి దేవాలయములన్నియు పడగొట్టించి రావణ కుంభకర్ణుల

కు హిరణ్యాక్ష హిరణ్య కశిపులకు మంచి మంచి యాలయములు కట్టింతును. ఇప్పుడప్పుడనకుండా యెల్లకాలము ఆదేవాలయములలో భోగము మేళము లాడే టట్టు చేస్తును

కృష్ణ—నీవెల్లకాలము భోగము ముండల తోనె కాలక్షేపము చేయుచున్నావు గనుక నీకువాళ్ళతోనే స్వర్గము మోక్షము. వాళ్ళ మూలముచేతనే యింతవరకు బాగుపడ్డావు. ఇక ముందుగూడ బాగుపడతావు. నీవేగాకుండా దేశములోగల కుట్టవాళ్ళనుగూడ బాగుచేయదలచుకొన్నావు.

రామ—భోగమువాళ్ళుండడమువల్ల లోకములకు గలిగే ఉపకారము లెఱుగని మూర్ఖుడవు. నీతో నేనేమని వాదించను?

కృష్ణ—ఆయుపకారము నీవేయెఱిగి నీవేపొందుము. నాకక్కఱలేదు

రామ—నీకు గావలసినదురాదు. భోగమువాళ్ళవల్ల ఉపకారములు చెపుతాను విను. ఇప్పుడైనా బాగుపడుదుగాని. వివాహములలో వాళ్ళుంటేనేశోభ. అదిలేని పెళ్ళి బోడిపెళ్ళి, పైగావాళ్ళను రక్షించడంకూడా లోకోపకారమే. వాళ్ళీరోజులలో తగినప్రాపకములు లేక అన్నవస్త్రములకు దూరమైయున్నారు. అన్నము లేనివాళ్ళను రక్షించడం పరోపకారముకాదా ఈధర్మసూక్ష్మములు తెలియక మీరు మూర్ఖులై చెడిపోవుచున్నారు.

కృష్ణ—ఈధర్మ సూక్ష్మములు మాకు తెలియనక్కర లేదు. నీవే తెలిసికొని బాగుపడుము.

(అని నిష్క్రమించుచున్నారు.)

# పితృదేవతల మహాజరు

మ॥ రా॥ రా॥ శ్రీ విష్ణువర్ధనపురము మునిసిపల్ అధికారులదివ్య సముఖమునకు—

విష్ణువర్థనపురమందు కొంతకాలము కాపురముండి అక్కడనే చచ్చిపోయి ప్రస్తుతము పితృదేవతలమైయున్న (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర)లయొక్కయు, కంసాలి, కమ్మరి, కంచరి, వడ్లంగి, చాకలి, మంగలి, సాలి, దేండ), జంగము, ఈడిగ, గమళ్ళ, యెరుకల, మాలమాదిగ మొదలగు సమస్త వర్ణములవారి యొక్కయు మహాజరర్జీ విన్నపములు

మాలో స్త్రీపురుషుల మందరము యీమహాజరర్జీలో వ్రాలు చేయుచున్నాము. మాలో మైనర్లుకూడ కొందరున్నందున వారిపక్షమున మాలో పెద్దలమయిన వారందరము సంరక్షకులుగానుండి యీ అర్జీలో వ్రాలు చేయుచున్నాము. కాబట్టి మా యావజ్జనముల యొక్క అర్జీవిన్నపములు తమరు సావధానముగా చిత్తగించవలయునని యందుమూలముగా ప్రార్థించుచున్నాము. ఈపట్టణమందు మహానుభావు లయిన గౌతములవారి అనుగ్రహమువల్ల గోదావరినది ప్రవహించుచున్నది. ఆయేటియొడ్డున శ్మశానభూమి లేర్పడి యున్నవి. చచ్చిపోయినప్పుడు మమ్మందఱిని యిక్కడికి మాబంధువులు మోసి తీసికొని వచ్చుటకయి చాలా శ్రమపడుచున్నారు. ఆశ్రమకుదోడుగా వారిమనస్సులో బంధువియోగదుఃఖ మొకటి పెల్లుగా వేధించుచున్నది. ఆరెండు శ్రమలకుదోడుగా మీరుకూడ బ్రతికియున్న మాబంధువులకు అధిక శ్రమను గలిగించుచున్నారు. ఏలయనగా మేము చనిపోయినప్పుడు మమ్ము మోసికొనివచ్చినవారున్ను, మావెంటవచ్చిన వారున్ను, యిసుక

తిప్పలలో యెండకాలములో నెత్తిమాడుచు యెండలో నిలిచియుండ వలెను వానకాలములో హోరున కురియుచున్నవానలో నిలిచియుం డవలయును. బ్రతికియున్న ప్రజలు యెన్నివిధముల మొరలు పెట్టు కొనినను, నాలుగుపందిళ్ళు శ్మశానభూములలో మీరు వేయించలేక పోయినారు. మాపట్టణమువల్ల వచ్చే సొమ్ములోనుంచి ఖర్చుపెట్టి పందిళ్ళు వేయించమని ప్రజలు వేడుకొనుచున్నారు గాని, మీ యింటి లోనున్న మీధనము పెట్టి వేయించమని కోరలేదు. ప్రజలు చెప్పు కొన్నను మీరు లక్ష్యముసేయరు. పత్రికలలో వ్రాసినను మీరు శ్రద్ధచేయరు. స్వయముగా మీకు తోచదు. మీకీ మొండితన మెందు చేత కలిగినది. "దూషణభూషణ తిరస్కారంబులు దేహంబునకుగాని పరమాత్మకు గావు." అను సిద్ధాంతము నమ్మిన వేదాంతులామీరు? లేక బుద్ధి గడ్డితిని మిమ్మందఱను అధికారములోకి తీసికొని వచ్చినం దుకు ప్రజ లీవిధముగా కష్టము ననుభవించవలసినదేయను సిద్ధాంత ములో జేరినవారా! లేక చచ్చినవాళ్ళు అగ్నిహోత్రములో కాలు చుండ బ్రతికినవాళ్ళు యెండలో కాలుచుండవలెనని కోరికా? చచ్చి పోయినవాళ విషయమైనను యీవిధమయిన సదుపాయము చేయ లేని మీరు యెందు కధికారమువహించి యుండవలెను? కుర్చీ లలం కరించుటకా! కుర్చీలను నల్లు లాశ్రయించియున్నవి. మీరును ఆశ్ర యించి యున్నారు. భేద మేమి? ఈఅర్జీదారులలో మీబంధువులమనే కుల మున్నాము, బ్రతికియున్న పౌరులు మొర బెట్టుకొన్నప్పుడు మా ణిక్యములువంటి మీహృదయములు కఱుగక పోయినను, మీమృత బంధువులమైన మేము పితృలోకమునుండి ప్రత్యేకము పనిగట్టుకొని వచ్చి మీకొక అర్జీ నిచ్చుకొన్నయెడల బంధువులమను నభిమానము చేనైన మామాటలందు గొంచెము గౌరవ ముంచురేమో యని ఈఅర్జీని వ్రాసితిమి. [illegible] ధామములు

యిన తమకు మాబంధువులను నభిమాన ముండునని నమ్మకములేదు. అందులో బ్రతికియున్నవారే అనుదినము మొరలుబెట్టుకొనుచుండగా ఆమొరలే వినబడని మీచెవులకు చచ్చినవాళ్ళ మొరలు వినబడు ననుట కలలోనివార్త. అయినను మీయనుగ్రహ మెట్లు వచ్చునో యని యీమహజరీ నిచ్చుకొంటిమి. మా అర్జీప్రకారం వెంటనే శ్మశానభూములలో మంచిపందిళ్ళు వేయించిన సరే, అట్లు వేయించక పోయిన పక్షమున మేమందరము గోతులలోనుండి కాష్టములలోనుండి నదులలోనుండి నరకములోనుండి స్వర్గమునుండి ఒక్కపెట్టున వేల కొలది దండెత్తి మీపట్టణము ముట్టడివేసి ఈపని మీచేత చేయించెదము. మా ఆకారములు మేము బ్రతికియున్నప్పు డున్నట్లుండవు. మమ్మునుచూచిన మాత్రమున మీరు గడగడవడకి పోవుదురు. మీ గుండెలు పగిలిపోగలవు. మీ యిండ్లకువచ్చి చూరులు పట్టుకొని వ్రేలాడెదము. దూలములమీద కూర్చుండెదము. తలుపులు వేసినను మేము లోపలికి రాగలము. మీకు నిద్రపట్టనీయము. పట్టినను కలలో మేమే కనబడుచుందుము. జాగ్రత్త! జాగ్రత్త!

ఈపైసంగతులన్నియు గవర్నమెంటువారి యుత్తర్వు కాలేద నియు అది యేప్రిలులో అగుననియు మీరుత్తరము చెప్పెదరేమో వర్షకాలము వెళ్ళిపోయినప్పటినుండి అనగా వఱదలు మానినప్పటి నుండి యిక్కడ పందిళ్ళు కావలయును. గవర్నమెంటువారికి వ్రాసి యొకమారే మీరు శాంక్షను చేయింపవచ్చును. గవర్నమెంటువారు శెలవియ్యకపోరు. ఇది మీలోపముగాని గవర్నమెంటువారి లోపము కాదు. ఎలెక్షనురోజులలో మీకున్న చాకచక్యము నడచునట్టి యోపిక, డబ్బు కర్చుచేయుటలోని చొరవ తర్వాతకూడనున్న పక్షమున ప్రజలకిటువంటి యిబ్బందులు రావుకదా! చచ్చిపోయి నీకంటె కగ పడుటకు వీలులేక ప్రజల కేయుపకారమును చేయజాలక మే మేయువ

స్థలో నున్నామో, బ్రతికి యధికారములోనుండి చిన్నయుపకారములు జేయలేక మీరును ఆయవస్థలోనున్నారు. కాబట్టి యికమీద మాలో లింగధారులయినవా రందరు గోతులలోనుంచి లేచినట్టె, మీరుగూడ అశ్రద్ధసమాధిలోనుండి, లేచి, ఒక్కసారి శ్మశానభూములలోకి షికారుగా పగలు 10 గంట లప్పుడు గొడుగు జోడు లేకుండ దయచేసి, అక్కడ జనులు పొందెడి అవస్థస్వయముగా తాము తెలిసికొని పందిళ్లు వేయుటకై యుపక్రమింతురని ప్రార్థించుచున్నాము.

ఇట్లు విన్నవించువిధేయులు,
యినుకతిప్పనివాసులు, పితృదేవతులు,
రాక్షసనామసంవత్సర, పూర్వాషాఢమాస,
సప్తమి, శనివారం,
విష్ణువర్ధనపురం, మకాం యినుకతిప్ప.
రెల్లుదుబ్బులపోష్టు.



# మార్కండేయ స్వామివారి మనవి

రాజమహేంద్రవర పట్టణమందున్న మహాజనులందరు నా మనవి సంపూర్ణముగా శ్రద్ధతో నోపికతో శాంతముతో ప్రారంభము మొదలుకొని చిట్టచివరవఱకు నొక్క యక్షరమైన విడిచిపెట్టకుండ చదువుకొని దానికి తగిన ప్రతి క్రియ చేయుదురుగాక!

నేను రాజమహేంద్రవరమునకు పాతకాపును. నా కంటె పూర్వులెవరు ఇక్కడ లేరు. వేణుగోపాలస్వామివారును, సీతారామ

స్వామివారును, ఆంజనేయస్వామివారును, నరసింహ స్వామివారును, కోటిలింగేశ్వరస్వామివారును, చామాలమ్మయు, కోరలమ్మయు, నేను వచ్చిన తర్వాతనే యీ గ్రామము ప్రవేశించినారుకాని, నాకంటె ముందు రాలేదు పట్టణమధ్యమందున్న పక్షమున జనులకు నావల్ల బాధ కలుగునేమో యని సందేహించి మొట్టమొదటనే నేను గోదావరిమహానది యొడ్డున వెలిసినాడను. ఆస్తికబుద్ధిగల మహానుభావులు కొందఱు నాకు గుడి గోపురము మంటపము మందిరము కట్టించి నాయందు భక్తిప్రపత్తులు చూపించినారు. నాటినుండి పురజనుల యభిమానముచేత ఇంత విభూతి మేన ధరించి, మా రేడుపత్రి నెత్తిన పెట్టుకొని యెవరో కొందఱు భక్తులుచేసిన యభిషేక జలముతో తృప్తినొంది "తదన్నం తద్రస" మన్నట్లుగా నొకరిజోలికి నే బోక నా జోలికొకరిని రానీక నాగుడిలోనే పడియుండి కాలక్షేపము చేయుచున్నాను నేనిచ్చటికి వచ్చిన వేయి సం॥ములనుండి నా కిదివఱ కేవిధమయిన బాధయు విశేషముగ గలుగలేదు. ఇప్పుడొక క్రొత్త బాధ నాకగుచున్నది. ఆబాధ యేమనగా చెప్పుకొనుటకు నాకేసిగ్గగుచున్నది. ఇన్నాళ్ళుబ్రతికి యింటివెనుక చచ్చేరాయన్నట్లు, భూమికంటె ముందుపుట్టిన జాంబవంతునివలె సీపట్టణముకంటె ముందుపుట్టిన నేను సన్న మొన్న పుట్టి కన్నులుదెఱచిన మీవంటివారిలో భగవంతుడనై యుండి నాయవస్థ నే జెప్పుకొనవలసివచ్చెగదా యని నాకెంతో సిగ్గుచున్నది. సిగ్గేకాదు విచారముగూడ కలుగున్నది. నాయాలయమునకు పడమటివైపున నూతనముగా నిర్మింపబడిన గట్టుక్రింద పట్టణాధికారులు ముఱికినీటికో నేరు నొకదాని నేర్పఱచినారు. దీనిని నిర్మించుటలో వారియుద్దేశము మంచిదేకాని, నాకు ప్రాణముమీదికి వచ్చినది. ఎన్నో ప్రాకారములమధ్య వెలుతురు రాని గర్భగుడిలో దాదాపుగా నెల్లప్పుడు తలుపులు వేసికొన్ని మూల కూర్చుండునట్టి నాకే ఆముఱికినీటికంపువల్ల

ఎంతో బాధ కలుగుచుండగా, గోదావరియొడ్డునకు వెళ్ళి దాని సమీపమున నడుచుచుండు పురజనులకు యెంత బాధ గలుగుచున్నదో నేను చెప్పనక్కరలేదు. అయినను నాగోల నేను చెప్పుకొనవలెనుగాని, పురజనుల గోల నాకెందుకు. నావిగ్రహము జాతివిగ్రహమన్న మాట మీకు తెలుసునుగదా! జాతివిగ్రహమునకు జాతిముక్కలు జాతిపేగులుండునుగదా! ఈదుర్వాసనకు నా జాతిముక్కలు పగిలిపోవుచున్నవి. నాజాతిపేగులు ఛిద్రమలవుచున్నవి. నాజాతి వెంట్రుకలు ఊడిపోవుచున్నవి. నాగర్భగుడిలోనున్న గబ్బిలపు కంపయినను నాకింత బాధలేదు. శ్మశానములలో నేనున్నప్పుడును నాకింత బాధకలుగలేదు. నాబాధ యట్లుండగా నాదేవాలయములోనికి ననేకకారణములచేత వచ్చెడు జనసంఖ్య యిదివరకే తగ్గిపోయినది. దీనిచేత మునుపువచ్చెడు కొద్దిమంది కూడ రారని భయమువేయుచున్నది. మీరు గుళ్ళోకి రాక పోయినను సరే ఈకంపు లేకుండ చేసినపక్షమున, మీరు నాగుళ్ళో సాంబ్రాణి, హారతికర్పూరము, ధూపము వేసినంత ఫలము, అగరువత్తులు వెలిగించినంత ఫలము. అత్తరుపన్నీరు చల్లినట్లు సంతోషించెదను. పెద్దముండావాడను, నాకు తల్లి, తండ్రి, బిడ్డ, పాప, అన్న, తమ్ముడు, చుట్టము, పక్కము లేదు. అన్నిటికి మిమ్మే నమ్ముకొనియున్నాను. ఈకంపుచేత నాకేరోగము ప్రవేశించునో యని భయము వేయుచున్నది. ఒంటిగాడనగుటచేత నా కుపచారములు చేయువారెవరు లేరు. ఉన్నవూరు గనుక లేచిపోలేక మానమునకు కట్టుపడియేలాగో ఉన్నాను ఇక నుండ శక్యముకాదు. ఈపట్టున మీరు జాగ్రత్తపడి యీ బాధ నివారించకపోయినపక్షమున నాడబ్బా డవాలి తీసుకొని యిక్కడనుండి బిచాణాయెత్తి మరియొకచోటికి బోవలసివచ్చునని యోచించుకొన్నాడను చిత్తగించవలెను,

ఇట్లు,

మార్కండేయస్వామి.

# జీవన్మృతోపాఖ్యానము.

వేగినాటిలో వెఱ్ఱిరాయిపేరు గల గ్రామ మొకటిపూర్వ కాలమున నుండెను. ఆగ్రామమిప్పటికాలమునఁగూడ నున్నదేమో చెప్పజాలము. ఆ గ్రామమునందు పూర్వము ఒకానొక కాలమునందు విచిత్రమైన మనుష్యులు కాపురముండిరి. కొందరకు వెఱ్ఱి కొందరకుపిచ్చి, కొందరికితగని ఛాందసము, కొందరికి బుద్ధిమాంద్యము, కొందరికి మతిస్థైర్యలోపము, కొందరికి మూగ, కొందరికి చెవుడు, కొందరికి గుడ్డితనము, మాటలు నేర్చినవారి కందఱికి నొకవిధమయిన నత్తి. ఈవిధముగానున్న గ్రామముల లో నొక కుటుంబముకలదు. ఆకుటుంబయజమాని పేరు వెఱ్ఱివెంగళప్ప. వెఱ్ఱియనునది తల్లిదండ్రులు వానికిచ్చినది కాదు. అది ప్రజ్ఞవలన సంపాదించుకొనిన పౌరుషనామము. ఈపౌరుషనామమిాతని కొకనికెకాక తండ్రికిని తాతకును గలదు. మూడునాలుగు పురుషాంతరములనుండి వచ్చిన యీపౌరుషనామము వెంగళప్ప కొకవిధమయిన పిత్రార్జితమని చెప్పవచ్చును. ఆకుటుంబములో కెల్ల నతఁడే పెద్దవాడును తక్కువ వెఱ్ఱితలవాడునగుటచే నతడింటిపెత్తనము చేయుచుండెను. వెంగళప్ప యొకనాడు విస్తరలు కుట్టుకొనుటకై మఱ్ఱియాకులు కావలసి ఊరిబయటనున్న పొలమునకు బోయి అక్కడ మఱ్ఱిచెట్టెక్కి సన్నపాటి యొక కొమ్మమిాద గూరుచుండి ఆకులు గోయుచుండెను. అప్పుడాదారిని మేకలు దోలుకొనుచున్న యొక గొల్లవాడు పోవుచు నెండవేడిమి కోర్వ కయాచెట్టు నీడ నిలిచి చప్పుడగుచుండుటచే వెదకి జూచి వెంగళప్పను కనుగొనెను. వెంగళప్ప బ్రాహ్మణోత్తముడనియు, వైదికశిఖామణి యనియు మాకుజెప్ప నిదివఱకే మఱచితిని. బ్రాహ్మణుల కుపకారము సేయుట పుణ్యమని గొల్లబోయుడు నమ్ముటచే నత డిట్లనియెను—

„ఓ బాపనయ్యా! సిట్టసివర కొమ్మ మిాద గూసుందున్నారు; కొమ్మగీనిరిగిపోతే నేలమిాద కాలిఱగ్గొట్టుకొంటావు. పదలంగుండు బా

పనయ్య" అనిపలికి గొల్లబోయడు మేకలందోలుకొని సాగిపోయెను. అతడు 10 బారలరుగకమునుపే కొమ్మ విరిగినందున వెంగళప్ప గుబాలున క్రిందపడెను. అతనిఅదృష్టమేమోకాని గట్టిదెబ్బయాతనికి తగులలేదు. తల పగులలేదు. కాలుసేతులువిరుగలేదు. మోకాళ్ళమీద చర్మముమాత్రము కొంతకొట్టుకొనిపోయినది. పడినతోడనే వెంగళప్ప తీవ్రమైన భయపడక చప్పుచప్పున మేనుదుల్పుకొని పడత బడిన కాలొకనారి ఝాడించి గబగబ పరుగెత్తి నడచుచున్న గొల్లబోయని కలిసికొని చేయిపట్టుకొని ఆపి యిట్లనియెను.— "నీవు మహానుభావుడవు. లోకములో నీకు దెలియని యంశములు లేవు. జ్యోతిషశాస్త్రములో నీవంటి ప్రజ్ఞకలవాడు లోకములోలేడు. చెట్టుమీదనుండి నేను పడిపోదునని నీవుచెప్పితివి. చెప్పిన 4 నిమిషములకే నేనుపడితిని. నేనెప్పుడు చచ్చిపోదునో చెప్పవలయును." అనవుడు గొల్లవాడు తెల్లబోయి "బామ్మనయ్యా నేనుసదుముకోలేదు. ఆయుస్సు మూడితె అంతా సత్తారు, నువ్వెప్పుడు సత్తావో నేసెప్పగల్నా. లేతగొమ్మ మీదగూకుంటె పడ్తావని మాటవాసికన్నాను. నే సెప్పలేను. నన్నిడిసిపెట్టుపోవాల" యని బదులుచెప్పెను. బ్రాహ్మణుడాపలుకులు చెవినిబెట్టక "తెలిసినవారు తెలిసినదని చెప్పకొందురా? నీవు భగవంతుడవు. నీకన్నియు దెలుసును. నాకు చెప్పకతప్పదు. లేనిచో నిన్నువిడువ"నని బలవంతపెట్టెను. అప్పుడు గొల్లవాడు ప్రాణమువిసికి యెట్లయిన తప్పించుకొని వెళ్ళదలచి యిట్లనియె —"నీ కాలికిందికి నీళ్ళెప్పుడొస్తయో అప్పుడు చచ్చిపోవుదువు" అనిచెప్పగానే వెంగళప్ప బ్రహ్మానందభరితుడై "మహానుభావా! నాకు నిజమెరిగించితివి. ఇది మొదలుకొని నేను మిక్కిలి జాగ్రత్తగా నుండెదను" అని వానిని వదలి పెట్టెను. వదలినదెచాలునని గొల్లవాడు తనదారిని బోయెను. బ్రాహ్మణుడును తనలో నాలోచన చేసుకొనుచు నింటికి పోయెను.

ఇంటికివెళ్ళి వెంగళప్ప ఆదినము మొదలుకొని తనకాళ్ళ క్రిందికి నీళ్ళు రాకుండునట్లు జాగ్రత్తగ జూచుచుండెను. చెఱువులో దిగిస్నాన మొనర్చిన పక్షమున కాళ్ళక్రింద నీళ్ళుండును గనుక తత్క్షణమే ప్రాణము పోవునని చెఱువులలో నదులలో కాలువలలో దిగుట మానెను. ఇంటివద్ద స్నానము చేయునపు డెత్తైన పీటమీదనిలుచుండి స్నానము చేయుచుండును. వాన కురిసినప్పుడు ఇల్లు కదలుటమానెను. చేతులు కాళ్ళు కడుగుకొనినప్పుడుకూడ మిక్కిలి యెత్తయినచోట నిలిచి కాలు చెయ్యి దూరముగాజాపి కడుగుచుండును ఈవిధముగా బహు ప్రయత్నములచేసి యాత్మసంరక్షణము చేసికొనుచుండగా దైవవశమున నొకనాడొక వైపరీత్యము జటిగెను. వెంగళప్ప నడివీథిలో నొక పెద్దమనుష్యునితో నేదో మాటలాడుచుండెను. ఒకమనుష్యుడు కుండలకావడి వేసికొని చెరువునుండి నీళ్ళుతీసికొని యాదారిని బోవుచుండెను. పోవుచుండగా కావడిమట్లు తెగి కుండలు భల్లున నేలబడి పగిలిపోయెను. వెంగళప్ప యాప్రక్కనెనిలిచియుండుటచేత నీళ్ళు వానికాలిక్రిందికివచ్చెను. వచ్చినతోడనే వెంగళప్ప నిశ్చేష్టుడై చూపు మొద్దుపార అయ్యో చచ్చితి చచ్చితినని నేలబడెను. ఏమిసంగతి ఏమిసంగతి యని వెంగళప్పను బహువిధముల నడిగిరికాని, వారికతడే ప్రత్యుత్తర మియ్యజాలకపోయెను. అప్పుడు పదిమందిచేరి వానినెత్తి యొక బండిమీదవేసి యిల్లుచేర్చిరి. ఇంటికి వెళ్ళగానె వెంగళప్ప భార్యను బిడ్డలను బంధువులను కౌగిలించుకొని 'నాకాళ్ళక్రిందికి నీళ్ళువచ్చినవి. నేను చచ్చిపోయినాను. చచ్చిపోయినవానితోకలసి గృహమందుండరాదు. అందుచేత మీరిక్కడనుండి లేచిపొండి' అని చెప్పి యేడ్చెను. ఇంటివారందరు వెర్రివాండ్రు గనుక చచ్చినవానితో కాపురముచేయుట మంచిదికాదని యక్కడనుండి లేచిపోవుటకు నిశ్చయించుకొనిరి. గ్రామములో నందఱుకూడ మట్టితల మనుష్యులేగనుక

వారిమాటనే యనుసరించిరి. తెలివితేటగల మనుష్యు లొకరిద్దరు వెంగళప్పగారి యింటికివెళ్లి చచ్చిపోయినవారు మాటలాడరు. కదల లేరు మెదలలేరు కాబట్టి వెంగళప్ప చచ్చిపోలేదు. అని తెలియజెప్ప జూచిరిగాని, సర్వజ్ఞుడైన వెంగళప్ప వారిమాటలనమ్మక కాళ్ళక్రిందికి నీళ్ళువచ్చునప్పుడు చచ్చిపోదునని గొల్లవాడుచెప్పెను. వాడికంటె నెక్కువ తెలిసినవారు కలరా! మేకను చంపిన తర్వాత దానితల కొంతసేపు కొట్టుకొనును. ఆవిధముగానే నేను చచ్చిపోయినతర్వాత కొంతసేపు మాట్లాడుతున్నాను. నేను చచ్చితిని. ఇదినిశ్చయము, నా మాట చచ్చినవానిమాట. నానడక చచ్చినవాని నడక. నాబ్రతుకు చచ్చినవానిబ్రతుకు: నాచూపు చచ్చినవానిచూపు. కాబట్టి మీరందరు నన్నువిడిచిపొండియని పలుమారు నొక్కిచెప్పెను, అట్టివానితో వా దించుటకంటె నిష్ప్రయోజనమైనపని మరియొకటిలేదని వారందఱు తొలఁగిపోయిరి. ఇంటివారందఱు నాటిరాత్రి యిల్లువిడిచి మరియొక స్థలమున కఱిగిరి. చచ్చిపోయినవాఁడుగావున వెంగళప్పమాత్రము ఆగృహమందుండెను. అందరులేచి వెళ్లినతర్వాత వెంగళప్ప తల్పులు నాల్గు లోపలబిగించుకొని యొకబోషాణములో పండుకొని తలుపు మూతవేసికొనెను. వెంగళప్పగారు మృతినొందిరనియు, వారిచుట్టము లాగృహమునుండి లేచివెళ్ళిరనియు విని యాకస్మికముగా వారు వెళ్లి పోవుటచేత గృహమందుసామానులు మొదలగునవి విడిచివెళ్లిరనియు లోకమున వాడుకపుట్టుటచే దొంగ లాగృహమున ప్రవేశించినపక్షము న మంచియాస్తి చేయిచిక్కునని అర్ధరాత్రమందు దక్షిణపుగోడకు కన్నముత్రవ్వి ప్రవేశించిరి. తలుపుబిగించుకొని వెంగళప్ప లోపల పండుకొనుటచే వారు తల్పుయొక్క ఉతకలనెత్తి గదిలో ప్రవేశించిరి. వారువచ్చుట యెఱిగి వెంగళప్ప కేకలువేయక యూరకుండెను. దొంగలు నలుప్రక్కలజూచి బోషాణవద్దకువచ్చి దానినెత్తిచూచిరి.

వెంగళప్ప పండుకొనియుంటచే మిక్కిలి బరువుగానుండెను. బరువు
జూచి సొమ్మున్నదని దొంగలు దానిని మోసికొనిపోవ నిశ్చయించిరి.
దొంగలు బోషాణ మెత్తుచుండగా వెంగళప్ప తనలో నిట్లనుకొనెను:
"ఆ! చచ్చిపోయినతర్వాత జరుగవలసిన ముచ్చటలన్ని జరుగుచున్నవి.
చచ్చినవారు యమలోకమునకు వెళ్ళుదురు. ఈవచ్చినవారందరు యమ
దూతలు. నన్ను యమధర్మరాజునొద్దకు తీసికొనిపోవుచున్నారు. నేను
వద్దని కేకలువేసిన మానుదురా? యమదూతకు జాలి జంకుకలదా!
చచ్చినవాడను గన్క. చచ్చినవారు పడవలసిన పాటులన్నిటిని పడ
వలెను. కేకలు వేసినపక్షమున కోపగించి వారు మరింత దండింతురు
కాబట్టి యూరకుండుటె యుత్తమపక్షము. ఇదిగో! బోషాణమును
వీరు దక్షిణపుదిక్కుగా తీసికొని పోవుచున్నారు యమలోకము దక్షి
ణపుదిక్కున నున్నదిగదా! అయ్యో! ఆయమధర్మరాజెట్లుండునో!
ఏమనునో? చిత్రగుప్తుడు నామీద నేమివ్రాసెనో! ఏమివ్రాసిన నేమి
చేయగలను. అనుభవింపకతప్పదు." ఇట్లనుకొనుచు వెంగళప్ప దొంగ
లు బోయలుగా, బోషాణము పల్లకీగా, వాహనయోగము కలిగినవారి
లో వెళ్ళువానికి గలిగిన కుదుపులు ఉలాతులు మొదలగువానివలన
గలుగు సౌఖ్యములు అనుభవించుచుండెను. లోపలనున్న వెంగళప్ప
యిట్టట్టు కదలుచుండుటచే దొంగలు మనుష్యుడున్నట్లెఱుగక బోషా
ణములోనున్న నగలపెట్టెలు దొర్లుచున్నవని భ్రమపడి యెప్పుడు
త్వరగా నడవికి వెళ్ళుదుమో యెప్పుడు బోషాణము పగులగొట్ట కనుల
పండువుగా సొమ్ముపెట్టెచూతుమో యెప్పుడు ధనముపంచుకొందుమో
యని యూటలూరుచు శ్రమపడి మిక్కిలి వేగముగా బోషాణమును
మోసికొని నడిచిరి. నాలుగుగడియల తెల్లవారుగట్టకు దొంగ లడవి
జేరిరి. వారు మొదట బోషాణము తలుపుతాళము వేయబడియున్న
దనుకొని గొడ్డళ్ళతో బ్రద్దలుగొట్ట[illegible] గానె

వెంగళప్పగుండెలు ఝల్లుమనెను. యమదూతలు యమలోకమునకు తన్ను తీసికొనివచ్చినారని వెంగళప్ప నిశ్చయించుకొనెను. యమధర్మ రాజును ఎప్పుడుచూతునను భయముతో నాతని శరీరము వడకజొచ్చెను. శరీరము చెమటలుబట్టెను దొంగలు తలుపుబద్దలుకొట్టి చెక్కలు తొల గించునప్పటికి వెంగళప్ప బాబో! నాయనో! యని పెద్దకేకలు వేయు చు బోషాణములో దబ్బున లేచి నిలుచుండెను. యమదూతలు కొట్టి చంపుదురనే యాతనిభయము. భయముచేతనే కేకలు వేసెను. అట్లు కేకలు వేయుచు బోషాణములోనుండి గుభాలున లేచిన వెంగళప్పను జూచి దొంగలు నిశ్చేష్టులయి కొంత సేపటికి నిట్లనుకొనిరి: "ఒరే వెంగ ళప్పదయ్య మయినాడు. చంపితినగలడు. రండి రండియని పారిపోయిరి.

అట్లు దొంగలు కొంతదవ్వు పారిపోయి ఒకచోట నిలిచి వెంగళప్పను జూచి వీడు నిజముగా దయ్యమేయని వెంగళప్పను రాళ్ళువుచ్చుకొని కొట్ట నారంభించిరి. రాళ్ళు మీద పడగానె వెంగ ళప్ప తనలో నిట్లనుకొనియెను; "నేను చచ్చినవాడను గనుక యమ దూతలు చచ్చినవానిని బాధపెట్టుట సహజమేగనుక నామీద రాళ్ళు రువ్వుచున్నారు. ఎట్లైనను నేను వెళ్లి కొట్టవద్దని బతిమాలుకొనియె దను." అని నిశ్చయించుకొని యతఁడు దొంగలవంక పరుగెత్తి సాగెను. ఆకారుగు జూచి దొంగలు మరింత భయపడి ఓరీ మనలను పీక్కుతినుటకై వెంగళప్ప వచ్చుచున్నాడు. రండి రండి యని మును పటికంటె వేగమున బరుగెత్తజొచ్చిరి. వెంగళప్ప తనచుట్టునున్న అరణ్యమంతయు యమధర్మరాజు సభయనియు దొంగలు యమ దూతలనియు దృఢముగా నమ్మెను. దొంగలు, వెంగళప్ప తరుముకొని వచ్చుటచే చుట్టుపక్కల నిలువక తిరిగిచూడక యొక్కటే వరుసను పరుగెత్తి యదృశ్యులయిరి. నిర్జనమైన యా మహారణ్యమున కంటికి కనబడుచున్న నేలకంతకు, దానిలోని వృక్షములకు నేకప్రభువై వెంగ

ళప్పయొక్కడే యుండెను. ఆయరణ్యమంతయు సాయంకాలమువరకు వెంగళప్ప తిరిగి యలసిపోయెను. సహజమైన యాకలి ఆయాసముచే మిక్కుటమయ్యెను. అతడాహారము నిమిత్తము వెదకెనుగాని తగిన వేవియు కానబడలేదు. ఆరాత్రి యతడొక చెట్టుక్రింద పండుకొని యెను. మరునాడు లేచి దొరకినపండ్లు భక్షించెను. ఏపూట కాపూట కతడు యమధర్మరాజు యెదుటకు వెళ్ళవలసియుండునని భయపడ సాగెను అడవిలోనున్న పల్లెలలోనికి వెళ్ళగూడదాయని చదువరులు సందేహపడవచ్చును. చచ్చిపోయినవారిని గృహములోనికి రానియ్య రని మనవెంగళప్ప నిశ్చయముగ యెఱుగును గావున గ్రామములోనికి వెళ్లసాహసింపలేదు. ఇట్లు కొన్నిమాసములు గడచెను అంతలో శీత కాలము ప్రాపించెను. అందఱకుగల చలిబాధ తీర్చునట్టి కుంపటులు గూడ చలిబాధచేత మంచములక్రింద దూరవలసివచ్చెను. ఆసమయ మున వెంగళప్ప ఒకానొకగ్రామ సమీపముననున్న అరణ్యములో నివసించియుండెను. కప్పుకొనుటకు వస్త్రములు లేకపోవుటచే నతడు చలిబాధ కోర్వలేక ప్రతిదినము రాత్రి జాముప్రొద్దుపోయినతరు వాత చాకిరేవుకువెళ్ళి అక్కడనొక బానక్రింద వెచ్చగా గూర్చుండ జొచ్చెను. తెల్లవారుజామున బట్టలుదుకుకొనుటకై చాకలివాండ్రు వచ్చి బాన యెత్తునప్పటికి వెంగళప్ప తన్ను దీసికొనిపోవుటకై యమ దూతలు వచ్చినారనుకొని బాబోయి నాయనోయి అని కేకలువేయు చు లేవజొచ్చెను. ఇట్లు జరుగుటచేత నాయూరి చాకలివాండ్రందఱు దయ్యము వచ్చి బానలక్రింద గూర్చుండుచున్నదని భయపడి తెల్ల వారుజామున బట్టలుదుకుటకై వచ్చుట మానివేసిరి. నాలుగు గడి యల ప్రొద్దెక్కినతరువాత రేవునకు వచ్చి చాకలివాండ్రు నాలుగు గడియలప్రొద్దువేళనె యింటికి బోవజొచ్చిరి. అది కనిపెట్టి వెంగళప్ప మరల బానలక్రింద దూరజొచ్చెను. ఆయూరిలో నొక సాహేబుగా

రుండిరి. ఆయనకు వందలకొలది దుస్తులుండెను. తనబట్ట లుదుకుటకై యాతడు ప్రత్యేక మొక చాకలివాని నేర్పరుచుకొనియెను. వాడు తెల్లవారుజామున లేచి ప్రతిదినము నాలుగుగడియల ప్రొద్దుపోవువరకు పనిచేసినగాని యతనిదుస్తులు పరిశుభ్ర మగుటలేదు. అటులుండగా జామప్రొద్దెక్కి వెళ్ళి జాముప్రొద్దువేళ యింటికి వచ్చినప్పుడు పనియగునా ? అందుచేత సాహేబు చాకలివానిమీద మిక్కిలి కోపించెను. చాకలి సాహేబుగారివద్దకు వెళ్ళి దయ్యముబాధమూలమున తనపని యడ్డినదని మనవిచేసికొనియెను. "దయ్యములు లేవు గియ్యములు లేవు. వట్టి యబద్ధము" అని సాహేబు వానిని తిట్టెను. ఏలినవారు వచ్చి చూడుడని చాకలి మొఱవెట్టుకొనియెను. "రేపురాత్రి వచ్చెదను తెల్లవారుజామున నన్ను వచ్చిలేపు. దయ్యమును గుఱ్ఱపుకొరడా పుచ్చుకొని వీపుపగుల గొట్టెద" నని సాహేబుచెప్పి చాకలిని యింటికి పంపెను. చాకలి మరునాడురాత్రి సాహేబుగారిని లేపి తీసికొనివచ్చెను. ఇద్దఱు చాకిరేవునకు వెళ్ళిరి. ఇదియే నాబానయని చాకలి చూపి వెనుకకు తగ్గెను. సాహేబు దయ్యమేదిరాయని వానిబాన తన్నెను. దైవవశమున వెంగళప్ప ఆబానక్రిందనె కూర్చుండుటచే యమధర్మరాజో యమదూతలో తననిమిత్తము వచ్చినారనుకొని బావురుమని యేడ్చుచు లేచెను. అది వినగానే చాకలి పిక్కబలముజూపెను. సాహేబు గుండెలు జల్లుమనియెను అనగానే యతడు పరుగు లంకించుకొనియెను. వెంగళప్ప బానలోనుండి పైకివచ్చి యమధర్మరాజుగారిని బతిమాలుకొనుటకై సిలువుటంగీ కొంగును గట్టిగా పట్టుకొనెను. దయ్యమువచ్చి తన్నుబట్టుకొనెనని భ్రమించి సాహేబు శరీరము తెలియక వెంగళప్పనుగూడ బరబరలాగికొని పరుగెత్తెను. నేలబడి యీడ్వబడుచున్న వెంగళప్ప పట్టువదలలేదు. సాహేబు చాకలి భయముచేత అరవజొచ్చెను. వచ్చినవారందఱు దయ్యమునకు భయ

పడి అరుగులెక్కి చెట్లెక్కి చూడజొచ్చిరి. అప్పుడు ధైర్యవంతులు కొందఱువచ్చి మనుష్యుడేకాని దయ్యము కాదని వెంగళప్పను పట్టుకొని యీవలకు లాగిరి. అప్పుడు సాహేబు ధైర్యము దెచ్చుకొని నిలువబడెను. చేరినవారందఱు వెంగళప్పనుజూచి వానివృత్తాంత మడిగిరి. అతడు తనవృత్తాంతమును పూసగుచ్చినట్లు చెప్పెను. అది విని వారు వాని యమాయకత్వమునకు విస్మితులై "నీవు చచ్చిపోలేదు. బ్రతికియే యుంటి" వని యనేకములైన నిదర్శనములజూపి తెలియజెప్పి వాని నొడంబరచి యింటికి పంపిరి.

# ఆకాశరామనన్నోపాఖ్యానము

ఈ మహానుభావుల చరిత్ర వ్రాయవలయునని చిరకాలము నుండి మాకు కుతూహలము కలదు, కాని అందుకు తగిన యాధారములు మాకెంత ప్రయత్నము చేసినను లభించినవి కావు. ఆధారములు దొరకలేదను కారణమున ఇటువంటి మహాపురుషుని చరిత్రము వ్రాయక యూరకుండుటకంటె ప్రస్తుతము దొరకినన్ని యాధారములతో నేదోయొక విధముగ నీతని చరిత్రము వ్రాయుట మంచిదని తలంచి సంగ్రహముగా వ్రాయదలచుకొన్నారము. మా శక్యమైనంత వఱకు మే మిప్పుడు వ్రాసి విడిచితిమా ముందుముందు బలవత్తరములైన యాధారములను సంగ్రహించినవారు వానిచరిత్రమును సవిస్తరముగా వ్రాయగలరు. ఆకాశరామన్నగారు ఏ యుగములో ఏ శతాబ్దములో జన్మించిరో నిర్ణయించుటకు దగిన యాధారములు దొరకినవి కావు. ఆకాశముతాకని యింటిపే రుండుటచేతను, రామన్న యని పేరుం

డుటచేతను. ఈయన తెనుగుదేశపు వాడని స్పష్టముగా చెప్పవచ్చును. తెనుగుదేశములో రామన్న సుబ్బన్న వెంకన్న, పుల్లన్న యనునట్టి పేరులు విశేషముగా నుండుటచేత తెనుగుదేశపువాడే యని మే మూహింపవలసి వచ్చినది. రామన్న సింగన్న మొదలైనపేళ్ళు కన్నడ దేశస్థులలో కొందఱ కుండునుగాని వారికీ విధములైన యింటిపేళ్ళుం డవు. అందుచేత నీతడు తెలుగువాడేయని మేము నిశ్చయించు చున్నాము. ఒకవేళ ముందుముందు బుద్ధిమంతు లెవరైనను బయలు దేరి దేశచారిత్ర మందలి యభిలాషచేత పురాతనములైన తామ్రశిలా శాసనములు, ప్రబంధములు, చీకి తాటియాకుల గ్రంథములు చెదలు పట్టిన అర్జీలు, దస్తావేజులు, శోధించి వెదకి తెలుగువాడు కాడని సత్యము నిర్ధారణ చేసిన పక్షమున మేము మా వాదమును వదలు కొని ఉద్దుకొని మార్చుకొని సరిజేసుకొని అట్టివారి కనేక శిరస్సా ష్టాంగ దండ ప్రణామము లాచరించి శాశ్వత బ్రహ్మకల్పముగా కృత జ్ఞులమై యుందుమని యిందుమూలముగా ప్రమాణ పూర్వకముగా, గాయత్రిసాక్షిగా, వట్టుపెట్టుకొని వాగ్దానము సేయుచున్నాము. ఆకాశరామన్నగారేగ్రామములో నేలవతార మెత్తినారో, ఏకులము వీరిజన్మ కారణముచేత పావనమైనదో ఏజననీజనకులు ఈయనను తమగర్భవాసమున కనిపెంచుటచేత ధన్యాత్ములై విలసిల్లిరో యెంత మాత్రము తెలియకుండుట మిక్కిలి విచారకరమైన సంగతి. ఈ విచా రమును మేము భరింప జాలకున్నాము. దేశ చరిత్రము లేని లోప మిప్పుడు కనబడుచున్నది. చరిత్రములు వ్రాయునట్టి యాచారము పూర్వకాలమున మన దేశములో నున్నపక్షమున మన పూర్వ కాలపుకవులు ఆకాశరామన్నగారి దివ్యచరిత్రమును చిత్రవిచిత్ర ముగా భారతముకంటె రామాయణముకంటె నెక్కువ గ్రంథ ముగా రచియించి యుందురు కదా! అటువంటి భాగ్యము మనకు

పట్టినదిగాదు. ఇప్పుడు దొరికినంతవరకే స్వల్పచరిత్రమును మా చెప్పిడి మాటలతో వినవలసి వచ్చినది. ఇందుకు చదువరులు మమ్ము క్షమింతురుగాక! ఈతప్పు ప్రాచీన కవులదిగాని మాదికాదు. ఇకముందు బయలుదేరబోవుచున్న కవులైనను ప్రాచీన కవులమార్గము దొరక్కక, మిక్కిలి చిత్రమైనటువంటి మహానుభావుల ఈయన చరిత్రమును తమ రసవంతమైన వాక్కులచేత వర్ణించి తమ కవిత్వమును ధన్యముచేసి కొందురుగాక! ఆకాశరామన్నగారికి సోదరు లెవ రున్నట్లు కనుపడదు కాని, పినతల్లికొడుకు లిద్దఱున్నట్లు కనబడుచున్నది. వారెవరనగా:— వల్లకాటి రామనాథయ్యయు, పిడుగు అగ్నిహోత్రుడును వీరు రామన్నగారికి దశరాత్రములు పుట్టుక పుణ్యములుగల జ్ఞాతులుకాదు. ఇంటిపేరు భేదమగుటచే నీ సంగతి తెలిసికోగలిగితిమి. మూడు దినములు పక్షిణీతో సరిపోవునట్టి దగ్గరి బంధువులు. ఆకాశరామన్నగారు మార్కండేయ మహాముని మొదలగు వారివలె చిరకాల జీవులు. గాలివలె సర్వవ్యాపకులు, యెండవలె తీక్ష్ణమైనవారు. చలివలె మనుష్యులను గడగడ వడకించునట్టి ప్రజ్ఞకలవారు. ఈయన శ్రీమన్నారాయణమూర్తి వారివలె అనంతకోటి యవతారముల నెత్తియున్నారు. విష్ణుమూర్తివారెత్తిన యవతారములలో రూపభేదమె గాక నామభేదమును గలదు. ఈయన యవతారములలో రూపభేద మున్నదిగాని నామభేదము లేదు. ఏ పట్టణములో నున్నను సరె ఏయూరిలోనున్నను సరె యీయనపేరు ఆకాశ రామన్న యందురు. ఈయన యవతారములు ప్రతిగ్రామములో నున్నవి. ఈయనకొన్నిచోట్ల పడుచువాడుగాను, కొన్నిచోట్ల ముసలివాడుగాను కొన్నిచోట్ల నడివయస్సు కలవాడుగాను, కనుపడుచుండును. ఇప్పటివరకీయన స్త్రీరూపము ధరించినట్లు కనపడను. విష్ణుమూర్తిగా రొకసారి జగన్మోహనావతారమును పేర స్త్రీ రూపమెత్తినటు కనపడుచున్నదిగాని, ఆకాశరామన్నగారు

అప్రతిష్టయనియో, పౌరుష హీనుఁడనియో మఱియే కారణముచేతనో స్త్రీ చూపు మెత్తలేదు. అందుచేతనే యీయన శ్రీమహావిష్ణువుకంటె తానెక్కువ వాడనని తనలో తాను గర్వించి బిఱ్ఱబిగిసి విఱ్ఱవీగు చుండును. ఈయన కొన్ని చోట్ల వ్రాలు నాఱై పొడకట్టును. కొన్ని చోట్ల వ్రాతయొక్క యక్కఱలేక తన సంకల్పము లన్నియు నోటితోనె వెలిబుచ్చును. కొన్నిచోట్ల నీయన మఱియొకరి వ్రాలు చేయుచుండును. ఈయన కలియుగనారదుఁడు. కడుపులో కందిగింజ యిమడదు. నోటిలో నూవుగింజ నానదు. మనసులోనున్న సంగతి వెలిబుచ్చక పోయిన పక్ష మున ఈయనకు కడుపుబ్బును. ఈయనకు తెలియని సంగతులుండవు. జీతము బత్తెము లేకపోయినను శ్రమపడి వ్యవహారములు కనుగొను చుండును ఈయన గొప్ప వాకబుమనిషి. తనకు కావలసినది, అక్కఱ లేనిది లేదు. పొంచుండి వినుటలో ఈయనది పెట్టినదిపేరు. కొండె ములు చెప్పుటలో నీయన నాలుక చికిలిచేసినకత్తి. అర్జీలు పంపుట ఈయన మొట్టమొదటి కృత్యము. ఈ యర్జీలలో నొకప్పుడు సత్యముం డును. ఒకప్పుడు సత్యముండదు. అది ఆయన చిద్విలాసము కొలది యుండును. ఈ మహానుభావునకు సత్యమే కావలయునన్న పట్టింపు లేదు సత్యమైనను అసత్యమైనను తనకోపము తీర్చుకొనుటే ప్రధాన కార్యము. ఈయన వ్రాసిన దంతయు నొకప్పుడు సత్యమేయై యుండును. కాని వాలిం జంపిన రామ బాణమువలె దొంగపోటుగా చాటునుండి వచ్చుటచేత సత్యమయినను దీనిని నమ్మరు. కొందఱధి కారులకుకూడ ఆకాశరామన్నగారి వ్రాత వేదాక్షరముల వంటిది. ఆయనయర్జీలలోనున్న దంతయు వారు నమ్ముదురు కొందరు చూడ గానే బుట్టదాఖలు చేయుదురు.

ఆకాశరామన్నయొక్క జాతకము వ్రాయవలయునని గొప్ప గొప్ప జ్యోతిష్కు లనేకులు ప్రయత్నము చేసిరిగాని యీయనజన్న

కాల నక్షత్రములు సరిగా దొరికినవికావు ఈయన చేష్టలను గుణము లను బట్టిచూడగా రాక్షస సం॥ రమున జన్మించెనని తోచుచున్నది. కొందఱు దుర్మతిలో జన్మించినాడని చెప్పుచున్నారు. కొందరు ఖర నందనలు వీనికి జన్మస్థానమని వచియించుచున్నారు. కొందరు ప్రమా దిలోనని యభిప్రాయపడుచున్నారు. ఏసంవత్సరమో మొత్తముమీద స్థిరపడలేదు. కాని పైనుదహరింపబడిన సంవత్సరములలో నేదోయొక టియై యుండవచ్చును. జన్మనక్షత్రము మూలయని పలువురయభి ప్రాయము. ఈయన తెనుగుదేశములో ఆకాశరామన్న పేరుతో ఉ న్నాడేగాని యెల్లదేశములలో నానావిధములయిన నామములతో ప్ర పంచమందంతట వ్యాపించియున్నాడు. సూర్యుని యెండలేని చోట్లు న్నవిగాని యీయన లేనిచోట్లు లేవు. చీకటిలేని చోట్లయిన నున్నవి గాని యీయనదుష్కీర్తి లేనిచోట్లులేవు. పాములు తేళ్ళు లేనిచోట్లు న్నవిగాని యీయన లేనిచోట్లు లేవు. విషము, పాషాణము, నాభి లేనిచోట్లున్నవిగాని యీమహానుభావుడు లేనిచోట్లు లేవు. ఈయన మహాద్భుత చరిత్ర మెల్లవారు వినవలసినది. విన్నవారికి వీసెడు పుణ్య ము. చదివినవారికి సవ్వాశేరు పుణ్యము. చెప్పినప్పుడు విననివారికి శేరుపాపము. మరచిపోయినవారికి మణుగు పాపము. ఆకాశరామన్న గారి పినతల్లికుమారులైన పిడుగగ్నిహోత్రులు గారియొక్కయు వల్ల కాటి రామనాథముగారియొక్కయు చరిత్రములనుగూడ సంగ్రహముగా వ్రాయవలయునని సంకల్పించుకొంటిమి గాని ఆచరిత్రములుకూడ యెక్కడను మాకులభించినవికావు. ఎవరియింటనైన తాటియాకు పుస్త కములలోగాని కొబ్బరియాకు పుస్తకములలోగాని యీతాకు పుస్తక ములలోగాని యీచరిత్రములు పద్యరూపకముగా గాని గద్యరూపక ముగా గాని యక్షగానరూపకముగా గాని నాటకరూపకముగా గాని హరికథారూపకముగా గాని సంస్కృతమునగాని తెనుగునకాని పిశాచి

భాషలోగాని మరియే యితర భాషలలోగాని దొరికినపక్షమున వారదితెచ్చి మాకు సమర్పించిన పక్షమున వారుకోరినంత సొమ్ము వారికి మేమిచ్చెదము. కాబట్టి ప్రతిమనుష్యులును తమతమ యింటనున్న తాళంపత్ర గ్రంధములను ఈరోజు మొదలుకొని వెదకుచుండవలయును.

ఇట్లు విన్నవించు,
ఆకాశరామన్న పక్షపాతి.

---

# పండ్రెండు పండ్లు.

భర్త — (తనలో) నాశరీర మూష్ణించిపోయి కురుపులు వేసిమంచముమీదనుండి కదలకుండ జేయుచున్నవి. ఇందువలన నావ్యవహారములన్ని చెడిపోవుచున్నవి. చక్రికేళీపండ్లు తిన్నయెడల ఉష్ణము తగ్గి కురుపులు త్వరగా నివారణమగునని వైద్యులు చెప్పినందున కష్టపడి పండ్రెండుపండ్లు తెప్పించుకొంటిని. దినమునకొక పండు తినుమని వైద్యుడు చెప్పెను. పండ్లువచ్చి పదిదినములయినవి. అయినను నేటివరకొకపండైన నానోటికి రాలేదు. ఎందుకుపండ్లు నాకుపెట్టలేదని నోరుజారి అడిగితినా భార్య పెనుభూతమువలె మీదపడి చంపును. అడుగకుందమన్న బాధ పడజాల. అడుగుదమన్న కలహమున కోర్వజాల. వెనుకకువచ్చిన గొయ్యి, ముందరికివచ్చిన నుయ్యి. అదిగో! ఈలాగున వచ్చుచున్నది. వచ్చినప్పుడెల్ల పండుతెచ్చుచున్నదనే నానో రూటలూరుచుండును.

భార్య—(ప్రవేశించి) ఇదిగో చక్కరకేళిపండు. (అనియిచ్చును.)

భర్త—అమ్మయ్యా! పండెన్నాళ్ళకు కనుపడినది. ఈపండు తిన కుండగానే నాప్రాణము పోవుననుకొంటిని.

భార్య—ఏమీ భయములేదు. ఇంతలోనే పోయేప్రాణము కాదు. తుమ్మితే వూడిపోయేముక్కు దగ్గితే ఏమాత్రముండును. ఇంత మాత్రమునకే పోయేప్రాణ మెంతకాలముండును?

భర్త—నాప్రాణము పోయినను నాకుసంతోషమే. అదిత్వర గాపోదు. అట్లుపోయిన పక్షమున మీబాధలే నివారణమగును.

భార్య—మీరు నగలూ నాణెములు పెట్టేదిలేదు. ఈపసుపు కుంకుమూ లేకుండా చేయకండి.

భర్త—సరేకాని ఈపండిప్పుడు తింటాను. తక్కిన పదకొండు పండ్లూ ముగ్గినవా?

భార్య—ఇంకాయెక్కడిపండ్లు. పండ్లుమీకోసరం కూర్చున్న వనుకొన్నారా యేమిటి?

భర్త—ఏమి పడ్లయిపోయినవా? నేను తినందెట్లు అయిపోయి నవి ?

భార్య—అన్నిపండ్లూ మీకోసరం ఖర్చయి పోయినవి.

భర్త—నాకోసరమెట్లు ఖర్చైనవి?

భార్య—వినండి చెప్తాను. మీకురుపు నిమిత్తము పిండివుడికిం చుచు నేనెండలో కూర్చుంటిని. అందుచేత నాకెండదెబ్బ తగిలి తల నొప్పి వచ్చినది. ఆనొప్పి తగ్గుటకై రెండుపండ్లు నేను తినవేసినాను నీ మూలమున వచ్చిన నొప్పికోసము నేనుపండ్లు తిన్నాను. గనుక, అపం డ్లుమీకోసము ఖర్చయినవె, అవునా కాదా?

భర్త—(తనలో)కాదంటె బతుకుట లేదుగదా! (పైకి) సందే హమేమి! నానిమిత్తమే ఖర్చుపడినవి.

భార్య—ఇక పదిపళ్ళుమిగిలినవి. మొన్నరాత్రి మీకు జావగా చినేనిక్కడికి పట్టుకొని వచ్చి మీకిచ్చుచుండగా వంటయింటిలో కుక్కదూరి అన్నముతినిపోయినది. నాకు తినుట కన్నమే లేకపోయినది. ఆకలికాగలేక యందులో నాలుగుపండ్లు తినివేసితిని. మీకు జావయిచ్చుచున్నప్పుడు నాఅన్నము కుక్కముట్టుకొని పోయినది గనుక ఆనాలుగుపండ్లు మీకోసమే కర్చుపడినవి. అందులో నాతప్పేమున్నది. ఏమంటారు?

భర్త—నిస్సందేహముగా నీతప్పేమిలేదు.

భార్య—ఆరుపండ్లిక మిగిలినవి మీకు జబ్బుగా యున్నదని నిన్నరాత్రి మాఅమ్మ మిమ్మలిని చూడడానికివచ్చినది. ఆబిడ వచ్చేటప్పటికి చాలాప్రొద్దుపోయినది. అప్పుడు రొట్టెకాల్చుటకు నిప్పులేకపోయినది. మనయింట్లో అటుకులు లేవు. అదినల్లమందు నుండ. కాళ్ళుచేతులు లాక్కపోతున్నాయంటే పెద్దముండా కూతురు శోషవచ్చిచచ్చిపోతుందేమో యని మూడుపండ్లుదానికిచ్చినాను. ఆముండమిమ్మలిని చూడడానికి వచ్చిందిగాని నన్నుచూడడానికి రాలేదుగదా! అందుచేత ఆమూడుపండ్లు మీక్రింద కర్చుపడ్డట్లేకాని మరొకటికాదు. ఇది మీరొప్పుకుంటారా వొప్పుకోరా ?

భర్త—అయ్యో! వొప్పుకోకేమి సబబుగాయున్న నేనొప్పుకోక పోతానా?

భార్య—ఇక మూడుపండ్లుండవలెను. మీకురుపుల నిమిత్తమై అవిసెగింజలు తెమ్మని మన పిల్లవాడిని యెంతబతిమాలినా తెచ్చినాడు కాడు. కొట్టినా వెళ్లినాడుకాడు. అప్పుడొక యరటిపండు వాడిచేతుల్లో పెట్టి బజారుపంపించి గింజలు తెప్పించినాను. ఆపండు మీపనినిమిత్తమేఇచ్చాను గాని నాపనినిమిత్తము గాదుగదా !

భర్త—అవును నాపని నిమిత్తమే, ఇందులో నీలోపమేమిలేదు.

భార్య—మిగిలిన రెండుపండ్లలోను ఒకపండు మీయెదాననే బెట్టాగదా ! ఇంకొకపండుంది. అది గూట్లోనుంచి తీసేటప్పుడు క్రింద పడి పోయింది. కొంచెము మట్టైనపండు జబ్బుమనుష్యులకు మీకు పెట్టడ మెందుకు, యెటుపోయియెటువచ్చునోయని భయపడి కడిగివేసి నేను నోట్లో వేసికొన్నాను. ఎటువచ్చీ బుద్ధిపూర్వకముగా నేతిన్నదే యొకపండే. అదైనా పతిభక్తిచాత క్రిందపడ్డపండు రోగులకు పెట్ట కూడదని ముందువెనుక లాలోచించే దాననుగనుక అటువంటి పండు తినడంవల్ల వచ్చేనష్టం నాకేవస్తుందని ఆపనిచేసినాను. ఇందులో నా దోషమేమిలేదు. అన్నిపండ్లు మీకిక్రింద ఖర్చుపడ్డవి. నామీదవూరక అనుమానపడితే ఆదోషంమీది. మీవల్లదోషముంటే మీరేపోతారు. నావల్లదోషముంటే నాపసుపుకుంకమే పోతుంది. దైవమొగంచూచినే నెంతో భక్తితాత్పర్యములతో పనిచేస్తున్నాను.

భర్త—నీవల్లఏదోషములేదు. దోషమంతా నావల్లనే యున్నది. ఎట్లైనా నేనే పోవలెనని నీసంకల్పము. ఇంతలో నేను పోను. భయములేదు. ఛక్రికేళీపళ్ళు తినకపోయినను నారోగము కుదురు చున్నది.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

# ప్రమాదీచసంవత్సరఫలము

ఈసంవత్సరఫలము మిక్కిలి చిత్రమైనది. అదృష్టహీనులకోరిక నిష్ఫలము. అదృష్టవంతులకోరిక సఫలము. వేసవికాలములో చూతఫలము, రసాలఫలము, మాకందఫలము, వర్షకాలములో జంబుఫల

ము, శీతకాలములో సీతాఫలము. ఈఫలములుమాత్రము నిశ్చయ ములు. తక్కిన ఫలములు విఫలములు. ఈసంవత్సరాది పాడ్యమి మొదలుకొని మృగశీర్షా ప్రవేశమునకును పగలెంతలు మిక్కుటముగా నుండును. జోడు లేనివారికాళ్ళు గాలును. గొడుగు లేనివారి నెత్తిమాడును. ఈ సం॥ రము చైత్రవైశాఖ జ్యేష్ఠమాసములలో విసనకఱ్ఱ లెక్కువ కర్చగును. లావుశరీరములవారికి చెమట లెక్కువ పోయును. వైశాఖమాసములో కొన్ని రాత్రులయందు గాలివీవక జనులు తహ తహ పడుదురు ఈసంవత్సరము 365 దినములలో మాపట్టణమునందున్న దానవాయిగుంట పేటలో రెండుస్థలములన్నర వేలము వేయబడును. తక్కిన స్థలములలో రెండుమూడు ఆనంద సం॥ రములోను తక్కినవి అక్షయ సం॥ రము లోపుగాను వేలము వేయబడును. మా పట్టణమందలి మార్కండేయ స్వామివారి ఆలయమువద్ద మునిసిపల్ వారు త్రవ్వించిన మురికినీళ్ళ కుండులవల్ల బయలుదేరుచున్న వాసన పూర్వజన్మవాసనకంటె నెక్కువ బలకరమై ఆరతికర్పూరము, మంచిగంధము, అగరువత్తులు, మల్లెపూలు, అత్తరుపన్నీరు, సెంట్లు మొదలగువాని వాసనను యెంతమాత్రము బయల్పడనీక జేయును. మునిసిపల్ పట్టణములో వోటర్ల జాతకములు ఈ సం॥ ము బాగున్నట్లు కనుపడుతున్నవి. బి., యె, మొదలగు గొప్పపరీక్షలయందు కృతార్థులయిన యుద్యోగస్థులు, ఇంగ్లీషువిద్య విశేషముగా చదువుకొనని యుద్యోగస్థులు సమానముగానే హిరణ్యశ్రాద్ధములు స్వీకరించుచుందురు. యజ్ఞము చేయదలచుకొన్నవారికి జనులవలన వసూలగు సొమ్ములో కర్చులుపోగా భార్యకు కంఠి, కాసులపేరు, వడ్డాణము చేయించుటకు సొమ్ము మిగులును. ప్లీడర్లలో దొంగప్లయింట్లు వ్రాసిన వారికి డబ్బెక్కువ దొరకును. న్యాయమార్గస్థుల స్థితి యథాప్రకారముండును. ప్రజలిచ్చుకొను మహాజరర్జీల మీద సర్కారువారిచ్చు

ఉత్తరువులు యథాప్రకారమునకు లోటు లేకుండా యుండును. ధనమే కాక నెయ్యి, ఊరగాయ, మామిడికాయలు, నిమ్మకాయలు, పెరుగు మొదలగునవి కూడ లంచములు పుచ్చుకొనునట్టి యుద్యోగస్థులు కొందరు బయలుదేరుదురు. వివాహపు మేజువాణీలలోను శ్రీరామ నవమి ఉత్సవములలోను వేశ్యాంగనలపై చిమ్మిలిగొట్టములతో వసంతము పన్నీరుకొట్టి ధన్యులమైతిమని సంతోషించుమహారసికులు నిరుటి కంటె నూటికి పదిమంది హెచ్చగుదురు.

| | |
|---|---|
| వైద్యులవృద్ధి. | ౫౦ పాళ్ళు. |
| రోగములవృద్ధి, | ౯౦ ,, |
| వడ్డీవ్యాపారంచేయువారికి దయ. | ౩ ,, |
| కాఠిన్యము. | ౯౩ ,, |
| అప్పులు పుచ్చుకొన్నవారికి ఇయ్యవలెనను బుద్ధి. | ౪౦ ,, |
| ఎగబెట్టవలెనను బుద్ధి. | ౬౦ ,, |
| కూటసాక్ష్యమువృద్ధి, | ౯౫ ,, |
| సత్యము. | ౫ ,, |
| ఉద్యోగస్థులకు ఓపిక. | ౩౦ ,, |
| తొందర. | ౭౦ ,, |
| భక్తి. | ౧౦ ,, |
| నటన. | ౯౦ ,, |
| జరిగినచర్య కొంచెమయినను వృత్తాంత పత్రికలలో ఎక్కువగా వర్ణించవలెనను నాసక్తి. | ౭౦ ,, |
| నిజవర్ణనము. | ౩౦ ,, |
| చుట్టలు తాగని వంటబ్రాహ్మణులవృద్ధి. | ౧ ,, |
| శుచిలేనివారివృద్ధి. | ౯౯ ,, |
| వరదక్షిణవృద్ధి. | ౧౦౫ ,, |



# నాగరికతా ప్రహసనము

(ఒక తెనుగుదేశపు బ్రాహ్మణుడు ఒక బంగాళీ బ్రాహ్మణుడు ప్రవేశించు చున్నారు)

తె—నాగరికతకు ముఖ్యలక్షణమేమని మీ యభిప్రాయము.

బం—లక్షణముల కేమిగాని మీరు కేవలము మోటవాండ్రు

తె—ఎందుచేత?

బం—మీరు చేపను ముట్టుకోరు. చేపను తినుటయనంగా మీరు ప్రాణపోకట. వట్టిశాకములు మాత్రి మారగింతురు. చేపను చూచిన భయపడువారు చేపను తినని వాడు మోటవాడుగాక నాగరికుడా? అందుకే మీరు వెనుకబడియున్నారు.

(అప్పుడొక శూద్రుడు ప్రవేశించుచున్నాడు)

శూ—యేంటండీ. మీయివోదాలుసూస్తే శిత్రింగావుంది. శేపను తినక మోతే తెనుగుబ్యామ్మడు మోటోడని బంగాలీబ్యామ్మడు అంటున్నాడా? నా యబిప్రాయంచేత మీ రిద్దఱుగూడ మోటోళ్ళే.

బం—ఎందుచేత?

శూ—నువ్వుమాంసం తింటావా?

బం—ఛీ. నేను మాంసము తింటునా? అంత యొడ లెఱుగకుండ పేలుచున్నావేమి?

శూ—అద్గందుకునే నువ్వు మోటోడవు. మాంసంపేరు శెప్పితే ఛీ యని గింజుకునేవోడివి గనుకనే నీవు మోటోడవు. శేప, మాంసము, ఈ రెంటిపేర్లు శెప్తె "తూ" అనేవాళ్ళు గనుక ఈ తెనుగు బ్యామ్మడు మోటోడు ఇటువంటి అపాత్రులకు మీకు నాజూకెక్కడానా?

(అప్పుడొక తురక ప్రవేసించు చున్నాడు)

తుర—అరే! కాఫర్. ఏమ్టివోయి మూడు మన్సీలు మాటసేస్తావున్నార్. మీ గడ్బిడసూస్తే కొట్కుంటార్ మల్లేవోంది. గడ్బిడ్ ఏమ్టిబోలో. ఒక్కికంటే ఒక్డు యెక్వాలనీ ఒక్డు తక్వలని మీలోమీర్ బాత్ సెప్తావుండార్,

శూ—ఏమండో సాహేబుగారూ! ఈ బాపనయ్య లిద్దరు మాంసము పేరు శెపితే కోశెడుదూరం పోతారండి. అందుచేత మోటవోళ్ళంటా వున్నానండి.

తుర—నీ వేమ్టివోయి. నీకి మోటవాడ్వి కావా ?

శూ—నే నెందుకయినాను. నేను మాంసము తింటాకాదూ.

తుర—అరే బద్మాష్! నీవు గొడ్డుమాంసం తింటావువోయి.

శూ—(చెవులుమూసికొని) రామ రామ. ఏంమాటలండఋ. ఆమాటినగానే నా శెవులో బల్లాలుచ్చుకు మొడిశినట్టుంది.

తుర—అరే. తూ నామర్దామన్సీ. అరే! ఆవు నీకి సుట్టం. మేఖ, ఖోడి నీకి సుట్టంకాదు. ఆవుతింటే యేమిఖోంప మున్గిందివోయి ఆవు మాంసం కడుపులో నీకి మంటసేస్తాదా? ఆవుపేడ ఆవుమూత్రం తినేకాఫర్ ఆవుమాంసం తింటే తప్పురా నీకి. మీ మూడు మన్సీ మోటగాడ్లోవోయి

తె—(తనలో) శివశివా!

బం—(తనలో) హరిహరి!

తుర—ఏమివోయి, మీరు సచ్చిపోన శపాల్‌లాగా మాటా లేక సూస్తార్ మేమీవోయి. గొడ్డుమాంసం అంటే గుల్‌గుల్ మంటార్, మీకి మోటనామర్దా మన్సీలువోయి మీరు.

(అప్పు డొక యూరోపియను ప్రవేశించు చున్నాడు.)

యూ—ఏమి గందరగోళం చేయుచున్నారు మీరు! ఒక మోట వాడు రెండవవానిని మోటవాడనుచున్నాడు నాబుద్ధిచేత మీరందఱు మోటవారలై నుండీ. మీ రందఱు పశువులవంటివారు. నాగరికత యేమో మీ రెఱుఁగరు. మీరు నేర్చుకొనుటకు సిగ్గులేదు. ఒకరిని చూచి మీరు నేర్చికొనరు.

తుర—అరె మాకికూడా మోటా?

యూ—ఓ తురక మనుష్యుడుగారూ, మీరు మోటవారు. ఈ బాప్మలు మోటవారు. ఈ శూద్రులు మోటవారు.

తుర—అరె నాకి బాపన్గాడ్లెకు సమం శేశావు నీకి. అరె యేంమడ్కిబే నొవ్వు. అశే నే గ్గొడ్డు తింతాన్ కోడి తింతాన్ మేక తింతాన్. నాకి మోటా? అరే శేపా సూ స్తే శిల్లంగి పెట్టిన మల్లె పారి పోతాడ్ యీబాప్మడు. వాడ్కి-మోటనాకి మోటా? నీకి బుద్ధిలేదూ వోయి.

యూ—మ సల్మానుగారూ! కోపము పుచ్చుకోకండీ. ముమ్మాటికి మీరు మోటవారు. ఈ హిందువు లెంతమోటవారో మీ రంత మోటవారు.

తుర—అరే యెందుక్ శేతావోయి?

యూ—మీరు కోపము చేయుదురుగదా.

తుర—నాకీ కోపం లేదు, నీపం లేదు. శెప్పవో.

యూ—మీరు కోపముచేయరుగదా.

తుర—మాకీ కోపం? కోపం లేదు. గీపం లేదు. శెప్పుబే.

యూ—మీరు పందిని భక్షించెదరా?

తుర—తు, తు, తు, తు, తు, తు, అరే ముర్దార్ ముర్దార్,

యూ—మురదా రనగా నేమి? దాని భావము సెలవియ్యండి మీరు.

తుర—ముర్దార్ ముర్దార్ ముర్దార్. అరే యీ డెవడురా మాకీ. ముర్దార్ తిన్మంతాడు మాకీ. ముర్దారంతే, అరేబిస్మిల్లా శేసి తిన్నాడదు. మా అల్లా మా రసూల్ శెల్వ యిచ్చినార్. అది బల్ దోసం. ఆమాట నోట్కి రానియ్యకూడ్దు.

యూ—సాహేబులుగారూ! అది పొరబాటు. అదితప్పు. మనము కోసుకు తినుటకై దేవుడు కరుణచేత, అన్నిజంతువులు నిచ్చినాడు. ఆయన మనుష్యులమీద మిక్కిలి దయగలవారు. ఆవును తినుమని పందిని తినవద్దని వారు ఎక్కడ చెప్పియుండలేదు. ఆవుమాంసము గొంతుకు దిగి, పంది మాంసము గొంతుక దిగదాయేమి? రుచిగల వస్తువులను తినకుండ విడిచిపెట్టుట పాపము దోసము ఈదోసము మీరు చేయుటచేత మీరు తెలివితక్కువవాండ్రు మోటవాండ్రు. అందుచేత మీకు నాగరికత లేదు

(అప్పుడు చీనాదేశస్థుం డొకడు ప్రవేశించుచున్నాడు.)

చీ—చీనాదేశమే దివ్యదేశము చీనాదేశస్థులు దివ్యులు. చీనా రాజ్యము దివ్యరాజ్యము. లోకములోనున్న యితరదేశస్థు లందఱు మూర్ఖులు, అనాగరికులు, పశువులు ఎవరి తెలివితక్కువ వారికి తెలియదు. ఉన్నమాటన్న ఉలుకెక్కువ. ఈబ్రాహ్మణులు, తురకలు, యూరోపియనులు, నాగరికతావిషయములో మనముందఱ నిలుచుండుటకయిన అర్హత లేనివారు.

యూ—ఓ చీనా దేశస్థుడా ! నాగరికతలో నీగొప్ప యేమిటి?

చీ—మీరు తలవెండ్రుకలు కత్తిరించుకొందురు మేము జడలు పెంచుకొందుము. మీరు కుక్కపండ్లవలె పండ్లు తెల్లగా నుంచుకొందురు. మేము పండ్లకు కప్పువేసికొందుము. మీపనులన్ని అనాగరికపుపనులు గావా !

యూ—జుట్టు కత్తిరించుకొనకపోవుట, పండ్లకు కప్పు వేసికొనుట గొప్పనాగరికతలా ?

చీ—కాకేమి! నాగరికత, మోటతనము చిన్నపనులలో కూడ తెలియుచుండును. దీనికేమి భోజనములో మీరుమిక్కిలిఅనాగరికులు

యూ—ఎందుచేత ? మేమన్నివస్తువులు తినుచున్నామే

చీ—మీరు కుక్కను తిందురా !

యూ—ఛీ! ఛీ! పాడుకుక్క.

చీ—మీరు పామును తిందురా ?

తురక—అరె పామ్కితింతారువోయి మీకి అరె యెంతా నఖారాఖులంవోయి మీది. తేలూబీ తింతావోయ్. జెజ్జీబితింతావా?

చీ—మీరు కప్పను తింటారా ?

యూ—మేము కప్పలను తినము.

చీ—కప్పఊరగాయ తినని నీనాలు కెందుకు? ఒకపర్యాయం తింటె నీజన్మమధ్యమున మళ్ళా వొదిలిపెడతావా ?

యూ—ఛీ ! దిక్కుమాలిన ఊరగాయ. ఆమాట చెప్పకు. నాకు డోకు వచ్చుచున్నది.

చీ—ఇందుచేతనే మోటవాడవైతివి.

(అప్పుడు అఘోరమతస్థుడు ప్రవేశించుచున్నాడు.)

అఘో—(తనలో) ఈశ్వరునకు పశుపతి నామ మేలవచ్చినదో ఒక్క పండితపశువెన నెఱుగను. పశువు లనగా బ్రహ్మ

మొదలుకొని పిపీలికాది పర్యంతము జంతువులు. అందుచేత చీమ పశువు. మనుష్యుడు పశువు. బ్రహ్మ పశువు. దేవతలు పశువులు. అట్టిపశువులన్నియు సమానమై యుండగా జంతువులకు జంతువులకు భేధ మేలచేయవలయునో తెలియకున్నది. ఓహో! నాయెదుట మోట జాతివా రనేకులు కనబడుచున్నారు. వీరందఱు జ్ఞానశూన్యులే.

యూ—నీవెవరు ? నీ వేషము చాల భయంకరముగానున్నది.

అఘో—నే నఘోరమతస్థుడను. దూరముగా నుండు! దూరముగా నుండు! దగ్గరకు రాకు. నేను మైలపడిపోదును. నీవు జ్ఞానశూన్యుడవు.

యూ—నా కేమిజ్ఞానము తక్కువయినది?

అఘో—అంతయు తక్కువే ! నీకున్నజ్ఞానమేమిటి ?

యూ—లేదని యెట్లు చెప్పగలవు ?

అఘో—ప్రత్యక్షముగా కనుపడుచుండగా వేఱ చెప్పవలయునా ! నీవు గొఱ్ఱెలు తిందువు. కోళ్ళను తిందువు. పసువులు తిందువు. పందిని తిందువు. కాని మనుష్యుని తినుట కొప్పుకొనవు.

యూ—(చెవులు మూసికొని, ఆకాశమువంకజూచి) పాపము! పాపము! ఓప్రభువా ! ఈపాపాత్ములను రక్షింపుము.

తురక—మన్నిసి తినేమతమూ మీది? అరే. పిల్లల్కి పెద్దల్కి మీక్కుతింతావ్. అరే! నీకే పులీమన్నీ.

అఘో—ఆభేదమే కూడదు. అన్నిజంతువులు సమానము. మనుష్యుడు జంతువే అందుచేత ఏది లభించినప్పుడు దానిని తినవలయును.

యూ—నీవంటి పాపఖర్మ్ముడు లేడు.

అఘో—ఎందుచేత ?

యూ—ఎందుచేతనా ! మనుష్యు లీశ్వరపుత్రులు.

అఘో—అన్ని జంతువులు ఈశ్వరునిబిడ్డలే. మనుష్యుని దినుట పాపమైన పక్షమున కోళ్ళను దినుట గొఱ్ఱెల దినుట పాపమె. పాపము లేని పక్షమున యెవరేమి తిన్నను పాపము లేదు.

యూ—నీసిద్ధాంతములు విపరీతసిద్ధాంతములు, పాపములు, మానవజాతివిరుద్ధములు.

అఘో—మీయందఱి పద్ధతులు మానవజాతి విరోధములు. కాని నావి కావు.

తుర—(యూరోపియనుతో) జీభాయ్, ఈమన్సీ సీకీ నాకీ కొరుక్కుతింటాడ్. మన్కీ పోదాం రావోయ్.

యూ—భయము లేదు. దేవుడు ఉన్నారు.

తెలుగుబ్రాహ్మడు—మీనాగరికతలన్ని నేను గంటనుండి విను చున్నాను. మాంసము తినుటయే నాగరికత యైనపక్షమున మీనాగరికతకు మీకు ఒక్క సలాము. మీలో మీకే ఐకమత్యము లేదు. ఒకరు తినునట్టివస్తువు మఱియొకరు తినకపోవుట మీలో కూడ గలదు. కొన్నివస్తువులు తినకపోవుట అనాగరికత యైనపక్షమున నాతోపాటు మీరంద అనాగరికులే. అనాగరికుడనైనను సరే, అడవిమృగమైనను సరే, నాకాయగూరలనే నేభుజించి బ్రతికెదనుగాని మీ సాధుపశువులు కుక్కలు నక్కలు పిల్లులు పాములు జెఱ్ఱులు తేళ్ళు తిని నేబ్రదుకజాలను. బ్రతుకకపోయిన పక్షమున చచ్చియైన పోయెదగాని వాటిని స్పృశింపజాలను. అటువంటి నాగరికతకంటె ఇటువంటి నాగరికతయే నాకు తృప్తికరముగా నున్నది.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



# మహామంత్రకేసరి

(చండినాథశాస్త్రులుగారును, పురుషోత్తమరావుగారును
ప్రవేశించుచున్నారు.)

పురు—ఎవరువారు ? ఏవ్వూరండి మనది.

చండి—మాది గోదావరీతీరము. కోటిపల్లిమహాపుణ్యక్షేత్రము కాపురము.

పురు—తమ రేమిపనిమీద దయచేశా రిప్పుడు?

చం—ఏలినవారి దర్శనము నిమిత్తము.

పు—నాదర్శనము నిమిత్తమేనా! సరే ఆకుర్చీమీద దయ చేయండి.

చం—చిత్తము. తమ అనుగ్రహమునకు పాత్రులమె. (అని కూర్చుండును),

పు—నావద్దకు తమరెందుకు దయచేసినారు? మీఅభిప్రాయ మేమిటో సెలవియ్యవలెను?

చం—చిత్తము. చిత్తము. మనవిచేస్తాను. తమరు సాక్షాత్తు మహానుభావులు. తమముఖము చూస్తె సమస్తపాపములు పోతాయి. తనుకీర్తి జగద్విశాలింతము. తమ తండ్రిగారుచేసుకున్న గొప్ప తపస్సు చేత తమవంటి సుపుత్రులు జన్మించినారు.

పు—తమరాట్టె స్తవము చేయకండి. నే నెందుకూ తగను. మీపనేమిటో సెలవియ్యండి.

చం—తగకపోనడమేమి. తగినవారు తగుదుమని చెప్పకుం టారా యేమిటి. "ఏకో గోత్రే ప్రభవతిపుమాః యః కుటుంబం బిభర్తి." అన్నట్టె బహునాయబాలు పోషిస్తారు అట్టిడే వంశము

తకూ గొప్పవాడు. అని వెనకటివిక్రమార్క మహారాజులుంగారి సభలో తెనాలి రామలింగంగారు సెలవిచ్చారట !

పు—(నవ్వి) ఇదేమిటండో శాస్త్రిలుగారు ! విక్రమార్కుని సభయేమిటి. తెనాలి రామలింగము చెప్పడమేమిటి? అతనికీ యితనికీ వేయి సం॥ ముల తేడా ఉన్నది. రామలింగము తెనుగు దేశస్థుడు. విక్రమార్కుడు మాళవదేశస్థుడు. మీరీ అసందర్భము లెక్కడ నేర్చు కొన్నారండీ ?

చం—ఆలాగాండి. అవునవును. పెద్దముండావాణ్ణి నగుటచేత మరిచిపోయినాను. పొరబాటె, ఇప్పుడు సరిగా జ్ఞాపకము వచ్చినది. వెనక రాయలవారి సభలో కాళిదాసుగారు చెప్పినది.

పు—(నవ్వి) ఏమండోయి శాస్త్రిలవారు. ఒకతప్పు దిద్దుకో బోయి మఱొకతప్పు చేస్తున్నారు. ఎక్కడి రాయలవారు. ఎక్కడి కాళి దాసండి. రాయలవారు మొన్న మొన్న తెనుగుదేశము, కన్నడదేశము ఏలినవారు. కాళిదాసుగారు వెయ్యేండ్లక్రిందట ఉజ్జయినిలో నున్న వారు. ఈ గొడవలన్నీ మీకెందుకు, మీరు వచ్చినపని సెలవిస్తురూ!

చం—ఏమో పెద్దకాలపువాడి నగుటచేత ఒకదానికొకటి చెప్పినానేమొ పోనీండి. ప్రస్తుతము మనవిచేస్తాను. నేను కాశీలో 24 సం॥ ములు సకలవిద్య లభ్యసించినాను. జగత్ప్రసిద్ధులయిన గార్శీప్రసాద ఘటోపాధ్యాయులవారు నాగురువులు. తర్కములో బాధాంతమువరకు చదివినాను. నాప్రజ్ఞకు సంతోషించి కాశీపండితు లందరు సభచేసి తర్కాలంకారచూడామణియని బిరుదిచ్చినారు. వ్యాకరణములో భాష్యాంతమువఱకు క్షుణ్ణముగా చదివినాను. నా యెదుట యెవరు నిలుచుండలేరు. భాష్యములోనున్న కొన్నిలోటు పాటులు సవరించి యింకొకభాష్యము వ్రాయవలెనని ఆలోచించితిని గాని మహానుభావుడయిన పతంజలి గ్రంథము నూాల పడిపోవునేమో

యని కొందఱుపండితులు సన్మానించినారు. వేదాంతశాస్త్రములో ప్రస్థానత్రయము శాంతిచేసినాను. మంత్రశాస్త్రములో మహోపాదు కాంత దీక్ష పుచ్చుకొన్నాను. "శాపాదపి శరాదపి" అనునట్లుగా నే నడిగినప్రశ్న కెవ్వడు జవాబు చెప్ప లేడు. చచ్చినవాడిని బ్రతికించగలను. బ్రిదికిఉన్నవాడిని క్షణములో చంపఁగలను.

పు—శాస్త్రులవారూ! మీరు సకలశాస్త్రపారంగతులే! ఇప్పు డెవరికైనా తర్క వ్యాకరణ వేదాంతములు పాఠాలు చెప్తారా?

చం— కాశీనుండి వచ్చినతర్వాత ఆశాస్త్రాల వ్యాసంగమే లేదు. అందుచేత చాలావఱకు మరచిపోయినాను. ఏమంటే? చిల్లర పుస్తకములు పాఠములు చెప్పడము నావంటి పండితునికి అవమాన కరము. పెద్దగ్రంథములు చదివేవాళ్ళు ఈదేశములో లేనేలేరు. అందు చేత ఇప్పుడు జ్యోతిషశాస్త్రములోను మంత్రశాస్త్రములోను వ్యాసంగ మెక్కువగా చేసినాను. మైసూరురాజుగారి వివాహమునకు ముహూర్తము పెట్టి రు 1116 లు బహుమానము పొందినాను. బడ్వాడా మహారాజుగారికి చండీమంత్ర ముపదేశముచేసి రత్నకుండలములు వేయిరూపాయలు విలువగల జరీశాలువలు పుచ్చుకొన్నాను.

పు— శాస్త్రులవారూ, ఆకుండలములు శాలువలు ఒకసారి చూపిస్తురూ. అవి చెవులకు పెట్టుకొని వచ్చినారు కారేమి?

చం—నేను పట్టి నిర్భాగ్యుడను నాయనా! అవి చెవులకు పెట్టుకొని వెడుచుండగా దొంగలుకొట్టి దోచుకొన్నారు.

పు—అయితే మీశాలువలయినా ఒకమాటు చూడవలెనని యున్నది. పట్టుకురాగలరా?

చం—పట్టుకొనేనస్తును. తనువంటివాడు చూడతలంచుంటే మఱే మున్నది! కాని పాడుతాటాకుకొంపలు, నిరుటి సం॥ రం మాగ్రామం కాలిపోయినది. అందులో ఆ శాలువలు కాలిపోయినవి ... రామవీ ...త్రి

అయింది. అందులో శాలువలు, పాత్రసామగ్రి అన్ని హతమయిపో యినవి.

పు—ఏరోజునండీ మీ యిల్లు తగులడిపోయినది ?

చం—చైత్ర బహుళ మావాస్యనాడు.

పు—అమావాస్యనాడా! నేనానాడు కోటిపల్లిలోనున్నాను తగులడిపోలేదే!

చం—అసలు కోటిపల్లేగాని ప్రస్తుతం రెండేండ్లనుంచి అక్కడ ఉండడంలేదు. ద్రాక్షారందగ్గరఉన్న శివలగ్రామంలో ఉంటున్నాను. అక్కడ యిల్లు తగులడిపోయింది.

పు—సరే సరే తెలిసింది. ఎక్కడైతే నాకెందుకు? తమరొచ్చి నపని సెలవియ్యండి.

చం—నేనువచ్చినపని యేమో తమకీపాటికి తెలిసియేయుండును. కొంపకాలిపోయినది గనుక మరల దానిని నిర్మించుకొనవలయును. కావున తమరు సహాయము జేయవలయును. అయితే—

పు—శాస్త్రిగారూ, మీరు తర్కములో బాధాంతమయినను సంసారములో బాధాంతమయినదికాదు. వ్యాకరణములో భాష్య శాంతియైనది కాని మనశ్శాంతి మాత్రముకాలేదు వేందాతములో ప్రస్థానత్రయమైనది కాని బ్రాహ్మణ్యత్రయము పదలలేదు. మంత్ర శాస్త్రముతోబాటు తంత్రశాస్త్రముగూడ తమరు నేర్చుకొన్నారు.

చం—మీమాటకడ్డువచ్చినాను. నన్ను క్షమించండి. ఉచిత ముగా నాకు మీరేమి ధనమియ్యవద్దు. నాకిద్దరు ముగ్గురు డిప్టీకలక్టర్లు తహసీలుదార్లు ఉచితముగా ధనమియ్యవస్తే వద్దన్నాను.

పు—ఉచితముగానియ్యక యెల్లాగిమ్మన్నారు? బదులియ్యమ న్నారా యేమిటి?

చం—బదులు కాదు. నావల్లకొంతలాభము పొందియియ్యండి.

పు—మీవల్ల మాకు వచ్చు లాభ మేమిటి ?

చం—నావల్ల మీరేదైనా విద్యనుపదేశముపొంది నాకుకొంత ధన మిప్పించండి. అప్పుడు యాచనచేత జీవించినాన నేదోషము నావద్ద నుండదు.

పు—మీ రేమివిద్య నాకుపదేశింపగలరు ?

చం—మంత్రవిద్య.

పు—ఏమిమంత్రం నడమంత్రమా ? పాముమంత్రమా తేలు మంత్రమా ?

చం—పాముమంత్రముకాదు తేలుమంత్రముకాదు అటువంటి తుచ్ఛమంత్రములు నేర్పువాడనుకాను.

పు—అట్లయిన నే మహామంత్రము నేర్పుదురు ?

చండి—బాలమంత్ర ముపదేశించెదను.

పు—దానిగొప్ప యేమిటి?

చండి—తమకు తెలియునుకాని దానిగొప్పయింతా అని నేనువ ర్ణించలేను. దానిమహిమ కొంచెము చెపుతాను వినండి. బాలమంత్ర ముపదేశముపొంది తగినట్లు పునశ్చరణచేసి తగిన శాంతులు వగయి రాలు చేసినవాడు, అధికారులను తనజేబులో వేసికొనగలడు. ఎంతెంత చిక్కులు వానికి వచ్చినను మంచు విరిసిపోయినట్లు మాయమైపోవును. అతడు పట్టినదంతయు బంగారమగును. పలికినదల్లా వేద వాక్కగుతుంది. అధికారులు చేతిలో కీలుబొమ్మలైపోతారు. ఎక్కడికి వెళ్ళినా దిగ్విజయమే. లక్ష్మీసరస్వతులు వారియింట్లో తాండవమాడు తూంటారు అధికారులే కాదు లోకమంతా వాడికి వశమైపోతుంది.

పు—అబ్బా. అంతమహాత్మ్య ముందండి, అందులోను ?

చం—మహాత్మ్య మని మెల్లిగా అడుగుచున్నారా ? ఇదిమంత్ర ములలోకల్లా రాజు. విజయనగరం మహారాజులుంగారి కీమంత్రమునల్లనే కదా రాజ్యము వచ్చినది!

పు—అట్లాగాండి. అయితే తమకు సంపూర్తిగా పునశ్చరణ అయిందాండి.

చం—తమ దయనల్ల సంపూర్తిగా అయినది.

పు—శాంతులు నగయిరాలు సరిగా జరిగినవా ?

చం—యధావిధిగా జరిగినవి

పు—అయితే యేవిధమైన లోటూ లేదన్నమాటే. ఉపదేశముకూడా సరిగా జరిగిందా మొట్టమొదట?

చం—ఆహా సరిగా జరుగకేమి! మాగురువుగారు మంత్రి చింతామణి. భరతఖండములో మంత్రశాస్త్రములో అంతవారులేరు. కాశీమహారాజులుంగా రొకపర్యాయము మాగురువుగారివద్దకు నచ్చి పాదాక్రాంతులై మంత్రశాస్త్రము మహిమ చూపించవలసినదని ప్రార్థించినారు, అప్పుడు నీకేమికావలయు నవి మాగురువుగా రడిగినారు. ప్రవహిస్తూన్న గంగనుకట్టివేయవలసినదని రాజుగా రడిగినారు. మా గురువుగారు గంగాప్రవాహము నాలుగుగడియలసేపు స్తంభింపజేసినారు. అదిచూచి కాశీజనులు మహారాజుగారు గడగడలాడిపోయినారు

పు—ఈసంగతి యేపత్రికలోను పడలేదేమండి?

చం—వెధవపత్రికలు ఇల్లాంటి గొప్పసంగతులు పాడుపత్రికలలో పడతాయా.

పు—సరే దానికేమిగాని, ఇప్పుడు మంత్ర ముపదేశము చేస్తానంటారూ మీరు?

చం—చిత్తము. తమ కుపదేశము చెయ్యవలెనే సంకల్పము.

పు—అయితే నన్నడుగడ మెందుకు ? చెయ్యండి.

చం—అడక్కుండా యెల్లా గుపదేశం చెయ్యమన్నారు ?

పు—మీ కీమంత్రము సరిగా నుపదేశమై పునశ్చరణమైనది గదా! పునశ్చరణ సరిగానైనవారికి లోకమంతా వశమగుతుందికదా.

కాబట్టి మీమంత్రశక్తివలన మీకు నేను వశముకావలసినదే. మీవద్దకు నాయంతట నేను వచ్చి మీపాదములకు నేను మొక్కి స్వామీ! బాలమంత్రము నాకుపదేశము చెయ్యండి యని నేను మిమ్మలిని అడిగేటట్టు మీరు చేయవలెను. మీమంత్రములో ప్రభావముంటే అలాగే కావలెను. అట్లు కానియెడల మంత్రములో ప్రభావము లేదనియైన మేమనుకొనవలెను లేక పునశ్చరణలో లోటుగలిగినదనియైన ననుకొనవలెను.

చం—ఉపదేశములో లోటు లేదు. పునశ్చరణలో లోటు లేదు. మంత్రప్రభావములో లోటు లేదు.

పు—లోటు లేకపోతే నన్ను మీరెందుకు వశము చేసికొనలేకపోయినారు? ఈమంత్రసిద్ధియైనవారికి లోకమంతా వశమగునని చెప్పినారు కదా మీరు!

చం—చిత్తము అల్లాగే అన్నాను. అదినిజమే ఈరాత్రి దేవిని మళ్ళీ ఆవాహనజేసి రేపో యెల్లుండో మీరు నన్ను వచ్చి అడిగేటట్టు చేస్తాను. ప్రస్తుతం సెలవిప్పించండి. (అని లేచి తనలో) వీ డెవడో గడుసుపిండము. వీడు నన్నే బుట్టలో పెట్టినాడు. వీడిదగ్గర నాపాచిక పడదు. (అని వెళ్ళును)

పురు—వీడి కిదే సెలవు. వీడు మళ్ళీ రాడు వీడు నేను యినుకతక్కెడ పేడతక్కెడయైనాము. (అని నిష్క్రమించును)

---

# అపూర్వ యజ్ఞము

## రంగము 1

(అప్పుడు పిడిగుద్దుల విస్సయ్య, మాటకారి మల్లయ్య కోతల గోవిందయ్య ప్రవేశించుచున్నారు)

విస్స—అయితే మీ రిప్పుడు చెప్పవచ్చేమాట ఏమిటి.

మల్ల—నేను నాలుగు గడియలనుండి గంతుక చించు

కుంటూంటే నీకు తెలియనే లేదూ. చిన్నప్పుడు కాంతయ్యపంతులు గారు మట్టితల ముంటాకొడకాయని నిన్ను పిలిచేవారు. ఆమాట సార్థకము చేశావు.

గోవిం—వాడికి స్పష్టముగా అరటిపండు వొలిచి చేతిలో పెట్టి నట్టు చెప్పితేనేగాని తెలియదు. మీా గడుసుతనము పోకడలు మీా టక్కుటమారాలు వాడిదగ్గిర పెట్టకుమరి.

మల్ల—అయితేనీవు యజ్ఞం చెయ్యవలసినదని మా అభిప్రాయము. దీనివల్ల మనము ముగ్గురముకూడా తేల్తాము.

విస్స—ఓరి మీా యమ్మకడుపుమాడా. నేనేమిటి యగ్గెం చేయడమేమిటి. రాజానగరం సత్త్రములో మొన్నటిదాకా వంట స్తిని, అంతకుముందు కత్తిపూడి సత్త్రంలో నిన్నటిదాకా నీళ్ళు మోస్తిని, నాలుగు నెలలక్రిందటివరకు అమలాపురము తహసీలుదారు గారి దగ్గర గరిటె పుచ్చుకుంటిని. నేను యగ్గెముచేస్తే నలుగురునవ్వరూ

మల్ల—ఎవడురా నవ్వేవాడు. ఈ చేసేవాళ్ళందరు నీకంటె నెక్కువవాళ్ళా యేమిటి, రాజానగరం సత్త్రములోను కత్తిపూడి సత్త్రములోను నీవున్నమాట యెవడికి తెలుసురా? ఎవడూవచ్చి మొగముమీాద అడగడు. ఒకవేళవచ్చి యెవడైనా మొగముమీాద అడిగితే చీచీ నేనుగాదు. మాపినతండ్రికొడుకు నాలాగేయుండేవాడు, నేనేమిటి ఆపనిచేయడమేమిటని చుట్టు ప్రక్కలనున్నవాళ్ళు నలుగురు హడలిపోయేటట్టుగా గావు కేకలవేసి చెడతిట్టి పారవెయ్యి. ఆపయిన మేమందుకుని జాడించి పారవేస్తాము. దానితో నెవడైనాసరే డంగు పోతాడు.

గోవిం—నిజమేనోయి. బుకాయింపు వంటిది మరియొకటికాదు, బుకాయించగలిగితే భూమి తేలవచ్చునన్నాడు, ఓరే! విస్సన్నా అన్ని విధాలచేత నీవు యజ్ఞముచేయుటకు తగియున్నావు. నే చేదామంటే

నాంభార్య కాపురానికి రాలేదు. పదకొండువందల రూపాయలు వాళ్ళ మొద్దాన్నిపోసి మొన్న మొన్ననే ఆరేండ్ల గుంటముండని కట్టుకున్నా నన్నమాట తెలుసుగదామీకు. పోనీ మల్లిగాడి చేతచేయిద్దామంటే వీ డపత్నీకుడు. వీడికెక్కడా సోమిదేవమ్మ కుదరదు.

విస్స—రావువారి కొట్లలో నుందిగా సోమిదేవమ్మయొకతె?

గోవిం—ఆసోమిదేవమ్మ మన మల్లిగాడికి బహిరంగములోనికి వచ్చేదికాదు. ఆలాటి సోమిదేవమ్మలు నీకూఉన్నారు నాకూ ఉన్నారు.

విస్స—పోనీ యిప్పుడు యజ్ఞముచేయకపోతే నేమిరా దీనమ్మ కడుపుకాలా?

మల్ల—ఓరీ వెఱ్ఱిముండాకొడకా అల్లాగనకు యిప్పటిరోజులలో డబ్బుసంపాదించడానికి రెండు మూడుపాయాలువ్నాయి. దేవాలయము కట్టిస్తానని బయలుదేఱడము ఒకటి. యజ్ఞము చేస్తానని బయలుదేఱ డము ఒకటి. వీటిలో రెండవదే మంచిది. యజ్ఞంచేస్తే గోనిసంచెడు రూపాయలు వస్తాయి ఒకడు బియ్యమిస్తాడు ఒకడు పప్పిస్తాడు. ఒకడు నెయ్యిస్తాడు. ఒకడు విస్తరాకిస్తాడు, ఇల్లాగ తలొకకస్సు తలకొకరు పెట్టుకుంటారు. పైగా కట్నాలక్రింద కానుకలక్రింద బహుమానముల క్రింద దొరికే చీరలు రవికెలగుడ్డలు పండ్లు ఫలములుగాక మొద టయితేనేమి చివరయితే నేమి దొరికే రొక్కము నాలుగువేల రూపా యలకు తక్కువ యుండదు. ఇందులో మా యిద్దఱకు చెరియొక వైను వందలు రూపాయలుఇచ్చి తక్కిన మూడువేలు నీవేపుచ్చుకో. పైగా రెండు సం॥ల వఱకు బియ్యం పప్పు ఉప్పు మొదలయిన గ్రాసం మిగులుతుంది. పైగా చీరలు జామాఱులు కొంచెము తక్కువ ధరలకు అమ్మివేసినామంటే అయిదారు వందల రూపాయలు వస్తాయి. ఏ శుభాశుభములకు యెక్కడికి సంభావనకు వెళ్ళినా తక్కినవాళ్ళకంటె సంభావన సెకు రెట్టింపు ముట్టుతుంది. పైగా సోమయాజులుగారని

చెప్పి గౌరవముకూడా చేస్తారు. కుండలాలజత యెవరైనా వేస్తే వేస్తారు. లేకపోతే యింతసొమ్ము వస్తూన్నది గనుక రెండుకానుల బంగారముపెట్టి మనమే చేయించి యేకరణంగారో మునసబుగారో యిచ్చినారని మనమే వేసుకోవచ్చును. నాలుగు మేకలనిచంపినా మంటే నాలుగువే లింట్లో వచ్చిపడతాయి. ఇప్పుడు నీపెళ్ళాము నగ నట్రాలేక పరిత్యక్తము తలవెంట్రుకల వెధవలాగున్నది. యజ్ఞమైన తరువాత కావలసినన్ని నగలు దిగవేయవచ్చును ఓరే! పైగా అదృ ష్టము బాగాయుంటే ఒక పుట్టెడుభూమి కొనుక్కోవచ్చునురా.

విస్స—ఒరే అంతా బాగానే యున్నది కాని పొట్టచించి కంచు కాగడాపెట్టి వెదికినా యెక్కడా అక్షరముక్క లేదునాకు. ఇల్లాటి వాడిని యెగ్గెమెల్లా చేయను? పైగా సంధ్యావందనమైనా రాదురా దీనమ్మకడుపుకాలా!

మల్ల—పాండిత్య మెందుకోయి వెధవపాండిత్యము! ఈ చేసే వాళ్ళందరికీ పాండిత్య ముండేడిశింది! యజ్ఞం చెయ్యదలచుకుంటే మూడుపూటలలో సంధ్యావందనము చెప్పిస్తాను నీకు!

గోవిం—అవునురా, సంధ్యావందనము మాటకుభయము లేదు.

విస్స—అన్నింటికన్నా మరోచిక్కుందిరా నాకు సుఖసంబంధ మైన జబ్బుమూలాన్ని తెల్లారేటప్పటికి తరవాణీ యన్నము తింటే కాని యుండలేను. ఆయగ్గెం నాలుగు రోజులు ఉపవాసం ఉండడ మెల్లాగు? తరువాతరోజు అగ్గోత్రాలు చేసికోవాలి కాబోలు.

మల్ల—యజ్ఞము నాలుగురోజులు యెల్లాగో కష్టపడి కాలక్షే పము చెయ్యాలి నువ్వు. అప్పుడుకూడా నేను మన గోవిందుగాడు యెల్లాగో ఒకలాగు యే కాఫీకొట్టులోనుండైనా యింత కాఫీ ఉపమా తెచ్చినీకు పెడుతూనే యుంటాము. తరువాత నీ వగ్నిహోత్రాలు చెయ్యక్కరలేదు ఏమిఅక్కరలేదు.

విస్స—సరే! నాపెళ్ళాముతోకూడా ఆలోచించి రేపు ప్రొద్దున్న చెపుతానులే. అదొక బ్రహ్మరాక్షసిముండ. అది తెల్లారేటప్పటికి ఆవకాయి వేసికొని కంచెడన్నము తింటేనే కాని యుండలేదు.

గోవిం—ముందు నువ్వు చెప్పిచూడు వప్పుకుంటుంది అంతగా వప్పుకోకపోతే మేము చెప్పి యెల్లాగో ఓలాగ బలవంతముగా వప్పిస్తాము.

విస్స—సరే.

(అందఱు నిష్క్రమింతురు.)

రంగము 2.

(విస్సయ్యయు భార్యయగు పుల్లమ్మయు ప్రవేశించుచున్నారు.)

విస్స—రెండురోజులనుంచి అడగాలనుకుంటూన్నాను.

పుల్ల—అంతాలోచ నెందుకు. అడగదలచుకొన్న దేమిటో అడగరాదూ.

విస్స—ఎప్పటికప్పుడు పనితొందరలో మరచిపోవుచున్నాను. ప్రొద్దున్నే లేచి నా కాల్యకృత్యములు నేను తీర్చుకొని ఆయిల్లుకాస్తా అలికేసేశి, ముగ్గు వేసి చెంబులు తోముకొని పిటలుకడిగి నీకు కంచములో చలిదన్నము పెట్టి, అప్పుడు నిన్ను నిద్ర లేపి మొగము కడిగించి కంచముముందర కూర్చోపెట్టి, అప్పుడు చెరువుకెళ్ళి రెండు కావిళ్ళ నీళ్ళు యింట్లో పారవేసికొని ఆపయిన వంట చేసికొని నేను భోంచేసి విస్తళ్ళు అవ్వి తీసికొనేటప్పటికి మూడుజాములవుతూ వున్నది. ఉస్సూ అస్సూ మంటూ వంటింట్లోనుంచి చివతల కొచ్చేటప్పటికి కాళ్ళు చేతులు పీక్కుపోతాయి. అందుచేత యేనాపగుడ్డమీదో పడుకొని లేచేటప్పటికి దీపాలవేళవుతుంది. అనుట్టుకు దీపాలు వెలి

గించుకొని వంట చేసికొని నీకు పెట్టి నే తిని పనిపాటలు చేసికొనేట ప్పటికి కళ్ళమీదికి నిద్ర కూడుకొస్తుంది. ఈరోజున మనయిద్దఱముగూడ పెళ్ళివారింటికి భోజనము గనుక తీరుబడిగానున్నది. నీపనిమూలాన్ని నే చస్తూన్నాను.

పుల్ల—నాపనిమూలాన్ని మీరు చస్తూన్నారా? ఆమాటకి పట్టొస్తే నేను చేసినట్లు పనెవరూ చెయ్యడమే లేదు. నాకంచం నేను కడుక్కుంటాను. మీకు కూర తరిగిస్తాను, పోగుపులోకి జీలకఱ్ఱ మెంతులూ యిల్లాటి పందిస్తూంటాను. మీరు నాకేమి విసురుతున్నారా? కాళ్ళు పిసుకుతున్నారా? వెల్లేస్తున్నారా గోడలు మెత్తుతూన్నారా, అంట్లు తోముతూన్నారా? ఎల్లమ్మ మగడు, ఇంట్లో అన్నిపనులు వంటలు చేసికొనడం కాకుండా, వడ్లు దంపుతాడు అంట్లుతోముతాడు, గోడలు మెత్తి వెల్లేస్తాడు. ఎల్లవారి పెళ్ళాలులాగా నేను పని చెయ్యకుండావుంటే నన్ను మరీఆక్షేపించి చంపుదురు మీరు. ఇల్లా పనిచేస్తూంటేనే పారాగతిం లేకుండావుంది.

విస్స—ఈపనులకే తలెత్తుకోలేకుండా చస్తూన్నాను. ఇంకా అవిగూడా చెయ్యన్లమను.

పుల్ల—ఇప్పు డీమాటల కేమిగాని మీరేదో మాట చెపుతా నన్నారు. చెప్పండి

విస్స—అది చాలా ముఖ్యమైన మాటే. మనకి నాలుగువేల రూపాయలు కలిసివచ్చే వ్యవహార మొకటున్నది. నీవు వప్పుకుంటే అది కలిసివస్తుంది.

పుల్ల.—నాలుగువేలు కలిసివచ్చేటట్టయితే నేను వప్పుకోకపోవడం యేమిటి. నే నెందు కొప్పుకోకపోతాను.

విస్స—నన్ను యెగ్గెం చెయ్యమని మన మల్లయ్య గోవిందయ్య చాలా బలవంతము పెడుతూన్నారు. యగ్గెం నిమిత్తము యూ

చనకు వెళ్ళినామంటే నాలుగైదువేల రూపాయలు రొక్కం దొరుకు తుంది. పైగా బియ్యం పప్పు ఉప్పు మిరపకాయ చింతపండు కూరా గుటర్రి అప్పటి అన్నప్రదానానికి సరిపోగా మిగిలియుంటాయి. పైగా చీరలు జామారులు కావలసినన్ని.

పుల్ల—సరి. ఇగా చెప్పవచ్చినమాట. నాకు యెగ్గాలూవద్దు యాగాలూవద్దు. ఇలాగుండనియ్యండి. ఆనాలుగురోజులు అన్నంలేకుం డా యెవళ్ళుంటారు. పైగా చల్దికూడు తినగూడదు కాబోలు. ఆపయి న యిష్టి అని అగ్గోత్రం అని ఆచారమని కాల్చుకుతింటారు. అల వాటు లేని అపవాసనం చేస్తే మీసాలన్నీ తెగకాలాయట. మన కెందుకు.

విస్స—ఓసి భ్రిష్టాకారిముండా! నాలుగువేల రూపాయలు వస్తాయి, ఆపయిని చల్దికూడు మానక్కఱలేదు. ఇష్టీ చెయ్యను నష్టీ చెయ్యను. అగ్గోత్రాలు లేవు ఆచారాలు లేవు. ఇది రూపాయలుకోస ము కాని నిష్టకోసమా యేమిటి. దీనివల్ల రూపాయలే రావడంకాకుం డా మనకు గౌరవము యెక్కువుంచుంది. సోమిదేవమ్మగారు సోమి దేవమ్మగారంచూ ఆడవాళ్ళు మగవాళ్ళు కూడా యెంతో యిది చేసి నిన్ను నెత్తిమీద పెట్టుకుంచారు. ఎల్లాగోల్లాగ వప్పుగో. నాలు గు రోజులు కష్టపడితే నాలుగువేలు వచ్చి యింట్లో పడచాయి.

పుల్ల—మీరిన్నివిధాల చెపుతూన్నారు గనుక యేదోవిధంగా నాలుగురోజులు చల్దన్నం మానుకొని వప్పుకుంటాను. కాని నాముద్దు చెల్లించాలి. నాకొక్క కోరికుంది.

విస్స—యేమిటో ఆకోరిక పెందరాళే చెప్పు. నాచేతనైన దయితే నేను పెందరాళే తీరుస్తాను.

పుల్ల—కోరిక తీరుస్తానంటే చెప్ప కేమి. నాకు బంగారపుకంఠి

ఒకటి చేయిస్తిరా. యెగ్గెప్పాకలో కొచ్చి నేను మీాసరసని కూర్చుంటాను. ఎగ్గెం పూర్తి చేయిస్తాను.

విస్స—ఎగ్గెం అయినతరువాత చేయిస్తాను. కంఠికి ముందుగా డబ్బెక్కడ తేగలను.

ఫుల్ల—అప్పుచేసైనా సరే నాకు ముందుగా కంఠి చేయించాలి నేనుయెగ్గెంపాకలో అడుగుపెట్టాలి. అందు కొప్పుకోకపోతే మీారు నాతో మాటాడక్కఱలేదు.

విస్స—సిరిరా మోకాలొడ్డినట్లు శనైశ్వరపుముండవు. నాలుగు వేల రూపాయలు వస్తూంటే నష్టజాతకము గుణించి తగలపెడుతూన్నావు, అభము తెలియదు శుభము తెలియదు,

ఫుల్ల—అస్తమానం ముండా ముండా అనేనోటికి విధివిరామము లేదుగదా. అనడమేకాని యెన్నడు జరగడం లేదు. ఒక్కమాటు జరిగిపోతే యీకంఠిలు కాసులు అక్కఱలేదుకదా. ఆదేవుడు తిన్నగా చూడడం లేదు.

విస్స—అంతమాట పుడితే నాచాకిరీయైనా తప్పు నని నే నేడుస్తూన్నాను. నీబట్టలు తగలేక అన్నమువండిపెట్టలేక నేనుచస్తూన్నాను.

ఫుల్ల—నాకు మీారు చెయ్యవద్దు మీాకు నేను చెయ్యవద్దు లేచి పొండి. ఎగ్గానికి నే నెందుకు ఆరావువారి కొట్లలోనున్న ఆమంగిముండని తీసుకెళ్ళరాదూ!

విస్స—సరే నీకింత పొగరుగావుందికనుక ఆకంఠి ఏమోదానికే చేయించిపెడతాలే నీవు నంబి కృష్ణమాచార్లుతో చీట్లపేకాడుతూ కూర్చుందుగాని యిక్కడ.

పిల్ల—ఆట్టే పేలాపన పేలక యిక్కడినుంచి వెళ్ళండి. మీా మాటలు వెలపరం వస్తూన్నాయి.

విస్స—సరే లేచిపోతాను.

(అని యిద్దఱు నిష్క్రమింతురు).

రంగము 3

(విస్సయ్య మల్లయ్య గోవిందయ్య ప్రవేశించుచున్నారు.)

మల్ల—ఓరే విస్సిగా! మీపట్టపుదేవి యజ్ఞంమాట యేనుం దేమిటి

గోవిం—అది వీడికి ముగుడు కాని పెళ్ళాము కాదు. వీడు చెప్పి నట్లు వింటుందని తోచదు.

విస్స—మన గోవిందుగాడు చెప్పినట్లే అయిందిరా! ఆముండ ససేమిరా యంటుంది. దాని కెవరు దుర్బోధ చేసినారో కాని తనమె ళ్ళోకి కంటె చేయిస్తేనే కాని వప్పుకోదట.

మల్ల—అయితే నీవీవిషయములో నేమి నిశ్చయించినావు?

విస్స—పోనీ మానేదామా అని తోస్తూంది. ఈముండతో వేగలేను.

గోవిం—నీవు శుద్ధవెఱ్ఱిముండాకొడుకువన్నమాట. పనికిమాలి నఆడముండ చెప్పినట్లువినక తెగసాగుతూంటే చేతకాని వెధవలాగ యజ్ఞంమానేస్తానంటావేమిటి. తాటికమ్మ పుచ్చుకొని నారవచ్చేవరకు వెన్నుబద్దలగొడితే అది దానిని పుట్టించిన జేజెమ్మకూడా వింటాడు. పెళ్ళాముకు జడిసే వెధవవు నీవేమి కాపురము చేయగలవురా?

విస్స—అవిఆసపగుగ్గిళ్ళుకావు ఇనపగుగ్గిళ్ళు. అదినూరుమంది మగవాళ్ళను చంపి పుట్టింది. దాన్ని మంచిమాటలతోనే వశపరచుకో వాలి కాని పాకం ముదురుతే మనతిరముకాదు.

మల్ల—నిజమేరా బాబూ. దానిసంగతి మొదటినుండీ నాకు బాగా తెలుసును. దాని సాంప్రదాయమే యటువంటిది. దానితల్లి అ త్తగారిమీద కోపముచేత కొంపకు నిప్పెట్టి పుట్టింటికి లేచిపోయింది. దానితో ఎదురువాద మేస్తే కార్యము లేదు.

గోవిం—అందుకని దాని కాళ్ళకు దండము పెట్టి యజ్ఞముమా నుకొంటావూ.

మల్ల—మానుకోనక్కఅలేదయ్యా!

విస్స—మానుకోక నేమి చేయమంటావు?

మల్ల—నేను చెప్పినట్లు చేస్తే ఉభయతారకంగా నుంటుంది. ఆ చిన్నదాని కోరికా తీరుతుంది మన పనీ సాగుతుంది.

విస్స—ఏమి టాయుపాయము?

మల్ల—ఎక్కడైనా నాలుగువందల రూపాయలు నోటువ్రాసి బదులు తెచ్చి ముందుగా కంటిచేయించిపెట్టి దాని వప్పుదల పుచ్చుకొని ఆపయిన యజ్ఞంలో దిగితే బాగావుంటుంది.

విస్స—ముందుగా లోటురాసి బదులు తెమ్మంటావూ ఎగ్గానికల్లా మూలం ఎగ్గెం మండినట్టేవుంది.

మల్ల—ఓరీ వెఱ్ఱిముండాకొడకా బదులు తెస్తేనేమిరా? మూడోనాటికి సొసాయించి పారవేస్తాము కాదురా?

గోవిం—మూడు మాసములలోవుగా, అసలీపాయిదా లిచ్చివేస్తామురా.

విస్స—మనకు బదులిచ్చేవాడెవ డీవూళ్ళో?

మల్ల—నీకోపంవస్తే చెప్పలేను కాని చిలకలంపాటి మాన్యం తనఖాపెడితే యిస్తారు.

విస్స—పెద్దలు సంపాదించిన కొంద్ర. ఉన్నఆధారమే యిది నాకుఆకాస్తా యీమెగ్గెంతో ఊడ్చిపెట్టుకుపోయినా యిక కాళ్ళు పారజాపాలి.

మల్ల—అదిగో అదేమాటంటావు. మళ్ళీనిరెండు మూడు నెలలలో పారేస్తామురా? గోనిసంచెడురూపాయలొస్తాయని చెప్పుతూంటేనూ

గోవిం—వీడికి మనసు నిబ్బరము లేదురా, చల్చిత్తంముం డాకొడు.

విస్స—అప్పంటే భయము రా మరి. కాక పోయినా మనకు బదులిచ్చేవాడెవడు?

మల్ల—రామన్నపంతులుగా రిస్తారురా? ఆయనదగ్గఱ నేను కుదిర్చి పెడతాను.

విస్స—అమ్మబాబూ ఆయనదగ్గఱ తనఖా పెట్టానుంటే మన భూమి మనకు దక్కదు. మనమీాజన్మాకిని తేలము.

మల్ల—తేలడానికి తేలకపోవడానికి యెన్నళ్ళురా? యాగం ఆరంభించకముందే ఋణంతీరుస్తాయకాదూ. మనమ్ముగ్గురము బయలుచేరామంటే కుంచాలకొలది రూపాయలు తేమటా?

విస్స—అయితే రామన్నపంతులుగా రిస్తారూ.

మల్ల—ఇవ్వకేమి తనఖా వ్రాస్తూంటేనూ.

విస్స—వడ్డీ రూపాయన్నర గాబోలు.

మల్ల—తనఖామీా దంతకు తక్కువివ్వడు.

గోవిం—వడ్డీ యెంతరా నాలుగువందలు బదులుచ్చురుంటే నెలకారురూపాయలు. మూడు నెలలకు 18 రూపాయలు.

విస్స—సరే పదండి రామన్నపంతులుగారి దగ్గఱకు వెడదాము.

(అందఱు నిష్క్రమింతురు)

---

రంగము 4.

(అప్పుడు విస్సయ్య మల్లయ్య గోవిందయ్య ప్రవేశించుచున్నారు.)

మల్ల—నేచెప్పలేదట్రా. రామన్నపంతు లంతఃకరణ చాలా మంచిది.

గోవి—నిజమేరా, అడిగితే లేదనడు ముండావాడు.

విస్స—భూమితనఖా పెట్టుకొని బదులియ్యడంకూడా గొప్పేనా యేమిటి. సరే! సొమ్ము దొరికిందికదా. ఇక చెయ్యవలసిన పనేమిటి.

మల్ల—పనేముంది. నేను గోవిందయ్యా వెళ్ళి కొంతసొమ్ము నీ యజ్ఞంనిమిత్తం యాచనచేసి పట్టుకొని వస్తాము. మాకిద్దఱికీ బత్తికర్చు క్రింద చెరియొక పదిరూపాయలు ఇప్పించు. తరువాత బత్తికర్చులు దొరికిన సొమ్ములోనుంచి పెట్టుకుంటాము.

విస్స—మీరంటే నాకు నమ్మకమే? ఎలాగో ఒకలాగు కార్యము నెఱవేర్చండి. అయితే యేంపేరు పెట్టుకోను నేను.

మల్ల—విశ్వనాథశాస్త్రీ బాగావుంటుంది.

గోవిం—శాస్త్రీ బాగుండదురా. విస్సన్నవధానులే బాగావుంటుంది. అవధానులు సోమయాజులు కావడం బాగావుంటుంది.

మల్ల—అవునోరే నీవుచెప్పినదే బాగావుంది. అందుకుచేత విస్సన్నవధానులుగారే అందాము. పదిమాట్లు అనుకుందాముపట్టు. ఇదివరకు విస్సిగాడు విస్సన్నగాడు అని పిలవడం మనకలవాటు. ఆయలవాటుచొప్పున పెద్దమనుష్యులదగ్గఱకు వెళ్ళినప్పుడుకూడ ఆపేరే వస్తుందేమో. అందుకుచేత పదిమాట్లు వల్లించుకుందాము.

విస్స—రేపు నేనుయింటికివెళ్ళి కంఠిప్రయత్నము చేస్తాను.

(అని వెళ్ళును)

మల్ల—ఒరే గోవిందుడు. యజ్ఞం మూడునెలలుందిగదా. ఈ మూడునెలలలో మనము దేశాలవెంటదిరిగి సొమ్ము సంపాదించాలి. సంపాదించినదంతా వీడియదాన్నే పెడదామంటావా?

గోవిం—వాడికిచ్చేటట్టయితే మనము తిరగడమెందుకురా. రూపాయకర్ధలు వాడికిద్దాము.

మల్ల—ఒకే రూపాయకు పావలాలు వాడికిస్తే బాగావుంటుం దిరా. ఎందుకంటే రేపు యజ్ఞంలో కట్నాలు కానుకలు వచ్చును రాక పోవును. మనము ముందుగానే జాగ్రత్తపడాలి. ఇద్దఱము చెరియొక వెయ్యిరూపాయలు సంపాదించుకుంటేనేగాని కష్టము గిట్టదు.

గోవిం—నిజమే యీముండాకొడుకు మాన్యముకొంద్రడ అమ్ము కోవలసినదే. వీడికివచ్చేదేమిటి వీడియడం ప్రస్తుతం చెరియొక పది రూపాయ లిచ్చాడుగదా. కాని యివియింట్లోయిచ్చి పోదాముర ?

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 5. విస్సన్నయిల్లు.

(విస్సన్నయు భార్యయు ప్రవేశించుచున్నారు)

విస్స—ఒసే! ఎంజేస్తూన్నావు.

భార్య—(గుఱ్ఱుపట్టి నిద్రపోవుచున్నది)

విస్స—ఓసీ నిర్భాగ్యురాలా. లేవవే యెప్పుడూ నీకు నిద్ర యేను.

భార్య—అబ్బా దిక్కుమాలిన కర్మము. ఎవరువారు. చెన్న మల్లయ్యా!

విస్స—నీయమ్మకడుపు కాలా. జంగం చెన్నమల్లయ్య యెం దుకు జ్ఞాపకము వచ్చాడే యిప్పుడు.

భార్య—(మేలుకొని) సరి. మీరా? ఏదో నిద్రలో కలవచ్చి పలవరించాను. నిద్దగోతూన్న మనిషి నెందుకూ లేపడం. ఏమంతరాచ కార్యము పడిపోయిందని. మనిషికి కష్టము సుఖము తెలిసుండాలి. ఎప్పుడూ యిల్లాంటి [illegible] మాపుట్టిల్లు మరిపెట్టి యే

నాకు కాపరానికి వచ్చానోగాని యెన్నడైనా కంటికి నిద్ర లేదు కదా. మాయ లేపడం, పూరికే లేపడమే నిద్దరోతూంటేను.

విస్స—ఓసీ నీగుల్లు నల్లకాడుగాను. పనిపాట చెయ్యక వంటా పెట్టూ లేక యెపుమిదిజాములు మంచముమీదే పడుకొని నిద్రపోతూంటావు. నీకు నిద్ర లేకపోవడ మేమిటే. నీకు పగలు రాత్రియను భేదము లేదు. పావురపిల్లులు దెబ్బలాడినట్లు గుఱ్ఱు పడుతూంటావు.

భార్య—పట్టిపడకేగాని ఆద మరచి నిద్రపట్టదు. శ్లేష్మతత్వమగుటచేతను వాతకొడి మః పి. నగుటచేతను కన్ను మూసేటప్పటికి గొంతుకలో గురగురలాడుతుంది. అందుచేత అది నిద్దలా గనబడుతుంది. కాని యెప్పుడూ మెలకువే.

విస్స—ఎప్పుడూ మెలకువైతే యెన్నిపిలిచినా పలకవేమేమరి?

భార్య—ఎప్పుడూ పరధ్యానంగా వుంటాను, నిద్రపట్టినా కోడి కునుకు. చీమ చిటుక్కుమంటే మెలకువ వస్తుంది. దానిమాట కేమిగాని మీరిప్పు డింత తొందరగా లేపటము కారణమేమిటో చెప్పండి?

విస్స—రామన్న పంతులుగారిదగ్గఱ నాలుగువందలు బదులుచేసి పట్టుకువచ్చాను కంఠి చేయించడంకోసము. ఇది నీలాభముకోసమే కాని నాలాభముకోసము కాదు.

భార్య—ఇదా శుభవార్త నాదగ్గఱకెందుకు రూపాయలు? నెత్తి నేసి కొట్టుకుంటానా యేమిటి? కంసాలి నరసింహాన్ని పిలిచి కానులుకొని యియ్యండి. ఈభాగ్యానికా నిద్ర లేపడం?

విస్స.—నీమేలుకోసం చెప్పినా నామీదే కోపమా?

భార్య—నా యుపకారంకోసమా కంఠి చేయించడం? మీయజ్ఞంకోసము చేయిస్తూన్నారు!

విస్స—ఎందుకు చేయిస్తేనేమిగాని యీమాటు సోమిదేవమ్మవైపు పక్కని తెచ్చుకుంటానా?

భార్య—కూర్చో కేమి? నెత్తిమీద ఒకచిన్నానాగరికూడా చేయించండి. బోడితలతో కూర్చోలేను.

విస్స—నీయిల్లు బంగారంగాను. బోడితల అనకే నాకు వాగా యిత్యంగా వుంది.

భార్య — అంటేనే అవుతుందా యేమిటి! రెండూ చేయించండి.

విస్స— రెండూ చేయించుకు వస్తాను.

(అని బుద్దలు నిష్క్రమించుచున్నారు)

(అప్పుడు విస్సయ్యయు భార్యయు ప్రవేశించుచున్నారు)

విస్స—ఆమల్లయ్యగాడూ గోవిందయ్యగాడూ నాకొంప తీసినారు. యగ్గెనువద్దు మొఱ్ఱో అంటూంటే చెయ్యి చెయ్యి వేలకొలది రూపాయలు వస్తాయని ఆశపెట్టి నన్నుగంగలో దింపినారు.

భార్య—అలవాటులేని అవపోశనచేస్తె మీసాలన్నీ తెగకాలిపోయినా యన్నట్టుగా సీళ్ళకావిళ్ళు మిసపసున్నిసారెకావిళ్ళు మోసుకునేవాళ్ళు యగ్గాలుచేస్తే యిలాగేబెడిశికొట్టి సంసారాలు మాశిపోతాయి, యగ్గం చెయ్యడమంటే వంటచెయ్యడనూ, నీళ్ళు మొయ్యడమా, శోడశబ్రాహ్మణార్ధాలు చెయ్యడమనుకున్నారా?

విస్స—ఏదోబుద్ధిగడ్డితిని వెనుక మహేశ్వరచెయినులుగారు రామావధానులుగారు చేశినట్టే నేనుకూడా యగ్గంచేస్తే రూపాయలకు రూపాయలు వస్తాయి నేనుకూడా గొప్పవాడినవుతాననుకొని బాండలోపడ్డాను.

భార్య—భద్రియ్యపల్లకీ యెక్కితే సీతయ్యచెనపుగట్టైక్కాడన్నట్టుగా మహేశ్వరచెయినులుగారెగ్గంచేశారని భూమచేస్తే వస్తుందా?

విస్స—అయిందేమిటో అయింది. ఒక్క మాటచెప్తానువిను అప్పులవాళ్ళు మనభూమి అమ్మకుపోతారు. యజ్ఞేశ్వరుడు చేసిన సహాయము మనకింతే. నీకు మొన్న చేయించిపెట్టిన కంటె మళ్లీ యిచ్చావంటే అదియెల్లాగైనా అమ్మి—

భార్య—కంటెలేదు గింటీలేదు, నోరుమూసికొని అవతలకు నడవండి. నాప్రాణం పోయినా నేకంటి యివ్వను. నాగొంతుకపిసికి చంపి తరువాత పట్టుకొనివెళ్ళండి. మావాళ్ళు డబ్బు కాళీపడి దిక్కుమాలాళ్ళ మూడో యేట చేశారు యీవెధవపెళ్ళినాకు. నగానట్రాపెట్టించుకోలేదు. ఎన్నాళ్ళనుంచో అంటిపెట్టుకు తిరగాలని ముచ్చట నాకు. నేటికాలానికి యీబంగారపుపోచ కాస్తరాయించి మెళ్లో వేశారు. ఇచ్చిన మొన్నాడే తెమ్మంటూన్నారు.

విస్స—ఓసి వెఱ్ఱిపాడకట్టా! భూమమ్ముకుపోతారే.

భార్య—భూమిఅమ్ముకుపోతే నాకేమి యిల్లమ్ముకుపోతే నావేమి. మిమ్మలినమ్ముకుపోతేనాకేమి. ఈభూమివల్లవచ్చే డబ్బువల్ల నా పదిమంది బ్రతుకకపోతారాయేమిటి. అంతగా నామనువర్తికిలేకపోతే నాకంటిచాల్లే. కానాయనాంటె ఆయింతా మీప్రాణము గుటుక్కుమంటే నేను బ్రతుకలేకపోతానా యేమిటి? ఆభూమివల్లవచ్చేవి యిరవయిరూపాయల్లో రానుపోను నాలుగురూపాయలుపోతే తక్కినవి 16 రూపాయ లుంటాయి. అంతయోగంపడితే యీకంఠిఅమ్మి వడ్డీకి వేసుకుంటాను.

విస్స—ఓసి! నీబొడ్డుపాకా. మాటకల్లా నన్నుచావమంటావేమిటే.

భార్య—నేను చావమని తిట్టేనామిమ్మలిని. ఎప్పటికైనా అల్లాటచిక్కొస్తె యిలాచేస్తానని చెప్పేను. కాకపోతేమట్టుకు చావక యెల్లకాలము పుట్టకట్టుకు వూరేగుతారా యేమిటి?

విస్స—ఇంతకూ యేమన్నా సరేకాని ఆకంఠిమాత్రము నీవివ్వ కతప్పదు. ఒకనెల్లాళ్ళుముచ్చటగా పెట్టుకొన్నావుకదా. ఈపాటికి ముచ్చట తీరుతుంది. లేకపోతే పదిమంది గయ్యాళిముం డంటారు.

భార్య—ఎవర్తాగయ్యాళిముండ నేది. మొగంమీద పేడనీళ్ళు కొడతాను వెధవముగ్గము యల్లాఅవుతేంచేశానని మీదమీదకొచ్చి తిడుతూన్నారు. శుక్రవారముపూటా యీకంఠియిమ్మన్నారని నాకెంతో వాగా యిత్యంగావుంది నిన్న యీకంఠి మెళ్లోపెట్టుకుని నాగరి నెత్తిమీదేసుకుని మనవాళ్ళింటికి పేరంటానికెడితే నలుగురుముత్తయిదులు నన్నుచూచి పార్వతీదేవిలాగున్నావే అమ్మాయని యెంతో ముచ్చటపడి యిచ్చేశారు అందుచేత నేనివ్వను. నన్నల్లరిపెట్టి యీరల్లరిపడకండి.

విస్స—(నెత్తి మొత్తుకుని) నీయమ్మకడుపుమాడా నీమూలాన్ని ఆమల్లిగాడు గోవిందుగాడిమూలాన్ని పితురార్జితం పదిపన్నెండుతరాలనుంచి వచ్చేభూమిని నిష్కారణంగా హారునయేడుస్తూ అమ్ముకుంటూన్నాను. ఏభ్రాశిముండా నావుసురుకొట్టి పోతావు.

(అనియేడ్చుచున్నాడు.)

భార్య—మీవుసురుకొట్టి నేపోవడమేమి. మీకున్నవాళ్ళంతా పోతారు మీఅప్పలు మీచెల్లెళ్ళు మీఅన్నదమ్ములు మీవాళ్ళంతా పోతారు.

విస్స—నావాళ్ళు పోవడమేమి. నీవాళ్ళునీవు దుంపతెగిపోతారు నిర్భాగ్యంముండా.

భార్య—నావల్లలోపముంటే నాపసుపుకుంకమే పోతుంది. మీవల్లలోపముంటే మీరేపోతారు అమగోమల్లయ్య అల్లావెడుతూన్నాడు. వాడినిపిలిచి ఆలోచనడగిండి మొదట ముగ్గెం చెయ్యమన్నవాడు నాడేకాదుమరి. ఇప్పుడేమిచెపుతాడో పిలవండి.

విస్స—ఒరే ఓరీమల్లయ్యా (అని పిలుచుచున్నాడు.)

భార్య—అతను పలకడమే లేదు. తలవంచుకొని వెళ్లిపోతూన్నాడు.

విస్స—దొంగముండాకొడుకు పారిపోతూన్నాడు. అయినకాడికి దొరికింది వాడు చేతిలో వేసికొన్నాడు. నన్ను పశువును చేసి యగ్గం చేశారు వీళ్ళు

భార్య—రేపు యిష్టికాబోలు దాని ప్రయత్నం చేసికోండి.

విస్స—ఇష్టీ లేదు సీశార్థం లేదు నోరుమూసికొని యూరుకో. ఇంకా యిష్టేమిటి. రేపుభూమిఅమ్మేసి రామన్న పంతులుగారికిచ్చి సోమయాజులుగారు మళ్ళీ కావిడిబద్ద యెత్తుతారు.

భార్య—సోమిదేవమ్మగా రెప్పటిలాగే పెళ్లిముత్తయిదు కెడతారు.

విస్స—ఎప్పుడు యిల్లాంటి తలమారిన పనులకెళ్ళకుండా బుద్ధొచ్చింది. ఈజన్మానికి దీనితో చాలు.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

---

# చాకలి పురాణం

నైమిశారణ్యమునందు శౌనకాదిమహామునులు పండ్రెండు సంవత్సరములు సత్రయాగము జేయుచుండగా నచ్చోటికి సకలపురాణములు సకలేతిహాసములు సకలధర్మములు సకలశాస్త్రములు సకల విద్యలు నేర్చిన సూతుడు వచ్చెను. మహామునులాతని మిక్కిలి గౌరవించి మంచి పీఠము మీద కూర్చుండబెట్టి "మహానుభావా! ఇదివరకు లోకములో నెన్నడు నెవ్వరు విననిది కననిది క్రొత్తది చెవుల

కింపయినది యుగు నొక్క యితిహాసము చెప్పి మమ్మందరను ధన్యులను జేయవలసినదని వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాము" అని ప్రార్థింపగా సూతుడు వారియందు దయగలవాడై చాకలి యా దరముతో నిట్లనియె: "మహానుభావులారా! ఇటువంటి ప్రశ్నమునే పూర్వము శనైశ్చరుడు (శనిగాడు) విఘ్నేశ్వరు నడిగెను. ఆ విఘ్నేశ్వరుడు పొట్టసవరించుకొనుచు శనైశ్చరునితో నొక చిత్రకథ చెప్పెను. ఆకథయే నేను మీ కిప్పుడు చెప్పుచున్నాను. శనైశ్చరుడు విఘ్నేశ్వరు నిట్లడిగెను. "అయ్యా! విష్ణుమూర్తి పాముమీద పండుకొనుటకు గారణమేమి? నూలుబట్టలు గట్టక ఆయన బంగారుబట్టలు కట్టుటకు గారణమేమి? సాంబమూర్తి దిగంబరుడగుటకు గారణమేమి? ఏనుగు తోలు పులితోలు కప్పుకొనుటకు గారణమేమి?" అనగా విఘ్నేశ్వరు డిట్లు ప్రత్యుత్తరము జెప్పెను. "ఓయీ శనైశ్చరుడా! నీవడిగిన ప్రశ్నము చాల ప్రశస్తమయినది. ఇప్పటికాలములో నడుగవలసిన ప్రశ్నయే యిది. విష్ణుమూర్తి లోకులందఱు పండుకొన్నట్లు దూది పాన్పుమీద పండుకొనక పామమీదపండుకొనుటకు గొప్పకారణము కలదు. అదియేమనగా చాకలివాళ్ళ బాధ పడలేకను పరుపున్న పక్షమున దుప్పట్లుండవలెను. దుప్పట్లు చమటపట్టి మాసిపోవును. మాసినప్పుడు వాని నుదికించుకొనవలెను. ఉదుకుటకు చాకలివాళ్ళకు వేసిన పక్షమున వాళ్ళు వేళకు తీసికొనిరారు. తెచ్చినపక్షమున చింపి ముక్కలుచేసి తీసికొనివత్తురు ఈచాకలివాళ్ళతో వేగలేక విష్ణుమూర్తి దుప్పట్లక్కఱ లేకుండా, ఉతకనక్కఱ లేకుండా ఉండునట్టి పాము మీద పండుకొనుచున్నాడు. నూలుబట్టలు కట్టుకొన్నపక్షమున నిట్టి బాధలే పడవలసివచ్చునని విష్ణుమూర్తి బంగారుపుబట్టలు కట్టుకొనుచున్నాడు ఆయనకు కాంచనచేలుడను పేరిందువలననే గలిగినది. తరువాత మా తండ్రిగారైన సాంబమూర్తిగారిసంగతి చెప్పు

చున్నాను వినుము. బట్టలుదికించుకొనుటకు విష్ణుమూర్తిగారివద్ద డబ్బున్నది. ఎందుచేతననగా ఆయనవద్ద లక్ష్మియున్నది గనుక. సాంబమూర్తిగారికో చిల్లిగవ్వలేదు. ఇల్లు వల్లకాడుగదా. పుఱ్ఱెలో భోజనముగదా. ఈమన బట్టలుదికించుకొనుటకు నెబ్బెక్కడనుండి వచ్చును? ఏవో రెండుగుడ్డలతో కాలక్షేపము చేయవలయునన్న పక్షమున చాకలివాళ్ళు త్వరగా నుదకరు. అందుకుచేత సాంబమూర్తిగారు దిగంబరుడై యున్నాడు. ఎవరైనా తమవంటిపెద్ద లాయనదర్శనమునకు వచ్చినప్పుడు సిగ్గుచేతనో బొత్తిగా బాగుండదను శంకచేతనో పులితోలుతోనో యేనుగుతోలుతోనో శరీరము కప్పుకొనుచుండును. ఈచాకలివాళ్ళమీందగల కోపముచేతనే ఆయన నూలుబట్టవేసికొనననని శపథము చేసినారు. ఆయనమీందనుండు యుత్తరీయము పాము యుత్తరీయమే. యజ్ఞోపవీతము పాముల యజ్ఞోపవీతమే. తలపాగ పాముల తలపాగ. ఈతలపాగలలో నాయన వన్నెవన్నె పాగలు ధరించును. నల్లదిదాల్పవలెనన్న నల్లత్రాచును, తెల్లదిదాల్పవలెననితోచినప్పుడు తెల్లత్రాచును, గోధుమవన్నెది తాల్పవలెననితోచినప్పుడు గోధుమత్రాచును ధరించుచుండును. ఈవిధముగ ముద్దినుసుత్రాచులు నాయన యుపయోగించుచుండును. వారిమాట యటుండగా ప్రాచీనమహామునులందఱు వస్త్రములదాల్పక నారచీరలు చెట్లబెరడులు అఱటిదొప్పలు మొదలగునవి ధరించుటకుగూడ కారణ మీచాకలివాళ్ళతో బాధపడలేకనే. ఆప్రాచీనుల సాంప్రదాయము ననుసరించియే యీనాటి మునులుగూడ నట్లుచేయుచున్నారు. ఈ యితిహాసము మిక్కిలి క్రొత్తది. ఇదివఱకెవరును విననిది కననిది. ఇది నాస్తికునకు పాషండునకు వేదబాహ్యులకు జెప్పవద్దు. ఇది పరమగోప్యముగా నుంచవలసినది. దేవేంద్రాదు లీపురాణమునువిని మిక్కిలి ధన్యులైరి."

ఇట్లు విఘ్నేశ్వరుడు శనైశ్చరునకు జెప్పిన యీచాకలిపురాణమును సూతుడు శౌనకాది మహామునులకుజెప్పి వారిని సంతుష్టాంతరంగులం జేసెను.

# మారీచస్మృతి.



అనేక పురాతన గ్రంథములు దొరకుచున్న యీకాలములో నిటువంటి ప్రాచీనగ్రంథము దొరకుట యాశ్చర్యముకాదు. ఇది రావణాసురుని మిత్రుడు, సేవకుడు, వాని యాస్థాన పండితుడునగు మారీచు డను రాక్షసుడు రచించిన గొప్పస్మృతి. ఇదివరకు లోకులు వ్యాస, వశిష్ట, గౌతమ, నారద, పరాశర, యాజ్ఞవల్క్య ప్రముఖులగు మహామునులు రచియించిన స్మృతులే యెరుగుదురుగాని, మహానుభావుడైన మారీచుడు చేసిన యీధర్మశాస్త్రము నెరుగరు. మారీచుడనగా గొప్పప్రజ్ఞావంతుడు; కామరూపి, అనగా యేరూపము ధరింపవలెనన్న ఆరూపమును క్షణములో ధరింపగల శక్తిగలవాడు. కుక్కగావలెనన్న కుక్క, నక్కగావలెనన్న నక్క, పందిగావలెనన్న పంది, చీడపేనుగావలెనన్న చీడపేను కాగలసామర్థ్య మతనివద్ద నున్నది. ఈశక్తియుండుటచేతనే యీమహానుభావుడు పూర్వము లేడిరూపము దాల్చి శ్రీరామచంద్రుని చాలదూరము లాగికొనిపోయెను. 'పరోపకారార్థ మిదంశరీరం' మనుమాట యీమారీచునియందె సార్థకమైనది. ఎందుచేతననగా రావణాసురుడు సీతాదేవి నపహరింపవలెనని శ్రీరాముని మోసపుచ్చవలెనని సంకల్పించుకొని లేడిరూప మెత్తవలసినదని మారీచుని ప్రార్థింపగా నతడు తనప్రాణముకు భంగము కలుగునని భయముపడక, శంకింపక, ఆలస్యముచేయక, అనుమానించక వెంటనే లేడిరూపము ధరించి స్నేహితుని నిమిత్తము తన యర్థముచు ప్రాణమును ధారపోసి స్వార్థత్యాగముచేసి కీర్తిశేషుడై సకలరాక్షస ప్రపంచముయొక్క కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. ఆయుపకార మటుండగా మారీచస్మృతియను మహాధర్మశాస్త్రము [illegible] లోకమున

కీయనచేసిన యుపకార మింతింతయని వర్ణింపరాదు. ఈస్మృతికి అనేక వ్యాఖ్యానములు గలవు. అందులో ముఖ్యమైనవి రెండు. మొదటిది కాలనేమి వ్యాఖ్యానము. కాలనేమి యనగా నెవ్వరో కొందరెరుగరు. కొందరు మరచిపోయి యుందురు. రామరావణ యుద్ధములో లక్ష్మణస్వామి మూర్ఛపోయినపుడు హనుమంతుడు సంజీవిపర్వతము తీసికొనివచ్చుటకు వెళ్ళుచుండగా రావణాసురుడు వాని ప్రియత్నమునకు విఘ్నము చేయదలంచి కాలనేమిని బిలిచి హనుమంతుని ప్రియత్నమునకు విఘ్నము కలిగింపుమని యాజ్ఞాపించెను. అప్పుడు కాలనేమియు తన ప్రిభువునాజ్ఞ శిరసావహించి హనుమంతునికి గొన్ని యపకారములుచేసి చివర కన్యాయముగా నతనిచేత చంపబడెను. ఈతడు చావకముందె యీవ్యాఖ్యానమును చేసియుంచెను. రెండవవ్యాఖ్యానము మాల్యవంతుని వ్యాఖ్యానము మాల్యవంతు డెవరందురేమొ ఈయన రావణాసురునకు పినతాత అనగా తల్లికి పినతండ్రి. ఈనుహానుభావుడు రాక్షసకులమంతయు నాశనమైనతరు వాత-లంకాపట్టణమంతయు పాడైనతరువాత ఈగ్రంథమునకు మాత్రము వ్యాఖ్యానము చేసి తనజన్మను సార్థకముచేసికొని కొంతకాలములో మృతినొందెను. మారీచుడు, కాలనేమి, మాల్యవంతుడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులవలె త్రిమూర్తులై ఈస్మృతి రచియించుటచేత చచ్చిపోయినను బ్రతికియున్నవారితో సమానముగ నున్నారు. మారీచునియొక్క జీవచరిత్రము వ్రాయుటకు దగిన యాధారము లేవియు దొరికినవికావు. వాల్మీకిమహాముని రామాయణములో వ్రాసిన తప్పవ్రాతలు తప్ప యితరవిషయము లేమియు తెలియుటలేదు. ఈయనవిషయమై తామ్రిశిలాశాసనము లిప్పటివరకేమియు నింకను దొరకలేదు. సింహళద్వీపవాసులకు గాని మరియెవ్వరికి గాని అట్టిశాసనము లేవైనదొరికినపక్షమున వానిని మేము ప్రకటింప నిశ్చయించుకొన్నారము గాన తప్పక

పంపకోరుచున్నాము. ఈమారీచస్మృతి మిక్కిలి ప్రశస్తముగ నుండుట చేత దేవతలు దీని నపహరింపవలెనని యాలోచించుకొని కుబేరసేవకు డైన పుష్పదంతుని వానిం దెమ్మనుబంపిరి. అతడు పందికొక్కురూపము ధరించి గోడత్రవ్వి గదిలో ప్రవేశించి ఈపుస్తక మెత్తుకొనిపోవుచుం డగా ఆగదిలోనే పండుకొన్న మాల్యవంతుడు వెంటనే మేల్కొని పెద్దవాడగుటచేత ఓపికలేకపోయినను లేనియోపిక దెచ్చుకొని వెంటనే శునకావతారమెత్తి యామాయపందికొక్కుతో దంతాదంతీ, నఖానఖీ బాహాబాహీ ఘోరయుద్ధముచేసి నెత్తురు వరదలు ప్రవహించునట్లు వానిని సంహరించి పూర్వము విష్ణుమూర్తి సోమకాసురునిజంపి వేద ములుతెచ్చి బ్రహ్మకిచ్చినట్లు మరల నీగ్రంథముచు మారీచున కిచ్చెను. తరువాత నీగ్రంథము రావణాసుర గ్రంథభాండాగారములో నుండుచు వచ్చినది. ఆంజనేయులు లంకాదహనము చేయునపుడు కాలనేమి, మాల్యవంతుడు ఈగ్రంథము కాలిపోవునేమోయను భయముచేత అతికాయుని, మహాకాయుని, సర్పరోముని, వృశ్చికరోముని, ఖడ్గరోముని వెంటనే గ్రంథభాండారమునకు పంపి కోటలు, పేటలు, మేడలు, గోడలు కాలిపోయినను, దీనిని మాత్రము దెప్పించి పదిలపరచిరి. ఈమహాగ్రంథము యెక్కడ దొరికినదో చెప్పెదను వినుండు. లంకా ద్వీపములో నొకచాకలివాడు పుల్లిపాయలు పాతుకొనుటకు నేల త్రవ్వు చుండగా రెండు కుండపెంకులమధ్య నిది దొరికినది. ఈపుస్తకము ఈతాకులమీద వ్రాయబడినది. వ్రాసినపుడు దీనిమీద తాటికా యంత యక్షరములుండి యుండవచ్చును. ఆ యీతాకులన్నియు చెద పురుగులు తినివేసినవి. కాని యక్షరములు మాత్రము స్పష్టముగ కనిపించుచున్నవి. ఇవి గునపముతో వ్రాసిన యక్షరములుకాని గం టముతో వ్రాసిన యక్షరములుకావు. ఈతాకులమీద తాటికాయంత యక్షరము లెట్లుండునని మీరు సందేహింతురేమో? అట్లు సందేహింప

వలసిన పనిలేదు. లంకలోని యీతాకులనగా మన పెద్దటాకులంత యుండును. ఈపుస్తకము మిక్కిలి బరువుగా నున్నది. రెండు గాడిదలమీద వేసి మోయించినను అవి మోయలేక టకటకలాడిపోయినవి. ఇది మూడుకాండలు కలది. అవి యేవనగా (1) ఆచారకాండ (2) ప్రాయశ్చిత్తకాండ (3) వ్యవహారకాండ. ఈస్మృతియొక్క యవతారికలో నిట్లున్నది. రావణుడు మొదలగు రాక్షసులందరు మహానుభావుడైన మారీచునియొద్దకు వెళ్ళి "ఓస్వామీ! నీవు సకలధర్మములు నెరిగినవాడవు. అన్నియుగములకు పనికివచ్చునట్టి స్మృతి నొకటిచేసి దేవ రాక్షస మనుష్యలోకముల ననుగ్రహింపవలసినది. బృహస్పతి స్మృతి, శుక్రస్మృతి సరిగాలేవు. తక్కిన మునుల స్మృతులు బొత్తిగా బాగులేవు. నీవు చేసినపక్షమున నది తక్కిన స్మృతులను చెంపకాయగొట్టినట్లుండును. గౌతమాదులైన మహామునులు నీచెప్పులు మోయుటకైన తగరు. వారికి రావలసినయట్టికీర్తి వచ్చినదిగాని వారు నిజముగా నీకాలిగోరికైన బోలరు" అని ప్రార్థింపగా మారీచుడు సమస్తలోకముల ననుగ్రహించుటకై యీస్మృతి రచియించెను. ఇకముందుముందు యీస్మృతియందలి కాండత్రయమును వరుసగ ప్రకటింతుము.

## ఆచారకాండ.

1. సూత్రము —

స్నానము ప్రాణాపాయము.

కాలనేమి వ్యాఖ్యానము—ఉదయమున లేచి స్నానము చేయవలసినదని మూర్ఖులైన వ్యాస నారదాది ప్రాచీనులు తమ స్మృతుల వ్రాసిరి. అది జగత్తును మోసపుచ్చుటకై వ్రాసినదికాని మంచి యుద్దేశముతో వ్రాసినది కాదు. స్నానమువలన ననేక నష్టములు కలవు. ప్రతిదినము శరీరము శోషముగాని స్నానము చేయుటవలన

రోమకూపములు వదులయి శరీరము కృశించి త్వరగా నశించును. నదులలో స్నానము చేసిన పక్షమున నొకప్పుడు కొట్టుకొనిపోయి చనిపోవచ్చును నూతులవద్ద స్నానము చేసినపక్షమున నీళ్లు తోడుకొన లేక జబ్బులు నొప్పిపట్టును. ఒకప్పుడు నూతులలోపడి చచ్చిపో వచ్చును. కొన్ని గ్రామములలో చెఱువులు లేకపోవచ్చును. నూతు లలో నీళ్ళు త్రాగుటకే చాలక పోవచ్చును. స్నానముకూడ చేసిన పక్షమున త్రాగుటకు లేక మనుష్యులు పశువులు చచ్చిపోవుట తటస్థిం చును. అందుచేత సర్వవిధములచేత మనుష్యుడు స్నానము పరిత్య జింపవలెను.

మాల్యవంత వ్యాఖ్యానము—తల్లిదండ్రులు చనిపోయినప్పుడు తప్ప యితరసమయములయందు స్నానము చేయకూడదు,

2. సూత్రము —ఆలస్యముగా రాత్రి నిద్రింపవలెను. పొద్దెక్కి లేవవలెను.

కా—వ్యా—పెందలకడ నిద్రపోవుట సర్వ విధముల చేత నష్ట ప్రదము. అట్టిదురభ్యాసములవారైన పక్షమున జూదమాడుకొనువారికి దొంగతనములు చేయువారికి సరసులకు వినోదముగా కాలము పుచ్చు టకు వీలుండదు. పెద్దవాళ్ళు ఈ యలవాటువలన చెడిపోయినను పిల్లలు మాత్రము పెందలకడ నిద్రపోవుట కలవాటు పడకుండ జాగ్ర త్తపెట్టవలెను ఉదయమున జాముప్రొద్దులోపుగ నెప్పుడు లేవకూడదు

మాల్యవంతుడు పై విధగానె వ్యాఖ్యానము చెప్పెను.

3. సూత్రము—దంతధావనము చేయనక్కఱలేదు.

కా—వ్యా—ప్రతిదినము దంత ధావనము చేసినపక్షమున పండ్లరిగిపోయి విరిగిపోయి యూడిపోవును. పుప్పిపండ్ల రోగము ప్రపంచములో బయలుదేఱుటకు ముఖ్యకారణము దంతధావనమే. దీనిక్రింద వినియోగించునట్టి కాలము గూడ వ్యర్థము. పుప్పిపండ్లు

బయలు దేరినయెడ జంతువులను పీక్కుతినుటకు మాంస భక్షణము జేయుటకు వీలుండదు. నిద్రమంచమునుండి లేవగానె తరవాణియో, కాఫీనీళ్ళో, టీనీళ్ళో ముందు రెండు గ్రుక్కలు నోటిలో పోసికొని తరువాత గండూషణము చేసికొనవలెను. గండూషణ మనగా పుక్కిలించి యుమ్మివేయుట. ఇది చేసిన పక్షమున దంతధావనము చేసినంత ఫలము.

మాల్యవంత వ్యాఖ్యానము—పర్వ దినములయందును పితృకార్యదినములయందును బొత్తిగా గండూషణముగూడ జేయగూడదు ఆ దినములయం దట్లు చేసినపక్షమున నిటు పదితరములవరకు నటు పదితరములవరకు నరకకూపమున పడిపోవుదురు.

4 సూత్రం—పగటినిద్రప్రశస్తము.

కా-వ్యా-ప్రాచీనులైన రాక్షసమహానుభావు లందఱుగూడ ఈ సూత్రమునే యవలంబించిరి. దీనివలన ననేక ప్రయోజనములు కలవు. పగలు నిద్రపోయినపక్షమున శ్రమపడి మేనువంచి పనిపాటలు చేయనక్కఱలేదు. రాత్రులు స్వేచ్ఛగా విహారములుచేసి యనుభవించవలసిన సకలసౌఖ్యములు ననుభవించవచ్చును. రాత్రులు చేయు సంచారములలో నిద్రయు కునికిపాట్లు వచ్చిన పక్షమున కార్యములు చెడిపోవచ్చును. పగలునిద్రించినపక్షమున నట్టి కునికిపాట్లు మొదలయినవి రావు గావున కార్యములు నిర్విఘ్నములుగా కొనసాగవచ్చును.

మాల్యవంతుడగూడ పై విధముగ వ్రాసెను. కావున నతని వ్యాఖ్యానము వ్రాయనక్కఱలేదు.

5 సూత్రం—కల్లుసారాలు త్రాగవలసినది.

కా-వ్యా-దేవతలు త్రాగిరి. మహర్షులు త్రాగిరి. మనుష్యులు త్రాగిరి. త్రాగనివారు లేరు. త్రాగని జంతువులులేవు. ఏదోయొకటి త్రాగకుండ నెవ్వడు నుండలేదు. మంచినీళ్లు త్రాగుచున్నారా లేదా?

ఆ విధముగానె కల్లుత్రాగవచ్చును. సారా త్రాగవచ్చును. ఇది చెట్టు లోనుండి వచ్చినదికాని వేరొకచోటనుండి వచ్చినదికాదు. తాటిచెట్టు యీతచెట్టు యిప్పచెట్టు భూలోక కల్పవృక్షములు. వాటిని మనుష్యులుపూజింపవలయును. కల్లుత్రాగుటకు ధనములేనివాడు, ఆ కుండనైన వాసనజూడవలెను. అదియు లభింపనప్పుడు తాటిచెట్టుక్రింద నొకజాము కూర్చుండి వెళ్ళి పోవలెను. మద్యపానము జేయనివాడు మనుష్యుడుగాడు. కల్లు తాగనివాడు గాడిదెకన్న నధముడు మన దేశపు కల్లుసారాలకంటె విదేశమునుండివచ్చిన బ్రాంది మొదలయినవి ప్రశస్తములు. కల్లు నిందించినవారు మహాపాతకులై నరకమునకు పోవుదురు.

మా-వ్యా—చిన్నబిడ్డల కేవగింపు లేకుండ నుగ్గుతోపాటు అలవాటుచేయవలెను. అవి దొరకనప్పుడు నల్లమందు గంజాయి మాజుము మొదలయిన పదార్థములు భక్షింపవచ్చును. ఇవి అభావమందు విధించుచున్నాముకాని నిత్యకృత్యమున సారాయమునే త్రాగవలెను. ఈ దుకాణములు వీధి వీధికి సరిపడినన్ని యుండునట్లు రాజు లేర్పాటు చేయవలెను. ప్రతిమనుష్యుడు తనదొడ్డిలో నాలుగు త్రాటిచెట్లు నాలు గీతచెట్లు వేసికొనవలెను,

6 సూత్రం—ఆడపిల్లల నమ్ముకొనుట శ్రేయస్కరము.

కా-వ్యా— దీనివలన పేదవాడు ధనవంతుడగును. ధనవంతుడు మరింత ధనవంతుడగును. మనయింటిలో పుట్టిన ఆవుదూడలను గేదె దూడలను కుక్కపిల్లలను పెంచి పెద్దవాటినిజేసి తగిన బేరము వచ్చినపుడే ప్రకారముగా నమ్ముకొందుమో అట్లే మనకడుపున పుట్టిన ఆడుపిల్లలనుకూడ అమ్ముకొనుటవలన దోషములేదు. ధాన్యాదులమ్ముకొనుట యెట్లు తప్పుకాదో ఇదియునట్లుతప్పుగాదు.

మా-వ్యా—కుంటివారికి గ్రుడ్డివారికి కుష్టువారికి అమ్మినను దోషము లేదు.

7 సత్య మవాచ్యం

కాలనేమివ్యాఖ్యానము — సత్యమెప్పుడు పలకకూడదు. సత్యమువలననే కొంపలు మునిగిపోవుచున్నవి. సత్యమువలననే లోకమునకు హానిజరుగుచున్నది. కొందరుమూర్ఖులు సత్యమే పలుకవలసినది, సత్యమే పలుకవలసినదని బోధించి జనులను గంగలో దింపుచున్నారు. సత్యము బలికి హరిశ్చంద్రుడు రాజ్యముకోలుపోయి పెండ్లాము నమ్ముకొని మాలవానిని గొలిచినాడు. సత్యముపలికి బలిచక్రవర్తి సమస్తరాజ్యము గోలుపోయి చివరకు వామనమూర్తిచేత అడుగంట ద్రొక్కబడినాడు. అసత్యముపలికి ధర్మరాజు బాగుపడినాడు, అసత్యముపలికి శ్రీకృష్ణుడు శత్రువులను గెలిచినాడు. భగవంతుడైన శ్రీకృష్ణుడే యబద్ధములాడి లాభములు పొందునప్పుడు మనమేల పొందగూడదు ? మహానుభావుడైన శుక్రాచార్యుడు తన నీతిశాస్త్రమునందు ప్రాణహాని వచ్చునప్పుడు మానహానివచ్చునప్పుడు ధనముపోవునపుడు గోబ్రాహ్మణులకు విపత్తువచ్చునప్పుడు, అబద్ధము లాడవచ్చునని చెప్పినాడు. 'సత్యమేవజయతే' అనునట్టి వేదవాక్యము కేవల మర్థవాదము. అర్థవాదమనగ నమ్మగూడనిదియని భావము.

మాల్యవంతవ్యాఖ్యానము—సత్యమెల్ల కాలము బలుకుట యసాధ్యము. ఒకడు జబ్బుగానుండి వైద్యునిగాని బంధువునిగాని పిలిచి నేను బ్రతుకుదునాయనియడుగును. అతడు బ్రతకడని వారికి తెలుసును తెలిసినను బ్రతుకడని చెప్పినపక్షమున నతడు బెంగగొని చచ్చిపోవునని నీవుబ్రతకవని యెవ్వరుజెప్పరు. నీకుకుదురుతుంది భయములేదని చెప్పుదురు. దీనింబట్టి యసత్యమే యెక్కువయుపయోగమని తెలిసికొనవలెను. సత్యము మేడిపండు. అసత్య మంటుమామిడిపండు. సత్య

ము గంజినీళ్ళు అసత్య మా ఘృపాలు. సత్యము గుల్లముత్యము అసత్యము మాణిక్యము. సత్యము తాఁటియాకుదడి. అసత్యము రాతికోట. సత్యము నూలుగుడ్డచొక్కా. అసత్యము వజ్రకవచము. అసత్యము వర్తకమునకుగావలెను. న్యాయవాదులకు కావలెను. వేశ్యలకుకావలెను. జారులకు కావలెను. చోరులకు గావలెను. సంసారులకు గావలెను. సన్యాసులకు గావలెను. సత్యము ప్రియము. అసత్యము చవుక చవుక వస్తువు వదిలిపెట్టి ప్రియము వస్తువు నెవఁడు కోరును? అసత్యము పెరటిలో కల్పవృక్షము. కొంగు బంగారము. పెట్టిలో నిధి. సత్యము గ్రుడ్డిగవ్వ. అసత్యము మొహరి. సత్యము సవతితల్లి అసత్యము కన్నతల్లి. అసత్యము సొమ్మిచ్చును. సుఖమిచ్చును. కాబట్టి అసత్యమందరికు సేవ్యము. వేందాతశాస్త్రరీత్యా చూచినప్పటికి జగత్తంతా అసత్యమే అంతామాయయే. కాబట్టి మాయ, అసత్యము, సేవింపదగినవి.

8 పాపాత్ముల పంక్తిని భోజనము చేయగూడదు.

కా—వ్యా—పాపాత్ములెవ్వరనగా ఎల్లప్పుడు సత్యము బలుకువారు. పరకాంతల తల్లులని భావించువారు. దొంగతనముచేయనివారు చేయగూడదనువారు. ఉదయమున లేచి స్నానముచేయువారు. సత్రములు వేయించువారు నూతులు త్రవ్వించువారు దానములుచేయువారు స్వార్థత్యాగము చేయువారు. తాగనివారు, దానిని నిషేధించువారు. జూదమాడనివారు ఈపండ్రెండు గురు పంక్తిబాహ్యులు వీరిపంక్తిని భోజనముచేసినవారిని కులమువారు తప్పక వెలివేయవలెను. అంతతో బోక నదియొడ్డుననో చెరువుగట్టుననో కూర్చుండబెట్టి తాటికాయంత గోమయము తినిపించి కుంచెడు గోమూత్రం తాగించి బ్రాహ్మణులకు సువర్ణదానము చేయించి ప్రాయశ్చిత్తము చేయించవలెను.

మా వ్యా —ఆదేశములో స్వాములవారున్యపక్షమున ఆయనకు పాదపూజగా నూరురూపాయలిచ్చి ఆయనపాదతీర్థము పూటకు శేరు చొప్పున పుచ్చుకొనవలెను.

9. అవాచ్యములు పలుకకూడదు.

కా-వ్యా—అవాచములనగా నేవి ? దొంగవానిని దొంగవాడనుట. వ్యభిచారముచేసినవానిని వ్యభిచారియనుట. అబద్ధములాడువానిని అబద్ధీకుడనుట. వెయేల. ఉన్నది యున్నట్లనుట. అట్లవానిని యూరిలోనుండి వెళ్ళగొట్టవలెను. అట్టివాడు గ్రామశతృవు.

మాల్యవంతుడుగూడ కాలనేమితో నేకీభవించి వేరేవ్యాఖ్యానము వ్రాయలేదు.

ప్రాయశ్చిత్తకాండము.

1. రసికదూషకులు భోగచాంద్రాయణ వ్రతము చేయవలెను.

కాలనేమివ్యాఖ్యానము—రసికులనగా భోగమువాండ్ర నుంచుకొన్నవారు. చాంద్రాయణవ్రతమనగా భూమిచుట్టు ప్రదక్షిణము చేసి వచ్చుట. రసికులను దూషించినవారు మూడు సం॥లు భూప్రదక్షిణముచేసి తానువెళ్ళిన ప్రతిపట్టణమందును, ప్రతిపల్లెయందును కాపురమున్న వేశ్యలగృహములకుబోయి వారిని దర్శించి వారితో సరసములాడి మూడుసం॥లు ముగిసిన తరువాత మరల నింటికివచ్చి తాను మునుపు దూషించిన రసికులకు మెడకు బట్టచుట్టుకొని సాష్టాంగనమస్కారము జేయవలెను. దీనిపేరే భోగచాంద్రాయణవ్రతమందురు. ఈ వ్రతము శ్రద్ధాభక్తులతో జేసినవారికి రసికులను దూషించిన మహాపాతకము క్షణములో బోవును.

మాల్యవంతవ్యాఖ్యానము—భోగ చాంద్రాయణవ్రతము చేయుటకు శరీరదార్ఢ్యములేనివాడు మూడుసంవత్సరముల పరిమితిగల కాలము భోగముదానినొకర్తు నుంచుకోవలయును. అట్లుంచుకొనుటకు ధనములేనివాడు రసికులను వేశ్యలను స్తోత్రము చేయుచున్నపక్షమున నాపాతకము పోవును.

2. వేశ్యాదూషకులకు ప్రాయశ్చిత్తమే లేదు.

కా-వ్యా—పై సూత్రములో రసికులను దూషించినవారికి ప్రాయశ్చిత్తము విధించితిమి. ఈసూత్రములో వేశ్యలను దూషించిన వారివిషయమై చెప్పబడుచున్నది. వేశ్యలు అప్సరసల అంశమునందు బుట్టినవారు. పూర్వకాలమున దేవతలు రాక్షసులు పాలసముద్రము మథించినప్పు డప్సరసలు కల్పవృక్షములు అమృతము నైరావతము మొదలగు గొప్పపదార్థములన్నియు నాసముద్రములోనుండి పుట్టినవి. కాబట్టి యప్సరసలు దేవతాస్త్రీలు. దేవతాస్త్రీల యంశమునందు బుట్టినవారందఱు దేవతాస్త్రీలే. దేవతలను దూషించినవారికి ప్రాయశ్చిత్తమే లేదు. అందుచేత వేశ్యలను దూషించినవారికి ప్రాయశ్చిత్తము లేదు.

మా-వ్యా—ఒకవేళ ప్రాయశ్చిత్తము చేసికొనవలెనని వేశ్యాదూషకులకు గట్టిగా మనస్సులో సంకల్పము కలిగినపక్షమున నాలుక కోయించుకొనవలెను. ఇందువలన వేశ్యలను మరల దూషించుట కవకాశము కలుగదు. ఇది చేసికొనుట చాల కష్టము గనుక మహానుభావులైన సూత్రకారులు మారీచస్వాములవారు ప్రాయశ్చిత్తమే లేదని విధించిరి.

0. సురదూషకునకు తన్విక్రయమే ప్రాయశ్చిత్తము.

కా-వ్యా—కల్లు త్రాగగూడదని నిందించినవారికి స్వల్పప్రాయశ్చిత్తము విధించినారు అది యేమనగా కల్లుదుకాణములో గూర్చుండి కొంతకాలము కల్లమ్ముట. ఈకల్లువాసన తగులునప్పటి కా దూషించిన పాపము పోవును. ఇది యెంతకాలము సేయవలయునని ధర్మశాస్త్రకర్తలనేకులు మీమాంసచేసిరి. మూడు సం॥ల వరకు కల్లమ్మవలసినదని సూత్రకారుల మతము. ఈమాట సూత్రములో లేదు గదా మీరెట్లు తెలిసికొనగలిగితిరని యందురేమో? మేము సాక్షా

త్తు సూత్రకారుల పాదసేవచేసి వారినోటనుండియే యీమాట విన్నా ము. అతిప్రాచీనులైన జ్వాలాజిహ్వాస్మృతిలోను హిరణ్యాక్షస్మృతి లోను నముచిస్మృతిలోను శతబాహుస్మృతిలోను పదిసం॥లు సుర దూషకుడు కల్లమ్మవలసినదని యున్నది.

మూ-వ్యా—అట్టి పరమపాతకునిచేత యావజ్జీవము కల్లమ్మవ లసినదని మాయభిప్రాయము. అందుకు వాడిష్టపడకపోయినచో వాని సొత్తుసర్వము హరించి గ్రామమందుగల త్రాగుబోతులందఱు పంచు కోవలెను.

4. సురాపానదూషకులకు బలాత్కారపానమే కర్తవ్యము.

కా-వ్యా—సురాపానము చేసినవారిని త్రాగుబోతులని నిం దించినవానిని గ్రామములోనున్న పదిమంది జేరి బలవంతముగా బట్టు కొని పటకారులతో వానినోరు బిద్దలుచేసి కల్లు వానినోటనిండ బో యవలెను. మ్రింగకపోయినచో ముక్కునూయవలెను.

మూ-వ్యా—వాడొకవేళ కల్లు మ్రింగకనే యేకారణముచేత నైన చచ్చిపోయినపక్షమున వానిశరీరము కల్లుతో స్నానముచేయించి తరువాత దహనముచేయవలెను.

5. సురాదానము రోగనివారణోపాయము.

కా-వ్యా—కల్లు త్రాగుటవలన కొన్నిరోగములు పుట్టవచ్చును అట్టిరోగములు మందులవలన నివారణ కాకపోవచ్చును. కానియెడల గ్రామములో త్రాగుటకై మిక్కిలి ప్రసిద్ధికెక్కిన సత్పురుషు లను పదిమందిని తీసికొనివచ్చి వారికాళ్ళుకడిగి ప్రదక్షిణముచేసి ఒక్కొక్కరికి ఒక్కొక్కతాటిచెట్టు దక్షిణయిచ్చి మూడు కల్లుకుండలు దానమియ్యవలెను. ఈదానముచేత ఆరోగము పోవును.

మూ-వ్యా—రోగము పోవుటయేగాక యీజన్మమున పెట్టి పుట్టుటచేత నింకొకజన్మమున కావలసినంతకల్లు వానికి సమృద్ధిగా లభించును,

౯. వృక్షనాళకులు తాళవనప్రతిష్ట చేయవలెను.

కా-వ్యా—ఏచెట్టునైనను దూలములనిమిత్తముకాని వాసములనిమిత్తముకాని యింకొకకారణముచేతగాని చంపవలసివచ్చినపుడు ఆమహాపాతకము పోవుటకై తాటితోటలు వేయించవలెను. తాటిచెట్లు భూలోకకల్పవృక్షములని మహానుభావులైన ప్రాచీనమహర్షుల యభిప్రాయము. ఆ తాటిచెట్లు ఆ చెట్లవల్లపుట్టిన చెట్లు వాటివలనపుట్టిన చెట్లు భూలోకమందెంతకాలముండునో అంతకాలము అతఁడు అతని బంధువులు అతని స్నేహితులుకూడ మరణానంతరము కలిలోకమున మహానందపదవి ననుభవించుచుందురు.

మా-వ్యా—తాటిచెట్లు వేయుటకు సమర్థనిపక్షమున ఈతచెట్లు ఇప్పచెట్లు ద్రాక్షచెట్లు మొదలయిన కల్లుచేయుటకు వీలైన చెట్లు నాటవచ్చును. అధమపక్ష మట్టిచెట్లు నొక్కటైన నాటనివానికి నరకమే ప్రాప్తమగును.

మారీచస్మృతి—ప్రాయశ్చిత్తకాండము.

సోదరులకుభాగము పంచిపెట్టకూడదు.

కాలనేమి వ్యాఖ్యానము—అన్నదమ్ములలో బలవంతుడెవ్వడో వాడేతక్కిన సోదరుల నెత్తికొట్టి పితార్జితమైన యూవదాస్తి యుస్వాధీనము చేసికొనవలసినది. దీనికి రెండుకారణములుగలవు. బలహీనుని చేతిలో స్థిరాస్తిగాని చరాస్తిగాని యుండుట యపాయకరము. ఎందుకనగా వారు దుర్బలులగుటచేత నెవరో వారివద్దలాగి కొనిపుచ్చుకొందురు. అందుచేత బలవంతుని చేతిలోనున్న పక్షమున నట్టియాస్తి కుటుంబములోనుండి యావలకుపోదు. ఆస్తిముక్కముక్కలుచేసిపుచ్చుకొన్నపక్షమున కొంతకాలమునకునప్పటికి ఎవరికి నేమియుదక్కదు. రాజ్యమువిరపురుషు లనుభవింపవలసినది. ఆవిధముగానె భూములు గూడ బలవంతులనుభవింపవలసినది.

మాల్యవంత వ్యాఖ్యానము—"తనకలిమి యింద్రభోగము, తన లేమి లోకదరిద్రము" అన్నట్టుగా ఎవడిమట్టుకు వాడు తన భాగ్యము చూచుకొనవలసినదే కాని యున్నదమ్ములు బాధపడిపోవుదురేమోయని వారినిమిత్తము తనసుఖములు పోగొట్టుకొనగూడదు. పరులకై తనసుఖమును బోగొట్టుకొని కష్టపడెడువాడు ఆత్మహత్య మహాపాతకుడైపోయిన దుర్గతికిబోవును. ఒకగడ్డిమోపు చూచినప్పుడు ఒకయావు కడుపునబుట్టిన దూడలు నాలుగు దానిదగ్గరకుజేరి ఆగడ్డినిమిత్తమై యొకదానినొకటి కుమ్ముకొని బలముగలది తినును. అట్లె ఒకతల్లిదండ్రులకు బుట్టిన బిడ్డలలో గూడ బలముగలవాడే యనుభవింపవలసినది.

2 లంచము గ్రహించదగినది

కా. వ్యా—లోకమంతయు లంచములోనే యున్నది. దేవతలు లంచము గోరెదరు. నైవేద్యములే లంచములు. పరమేశ్వరుడు లంచముగోరును. ప్రార్థనలు భజనలు కీర్తనలు స్మరణలు ధ్యానములు పూజలు పరమేశ్వరునకు లంచములు. గురువులంచముగోరును. వినయముశుశ్రూషవానికి లంచములు. తలిదండ్రులు లంచములు గోరుదురు. ఈలంచములకే ప్రీతిభక్తియందురు. ఉపకారముచేసి లంచము పుచ్చుకొనుట తప్పగాదు. లంచము నిన్నటిది నేటిదికాదు. పృథివిపుట్టినప్పటినుండి యున్నది. అపకారము చేయకుండుటకై గూడ లంచము పుచ్చుకొనవచ్చును.

మా. వ్యా. లంచములుపుచ్చుకొననని చెప్పువారందరు అప్రయోజకులు. పేరునిర్భాగ్యులనవలెనుగాని నీతిమంతులనుటకు వలులేదు. అశక్తులుగాని ప్రజ్ఞావంతులుగారు. వారిది అశక్తదుర్జనత్వముగాని యోగ్యతగాదు. లంచములో మహాలక్ష్మియున్నది. అదిపుచ్చుకొన్న వారియిల్లు కలకలలాడుచు నిత్యకల్యాణము పచ్చతోరణమువలెనుండును. మహాలక్ష్మి అందెలు గజ్జెలు ఘల్లు ఘల్లుమనునట్లుగా వారియిల్లంత

యుదిరుగుచుండును. లంచములు పుచ్చుకోజాలని తెలివితక్కువవాని యిల్లు శ్మశానమువలె యమంగళమై యసహ్యమైయుండును కావున సర్వవిధములచేత దానిని గ్రహింపవలసినది.

3. వ్యాపారంబులలో వడ్డీ శ్రేష్టము,

కా. వ్యా — గౌతముడు, మనువు మొదలయిన ప్రాచీన ఋషులు వడ్డీవ్యాపారము సేయువారు పంక్తిబాహ్యులని తమతమ స్మృతులలో వ్రాసిపెట్టిరి. కాని వారితో మే మేకీభవింపజాలము. నూటికి నెలకు అయిదు రూపాయలవంతున ఇచ్చుట ధర్మవడ్డీ వాయిదా దాటిన తరువాత నూటికి నెలకు పదిరూపాయల వంతున పుచ్చుకొనుట ధర్మము. ఇదితనఖాలమీద నిచ్చుపద్ధతి. విడిబదుళ్ళు ప్రాణావసరము వచ్చినప్పుడైనను ఇయ్యగూడదు. ఇచ్చెడు పక్షమున దీనికి రెట్టింపువడ్డీయుండవలెను. బంగారము తాకట్టుమీద నూటికి యేడున్నర వడ్డీకి తక్కువ యియ్యగూడదు. ఆయిచ్చునదియైనను నూరురూపాయల విలువగలదానిమీద పదిరూపాయలియ్య వలెను. వెండి మొదలగు వాటిమీద తాకట్టు యియ్యనేగూడదు.

మా-వ్యా—ఏమనుష్యునకైనను ప్రాణముమీదకు వచ్చినప్పుడతడుగాని అతని బంధువులుగాని వైద్యము నిమిత్తముగాని ఉత్తర క్రియల నిమిత్తముగాని సొమ్మడిగినపక్షమున నూటికి యిరువది రూపాయల చొప్పున వడ్డీకి తనఖామీద ఆస్తికిమ్మతులో మూప్పదవవం తియ్యవలెను. తోడి మనుష్యుల కాపదసమయములలో అట్టియుపకారము చేయుటధర్మము. చిన్నవాళ్ళు చోరులు జూదగులు త్రాగుబోతులు బదులు నిమిత్తము వచ్చినప్పుడు అయిదు వందలు వారు కోరిన పక్షమున అంతసొమ్మునకు దస్తావేజువ్రాయించి అందులో అయిదవవంతు సొమ్మిచ్చి పంపించవలెను. కొన్ని సమయములయందు దస్తావేజులు వ్రాయించుకొని సొమ్మియ్యక పోయినను దోషము లేదని

దేవాంతక నరాంతకులను ప్రాచీన మహర్షుల మతము. అసలువడ్డీ పుచ్చుకొనకయు, తక్కువ వడ్డీకి బదులిచ్చునట్టియు దుర్మార్గులులోక శత్రువులగుటచేత వారి యాస్తి దోచుకొని దేశమునుంచి వెళ్ళగొట్ట వలెను. అటువంటి వారున్న పక్షమున పట్టణములోని వారికి చాల ధన నష్టము గలుగును. ప్రాణనష్టమునకైనను యోర్వవచ్చునుగాని ధన నష్టమునకు యోర్వరాదు. ఎంతఅవసరముమీాద బదులునకువచ్చునో అట్టివానికి అంత యెక్కువ వడ్డీమీాద బదులిచ్చుట ధర్మము.

## వ్యవహారకాండము.

### 1 దొంగలను దండింపగూడదు.

కా. వ్యా: ఈసూత్రము జనులకు విరుద్ధముగా కనపడవచ్చు ను కాని శాంతముతో నాలోచించినపక్షమున నిందు విరుద్ధమేమియు లేదు. గృహయజమానులు తమతమ గృహములను చక్కగా గట్టు కొన్నపక్షమున దొంగవాడు కన్నము వేయుటకు వీలుండదుగదా? ఇండ్లు జాగ్రత్తగా గట్టుకొనక దొంగలకు కన్నము వేయుట కవకాశ మిచ్చి తరువాత వారిని శిక్షించుమని చెప్పుట యేటిన్యాయము. దొంగలు పశువులవంటివారు. పంటకాపులు తమచేలు సరిగా సంరక్షణ జేసికొనక వచ్చిమేసిపోయినవని పశువులను గొట్టిన నేమిలాభము. ఆవిధముగానె తగినజాగ్రత్త పుచ్చుకొనక యిండ్లు చోరులుదోచుకొని పోయినారనుట కేవల మన్యాయము. బెల్లము జాగ్రత్తగా నొకచోట బెట్టి చీమలను చేరవద్దని చెప్పినచో నవి మానునా? మాంసము ముక్క బయటపెట్టి గ్రద్దలను రావలదన్నచో నవి మానునా? ఎదుట మిఠాయిపెట్టి పిల్లవానిని దరికిరావలదన్నచో నూరకుండునా? ఆవిధము గానె దొంగలకు లోపల ప్రవేశించుటకు వీలకలుగ జేసి వస్తువులు పోయినవని ఏడ్చిన నేమిలాభము! అందుచేత జనులందఱు తమతమ

యిండ్లు రాతిగోడలతో గట్టుకొనవలయును. మఱియు గృహములలో నున్నవారు జాము కొక్కొక్కరు చొ॥ తెల్లవార్లు మేలుకొనవలయును

మా. వ్యా. దొంగతన మేయింట్లో జరుగునో ఆయింటి యజమానుని తగినజాగ్రత్త పుచ్చుకోనందుకు దండింపవలయును. అంతియగాక గోడలుసరిగా పెట్టనందుకు యిల్లుకట్టించిన మేస్త్రీసి కూలీలను గూడ పిలిపించి దండింపవలయును. ఈవిధముగా చేయనిపక్షమున ప్రపంచములో న్యాయము దొరకదు. కేవలము దొంగలను దండింపదలచుట అక్రమము అధర్మము అన్యాయము.

2 దొంగలకు బహుమానము లీయవలెను.

కా. వ్యా. దొంగతనములు మిక్కిలి చమత్కారముతో చేసినట్టివారికి. కన్నము నేర్పుతో వేసినవారికి, మంచియుక్తులుపన్ని అపాయము తప్పించుకొని పారిపోయినవారికి బహుమానము లిచ్చుట ధర్మము. ఏవిద్యలోనైనను సంపూర్ణమైన ప్రజ్ఞసంపాదించినవారిని మెచ్చి పారితోషికము లిచ్చుట లోకధర్మము. దొంగతనముగూడ ప్రశస్తమైన విద్యలలో నొకటిగనుక అందులోగూడ అధాసారణప్రజ్ఞగలవారికి బహుమానముచేయుట తప్పుగాదు. లోకమునకు బాధకరమైన దొంగతనము గొప్పవిద్యలలో నొకటియందువాయని మీరు శంకింతురేమో. అట్లు శంకింపగూడదు. వేట జీవజంతువులకు బాధకరమైనను అదియొక గొప్పవిద్యగా జనులు మెచ్చుచున్నారు. ఆవిధముగానె చౌర్యముగూడ కొందఱికి బాధకరముగా నున్నను మెచ్చదగిన విద్యలలో నొకటి.

మా. వ్యా.—దొంగతనమునుగురించి మహానుభావుడైన వృశ్చికరోముడు వ్రాసిన గ్రంథము పాఠముగా బెట్టి చదివించి అందులో పరీక్షించి కడతేరినవారికి బంగారుపతకములు మొదలయినవిచ్చుట యుచితముగానుండును.

3. జారత్వముగూడ దండింపదగిన నేరముకాదు.

కా. వ్యా. స్త్రీపురుషులు పరస్పరానురాగములు గలిగి మనస్సులు కలుపుకొని కలియుదురుగావున నటువంటి యనురాగములను మనము వృద్ధిచేయవలసినదేగాని దండించి క్షీణింపజేయగూడదు. కాని పరపురుషుని భార్యతో గలియుట న్యాయమా యని యందురేమో. పరపురుషుడు పరస్త్రీయనుభేదము లెన్నడు నుండగూడదు. మనస్సులో అనురాగములు పుట్టి యెవరు కలియుదురో వారే దంపతులు. తలిదండ్రులుచేసిన వివాహములు వివాహములుకావు. పరునిభార్యయైననుసరే ఆమె కేపురుషునిమీద యనురాగము కుదురునో ఆపురుషుని దీసికొనివచ్చి అట్టివారిద్దరికిని క్రొత్తగా వివాహము చేయవలెను. పాత వివాహము దానితో రద్దు.

మా. వ్యా. అసలు వివాహములే యుండగూడదు. పశువులలో వివాహము లున్నవా? పక్షులలో వివాహము లున్నవా? జలజంతువులలో వివాహము లున్నవా? ఈ వివాహముల మూలముననే జారత్వమనునది లోకమునగలుగుచున్నది. అసలు వివాహములు లేనిచో జారత్వమన్న మాటే పుట్టదు.

1 అప్పు లెగబెట్టుట తప్పుగాదు.

కా. వ్యా — అప్పులిచ్చువాడు వడ్డికాశపడి యిచ్చిపుచ్చుకొన్నవాడు సొమ్మిచ్చుకోలేనప్పుడు వానియిల్లువాకిలి పొలము వస్తువులు వాహనములు అమ్మించి సొమ్ముపుచ్చుకోవలెనని దురుద్దేశము గలిగియుండును. అందుచేత అప్పుపుచ్చుకొన్నవాడియ్యకపోయినను దోషములేదు దొరికినంతకాల మప్పుపుచ్చుకొని తలమునిగి తాడిప్రమాణమైనప్పుడు న్యాయస్థానములలోనికి వెళ్ళి దివాలాఆర్జీయొకటి యిచ్చినపక్షమున ఆబాధ తీరిపోవును.

మా. వ్యా— కావలసినప్పుడు సొమ్మిచ్చి అవసరముగడిపినాడు గదా యని విశ్వాసముచేత కొందరు మూర్ఖులు తెచ్చుకొన్న అప్పు

మరలనీయవలయునని దుర్బోధలు చేయుచుందురు. అట్టిదుర్బోధలు విని మనుష్యులు చెడిపోగూడదు. "ఋణంకృత్వా ఘృతంపిబేత్" అని చార్వాక మహాముని లోకోపకారార్థమై యొకసూత్రం వ్రాసినారు. అప్పుచేసి నేయికొనుక్కొని త్రాగవలెనని దీనియర్థము. ఈసూత్రము మనస్సులో లోకులందరు నిలుపుకొని సుఖపడవలయును. లోకుల యొక్క సుఖము నిమిత్తమే నేమీస్మృతివ్రాయుచున్నాము గనుక మాయొక్క మంచియుద్దేశమునుగ్రహించి లోకులుసుఖపడవలయును.

2. న్యాయాధిపతులు వాదిప్రతివాదులిద్దరికి గూడశిక్ష వేయవలెను.

కా. వ్యా—శిక్షవేయుటయనగా ఇద్దరివద్దను చెరికొంత లంచము పుచ్చుకొని వచ్చిన యభియోగము తనయిష్టము వచ్చినట్లు తగలబెట్టుట ఇదియొక విధమైనశిక్ష, ఇంతకంటె రెండవది యిద్దరిని ఖైదు చేయుటగాని యిద్దరికి జరిమానా వేయుటగాని యైయున్నది. ఇట్లు చేసినపక్షమున నేకారణమునను మనుష్యులు తగవులాడరు. ఇట్లుగాక నేరము కనుగొని నేరము చేసినవానినే శిక్షించినపక్షమున గెలిచిన వాడు గర్వపడి కయ్యమునకు మరింత కాలుదువ్వుచుండును. కాబట్టి యిద్దరిని శిక్షించిన మిక్కిలి లాభముండును.

మా. వ్యా—దీనివల్ల న్యాయాధిపతికి నష్టముండదు. సాక్ష్యములు విచారణచేసి యెవడు నేరస్థుడో కనుగొనుట విసుగుపుట్టించును

3. న్యాయాధిపతులు త్రిప్పి త్రిప్పి రప్పించినపక్షమున అభియోగములుండవు.

కా. వ్యా—వచ్చినయభియోగముల విచారణ చేయుటకు ఓపిక లేని న్యాయాధిపతులు అభియోగములు దెచ్చిన మనుష్యులను త్రిప్పి త్రిప్పి విసిగించినపక్షమున నుభయులు బుద్ధి తెచ్చుకొని వారంతటవారే రాజీనామా పడుదురు. న్యాయాధిపతికెంతో సుఖము. అభియోగము తెచ్చినవారికి బుద్ధివచ్చును అందుచేత న్యాయాధిపతులందరీయుపాయమునే బ్రయోగించుచుండవలెను.

# వినాయక విషాదము

(అప్పుడు వినాయకుడు నందికేశుడు ప్రవేశించుచున్నారు.)

నంది——వినాయకా! ఎందుచేత మాటలాడవు. ఎన్నిపిలిచినను పలుకవేమి? నీ మనస్సులో ఏదో గట్టివిచారమున్నట్లు కనబడు చున్నదే.

వినా——(తలవంచుకొని విచారించుచు ఊరకుండును.)

నంది——మిత్రుడా! విఘ్నేశ్వరుడా! నేను నీకు చిరకాల మిత్రుడనుగదా. అట్టి స్థితిలో నీ విచారమేమో నాకు తెలియజెప్పరాదా? నీ విచారముజూడగా నాకును విచారము కలుగుచున్నది.

వినా——(నిట్టూర్పువిడిచి) అబ్బబ్బా యేమి దుష్కాలము సంభవించినది. నేనేమని నీతో జెప్పుదును. చెప్పుటకైన నాకు నోరు రాకున్నయది.

నంది——ఏలాగో యొకలాగు ధైర్యము దెచ్చుకొని నీ మనోవ్యాధి యేమో మర్మములేక నాకు దెలియజెప్పుము. దాని కేదేని ప్రతిక్రియ యున్నయెడల చెప్పెదను

వినా——ప్రతిక్రియ నీవు చేయలేవు. నిన్ను పుట్టించిన జేజెమ్మ చెయ్యలేదు.

నంది——నాన్చి నాన్చి చంపక చెప్పవయ్యా బాబూ! ఇతరులకు చెప్పక లో లోపల దిగమింగిన పక్షమున విచారము మఱింత యెక్కువగును.

వినా——ఏమిచెప్పను. అప్రతిష్టపాలై పోయినాను. అప్రతిష్ట పడుటకంటె మరణము మేలు గదా. మనము దేవతల మగుటచే మరణము రాదు. అందుచేత ననుభవించ వలసినదే.

నంది—అప్రతిష్టా! నీ మీదనా? అంతటి యప్రతిష్ట యేమి వచ్చినదయ్యా. చెప్పు చెప్పు.

వినా—ఏమియప్రతిష్టా! నీవు యెరగని నంగనాచివలె మాట లాడుదువేమి? నేను లోకములో గొప్పతిండిపోతునని యప్రతిష్ట లేదా. నీ వనుదినము వినుచు నెఱుగనివానివలె బలికెదవేమి. భాద్ర పద శుద్ధ చవితినాడు ప్రతి సంవత్సరము ప్రజలునన్ను పూజించి యుండ్రములు పెట్టుదురు. పెట్టినవన్నియు నేను తినుటచేత నేనుతిండి పోతునని నిందించుచున్నారు. ఈ నింద నేను భరింపజాలను. (అని కన్నీరు విడుచు చున్నాడు.)

నంది—ఆ యొక్కదినముననేనా జనులు నీకు విందులు చేయుట. ఏకార్యము దలపెట్టుకొన్నను ముందు విఘ్నేశ్వరపూజ జేసి నైవేద్యము బెట్టరా?

వినా—అదియెంతయ్యా! కొంచెము బెల్లపుముక్క పెట్టు దురు. అది ఆకలి తీరునా వల్లకాడా నల్లమందు మాత్రలాగున గుట్టు క్కున మ్రింగివేయుదును.

నంది—ఏమైనప్పటికి లోకులు నిజమే పలికిరి. నీవుతిండిపోతు వే

వినా—అయ్యయ్యో. నీవుగూడ నిట్లన్నపక్షమున నింకగతి యేది. ఈ నింద మిక్కిలి యన్యాయము. నన్ను మించిన మహాను భావు లెందరో యుండగా నన్నొక్కనినే తిండిపోతనుట యన్యాయము గాదా.

నంది—నిన్ను మించిన మహానుభావులు లోకములో గలరా? ఇది యసంభవము.

వినా—అసంభవమా! నీవుగూడ నన్యాయమునకు వడిగట్టు కొనుచున్నావు. నే చెప్పెడిది విని మాట్లాడుము. సంవత్సరమున కొక్కసారి చవితినాడు ఉండ్రముక్కలు తినినందుకు నేనే తిండిపోతు

నైనపక్షమున ప్రతిదినము రెండుపూటల భోజనముచేసి మరిరెండు పూటలు కాఫీకొట్లలో దూరి గొంతులో వేలుపెట్టిన పక్షమున నందునట్లు కడుపుమాన మెఱుగకుండ ఇడ్డెనలు పులిపిండితో జేసిన దోసెలు మొదలయిన అడ్డమయినగడ్డి తినునట్టివారు తిండిపోతులు గారా. మీ యందరివి నాలుకలా తాటిపట్టెలా నిజమూడ రెండుచేత వెఱ్ఱిసాంబమూర్తికి పిచ్చిపార్వతికి ముద్దుబిడ్డనని లోకువా మీకు. లోకులు కాకులన్నమాట నిజముకాదా. ననన్నా శృంఖలు తలకొక యింతపాపము మూట కట్టుకొనుచున్నారు.

నంది—నీమాట నా కిప్పుడు నచ్చినది. కాఫీ కొట్లలో జేరు నట్టివారిముందర నీ వెందుకు పనికిరావు. నీ ప్రారబ్ధకర్మముచేత నీకీ యప్రతిష్ఠ వచ్చినదికాని మఱియొకటికాదు. విచారించకు.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

# అపూర్వ వేదాంతము

(అప్పుడు రఘూనాధరావుగారు దేవదాసుగారు ప్రవేశించుచున్నారు.)

రమా—మీ రెందుకు వచ్చినారో చెప్పరేమి?

దేవ—నేను చందానిమిత్తం వచ్చినాను.

రమా—ఏమిచందా మీకు పనిపాటలు లేవా యేమిటి.

దేవ—మాకుపనిపాటలున్నవి. ఈచందామానిమిత్తముకాదు.

రమా—(కోపముతో) ఎవరినిమిత్తమో త్వరగా చెప్పండి

చంపక.

దేవ—చిత్తము ఆగ్రహించకండి మనవిచేయుచున్నాను. దక్షిణాఫ్రికాలోనున్న మనహిందూదేశస్థులు ఆదేశమందలి తెల్లవారిచేత నానాబాధలు పడుచున్నారు. వారు ప్రస్తుతము చెఱసాలలో బడినారు. వారి దారపుత్రాదుల పోషణనిమిత్తమై మనదేశమునుండి చందాలు వసూలుచేసి పంపుచున్నారు. మీరుగూడ నేమైన చందాలు యిప్పించవలెను.

రమా—ఇదా పని నీకు దేశముదాటి మాలదేశములోనికి వెళ్లి వర్ణభ్రష్టులైన నిర్భాగ్యులకు సహాయము చేయునలయుననియా నీవు చెప్పునది. దేశమువిడచి వెళ్ళినవాళ్ళతో మన కేమిసంబంధము. వాళ్ళు మతభ్రష్టులు వర్ణభ్రష్టులు దేశద్రోహులు. అటువంటివాళ్ళకు నే నొక్కదమ్మిడీ యివ్వను. వాళ్ళు మలమల మాడినాసరే. చచ్చినా సరే.

దేవ—తమరంత కోపగించినపక్షమున నేనేమి మనవిచేయగలను. అక్కడికి వెళ్ళినప్పటికి వారు హిందూమతములోనె యున్నారు. తురకలు తురకమతములోనెయున్నారు. అక్కడనుంచి మనవారిని వెళ్లిపొమ్మని ఆదేశస్థులు బాధపెట్టుటచే ప్రస్తుత మీచిక్కులు సంభవించినవి.

రమా—వాళ్ళదేశములోనుంచి వాళ్ళు వెళ్లిపొమ్మని బాధపెడుతూంటే అక్కడనుంచి లేచిరాక సిగ్గులేక అక్కడనేయుండి వాళ్ళతో దెబ్బలాడుచుండుట యెందుకు.

దేవ—వీళ్ళ తాతలు చిరకాలముక్రిందట ఆదేశము వెళ్లనారు. వీళ్ళందరు అక్కడనేపుట్టి అక్కడనే పెరిగి అక్కడనేచదువుకొని అక్కడనే యిల్లువాకిలి పొలము సంపాదించుకొని కుటుంబములతో కాపురమున్నారు.

రమా—పరాయివాళ్ళ దేశములోనికి వెళ్లినప్పుడు వాళ్లిష్టము వచ్చినన్నాళ్ళుండవచ్చును వాళ్ళు పొమ్మన్నప్పుడు పోవద్దా. ఏమిసబబయ్యా యిది. మీయిష్టముమీద మీయింట్లో నెన్నాళ్ళయినా కాపురముండవచ్చును. మీరు పొమ్మన్నప్పుడు పోక కాలుపట్టుకొని లాగితే చూరుపట్టుకొని వేళ్ళాడుట న్యాయమేనా?

దేవ—అయ్యా! నాకొక్కమాటకు జవాబుచెప్పండి. మొదట మీ దీగ్రామమేనా కాపురము.

రమా—మా దీగ్రామముకాదు. మాది దక్షిణాది.

దేవ—సరే మీరిక్కడకువచ్చి యిల్లువాకిలి కట్టుకొని ఆస్తి సంపాదించుకొని కాపురమున్నారుకదా. మీరిప్పుడు మీదేశమువెళ్ళిపోవలసినదని మేమందరము అంటే మీరేమిచేస్తారు.

రమా—నేనీ దేశస్థుడనే నైపోయినాను. ఇదే నాస్వస్థలము. నేనిక్కడనుంచి కదలను.

దేవ—మీలాగే వాళ్ళుకూడ అక్కడనుంచి కదలమంటారు. అది న్యాయమేకదా.

రమా—వాళ్ళదెంతమాత్రము న్యాయముకాదు. అన్యాయముగా నితరులదేశములోనికి వెళ్ళియుండి వాళ్ళను బాధపెట్టి తాము బాధపడుచుండు మొండివాళ్ళకు నేనొక్క దమ్మిడీయైన నిచ్చేవాడను కాను. పైగా నాకింకొక్క సందేహముగూడ నున్నది. ఈసొమ్ము మీరు వసూలుచేసి యేమిచేయుదురో మాకు తెలియదు.

దేవ—అన్నన్నా యెంతమాటన్నారండి. ఈచందాసొమ్ము మేమందరము హరింతుమా.

రమా—హరింతురో భరింతురో నేనేమిచెప్పగలను. దక్షిణాఫ్రికాకు మీరుపంపినట్లు నిదర్శనమేమున్నది.

దేవ—చెన్నపట్టణములో గొప్పవారందరు కమిటీచేసినారు. ఈసొమ్ము మేముకమిటీవారిదగ్గరకు పంపుతాము.

రమా—ఆకమిటీ యున్నదో లేదో యెవడెరుగును. ఉంటే ఆకమిటీవారు మీరుగూడకలిసి హరించగూడదా.

దేవ—ఇందులో మహానుభావులైన గోపాలకృష్ణగోక్లేగారు మదనమోహన మాళవ్యాగారును సురేంద్రనాధ బెనర్జీగారు నిందు లో పనిచేయుచున్నారు. వారందరు మనసొమ్ము హరించేవారేనా!

రమా—గోక్లేగారైన నాకు నమ్మకం లేదు. బెనర్జీగారైనా నాకు నమ్మకం లేదు. వారుమాత్ర మాకాశముమీదినుంచి యూడి పడ్డారా యేమిటి. వారికిమాత్రము డబ్బుతీపిలేదా. మాతాపుత్రవిరోధాయహిరణ్యాయ నమోనమః అనగా వినలేదా నీవు.

దేవ—ఛీ' ఛీ! ఛీ! యిటువంటిమాటలన్నతరువాతమీయెదుట నేనుండగూడదు. ఆమహానుభావుల నామస్మరణ చేసినపక్షమున మీ జన్మ పావనమగును. డబ్బుకర్చుపెట్టుట కిష్టములేక బుద్ధికుశలతకొలది మీరిన్ని క్రొత్తవాదములు వాదించుచున్నారు. మీలోభత్వమే యీ వాదమునకు కారణముకాని మరియొకటిగాదు

రమా—నిరర్థకమైన వ్యాపారముల నిమిత్తమై చందాలనివ్వని వారిని మీరు లోభులనక యేమంటారు. నీవంటివానితో నేనింతసేపు మాటలాడి నాకాలము వ్యర్థముచేసికొనుట నాదె బుద్ధితక్కువ.

దేవ—మీవేషముజూచి మీపటాటోపము జూచి మీరేమో సత్కార్యములకు దానములిస్తారని వచ్చినందుకు నాదే బుద్ధితక్కువ. సెలవిప్పించండి పోతున్నాను.

రమా—వెళ్ళు ఇటువంటి అపాత్రులను రానియ్యకుండా ముందుముందు గుమ్మములో బంట్రోతులను పెడతాను.

(అని నిష్క్రమించును).

# నారదవిలాపము

(తుంబురుడు నారదుడు ప్రవేశించుచున్నారు.)

నార—తుంబురా! నాయిచ్చవచ్చినంత సేపు నేను విలపించె దను. ఎందుకు విలపించుచున్నావని ప్రశ్నలడిగియడిగి నన్ను చంప బోకు.

తుంబు—నారదా ఆప్తులైనవార మున్నారముగనుక నడుగు చున్నాము. మేము లేనిచో నిన్నడుగువారెవ్వరు? అవసరము లేని మొండి తనము చేయక నీ విలాపకారణము జెప్పుము.

నార—ఆర్చువారా తీర్చువారా మీరు? ఇతరుల దుఃఖములు వినవేడుక.

తుంబు—నాదుఃఖమునీది నీదుఃఖము నాది అందుకుచేత నిన్న డుగుచున్నాను. చప్పున చెప్పు.

నార—కారణము నేను చెప్పవలయునా? మొగముజూడగనే మీగాళ్ళవాపు తెలియునన్నట్లు చిక్కిచిక్కి బక్కగొడ్డువలెనున్న నన్నుజూచి నాదుఃఖకారణము నీవెఱుగలేవా?

తుంబు—అవును పాపము ఎందుచేతనోగాని నీవుమిక్కిలిచిక్కి యున్నావు నీకు త్రిప్పటయెక్కున. త్రిపాదగంగలాగున నెల్లచోట్ల దిరుగుచుందువు.

నార—కడుపునిండ పట్టెడన్నము లేనివాడు చిక్కిపోక యేమి చేయును. నేను కృశించుటకు త్రిప్పటకారణముకాదు. దారిద్ర్యమే కారణము.

తుంబు—అయ్యో నీవు కలహభోజనుడవుకాదా. అన్నము లేకేమి. కలహమేనీకన్నము. కలహమే నీకుపిండివంట. కావలసినంతన్న ముండగా నీవు లేదనియెదవేమి?

నార—అయ్యో వెఱ్ఱివాడా! జరుగుచున్నకథ నీవెఱుగనే యెఱుగవు కాబోలు. లోకములో నన్నివృత్తులలో నెట్లుపోటీలు వచ్చి నవో నావృత్తిలో గూడ నన్ని పోటీలు వచ్చినవి. ఏమిచెప్పుదును నాయవస్థ!

తుంబు—ఏమేమీ. పోటీలు వచ్చినవా? ఎట్లెట్లూ చెప్పు చెప్పు.

నార—చెప్పుచున్నాను విను. పూర్వకాలమున నే నొక్కడనే కలహప్రియుడను. నేనొక్కడనే కలహాభోజనుడను. ఇప్పు డూహార యింట నింట నెంతమందో కలహప్రియులు కలహాభోజనులు బయలు దేఱినారు. అన్నకు తమ్మునకు విరోధములు పెట్టుచున్నారు. ఆలి మగనికి విడియాకు లిప్పించుచున్నారు తండ్రికి బిడ్డకు తగులాటములు కల్పించుచున్నారు. ఇక్కడమాట లక్కడచెప్పి అక్కడమాట లిక్కడ చెప్పి లేనిపోని పుల్లింగములు చెప్పి నాకూటిలో మట్టిపోసినారు. నా నోటిముందర అన్నము పడగొట్టినారు. వృత్తియొక్క గౌరవమంత యు పాడుచేసినారు. అందుచే వేళపట్టున కింత యన్నము లేక అన్నమో రామచంద్రాయని నే నడలుచున్నాను. మునుపటివలె నావృత్తిలో మంచి కసవున్నపక్షమున నే నేనుగంత మనిషినికానా! ఈలాగు బక్క చిక్కి యుందునా?

తుంబు—అయ్యయ్యో. అదియా కారణము నేను వినలేదు. నాకుచాల విచారముగనున్నది. దీని కేమిప్రతివిధానము?

నార—ప్రతిక్రియ యేమున్నది. కర్మ మనుభవించవలసినదే. పదపద వెళ్ళుదాము.

(అని నిష్క్రమింతురు,)

# బ్రహ్మదేవుని యజ్ఞానము

(అతికాయుడు మహాకాయుడు ప్రవేశించుచున్నారు.)

అతి—అన్నయ్యా మహాకాయా! నీవు చెప్పినమాట నిజమే. బ్రహ్మదేవునివలన చాల లోపము లున్నవి. అతనికి తెలివితేటలు బొత్తిగా లేవు.

మహా—నేను మొదటనుంచి అనేమాటే అది. దురభిమానముచేత నారదుడు మొదలైన మహర్షులు బ్రహ్మదేవుడంతవాడు లేడని భట్టుగాండ్రవలె పొగడుచుందురు. కాని ఆమాటలు విన్నప్పుడు నాకు తలనొప్పి వచ్చును. గంపెడులోపములు కనబడుచుంటే వాని నూరికే స్తవంచేస్తారెందుకు వీళ్ళు.

అతి—అవునురా. ఈమునిముండాకొడుకులతోటి నాకప్పుడప్పుడు వాదములు వస్తావుంటవి. వాళ్లనోళ్ళణచటంకోసం నాకు రెండుయుక్తులు చెప్పు. అనగా బ్రహ్మదేవుని దగ్గరనున్న లోపములు కొన్ని చెప్పు. ఈపరియాయము వాళ్ళు కనబడినప్పుడు నీవు చెప్పిన నాలుగుయుక్తులు గబగబ యెకరపెట్టి వాళ్ళ పీకి డమాయించేస్తాను.

మహా—అయితే చెప్తా వినరా. బ్రహ్మదీవునివద్ద కనబడుచున్న పెద్దలోప మొకటి ముందుచెపుతాను. కాలసృష్టిలో అతడు చేసిన లోపము యింతా అంతా కాదు. దినము పగలు రాత్రియని రెండుభాగములు చేసినాడు. సరే బాగున్నది. కాని పగలు నాలుగుజాములు రాత్రి నాలుగుజాములు చెయ్యడం యెంతమాత్రము బాగాలేదు. హాయిగా నిద్రపోవుటకు పగటిలో రెండుజాములు తగ్గించి రాత్రిలో రెండుజాములు హెచ్చించి రాత్రి ఆరుజాములు పగటి రెండుజాములు చేస్తే వహవా యెంత బాగుండును! నిద్రకు బొత్తిగా కాల

ము చాలదనములేదుకదా. భోజనముచేసి పండుకొనేటప్పటికి జాము
రాత్రి అవుతుంది. తక్కిన మూడుజాములూ నిద్రపోవడాని కీమాయ
కాకులు వాటిసొమ్మంతా పడిపోయినట్లు తెల్లవారకముందే కావుకావు
కావు మని పెద్దపెట్టున యేడుస్తూ నిద్రపోయేవాళ్ళని లేపుతాయి.
ఈసూర్యుడొకడు. వాడి పుట్టి మునిగిపోయినట్లు పొద్దుటే వస్తా
డు. పగటి కింత నిధవపొద్దెందుకు? రెండుజాముల కాలము చాల
దా. అన్నము వండుకొనితినడం వ్యవహారము చేసికొనడము దీనికి రెం
డు జాముల కాలము చాలదా.

అతి—నిజమే నీవు చెప్పినదంతా నిజమే. కాని నీవిందులో
ఒక చిన్నపొరబాటు పడ్డావు. అదేమిటంటే పగటికి రెండుజాముల
కాలము కావాలని నీవు చెపుతూన్నావు. ఎందుకు రెండుజాముల
కాలము. పగలొక్క జాము రాత్రి యేడుజాములు వుంటే చాలా
బాగుంటుంది. ఏడుజాములైనా నిద్రపోకపోతే యేమితృప్తి తీరుతుంది.
ఉన్నదానిలోనే సర్దుకోవాలి గనుక ఈ యేడుజాములూ ఎలాగో ఒక
లాగ సరిపోతాయని నేనంటూన్నాను. కాని సుఖముగా తనివిగా
నిద్రపోవాలంటే యిది మాత్రము చాలుతుందా. ఒక్కగుట్టు కొట్టి
ఒకకల గనేటప్పటికి ఏడుజాములు ఏడుచిటికెలలో ఎగిరిపోతాయి
ఇప్పుడు బొత్తిగా కాలము చాలక కంటిమీద కునుకే లేదని నమ్మ.
గూట దీపాలు పెట్టకముందే భోజనముచేసి నేను పడుకుంటాను.
బాగా తెల్లవారిన తరువాత లేస్తాను. ఈలాగున చేసినప్పటికి నిద్ర
తృప్తిగా పోవడంలేదు. ఇది బొత్తిగా అన్యాయముగా నున్నది. తెల్ల
వారేటప్పటికి నాకళ్ళు లక్కముద్దరవేసి అంటించినట్లు గట్టిగా అంటు
కొనిపోవును. ఎంతో ప్రయత్నమునగాని తెరవలేను. నాకు సరియయిన
నిద్రేయుంటే రెట్టింపుమనిషి నగుదును.

మహా—అవునురా బాబూ నీవు చెప్పినట్లు పగ లొక్క జామే చాలును. కాని మన ఆలోచన వినేవా డెవడు యీసదుపాయం చేసే వాండెవడు. బ్రహ్మదేవుడు తెలియని ముండాకొడుకు తెలియనట్లూరు కోడు. ఒకరి నడుగడు. సర్వజ్ఞత్వ మెక్కువ మనంటివాళ్ళను కాస్త పెద్దనుపిన్ననుపిలిచి యిందులో యేలాగు చెయ్యమన్నావని అడగడు. అడిగితే పరువు తక్కువ కాబోలు. వీడి పరువు తగలెయ్య. ముంజి కాయల్లాగ నాలుగు తలకాయ లున్నాయి. ఎందుకు తెలివా తేటా. మట్టితలలు. నాలుగుగోజులు సృష్టి మన చేతి కిచ్చి మనలను చెయ్య మంటే, ఓ దివ్యసుందరంగా ఏలాచేసుందుము అక్కడ దిక్కడ బెట్టి ఇక్కడ దక్కడపెట్టి గగ్గోలు చేసి పారెయ్యమట్రా.

అతి—సరే బ్రహ్మదేవుడు చేసిన లోపము ఒకటి చెప్పినావు గదా యింకోటి కూడాచెప్పు.

మహా—సరే చెపుతూన్నాను విను. మనుష్యుల భోజనపు యేర్పాటులలో కూడ బ్రహ్మదేవుడు పెద్దలోపము చేసినాడు. ఒక్క నోరు ఒక్క జీర్ణకోశము పెటినాడు బాగా తినవలెనంటే ఒక్కనో రేమిచాలుతుంది ఒక్కజీర్ణకోశము పెట్టడమువల్ల విశేషము తినడానికి వీలులేకపోతూంది. ఎక్కువతింటే అజీర్ణము చేస్తూంది. ఇది యెంతో బాధగా నున్నది. బ్రహ్మదేవుడు చేయవలసిన దేమిటంటే మనుష్యు నకు రెండుమూడునోర్లు పెట్టవలసినది. ఆనోళ్ళలో ముదలుచేసి వేసి కొనుట కైదారు చేతు లియ్యవలసినది. ఇప్పుడు గర్భకోశములో ఒక్క జీర్ణకోశము పెట్టినాడు. ఆలాగు గాకుండా కాళ్ళలోను చేతుల లోను వీపులోను మెడలోను తలలోను మొగములోను వేళ్ళలోను గోళ్ళలోను శరీర మంతటను జీర్ణకోశములు పెట్టివేయవలసినది. ఎంత తిన్నప్పటికి అరక్కపోవడమంటూ వుండగూడదు. అటువంటి యేర్పా టుంటే చాలా సదుపాయము.

మహా—ఇవేగాదు ఇంకను బ్రహ్మదేవునియొద్ద అనేకలోపము లున్నవి. చెప్పదలచితిమా యిసుకపాతరవలె బయలుదేరుచు.

అతి—నీకు దెలిసిన లోపములలో నొకటి చెప్పు చెవులారా వింటాను.

మహా—వెనుక మనము చెప్పుకొన్న లోపములకంటె ఎక్కువ లోపము లున్నవి. అవి నీవు నేనూ లోకమందరూ వప్పుకొనక తప్పనివి.

అతి—త్వరగా చెప్పు. త్వరగా చెప్పు.

మహా—భూలోకములో భోగమువాళ్ళ జాతియొకటి బ్రహ్మ దేవుడు సృష్టించినాడన్నమాట నీ వెరుగుదువా?

అతి—సరి సరి బాగున్నది. యెరుగుదువాయని యడుగు చున్నావా? ఈప్రశ్న నాకెంతో యవమానముగా నున్నది. భోగము వాళ్ళజాతియేకాదు మనపట్టణములో యెన్నిభోగముకొంప లున్నవో ఏయేవీధులలో ఆకొంప లున్నవో దేనిపేరేదో దేనితల్లిపేరేదో దేని అమ్మమ్మ పేరేదో, దేనిని యెవరెవరు యెంతెంతకాల ముంచుకొన్నారో దేనిదగ్గర యెంతెంత డబ్బున్నదో అన్నిసంగతులు నాకు బాగా తెలుసును. ఈమాత్రం తెలియకపోతే నావెథవబ్రతు కెందుకు? ఈసంగతే తెలియకపోతే మీవంటి పదిమంది పెద్దమనుష్యులలో నేను తలయెత్తుకొని యేలాబతుకను?

మహా—వహ్వా వహ్వా. నాపరువుకుతగ్గ స్నేహితుడవు దొరికేవు. ఈమాత్రపు పెద్దమనుష్యుడవని యెన్నడూ యెరుగను. భోగమువాళ్ళజాతి యెరుగుదువు గనుక చెపుతా విను.

అతి—బోగమువాళ్ళ జాతిని సృష్టించుటలో భగవంతుడు మంచివాడు కాడంటావా యేమిటి? ఆమాటమాత్రం నే నొప్పుకోను. అటువంటిమాటలు వినను. భోగముజాతి చేయుటలో భగవంతుడు

చాలా తెలివైనపని చేసినాడు అందుకు వానికి మన మనేకనమస్కారములు చేయవలసియున్నది. అంత వుపయోగమైన జాతి లోకములో లేదు.

మహా—వోరి వెర్రిపాడుగట్టా! ఆమాట నే నెరుగనా యేమిటి నీవు వేరే నాకు చెప్పవలెనా? అంత వెధవక్రింద గట్టేవు నన్ను. నా మాన్యాలు, మళ్ళూ, తోటలూ, దొడ్లూ, యిళ్ళూ, వాకిళ్ళూ సమస్తమూకూడా భోగమువాళ్ళకోసం అమ్మేసిన ముండాకొడుకుని నేను భోగముజాతి మంచిది కాదంటానా? అది సృష్టించడములో భగవంతుడు మంచిపనే చేసినాడు, అందులో లోటేం లేదు. నే చెప్పబోయే లోప మదికాదు.

అంతి—అది కాకపోతే శాంతముగా వింటాను. శాంతముగా చెప్పు. వాళ్ళను తిడతావేమో అనుకొని నా మనస్సు చివుకుమన్నది.

మహా—అటువంటి పాడుపని నే నెప్పుడును చేసేవాడనుకాను. సంగతి చెపుతాను విను. భోగమువాళ్ళకు తల్లిముండలను సృష్టించుటలో బ్రహ్మదేవు డెంతైనా లోపం చేసినాడు ఆముండలు కొరివి దయ్యములవలె గుమ్మములో కూర్చుండి డబ్బు తక్కువైన విటులను వేధించి చంపుదురు. వీడి పుట్టి యేమి మునిగిపోయింది. అటువంటి సృష్టి సృజించకపోతే; పెద్దపులి కోరకాట్లైనా దినవచ్చునుగాని ఆ తల్లిముండ లనే సూటిపోటుమాటలు దెప్పుడుమాటలు ఎత్తిపొడుపులు పడడం చాలాకష్టము. ఆముండల మూలమున పడుచుభోగము వాళ్ళు పొగచెక్కి పోతున్నారు. లేకపోతే బంగారు తీగలవలె వాళ్ళు చెప్పినట్లు వస్తురు. "విటులపాలిటి యమదూత వేశ్యమాత" అన్నట్టి మాట అతిచాలా నిజము. యెంతమందికైనా చావున్నదిగాని ఆ ముండల కెన్నటికీ చావేలేదు. కాకపోయినా బ్రహ్మదేవుడి కెంతో పక్షపాతం. దేవత లంటే వాళ్ళకభిమానమెక్కువ. స్వర్గంలోకూడా

రంభ, ఊర్వసి, తిలోత్తమ మొదలైన వేశ్యలున్నారుకదా; దేవతా వేశ్యకాంతలకు తల్లులను సృష్టింపక మనుష్య వేశ్యకాంతలకు తల్లి ముండలను సృష్టింపుమని యీ బ్రహ్మదేవుడి కెవడు చెప్పినాడు. సృష్టి శక్తి నా చేతిలో నున్నదిగదాయని యిష్టము వచ్చినట్లు చేస్తాడా! కంటికి కనపడకుగాని కనబడితే పదిమంది పెద్దమనుష్యులలో బెట్టి యీడిపిస్తును. తల్లిముండలు లేకపోబట్టి స్వర్గములో వేశ్యకాంతలు హాయిగా తినవచ్చు తిరుగవచ్చు వుండవచ్చు భూలోకములో వేశ్యలు తల్లిముండల మూలమున కదలలేరు. మెదలలేరు.

అతి—నీవు చెప్పినమాటనాకు నసాళ్యాని కంటింది. నీమాటలు వేదాక్షరములే. ఆ తల్లి ముండలవల్ల యీ విటులు పడే బాధలు యిన్నీ అన్నీ కావు. నీతో నే వేరే చెప్పేదేమిటి. కనుక యిదిగాక మరియొక లోపం నేను చెప్తాను విను. కల్లు సారా మొదలైన పదార్థ ములకు వాసన కల్పించి బ్రహ్మదేవుడు లోకముల కెంతో అపకారము చేసినాడు. ఈ వాసన లేకపోతే గూనలో బోసినట్లు యెన్నికుంచముల సారాయైనా కడుపులో పోసుకోకపోదునా. దీనికడుపుగాల యీవాస నంటూ యొకటిపుట్టబట్టి యిది పుచ్చుకొని యే పెద్దమనుష్యుల దగ్గ రకూ వెళ్ళడానికి వల్లకాదు. నిషా మాత్రం వుండి మంచినీళ్ళవలె వాసన లేకుండా వుంటేనా? తాగి తాగి మరీతాగి యింకా తాగి చెడతాగి, దొర్లి దొర్లి భూలోకంలో స్వర్గసుఖము, వైకుంఠసుఖము, కైలాససుఖము అనుభవించనా? మతిమాలిన ముండాకొడుకా బ్రహ్మ దేవుడు గొప్పలోపం చేసేడు.

మహా—నిజమేరా బాబూ. వీడి లోపాలు యెన్నని చెప్పుకోం చెప్పుకుంటే కావలసినన్ని వున్నవి. ప్రొద్దుపోయినది. వెళు దాము. రా. (అని యిద్దరు నిష్క్రమించు చున్నారు.)

# లోభిపిశాచము

(అప్పుడు నాగభట్టను బ్రాహ్మణుని భార్యయగు కామమ్మయు
కూతురున్ను ప్రవేశించుచున్నారు)

కామ—(తనలో) ఏమోగాని నాతల తిరుగుచున్నది. ఈ పూట నేను వంటచెయ్యవలెను. పడుకుంటే నేకాని నాకుతోచడం లేదు. (ప్రకాశముగా) అమ్మాయీ, యీలారావే. ఈపూట మీ నాన్నకు అత్తిసరు వెయ్యమ్మా. నాకేమో వొళ్ళంతా భారముగా నున్నది.

అమ్మాయి—ఈమాట యిందాకానే చెప్పలేకపోయినావు. పెందలకడ మడిగట్టుకొందును. ఈవేళ కంచి సుదర్శనుడుగారు పోయిన పన్నెండోరోజు. నాన్నక్కడికి వెళ్ళినాడు. పాపము ప్రొద్దోయివస్తాడు. వచ్చేటప్పటికి వంట సిద్ధంగా వుండాలి.

కామ—పొద్దోయిరానీ పెందలకడరానీ నేను చెయ్యలేను వంట. నీవుచేసుకుంటే చేసుకో లేకపోతే మాటలాడక వూరుకో.

అమ్మాయి—అంతవిసుగెందుకేలమ్మా. పోనీ నీవు చెయ్యక పోతే నేను చేస్తానులే.

(అప్పుడు దానమిచ్చిన గోవును మెడకుపలుపుగట్టి తీసికొని
నాగభట్టు ప్రవేశించుచున్నాడు.)

నాగ—ఓసీ, ఏమిచేస్తున్నావు. సుదర్శనుడుగారికొడుకు గో దానమిచ్చినాడు. రా. చూడు. మహామంచిగోవే. దీనిసంగ్రహించాలా మంచిది. పాతికరూపాయిలు పెట్టికొన్నాడు. పూటకు రెండు శేర్లు పాలిస్తుంది. మనముబాగా మేపుకున్నామంటే యింకొక్క శేరు తప్పకుండా యిస్తుంది. ఆవు చూస్తే చాలాచిన్నది. మేత తక్కువతింటుంది.

పోటూతన్నా లేవు. చిన్నపిల్లవాడెళ్లి పాలు పితుకున్నాయిస్తుంది. రా. లేచి కాస్తచిట్టుపెట్టు పాపందీసికి.

అమ్మాయి—అమ్మ బద్ధకంగా పడుకుంది నాన్నా.

నాగ—(ఆపునువదలి) ఏమిటి పడుకుందా. ఏమిచెపుమా (అని దగ్గరకుపోవును.)

కామ—(గుడ్లెఱ్ఱజేసి పినిమిటిని చూచి పండ్లు పట పట కొరుకును.)

నాగ—ఇదేమిటి పండ్లు కొరుకుతున్నావు. మాట్లాడవేమి. కండ్లు చింతనిప్పుల్లాగున్నాయేమి? ఏమైనా జబ్బుగానున్నదా యేమిటి చెప్పు.

కామ—(అమాంతముగా లేచికూర్చుండి తలవిరియబోసికొని ముందుకు వెనుకకు ఊగులాడును.)

నాగ—ఇదేమిటే నీకు పిచ్చెత్తిందా దయ్యముపట్టినదా ?

కామ—హుం. ఏమిటీ. ఓసే యేమిటీ అంటావు. నేను నీపెళ్ళాననుకున్నావా యేమిటి.

నాగ—అయితే నీవెవరవు?

కామ—ఎవరినో యెరుగవు. తొందరపడకు తెలుస్తుంది లే.

అమ్మాయి—నాన్నోయి నాకు భయమేస్తోంది. నేను వెంకట శాస్త్రులుగారియింటికి పరుగెత్తుతాను (అనిపోవును)

నాగ—నీవెవరవో నీకేమికావాలో చెప్పు. లేకపోతే ముంత పొగపెట్టించి మంత్రగాడిని పిలిపించి మారణహోమము చేయిస్తా.

కామ—ఓరి దొంగబ్రాహ్మణా ! నీవటా) నన్ను మారణ హోమము చేయించేవాడవు. నేనెవరినో తెలుసునా? నాపేరు కంచి సుదర్శనుడు.

నాగ—ఓరి నువ్వా! ఒక మూలింటా సాపిండమైనా తిన్నగా కాలేదు. అప్పుడే దయ్యమైనావు. నీకు గతులులేవురా.

కామ—నాకు గతులు లేవూ. నీకున్నాయీ గతులు? నా తమాషా చూపిస్తాను. చూచుకో. నాకొడుకు కుట్టిముండాకొడుకు కదా యని వాడిని బెల్లించి నా దినవారాలకి కర్చెక్కు_వ చేయించి నాసొమ్మంతా పాడుచేయిస్తావా? పైగా పాతికరూపాయలు పెట్టి గోవు ను కొనిపించి ఆదానము నీవు పుచ్చుకుంటావా ? ఈగోవు నీకు దక్క_ నిస్తానా. నీవు నీపెండ్లాము నీబిడ్డలూ యీపాలు తాగుతారా ? నెత్తురుచుక్కలు పడనిస్తానుకాని పొదుగులోనుంచి పాలు పడనిస్తానా నీగొంతుక్కి_ అడ్డంపడతానుకాని పాలొక్కచుక్క_ దిగనిస్తానా. సుదర్శనుడు చచ్చిపోయినాడుగదా, కొంపలో కుక్క_లాదూరి యిష్టము వచ్చినట్లు తిందామనుకున్నావా ? పీకి నులిమివేస్తా. డుంప తెంపివేస్తా. మచ్చమాపివేస్తా. రాత్రి రెండుజాములవేళ కొంప తగలేస్తా. (గుండె బాదుకొని) అమ్మయ్యో! పాతికరూపాయ"గోవే పాతికరూపాయల గోవే. పాతికరూపాయలగోవే నాజన్మమెత్తి నేనెప్పుడూ కొనలేదు. నాకు జబ్బుగానున్నపుడు వైద్యుడు పాలపథ్యముచెపితేనయితం ఆవును కొనక కూతురత్తవారింట్లోను కొడుకత్తవా రింట్లోను పాలు తెప్పించుకొని కాలక్షేపము చేశాను యెరుగవూ? దొంగ ముండాకొడకా! డొక్క_లో నిద్రపోతాను జాగ్రత్తా. నాకొడుక్కి_ నెలకు అర్థరూపాయి వడ్డీ పోగెడతావా. నీదానంమండా. నీమంతాలిమీద నిప్పులో య్యా, మంచావు మంచావు, అటూ కులుకుతూవచ్చావా. నీకులుకు కనపరుస్తానుండు.

నాగ—అల్లాగనరు నీకు గతులుండవు. దానితోకట్టుకుంటే నీకు గతుంది.

కామ—నాకు గతులొద్దురోయి. నాపాతికరూపాయలు నాకు కావాలిరోయి. ఆగోవుతోక నేను పట్టుకోలేదు. ఇకముందు పట్టు కోను. నేను వైతరణీనదిలో యీది వెడతాను కాని యీగోవుతోక పట్టుకోను.

నాగ—అయితే యేమంటావు? ఈగోవును మీఅబ్బాయికి యిచ్చివేతునా ?

కామ—గోవు మాఅబ్బాయికెందుకు వాడికిస్తే నాపాతికరూపాయలు పెట్టెలో పడతాయా? నాఅర్ధరూపాయవడ్డీ వస్తుందా?

నాగ—అయితే యేమి చెయ్యమంటావుమరి.

కామ—చెపుతావిను. దీనికి ఖరీదు పాతికరూపాయలు, కొన్నరోజు మొదలుకొని అయినవడ్డీ, కొన్నప్పటినుంచీ పెట్టిన మేతఖరీదు, ఆమేతఖరీదుకైన వడ్డీ, దూడ కన్నెఖరీదు పలుపుఖరీదు దానికైన వడ్డీ నాకొడుక్కి నీవిచ్చి యీయావును నీదగ్గరే వుంచుకో. లేచా నీవంశనాశనము చేశాననినమ్ము.

నాగ—నీదానంమండా యెరక్కపోయి పుచ్చుకొన్నాను. ప్రాణంమీది కొచ్చిందినాకు. ఆలాగే యిస్తాను. కాని నీకొడుకు పుచ్చుకొంటాడేమో?

కామ—పుచ్చుకోకపోతే వాడిదుంప తెంపెయ్యనూ. తప్పకుండా పుచ్చుకుంటాడు. ఇయ్యి. నీవు రూపాయలు చేత్తో పట్టుకోగానే నే వదిలిపోతాను.

నాగ—(పెట్టెతీసి ముప్పదిరూపాయలు చేతితోపట్టుకొని) ఇదిగో పట్టుకువెడుతున్నాను. వదిలిపెట్టు.

కామమ్మ—(దయ్యమువదలిపోగాలేచి) అమ్మయ్యా, నే నింతసేపూ నిద్రపోయినాను కాబోలు! లెండి మీకు ప్రొద్దుపోయినది మడిగట్టుకోండి.

నాగ—సరి నీ విప్పుడే స్నానముచెయ్యి. నేనింతలోకే పనిమీదవెళ్ళివస్తాను.

(అని నిష్క్రమింతురు.)

# ప్రశ్నలు

1. ఒకానొక మనుష్యుడు కలడు. ఆయనగారి నోటనువుగింజ నానదు. ఎంత రహస్యమైనసంగతి విన్నను వెంటనే యెవరి చెవిలో నైనను ఊది తీరవలెను. లేకపోయినచో ఆయనకడుపు పుబ్బునట. ఈ విపరీతజాడ్యమునకు యేదైన మంచియవుషధమున్నపక్షమున ఆయనకదియిప్పించవలెనని యున్నది. అది యునానిమందుగాని, యింగ్లీషు మందుగాని, తెలుగుమందుగాని, గ్రామస్థు లందరు చందావేసికొని యెంతఖరీదైననుసరే కొని ఆయన కిప్పించదలచుకొన్నారు. కాబట్టి ప్రపంచమందలి ఘనవైద్యు లందరు, యిదివర కీజాడ్యమున కేదైన మందున్నపక్షమున దానిపేరు చెప్పవలసినదని కోరుచున్నాను. ఇదివర కేమందు లేకపోయినపక్షమున క్రొత్తగ ప్రకృతిశాస్త్రసహాయముతో నేదైనకనిపెట్టి ఆగ్రామస్థులకు మహోపకారము చేయవలెనని కోరుచున్నాము.

2. ఇరువది సం॥ ముల వయస్సుగల పిల్లవాడున్నాడు. అతని కజీర్ణరోగము పట్టినది. పాపమత నెంతో జాగ్రతగాను, పథ్యముగాను ఉంటాడు. అయినప్పటికి పాడువ్యాధి పట్టుకొని అతనిని బాధించుచున్నది. ఉదయమున లేచి యతడు కాఫీకొట్టుకువెళ్ళి ఒకడజను యిడ్డెనలను చులకనగాలాగి, పావలా ఉపమా నిమ్మకాయ ప్రమాణముగల మాత్రలుచేసి, కంచెంబుడు వెచ్చనికాఫీ యనుపానముతో దిగ మ్రింగి, అంతలో పైత్యించకుండా ఒక అరడజను పెసరట్లుచప్పరించి యింటికి వెళ్ళేటప్పుడు దారిలో 4 చుట్టలు కాల్చి మూడు కాశాకిల్లీలు నమలి మెల్లగా యిల్లు చేసునప్పటికి 9 గంటలగును. అప్పటికి వంట తయారై యుండుట చూడగనే నీర్సమునచ్చి చప్పున నాలుగుచెంబులు

నీళ్ళు పోసికొనియో, పోసికొనకయో, పట్టుపంచ చుట్టబెట్టుకొని
విస్తరిముందు కూర్చుండి పప్పు, రెండు కూరలు, రెండుపచ్చళ్ళు, పులు
సు కమ్మని పెరుగు వీటితో శుష్టుకృత్తుగా భోజనముచేసి, 4 చుట్టలు
కాల్చి తరువాత తాంబూలము వేసికొని కొంచెముసేపు పక్కమీద
దొర్లేటప్పటికి రెండుగంటలై పోతుంది. లేవడంతోనే ఫలహారం
తయారై యుండును గనుక దానినిఁదోసివేయజాలక ఒకతవ్వెడు వేపు
డటుకులు, తవ్వెడు కారపుబూంది తిని మరల శేరుగిన్నెతో గిన్నెడు
తేయాకునీళ్ళుతాగి తిరిగి చుట్టలుకాల్చి, కారాకిల్లీలు నమలి చీట్లపేక
దగ్గర కూర్చుండి కొత్తగావచ్చిన అణాకానులు బేస్తులుపెట్టి కొంతసే
పాడునప్పటికి నీరసపెట్టగా సత్తుగిన్నెడు మజ్జిగతేట త్రాగి, నాలుగు
బొంతరటిపండ్లుతిని కొంచెముసేపు కబుర్లాడునప్పటికి రాత్రి నంట
యగును. మరల యీభోజనపుబాధ తప్పించుకొనలేక, కడుపు నొప్పి
వద్దని యేడుస్తూంటే, అతడు బలవంతముగ మొగమోటపడి పప్పు
పులుసు, కందిపచ్చడి, అప్పడములు, వడియములతో తలచినదాని
కంటె యెక్కువ తిని, భోజనమైనతరువాత నిద్రించుటకు పండుకొని
తెల్లవార్లు నిద్రపట్టక కొంతసేపు కలవరించుచు, కొంతసేపుమిడిగుడ్లతో
కండ్లుతెరచి చూచుచు, మొత్తముమీద రాత్రి యంతయు ఆప
శోపములు బడుచు నెట్టెటోగడపివేసి కాకులు కావుకావుమనునప్పటికి,
'కాఫీ కాఫీ' యనుచు లేచి మరల సూర్యోదయము చూడగలుగును.
ఈతడు ముద్ద నోట్లో వేయగనే అది టపాపెట్టెలో వేయు ఉత్తరమట్లే
కడుపులోనికి జారునేకాని అతడు పండతో నములుపద్ధతి యెన్నడు
లేదు. పాపమీయనకు మధ్యమధ్య కడుపుబ్బరము మొదలగు
అజీర్ణలక్షణములు కనపడుచుండునట. ఈయనకు కాఫీ యనుపాన
ముతోకాని మజ్జిగ తేట యనుపానముతోగాని మందిచ్చిన పరమసంతో
షము. సత్యనారాయణ ప్రసాదముతో కాని, బాదంహల్వాతో కాని

మాటుపెట్టి యిచ్చినయెడల మందుపుచ్చుకొనుట కాయాన కేయాటంకము లేదు. అతడు అరఖులుగాని, కషాయములుగాని, వాముురసము మొదలగు రసములు కానియెప్పుడు మింగడు. మందు తియ్యగా లేనిపక్షమున వైద్యుని మొగముమీాద వేసి కొట్టును. ఈయన నిత్యము చేయుచున్న పథ్యము తప్పించకుండ యెవరైన మూడుపూటలలో రోగము కుదిరే మందియ్యగలరా? ఇవ్వగలిగినపక్షమున తక్షణాతిండిపోతు తిరుపతియ్యగారికి, యుడ్డెనల వీధి, కాఫీపురము అని వ్రాయవలెను.

3 ఒకనికి గ్రహబాధ కలిగినది. తక్కినగ్రహములవంటిదికాదు ఈగ్రహము వేరుగ్రహము. ఈగ్రహము పూనినప్పు డాయనకు వళ్ళు తెలియదు. ఈగ్రహబాధ నివారింపగల మంత్రవేత్త లెవరైనా యున్న పక్షమున వారికి గొప్పబహుమాన మీాయబడును. అట్టివారు కోపాల గుండయ్యగారికి వ్రాయవలెను.

---

# దశమగ్రహము

(ఇంద్రుడు నారదుడు ప్రవేశించుచున్నారు).

ఇంద్రు—నారదమునీంద్రా! మీారిప్పు డేలోకములోనుండి దయచేయుచున్నారు?

నార—నే నిప్పుడు భూలోకమునుండి వచ్చుచున్నాను.

ఇంద్రు—అక్కడ విశేషము లేమి? వింతలు మీా చెవిని బడక పోవు.

నార—అనంతమై విశాలమైన భూమియుండగా వింతలు పుట్టకుండునా? ఎప్పటికప్పు డేదో వింత బయలుదేఱుచునేయుండును.

ఇంద్ర—అట్టివింతలేవో విన వేడుకపడుచున్నాను.

నార—అట్లైన చెప్పెద వినుండు. భూలోకములో జనులు క్రొత్తగ్రహము నొకదానిని కనిపెట్టినారు.

ఇంద్ర—ఏమేమీ! ఇదివరకున్న నవగ్రహములుగాక క్రొత్త గ్రహము బయలుదేఱినదా ?

నార—ఆహా బయలుదేఱినది. ఈగ్రహము ఇదివరకున్న నవగ్రహములకంటె విలక్షణమైనది.

ఇంద్రు—ఆ గ్రహముయొక్క లక్షణములేవో సెలవియ్యవలయును. వినుటకు నాకెంతో ఆతురముగనున్నది.

నార—చెప్పుటకుగూడ నాకెంతో యాత్రముగ నున్నది. ఇంతమాత్రమడిగినవారు లేరని నేను విచారించుచున్నాను. సూర్యుడు చంద్రుడు బృహస్పతి అంగారకుడు బుధుడు మొదలగు గ్రహములాకాశమున సంచరించుచుండును. క్రొత్తగా కనిపెట్టిన యీ దశమ గ్రహము భూమిమీదనే సంచరించుచుండును.

ఇంద్రు—గ్రహములు రాసులలో సంచరించునుగదా! రాసులన్నియు నాకాశముమీదనే యున్నవిగదా! భూమిమీద తిరుగునట్టి గ్రహము ఆకాశముమీదిరాసులలో నెట్లు సంచరింపగలదు?

నార—ఆ రాసులన్నియు గాకపోయినమానె కొన్ని రాసులైన భూమిమీద గలవు. ఈగ్రహ మన్నిరాసులలోను దిరుగదు. కొన్నిరాసులయందుమాత్రమె సంచరించును.

ఇంద్రు—ఆరాసులేవి ?

నార—ఈగ్రహము మొదట కన్యారాశిలో నుండును. తరువాత నిరంతరము మిధునరాశిలోను కుంభరాశిలోను దృష్టిగలిగి యుండును.



ఇంద్రు—ఇది క్రూరగ్రహమా, శాంతగ్రహమా?

నార—ఇది యెల్లపుడు వక్రగ్రహము. ఎల్లపుడు క్రూర గ్రహము.

ఇంద్రు—ఈగ్రహ మెవరికి కీడుగలుగ జేయును? ఎవరికి మేలు కలుగజేయును?

నార—ఈగ్రహము జన్మస్థానమునకు మేలుకలుగ జేయుచు ఆడ పిల్లలుగల తలిదండ్రులకు సదా కీడు చేయుచుండును.

ఇంద్రు—వారి కేవిధమైనకీడు చేయుచుండును?

నార—వారియిండ్లు భూములు నమ్మించును. యావజ్జీవము మనస్సునకు బెంగకలిగించును.

ఇంద్రు—ఈగ్రహమునకు శాంతియెట్లు?

నార—ఆడపిల్లలుగలవారు నిరంతరము హిరణ్యదానముచేయు చున్నపక్షమున ఈగ్రహముయొక్క క్రూరత్వము కొంత శమించును. అప్పటికి శాశ్వతముగ శమింపదు. తాత్కాలికముగ శమించును.

ఇంద్రు—ఈగ్రహమునకును శనిగ్రహమునకును భేదమేమి?

నార—ఈగ్రహముకంటె శనిగ్రహమే చాల మంచిది. ఎందు చేతననగా శనిగాడు యేడుసంవత్సరములుమాత్రమే మనుష్యు నాశ్ర యించి బాధపెట్టును. ఏలినాటిశనిగూడ దీనివలె క్రూరముగా నుం డదు. ఈగ్రహము ఆశ్రయించినవారిని యావజ్జీవము బాధపెట్టును. ఇంకొక విశేషముగూడ కలదు. మందపల్లి వెళ్ళి నూనితో అభిషే కము చేసినపక్షమున శనిగాడు శాంతించును. కనకాభిషేకముచేసిన గాని యీగ్రహము శాంతింపదు. శనిగాడు తిలదానముతో శాంతిం చును. ఈగ్రహమునకు అన్నదానము వస్త్రదానము భూదానము హిరణ్యదానము మొదలయిన వెన్నిచేసినను శాంతింపదు. వెయ్యేల! యింత పాడుగ్రహము లేదు. ఈగ్రహమువలన బాధపడనివారు లేరు.

ఇంద్రు—ఆగ్రహముపేరేదో చెప్పి నన్ను సంతోషపెట్టు.

నార—ఇది జామాతృగ్రహము. అనగా అల్లుడు గ్రహము.

ఇంద్రు—(నవ్వి) ఇదటయ్యా! నీవుచెప్పిన గ్రహము. సరే! యిప్పుడు తెలిసినది. కుంభరాశి అనగా అన్నపురాశి, మిధునరాశి అనగా దంపతులరాశి. మిక్కిలి చమత్కారముగ చెప్పినావే. పరమేశ్వరానుగ్రహముచేత నీపదియవగ్రహ బాధ మన స్వర్గలోకమునకు లేదు నయమే. ఇంతక్రూరగ్రహమైనపక్షమున పాపము భూలోకజను లేవిధముగ బాధపడుచున్నారోగదా!

నార—బాధోగీధో నేనెరుగనుస్వామీ! చదువుకొన్నవాడని లేదు, చదువుకోనివాడని లేదు. ఆస్తి కలవాడనిలేదు, లేనివాడని లేదు. గుడ్డిగవ్వ చెయ్యనివాడు గడ్డిపరక చేయనివాడుగూడ అల్లుడు కావలెనంటే వేలకొలది కట్నములు కానుకలు తెమ్మని ఆడుపిల్లలతండ్రిసంసారము దిబ్బచేయును. ఈకట్నముల యాశలోబడి పిల్లయొక్కవంశము చూచుటలేదు. పరువులేదు. ప్రతిష్ఠలేదు. మరియాదలేదు. లోకాపవాదభీతిలేదు. ఆడపిల్లలగన్న తండ్రియనగాను వాడొక బానిసవాడని అల్లునియొక్కయు, అల్లుని బంధుగులయొక్కయు అభిప్రాయము. ఈదురవస్థకు పారములేకయున్నది.

ఇంద్రు—ఈదశమగ్రహమునకు దగినశాంతి యెట్లు చేయవలెనో నేను బృహస్పతితోడ నాలోచించెదను. రండి వెళ్ళుదము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

---

# కటుకుల గంగయ్య

ఒక దేశమున తెలివిమాలినరాజు పరిపాలించు చుండెను. అతని రాజధానిలో గంగయ్య యను బ్రాహ్మణుడుండెను. ఆబ్రాహ్మణుడు

తన కేవృత్తియు లేకపోవుటజేసి తన జీవనోపాయమునకై రాజుగారి నాశ్రయించెను రాజు నానిపై దయ దలంచి ఇట్లని యానతిచ్చెను. "బ్రాహ్మణుడా! ఈయూరిలో చనిపోయెడు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య, శూద్రుల, శవములను మోసుకొనిపోవుటకై వెదుళ్ళతో నీవు కటుకులుకట్టి యిచ్చుచుండుము. ఎవరియింటనైనను మరణము సంభవించిన పక్షమున గృహయజమానులు నీ కాసంగతి తెలియ జేయుదురు. నీవు వెంటనే యొక కటుకు కట్టి వారియింటికి పంపించవలెను. ఇందుకునీకు రెండుపుట్లభూమి మాన్య మిచ్చెదము. దానికి కటుకుల మాన్యమని పేరు." అని రాజుగారు సెలవియ్యగానె బ్రాహ్మణుడు మిక్కిలి సంతోషించి మాన్యము స్వాధీనముచేసుకొని గ్రామములో చనిపోయినవారందరికి కటుకులుకట్టి యిచ్చుచుండెను. ఇట్లుండగా గంగయ్యకు బంధువులను చూచుటకై గ్రామాంతరము వెళ్ళ వలసిన పని సంభవించెను. వెళ్ళినతరువాత వెంటనే వచ్చుటకు వీలు లేక పోయెను. పదిదినములాలస్యమయ్యెను. ఆ దినములలో గ్రామస్థులలో నొకడు మృతినొందెను. ఆయింటి యజమానుడు గంగయ్య గ్రామాంతరము వెళ్ళినమాట యెరుగక కటుకు కట్టుకొనిరమ్మని వర్తమానము చేసెను. భర్త గ్రామాంతరము వెళ్ళెనని భార్య మరల వర్తమానమంపెను. ఆమాటవిని మృతినొందినవాని కుమారుడు గంగయ్య యింటికివెళ్ళి. భార్యను బిలిచి యామెతో కలహమాడి భర్తను నిందించెను. అంతటితో తృప్తిపొందక యతడు గంగయ్య సరిగాపనిచేయుట లేదని రాజుగారితో ఫిర్యాదుచేసెను. గంగయ్య గ్రామాంతరము నుండి వచ్చినతరువాత జరిగిన వృత్తాంత మంతయు భార్య అతనితో చెప్పెను. ఆసంగతివిని యాతడెంతో భయపడుచుండగా రాజుగారు వానిని తనయెదుటకు రమ్మని యాజ్ఞాపించిరి. అతడు భయముచే గడగడ వణకుచు రాజుగారి సన్నిధికరిగి యొక స్తంభమునుజేరబడి నిలు

చుండెను. రాజు వానినిజూచి కోపముతో మండిపడి యిట్లనియె: "సోమరిపోతా! గ్రామములో వారికి కావలసి వచ్చినపుడు పనిచేయక నీ యిష్టమువచ్చినప్పుడు పోకుగూళ్ళు పోయెదవా? కటుకులు గట్టుటకు నీ తాత యొకడైనా వున్నాడా! కమ్మగా మాన్య మనుభవించుటకు నీవును కటుకులుగట్టుటకు మరియొకరునా? నీ కింత పొగరెక్కినదా? మంచిది నీపొగ రణగించెదనులే నీ మాన్యము తీసివేసెదను." ఆ పలుకులు వినగానే గంగయ్య మరింత భయపడి రాజుగారి పాదములవద్ద కూలబడి రెండుకాళ్ళు బట్టుకొని యిట్లు వేడుకొనెను—

"ఏలినవారు రక్షించవలెను. మీరు రక్షించకపోతే నాకు దిక్కెవరు? మీ దయవల్ల నేనూ నా బిడ్డలు యింతన్నముదిని బ్రతుకుచున్నాము. ఏలినవారు మాన్యము తీసుకుంటే నేనూ నా బిడ్డలు గంగపాలై పోవలసినదే. ఇకముందు నే నిట్టితప్పు చేయను. ఇకమీదట నావల్ల యిటువంటిలోపము వచ్చిన పక్షమున నా మాన్యము లాగుకొని ఏలినవారు నన్నుప్పుపాతర వేయించండి. ఇప్పటికి నన్ను క్షమించండి. నా పనిలో నిక నెన్నడు లోటులేకుండా చేసికొందును." అని పలికి మరియు బహువిధముల ప్రార్థించుటచేత రాజుగారి కాయనయందు మరల యనుగ్రహము కలిగెను. గంగయ్య బ్రతుకుజీవుడా యని యింటికివెళ్ళి తాను గ్రామాంతరము పనిమీద వెళ్ళినను తనవల్ల గ్రామస్థుల కిబ్బంది లేకుండుటకై యెన్నో యుపాయము లాలోచించెను. చిట్టచివర కతనికొక గొప్పయుపాయము తోచెను. ఆ యుపాయముప్రకార మతడు వెయ్యి వెదుళ్ళుకొని నాలుగు వందల కటుకు లొకసారియే కట్టెను. అందులో కొన్ని పొడుగుపాటివి కొన్ని పొట్టివి, కొన్ని వెడల్పువి. కొన్ని సన్నవువి. కొన్ని పెద్దవి. కొన్ని చిన్నవి. కొన్ని లావు వెదుళ్ళతో గట్టినవి. కొన్ని సన్నవు వెదుళ్ళతో గట్టినవి. ఇట్లు పదిహేనురోజులు రాత్రి పగలు కష్టపడి తాను

పెండ్లాము బిడ్డలుకలిసి నాలుగు వందల కటుకులుకట్టి వాటినన్నిటిని బండ్లమీద వేయించుకొని యింటింటికివెళ్ళి బండ్లాపుజేసి యొక పెద్ద కటుకు యొక చిన్నకటుకుతీసి వారి యరుగుమీద బెట్టించి యింటివారితో ఇట్లని చెప్ప మొదలుపెట్టెను—"అయ్యా, నా కప్పు డప్పుడు గ్రామాంతరము వెళ్ళవలసిన పనియుండును. అప్పుడు మీ యింటిలో నెవరైన చనిపోవచ్చును. పోయినప్పుడు కటుకులు లేక మీ రిబ్బంది పడవచ్చును. అందుచేత నా మాన్యము పోవచ్చును. గంగయ్యమూలమున మే మిబ్బందిపడినామని మీ రనుకోకుండ ముందే కటుకులుకట్టి తీసుకొని వస్తిని. ఒక పెద్ద కటుకు యొకచిన్న కటుకు మీ యింట్లో నుంచుకొండి. పెద్దవాడుపోయినపుడు పెద్దదుపయో గించుకోవచ్చును. చిన్నవాడు పోయినపుడు చిన్న దుపయోగించుకో వచ్చును." ఆమాటలువిని ఇంటి యజమానులు స్త్రీలు "ఛీ, ఛీ, దుర్మార్గుడా, పాపాత్ముడా, ఎంతమాటన్నావు. నీ కిదేమి పోయ్యేకాల మురా" యని దూషింప మొదలుపెట్టిరి. కొందరు గట్టిగా తిట్టిరి. కొందరు చంపకాయలుకొట్టిరి. కొందరు పీసెగుద్దులు రుచి చూపిరి. కొందరు కర్రలుపుచ్చుకొని మీదికివచ్చిరి. గంగయ్యభయపడి కటుకుల బండి వదలిపెట్టి పిక్కబలమే శరణ్యమని లేడిలాగు పరుగెత్తిపోయెను. అప్పటికిప్పటికి తిరిగి యిల్లుజేరలేదు. వారిల్లు గ్రామము చిన్నబోయి నదిగనుక యీ చదువరులలో నెవరికైన గనిపించినపక్షమున వాని నింటికి పంపించి పుణ్యము గట్టుకొందురుగాక!



# కలిగీత



ఈలోకములో ధర్మోపదేశములు చేయునట్టి గ్రంథము భగవద్గీతయొక్కటేయని మనవారు తలచుచున్నారు. భగవద్గీతకంటె నెక్కువగ మహాధర్మములను బోధించునట్టి మహాగ్రంధము మరియొకటికలదు దానిపేరు కలిగీత. ఇది మహాత్ముండైన కలిపురుషుడు తనప్రియశిష్యుడైన అహంకారున కుపదేశించిన వేదాంతశాస్త్రము. ఈశాస్త్రమే ప్రస్తుతము లోకమునందన్ని ఖండములలో నెల్లదేశములలో నెల్లజాతులలో చాలవ్యాపించియున్నది. ఈశాస్త్రమేయిందు బ్రకటింపబడును దీనిపూర్వవృత్తాంత మీలాగుననున్నది.

కాలపురుషుడను నొకరాజునకు జ్ఞానదేవి మాయాదేవి యను నిద్దరు భార్యలుగలరు. జ్ఞానదేవికి వివేకుడు సత్యుడు ధర్ముడు కృపుడు శౌచుడు అనునైదుగురు కుమారులుగలిగిరి. మాయాదేవికి అవివేకుడు క్రూరుడు దంభుడు లోభుడు అహంకారుడు కాముడు క్రోధుడు లోభుడు మోహుడు మదుడు మత్సరుడు మొదలగు నూరుగురు కొమారులు గలిగిరి. లోకపరిపాలన విషయములో వీరికిరువురకును వివాదములు పుట్టెను. అవివేకుడు అహంకారుడు మొదలగు మాయాదేవి పుత్రులు బహువిధకపటోపాయములచేత సవతితల్లి బిడ్డలను పట్టణములనుండి పల్లెలనుండి పారదోలి మహారణ్యములలో మునిపల్లెలయందు మాత్ర ముండునట్లుచేసిరి. వివేకుడు మొదలగు జ్ఞానదేవి పుత్రులు, అప్పుడప్పుడు చాటుచాటున నరణ్యములనుండి పట్టణములకు పల్లెలకు వచ్చి యెక్కడో మూలమూలలనున్న యొకానొకసత్పురుషునియింటబసచేసి, బహురహస్యముగ దేశమువెంట తిరుగుచుండురు. జనులలోననేకులకు [illegible] గాని బల

వంతులు పరాక్రమవంతులు నైన అహంకారుడు క్రోధుడు మొదలగు వారికి జిడిసి బహిరంగముగ వివేకాదులతో మాట్లాడరు. అవివేకుడు అహంకారుడు మొదలగువారికి మొదటినుండియు కలిపురుషుడు దైవము. ఆతని సహాయముచేతనే వీరందరు జయింపగలమని నమ్మికొని యుండిరి. కలిపురుషుడును వారినందరిని తనపుత్రులవలె భావించి వారికి సకలవిధముల సహాయము జేయుచు వారిరాజ్యసంపాదనము తనరాజ్యసంపాదనముగ వారివైభవము తనవైభవముగ నెంచి సంతోషించుచుండును. ఇట్లుండగా వివేకుడు మొదలగువారు దేశములో చాటుచాటున దిరుగలేక అరణ్యములోనుండి బాధపడలేక దేశముల లోనున్న ప్రజలందరు అవివేకుడు మొదలగువారిచేతబడి పాడైపోవుచున్నారని జాలినొంది బహిరంగముగ వెలుపలకువచ్చి అవివేకుడు మొదలగువారితో యుద్ధము చేయ నిశ్చయించుకొనిరి.

ఈయుద్ధము పుణ్యక్షేత్రమైన (మనస్సు) అను క్షేత్రమునజరిగెను. కాలపురుషునకు మాయాదేవిపుత్రులయందే అభిమానమతిశయముగ నుండుటచే వారిగెలుపునే కోరుచు ఆయుద్ధమేప్రకారముగ జరిగినదో వినవలయునని తనసేవకుడైన మారుతుడనువానిని పిలిపించి అడిగెను మారుతునకు జ్ఞానదేవతా ప్రభావమువల్ల యుద్ధములోజరిగిన సంగతులెల్ల కండ్లకుగట్టినట్లు కనబడుచువచ్చెను. అందుచేతనతడు జరిగినదంతయు రాజపురుషునకు ఫూసగ్రుచ్చినట్లు తూచా తప్పకుండ సమస్తమును వివరించెను. ఆసందర్భములో కలిపురుషుడు, అహంకారున కుపదేశించిన గీతాశాస్త్రమును కాలపురుషునకు నీక్రిందివిధముగ నుపదేశించెను:—

కాలపురుషఉవాచా—కాలపురుషుడడుగుచున్నాడు.

"ఓయిమారుతుడా ధర్మక్షేత్రమైనమనసును క్షేత్రమునందు నా ప్రథమభార్యపుత్రులగు వివేకుడు మొదలగువారును రెండవభార్య

బిడ్డలైన యవివేకుడు, అహంకారుడు మొదలగువారును, యెట్లు యుద్ధము చేసిరో తెలియజేయుము.

మారుతోవాచా-మారుతుడుపలుకుచున్నాడు.

" దేవా చిత్తగింపుము అట్లు వివేకుడు మొదలగు నీమొదటి భార్యబిడ్డలు తమకు ధర్ముడనువానిని సేనాధిపతిగ చేసికొని యుద్ధమునకు వెళ్ళిరి. అంతకుముందే యవివేకుడు మొదలగువారు తమకు అహంకారుని సేనాధిపతిగ జేసికొని యుద్ధసన్నద్ధులైవచ్చిరి. అహంకారునకు కలిపురుషుడు సారథియై యుద్ధరంగమునకు వచ్చెను. ఆతడు రథమును తోలుటకే ఒప్పుకొనెనుగాని యుద్ధము చేయుటకు ఒప్పుకొనలేదు. ఆతడు తమపక్షమున నున్నంతమాత్రముచేతనే జయముగలుగునని యహంకారుడు మొదలగువారు కలిపురుషునియొక్క ఇచ్ఛాప్రకారమే నడచిరి. ఉభయసేనలు యుద్ధరంగమున జేరినతరువాత, మహావీరులందరు శంఖధ్వనులు చేసిరి. అంతట అహంకారుడు కలిపురుషునిజూచి "మహాత్మా! నారథము ఉభయసేనలమధ్యను నిలుపుము. నేనెవరితో యుద్ధము చేయవలయునో యట్టిసైనికుల నందరనొక్కసారి చూడవలయు" నని బలికెను. అప్పుడు కలిపురుషుడు సరేయని రథము నుభయసేనల మధ్యముననను నిలిపెను. నిలుపగానే యహంకారుడు తనశత్రుసైన్యమువంక నొక్కమారు పారజూచి వివేకుడు మొదలగువారిని కనుగొని చేతిలోనున్న విల్లునమ్ములు క్రిందపారవైచి రథముమీదచతికిలబడి విషాదముతో కలిపురుషునకిట్లనియె. "భగవానుడా కలిపురుషుడా! నీవు సర్వవ్యాపివి. సర్వజ్ఞుండవు సర్వశక్తుండవు. నీకు తెలియని రహస్యములు లేవు. అయినను నామనోనిశ్చయము నీకు చెప్పెద వినుము వివేకుడు మొదలగువారును మేమును ఒకతండ్రిబిడ్డలము. అన్నదమ్ముల వధియించుట యుక్తముకాదు. మరియును వారందరు మిక్కిలి మంచివారు. అట్టి మంచివారిని సంహరించి యీలోక

మంతయు నాక్రమించి పాపపుభోగముల ననుభవించుటకంటె మేమే యరణ్యములలోనికి బోవుట యుత్తమమని తోచుచున్నది. మంచి వారిని నాశనము చేయుట పాపము. వారిదివరకే మేము పెట్టిన బాధల వల్ల చిక్కి శల్యములైయున్నారు. మే మిప్పుడు కొట్టక యూరకుండినను తలదాచుకొనుటకు స్థలములేక తినుట కన్నములేక వారంతటవారే నశింతురు. శేతులార మేము చంపనక్కఱలేదు. ఇట్లు జరుగునాయని నీవు సంశయపడనక్కరలేదు. వారునిలుచుటకై గోష్పాదమంతభూమి యైనను మే మియ్యమని ఇదివరకే వర్తమాన మంపినాము ఎన్ని విధములచేత చూచినను వారు వృద్ధిపొందరు ఆ వివేకమహారాజువంక జూడుము. ఏకుముక్కవలె తెల్లగ పాలిపోయి బక్కచిక్కి యెట్లున్నవాడో! సగము చచ్చినవారిని మనమిప్పుడు చంపనేల ? అదిగాక నేనెంతశాతి గుండె కలవాడనైనను వివేకాదులను నిర్మూలించుటకు నాచిత్తమే యొప్పుకున్నది. కావున నారథమువతలకు తోలుకొనిపోయి నన్నొక యరణ్యమున జేర్పుము.

ఇది అహంకారుని విషాదయోగమను
ప్రథమాధ్యాయము.

---

## రెండవ అధ్యాయము.

అహంకారుడట్లు మహావిషాదముచే రథముమీద కూలబడి యుద్ధముచేయుట కిష్టములేక యరణ్యవాసమును గోరుచుండగా, మహాత్ముడైన కలిపురుషుడు వాని వీపుమీద చెయ్యివైచి తట్టి భయము తీర్చుటకై గాఢాలింగనము చేసికొని తలనిమిరి వాని ప్రక్కనే గూర్చుండి మంచుపలుకులవంటి చల్లని పలుకులతో వాని కీక్రిందివిధముగా తత్త్వోపదేశము చేసెను.

కలిపురుషఉవాచ - కలి పలుకుచున్నాడు.

ఓ వెఱ్ఱివాడా! అహంకారుడా! నీధనస్సుయొక్క టంకారము చూచి నీ ఝంకారము చూచి, నీవెంతో ధైర్యవంతుడవు గంభీరుడవు ననుకొంటినిగాని యినుమువలె నుండవలసిన నీహృదయము నవనీతమువలె నున్నదని యెన్నడును నే నెరుగకపోతిని. ఇంత మెత్తని వాడవన్నమాట నాకిప్పుడు తెలిసినది. మనకు సహజముగా విరోధులైన వివేకుడు మొదలయినవారిని మనము చంపకపోతిమా లోకమంతయు వారే యాక్రమింతురు. నీవు నాశిష్యుడవై యుండి యీలాటి మెత్తదనము కనబరచుట నాకప్రతిష్టగాదా. ఇది క్రూరత్వమని నీవనుకొనుచున్నావు క్రూరత్వమని లోకములో నొకటి లేదు. క్రూరత్వమే శూరత్వము. శూరత్వమే క్రూరత్వము. భగవంతుడు కలడనియు దయాసముద్రుడనియు నందురుగాని అతడున్న పక్షమునకూడ క్రూరుడే. సృష్టింపబడిన సమస్తజంతువులలో బలమైనది, బలములేని దానిని చంపుచున్నది. కుక్క పిల్లిని చంపును. పిల్లి యెలుకను చంపును. లోకమరియాద యీవిధముగానే యున్నది. ఆవిధముగానే మనము బలవంతులమైనపుడు మనకంటె బలహీనుల జంపవలసినది. మంచివారు మంచివారనడమేకాని వారు మనమార్గములో ముళ్లవంటివారు. ఆముండ్లు మనము పెల్లగించవలసినది. పెల్లగించకపోయిన పక్షమున మనకు రాజ్యము లేలాగున దక్కును? ధన మేలాగున వచ్చును? సుఖ మేలాగున దక్కును? కాబట్టి సజ్జనులని గిజ్జనులని యాలోచింపక మనము శత్రుసంహారము చేయవలెను. వివేకుడు మొదలయినవారు మహామునుల యాశ్రమములలోను అక్కడక్కడ కొందరు సజ్జనుల యిండ్లలోనుమాత్రమే చిక్కిచిక్కి యున్నారని నీ వనుచున్నావు. ఈవేళ చిక్కినవారు రేపు బలియుదురు. నేడడవులలో నున్నవారు రేపు పట్టణములలో నుందురు. కాబట్టి వారు చిక్కియుండ

గానే అడవులలో నుండగానే నాశనముచేయవలయును. పాపమని నీవు జంకనక్కరలేదు. లోకములో పాపమన్నది లేదు. గొంతులు కోసియైనను సరే, మోసముచేసియైనను సరే, కొంపలు కాల్చియైనను సరే, ద్రోహము సలిపియైనను సరే, విషముల పెట్టియైననుసరే శత్రువుల నాశనముచేసి గొప్పవాడైనవాడే ప్రయోజకుడు. వానినే లోకులందరు గౌరవింతురు. వానికే యెల్లవారును జడియుదురు. అతనినే పుణ్యాత్ముడని యాచకులు స్తోత్రము చేయుదురు. వాడొక్కడబ్బ యెవరికీ ఇయ్యకపోయినను అందరు వానినే యాశ్రయింతురు. సజ్జనుడు సజ్జనుడనిచెప్పుకొనుటయే కాని ధనము కానియధికారముగానిబలముకాని లేకపోయినచో సజ్జనుని మొగ మెవ్వరు జూడరు. పరకాంతమొగము చూడనివారు పరధనము ముట్టుకోనివారు, నిరంతరము ప్రార్థనలు చేయు భక్తులు ముక్కుమూసికొని కూర్చుండు తపశ్శాలులు, బూడిద పూసికొను బ్రాహ్మణులును మహామునులు యోగులు సన్యాసులు మొదలగువారందఱు అప్రయోజకులలో మొట్టమొదటిగకంవాగు వీళ్ళనుచూచి కూర్చుండిన గుడ్డియుంత లేవదు. వీళ్ళకు పొట్టగడవదు. క్రూరకర్మచేత నీచకర్మచేత భాగ్యవంతులైనవారిని యధికారులైన వారిని పైనచెప్పినవారందరు లోలోపల నిందించి యాక్షేపింతురే కాని డబ్బుకావలసివచ్చినప్పుడు వారిదగ్గరకేవెళ్ళి నోరుతెఱచి చెయి జాచి యడుగుదురు. కాబట్టి ధనమూల మిదంజగత్తు. అధికారమూల మిదంజగత్తు. కాబట్టి ధనము అధికారము తప్పక సర్వవిధములచేత సంపాదింపవలయును. ఈతత్వము పరమరహస్యమైనది. నీవు ప్రియ శిష్యుడవును నాయంతవాడవుకనుక నీకు నేను నిర్హేతుకజాయమాన కటాక్షముచేత తెలియజేయుచున్నాను. ఏకార్యమైనను నెగ్గించగలిగితే పాపములేదు. నెగ్గించలేకపోతే పాపాత్ముడు అప్రయోజకుడు అందురు. గొప్పతనమునకంతకు నిదియే రహస్యము. ఇదియే తాళము

చెవివంటిది. కాబట్టి వివేకుడు మొదలయినవారిని నీవు సంహారింపుము. నీకు దీనివలన కీర్తివచ్చును. యైశ్వర్యమువచ్చును. నిగుడుగప్పిన నిప్పువలె నుండి నీబలము నీవెఱుగకున్నావు. అగ్నిహోత్రునకు వాయుపుత్రోడైనట్లు నీకు నేను తోడగుచున్నాను. గనుక నీవు అవలీలగ శత్రువులను జయింపగలవు. నన్ను నేను కొనికూడుకొనగూడదు. నామహాత్మ్యమును నీవు తిన్నగా యెఱుగవు. కాబట్టి నామాటవిని విలునమ్ములు పుచ్చుకొని లేచి రథముమీదగూర్చుండి ధైర్యముతెచ్చుకొని వివేకాదులను సంహారింపుము.

ఇది లోకాయిత యోగంబను

రెండవ అధ్యాయము.

## మూడవ అధ్యాయము.

అహంకారోవాచా, అహంకారుడు పలుకుచున్నాడు

మహాత్మా మీరు సెలవిచ్చినది బాగున్నది కాని భగవంతుడున్నాడనియు కూౄరకర్మముచేసిన పక్షమున నతడు నాయాత్మను శిక్షించుననియు నాకు భయముగలుగుచున్నది. అందుచేత వివేకాదులను సంహారించుటకు నాకు చేతులు రాకున్నవి.

కలిపురుషోవాచా: కలి పలుకుచున్నాడు.

అనవుడు కలిపురుషుడు వికవిక నవ్వి "ఎంతపిచ్చివాడవు! పరలోక మొకటియున్నదా. ఆత్మ యొకటికలదా. భగవంతుడున్నాడా. ఆత్మయెక్కడిది. దాని కాకారమున్నదా. పరలోకములో సుఖదుఃఖములనుభవించువారెవరు. చచ్చిపోయిన తరువాత శరీరము కాలిపోవుచున్నది. ఇక ఆత్మను చూచినవారెవరులేరు. వేదవ్యాసులు, శంకరాచార్యులు మొదలయినవారందఱు ఆత్మయున్నదని పాడుపుస్తకములు

వ్రాసినారు. నాకు దొంగలు వారి వ్రాత లబద్ధములు. ఆత్మ లేకపోయి నచో శరీర మింతకాల మెట్లు బ్రతికినదని నీవడుగుదువేమో. బ్రతుకుటకు ప్రాణము లాధారములు. జబ్బుచేసి ప్రాణములుపోయిన తరువాత నేమియు లేదు. సుఖము దుఃఖము ననుభవించుట యిక్కడనే కాని పైన యేమియు లేదు భగవంతుడు లేడు. ఉన్నపక్షమున కనబడ డేమి? అతడీ లోకములన్నీ సృష్టిచేసినాడట. అతని నెవరు సృష్టించినారు? అతడు స్వయముగా పుట్టగలిగినపక్షమున నీలోకమే స్వయముగా పుట్టినదని యెందుకనుకొనకూడదు? ఈశ్వరుని చూచినామని చెప్పునట్టి భక్తులందరుగూడ మోసగాండ్రు. వారిమాటలు నమ్మగూడదు. శరీరము యంత్రము నంటిది యంత్రములోనున్న మర లన్నీ కూర్చినప్పుడు యంత్రము శక్తిగలిగి పనిచేసినట్లే శరీరములో అవయవములన్నీ బాగున్నపు డది పనిచేయును. యంత్రములు కాత్మ లేనట్టే శరీరమున కాత్మలేదు. భగవంతు డంతకన్న లేడు. నేనే భగవంతుడను. పాప మనలే లేదు. పుణ్యము మొదలే లేదు. పరలోకము కలలోనైన లేదు. కాబట్టి నీవు జడియవలసిన పనిలేదు.

ఇది నాస్తిక యోగంబను
మూడవ యధ్యాయము.

---

## నాలుగవ అధ్యాయము.

### కలిపురుషుని విశ్వరూపప్రదర్శనము.

అహంకారో వాచా —అహంకారుడు పలుకుచున్నాడు

మహానుభావా! కలిపురుషా పరమేశ్వరుడు వేరే లేడని యు నీవే లోకేశ్వరుడనియు క్షణకాలము క్రిందట మీరే చెప్పియున్నారు. అజ్ఞానముచేత నావరింపఁబడిన మనస్సుగలవాడనగుటచే మీ

మాట-నేను నమ్మజాలను. మీ రేనిధముగా లోకేశ్వరులయిరో మీ మహిమ యెట్టిదో తెలియజేసి మీ నిజమూర్తిని నాకు జూపిసకాని నాకు నమ్మిక కుదురదు. కాబట్టి యావిధముగా జేయ ప్రార్థించుచున్నాను.

కలిపురుషోవాచా—కలిపురుషుడు చెప్పుచున్నాడు.

ఓయి మూర్ఖుడా అహంకారుడా! నీవు నాప్రియభక్తులలో నొకడవయినను దురాత్ములైన జ్ఞానదేవత మధ్యమధ్య నిన్ను ఆవహించి పాడుచేయుచుండుటచేత నీవు నామాటలను విశ్వసింపకపోవుచున్నావు. దీనింబట్టి నీచిత్త మింకను స్థిరముగా లేదని తలంపవలసియున్నది. ఈదెబ్బతో నీకును జ్ఞానదేవతకును కోటియోజనములదూరముండునట్లు నా మహిమను నీకు బోధించెదను. సావధానుడవై వినుము. క్షణకాలమునీవు వివేకుడు నీకు చుట్టముకాడని తలంచుకొనుము. జ్ఞానదేవత నీదగ్గరకు రాకుండ పూర్వకాలమున నీ కుపదేశించిన మోహమంత్రమును జపియింపుము. నాశిష్యులును నీకుమిత్రులును నైన కామక్రోధాదుల రూపమును నీవు మనస్సులో భావించుకొనుము. అప్పుడు నాబోధలు నీకు సమగ్రముగా తలకెక్కును.

అహం—దేవా అట్లే చేయుచున్నాను. సావధానుడనై యున్నాను. మీమహిమ సెలవిమ్ము.

కలి—ఇదిగో వినుము. నేను లోకేశ్వరుడను సర్వశక్తుడను, సర్వవ్యాపకుడను, సర్వనియామకుడను, సర్వజ్ఞుడను, లోకమునందు ప్రతిమనుష్యుడును సాధారణముగా నాయొక్క యవతారమే. నా యవతారమనుటకు 'తార్కాణ మేమనగా స్వల్పముగానో యధికముగానో నాగుణములులేని మనుష్యుడుగాని జంతువుకాని లోకములో లేదు. కొందఱు మూర్ఖులు మాయచేత భ్రమపడి వివేకమనునది మనుష్యులలో కలదని యూహించుకొని యుండ్రు. నాసంబం

ధమైన జ్ఞానము కలుగగానే నీటిలోవేసిన యుప్పువలెనే యీ తెలివి తక్కువ కరగిపోవును. నన్ను నమ్మికొన్న పరమభక్తులకు జీవన్ముక్తి వారికి ప్రసాదించెదను. అనగా బ్రతికియుండగానే సకల సౌఖ్యములను బ్రహ్మానందమును గూర్చెదను. "త్వమేవశరణం అన్యథాశరణం నాస్తి" అని నన్ను మనస్ఫూర్తిగా నమ్ముకొన్నవారిమీద నా దయారసము వరదవలె ప్రవహించును. నాభక్తులు బంగారపు తూగుటుయ్యాలలో నెక్కి యూగుదురు. వారియిండ్లు సకలైశ్వర్యములతో తులతూగు చుండును. నాశిష్యుల భార్యలు నగలబరువు మోయలేకయుందురు. నాశిష్యులే తరుచుగా మేడలు మిద్దెలు కట్టగలుగుదురు. వారి కచ్చేరీ చావడులు వేశ్యాంగనల మేజువాణులతోను గానవినోదములతోను ప్రతిధ్వను లిచ్చుచుండును. లక్ష్మీదేవి నావశవర్తినియై యున్నది. గనుక అట్టివారి యిండ్లలో నివసింపుమని యామెను పంపి మరేదురాత్ముల చేతను ఆమె తీసికొనిపోబడకుండ కాళ్ళకు సంకెళ్ళు వేయబడును. అందుచేత మహాలక్ష్మి నాశిష్యులయిండ్లలో ఘల్లుఘల్లుమని సంచరించు చుండును. వీనులవిందుగా రూపాయల చప్పుడు ఖంగుఖంగుమని వారి యిండ్లలో వినబడుచుండును. వేయేల! సకలసౌఖ్యములు వారివే. సకలభోగములు వారివే. సకలవైభవములు వారివే. సకల సంపదలు వారివే. పలుకుబడి వారిదే. అధికారము వారిదే. మాటచెల్లుబడి వారిదే. సత్యము నాశిష్యుల యెదుటకురాలేక గడగడ వడంకి మూల మూలల నొదిగిపోవును. ధర్మము కంచుకాగడను వెదకినను గనబడదు. జ్ఞానదేవత నాశిష్యులున్న దేశములోనైన అడుగిడుటకు వెరచును. నాశిష్యులకే అంతప్రతాప మున్నపుడు గురువునైన నాపేరు చెప్పిన మాత్రమున సత్యము మొదలయినవి గుండె బ్రద్దలయి చచ్చిపోవును.

ఇక నన్నాశ్రయించని నిర్భాగ్యుల గతి చెప్పెద వినుము. వారికి పూటకు టికాణ యుండదు. నా విరోధికోటిలో గొందఱికి తలదాచు

కొనుటకు కొంపైన నుండదు. ఉండినను యొకగుడిసెయో లేక కొంప యని పిలుచుటను తగనిదొక కొంపయోయుండును. ఆనిర్భాగ్యులు బూడిదలు పూసికొని కాషాయవస్త్రములు గట్టుకొని గోచిపాతల ధరియించి యుపవాసములజేసి మాడి చిక్కి నశింతురు. అయితే నా శిష్యులలోగూడ కొందఱు బూడిద పూసికొని కాషాయవస్త్రములు గట్టుకొనియుందురు కాని వారు వేష మెట్లువేసినను లోపలమాత్రము నన్ను నమ్మియుండి నాకు యిష్టములైన కార్యములు చేయుచుందురు. వేయేల ! నాకు శిష్యులు కానివా రెల్లపుడు వేదలు. ఎల్లపుడు ఋణగ్రస్థులు. అగ్రహగోజకులు. పలుకుబడి మాట చెల్లుబడిలేనివారు. వారిని చూచినప్పుడు కూర్చున్న గుడ్డిముండ లేవదు. ఏచెట్టుక్రిందనో గూర్చుండి ముక్కుమూసికొని ఆకు అలము తిని బ్రతికవలసినవారే కాని యట్టివారు నలుగురిలోనికి రాదగినవారు కారు. ఇన్నిమాట లెందుకు? వాళ్ళు కాళ్ళు చేతులు ముక్కు చెవులు గలిగియుండి మాట లాడుచున్నను వాళ్ళు మనుష్యులే కారు. మనుష్యులన్నప్పుడు నాశిష్యులే మనుష్యులు.

అహం— మహాత్మా ! నీవు చెప్పినది నాకు తెలిసినది. నీవేయే స్థలములలో నుందువు. నిన్నెట్టి మహనీయులు తెలిసికొనగలరు. నీ యవతారంబు లెక్కడెక్కడ నున్నవి, యను శంక బాధించుచున్నది గావున నాకు శంకానివృత్తి చేయవలయునని వేడుచున్నాను.

కలి— వత్సా ! ఆయుష్మంతుడవుగమ్ము. ప్రపంచ మున్నంత కాలము జీవింపుము. నీభక్తికి మెచ్చితిని. నీకు సమస్తము కరతలామల కముగా నెఱిగించి నిన్ను నాయంతవానిగా జేసెదను నీవు నాపాదము లనే నమ్ముకొని యెల్లకాల మిట్లేయుండుము. ఇంక నీకు శంకానివృత్తి చేసెద వినుము. పూర్వకాలమునందు పుణ్యక్షేత్రములు దేవాలయములు తీర్థములు తులసివనములు మొదలగు చోటులకు నేను వెళ్ళ

జాలక వెరచుచుంటిని గాని యిప్పుడా ధర్మకర్తలు మొదలయినవారు నాతో రాజీపడి నాశిష్యులై నన్ను నమ్మికొనియున్నందున యిప్పుడా స్థలములకు తరుచుగా వెళ్ళుచున్నాను. కాని సహజముగా ఆస్థలముల పేరు దలచినప్పుడు నాకురోత. అక్కడ అడుగుపెట్టుటకే నాకిష్టముండదు. ధర్మకర్తలు మొదలగువారు శిష్యులైనారని యభిమానముచేత అక్కడకు వెళ్ళుచున్నానేకాని నాకు మనస్సులో ఆస్థలములమీద నిజమైన యభిమానము లేదు. ఏలయన యిప్పటికిని నాకు గర్భశత్రులైన విష్ణుభక్తులు యోగులు మొదలయినవారు కొంద అక్కడక్కడ నుండుచున్నారు. సంతోషపూర్వకముగా నేనుండునట్టి స్థలములు చెప్పెద వినుము. వేశ్యాంగనాగృహములు నాకు పరమప్రీతికరములైన యాలయములు. మరియు సారాదుకాణములు జూదపుపాకలు కోడిపందెము లతావులు నరహంతకుల హృదయములు అబద్ధీకుల నాలుకలు నాకు కొలువుకూటములు. ఈతతోటలు, తాడితోటలు, గంజాయివనములు నాకు విహారభూములు. చీకటిచోటులం జూచినప్పుడు నాకు పంచప్రాణములు లేచివచ్చును. మరియు వస్తువులు తూచునట్ట తక్కెళ్ళలోను తాసులలోను కంచము మొదలగు కొలతపాత్రలలోను, సమస్తాయుధములలోను, అన్నిరూపాయలు కాసులు డబ్బులు మొదలగు నాణెములలోను నేను తరుచుగా నుందును. పూర్వము విద్యయనునట్టి రాకుసి నాతో చిరకాలము విరోధపడి నన్ను విద్యావంతుల సమీపమునకు రానిచ్చినది కాదు కాని, ఇప్పుడామె నాశిష్యులచే నోడింపబడియుండుటచే విద్యావంతులు చాలమంది నాకు వశవర్తులై యున్నారు. నారోజులు మిక్కిలి బాగున్నవి. దేవతార్చన గదులలోను పెట్టెలలోను నేనే ప్రవేశించియున్నాను. నేను అనంతకోటి యవతారముల నెత్తినాను. పూర్వకాలము రావణకుంభకర్ణాదులు నాయవతారమూర్తులే. శిశుపాలదంతవక్త్రులు, దుర్యోధనుడు,

దుశ్శాసనుఁడు శకుని మొదలగువారుగూడ నా యవతారమూర్తులే. నాయందలి ద్వేషముచేత వాల్మీకియు వేదవ్యాసుఁడును రావణాదులు వైకుంఠమునందలి జయవిజయుల యంశ మునందు బుట్టినారని వ్రాసినారు. అది నిజముకాదు. వారు నాయంశమునసే బుట్టిరి. నా యవతారంబుల నింకను జెప్పెద వినుము. వృక్షములలో గంజాయిమొక్కను నేను. నాభిచెట్టును నేను. నల్లమందు మొక్కను నేను. జంతువులలో పెద్దపులిని నేను. చిరుతపులిని నేను. ప్రాకెడి పురుగులలో పామును నేను. తేలును నేను. పసువులలో పాలియ్యని పోట్లగొడ్డును నేను. పుస్తకములలో కొక్కోకమును నేను. వీథులలో రాజమహేంద్రవరపు అనప్పిండివారి వీథిని నేను. మనుష్యులలో హంతకుఁడను నేను. లంచగొండి యధికారిని నేను. లంచము నేను. లంచమిచ్చిన సొమ్ము నేను. లంచముదెచ్చిన రాయబారిని నేను. వ్రాసిన తప్పువ్రాత నేను. దొంగసాక్ష్యము నేను. సాక్షిని నేను. అబద్ధమాడునట్టి మనుష్యుఁడను నేను. నాలుకను నేను. అబద్ధమును నేను. నదులలో సుడిగుండము నేను. గృహమందలిదోమలు నేను. నల్లులునేను. సారా నేను. కూన నేను. పుచ్చుకొనునట్టి పాత్ర నేను. తెచ్చునట్టి సీసా నేను. సారాదుకాణము నేను. బట్టీ నేను. తప్పుతూనిక నేను. దొంగబేరము నేను. వేయేల సమస్తమును నేను.

ఇది కలిప్రభావయోగమును
నాలుగవ యధ్యాయము.



# విశ్వరూప ప్రదర్శనము

అయిదవ అధ్యాయము.

అహంకారుడు పలుకుచున్నాడు—

దేవా! నే నడిగిన ప్రశ్నలలో మొదటి రెంటికిని మీ రిచ్చిన ప్రత్యుత్తరము మిక్కిలి తృప్తికరముగా నున్నది. తక్కిన మూడు ప్రశ్నలకును సత్వరముగా బ్రత్యుత్తరమిచ్చి నన్ను ధన్యుని జేయ గోరుచున్నాను.

కలి—వత్సా, నీకు నా యందు కుదిరిన భక్తికి నేను మిక్కిలి సంతసించుచున్నాను. నీవు చాలమట్టుకు బాగుపడినావనియు నీ పేరు సార్థకము చేసికొన్నావనియు నే నిప్పుడు దృఢముగా చెప్పగలను. నీపు మీదచేయివేసి ఆదరపూర్వకముగా తట్టుచున్నవారెవరని అడిగినావు. చెప్పుచున్నాను వినుము. వీరందరు నాప్రియశిష్యులు. కాని నాప్రియ శిష్యులవలె ప్రత్యక్షముగా లోకములో గానబడక ధర్మదేవతనుసేవించు వారివలె నటించుచుందురు. చూడగానే వీరు నాశిష్యులవలె కనబడరు. నిదానముమీద బుద్ధిమంతులు చూచినపక్షమున వారు నావారేకాని తదన్యులు కారని విస్పష్టముగా తెలిసికొనవచ్చును. లౌకికసంబాధము లైనకొన్ని కొన్నిబాధలు వారికుండుటచేత వారు ప్రత్యక్షముగా నా ధర్మముల ననుష్టింపలేక పైకిమారువేషముల వేసికొని సంచరించుచు గాలక్షేపము చేయుచున్నారు. కాని నాసేవలో నెంతమాత్రము వీరు తక్కిన వారికి తీసిపోరు. వీరు రెండువిధములుగనున్నారు. ఉభయులకు నుద్దేశ మొకటె. అనగా ధన మార్జించుటే. ఇందు మొదటివారు న్యాయవాదులను పేరున వ్యవహరింపబడుచున్న కొందర న్యాయ వాదులు. వీరిలోగూడ నందఱు నా శిష్యులుగారు. కొందఱు

మాత్రమే నా ప్రియశిష్యులు. అట్లు వీరిలో నన్ను సేవింపనివారు గూడ సర్వవిధముల సుఖపడుచున్నారు. కాని మొత్తముమీద నీ జాతిలో చాలమంది నాశిష్యులే. వారు శరీరమున ధరించునట్టి గౌనులు అపవాదమునుండి వారిని తప్పించునట్టి కవచములు. వారు నిశ్శబ్దముగ గోల లేకుండ చేయుచున్నపని ఇంత యంత యని వర్ణించుటకు వీలు లేదు. వీరును వీరికి సేనాపతులై కుడిభుజములై పనిచేయుచున్న యేజంట్లును, నామనస్సునకు నచ్చునట్లు మితిలేని పని సేయుచున్నారు. సకల కలహములకు వీరలే కారకులు. అందుచేత వీరు శ్లాఘ్యముగా జీవనము చేయుచు నన్ను నమ్ముకొనియున్నందుకు నేను వారి వీపుపై చేయివైచి తట్టుచున్నాను. నా కోరలసందునబడి గానుగలలో బడిన చెఱకుగడలవలె నలిగిపోవుచున్న వారెవరో చెప్పెద వినుము. మొదటి వాడు వివేకుడు. సత్యుడు, ధర్ముడు మొదలగువా రందరును వాని మార్గమునే యనుసరించి నశించుచున్నారు. ప్రస్తుతము కొన్ని కారణ ములచేత వారు లోకములో అక్కడక్కడ నున్నట్లు కనబడుచున్నను క్రమక్రమముగా నా కోరలసందునబడి తప్పక నశియింప గలరు. ఇప్పుడే నశియించిపోవుచున్నారు. నా శరీరములోనుండు రక్తము కొందరి శరీరములలో ప్రవహించుచున్నది. అనగా వారి శరీరములోని రక్తము, నా రక్తము నొక్కటే. వారిలో గొందఱు మతాధిపతులు కొందరు మంత్రులు. ఈ మతాధిపతులుగూడ నాకు ప్రత్యక్షవిరోధుల వలె నుండి లోపల నా పనియే చేయుచున్నారు. వీరి వలననే కోట్ల కొలది మనుష్యులు మూఢులై నా పాదసేవ జేయుచున్నారు. వీరుండ బట్టియే జ్ఞాను లెవరైన బయలుదేరి ప్రజలను బాగుజేయ సంకల్పించు కొన్నను వారి మాట లెంతమాత్రమును సాగుచుండుటలేదు. మంత్రు లుండబట్టియే రాజనీతి యనుపేర నాపని కావలసినంత జరుగుచున్నది. అహా—మహాత్మా! నీ విశ్వరూప ప్రదర్శనముచేత నేనును

నా పెద్దలును తరింపగలిగితిమి. నేను నిశ్చయముగ బాగుపడినానని చెప్పగలను.

కలి—నీవు పరమభక్తుడవు కాబట్టి, అతిగోప్యమై అతి చిత్రమైన నా విశ్వరూపమును నీకు జూపితిని. నీవంటి ధన్యుడు ప్రపంచమున మరియొకడు లేడు. ఈ విశ్వరూప మెంతవానికి కనబడును. ఇది బ్రహ్మరుద్రాది దేవతలకు దుర్లభము. వశిష్ట వామదేవాది మహర్షులకు దుర్లభము. అరుంధతి సీత మున్నగు మహా పతివ్రతలకు దుర్లభము. నీ పూర్వజన్మ పుణ్యముచేత నీ కొక్కడికే కనబడినది.

ఇది విశ్వరూప ప్రదర్శనయోగ మనెడు
అయిదవ అధ్యాయము.

---

# ఆనందయోగము

అహంకారుడు పలుకుచున్నాడు.

మహాత్మా కలిపురుషా బ్రహ్మరుద్రాదులకైన తరముగాని నీ దివ్యరూపమును కన్నుల పండువుగా నాకు చూపించి యనుగ్రహించితివి. మనస్సు తలచుకొనుటకును నోరు వచించుటకును కన్నులు చూచుటకును దరముగాని నీ యసాధారణ విశ్వరూపమును జూడగలుగుటచే జరాచరభూతకోటిలో నే నొక్కడనే ధన్యుడను. నావంటి ధన్యులు లోకమున మరియొకరు లేరు. కాని యింకొక్క కోరిక నాకు గలదు. ఇట్టి చరాచరాత్మకుడవయిన నిన్ను ఏ యోగము చేత ధ్యానించి శాశ్వతసుఖము బడయవలయునో తెలియజేయవలయునని ప్రార్థించుచున్నాను. ఆ యోగము తెలిసినప్పుడె యిదివరకుపదేశించిన సమస్తయోగములు మొక్షఫలితార్థము తలాయు

క్తమై యుండును. కావున దీనున్నడైన యీ శిష్యునియం దనుగ్రహించి యట్టియోగము నానతీయవలయు.

కలిపురుషుడు చెప్పుచున్నాడు.

వత్సా! ప్రపంచ మున్నంతకాలమును నీవు దీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లుము. ఇదివరకు చాలమంది శిష్యులకు నేను ధర్మముల నుపదేశించితినిగాని నా ధర్మోపదేశములు చట్రాతినేలపై బడిన విత్తనములవలెనే వారియందు వ్యర్థములై నిష్ఫలములయ్యెను. ఇంక నీమనస్సు నా యుపదేశబీజములకు సారవంతమై ఫలనుగలిగిన మంచి నేలవలె యున్నది. కావున నీమూలమున నామతము జగద్వ్యాప్తము కాగలదు. వినయము విధేయతగలిగి చెప్పినదానిలో లేనిపోని వంకలు కల్పింపక గ్రహించునట్టి శిష్యుడు దొరకుట గురువుయొక్క పూర్వపుణ్యానిశేషము. అందుచేత మంచిశిష్యుడవైన నీవు కోరినవన్నియు నే నుపదేశించెదను. ఇప్పు డుపదేశింపుమని నీవు కోరిన యోగము, ఆనందయోగము. ఈయోగమును మించినది మరియొక యోగము లేదు. తక్కిన యోగములన్నియు నిందులోని యంతర్భాగములనియె చెప్పవలెను. నేనే యీ ఆనంద స్వరూపుడను. ఈ ఆనందము నెవరు సంపూర్ణముగ ననుభవింతురో, వారు నాలో నైక్యమగుదురు. అప్పుడు నేనే వారు వారే నేను. ఈ యానందము గలవారు నాతో సాయుజ్యముక్తి ననుభవింతురు. ఇట్టిది నీపూర్వపుణ్యవిశేషముచేత వినగలిగిన భాగ్య మబ్బినది. ఇదిగో చెప్పుచున్నాను. వినుము.

అహం—సావధానుడనై యున్నాను. మహాప్రసాదము.

కలి—ఆయుష్మంతుడా! ఈ యానందయోగము రెండువిధములు కలది. అందు మొదటి దమృతానందయోగము రెండవది భోగానందయోగము. మొదట, అమృతానందయోగశిద్ధి నైనవానికి భోగానందయోగశిద్ధి క్షణములో నగును.

అహం.—స్వామీ! యీయమృత మెక్కడ దొరకును. ఈ యోగమునందు ప్రవేశించుటకు నా మనసు త్తరపడుచున్నది. గనుక త్వరగా జెప్పవలెను.

కలి—వినుటకు నీమన సెంత తొందర పడుచున్నదో చెప్పుటకు నామనసు నంత త్తరపడుచున్నది. ఆయోగము తలచుకొన్నంత మాత్రముననె నానోరూరుచున్నది. ఈయమృతము పరిశిష్టలమునను దొరకును. భూలోక కల్పవృక్షములైన తాడిచెట్లు ఈ యమృతము పుట్టదగినట్టి ముఖ్యస్థానములు ఇవిగాక యిప్పచెట్లు దాళీచెట్లు కొబ్బరిచెట్లు జీలుగుచెట్లు మొదలగు వాటిలోనుండికూడ నీయమృతము పుట్టును. మరియు నన్నమునుండి బెల్లమునుండికూడ ఈయమృతము సంభవించును. అహాహా! ఆ యమృతమువంటి యమృతము లేదు. అది యొకలోట్టెడు కడుపులో పడినప్పుడు కలుగునట్టి యానందమును, ఆ వాల్మీకిగాని కాని ఆ వ్యాసులుగాడు గాని వర్ణింప గలరా? అది స్మరణకు వచ్చినమాత్రముచేతనే అది నానోటిలో బడినట్లై నా శరీరము పులకరించుచున్నది. అది పచ్చిదే పుచ్చుకొనవచ్చును. అట్లుగాక ఒకవంట రెండువంటలుచేసి పుచ్చుకొన్నపక్షమున దాని మహిమ చెప్ప నలవిగాదు. రెండువంటలదే ప్రశస్తము. అది లభించనినాడు ఒకవంటదైన మంచిది. అదీ చేకూరనినాడు పచ్చికల్లు సేవింపదగినది. అదీ దొరకనప్పుడు నల్లమందు మద్దతు మంచిది. అదీ చిక్కనప్పుడాక డబ్బు గంజాయి శ్రేష్ఠము. ఖరీదునకు కొనియైన ఎరువు తెచ్చుకొనియైన యాచించియైన దొంగిలించియైన ఈ యమృతమును కడుపులో బడవేసికొన్నవాడే ధన్యుడు వానిదే జన్మము. ఇది రహస్యముగా బుచ్చుకొన్నవాడు నా కాప్తుడు. త్రాగి త్రాగి త్రప్పత్రాగి ఒడలెఱుగక దొరల్లి దొల్లి నడవలేక తూలితూలి పడి పడి అడ్డము వచ్చినవారిని తిట్టితిట్టి నవ్వి యేడ్చి సుఖ మనుభవించిన

వాడు నాకు పరమాప్తుడు. జోడు సీసాలు చెరియొక చంకలో బెట్టు కొని వీధివెంట నిర్భయముగ వెళ్ళునట్టి విద్యావంతు లంతకంటె పరమాప్తులు. ఒకరు చూచుచున్నారని సందేహము. ఒక రనుకొనుచున్నారను భయములేక సిగ్గు బిడియము విడిచిపెట్టి నడివీధులలో కొలువుకూటములలో నీయానంద మనుభవించువాడు నా రెండవ ప్రాణము ఈ యానందయోగము నిందించినవారికి ఒక గ్రుక్కెడైనను జన్మమధ్యమందు పుచ్చుకొనని వారికి మహానరకములు గలుగును. ఈ యోగము సిద్ధించిన పక్షమున నరహత్య సులభము. చౌర్యము సులభము. ఆత్మహత్య సులభము. జీవహింస సులభము నింద సులభము. వెయ్యేల యిదియే సర్వయోగములలో బ్రశస్తమయినది. ఇంక రెండవదియైన భోగానందయోగమును జెప్పుచున్నాను వినుము. పర భార్యనుగాని వేశ్యాంగననుగాని యుంచుకొని యానందము నొందుట భోగానందయోగము. భార్యనువిడిచి యింటివారి కన్నముపెట్టక గుఱ్ఱపుబండి యెక్కిగాని పల్లకి యెక్కిగాని జోడు కాగడాలు వేయించుకొని యుంచుకొన్నదాని యింటికి వెళ్ళినవాడు నాకు పరమభక్తుడు. అందునిమిత్తము భూము లమ్ముకొని పకీరైనవాడు నాకు పరమశిష్యుడు. ఈ సుఖసంబంధములైన వ్యాపారములలో జిక్కి త్వరగా శరీరము విడిచినవాడు పైకి చచ్చిపోయిన ట్లగుపడినను నిజముగా నాలో నైక్యమైనాడని తెలిసికొనవలెను. అతనికి పునర్జన్మము లేదు. తార్పుకత్తెలు తార్పుకాండు) లోకములో గొంత నింద పడుచున్నను మరణానంతరమున మోక్షమున కర్హులై నాసమీపమున నుండి సాలోక్యముక్తినందగలరు. ఈపైన చెప్పబడిన మహనీయులు చచ్చిపోయినప్పుడు వారి శవముల మోసినవారికిగూడ కోటి యజ్ఞఫలములు లభించును. అబుకారీ యిజారాదారుల నందరినిమరణానంతరమున నాశిష్యులు పూలవిమానములపై నెక్కించుకొని తీసి

కొనిపోవుదురు. వెయ్యేల కల్లు సారాయి గంజాయి మొదలయిన వ్యాపారములలో నెంతపనిజేసినను ముక్తిదొరకును. దుకాణముల మీద కూర్చుని కల్లు సారా గంజాయి మొదలయినవి అమ్మువారు ముందు జన్మములో మహారాజులకు కొడుకులు కూతుల్లునై పుట్టి బంగారు తూగు టుయ్యాలలో ఊగుచుందురు.

ఇది కలిగీతా మహాశాస్త్రమందలి ఆనందయోగమను
ఆరవ అధ్యాయము.



## ధనయోగము.

అహంకారుడు పలుకుచున్నాడు.

దేవా! మీ రానతిచ్చిన యానందయోగము నామనస్సునకు మిక్కిలి నచ్చినది. ఇట్టియానందమును గలిగించుకొనుటకు ధనము ముఖ్యసాధనము. ధనమ్మూల మిదం జగత్తని పెద్దలు చెప్పగా విను చుందును. అట్టి ధనము సంపాదింపబడినకాని ఆనందయోగము సిద్ధింపదు. ఆనందయోగము సిద్ధింపనిచో మీ యుపదేశములు సిద్ధింపవు. కాబట్టి ధనసంపాదనము ప్రధానమని నాబుద్ధికి దోచుచున్నది. కాబట్టి అది యెట్లు సంపాదింపవలయునో యానతీయవలయును.

కలిపురుషుడు చెప్పుచున్నాడు,—

వత్సా! నీవు నిజము బలికితివి. ఆనందధనయోగములు కవల పిల్లలవంటివి. ఒక కావిడిబిందెలవంటివి. ఒక కాడియెడ్లవంటివి. ఒక తిరుగలిలోని రాళ్ళవంటివి. కాబట్టి ధనయోగము లేకుండ ఆనందయోగముండుటకు వీలులేదు. వేదవ్యాసులు మొదలయిన లోకవంచకులు కొందరు ధనాదులు లేకయే జ్ఞానమువల్ల నానందము కలుగునని

చెప్పుదురుకాని యది కేవలము దొంగమాట. ఏలననగా ధనము చేతి నిండ నున్నప్పుడే స్త్రీగాని కల్లు సారా మొదలయిన భోగ్యవస్తువులు గాని చేత జిక్కును. డబ్బులేనివాడు పరస్త్రీవర్జితుడని లోకములో నొకసామెత కలదు. ధనము లేకున్నచో నేభోగమును జరుగదు. భోగములేనిచో నానందమేలేదు. వైరాగ్యమువల్ల శరీరమునకు మనస్సునకు బాధయేగాని యానందమెప్పుడును గలుగనేరదు. ఆనందమునకు మూలము ధనము. కావున దానివిషయమై చెప్పుచున్నాను వినుము.

ఆహం—సావధానుడనై యున్నాను. సెలవిందు.

కలి—ఆయుష్మంతుడా! ఆకర్ణింపుము. ధనసంపాదనమున కనేకోపాయములు కలవు. అవి వేయినోళ్ళుగల శేషుడైనను వాక్రుచ్చుటకు దరముగాదు శ్రమపడి సంపాదించువారు కొందరు. శ్రమపడకుండ సంపాదించువారు కొందరు. శరీరకష్టములబడి న్యాయముగ ధనముసంపాదింపవలయునని బాధలు పడునటువంటి నిర్భాగ్యులబ్రతుకెప్పుడును కష్టపుబ్రతుకే. సాధారణముగ ఎక్కడనో వేయింటికొక్కడు గాని వృద్ధిపొందడు. దాసులుగొట్టి రాత్రులు ప్రాణములకు తెగించి కన్నమువేసి శ్రమపడి ధనము సంపాదింపవచ్చును. ఇది అపాయముతోగూడిన యుపాయము. ఇది సుకుమారులకు పనికిరాదు. సుకుమారులైనవారు, ఇటువంటి మోటవారితో స్నేహముచేసి వారికుపాయము చెప్పి కన్నములు వేయించి దాసులుకొట్టించి వారుతెచ్చినధనమంతయు దాము పుచ్చుకొని వాళ్లకు త్రాగుటకు నుదరపోషణమునకు గావలసిన డబ్బిచ్చి వాళ్ళకపాయము వచ్చినప్పుడు తామే డబ్బుకర్చుపెట్టి కాపాడి ధనము సంపాదించుట యుత్తమమైన మార్గము. అట్టివారు మేడలు మిద్దెలు కట్టుకొని మురుగులు మురిడీగొలుసులు పెట్టుకొని తెల్లదుస్తుల ధరించి పెద్దమనుష్యులవలె నుందురు గనుక వారి

మీద నెవ్వరు ననుమానపడరు. ఇది శ్రమపడకుండ సంపాదించు విధములలో నొకటి. శ్రమ లేకుండ సంపాదించు విధములు మరికొన్నిగలవు అందు జూదమాడుట మొదటిది. ఇందులో శ్రమయే లేదు కాని పందె మొడ్డుటకు సొమ్ము లేనప్పుడు కొంచెము దొంగతనముమాత్రి మప్పుడప్పుడు చేయవలెను. అది యొక్కటియే కష్టమైనది. ఇందులో బాగుపడిన నాశిష్యు లనేకులు కలరు. ఇంతకంటె పెద్దమనిషితరహా జూద మింకొకటి యున్నది. పెద్దమనుషులు మేడలమీద కూర్చుండి తలుపులు బిగించి చీట్లపేక తెప్పించి రూపాయలు కాసులు పందెముల పెట్టి ఒక్కొకరాత్రి వందలకొలది రూపాల సంపాదింపవచ్చును. తెల్ల వారినతరువాత వారిందరు పెద్దమనుష్యులవలెనుందురు. కావున రాజ భటులు వారినిపట్టుకొనజాలరు. పట్టుకోదలచినను, ఇతరోపాయముల చేత నాబాధవారు నివారించుకొందురు. ఇదిగాక, ఉద్యోగములో నున్నవారు లంచములు పుచ్చుకొనుట మరియొక యుపాయము. ఇందులో తెలివిగా పనిచేసికొన్నపక్షమున ఉద్యోగము కల్పవృక్షము కామధేనువు. వెయ్యేల లంచము తెలివిగా పుచ్చుకొననేర్చిన వారికి, ఉద్యోగము రూపాలచెట్టు. లంచములు పుచ్చుకొనువారికి మధ్యవర్తి గానుండి, అందులో గాసులుకొట్టుట మరియొక విధము. దొంగ భీమాకంపెనీలు, ప్రావిడెంటుకంపెనీలు పెట్టి యింటిలో గోనెసంచెడు రూపాయలు వేసికొనుట యుత్తమపక్షము. వర్తకములుచేసి నేతిలో అరటిపళ్ళు కొవ్వు, కిరసనాయిలులో నీళ్ళుకలిపి బస్తాలకు చిల్లులు పొడిచి కొంతసరకు తీసికొని తప్పుతూనికలు తూచి తప్పుకొలతలు కొలిచి దొంగపద్దువ్రాసి చెడ్డసరకులు మంచిసరకులని చెప్పి యిచ్చి ధనము సంపాదించి పిమ్మట విరివిగా వ్యాపారములుచేసి, అప్పులు తెచ్చి, ఆస్తి భార్యపేర బావమరదులపేర వ్రాయించి నగలు దిట్టము గా చేయించి తుదకు కాళ్ళు చాపుకొని దివాలాతీయుట మరియొక

మంచిపద్ధతి ఇదిగాక గుళ్ళు గోపురములు కట్టింతుమని సత్రములు వేయింతుమని వివాహములు వడుగులు చేసికొందుమని యాచనవల్ల ధనము సంపాదించుట శ్రమలేని యుపాయములలో మొట్టమొదటిది. లకోటాప్రశ్నలు చెప్పుట. కేరళవిద్య ప్రయోగించుట, భూతవైద్యము నేర్చికొనుట, సోదె చెప్పుట, మంత్రపువిభూతి పెట్టుట, మొదలయినవి కూడ నాప్రియశిష్యు లాచరించవలసిన ధనార్జనోపాయములే. చెల్లుబడి యున్నపక్షమున నిరుగుపొరుగుననున్నవారి యిల్లు భూమి క్రమక్రమముగ కలుపుకొనుట మంచిది. ఆడపిల్లల నమ్ముకొని మగపిల్లల నమ్ముకొని ధనము చేర్చుట శ్రేష్ఠమైన పనులలో నొకటి. సొమ్ము వడ్డీకిచ్చి వడ్డీలకు వడ్డీకట్టి ఋణగ్రస్తు తెలియకుండా చేసి కొంపలు గోడెలు నమ్మించి ధనమార్జించుట మిక్కిలి సౌఖ్యమైన యుపాయము. సన్యసించి పీఠము లెక్కి శుద్ధపత్రికలు కొన్ని అశుద్ధపత్రికలు కొన్ని తనప్రక్క నుంచుకొని కారణము లేకున్నను మనుష్యులను వెలివేసి వందలకొలది ధనము వారివద్దనుండి లాగి పూర్వాశ్రమమందలి కొడుకులకు మేడలు కట్టించి భూములు కొని బాగుచేయుట శిష్టాచారసమ్మతమైన పని. దీనివంటిది మరియొకటిలేదు. ఏదైనను కష్టపడకుండ సంపాదించుట నాకు మిక్కిలి యిష్టము. ధనార్జనమునకు నింక ననేకోపాయములు కలవుగాని యవి నీవే యూహించుకొనవచ్చును.

అహం—దేవా! ఈయుపాయము లన్నియు మిక్కిలి ప్రశస్తములైనవి. ఈప్రకారము నడచుకొని జనులు బాగుపడి పరమగురువైన మీకు భక్తులై యుందురని నమ్ముచున్నాను.

ఇది కలిగీతాశాస్త్రమునందు ధనయోగమను
ఏడవయధ్యాయము.

# శ్రాద్ధ యోగము.

అహంకారుడు పలుకుచున్నాడు

స్వామీ మీరుపదేశించిన ధనయోగము నామనస్సునకు మహానందమును గలిగించినది. మీరు చెప్పిన యుపాయములన్నియు మిక్కిలి మంచివి. ధనార్జనమునకు సాధనమైనవి. ఈయుపాయముల నెఱిగినవారికి ధనమునకు లోపముండదు. ఇటీవల కర్మకాండలను గురించి నాకు గల సందేహములను దీర్చవలయును. చిరకాలమునుండి నాకు కలియుగములో మనుష్యులు శ్రాద్ధాదికర్మలేవిధముగ నెరపవలయునో ఆవిధానమునుగూర్చి నాకు మనస్సులో సందేహములు గలవు. ఆశంకానివృత్తిమీవలన గావలయును.

కలిపురుషుడు—వత్సా నీవు చక్కగా నడిగితివి. శ్రాద్ధయోగమును గురించి నీకువివరముగా జెప్పవలయునని నామనసులో కుతూహలముగలదు. దానికి తోడుగ నీకునువినవలెనని కుతూహలము కలిగినది. ఇదిగో ఉపన్యసించుచున్నాడను. సావధానుడవై వినుము.

అహం—మనస్సు భక్తిశ్రద్ధలతో గూడియున్నది సెలవిండు.

కలి—వత్సా ఈయోగము మిక్కిలి ప్రధానమైనది. ఏలయన ప్రపంచమంతయు శ్రాద్ధములతోనేయున్నది. శ్రద్ధగాజేయబడినది శ్రాద్ధము. లోకములో ప్రస్తుతము పితృదేవతలకు చేయునదియే శ్రాద్ధమని చెప్పుకొనుచున్నారు. అదిసరిగాదు. దేవతలు పితృదేవతలు గ్రామదేవతలుగాక కలియుగములో మరియొకరకము దేవతలున్నారు. వారెవ్వరనగా అధికారి దేవతలు. వీరిశక్తి వీరిప్రభావము మిగతా దేవతల ప్రభావముకంటెను చాలగొప్పది. శ్రాద్ధము పెట్టకపోయినచో పితృదేవతలు మనజోలికి సాధారణముగారారు. గ్రామదేవ

తలు గూడ నీదినములలో ప్రజలజోలికి వచ్చుటలేదు. కాని యధికారి దేవతలు సరిగా శ్రాద్ధమును తమకు మనుష్యులు పెట్టనిపక్షమున వారి పైబడి వారిని నాశనముచేయుచుదురు. అందుచేత జనులయొక్క క్షేమమునకు శ్రాద్ధయోగము ముక్కిలిముఖ్యమైనదని చెప్పినాను. అందుచేతనా విధానమంతయు నిక్కడ చెప్పుచున్నాను. సావధానుడవైవినుము. పితృదేవతల శ్రాద్ధములను పుత్రుడుగాని జ్ఞాతులుగాని బంధువులుగాని జేయవలయును. అధికారిదేవతలకు అట్టిబంధువులు శ్రాద్ధములు చేయనక్కరలేదు. ఈశ్రాద్ధములు పైయుద్యోగస్థునకు క్రిందయుద్యోగస్థుడు చేయుచుండవలెను. క్రిందియుద్యోగస్థుడు మారిపోయినను చచ్చిపోయినను అతని అధికారము వహించి యాస్థలమునాక్రమించుకొనువాని యందీకర్తవ్యము సంక్రమించును. కాబట్టి యిందులో కిర్తనష్టములేదు పైయధికారులకుగూడ వారు మారిపోయినప్పుడు చనిపోయినప్పుడు వారిస్థాన మాయుద్యోగము లాక్రమించికొని వారియందు సంక్రమించును గనుక పిండచ్ఛేదమెప్పుడు నుండదు. ఈశ్రాద్ధములలో దర్భలు తిలగింజలు తడిబియ్యము అక్కరలేదు. ఈశ్రాద్ధములు మూడువిధములు. హిరణ్యశ్రాద్ధము, అన్నశ్రాద్ధము, ఆమశ్రాద్ధము పితృదేవతలకిచ్చునట్టి శ్రాద్ధములు గూడ నిట్లేమూడువిధములుగనున్నవి. కాని అవి యిట్టివికావు ఒకయధికారికి వానికిలోబడిన క్రిందయుద్యోగస్థుడుగాని, అతనివలన నుపకారము నపేక్షించువారు కానిఅతనివలన నపకారము రాకుండజేసికొనువారుకాని ఆయనయనుగ్రహము నిమిత్తము ధనరూపకముగ చేయుశ్రాద్ధము హిరణ్యశ్రాద్ధమనబడును. పితృదేవతాశ్రాద్ధములు పగలేజరుపవలయును. ఈశ్రాద్ధము రాత్రి జరుగవలెను. పితృదేవతల హిరణ్యశ్రాద్ధములు సాధారణముగ పుష్కరములు మొదలగు పర్వదినములలో నదులయొడ్డున జరుగుచునే యుండవచ్చును. పితృదేవతాశ్రాద్ధములలో పితృదేవతలు వచ్చి స్వయముగా శ్రాద్ధముల గ్రహింపరు. ఈశ్రాద్ధములో నధికారిదేవతలు వచ్చిస్వయముగా హిరణ్యశ్రాద్ధములను గ్రహింతురు. దీనికిమంత్రములక్కరలేదు. ఈదేవతలకు

శ్రాద్ధములు స్వయముగా జేయవచ్చును. ఒకప్పుడు రాయబారులమూలముగా జేయవచ్చును. పితృదేవతాశ్రాద్ధములలో నింటికి బ్రాహ్మణులనుపిలిచి పెట్టునది, అన్నశ్రాద్ధమనబడును. అధికారిదేవతలకుగూడఅన్నశ్రాద్ధవిధానముకలదు. హిరణ్యశ్రాద్ధమువల్ల కొంతవరకు తృప్తిచేసిఅధికారులు గ్రామముమీద తనిఖీకి బయలుదేరునప్పుడు తాబేదారులు వారికిగారెలు అరెసెలు, అప్పములు క్షీరాన్నము మొదలయిన పిండివంటలతో, అన్నశ్రాద్ధము చేసి వారిని తృప్తులుగ జేయవలెను. ఇందువల్ల అధికారి దేవతలు సంపూర్ణముగా తృప్తినొంది ప్రసన్నులగుదురు. ఈశ్రాద్ధములు వారుదర్శనమిచ్చినపుడెల్ల జరుపుచుండవలయును. ఇదియే అన్నశ్రాద్ధవిధానము. ఇక ఆమశ్రాద్ధవిధానమునుగురించి చెప్పెదవినుము అన్నశ్రాద్ధమును చేయుటకు వీలులేనప్పుడు పితృదేవతలకు సయితము, ఆమశ్రాద్ధము చేయుచుందురు. అనగాబియ్యము పప్పు ఉప్పు మొదలయిన సరకులతో నిండిన పొత్తరులు బ్రాహ్మణులు కాపులుగూడ నిచ్చెదరు. అధి రి దేవతలకు గూడనీవిధముగానే ఆమశ్రాద్ధము గేయవలసియుండును. ఈశ్రాద్ధములు హిందువులకేగాక అధికారములు వహించిన యితరమతస్థులలో గూడ కొందరికి చేయవలసియుండును. అనగా అధికారి తమగ్రామమునకు వచ్చినప్పుడా గ్రామవాసులు, వారికి గావలసిన బియ్యము పప్పు, ఉప్పు, నెయ్యి పాలు పెరుగు మేకలు కోళ్ళు మొదలయిన సమస్త వస్తువులు పంపవలయును ఈపొత్తర్లువారు స్వయముగానే గ్రహించి శ్రాద్ధముల చేసినవారి న గ్రహింతురు. ఈవిధముగా కలియుగములో నధికారి దేవతాశ్రాద్ధమును కాలాతీతము గాకుండ సమయానుక్రమణికగ చేసిన మనుష్యుడు, ఐశ్వర్యము గలిగితా నేచెడ్డపని చేసిన చెల్లుబడి కలిగి పన్నులు తక్కువ కట్టించుకొని ఇతరులను యిష్టమువచ్చినట్లు బాధపెట్టిహాయిగా సుఖింపవచ్చును.

ఇది కలిగీతా శాస్త్రమునందు శ్రాద్ధయోగమను

ఎనిమిదవ అధ్యాయము.

# వర్ణాశ్రమధర్మయోగము

అహంకారుడు—స్వామీ! మీ యనుగ్రహమువలన నేను అవగత శ్రాద్ధయోగుడనయితిని. అయినను నాకింతటితో తృప్తిలేదు. సర్వజ్ఞతగల మీచేత మరికొన్ని యితరధర్మములను శ్రవణానందకరముగ వినగోరుచున్నాడను. బహుశంకలచేత బాధపడుచున్న యీ దీనునియం దనుగ్రహించి ఆధర్మములనుగూడ దెలుపవేడెదను.

కలిపురుషుడు—ఆయుష్మంతుడా శంకలచేత పీడింపఁబడెడు నాశిష్యకోటికిని శంకానివృత్తులవలన నుద్ధరించుటకే నేనవతారమెత్తితిని. కాబట్టి నీవ్రసందేహింపక నీశంకలనెల్ల నివారించుకొనుము. మీ శంకానివారణమే నాకు పరమానందముకదా.

అహం—అట్లయిన దేవా! ఇదిగో అడుగుచున్నాను. వినుము. వర్ణభేదముండవలసినదా? వర్ణములెన్ని? అవి యెవరుచేసిరి?

కలి—ఉండవలసినదే. ఈవర్ణభేదమును నేనే కల్పించితిని. అవి మొదట నాలుగు. ఇప్పుడు నాలుగులక్షలున్నవి.

అహం—నీవా! యీ బేధములు జేసినవాడవు. బ్రహ్మచేసెనని లోకులు చెప్పుచున్నారే.

కలి—బ్రహ్మగాదు. వర్ణభేధము పెట్టివాడను నేనే. వర్ణభేదము వలనగాని యైకమత్యము చెడిపోదు. ఐకమత్యము చెడనియెడల నేను తలచుకొన్నపనిగాదు.

అహం—అట్లయిన మొదట నాలుగువర్ణముల జేసితివిగదా. అంతతో తృప్తిపొందక నాలుగులక్షలవర్ణము లేలచేయవలెను?

కలి—మొదట నాలిగింటితోనే నేనుచేయదలచుకొన్న నా ఘనకార్యము సంపూర్ణమగునని తలంచుకొంటినిగాని యంతత్వరగా

నాతలంపు నెఱవేఱిన దున ఒక్కొక్క వర్ణములలోనుండి వందల కొలది వేలకొలది శాఖలను బుట్టించితిని. కొందరు కొందరు మూర్ఖులలో నేను ప్రవేశించి వారిచేత జనుల నిన్ని తెగలుగ విడదీయించితిని. దేశముచేతను భాష చేతను: ఆచారవ్యవహారములచేతను మతముచేతను, శాఖలచేతను తెగలచేతను ఇప్పుడు జనులు యెన్నివిధములుగ విభాగింపబడి నాశిష్యులైయున్నారో చూడుము.

అహం—ఇంతటితో జాలునా. ఇంకను బేధముచేయదలచుకొన్నావా ?

కలి— ప్రస్తుతమిదిచాలును. నాపనిదీనితో మిక్కిలి ప్రశస్తముగ జరుగుచున్నది అవసరమైనపక్షమున నింకను ముందుముందు బహుశాఖలను సృష్టింపదలచుకొని యున్నాడను, చూడు. నాసంకల్పము. ఎంతతృప్తికరముగ నెరవేరుచున్నదో. బ్రాహ్మణులలో వైదికిగొప్పయుద్యోగములో నున్నపక్షమున తక్కిన బ్రాహ్మణులను, అనగా మధ్వవైష్ణవ నియోగులను శూద్రాదుల నతడణగద్రొక్కుటకు ప్రయత్నముచేసి వారికొంపదీయును. నియోగి ఆపదవిలోనికివచ్చిన పక్షమున వైదికులు మొదలగువారి నతడు నేలరాచును. మధ్వుడువచ్చిన పక్షమున తక్కిన బ్రాహ్మణులను మాడ్చును. వైష్ణవుడు వచ్చినపక్షమున తక్కితర విప్రులనుపట్టి పల్లార్చును. శూద్రుడు ఆస్థానమున ప్రవేశించినపక్షమున బ్రాహ్మణులకందరకు మహాపకారము చేయును. తురక ఆపదవిని పొందినపక్షమున హిందువులనందర దుంపతెంపును. ఈవిధముగా వర్ణభేదము మనుస్మృతిలో లేదు. ఇండ్లలో లేదు. గ్రామములలో లేదు. కాని కచేరీలలో మాత్రమున్నది. పాపము వర్ణభేదమను దేవత చాలకాలమునుండి మతసంస్కర్తలు సంఘసంస్కర్తలు దేశమునుండి తరుముటకై ప్రయత్నించుటచేత వారిదెబ్బలు తినలేక భయపడి, ఆయుధపాణులైన భటులెప్పుడు కాచుకొని యుందు

రుగదాయని తలచి కచేరీలలో కాలూది నిలిచి హాయిగ గుంజ్జమీద చేయివైచికొని సుఖించుచున్నది. ఆనాటికానాడు దానికిదగిన యాదరణముగూడ జరుగుచున్నది. ఈదేవత యొక చేరీలలో శాశ్వతముగ వర్థిల్లుగాక సురక్షితముగ నుండుగాక! నాపరిజ్ఞావిశేషముచేత వర్ణభేదమింతమాత్రముతో సమాప్తము నందలేదు. ఇది ఖండాంతరములయందు గూడ వ్యాపించియున్నది మనుష్యులలో నల్లవారికి పచ్చవారికి, నల్లవారికి, తెల్లవారికి, తెల్లవారికి పచ్చవారికి, వర్ణభేదముల చేత బహువిధములైన యంతఃకలహములు గలుగుచున్నవి. ఇదియంతయు వర్ణభేదముయొక్క మహాత్మ్యమే. ఇదియెప్పుడు నాకు కనులపండువుగానుండును చెప్పెదవినుము. జనులందరు ఇంకనుపలు తెగలుక్రింద భాగింపఁబడి ఒకరిమొగ మొకరు చూచుకొనకుండా ఒకరిచేతియన్న మొకరు తినక ఒకరిచేతిసీళ్లొకరు స్పృశియింపక ఒకరునడిచినదారిని మరియొకరు నడువక నడుమనడుమ కఠినములైన వాగ్వాదము జేసికొనుచు తరువాత బుఱ్ఱలుపగులగొట్టుకొనుచు కొంపలు తగులబెట్టుకొనుచు హత్యలుచేసికొనుచు నున్నపక్షమున నేనపరిమితానందభరితుడనై యుందును. జనులిల్లు కావలయుననియే నేను సకల ప్రయత్నముల జేయుచున్నాడను. కొంతవరకీ ప్రయత్నముకూడ ఫలించినది. ఏలననగా పలుతావులలో తురకలు హిందువులు నేను పైనజెప్పినట్లు నడచకొనుచున్నారు. తెనుగుదేశమందలి బ్రాహ్మణులలోగూడ నవీనముగ నిట్టికక్షలు బయలుదేరుచున్నవి. ఇదినాకు సంక్రాంతిపండుగ. ఈపద్ధతులు నాకిష్టము. ఈపద్ధతులు వేయేండ్లువర్థిల్లుగాక!

ఇది కలిగీతాశాస్త్రమునందు

తొమ్మిదవయధ్యాయము.

# పిశాచయోగము.

అహంకారు—దేవా! మహానుభావా? వర్ణాశ్రమధర్మయోగము అమృతమువలె నాకు శ్రవణానందము గలుగజేసినది. చాలవరకు నాకు గలసందేహములు తీరినవి. ఇంక స్వల్పవిషయములలో మాత్రమే నాకు సందేహములున్నవి. దేవరవారివంటి పరమగురువులు నాకు ఈ జన్మమునందు దొరకరు సరేగదా ఇకముందు సహస్రజన్మములకైనను లభింపరు కాబట్టి దీపముండగానే యిల్లు చక్కబెట్టుకొనవలెనన్న పెద్దలమాటలనుబట్టి మీవంటిపెద్దలు సాక్షాత్కరించి యున్నపుడె ధర్మసందేహములన్నియు దీర్చికొనవలెను. తరుణముదాటిపోయిన తరువాత విచారించిన కార్యమేముండును. కాబట్టి నేనొకచిన్నసందేహము నడుగుచున్నాను. అనుగ్రహించి చెప్పవలయును.

కలి—వత్సా నావంటి గురువు దొరకుట నీ కెంతదుర్లభమో వినయవిధేయతాది సద్గుణములుగల నీవంటి యుత్తమ శిష్యుడు నాకు దొరకుటయు నంతదుర్లభమే. కాబట్టి మనమిద్దరము పూర్వజన్మమందు జేసికొన్న పుణ్యమునుబట్టియే మన మిట్లు గురుశిష్యులమైతిమి. కాబట్టి నీ సందేహములదీర్చుటకు సిద్ధముగ నున్నాను. అడుగ దలచిన వేమియో యడుగుము.

అహం—స్వామీ! మహాప్రసాదము ఇదిగో మనవి చేయుచున్నాను వినుండు. పూర్వకాలమునందు ప్రతి గ్రామమందును ప్రతి గృహమునందును పిశాచములు విశేషముగ గనబడుచు వచ్చినవని మన పెద్దలవలనను గొన్ని పుస్తకములవలనను వినుచుందుము. అది యేమొకాని యీ దినములలో ఆ పిశాచములు బొత్తిగా గనబడుటయే లేదు. ఆ పిశాచము లేమైనవి? ముక్తిపొందినవా? నాశనమైనవా? జన్మాంతరమునందినవా? ఈ సందేహము తీర్పవలయు.

కలి—వత్సా! ఎంతవెఱ్ఱివాడవు. పిశాచములకు ముక్తియెన్న డును లేదు. నాశన మంతకన్నను లేదు. అవిజన్మాంతరమును బొందబట్టి మీకు విశేషముగ గనబడుటలేదు.

అహం—ఏమి! జన్మాంతరమందినవా? అట్లయిన నిప్పు డేరూ పముతో భూలోకములో నున్నవో చెప్పవలయును. ఈ సంగతి విను టకు నా మనస్సు మిక్కిలి తత్తరపడుచున్నది.

కలి—ఇదిగో జెప్పుచున్నాను. మనదేశములో ఈ మధ్య రమారమి నూరు సంవత్సరములనుండి హూణసరస్వతియని యొకా నొకదేవత యిక్కడ ప్రవేశించి తిరుగుచున్నది. ఆమెవద్ద గొప్ప గొప్ప మంత్రశక్తులున్నవి. ఆ మంత్ర ప్రభావముచేత పిశాచము లన్నియు నా దేవతకు జంకి మన దేశములో వెనుకటి రూపములతో నిలువలేక ఆత్మ హత్య జేసికొని జన్మాంతరముపొంది మారు వేషములతో లోకములో తిరుగుచున్నది. ఈ మారువేషములతో నుండుటబట్టి యవి వెనుకటి పిశాచములేయని యానవాలు పట్టుట గ్రహించుట మిక్కిలి కష్టముగానున్నది. జన్మాంతరమెత్తిన యీ పిశాచములకంటె అసలు పిశాచములే మిక్కిలి మంచివని తోచుచున్నది. ఏలయనగా అసలు పిశాచములు మంత్రవేత్తలకు భయపడుచువచ్చినవి. ఈ పిశాచములకట్టి భయములేదు. పాతపిశాచ ములు కొంత కుంభము పెట్టి దిగతుడుపు పెట్టిన పక్షమున తృప్తి పొంది వదిలిపెట్టి వెళ్ళిపోవుచుండెడివి. ఇప్పటిదయ్యముల కెన్నడు తృప్తియేలేదు. వెనుకటి దయ్యములు ముతపొగ మొదలయినవాటికి మంత్రవిభూతికి బెదిరి పోయెడివి. ఇప్పటివాటికి బెదురులేదు. అప్పటి పిశాచములు మనుష్యుని త్వరగా జంపుకొనిపోయెడివి. ఇప్పటివి మనుష్యుని చావనియ్యవు, సరిగా బ్రతుకనియ్యవు. పూర్వపు పిశాచ ములు వల్లకొళ్ళలోను మోదుగచెట్లలోను పాడుకొంపలలోను దొడ్ల

లోను చెట్లమీదను వాసము చేయుచునచ్చినవి. ఈ నాటిపిశాచ ములు చక్కగా కొంపలుగట్టుకొని కాపురములు సేయుచున్నవి. పూర్వపుదయ్యములకు నోళ్ళుచిన్నవి. కడుపులు పెద్దవి ఇప్పటివాటికి కడుపులు పెద్దవే, నోళ్ళూపెద్దవే. ఆ పిశాచములకు మడిమలు ముందుకు పాదములు వెనుకకు నుండుననియు నందుచేత వంకర నడకలు నడచుననియు జెప్పుదురు. ఇప్పటివాటికి పాదములు సరిగానే యుండునుగాని యెందుచేతనో తప్పునడకలు వంకరనడకలు వాటికంటె నెక్కువగనున్నవి. ఆ పిశాచములకు సంతానవృద్ధిలేదు. ఈ పిశాచము లకు సంతానవృద్ధి గూడగలదు. ఆ పిశాచములు మనుష్యుడు ఒంటిగా వెళ్ళినపుడె బాధపెట్టును. ఈ పిశాచములో మనుష్యుడు నూరు మందిలో కలిసియున్నను పీక్కుతిని బాధపెట్టును. వాటిని మారణ హోమము చేయవచ్చును వీటినిట్లు చేయుటకు వీలులేదు. కాబట్టి క్రొత్తయవతారములెత్తిన యీ నాటి పిశాచములు పైకి మామూలు మనుష్యులవలె సాధువులుగ గనబడుచున్నను, వెనుకటి వాటికంటె లోకమునకెక్కుడు బాధకరములై యున్నవి. ఈ నాటి యీ పిశాచ ములు నాలుగు విధములు. ఇందు మొదటివి గురుపిశాచములు. ఇవి గురువులమని పేరుపెట్టుకొని తలలు గొరిగించుకొని కాషాయ వస్త్ర ములను గట్టుకొని పీఠములెక్కి శిష్యులైన మందభాగ్యులలో నేరము లేనివారిని వెలివేసి నేరములున్నవారిని హిరణ్యశ్రాద్ధములు పుచ్చు కొని వదలివేసి పాదపూజలని పేరుపెట్టి భిక్షలని పేరుపెట్టి వందల కొలది ధనములాగి సంసారములను దిబ్బజేసి మనుష్యులను పీక్కుతినుచున్నవి. రెండవవి అధికార పిశాచములు. ఈ పిశాచముల బాధ నుభవించుచున్నారు. గనుక నీకు విస్తరించి చెప్పనక్కరలేదు. మూడవవి యాచక పిశాచములు. ఈ పిశాచములసంగతి చెప్పుట కనేక సంవత్సరములు పట్టును. వానిలో బ్రాహ్మణ రామాయణముల

వంటి పెద్దగ్రంథములగును ఈ పిశాచములు నిజముగా మనుష్యులను నిలువబెట్టి రక్తమును పీల్చివేయుచున్నవి. ఈ పిశాచములు ఆవహించినపక్షమున మనుష్యునకు మాట తోచదు పనితోచదు. మనసు మనసులో నుండదు. అన్నివృత్తులలో యాచకవృత్తియే యుత్తమోత్తమమని యీ పిశాచములు నానాటికి వృద్ధియగుచున్నవి. ఈ పిశాచముల తాలూకు దగ్గరచుట్టమొకటిగలదు. దానిపేరు మొగమోటము. అది వచ్చిముందుగా మనుష్యుల నావహించును. ఆ తరువాత యాచకపిశాచములువచ్చి మనుష్యులను పీక నారంభించును. వాటి తాలూకు చుట్టము ముందుగావచ్చి యావహించుటచేత మనుష్యుడు వెంటనే యీ పిశాచములకు లోబడిపోవును. గుళ్ళు గోపురములు కట్టింతుమని ధ్వజస్తంభము లెత్తింతుమని సత్రములు వేయించుచున్నామని దేవుళ్ళకు మ్రొక్కుచున్నామని వంకలుపెట్టి యీ పిశాచములు బయలుదేరును వీటికి కుంభములతో తృప్తిలేదు. దిగదుడుపులతో తనివిలేదు. ఇచ్చినను తంటా ఇవ్వకున్నను తంటా. ఈ పిశాచములను వదల్చుకొనుటకు కొత్తమంత్రగాళ్ళు కావలెను. నాలుగవవి అల్లుడు పిశాచములు ఇవికట్నములవేరుపెట్టి అత్తవారికొంపలు గుల్లచేసి వివాహములైనతరువాత గాదిక్రింద పందికొక్కులవలెచేరి అత్తగారియింటచెదలితిని అత్తమామలను యావజ్జీవము పీల్చి పిప్పిచేసి బాధపెట్టుచుండును. ఈ పిశాచములన్నిలకి మునుపటి నుంతపోగలు మొదలయినవి పనికిరావు. అహం కారుడా? ఈ పిశాచములన్నియు మన శిష్యకోటిలో జేరినవిగనుక వీటికి మరియొక హాని చేయకూడదు.

అహం—చిత్తముదేవా. ఈ యోగము చాలబాగున్నది.

ఇది కలిగీతా మహా శాస్త్రమునందు

పిశాచయోగమను

పదవయధ్యాయము.

# సాయుజ్య యోగము.

అహంకారుడు— భగవంతుడా! ఈవరకు బహుయోగములు తవముఖమున విని జంగమస్థావర రూపకములగు సకలభూతకోటి లోనే నగరిగణ్యుడనైతిని జన్మఫలించె. ఇప్పుడు మనస్సునకొక క్రొత్త సంశయము పుట్టినది. మీరు మహానుభావులరు మీమహిమ మపారము. ఈతోలుకన్నులతో మిమ్ము నెవ్వరును జూడలేరు. మీరు తల వెంట్రుకకంటెను సన్నముగాను చోడిగింజకంటెను సూక్ష్మముగాను రూపములు ధరించి సకలజంతుకోటి హృదయములలోను నివాసము చేయుదురు. మీరు వాచామగోచరులు. వెయ్యేల మీమహిమ చెప్ప రానిది. మీరు చెప్పరానివారు. ఇందుచేత మీరెందరి కన్నులకు గన బడరు. కాబట్టి యేరూపకముగా మిమ్ములను లోకులు పూజసేయ వలెనో మాకు దెలియజేయవలెను. పూజావిధానము తెలియకపోయి నచో మాభక్తియంతియు వ్యర్థమైనదగును.

కలి— ఆయుష్మంతుడా! అహంకారుడా! ఈప్రశ్న నడిగి నీవు తెలివిగల పనిచేసితివి. భక్తియంతయు చేయునట్టి యర్చనము లోనేయున్నది. కాబట్టి ప్రతిమనుష్యుడు పూజావిధానములో జాగ రూకుడై యుండవలెను. ఈవిషయమై నీకు నేను పరమోపదేశము చేసెదను. అన్నియోగములలో నిది మిక్కిలి యుత్తమోత్తమమైన యోగము. ముక్తివచ్చినను రాకపోయినను దీనివలననే గనుక యీ విషయమై నీవు మిగుల సావధానుడవై యుండవలెను.

అహం— ఆవిధముగానే యున్నాను. ఇప్పుడు మనస్సులో నిరెం డవతలంపు లేదు. మీయుపదేశము నీసమయములో జేసినపక్షమున అచ్చుపడినట్లు నామనస్సులో బడిపోవును. కాబట్టి సత్వరము జెప్ప వలయును.

కలి—ఇదిగో చెప్పుచున్నాను. ఆకర్ణింపుము.

అహం—దైవ మొక్కడా? అనేకులా?

కలి—దైవ మొక్కడే. ఆదైవమును నేనే.

అహం—ఇతరదేవత లున్నారా లేరా?

కలి—ఉన్నారు.

అహం—వారిని పూజించవలసినదా లేదా?

కలి—కొందరిని పూజింపవచ్చును. కొందరిని పూజింపగూడదు.

అహం—ఎవరిని పూజింపవచ్చును. ఎవరిని పూజింపగూడదు. ఆసంగతి చెప్పవలెను?

కలి—అదే నేనును జెప్పదలచుకొన్నాడను. వినుము. ఈమనుష్యులు పూజసేయునట్టి దేవతలు చాలవరకు నాకు లోబడిన దేవతలే. కాబట్టి వారికి జేసిన పూజలన్నియు నాకే చుటుచుండును. ప్రతిగ్రామమందు ప్రతిపట్టణమందు ఊరుబైట వెలసియుండునట్టి గ్రామదేవతను నేనే. నేను నామాయచేత స్త్రీజన్మము పురుషజన్మముగూడ, ఎత్తగలను. అమ్మవారలని పేరుపడియున్న యీగ్రామదేవత లన్నియు నా యవతారములే. వాటికి జరుగునట్టి పూజలు జాతరలు, ఉత్సవములు నాకు మిక్కిలి యిష్టములు. ఆదేవతలకు బలినిమిత్తమై మేకలనుదెచ్చి కట్టిపెట్టినపుడు నాసంతోషము జెప్ప నలవిగాదు. అవి మరణభీతిచేత, అరచుచున్న ధ్వని నాచెవులకు పండుగగా నుండును. ఆమేకల జంపిన రక్తము భూమిమీద ప్రవహించినప్పుడు భూదేవిమీద వసంతము గొట్టినట్లు నామనస్సు సంతోషించును. జాతరలలో బండి చక్రములకు బ్రతికియున్న పందిపిల్లల గుచ్చి, అమ్మవారి నూరేగించునపుడు, ఆపందిపిల్లలు మొర్రోయని బాధపడలేక యేడ్చిన యేడ్పులు నాచెవులకు వీణాగానములై వినబడుచుండును. ఆయుత్సవములో దిష్టిపు ప్రతిమను

ష్యున కప్పుడు నేనే పూనియుందును. అహాహా! పూర్వము మనుష్య
బలియిచ్చి మనుష్యులను సిడియాడించి నాకెంతో తృప్తికలిగించెదు
వారు. కటకటా ఆమేలుదినము లన్నియు బోయినవి. ఇప్పుడు పాడు
దినములు వచ్చి కూర్చున్నవి. ఈదుష్టదినములలో గొర్రెలు మేకలు
మొదలగు వాటితోనే తృప్తిపొందుచున్నాను. ఆగ్రామదేవతలకు మను
ష్యబలులు మొదలయినవి మునుపటివలె యియ్యకపోవుటచేతనే దేశ
ములో యాకగువులు ఈ యకాలమృత్యువులు, ఈ బొబ్బలమ్మలు
బయలుదేరినవి. ఇదిగాక గ్రామమధ్యమందుండు పోతురాజును నేనే.
మరియు కాళీమహాశక్తిని నేనే. ఆమెకుచేయు మాంసపునైవేద్యములు
కల్లునైవేద్యమును చాటుచాటున నిప్పటికిని యిచ్చు నరబలులు అన్ని
యు నాకే ముట్టుచుండును. వత్సా! అహంకారుడా! ఈపాడుకాల
మేమిటికాని పూర్వము కాళికాపూజ సర్వోత్కృష్టముగా వెలసియున్న
పుడు నామనోరథము సంపూర్ణసిద్ధియగుచువచ్చినది. అయినను యిప్పు
డుగూడ యేచాటునో మాటునో నరబలులు తరుచుగా జంతువులబలులు
జరుగుచున్నవి కాబట్టి నేను బ్రతికియుండి మీవంటిశిష్యుల కుపదేశము
చేయుచు, అధికారము చేయగలిగితిని. ఈవిధముగా నే యజ్ఞములు
గూడ నేనే. అందులో నాశిష్యులైన బ్రాహ్మణులు కొందరు కటిక
వాళ్ళకంటె బాగా ఒక్కొక్కడు నూరేసిమేకలు కోసినవాళ్ళువచ్చి
నాకు కొంతవరకు కనుపండువు సేయుదురు. కాని వైష్ణవులు మాధ్వు
లు నిజపశువులను చంపరుగనుక వారుచేయు యజ్ఞములు నాకిష్టము
లేదు ఇవియేగాక యింక లోకములో జరుగునట్టి వికృతములైన
యారాధనలలో నేనెప్పుడు ప్రత్యక్షమైయుందును. ఇది నన్ను పూజిం
చుటలో సగుణోపాసనము. ఇక నిర్గుణోపాసనమును గురించి సంగ్రహ
ముగా జెప్పెద వినుము. నిజమైన దైవభక్తుల కపకారములుచేయుట,
సత్ప్రవర్తనగలవారిని బాధించుట, అసత్యమునే యెల్లపుడు నాలుక

మీదనుంచుకొనుట నోరు మాటలాడుచున్న నొసలు వెక్కిరించునట్లు సంభాషించుట, పైకొకమాట లోపల నొకమాట చెప్పుట బుద్ధివక్రముగా ప్రసరింపజేయుట జనులకన్నులలో దుమ్ముకొట్టుట, జారత్వము, చోరత్వము, మొదలగువానియందు ప్రజ్ఞగలిగియుండుట మొదలయినవి నావిషయమైన నిర్గుణోపాసనములు. ఇవి వేయివిధములుగనున్నవి. తప్పుస్పష్టులు చేయుట మొదలయినవింక నేను చెప్పలేను. బుద్ధికుశలత గలవారవియన్నియు నూహించుకొని ఆవిధముగ నన్ను నుపాసన జేసి, ముక్తులు కావచ్చును. ఇది నీకు సంగ్రహముగ జెప్పితిని. ఈప్రకారము సగుణనిర్గుణోపాసనములచేసి నన్ను మెప్పించినవారు నాలో నైక్యమగుదురు అదియే సాయుజ్యముక్తి.

ఇది కలిగీతాశాస్త్రమునందు సాయుద్యయోగ మను పదునొకండవ యధ్యాయము.



# సదసద్వివేకయోగము

అహంకారుడు పలుకుచున్నాడు—దేవా! నా యోగము బాగుండుటచేత బహుయోగములు మీవలన వినియున్నాను. ఇక మీద యెవరితో సహవాసము చేయవచ్చునో యెవరితో జేయగూడదో యేగ్రంథములు చదువవలయునో యేవి చదువగూడదో యెక్కడికి పోవచ్చునో యెక్కడికి పోగూడదో అనువిషయము నాకుపదేశింపవలయును.

కలి—వత్సా! అందుకు సందేహమేమి? ఇదియే సదసద్వివేకయోగ మనబడును. అన్నియోగములుచెప్పి యిదిచెప్పకపోవుట

సకలాభరణములు బెట్టి శిరస్సునకు కిరీటము పెట్టక బోడిగా నుంచుట వంటిది. ఇదిగూడ ముఖ్యమైన యోగములలో నొకటి. అతిముఖ్య మనికూడ చెప్పవచ్చును. కాబట్టి నేర్చికొనవలెనని యాసక్తితో నిండియున్న నీమనః క్షేత్రమునందు నా యుపదేశబీజములను విరివిగా జల్లెదను. ఇవి త్వరలోనే ఫలించి వర్ధిల్లుగావుత.

అహం—మహనీయులగు మీదర్శనమని యెడు మేఘోదయ ముచేత యిదివరకు బీడుపడిన నామానసక్షేత్రము చక్కగా పదును కెక్కియున్నది. మీయుపదేశబీజములు చక్కగా నాటుకొనుచున్న వని నేను సంతోషించుచున్నాను. కష్టపడి చల్లిన మీవిత్తనములు వ్యర్థమైపోవుటకు రాతినేలగాదు. చవుటిపఱ్ఱయు కాదు కాబట్టి యను గ్రహింపవలయునని కోరుచున్నాను.

కలి—సత్సా! సావధానుడవై వినుము. ముందుగా సహ వాసవిషయమై చెప్పుచున్నాను. మనస్సులో నిజమైన వైరాగ్యము గల సన్యాసులతో నెప్పుడు సహవాసము చేయవద్దు. వెధవకు దం డము పెట్టగా తన్నుబోలి బ్రతుకుమని దీవించునట. అట్లే విరాగు లతో స్నేహముచేసినవాడు విరాగియై పాడై పోవును. ఈవిధము గానే తృప్తిగలవారితో స్నేహముచేయగూడదు. తృప్తి కోరికలను మొలవకుండ నాశనముచేయు వేఱుపురుగు. అది అభివృద్ధినిగాని య్యదు. మిక్కిలి చెడ్డది. దానిదరికి వెళ్ళగూడదు. ఈవిధముగానే వేదాంతులు నీతిమంతులు మొదలయిన వాదిని దూరముగ బరిహరించ వలెను. అధికారుల యిండ్లవద్దను ధనవంతుల యిండ్లను ఎప్పుడు దాస్యము చేయుచునుండవలయును. ఆత్మగౌరవము గలవారమని విఱ్ఱవీగునట్టి పొగరుబోతుల మొగమైనజూడగూడదు. అంటుజాడ్యము వలె వారి పొగరుబోతుతనము దరికి వెళ్ళినవారి కంటగలదు. ఉప న్యాసము లెప్పుడు వినగూడదు. సభలలోనికి వెళ్ళగూడదు. నరక

మునకైన బోవచ్చునుకాని యాస్థలములకు వెళ్ళగూడదు. వృత్తాంత పత్రికలు ముట్టగూడదు. చదువగూడదు. వినగూడదు. అవి త్రాచు పాములవంటివి. పుస్తకములలో కావ్యములు మంచివి. ఉపనిషత్తులు ఊసుపోనికూతలు. వేదాంతము వెధవముండల ప్రసంగము. భారతము బొంకు. రామాయణము రంకు. భాగవతము పనిలేనిపాట. ప్రహ్లాదచరిత్ర కలలోను జదువకూడదు. కృష్ణలీలలుమట్టుకు కొంచెము కంఠతా పట్టు. తెనుగుపుస్తకములలో కవిచౌడప్ప శతకము, రాధికాసాంత్వనము, తారాశశాంకము, చంద్రరేఖావిలాపము, కొక్కోకము యీయైదు ప్రతిమనుష్యునకు పంచప్రాణములై యుండవలెను. వీటిలోనె రసమున్నది. వీటిలోనె ఆనందమున్నది. వీటిలోనె ముక్తియున్నది. నేనా యైదుపుస్తకములలో అతురరూపుడనై యున్నాను. కలి బ్రహ్మావాదులైన మహానుభావు లీవిషయము నెఱుగుదురు. వేశ్యాగృహములు జూదపుపాకలు కల్లుదుకాణములు గంజాయికొట్లు మద్దతుఖానాలు వెళ్ళదగిన స్థలములు నోటికి రుచించిన వస్తువులన్నియు దినవచ్చును. ఇష్టమైనదెల్ల త్రాగవచ్చును. మనోజ్ఞమైన ప్రతివస్తువు జూడవచ్చును. శ్రావ్యములైనవన్నియు వినవచ్చును. అట్టివి కూడదనువారు మూర్ఖులు అరసికులు ద్విపాదపశువులు. ఏలననగా పశువులు సంగీతము వినలేవు. సరసము గ్రహింపలేవు. ఇదియే సుఖసాధనము.

ఇది కలిగీతా శాస్త్రమునందు
సదసద్వివేక యోగమను
పండ్రెండవ
యధ్యాయము.

# విశ్వరూపప్రదర్శనము

అహంకారుడు పలుకుచున్నాడు.

అహం—మహాత్మా! కలిపురుషా! ఇదివరలో మీరు మీ ప్రభావమంతయు సెలవిచ్చినారు కాని నాకోరిక ప్రకారముగా మీ యొక్క నిజమూర్తిని చూపలేదు. విశ్వవ్యాపకమై మహాద్భుతమై లోకతంత్రమును నిర్వహించుచున్న మీదివ్యమూర్తిని కన్నులార చూచి సంతోషింపవలెనని చిరకాలమునుండి యున్నది. ఆమూర్తిని చూచినగాని నాసందేహములు వీడవు కావున దీనుడైన యీశిష్యుని కరుణించి మీదివ్యమూర్తిని జూపప్రార్థించెదను.

కలిపురుషుడు పలుకుచున్నాడు.

కలి—వత్సా! అహంకారుడా! నేను లోకమంతా వ్యాపించిన పురుషుడనేయని యింతకుమున్నే దెలిపియుంటిని. అయినను మందబుద్ధివైన నీకది సంపూర్ణముగా గ్రాహ్యమైనట్లు కనిపించదు. కావున నీయిష్టానుసారము నావిశ్వరూపమును గనబరచి నిన్ను ధన్యుని చేసెదను. కాని పిరికిగుండెగల నీవు భయపడుదువేమో యని సందేహము గలుగుచున్నది. అదియునుగాక యీతోలు కన్నులతో నీవు నావిశ్వరూపమును చూడజాలవు. నీకేగాదు. నావిశ్వరూపమును జూచుటకు రుద్రాది దేవతలకు మహిషాసురమర్దని మొదలగు దేవతలకు గూడ సాధ్యముకాదు. వేయికన్నులున్న యింద్రుడు, రెండువేల కన్నులున్న శేషుడుగూడ నావిశ్వరూపమును చూడజాలడని భక్తులెల్లపుడు ఘోషించుచుండ నీవొక లెక్కగాదు. అందుచేత నీవు యీరూపమును సమగ్రముగా జూచి యానందించుకొరకు నీకు పిశాచదృష్టి నొసంగుచున్నాను. ఇదిగో సావధానుడవై యుండుము.

అహ — దేవా! సావధానుడనై యున్నాను గాని ఏందుచేతనో నాతల తిరుగుచున్నది. కండ్లు మిఱుమిట్లు గమ్ముచున్నవి. మనసు మారిపోవుచున్నది మునుపు కనిపించినవస్తువులు కనిపించుటలేదు. నేను భూమిమీద నిలిచియున్నట్లు తోచుటలేదు. ఆకాశముమీదికి నేనెగిరి పోవుచున్నాను.

కసి—వత్సా! అదియే పిశాచదృష్టి దానితో నన్నునీవు చూడ గలవు. ధైర్యము తెచ్చుకొని చూడుము.

అహం — స్వామీ! చూచుచున్నాను. ఆహాహా! నీవే బ్రహ్మాండనాయకుడవు. నీవే సకల భూతములయొక్క లోపలను, వెలుపలను నిండియున్న వాడవు. అఖండుడవు. అనంతుడవు. ఈభూతములన్నియు నీవలన పెరుగుచున్నవి. కోరికలకన్నిటికి నీవే యాధారుడవు. ఆహాహా! నీమూర్తి లోకాతీతమై, అసాధారణమై, బ్రహ్మాండవ్యాప్తమై, యద్భుతమై భయంకరమై యున్నది. అసూయయు, మత్సరంబును నీకు నేత్రంబులై చింతనిప్పులవలె దేదీప్యమాన ప్రభలతో వెలుగుచున్నవి. పంచమహాపాతకంబులు నీకు జడలు. నీకు చెవులందు కొండెంబులును, మనస్సునందు కామ, క్రోధ, లోభులును, నాలుకయం దసత్యంబు బూతులును కొండనాలుకయందు లంచములును హృదయంబున దంభమును, కంఠంబునం దాశాదేవియు, లలాటంబున మాయయు భుజంబులందు కావిడిబద్దలు దుష్టుకర్రలును, వీపున నిందాదేవతయు, వక్షస్థలంబున నాస్తిక మహాదేవియు, కుడిహస్తమున హింసాచౌర్య దేవతలును, ఎడమహస్తమున కత్తులు, తుపాకులు, ఫిరంగులు, నాభి, పాషాణము, మున్నగు హింసాసాధనములును, రోమకూపములందు పాములు, తేళ్ళు, మండ్రగబ్బలు, జెర్రెలు. కండచీమలును ఉదరంబున పెద్దపులులును, తోడేళ్ళు, సింహంబులును, నాభియందు పాడునూతులు [illegible] వేశ్యాం

గనాగృహంబులు, కల్లుదుకాణములును, నాకు గనబడుచున్నవి. మరియు నీకు బద్ధకంబునడుము. అతినిద్రలు నీకుతెప్పలు. కొడవళ్ళు చాకులు, కత్తిపీటలు, గరిగమ్మలు నీకుగోళ్ళు. అధర్మంబును, అజ్ఞానంబును, నీకు కోరలైయున్నవి. కరువు, వ్యాధి, విసూచి, మశూచి, బొబ్బలమ్మ నీప్రియపుత్రికలై నీయొడిలో గూర్చుండి వేలకొలది శవముల చెరుకుగడలవలె విరుచుకొని తినుచు నీశరీరముపై బాకి యాడుకొను చున్నారు. దుర్గంధములు నీయుచ్ఛ్వాసనిశ్వాసంబులై యున్నందున నేనావాసనకు భరింపజాలక దరికి రాజాలకున్నాను. లోకమునుమాడ్చి వేయుటకు తక్కిన నీశక్తులన్నియు నొకయెత్తు, ఈయుచ్ఛ్వాసనిశ్వాసంబు లొక యెత్తుగనున్నవి. మురికినీరు నీచెమ్మటయై కాలువలుగ బ్రవహించుచున్నది. ఇందులో నీపరమభక్తులు నిన్ను స్తవము జేయుచు ఓహోహో! యెట్లు తనివిదీర స్నానము జేయుచున్నారు? ఏమి వారి పుణ్యము? ఏమి వారి భాగ్యము? నారికి అఱచేత మోక్షము కనిపించు చున్నది. ఆహాహా! నీ జీర్ణకోశ మెంత యద్భుతముగనున్నది! దానియందు వేలకొలది కసాయిదుకాణములు రక్తప్రవాహములతో, ఎముకల గుట్టలతో, మాంసపు కండలతో, చర్మముల కొండలతో భీభత్సముగ నున్నది. యజ్ఞాది క్రతువులు చేసిన సోమయాజులు, వారికి తోడ్పడిన మహనీయులు, జంతువులనుపట్టిన కుమ్మరులు, మొదలగువారు చర్మపుకొండల దరిని నాకు కనిపించు చున్నారు. మహానుభావా! మీయుభయ పార్శ్వములందు నిలిచియుండి చేతులు జోడించి మిక్కిలి నమ్రులై మీకు స్తవము జేయుచున్నవా రెవ్వరు? మీ తలమీద నేదో యెత్తుగ బుట్టవలెనున్నది. అది యేమి? మీకు చేతులతో యెవరినో ప్రేమచేత వీపుపై తట్టుచున్నారు. అంతగా మీకు ప్రియులైన ఆశిష్యులెవ్వరు? మీకోతలసందునబడి గానుగలోబడిన చెరుకుగడలవలె తుత్తినియలై నలిగిపోవుచున్న వీరెవ్వరు? మీ శరీర

ములోనుండి ప్రవహించుచున్న యీరక్తము యెక్కడకు పోవు చున్నది ?

కలిపురుషుడు పలుకుచున్నాడు.

కలి—వత్సా! ఇప్పుడు నీకన్నులు ధన్యమైనవిగదా! నీవు భయపడకుము. నీవు పిరికివాడ వనియే నారూపమున నూఱవవంతైన నీకు జూపలేదు. నీకుగల సందేహముల నెల్ల నే నిప్పుడు నివారించెదను. నాప్రక్క నిలిచి నన్ను స్తోత్రముచేయుచున్న వారు చార్వాకుడు మొదలగు మహర్షులు. వారే నాధర్మములను లోకోపకారార్థమై లోకమున ప్రకటించి లోకులను బాగుచేయుచున్న మహానుభావులు. వారి వాక్కులే వేదములు. దేవుడు లేడు, కలిపురుషుడే భగవంతుడని వారిసిద్ధాంతము. ఈమహర్షి నాయొక్క సంపూర్ణమైన యవతారము. లోకములో నూటికి తొంబదితొమ్మండుగురు యీయన శిష్యులే. ఇంతయెందుకు? ఈయనయే నామంత్రి, నాకుడిచేయి నా బహిఃప్రాణము. నాతలపై బుట్టవలెనున్నది అప్రమాణము. అది బుట్ట కాదు నాకిరీటము. ఆకిరీటముపై మాణిక్యమువలె వెలుగొందుచున్న దానిని చూడుము! అది నాజెండా. అదియే యపతిష్టయను వెలలేని రత్నము. వెనుక నొకనాఁడు మాకు పరమశత్రువైన లజ్జాదేవిని జయించినపుడు, అమూల్యమైన యీరత్నము ఆమె ఖజానాలో మాకు లభించినది. దీనికాంతు లెల్లపుడు ప్రపంచమంతట వ్యాపించుచుండును ఇది వెలుతురులోను చీకటిలోనుగూడ నొక్కతీరున ప్రకాశింపగలదు.

ఇది కలిగీతా శాస్త్రమునందు విశ్వరూపపరిదర్శనమను
పదమూడవ అధ్యాయము.

# జన్మాంతరయోగము

అహం—దేవదేవా ? దేవరవా రిదివర కుపదేశించిన ధర్మములను వినినతరువాత నామనస్సు పదమూడు కళలతో నిండిన చంద్రమండలమువలె నిర్మలమై ధగద్ధగాయమానమై వెలయుచున్నది. నాకు గల తక్కిన సందేహములు కూడ బాపినపక్షమున నామనస్సు షోడశకళాపరిపూర్ణమైన చంద్రమండలమువలె జ్ఞానామృతమునకు నిలయమై భాసిల్లుచుండును. కావున నట్టిసందేహముల బాపవలయు.

కలి—వత్సా నీకుగలసందేహముల బాపుటయెగదా నాసకల ప్రయత్నము ! కావున నీవు నిర్భయముగా నడుగవచ్చును.

అహం—మహాత్మా జన్మాంతరమున్నదా లేదా ! అట్టి జన్మాంతరమున్నపక్షమున నీభక్తులెట్టి జన్మములెత్తుదురో నిన్ను ద్వేషించినవా రెట్టిజన్మము లెత్తుదురో నేను తెలిసికొనవలయును ఈవిషయము తెలిసికొనకపోయినపక్షమున నాజ్ఞానమసంపూర్ణమై యుండును. కాబట్టి దీనిని మీరానతీయవలయు.

కలి—ఇదిగో తప్పక యానతిచ్చుచున్నాను. జన్మాంతరములున్నవి. లేవనివాదించువారు వట్టిమూర్ఖులు. కల్లుకు సారా జన్మాంతరము. పేడకు పిడకలు, పిడకకు కచ్చికలు జన్మాంతరము. వంటచెరుకునకు బొగ్గులు జన్మాంతరము. ఈవిధముగా అన్నివస్తువులు అన్నిజంతువులు జన్మాంతరము లెత్తుచుండును. మనుష్యాది జంతువులు చేసికొన్న పాపపుణ్యములనుబట్టి అధమజన్మములనో. ఉన్నతజన్మములనో యెత్తుచుండును. నాభక్తులందరు నాలో నైక్యముబొంది శాశ్వతసుఖము ననుభవింతురు. నాభక్తులు కానివారు సకలనరకముల ననుభవింతురు. ఈలోకములో [illegible] యుంచుకొని

సుఖించినవాడు నాలోకములో రంభామేనక మొదలగు నచ్చరలతో నాలుగువేల సంవత్సరములు సుఖించును తాను స్వయముగా ఉంచుకొనలేనివాడు ముండలనుంచుకొన్నవారికి సహాయము జేసినపక్షము నను తార్చినపక్షముననుు, రంభయింటిలోను మేనకయింటిలోను నున్న వంటకత్తెలను దాసీలను చేపట్టి యైదువందల సంవత్సరములు సుఖించును. భార్యను బిడ్డలను తల్లిదండ్రులను వదిలివేసి ముండయే స్వర్గము మోక్షమునని యెంచుకొని దానియింటనే కూడుతిని, తిట్లుతిని, దెబ్బలుతిని, నిర్ధనుడై దానియరుగుమీదనే ప్రాణములు విడిచినవాడు కోటిసంవత్సరములు, ఆఖండసౌఖ్యమనుభవించును. వేశ్యాంగనలను, ఉంపుడుకత్తెలను, ఉంచుకొన్నవాని కన్నులారజూచి సంతోషించి మెచ్చినవారు వేశ్యాంగనలయొక్క లంగాలై, పైటలై, చీరలై, రవికలగుడ్డలై, తలకురాసుకొను చమురై పుట్టుదురు. భోగమువాండ్రను నిందించిన మహాపాతకులు వేయిజన్మములకైనను వాళ్ళకు విరోధులైపుట్టి యరసికులై వేదజడులై సన్యాసులై పుట్టుదురు. వైరాగ్యమును బోధించెడి నిర్భాగ్యులందరు కామలోకములో అడుగైనను బెట్టుటకు వీలులేక పాడుపడియుండు బ్రహ్మలోకములో బారెడేసి గడ్డములు పెంచుకొన్న మునిముచ్చులతో గలిసి నానాకష్టముల బడుచుందురు.

జన్మమెత్తినతరువాత యెవరికిని దమ్మిడీ గవ్వలైన దానము చేయని మహానుభావుడు, అన్నిటికంటె, ఊర్ధ్వలోకమైన కలిలోకములో మొహరీల పరుపుమీద వెండితంగడాలమీద పండుకొనును. అట్టి పుణ్యాత్ముడు బంగారురసమును నిరంతరము త్రాగుచుండును. దానముచేసిన యపాత్రులందరు తిరిగి తిరిగి భూలోకములోబుట్టి జననమరణబాధలు పొందుచుందురు. కల్లుదాహమిచ్చినవాడు నాలోకములోనున్న మద్యనదులలో హాయిగ యీదులాడుచుండును. సారాయిజారాలు చేసినవారు యింకొక జన్మమున త్రాటిచెట్లై పుట్టుదురు.

ఇది బహుసుకృతముచేతగాని లభింపదు. లోయిజాయదారులు లొట్టె లగుదురు. వెయ్యేల కల్లు సబంధము లోను సారాసంబంధములోను పని జేసినవారంపరు కీతకత్తులై నిచ్చెనలై బల్లలై సారాగూనలై జన్మింతురు. త్రాగుబోతుతనము మంచిదని మెచ్చుకొనువాండ్రందరు, ఈడిగ వాండ్రై పుట్టుదురు. దానిని నిందించువాండ్రు త్రాటిచెట్టుయొక్క సౌఖ్యమెఱుగక యుందురు. అట్టివారు త్రాటియాకు యిండ్లలో గూడ కాపురముచే యుటకు దగినవారు కారు. వారుచేసినపాపముచేత పెంకు టిండ్లలోను మిద్దెలలోను వారుకాపురము సేయుదురు అన్నిదానము లో నుత్తమదానము, సురాదానము, వేశ్యాదానము, ఆ రెండు సంపాదించుటకై యుపాదానము. జన్మాంతరమును గురించి చెప్పవల సిన సంగతులు చాలగనున్నవిగాని తక్కినవి నీవే యూహించుకొన గలవని స్థాలీపులాకన్యాయముగ నీకు చెప్పితిని.

ఇది కలిగీతాశాస్త్రమునందు జన్మాంతరయోగమను

పదునాలుగవ యధ్యాయము



# చరమాధ్యాయము



అహం—దేవాదిదేవా? మీ యనుగ్రహముచేత తత్వము సమ స్తము గ్రహించితిని. జీవన్ముక్తుడనైతిని ఇంకను బోధింపవలసిన దేది యైన నున్న పక్షమున నయ్యది నాకుపదేశించి ధన్యునిజేయవలయు. మీ నామస్మరణము నిమిత్త. మేమహామంత్రము జపియింప వలయునో యదిగూడ అనతీయవలయును.

కలి—వత్సా! చిరంజీవిగమ్ము, ఇకమీద నుపదేశింపవలసిన యంశములు విశేషముగ లేవు. పరమతారకములైన విషయము లొకటిరెండు మాత్రమున్నవి. అవి యుపదేశించెద వినుము.

అహం—స్వాతివానలకు ముత్తెపు చిప్పలవలె నాచెవులు మీ మాటలకై యెదురుచూచుచున్నవి. మిక్కిలి త్వరలో నానతీయ వలయు.

కలి—ఇదిగో జెప్పుచున్నాను. సర్వధర్మములను బరిత్యజించి నన్నే శరణుజొచ్చియుండుము. అందువలన నీకు సకల సౌఖ్యములు గలుగును. విచారమనునది నీచెంతకురాదు. ఇదియే పరమ ధర్మము.

అహం—దేవా! పరిత్యజింపవలసిన ధర్మములేవో ముందు తెలియజేయవలయును. అప్పుడుగాని యీ పరమార్థము మనస్సునకు బోధపడను.

కలి—సర్వధర్మములను పరిత్యజించుట యనగా సత్యమును బరిత్యజింపవలయును. త్యాగమును పరిత్యజింపవయును. శౌచమును పరిత్యజింపవలయును. దయను పరిత్యజింపవలయును. జ్ఞానమును బరిత్యజింపవలయును. నీతిని పరిత్యజింప వలయును. ఎవనినోటనుండి సత్యము వెడలగొట్టబడునో, యతడు సర్వసౌఖ్యములను బొందును. ఎవడు సత్యమే పలుకవలయునని పీకులాడునో వాడుసకలబాధలు పడును. సత్యమును పరిపాలించి హరిశ్చంద్రు డెన్ని యిడుమల గుడిచెనో నీ వెరుగుదువుకదా. సత్యమాడి బలిచక్రవర్తి పడిన భంగములు తెలియని వా రెవరు! సత్యమాడి దశరథమహారాజు ప్రాణముల బోగొట్టుకొనెను. సత్యమేవజయతే యను పలుకులు మునిముచ్చులు వ్రాసిన తప్పుమాటలు జ్ఞానమువలన మోక్షము గలుగుననుట యబద్ధము త్యాగ మెన్నడును జేయగూడదనిపని. పుణ్యమువచ్చునని కీర్తిగలుగునని లోకవంచకులగు మునులు కొందరు పురాణములో వ్రాసియుండుట

చే, ఆమాటలు తెలివితక్కువవాండ్రు నమ్మి తమ ద్రవ్యముల నుచితముగ నితరులకిచ్చుచున్నారు. మోసపోవద్దు. మోసపోవద్దు. ధనము చిక్కబట్టండి. నడ్డీకివ్వండి. దయయనునది మనోదౌర్బల్యముగాని సద్గుణముగాదు. దయానంతుడు భ్రష్టుడగును. హృదయము వజ్రమువలె కఠినముగా నుండవలయును. నీతి యనునది కొంద ఱప్రయోజకులు కల్పించిన పదము. నీతిగానుండుట యనగా శరీరమును కష్టపెట్టుకొనుట. శరీరమాద్యంఖలు ధర్మసాధనం, అన్నట్లు శరీరమే మనకు ప్రధానము ఆత్మ గీత్మ లేదు. యంత్రములలో నద్భుతమైన శక్తి పుట్టినట్లై శరీరములలో పంచభూతసంపర్కమువలన నీయద్భుతమైన శక్తిపుట్టుచున్నది. ప్రజలు నాశిష్యులగు నాస్తికులందురుగాక. నిందలు సేయుదురుగాక. దూషణ భూషణ తిరస్కారములతో వారికి పనిలేదు. స్వలాభము చూచుకొని పని చేయవలయును. నన్ను స్మరియింపదలచుకొన్నవారు "కలిపురుషాయనమః" యనునట్టి అష్టాక్షరీమహామంత్రము జపింపవలయును. దీనివలన సకలమనోరథములు సిద్ధించును.

అహం — దేవా! లోకములో మీ కాలయములు కట్టించి పూజసేయుదుమా?

కలి — ఓయి పిచ్చివాడా! నా కాలయములతో ప్రయోజనమేమి? ఆలయముగట్టి ప్రతిష్ఠించినపక్షమున నొక్కచోటనే యుండవలసివచ్చును ఆలయములోనున్నవా రాలయములోనే యుందురుగాని పైకిరారు. సర్వవ్యాపకుడనగు నాకు గుళ్ళతో గోపురములతో పని లేదు. ఇప్పుడు లోకములోనున్న శివాలయములు, విష్ణుదేవుని యాలయములు నావే. పేరునకుమాత్రము వాటిలో వారివిగ్రహములు ప్రతిష్ఠింపబడియున్నవి కాని నిజముగా నేనే యందు బ్రతిష్ఠింపబడి నిరాఘాటముగా జరిం చుచున్నాను. అక్కడకువచ్చు తైర్థికులు, అర్చనలుసేయు పూజారులు చాలమట్టుకు నాశిష్యులే. అదియును

గాక శివకేశవాది దేవతలవలె విగ్రహరూపకముగ నర్చింపబడుట నా కిష్టము లేదు. మనుష్యుల హృదయములే నా దేవాలయములు, ప్రతి మనుష్యుడు నాకర్చకుడు. హింస, అశుచి, మొదలగునవి నాకు భోగములు, నైవేద్యములు ఆశ, హింస మొదలగునవి యేహృదయ ములో నుండునో అక్కడ నేను ప్రత్యక్షమైయుంటునని నమ్మవలసి నదే. కాబట్టి నాకు వేరుగా నాలయములు విగ్రహములు నక్కరలేదు. కాముడు, క్రోధుడు, మోహుడు, లోభుడు మొదలగు నాసేనానా యకు లెంతకాలము అకుంఠితప్రతాపులై దిగ్విజయము సేయుచుం దురో, అంతకాలము కలిదేవుడు జగజ్జేగీయమానుడై వెలయుచుండును. ఎంతకాలము సూర్యమండల ముండునో యంతకాలము నాధర్మము లుండును. ఎంతకాలము చంద్రమండల ముండునో యంతకాలము నాయధికారముండును. పరమతత్వబోధకములైన యీకలిగీతలు చదివినవారికి విన్నవారికి వ్రాసినవారికి అచ్చువేసినవారికి అమ్మినవారికి కొన్నవారికి చూచినవారికి చేతితో తాకినవారికి యింటిలో దాచు కొన్నవారికి అక్షయసౌఖ్యములు కలిసాయుజ్యము గలుగును.

అహం—ధన్యోస్మి! ధన్యోస్మి! ఎప్పటికి మీపాదారవింద ములే శరణములు. అనంతకోటి జన్మములెత్తినను నేను కలిశిష్యుడనే గావలెను. కలిదేవునే నమ్మవలెను. కలిగీతనే పఠించవలెను.

ఇది కలిగీతాశాస్త్రమునందు పదునైదవదియగు

చరమాధ్యాయము సర్వంబును

సంపూర్ణము.

---

# అద్భుత కవిత్వము.



(గురువుగారు రంగన్న గంగన్న యను శిష్యులును ప్రవేశించుచున్నారు).

రంగ — అయ్యవారూ! మామనవి యేమిచేసినారు.

గురు — ఏమిచేయుట కేమున్నదిరా. నేను నిన్న చెప్పలేదా.

గంగ — మాకిద్దరికి కవిత్వము చెపుతారా లేదా?

గురు — మీకిద్దరికి కవిత్వం చెప్పడమేమిటి.

రంగ — కాదండి వాడిమాట సరిగా లేదు. కవిత్వం చెప్పడం నాకు నేర్పవలెను.

గురు — కవిత్వం చెప్పడం యెవడు నేర్పగలడురా. ముందుగా మనిషికి గొప్పపాండిత్య ముండవలెను. వ్యాకరణము రావలెను. ఛందస్సు రావలెను. అలంకారశాస్త్రము రావలెను.

రంగ — ఎందుకండలంకారశాస్త్రిలు వ్యాకరణశాస్త్రిలున్నూ. ఏవో రెండుమూడు గ్రంథాలు చదువుకొన్నాముకదా మేము. ఉన్నంతపాండిత్య మున్నది.

గురు — ఓరి నీపాండిత్యం తగులబెట్టా యేమిపాండిత్య మున్నదిరా మీకు. భాస్కరశతకం, సుమతీశతకము, వేమనశతకము నాదగ్గర చెప్పుకొన్నారు మీరు. అందులోగూడ కఠినమైన స్థలములలో మీకర్థము రానేరాదు. ఈమాత్రానికే పాండిత్యమున్నదని చెప్పుకుంటూన్నారా. దాశరథిశతకము చెప్పుకోమంటే నాలుగుపద్యములు చదివి మానివేసినారు. అందులో కొన్ని కష్టములైనపదములు సమాసములు నున్నవి. అది చదువుకుంటే కొంతపాండిత్యము కుదురుతుంది. అందులో రంగధరాదిభంగ యను పద్యముదగ్గరకు వచ్చేటప్పటి కర్థ

ము తెలియక మీకు ముచ్చెమటలు పోసిపోయినాయి. ఈవరస చదువు వాళ్ళు మీరు కవిత్వాలు చెపుతారా? భాష పాడుచేయకము కాని మీకు కవిత్వ మబ్బుతుందీ!

రంగ—ఈరోజుల్లో సమాసా లెవరికిగావాలి కష్టపదా లెవరికి గావాలండీ!

గురు—అయితే యిదివరకు మీకు చందస్సు చెప్పివేసినాను కదా కవిత్వం చెప్పండి.

రంగ—కొంచెం కొంచెం చెపుతూన్నామండి. మేము చెప్పిన పద్యాలు మీరు దిద్ది బాగుచేస్తే మేము బాగుపడి మంచిమంచి పుస్తకాలు వ్రాస్తాము. లోకాని కుపకారం చేస్తాము.

గురు—మీరు పుస్తకాలు వ్రాసి లోకాని కుపకారం చేయ నక్కఱలేదు. మహానుభావులు పూర్వము భారతము భాగవతము రామాయణము వ్రాసి మనుచరిత్ర వసుచరిత్ర వ్రాసి లోకమునకు కావలసినంత యుపకారము చేసిపోయారు. ఆగ్రంథాలు మీరు చదువుకొని అర్థంచేసుకుంటే చాలు కవిత్వము చెప్పినంత పుణ్యము.

రంగ—ఆ మనుచరిత్ర వసుచరిత్ర కవిత్వా లేమికవిత్వాలండీ! చూస్తే పెహారున యేడుపొస్తుంది. పాడుకవిత్వం అవకతవక కవిత్వం. చచ్చుకవిత్వం. తెలివితేటలులేని కవిత్వం ఎవరికైనా తెలియునా యేడవనా. అవి పద్యాలుకావు పాషాణాలుకాని. ఇనపగుగ్గిళ్ళుకాని మాటలాయవి. అనంతా గచ్చకాయపాకం శిలాపాకం. పుస్తకాలున్నాయని లెక్కపెట్టుకుందుకేగాని చదువుకుందుకు పనికిరావు. ఈ కాలానికి బొత్తిగా పనికేరావవి. కవిత్వమంటే అన్నికాలములకు బనికి వచ్చేదిగా నుండవలెను. రసముండవలెను. సులభముగా వుండవలెను. ద్రాక్షాపాకముగా నుండవలె. పూర్వకవిత్వం నాన్నెన్నునానుంది. చూడండి యింగ్లిషు పొయిట్రీ యెంత మెక్సలెంటుగా వుంటుందో.

మే మీలాగునంటే మీకు కోపమువస్తుంది ముక్కు మూరెడు మూతి జానెడుచేసి మండి పడతారు ఇంగ్లీషుచదువుకొన్నవాళ్ళంతా పొగరు బోతు లంటారు మీరు ఈ నన్నయభట్టు తిక్కన్న అల్లసానిపెద్దన్న యిల్లాటివాళ్ళు పుట్టకపోతే మన భాషెంతో బాగుపడును.

గురు—ఆరి నీ మొండితనం బద్దలుగాను. ఇదేమిరా! మహా కవీశ్వరులను పట్టుకొని చడామడా తిడుతూన్నావు. చేతైతే నీవు మంచి కవిత్వము చెప్పుకో యెవరూ వద్దన లేదు. వాళ్ళను మాత్రం తిట్టకు. ఇటువంటివి వింటే నాకుగూడా మహాపాతకము వస్తుంది. హాం డవత లకు పొండి.

గంగ—శాస్త్రిగారూ! తమరు కోపపడగూడదు. టాలరేష నుండాలి.

గురు—టాలరేష నేమిటి. ఆమాట కర్థము తెలియ లేదు ముండుగాను.

గంగ—టాలరేషనంటే యితరాభిప్రాయములను సహించె స్వభావము.

గురు—అభిప్రాయమంటే బూతులు తిట్టడమా.

గంగ—మేము తిట్టినామా?

రంగ—పోనియ్యండి. మేము తిట్టినామనితోస్తే మీరు క్షమిం చండి. మేమిద్దరము చేరి యొకపద్యము వ్రాసికొనివచ్చినాము. అదివిని దోషాలుంటే చెప్పండి.

గురు—ఏదీ ఆపద్యమేదో చదువు నాచేతనైతే దిద్దుతాను.

రంగ—ఇదిగో చదువుచున్నాను వినండి—

సీ॥ తోటకూరదెచ్చి దొడ్డిలోనతరిగి
కుండలోన బెట్టి [illegible]

క్రింద మంట బెట్ట వుడకకేం జేస్తుంది?
దానికడుపుకాల ధరణిలోన.

గురు—(నవ్వి) ఓరీ నీకవిత్వంమండా యిదేమికవిత్వంరా. ప్రపంచములోనున్న కవీశ్వరులనందరిని తట్టిన మహానుభావుల కవిత్వమా యిది! మిక్కిలి చక్కగానున్నది తిక్కన సోమయాజి చచ్చిపోయిన లోటుతీరింది ప్రపంచానికి. నన్నయభట్టు లేకన్న వెలితిలేదు.

రంగ—గురువుగారూ! మీకు కోపమువస్తే వచ్చిందికాని మమ్మలని వాళ్ళతో పోల్చకండి. వాళ్ళు తెలుగుకవీశ్వరులని చెప్పుకుంటే మాకు సిగ్గేస్తూంది.

గురు—అవునవును! నిజమే నేనుచెప్పినది పొరబాటె. పోనీ! కాళిదాసు భవభూతి వాళ్ళతో పోలుస్తునా?

రంగ—ఏమో మాకు సంస్కృతం రాదు. వాళ్ళకవిత్వాలెల్లాగేడిశాగో. మమ్మలని వాళ్ళతోటీ పోల్చవద్దు. వీళ్ళతోటీ పోల్చవద్దు. మేము మోడరన్ పోయిట్లుము.

గురు—ఆమాట కర్థమేమిట్రా ? నాకు తెలియలేదు

రంగ—ఇంగ్లీషురానివాళ్ళకి మీవంటివాళ్ళకి యీక్రొత్త అయిడియాసు చెప్పడంకష్టమండీ. అదిగాక యీవెధవ తెనుగుభాషలో మోడరన్ అనేపదమునకు అర్థమేలేదు. ఏమని చెప్పుము మీతోటి?

గురు—తెలుగెంత పాడుభాషైనా, ఇందులో మాటలే లేవా? నీమాడరన్ అనేమాటకు తగినమాటలు లేకపోయెనా. దానిభావమేమిటో చెప్పు.

రంగ—భావముచెప్పినా మీకు తెలియదు. అయినా చెప్తాను. మోడరన్ పొయెట్సుఅంటే మేము యీనాటి కవులమన్న మాట.

గురు—ఈనాడు బ్రతికున్నవాళ్ళు యీనాటి కవులుగాక పూర్వపుకవు లెట్లగుతారూ.

రంగ—ఈనాటికవులంటే యిప్పటిభాషలో కవిత్వము చెప్పేవాళ్ళమన్నమాట.

గురు—ఇప్పటిభాషంటే యీ చచ్చుపుచ్చుమాటలతో చెప్పే కవిత్వమా.

రంగ—చచ్చుపుచ్చుమాటలాయివి. మీకు సెన్సు లేకుండా మాటాడుతూన్నారు. శాస్త్రిల్లవారికి సెన్సెప్పుడైనాయున్నాదా. గురువైనాసరే అన్యాయంగా పరివర్తించినప్పుడు ధిక్కరించవలసినదేకనుక మే మిప్పుడు మిమ్ము ధిక్కరిస్తూన్నాము. ఈశాస్త్రిల్లవారి మూలాన్నే కొంపలు మునిగాయి. భాగోతంలో కృష్ణవేషగాణ్ణి కూచోబెట్టినట్టు యిస్కూలుభాగోతంలో శాస్త్రిల్లవారిని కృష్ణవేషగాళ్ల క్రింద కూచోబెడుతూన్నారు. శాస్త్రుల్లవారంటే ఒకవిధమైన జంతువులు వాళ్ళకికామన్సెన్సు లేదు. వాళ్ళచేత పాఠాలు చెప్పించినన్నాళ్ళు పిల్లలకు చదువులురావు. తెనుగూరాదు. సంస్కృతమూరాదు. పిల్లలంతా వుత్త వెధవలవుతారు ఈపిల్లలవుసురుకొట్టి యీశాస్త్రులవారంతా యెప్పుడు మాశిపోతారో స్కూళ్ళలోనుంచి అప్పుడే పిల్లలు బాగుపడతారు. అకారమట. ఇకారమట. ఉకారమట. సంధట వీళ్ళ శార్ధమట. శాస్త్రుల్లవారికి వ్యాకరణము వ్రాసినవాళ్ళకి సంధించింది. అంతకంటెవేరేసంధిలేదు. అయినా శాస్త్రుల్లవారందరికి పొయ్యేకాలము వచ్చిందిలే. మీయాటలికసాగవు. ఇకముందు మీఆవాహనవిసర్జనా వుండదు. ఇదివరకు భాషను పిల్లలను మీయిష్టమువచ్చినట్టు పాడుచేశారు. ఇక శాస్త్రుల్లవారినోట్లో మట్టే. మాఅదృష్టము బాగుండి మాపూర్వజన్మపుణ్యమువల్ల కల్పవృక్షములాగు కామధేనులాగు చింతామణిలాగు మోడరన్ స్టైలు నవీనతెనుగు కన్నులపండువుగా వచ్చింది. అది పూర్తిగా రాకుండా ఈ

పూర్వ తెనుగును పట్టుకుని వేళ్ళాడే పిశాచాలుకొన్ని పీక్కుతింటూ న్నాయి. ఈపిశాచాలని కొద్దిరోజులలోనే మారణహోమం చేశే స్తాము. వాళ్ళకడుపుచల్లగా అధికార్లు మాపట్లవుండబట్టిగాని లేకపోతే మమ్మల్ని వీళ్ళు బయటికి రానిస్తురా. మా మోడరన్ స్టైలువాళ్ళు వాదంచేస్తూంటే, ఎంతసబబు. ఎంతయుక్తి, ఎంతచమత్కారం. ఈ గ్రాంథికపక్షిగాడూ యీశాస్త్రిగాడూ వాళ్ళముందర నోరెత్తగలరా? మా వాడు వీకిడ భాయించేస్తాడు. మావాదాలువింటే సభలోవాళ్ళంతా గుమ్మైపోతారు. పాతతెలుగువాళ్ళని డొక్కచీరి రాళ్ళుకొట్టిస్తా. పాత భాష తవ్విపాతరేయిస్తా. మీభారతాల్ గీరతాల్ మీ ప్రబంధాల్ గింబందాల్ అన్నీకూడా దీపావళమావాళ్యకి తూటాల్ మతాబాల్ పువ్వొత్తుల్ పేకజువ్వల్ కట్టిస్తా.

గురు—అబ్బాశాస్త్రుల్లవారి నింతసేపు తిడుతూవున్నావు. నీ కింతకోప మెందుకురా. చిన్నప్పుడు నీకు తెనుగు పాఠం రాకపోతె వెనకటిశాస్త్రిల్లుగారు చేంతాడు మడతబెట్టి నిన్నుకొట్టేవారట. అదా కోపము. మొద్దువెధవలుంటే కొట్టకమానుతారా. నుమ్మల్ని తిడితే తిట్టావు. పోనీ భారతభాగవతాలు ఎందుకుతగలెయ్యాలని అంటావురా

రంగ—ఎందుకు తగలెయ్యాలని చూస్తోన్నానా. మీపూర్వ పుగ్రంథాలన్నింటిలోనూ కూడాకలపి యిప్పటిమానూతన్ తెనుగులో ఒక్కపుటలో ఒకసంక్తిలో ఒక్కఅక్షరములో ఉన్నంత జ్ఞానంలేదు. అట్లాంటప్పుడా పాతపుస్తకాలెందుకు? మనుష్యులను పాడుచెయ్యడా నికికాకపోతే?

గంగ—ఒరేశాస్త్రిల్లవారికి కోపమువస్తుంది ఆట్టేటిట్టకురా.

రంగ—కోపమువస్తే నాకేమిరా. నే నిండపెండెంటు మేనుని. ఒకరిలక్ష్యము నాకులేదు. ఒరే! యీగవర్నమెంటువారు సరిగా ఆలోచించలేదుగాని, ఆలోచించి ఒక్కఘంటసేపు గవర్నరు

జనరల్ పనేనా గవర్నరుపనేనా యిస్తే ఆఘంటలో తెలుగుసంస్కృతము శాస్త్రుల్లవారి నందరినీ అండమానుదీవులకు డిపోర్టుచేయవలసిన దనిన్ని పాత్రెన్గుపుస్తకా లెక్కడ కనబడితే అక్కడ చలిమంట వేశెయ్యవలసిన దన్నీ ఆర్డరు వేస్తునురా. భగవంతుడు నానోబుల్ అయిడియాసుకి తగిన అధికారం నాకిచ్చాడుకాడురా. ఇంతింత దేశాభిమానం భాషాభిమానం వున్నవాడికి భగవంతు డీవిధంగా చిన్నచూపు చూడ్డం న్యాయంగా లేదు.

గురు — ఇంతింతబుద్ధు లుండబట్టి భగవంతుడు నిన్నూ రెండు కళ్ళూ చూచి తిన్నగా పరిపాలించి పొట్ట చించినా అక్షరం లేకుండా చేసి నీచేత నేమీ అధికారం లేకుండా చేశాడు. నీకు చదువుఅధికారంవుంటే నీవు క్రిందామీదావుంటావా నాయనా. నీకధికారమే వుంటే యీపాటికి మేమంతా అన్యాయంగా యీపాటికి బంకోల్లులో వుందుముకదా.

రంగ — అన్యాయంగానా. మిమ్మల్నిడిపోర్టుచేయడం యెంతో న్యాయము. ఎందుకంటె దేశమునకు అపకారం చేశేవాళ్ళని గవర్నమెంటువాళ్ళు డిపోర్టుచేస్తూన్నారా లేదా. అలాగే భాష కపకారం చేశేవాళ్ళని యెందుకు డిపోర్టు చేయగూడదు. గవర్నరుజనరల్‌గారి లెజిస్లేటీవుకమిటీలో వున్న మెంబర్ల పేర శాస్త్రుల్లవారందర్నీ డిపోర్టు చేయుట కేదైనా చట్టము పెట్టించవలసినదని రాస్తాను. వట్టిమాటలు చెప్పకూడదు. క్రియచేసి చూపించాలి.

గురు — సరే వ్రాసిచూడు. నీవంటిమహాలుభావుడే అక్కడుంటే ఆయన చట్టము ప్రవేశపెడతాడు.

రంగ — నావంటివాళ్ళు చట్టనిర్మాణసభలో లేకపోబట్టే దేశము లాగుంది. నావంటివాళ్లుండి మంచిమంచి చట్టాలు ప్రవేశపెడితే వహావా దేశమీపాటి కెల్లాగుండును.

గురు—నిప్పు కర్ర లేకుండా తగులబడుచుండును.

గంగ — అది మీ శాస్త్రుల్లగారి మహాలాన్నే తగులడుతూంట

రంగ—ఈ మాటకేమిగాని నా కవిత్వములో ఉండేరసం గ్రహించకుండా మనము అప్రస్తుత ప్రశంస చేస్తూన్నాము.

గురు—నీ కవిత్వములోనున్న రసమేమిటి నాయనా నీరసము తప్ప.

రంగ—గ్రహించలేనివాళ్ళకి నీరసం గ్రహించేవాళ్ళకి సరసము ఉంది.

గురు—ఆసరస మేమిటో ఒకమాటు సెలవిస్తా వింటాను. ప్రపంచంలో వర్ణించడానికిన్ని వేలవస్తువులుంటే నీకు తోటకూర దొరకిందా వర్ణించేటందుకు.

రంగ—నేచురిలుగా కవిత్వము చెప్పటమంటే మీ కేమిటో తెలియదు. నేచరువర్ణనే వర్ణన.

గురు - నేచలేమిటి.

గంగ— నేచరంటే స్వభావమండి. ప్రకృతికూడాను.

గురు — అయితే తోటకూర స్వభావవర్ణనంటావూ.

రంగ—నా పద్యంలోవుండే తోటకూర స్వభావవర్ణన గాకపోతే అవకతవక ప్రబంధాల్లో వుండేవర్ణనలన్నీ స్వభావములా? సూర్యుడు రధమెక్కి ఒకపట్టణములోన్నుంచి వెడుతూంటే ఆవూళ్ళో వుండే కొబ్బరి చెట్ల కాయలకు సూర్యుడి గుఱ్ఱాల డెక్కలుతగిలి అవి పగిలితే వాటిలోనుంచి వచ్చేనీళ్లు వూరంతా ప్రవహిస్తూన్నాయట. చంద్రుడొకవూళ్ళో మేడల్లోనుంచి సంచారము చేస్తూంటే ఆడవాళ్ళు మేడల తలుపులు వేసి చంద్రుణ్ణి ఖైదులో పెట్టారట. తన మొగుడైన చంద్రుడు కనబడక రోహిణీదేవి మొగుణ్ణి వెతుకుంటూ వెళ్ళిందంట. కాని ఆవూళ్ళో ఆడవాళ్ళ మొగాలకీ చంద్రుడికీ భేదము లేకపోబట్టి

యేదిచంద్రుడో యేది మొగమో తెలిసికొనలేక గిజగిజ తన్నుకు చచ్చిందట. ఇవిటయ్యా వర్ణనలంటేను, కోతివర్ణనలు, కొండముచ్చు వర్ణనలు ? వర్ణనలంటే యెంత నేచురలుగా వుండాలి. వెనుకటికి మా తాతరుమాలు ఆకాశమంతవుందని ఒకడన్నాడట. వెంటనే రెండవవాడు వాడికంటె యెక్కువకోతలుకొయ్యాలని ఒరే మాతాత గువాలు కొంచెముచిరిగితే మీ తాతరుమాలు అతుకువేయుటకు పనికొచ్చిందన్నాడట. ఆలాగుంది తెనుగుకవుల యొక్క సంగతి. ఒకరిని మించవలెనని యొకరు అప్సర్డు వర్ణనలుచేసికొన్నారు.

గురు—అప్సర్డంటే యేమిటో యీ ఇంగ్లీషు ప్రయోగాలతో చంపేశేస్తూన్నావు?

రంగ—ఏంచెప్పమన్నారు? ఈ చచ్చుభాషలో దానికి తగిన మాటేలేదు.

గురు—నీకు తెలుగారాక తగినమాట లేదంటావేమి?

గంగ—ఆ మాటకు అసంభవము, అసాధ్యమని అర్థమండీ.

గురు—ఆలాగా అవన్నీ అసాధ్యపు వర్ణనలా మీవి మంచి వర్ణనలా?

రంగ—మంచివర్ణనలా అని అడుగుతారేమి యింకాను! నా పద్యంలో కల్పనెంతమంచిది! మాట లెంతరసవంతముగా నున్నాయి. ఉల్లిపాయ పకోడీల్లాగున్నాయి శబ్దాలు. ఒకొకటే చూడండి. అర్థ మెంతత్వరగా అవుతూవుందో చూడండి. గవుచివు మిఠాయిలాగ నోట్లోవేసుకుంటే కరిగిపోతూన్నాయి. నన్ను నేను పొగడుకో గూడదు కాని యింత రసవంతమైనపద్యము తెనుగుభాషలో ఇదివరకెన్నడూ చేయలేదు. ఈ పద్యము చెప్పినప్పటినుంచీ నా స్నేహితులంతా నన్ను కొగలించుకొని "ఒరే ఆదికవి వాల్మీకి నోటంటవచ్చిన "మా నిషాద" అనే మాటల్లోలాగున్నది నీ పద్యం. వాల్మీకిలాగే

నీవుకూడా యేదైనా కావ్యము చేయరా నాయనా” యని నన్ను పీక్కుతింటున్నారు.

గురు—(నవ్వి) అలాగైతే యేదైనా మహాకావ్య మారంభించీపాటికి.

రంగ—ఆరంభిస్తాను. సబ్జక్టు వెతుక్కుంటూన్నాను. సబ్జక్టంటే విషయము. మళ్ళీ మీరర్థమడుగుతారని ముందే చెప్పాను.

గురు—సరే. ప్రపంచానికి మంచి కావ్యాల్లోటుండదు. భగవంతుడు తెనుగు దేశానికి నిన్ను చూపించాడిప్పుడు.

రం—నన్నే చూపించడమేమిటి మీ రలా స్తోత్రం చేస్తూంటే నేనొప్పుకుంటానా. నా కంటే మిక్కిలి రసవంతమైన పద్యాలు చెప్పిన వాళ్ళుపూర్వ కవుల్లో కొందరున్నారు. ఆ సింపిలు స్టైలు పైకిరాని య్యక మీరు తొక్కిపెట్టేరు. మీరుఅంటే మీరు కారు-కొండముచ్చుపండితులు.

గురు—ప్రాచీనులలో ఇల్లాంటి వాళ్ళున్నారూ ఏదీ ఒకపద్యము చెప్పు యిల్లాటిది.

రంగ—చూడండి చదువుతాను. అల్లాంటి మంచిపద్యము. అందులో రసాలొలుకుతూంటాయి. అదులో సంస్కృతం తెలుగు మిశ్రాఖత్తు చేసి బ్యూటిఫులుగా వుంటుంది.

గురు—అందులో నేమి . మిశ్రాఖత్తోగాని యిప్పుడు నీవు మాట్లాడినమాటలో నాలుగు భాషలు మిశ్రాఖతైనాయి.

రంగ—ఇదిగో శ్లోకం వినండి.

శ్లో॥ తండులాలు గృహమందు నసంతి
తిండికైతె బహుమంది వసంతి
పట్టికుండలు గృహేషులుఠంతి
రండనాకొడుకులెల్ల వాసంతి

చూడండి. దీన్లోరసంచూడండిమఱి. వేలుమడిచి యిందులో తప్పు చూపెట్టండి మఱి

గురు—అహాహా! ఏమిపద్యమయ్యా. వరహాలకెత్తు కైత్తైనప ద్యం. ఏదీ మరియొకసారి చదవండి.

రంగ—ఓ. మీకు కావలసినన్ని మాట్లు చదువుతాను. తండులాలు గృహామంపునసంతి

(అనుపద్యమును చదువుచున్నాడు.)

గురు—(నవి) వహావా! ఇది తెలుగుకాదు సంస్కృతముకాదు శ్లోకముకాదు పద్యము కాదు.

రంద—మీకు శ్లోకమేమిటో పద్యమేమిటోతిన్నగా తెలిస్తే నా. ఇందులోవున్న స్వారస్యం గ్రహించేటందుకు యెంతవాడుకావా లి. ఇల్లాటిపద్యాలే జనసామాన్యం తలకెక్కేది.

గురు—ఇల్లాటి విం కేమైనా వచ్చు నాయనా మీకు?

రంగ—కావలసినన్ని వచ్చును. ఓరే గంగన్నా నీకొచ్చుకాదం ట్రా? ఒకశ్లోకం ఏదీ చదువు.

గంగ—ఆశ్లోకమా, చదువుతాను. అది ఛేషైన శ్లోకము. ఎం తచీకినా రుచితీరని మునగకాడలాగ యెన్నిమాట్లు చదువుకొన్నాయీ శ్లోకం తనివితీరదు.

గురు—శ్తోత్రాలకేమి. పద్యము చదువు బాబూ.

గంగ—

శ్లో॥ అన్నాతురాణాం నవుడికి ర్నవుడకః
నిద్రాతురాణాం నమెట్టన్ నపల్లః
అర్థతురాణాం నచెల్లి ర్నచెల్లః
కామాతురాణాం నముసిలి ర్నపిల్లః

గురు—(నవ్వి) ఓరి నీశ్లోకం బంగారుగాను. ఒకదాన్ని మించి ఒకటొస్తోంది రా. .... లోకైనా వచ్చునాయనా నీకు.

రంగ—వీటి రెండిటికన్నా సొగసైన శ్లోకమువచ్చు నాకు.

గురు—అదేది బాబూ. చెవులు తుప్పు వదిలించెయ్యి. దీనితోటి! ఇదివరకు కాళిదాసు భారవి భవభూతి మల్హాణ శ్లోకమ్ములు చెవను కొని నాచెవి బెరడుకట్టియున్నది. ఏదీత్వరగా వినిపించు బాబూ.

రంగ—చదువుతున్నాను వినండి. మీకుపంచప్రాణాలు లేచివస్తాయి శ్లోకము వింటేను.

శ్లో॥ అప్పంబొట్లో యెల్లపో జ్యేష్ఠబిడ్డః
సంకట్యాళోః చక్కగా తన్నె బాబున్
బంకమ్మట్టే అంటుకోగా వంటినింతన్
శంకర్పట్టీ వచ్చే ఆగమంగాన్.

గురు—(కడుపుపట్టుకొని వికవికనవ్వి) ఓరినాయనా యిదేమి శ్లోకమురా బాబూ. జన్మమధ్యమందిదివరకు వినలేదు. ఇకముందు వినబోనురా బాబూ. దీనర్థమేమిటి చెప్పు బాబూ. పతంజలి భాష్యం. మనోరమా తత్వబోధిని మొదలయిన వ్యాఖ్యానాలు చదువుకొన్నాగని నాకేమి యర్థంకాలేదు. నీభాష్యంవింటేగాని యందులో ఒక్కముక్కయినాఅర్థమయ్యేటట్టులేదు.

రంగ—క్రొత్త తెలుగులో చదువుకోవలసింది నేర్చుకోవలసింది ఏముంటుందని యిదివర కంటూన్నారుకదా. మీయంటివారికి గూడా తెలియనివి క్రొత్త తెలుగులో వున్నాయికదా. చూడం డర్థము చెపుతాను.

ఎల్లపో జ్యేష్టబిడః=అనగా యెల్లప్పగారి పెద్దకొడుకు; అప్పంభొట్లనేవాడు; సంకట్యాళోః=సంకటము కుదిరేట్టట్టుగా; బాబున్=తండ్రిని; తన్నె=కొట్టాడు. అప్పుడు బంకమట్టి వంటినిండా అంటుకొన్నది; శంకర్పట్టి=అనగా శంకరప్పగారి కుమారుడు. ఆగమంగా=అడ్డుకోగా; వచ్చే=వచ్చినాడు ఇది దీనిభావము

గురు—వాచామగోచరంగా వుందిరా నాయనా దీనిభావము. అహహా రసమేమిటి; పాకమేమిటి భావమేమిటి యతులేమిటి ప్రాసలేమిటి శబ్దసౌష్టవ మెంత. వేయినాలుకలున్న శేషుడే రావలెనురా దీన్ని వర్ణించేటందుకు. చాలురా బాబూ మొగం మొత్తిపోయింది కవిత్వం. ఇకకవిత్వమంటే అరోచకం పుడుతోందిరా నాయనా.

రం—మీవంటివాళ్ళకిటువంటి రసవంతమైన కవిత్వం సొక్కుతుందా. మీకీకవిత్వాలు వినిపించడం చెవిటివాడిముందర శంఖమువూదడం గ్రుడ్డివాడికి రవివర్మపిక్చర్లు చూపించడం.

గురు—నిజమే బాబూ. మావంటిమూర్ఖులదగ్గర యిటువంటి మహారసవంతమైన శ్లోకాలు చదువకూడదు. వాటికి దిష్టికొడుతుంది.

రంగ—నిజమే చదవనేకూడదు. నేను పొరబాటు చేశాను.

గురు—మీకొత్తపుంతపద్యాలు నాకు కూడా కొన్ని వచ్చుసుమా.

రంగ—మీకివికూడా వస్తాయా. మీకల్లా అర్థంకాని నల్లరాళ్ళంటి,ఆదిక్కుమాలినశ్లోకాలేకాని యీలాటిచక్కని పద్యాలొస్తాయా

రంగ—ఏదీ నిజంగా వస్తే ఒకటిచదవండి. ఇందాకా మీరుచెప్పినట్లు పాతశ్లోకాలు చదవడంవల్ల బెరడు కట్టిపోయిన మీనోటికిరుచొస్తుంది.

గురు—రా కేమయా! మంచిశ్లోకాలు రావడం కష్టముకాని యివిరావడానికేమి. చదువుతాను వినండి. అనవేమారాజుగారిమీద అవకతవక పండితుడొకడు చెప్పాడటీ యీశ్లోకం.

శ్లో॥ అనవేమమహీపాలా
చూపులుం గడులెస్సలు
యుద్ధమందు మహావీర్లు
శాబాసునౌ భళాముండా
ధీయో యోనః ప్రభోదయాత్.

రంగ—చాలా బాగావుందీశ్లోకం. రెండవపాదంలో ఆయన అందం వర్ణించాడు. కాని తక్కిన పాదాలు అర్థమైనాయికావు.

గురు—దానికి వ్యాఖ్యాన ముండాలి మరి. చెపుతానువిను. మొదటి మూడుపాదాలు కష్టపడిచేశాడు. నాలుగోపాదం తోచిందికాదాయనికి. పెళ్ళామును సలహా అడిగిగాడు. ఆమెసంధ్యావందనంలో ముక్కొకటి పారవెయ్యమని చెప్పింది. అందుచేత ధీయోయనః ప్రచోదయాత్తని వేశాడు.

రంగ—అయితే శబాసునా బళామూండాయేమి.

గురు—అటువంటి గొప్ప యభిప్రాయము చెప్పినందుకు సంతోషిస్తూ వేశాడు.

రం—దివ్యంగావుంది తేగముక్కల్లాగున్నాయి ముక్కలు శాస్త్రుల్లుగారూ! యిటువంటి రసవంతమైన ముక్కలొదిలిపెట్టి ఆపాడుపుస్తకాలెందుకు చదువుతారయ్యా మీరు?

గురు—కవిత్వాలు యిల్లాగే యుండవలసి వచ్చినట్టయితే ఇక రఘువంశము కుమారసంభవము భారతము భాగవతము మనుచరిత్ర యిల్లాటివన్నీ కట్టకట్టి మూలపారవేసి గరుడాచలనాటకాలు, గంగాగౌరీ సంవాదాలు, తందానపదాలు గొల్లసుద్దులు చదువుకోవడం చాలామంచిది.

రంగా—భేషుగ్గా చెప్పేరు శాస్త్రుల్లుగారూ: క్వొయిటురైయిట్. మిమ్మల్ని నే నిప్పుడు కన్విన్సుచేశానన్నమాట.

గంగ—కన్విన్సు అంటే అయనకు చెప్పు. శాస్త్రుల్లుగారితో మాటాడితే వచ్చే బాధే యిది.

రంగ—ఏంజెప్పను నాతలకాయి. తగినమాటలా వల్లకాడా యీభాషలో కన్విన్సంటే వాదబలంచేత మిమ్మల్ని నాపక్కకు తిప్పుకున్నా నన్నమాట.

గంగ—మీకు నచ్చేటట్టు చెప్పాడన్నమాట.

గురు—అలాగా. సరే మీయిష్టమువచ్చిన ట్లనుకోండి.

రంగ—శాస్తుల్లుగారు: మా వాదమువింటే యెంతభీష్మించు కున్న శాస్తుల్లుగారైనా ఒక్కగడియలో పడిపోరటండీ. మావాదానికి యెదురుజవాబె చెప్పడానికి వీలా. కొమ్ములుతిరిగినవాడు మా యెదుట మాట్లాడలేడు. ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళతో మాట్లాడడమంటే మజాఖా అనుకున్నారూ.

గంగ—శాస్తుల్లుగారూ! యీవాదాలతో నేను వచ్చినపని మరిచిపోయినాను.

గురు—ఏమిటి నీవు వచ్చినపని?

గంగ—మన రంగన్నలాగే నేనుకూడా ఒక చిన్నపద్య మల్లినాను. అందులో యింకా నాలుగోపాదం కుదరలేదు. మూడుపాదాలే కుదిరాయి. నాలుగోపాదం నాలుగురోజులనుం చాలోచిస్తూన్నాను.

గురు—అయితే యిప్పుడు నీపద్యం మూడుపాదాలే కుదరడం చేత త్రేతాయుగంలో ధర్మదేవతలాగుంది.

రంగ—అదేమిటండి. ఏదో చాదస్తం పురాణగాథ చెపుతూన్నారు.

గురు—మేమూ మీరూ మాటలాడుతూన్నంతకాలము మా చాదస్తం మీరు వినకతప్పదు. వినండి. కృతయుగంలో ధర్మదేవత గోరూపమెత్తి నాలుగుపాదాలా నడిచిందట. త్రేతాయుగంలో ఒక పాదం ధర్మం తరిగిపోవడంచేత ధర్మదేవత మూడుపాదాలతోటే నడిచింది. మీపద్యంకూడా మూడుపాదాలు కలదేకనుక కృతయుగంలో ధర్మదేవతవలె నుందని చెప్పినాను.

రంగ—శాస్త్రుల్లుగారూ! ఏమి యుపమానమండిది. ఉపమా లంకారమంటే యిల్లాగా వుండవలసింది. ఉపమ అంటే దామోదర హొటల్లో చేసే ఉపమాలా వుండాలి. ఉపమా కాళిదాసస్య అని పూర్వము డేదట. అది శుద్ధతప్పు. ఉపమా దామోదరస్య అంటే చాలా బాగావుంటుంది. దామోదరుని ఉపమాలాగ కాళిదాసు దెప్పుడూ వుండదు.

గురు—నారాయణ నారాయణా! ఎటువంటి దుర్భావలు వినవలసివచ్చినదిరా నాయనా. మహానుభావుడైన కాళిదాసుగారి యుపమ దామోదరుని ఉపమాకు తీసిపోయినదీ, అనగా ఉప్పు పిండికి తీసిపోయినదన్నమాటా. మాణిక్యాలు గాజుపూసలు, గాజుపూసలు మాణిక్యాలూ అయ్యేరోజులు వచ్చాయి. నిమ్మలి ననవలసినదేమీ లేదు. ఈలోపమంతా మాదే.

గంగ—ఈ వాదంతోనే కాలక్షేపము చేయక నాపద్యము వినండి శాస్త్రుల్లుగారూ!

గురు—నాకూ వినడం కష్టముగానే వుంది. బాబూ త్వరగా నీపద్యమేదో చెప్పూ.

రంగ—వీడి పద్యంకూడా చాలా బాగుంటుందండి. నేను విన్నాను.

గురు—ఊటబూరించి చంపక త్వరగా చదవండి.

గంగ—ఇదిగో చదువుతూన్నాను వినండి. శ్రద్ధగా వినాలి. మనస్సు మరోచోట పెట్టుకొనివింటే వల్లకాదు. అల్లాటప్పాకవిత్వా ల్లాగ మీా రశ్రద్ధగావింటే పనికిరాదు.

గురు—శ్రద్ధగానే వింటున్నానోయీా బాబూ చదువు.

గంగ—కోప్పడకండి. చదువుతూన్నాను.

పొలములో నక్కలు కూసెగా
మనసులో భయ మెంతో వేసెగా
పాలేరు యిట్టట్టె చూసెగా
యింతే తక్కినపాదం కుదిరిందికాదు.

గురు—అహాహా! ఇదా పద్యం.

గంగ—మున్నరాత్రి నేను పొలములో పడుకోవలసివచ్చింది. అప్పుడు నక్కలు కూస్తే భయమేసింది. దానిమీద నే చురుకుగా చెప్పాను.

గురు—(నవ్వుచు) ఇందులో గణమూ లేదు యతి లేదు. ఇది యేమి వృత్తం?

గంగ—ఈవృత్తాల ఫక్కీని మేము వెళ్ళలేదు. అందుచేతనే మాకు యతులు గణాలు అక్కరలేదు. ఇంగ్లీషుఫక్కీగా మేము రైము పెట్టాము. రైమంటే చివరప్రాస. కూసెగా వేసెగా చేసెగా అని వేశాను చూశారా? అవే రయిమంటే.

రంగ—అహాహా! ఆరై మెంత బాగుందండీ.

గురు—(నవ్వుచు) అల్లాగైతే నాలుగోపాదం నేను పూర్తి చేస్తాను భోజరాజు ముఖంచూస్తే సామాన్యమనుష్యులకు కవిత్వం పుట్టినట్లు మహాకవులైన మీ మొగంచూస్తె నాకుకూడా కవిత్వం పుట్టుకొస్తోంది

రంగ—చూచారా మామహాత్యం మరి ఏదీ పూర్తిచెయ్యండీ

గురు—ఇదిగో పూర్తిచేస్తూన్నాను వినండి ముందు మీ మూడుపాదాలు చదువుతాను తరువాత నాపాదం వేస్తాను

పొలములో నక్కలు కూసెగా
మనసులో భయ మెంతో వేసెగా
పాలేరు యిట్టట్టె చూసెగా
గంగన్న నీముండ మోసెగా

గంగ—(కోపముతో) ఎమిటండీ శాస్త్రుల్లుగారూ! యీలాటి అధికప్రసంగంలో దిగారేమిటి మీరు.

రంగ—జాగర్త శాస్త్రుల్లుగారూ డిఫమేషను చార్జీ యిస్తాం ఇలాంటి అధికప్రసంగాలు చేశారంటే

గురు—మీపద్య మెల్లాగుందో నాపూర్తి అల్లాగుంది మీ యిష్టమువచ్చినట్లు చేసుకోండి

గంగ—ఛీ! రారా ఈయన మాట్లాడవలసిన మనిషిగాడు లా పోదాము

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు)

సమాప్తము

---

# రాక్షససంవత్సర పంచాంగము

ఆనందసంవత్సర మంతరించినది. ఆనంద అంతరించకముందే లోకమున కానంద మంతరించినది. అందరి ఆనందము గోవిందమైనది. రాక్షస ప్రవేశించినది. రాక్షస ప్రవేశించక మునుపే జర్మనీరాక్షసులు, ఆస్ట్రియారాక్షసులు, ఫ్రాన్సు బెల్జియంమీద ప్రవేశించినారు. ఈ రాక్షససంవత్సరములో మహాద్భుతము లనేకములు జరుగును. చంద్రుడు శుక్లపక్షములో పాడ్యమినాడు కనుపడక విదియనాడు కొంచెముగా కనుపడి క్రమక్రమముగా వృద్ధిబొంది పున్నమనాటికి సంపూర్ణుడగును. అమావాస్యనాడు కన్ను పొడుచుకొన్నప్పటికి కనపడనంత కాఱుచీకటి కమ్మును. యుద్ధమునకు వెళ్ళిన సైనికులలో చాలమంది తుపాకిగుండ్లు ఫిరంగిగుండ్లు తగిలి కిక్కురుమనకుండ చచ్చిపోదురు.

ఈసంవత్సరము సంగీతసభలలోకి వెళ్లిన మనుష్యులు తమ యింటి గొడవలు, కచ్చేరీగొడవలు, లోకాభిరామాయణములు, పుక్కిటిపురాణములు, యిష్టాగోష్టులు, పిచ్చిపాటి, మాటామంతి, చెప్పుకొనుట యెక్కువగానుండును. పాటవినుట తక్కువగా నుండును. ఈసంవత్సరము జరిగినసభలలో చందాలపట్టిక బయలుదేరువరకు జనులు నిండుగా నుందురు. అది బయలుదేరగానే క్రమక్రమంగా సభ సన్నగించును.

ఈసంవత్సరము మామిడికాయలు పుల్లనగానుండును. మిరుపకాయలు కారముగానుండును. పొట్టిమిరపకాయే మరంత కారముగా నుండును. గాలిదుమారమునకు మామిడికాయ రాలిపోవును. ఈసంవత్సరము పన్నులులేనివారికి శెనగలు నమలుట చక్కిలములు, జంతికలు తినుట, పచ్చడిబద్దలు కొఱుకుట కష్టముగానుండును. ఈయేడు వేసవికాలములో చమటలు శరీరముమీద ప్రవాహముగా కారును. చదువుసంధ్యలులేని త్రాగుబోతులు బహిరంగముగా సారాదుకాణములకు, కల్లుదుకాణములకు పోయి త్రాగివత్తురు. విద్యావంతులైన త్రాగుబోతులు మునుగులు వేసికొని రాత్రి 8 గంటలైనతరువాత నాలుగు ప్రక్కలు చూచి బ్రాందీషాపులలో దూరుదురు. లేక షికారువంకపెట్టుకొని రైలుస్టేషనుకు, మరికొన్ని యితరస్థలములకు వెళ్ళి కావలసిన చుక్కలు నోటిలోపోసికొని వత్తురు. ఒకప్పుడు బుడ్లు తెప్పించుకొని బీరువాలోనె పెట్టుకొని ఔషధమనే వంకపెట్టి సేవించుచుందురు.

రాక్షససంవత్సరములో నల్లులు రాక్షసులవలె పీకును. దోమలు రాక్షసులవలె ధ్వనిచేయును. పిల్లులు రాక్షసులవలె సంచరించును. రాక్షసచుంచులు, రాక్షసయెలుకలు, రాక్షసకుక్కలు విజృంభించును. బడిపంతులు పిల్లలమీద బెత్తప్రయోగములు యెక్కువగా జేయుదురు. ఈసంవత్సరము చైత్రమాసము మొదలుకొని ఆషాఢమాసాంతమువరకు [illegible] నడుచు

వారికాళ్ళు కాలును. బి, యేలు ప్యాసయిన తహశీలుదార్లు మేజ స్ట్రీట్లలో కొందఱు హిరణ్యశ్రాద్ధములు గ్రహించి తృప్తిపొందు చుందురు.

జాయంటువర్తకములో కలహములు మెండు. జాయంటువ్యవహారములలో ఐకమత్యము శూన్యము.

ఉద్యోగస్థులలో అతివినీతముచేత రాచపుండ్లచేత కొందరు చనిపోవుదురు. వకాల్తనామాలు లేని ప్లీడర్లు లేదనివిచారించుచుండగా వున్నవారు వచ్చినవారిని తీరుబడిలేదని కసరుచుందురు. రాజమహేంద్రవరములో శ్రీరామనవమి బోగమువాండ్ల మొగముమీద పారును.

ఈసంవత్సరము శీతకాలములో బట్టలులేనివారికి చలి వేయును. రైలువేవుద్యోగస్థులలో కొందరికి గర్వము మునుపటివలెనే 100 డిగ్రీలుండును. వైద్యులెక్కువైనకొద్ది రోగము లెక్కువగుచుండును. డబ్బు తగ్గినకొద్ది వేషమెక్కువగుచుండును. ముసలితనము వచ్చినకొద్ది పటుత్వము చూపవలెనను ఆసక్తి హెచ్చుచుండును. పంట పండును గాని దారిద్ర్యమెప్పటివలె నుండును. చదువు హెచ్చుపెరుగునుకాని బుద్ధి యథాప్రకారముండును. కోర్టులలో వొక్కొక్కవ్యాజ్యమునకు 30, 40 హీరింగులు పడుచుండును. మునుపటివలెనే పార్టీల క్షేమము చూచేప్లీడర్లుగాని, గుమాస్తాలుగాని అధికారులుగాని వుండరు.

ఈసంవత్సరము రెండేగ్రహణములు పట్టును. ధనగ్రహణము, కాంతాగ్రహణము. ఒకటిపగలు, ఒకటిరాత్రి పట్టుచుండును. అప్పుడప్పుడు పేద బ్రాహ్మణులకు దానగ్రహణము సంభవించుచుండును. అందుచేత గ్రహణములు మూడని చెప్పవచ్చును. కొన్ని పాత్రగ్రహణములుకూడ జరుగునుగాన 4 గ్రహణములు పట్టునని కొందరు సిద్ధాన్తుల అభిప్రాయము.

—వృద్ధిక్షయులు—

సత్యవృద్ధి 1 పాలు.
నాశనము 99
మంచికవిత్వము ½
తుక్కుపుస్తకములవృద్ధి 98½
మాయవృద్ధి 100
నాశనము సున్న
ధనాశ 100
నాశనం సున్న
ఉపకారవృద్ధి ½
అపకారబుద్ధి 99½
నల్లులవృద్ధి 89
తన్నాశనం 11
దోమలవృద్ధి 99
తన్నాశనం 11
నిజమైనదాతృత్వం 1
డాబులదాతృత్వం 99
బికుదులదాతృత్వము 76
మొగమాటదాతృతం 24
కూటసాక్ష్యములవృద్ధి 79
నిజమైనసాక్ష్యము 21
తప్పుసృష్టి 50
తప్పుసలహా 75
న్యాయసలహా 25
ఆసుపత్రులలో ఆదరణ 15

నిరాదరణ 85

డబ్బుకొరకాదరణ 95

అత్తకోడండ్రపోరు వృద్ధి 86

పొందు 14

అసూయ 85 తన్నాశనం 15

ఉపన్యాసములు 97 ఆచరణ 3

పాఠశాలలవృద్ధి 75 విద్యావృద్ధి 25

లంచములవృద్ధి 99 తన్నాశనం 5

పట్టుదల వృద్ధి 90 తన్నాశనం 4

అజీర్ణం వృద్ధి 10 ఆరోగ్యవృద్ధి 30.



# పడకగది ముచ్చటలు



హాయ—నేనూళ్లో లేనప్పుడు జాబులేమైన వచ్చినవా?

రుక్మి—ఏవో నాగులు మూడుజాబులు వచ్చినవి. అవి బీరువాలో జాగ్రత పెట్టినాను.

హాయ—నాకేమైనా మనియార్డర్లు వచ్చినవా.

రుక్మి—మణిహార్డర్లేమి రాలేదు.

హాయ—వెల్లభూములుతాలూకు శిస్తు రయితు మనియార్డరు పంపుతానన్నాడు పంపలేదా.

రుక్మి—రయితు శిస్తు స్వయంగానే తీసికొనివచ్చినాడు.

హాయ—అయితే రూపాయలు నాచేతి కిచ్చినావుకానేమి?

రుక్మి—నాదగ్గరవుంటే నే నివ్వ నేయిస్తును.

హాయ—ఏమిటి నీమాటలు చిత్రముగా నున్నవి. ఉండ కేమైపో యినవి రూపాయలు? దొంగ లెత్తుకొనిపోయినారా యేమిటి?

రుక్మి—దొంగలెత్తుకుపోలేదు (అని నవ్వుచున్నది.)

హాయ—(కోపముతో) ఏమిటికిలిస్తావేమిటి పదహారుపళ్ళూ బయలుపడేటట్టు రూపాయ లేమైనాయో సంగతి చెప్పు.

రుక్మి—రూపాయ లెక్కడికి పోతాయి. పోలేదని చెప్పినాను.

హాయ—పోకపోతే యిల్లాగియ్యి రూపాయలు.

రుక్మి—నాదగ్గర లేవు. వరాబు వెంకటరత్నముచేతి కిచ్చాను.

హాయ—(మహాకోపముతో) డేం-ఫూల్ నిన్నెవడిమ్మన్నాడు వెంకటరత్నంచేతికి.

రుక్మి—మీరే యిమ్మన్నారు.

హాయ—(పండ్లుకొరుకుచు) స్టుపిడ్డు-రోగ్. నేనియ్యమన్నానా నిన్ను. ఎప్పుడిమ్మన్నాను ఎందు కిమ్మన్నాను. అబద్దాలు చెపుతావు. నీకు బొత్తిగా ప్రిన్సిపల్సు లేవు. నాకు పేము తెస్తున్నావు నీవు.

రుక్మి—మీమాటల కర్థమేమిటో నాకు తెలియదు. అనుకుంటే, ఆ వాచా దోషాలన్నీ మీకే. వెనక వెంకటరత్నం మనయింటికివచ్చి దుద్దులజోళ్ళుకట్టే మంచికంసాలి వచ్చాడు, అమ్మగారికి కూడా ఒకటికట్టించండని మీతో చెప్పినప్పుడు ఈమాటు శివరాత్రికి భూముల మీద శిస్తువచ్చాక, ఆశిస్తు పెట్టి కట్టిస్తానని చెప్పేరాలేనా.

హాయ—అవును మాటవరసకు చెప్పానప్పుడు.

రుక్మి—సరే. అప్పుడు మాటవరసకు చెప్పారు. ఇప్పుడు మాటవరసకు యిచ్చాను నేను.

హాయ—ఎప్పుడో యేపరధ్యాసంగావున్నపుడో నేను మాటంటే మళ్ళీ నాతో చెప్పకుండా యింట్లో యేమిక్కర్చుందో చూడకుండా

రూపాయలు చేతికివచ్చిందేసందని యిష్టమువచ్చిన నగలు చేయించు కొని కులుకుతావా ? నేనిప్పుడు భీమాకంపెనీకి నూటయేభైరూపాయలు పంపించాలి. ఎక్కడనుంచి సొమ్ము తెమ్మన్నావు.

రుక్మి—ఏమో భీమాకంపెనీ కివ్వాలో గీమాకంపెనీ కివ్వాలో నాకు తెలియదు. వెంకమ్మీరిమ్మన్నారు కనుక నేనిచ్చాను. భీమాకెక్కడైనా అప్పుచేసి యిచ్చుకోండి ముందు నెలజీతంలో తీర్చుకోవచ్చు.

హాయ—అప్పుచేస్తే యెవడు తీరుస్తాడు నీతాత.

రుక్మి—నాతాతతీర్చడు మీతాతతీర్చడు మీరేతీరుస్తారు. ఎన్నళ్ళనుంచో మనసుపడి దుద్దులు చేయించుకుంటూంటే అంతమండిపడతారెందుకూ. ఎల్లకాలము మూసినాయినము ముత్తయిదులాగ చెవులపోగులైనా లేకుండా వుండమంటారాయేమిటి ఇప్పటికి వంటిమీదికి నలభై యేళ్ళొచ్చాయి. మనమల నెత్తాను ఒకదక్షిణాదిచీరెరగను, ఒకకొర్నాడుచీరెరగను. చేతికి మురుగుపోచలైనా రాయించలేకపోయినారు. పుష్యరాగాలతో గట్టిన దుద్దులంటే నాకెంతో మనసు. వెనకెప్పుడో వైకాంతాలుతో గట్టించుకొన్నాను. అవి నీరుకాగి పాడైపోయినవి. ఇంతా చేస్తే నూరునూపాయలు. కిశిమిశిపండుగులలో దొర్లకు పట్టిగెళ్ళే పళ్ళు పంచదారచిలకలు అంత విలువుండదు.

హాయ—దొరగారి గొడవ కిష్టమనుపండుగ గొడవా నీకెందుకూ. నీవధికప్రసంగము చేస్తూన్నావు నీరోగము నేకుదురుస్తానుండు వెధవపెత్తనం బోడిపెత్తనం చెయ్యకుండా ఆడపెత్తనమున్న కొంపెప్పుడూ ముందరకురాదు. షరాబు వెంకటరత్నానికి గూడ బుద్ధిచెప్పిస్తానుండు ఒకసారి! రాస్కేల్! వాడుఆడవాళ్ళకి నగలు చేయిస్తానని చెప్పి యీలా డబ్బెత్తుకుపోతూంటాడు ఈసర్యాయం యింట్లోకి రానివ్వకు గాడ్డెని కొరడాపుచ్చుకొని వస్తాను

రుక్మి—షరాబు వెంకటరత్నాన్ని కొరడాపుచ్చుకొని కొట్టడ మెందుకు. ఆ కొట్టదలచిన కొరడాదెబ్బలేవో నన్నే కొట్టండి. ఇందు లోలోపమంతా నాదేకాని వెంకటరత్నానిది కాదు. మీరింత కక్షు వహిస్తారన్నమాట యెరక్క పాతగేళ్ళనుంచి కాపరం చేస్తూన్నాను కదా యింతమాత్రము చనువు కూడదాయని స్వతంత్రించి షరాబును పిలిపించి నేనే సొమ్ము స్వయంగా యిచ్చాను. వెంకటరత్నముచేసిన లోప మేమీలేదు.

హయ—వెంకటరత్నము లోప మున్నదో లేదో యీమాటు వాకట్లోకి రానీ కనుపరుస్తాను. నాకు మొదటినుంచీ నగలంటే తల నొప్పి. నగలుచేశేవాళ్లనీ చేయించేవాళ్లనీ చూస్తే అరికాలునుంట నెత్తికివస్తుంది.

రుక్మి—అంత తలనొప్పి అంత మంటా యెందుకు. నగలు చేయించుకోవడం హానికాదు. అపకీర్తికాదు. కానిపనికాదు. నలుగురు లోకి వెళ్ళినపుడు తలయెత్తుకోవడానికి వీలులేని పనికాదు.

హయ—హాని అపకీర్తి లేకపోతే సరా. నగలు చేయించడం సొమ్మంతా పాడుచేయడం దీనివల్ల యెన్నోనష్టము లున్నవి.

రుక్మి—ఏవీ ఆనష్టాలన్నీ ఒక్కమాటు సెలవియ్యండి. ప్రపంచ మందరికీ లేనినష్టా లేమిటో ఒక్కమాటు చూస్తాను.

హయ—ఒకటా రెండా నష్టాలు. లెక్కలేనన్ని యున్నాయి. ముందుగా దొంగలభయం

రుక్మి—నగలు చేయించుకోకుండా సొమ్ముదాచుకుంటే దొంగలభయ ముండదాయేమిటి. అప్పులిస్తే అప్పులవా ళ్ళెగబెడతారు. ఇంట్లో వుంచుకుంటే దొంగలెత్తుకుపోతారు. దొంగలకు నగలైనా రొక్కమైనా యొకటే.

హాయ—నామాట పూర్తిగా వినకుండా వాదం చేయడాని కారంభిస్తావేమిటి నీవు.

రుక్మి—సరే సరే చెప్పండి పూర్తిగా వింటాను.

హాయ—సొమ్ము వడ్డీలేకుండా పడియుండడము ఒకటి.

రుక్మి—వడ్డీ:—

హాయ—అదిగో మళ్లీ నోరెత్తుతున్నావు నామాటలు వినకుండా. మీ ఆడవాళ్ళంతా ఫూల్సు.

రుక్మి—సరే మరిచిపోయినాను. చెప్పండి చెప్పండి. మేము ఫూల్సుముకాబట్టే మీ ఆటలన్నీ సాగివస్తూన్నాయి.

హాయ—నగలు పెట్టుకొనుటవల్ల అందము చెడిపోవడము ఒకటి.

రుక్మి—(నవ్వుచు) అందం చెడిపోతుందా ?

హాయ—చెడిపోతుందా మరీ చెడిపోతుందా భగవంతుడిచ్చిన సహజసౌందర్య ముండవలె గాని నగలతో అంద మొస్తుందా. విద్యలేక పోవడంచేత మూర్ఖులై మీరందరూ నగలో నగలో అని మగవాళ్ళను పీక్కి పిండి పెట్టి సొమ్మంతా పాడుచేసి మళాగత్తుక్రింద తరుగుకిౖంద కొంతపాడుచేసి సొమ్మంతా ధ్వంసముచేస్తారు. నగలే మనదేశాన్ని కొంపలు తీస్తున్నాయి. నగ లెప్పుడు చేయించుకోవడం మానతారో అప్పుడు మన దేశము బాగుపడుతుంది. నగలు చేయించుకొన్నంత కాలము మనదేశ మీ దరిద్రస్థితిలో నే యుంటుంది.

రుక్మి—మీరు మగవాళ్ళు మీ మాట చెల్లుతుంది. మామాట చెల్లదు. అయినా యేవోరెండు తెలివితక్కువమాటలు నేనుకూడ చెప్తాను వినండి. నగలుచేయించుకోడంవల్ల వడ్డీలేకుండా సొమ్ముపడియుంటుందని మీరు చెప్పినారు. నిజమే వడ్డీపోతుంది. అన్నింటిమీద మనకు వడ్డీ వస్తుందా ? కట్టుకునేబట్టలకు సాలుకు మూడువందల

రూపాయిలు మనకవుతోంది. తిండిక్రింద సాలుకు మనకు రెండువేల రూపాయ లవుతున్నాయి. వాటిమీద మనకు వడ్డీవస్తూందా. పదివేల రూపాయిలుపెట్టి మీరు కాపరముండేటందుకు మేడకట్టించారు. దాని మీదేమైనా వడ్డీవస్తూందా మీకు. అల్లాగే నగలమీదకూడా వడ్డీ రాకపోయినప్పటికి నష్టములేదు.

హాయ—నాన్నెన్నూ. కట్టుకునేబట్టా, తినే తిండి, ఉండేయిల్లూ మోస్తరా నగలు.

రుక్మి—ఇందాకా మీమాటకు నేనడ్డమువచ్చినప్పుడు చీవాట్లు పెట్టారుగదా యిప్పుడు నామాటకు మీరడ్డమురావచ్చునా. నామాటంతా అయినతరువాత మీరు జవాబుచెప్పండి.

హాయ—ఓహో! నన్ను దెప్పుతూన్నావా యేమిటి.

రుక్మి—బియ్యేలు యప్పేలు ప్యాసయిన మీవంటి చదువుకొన్నవారిని పనికిమాలిన ఆడదాన్ని నే నెంతదెప్పగలను. కాని నా మాట కడతేరా వినండి. అందం చెడిపోతుందన్నారు మీరు. దేవుడిచ్చిన అంద ముండాలికాని నగలవల్ల అంద మొస్తుందా అని మీరు సెలవిచ్చారు. దేవు డిచ్చిన అంద ముండవలసినదేకాని వీటివల్లకూడా కొంత అందమువస్తుందని నేననుకుంటాను. ఎల్లాగంటే యింటి కందం రావాలంటే వెల్ల వేస్తారు. తోరణాలు కడతారు. అరటిస్తంభాలు గుమ్మాలముందర కడతారు. స్తంభాలకి పచ్చని కొబ్బరిమట్ట లల్లుతారు. పువ్వులదండలు కడతారు. చాందినీలు కడతారు. గ్లోబులు వాలుషేడ్లు మంచిమంచి లాంపులు యెరువుతెచ్చైనా పెడతారు. ఇంటికి సహజసౌందర్య ముండాలికాని యీ తెచ్చిపెట్టిన అలంకారా లెందుకు. మీటింగు లైనప్పుడు టౌనుహాలులోను అక్కడాకూడా యిల్లాటిఅలంకారాలే చేస్తారు. ఆకులవల్లా పువ్వులవల్లా వస్తుందా యేమిటి అలంకారము. మీరే అల్లాటివి మొందుకు కట్టిస్తారక్కడ. ఆకుల

వల్లా పూవులవల్లా యెంతో అందము గోడలకు గొంతెలకు వస్తూంటే వెండివల్ల బంగారమువల్ల వజ్రాలవల్ల రత్నాలవల్లా మనిషి కందం రాదా యేమిటి. కాలి కందెపోచైనా మెళ్ళో పట్టెడపోచైనా చెవికి బావిలీమైనా లేకుండా మూసివాయనం ముత్తైదువులాగుంటే పుణ్యస్త్రీ అందంగా వుంటుందా యేమిటి. నేను మోటమాటన్నానని మీరు కోపపడవద్దు. ఊరికే సంగతి చెప్పాను.

హ—నగలవల్ల అందము మన ఆడవాళ్లకేనా లోకంలో తక్కిన ఆడవాళ్ళకుకూడా వుంటుందా?

రుక్మి—లోకంలో అందరాడవాళ్ళకు నగలవల్ల అందము వస్తుంది. ఆశపుట్టుక పుట్టిందల్లా నగలు పెట్టుకోవాలని యుబలాటము పడుతుంది.

హ—.అయితే దొరసానులుకూడా ఆడవాళ్ళేనా? వాళ్ళెందుకు నగలకోసము బలాటపడరు.

రుక్మి—నగలవల్ల అందం వాళ్ళు గ్రహించలేదేమో కాని లేకపోతే పెట్టుకోరా. అప్పటికి కొందఱు దొరసానులు వజ్రాలుచెక్కిన యుంగరాలు పెట్టుకుంటారు. వాచీలా అవేమిటో అంటారు జేబు గడియారాలు, కెంపులు వజ్రపుపొళ్ళు చెక్కిన బంగారపు డిప్పలూ వున్న జేబుగడియారాలు వేసుకొంటారు. మంచిమంచి రాళ్ళు చెక్కిన బంగారపు గొలుసులు వాటికి వేస్తారు. అవన్ని అలంకారాలు నగలు కావా యేమిటి? ఎన్నిగంటలైనదో చూచుకుందుకు వట్టిగడియారము చాలదా యేమిటి? బంగారపు డిప్పలున్నదే కావాలా, బంగారపు గొలుసున్నదే కావాలా, కెంపులు చెక్కినదే కావాలా? అవన్నీ నగలు కావా యేమిటి? కంఠి కాసులపేరూ మాత్రమేనా నగలంటేను. ఇవన్నీ నగలే. అన్నట్టు మరిచిపోయినాను, వీటికేమి సీమలోవుండే మన రాజుగారి భార్య ... ... నగలు

పెట్టుకుందని పత్రికలలో చదువుకొన్నాము. అప్పుడు మంగమ్మపిన్ని నేనుకూడా అనుకున్నాము. దొరసానులుకూడా నగలు పెట్టుకుంటారు చూచావా అవి.

హా—దొరసానులలో నూట నాట యెక్కడో ఒకావిడ పెట్టుకుంటుందిగాని దరహాంమీద మనకిమల్లే నగలో నగలో అని పలవరించి మగవాడిని పీకి పిండిపెట్టి నెత్తురుపీల్చి అప్పో సప్పో చేయించి నగలు పెట్టుకోరు.

రుక్మి—పీకి పిండిపెట్టి నెత్తురుపీల్చి నగలుపెట్టుకోవడం యెవరూ వప్పుకోరు. ఇంట్లో బువ్వగడవటమే కష్టముగా నున్నపుడు నగలు తెమ్మని బాధపెట్టేపెళ్ళాము బ్రహ్మరాక్షసిగాని పెళ్ళామవుతుందా యేమిటి? అటువంటివాళ్ళు యెక్కడనో వెయ్యికొక్కర్తె యుంటుందిగాని సాధారణముగా నుండరు. మగవాడు బాగా సంపాదిస్తూన్నపుడు నాలుగుడబ్బులు వెనకపడుతూన్నపుడు ఆడది కొంచెము పట్టుబట్టినా నగలు చేయించుకొన్నా అందము చందము వుంటుంది కాని భూములు తాకట్టుపెట్టి అప్పులుచేసి నగలు చేయించుకోవడం బాగుంటుందా యేమిటి?

హా—ఎల్లాగైనా దొరసానుల మోస్తరుగా మనవాళ్ళు కేవలం మంచిదుస్తులు వేసికొని నగలు లేకుండా వుంటే చాలా బాగా వుంటుంది.

రుక్మి—దొరసానులులాగు అన్నింటిలోనూ వుంటే బాగావుంటుంది. ఒక్క నగలలోనేకాదు. దొరసానులులాగు గుఱ్ఱపుబళ్ళు కట్టించుకొని మనవాళ్ళుకూడా ఒక్కళ్ళు షికారువెడితే బాగావుంటుంది. పైమగవాళ్ళెవరువచ్చినా నదురు బెదురు లేకుండా వాళ్ళతో మాట్లాడి షికారుకెడితే బాగావుంటుంది. వాళ్ళలా మేము కూడా పెద్దవాళ్లమయిన [illegible] కాలేజీలకు వెళ్ళి

చదువుకుంటే బాగావుంటుంది అన్నింటిలో వాళ్ళలాగ మమ్మలిని కూడా తయారుచేసినతరువాత నగలలోకూడా వాళ్ళంతవాళ్ళు కమ్మని చెపితే బాగావుంటుంది.

హ.—మన పెద్దవాళ్ళు సూక్ష్మలై వప్పకోరుగాని వాళ్ళపద్ధతు లన్నీ బాగానే వున్నాయి. చదువుకుంటే తప్పా? షికారువెడితేతప్పా? అవన్నీ మనవాళ్ళు వప్పుకోకపోతేమట్టుకు నగల విషయములో మన ము మార్పుచేసికోగూడదా? ఒకవేళ అందంగావుంటే వుంటుందనుకో! ఉపయోగ మేమైనా వుందా ?

రుక్మి—అదిగో అల్లాసబబు గారండి. చెపుతాను. ఉపయోగ ముందో లేదో చూతురుగాని. నగలవల్ల యెంతైనా ప్రయోజన మున్నది,

హ—ఏమి టాప్రయోజనం ? అన్నిశాస్త్రాలు చదువుకొన్న వాడిని నాకు తెలియని ప్రయోజనాలు నీకేమి తెలిశాయో చెప్పు?

రుక్మి—ఈమాత్రము తెలిసికొనేటందుకు శాస్త్రాలు చదువు కోనక్కరలేదు. బియ్యేలుప్యాసు కానక్కఱలేదు. ఆడదాని వంటి మీద నగలంటూ వుంటే మగవాడికి యేఅవసరము వచ్చినప్పటికి అవి అక్కరకువస్తాయి. తాకట్టు పెట్టుకోవచ్చు. అమ్ముకోవచ్చు. ప్రాణావసర మేదివచ్చినప్పటికి నగలే తల కాస్తాయి. ఎన్నిభూము లున్నా సమయానికి అక్కఱకు రావు. రొక్కము పెట్టెలో వుంటేతప్ప ఒకళ్ళకి బదులిచ్చినప్పటికి సమయానికి అక్కరకు రాదు. సమయానికి అక్కరకువచ్చేవి పెళ్ళాము వంటిమీద నగలే. భూములు తాకట్టుపెట్టి తెచ్చుకోవాలంటే పదిరోజులో పదిహేనురోజులో అవుతుంది. పైగా రాతలు కోతలు అవడంచేత నలుగురికి తెలుస్తుంది. నగ లయితే ఒక గంటలో తాకట్టుపెట్టి తెచ్చుకోవచ్చును. సొమ్ము వెంటనే చేతిలో పడుతుంది. తాకట్టు పట్టినవాడికి మనమాత్రము యిక నెవ్వరికి తెలియదు.

నగలలో యింత ప్రయోజనమున్నది ప్రయోజనం లేదనుకోవడం వట్టి పొరబాటు.

హా—అబ్బో! కోతలు చాలానేర్చావు. ఆడదాని వంటిమీద నగపెట్టినతరువాత అవి మళ్ళ మగవాడిఅవసరాని కక్కరకువస్తాయా? ఆర్చిచచ్చినా, బాలుకవీక్కున్నా ఆడది మళ్ళ తాకట్టునికుత్తం మగ వాడికి వస్తువులిస్తుందా? మగవాడిని బుట్టలోపెట్టి నగలుచేయించి వంటినిండా దిగవేసుకుందుకు మాటవరుసకు యిస్తానంటుందేకాని, అబ్బో యెన్నిగడబిడలు చేస్తుంది నగలిమ్మంటే. అడగ్గానే కావలసినంత కోపము, తాపము, పరాకు, చిరాకు, మొగము మటమట, మొసలు చిటచిట, కండ్లనీరు, అడిగినమాటకు జవాబురాదు. అమ్మలక్కలతో నేరాలుచెప్పకొని యేడవడం. అబ్బో! నేనెఱగనాయేమిటి. ఆమధ్య చంద్రియ్య యేదో వారంటువచ్చి పెండ్లామును కంఠియిమ్మని అడిగితే కొంపలో చిచ్చుపెట్టిందావిడ. చిట్టచివరకు వీధిలోవాళ్ళందరూచేరి తగవుపెట్టినతరువాత మూడుపవాసాలుచేసి అందరూ చీచీయన్నతరు వాత. కంఠిఒక్కటి విసిరి మూదపార వేసింది. అవసరంవచ్చినదాకానేకాని వస్తే అందరికి చంద్రయ్యఅవస్తే ఘడుతుంది.

రుక్మి—అందరూ అల్లాంటి గయ్యాడివాళ్ళుండరు. మంచిపెళ్లా లుకూడా లోకంలోవుంటారు. మగవాడికవసరంవస్తే యివ్వనిది బ్రహ్మ రాక్షసికాని పెళ్ళాంకాదు.

హా—సరే యీవాదమంతా యెందుకు? అయిపోయినదేమి టో అయిపోయినది. సొమ్ము మించాయిచ్చావుగనుక యీదుద్దులు చేయించుకో. ఇకముందు నాతో చెప్పకుండా యేనగలు చేయించు కోనద్దు. ఎప్పుడూ ముందు సొమ్మియ్యవద్దు.

(అని యిద్దరు నిష్క్రమింతురు.)

(వాసుదేవరావుగారు కామాక్షమ్మ పరివేశించుచున్నారు.)

కామా—ఈలాగున మీ రూరకుంటే యేలాగు? అయిన సంబంధాలన్నీ దాటిపోతున్నాయి. మన పెద్దమ్మాయికి పెండ్లయ్యే దారి కనబడదు. మీకు చీమ కుట్టినట్టయినా లేదు. పెండ్లి యీడొచ్చిన కూతురు యింట్లోవుంటే మీ కన్న మేలా వంట పడుతూందో కంటికి నిద్రయేలా వస్తూందో నాకు తెలియదు. నా కేనిమిదో యేడు రాగానే మా బాబయ్య ఒంటిమీద చీమలు జెఱ్ఱెలు పాకినట్లు బాధ పడి యెన్నోవూళ్ళు తిరిగి నానావస్థ పడ్డాడు. మాచిరాజువారి సంబంధము దాటబెట్టారు. ఇలపకుర్తివారి సంబంధ మిట్టేయెగిరిపోయింది కదా. మనవాళ్ళలో మగపిల్లవాడు కనబడితే యెవరోయొకరు తీసికొనిపోయి ముడిపెడతారుకాని వదిలిపెడతారా? మనపిల్ల బొద్దుకూడాను. నా కెంతో అంత బెంగగావుంటుంది.

వాసు—అయితే మనపిల్లకెన్నో యేడు?

కామా—యేండ్లకు వైశాఖశుద్ధ పూర్ణిమనాటికి పదేండ్లు వెడతాయి

వాసు—సరే ఇది యింకా మాఘమాసమే కదా. పదో యేడు వెళ్ళలేదన్నమాట. ఇంకా తొందర లేదు.

కామా—తొందర లేదంటా రేమిటి. కావలసినవాళ్ళు నలుగురు మిమ్మలనిచూచి నవ్వుతున్నారు. నా నోట్లో గడ్డిపెడుతున్నారు. మొన్న మా పింతల్లికూతురు పలివెలనుంచివచ్చి యేమో అంత తప్పు పట్టినది. మన యింటి ఆడపడుచులు పదకొండో యేటే కాపరానికి వెడతారు. ఇదేమిటేఅమ్మా నీ వింకా పెళ్ళిచేయవని నన్ను తలవాచేటట్టు చీవాట్లు పెట్టినది. మీ పిల్లని సానిని చేస్తారటే పెళ్ళిచేయకుండాను అని నా మేనత్తకూతురడిగింది.



వాసు—మీ చుట్టాలందఱు నన్ను చెప్పనీ తిట్టనీ నవ్వనీ

యేడ్వనీ పన్నెండేళ్ళొస్తేకాని నేను పెళ్లిచేయను. ఈ రోజులలో పన్నెండేళ్ళొస్తేకాని యెవరుచేయడములేదు. చిన్నపిల్లకుచేస్తే నా కాక్షేపణగా వుంటుంది. పైగా నీవు పదకొండేళ్ళకు కాపరానికి రాలేదు. నీ చెల్లెలు పదకొండేళ్లకు కాపరానికి వెళ్ళలేదు. పదమూడే ళ్ళొస్తేనేకాని మీ రెవరు పెద్దవాళ్ళు కానేలేదు.

కామా—పన్నెండేళ్ళొచ్చేదాకా చెయ్యరూ! ఇదేమి సోద్దె మమ్మా. ఇంటా వంటాలేని పనులొచ్చాయి. ఇక మనమంతా గంగా ప్రవేశము కావలసినదే. అప్రదిష్టపడలేకుండా వున్నాను. కాకులు పొడిచినట్లు పదిమందీ పొడస్తారు. ఈ కాలపువాళ్ళంతా పన్నెండే ళ్ళకే పెళ్లిళ్ళుచేస్తూన్నారా? ఎవరుచేస్తున్నారు ఆలాగ? మనంత వెట్టి ముండావాళ్ళుకారు వాళ్ళు. సుబ్రహ్మణ్యము పంతులుగారు రెన్ని కబుర్లు చెప్పి తొమ్మిదేళ్ళపిల్లకు పెళ్లిచేసి యూరకొన్నారు. రంగారావు పంతు లుగారు ఆరేడేళ్లపిల్లకే చేశాడు. భీమరాజుగారు కూతురికి మూడో యేటనే పెళ్లిచేశారు. జ్ఞాపకములేదూ? కన్యాదానపువేళ నిద్రపోతూ తల్లిబట్టమీద యేదోచేసినదని చెప్పుకున్నారు. పైగా సభలోవున్న ప్పుడు పాలిమ్మని చంపిందట తల్లిని.

వాసు—వాళ్లు కక్కుర్తిపడితే మనముకూడా కక్కుర్తిపడాల నున్నదా యేమిటి? పాలు తాగేయీడున పిల్లకుకూడా పెళ్ళిచేయలేదని నీకు విచారముగా నున్నదా యేమిటి? కావలిస్తే యీ మాటు పిల్ల పుట్టినప్పుడాముచ్చట తీర్చుకొందుగాని.

కామా—(తల వంచి) చాల్లెండి. ఇల్లాంటి కొంటెమాటల కేమి. ఆలాటి చంటిపిల్లలకు పెళ్లి చేయాలని నాకు ముచ్చటలేదు. బియ్యేలు బియల్లులు ప్యాసయిన పెద్దపెద్ద లంతా అల్లాచేస్తూన్నారని చెప్పినాను. అల్లాటి అన్యాయపు పెళ్లి చేయుమనలేదు. లోకంతో పాటుగా పదేళ్ళు వచ్చిన పిల్ల కనుక తగిన సంబంధము వెతికి వెళ్లి

చెయ్యనంటూన్నాను. అయిన సంబంధాలు దాటిపోతే తరువాత మనకు దొరకుతాయా? పస్తాయించినకార్య ముంటుందా? అదిగాక మా అమ్మ పెద్దముండాకూతురు గదా. కాటికి కాళ్ళు చాపుకొని యున్నది. అమ్మా గా నేను బ్రతికియుండగానే పిల్లకు పెళ్లి చెయ్యవే. ఈ ముచ్చట చూచుకొని పోతా నని చెవినిల్లుకట్టుకొని పోరుతూంది. మొన్న మా తమ్ము డొచ్చేటప్పుడు వర్తమాన మంపింది. చైత్రమా సంలో మాఘమి వైశాఖమాసములో ఎండలు, అందుచేత యీమాఘ ఫాల్గుణ మాసములలో ఎక్కడో అక్కడ మంచి సంబంధము చూచి చెయ్యమన్నది. ఏమో పెద్దది. బతికినన్నాళ్ళు బ్రతకదు కదా. దాని ముచ్చటతీరుద్దామని నా మనస్సులో నున్నది. ఇంతకంటె నేను దానికి చేసే దేమున్నది. పెట్టనా పొయ్యనా? ఎప్పుడైనా చేశేపెళ్ళే కదా. ఆవిడుండగానే చేస్తే తీరిపోతుంది. ఆవిడముద్దు చెల్లించినవాళ్ల మవు తాము. ఇ దంతా ఆవిడ కడుపుచలవేకాదూ?

వాసు— సరిసరి. ఇదా దాని రహస్యం. పెళ్లితొందర కారణం తెలిసింది నాకు. మీ యమ్మ ముచ్చట తీర్చవలెనా? మీ యమ్మ ముచ్చటకోసం నేను పెళ్ళిచేశేవాడనుకాను.

కామా—అవును! మా అమ్మముచ్చటకోసం మీరు చేస్తారా యేమిటి? నేను బుద్ధి గడ్డితిని ఆలా ఆడిగానుకాని, మా అమ్మ యెవర్తి అడిగేటందుకు? మా అమ్మకోసం మీరు చెయ్యనక్కరలేదు. ఊరు కొన్నదాన్ని ఊరుకోక యేదో ఒకటి తెచ్చిపెడతాను నేనే. దాని పెళ్ళిగొడవ నా కెందుకు నిద్రపోక. (అని నిదురించును.)

(ఇద్దఱు నిద్రపోవుదురు.)

(వాసుదేవరావు కామాక్షమ్మ ప్రవేశించుచున్నారు)

కామా—ఎల్లకాలము ఒకచేపట్టా. ఎప్పుడైనా విడువున్నదా.

వాసు— దేనికి విడు వుండవలెనంటావు.

కామా— పట్టిన పంతానికి.

వాసు—విడు వుండవలసినచోట తప్పకుండా ఉండితీరుతుంది. ఉండకూడనిచోట ఉండనే యుండదు.

కామా—పిల్లదాని పెళ్ళిమాట స్థిరంగా చెప్పండి మీయభిప్రాయ మేమిటోను?

వాసు— ఇన్నిమాట్లు చెప్పేదేమిటి. ఒకపరియాయమే చెప్పివేశాను. ఇప్పుడు చెయ్యనని.

కామా—సరే యిప్పుడు చెయ్యకపోతే చెయ్యకపోయినారు కాని సంబంధ మేదైనా యిప్పుడు స్థిరపరచి యుంచుకుందాము. దానికైనా అంగీకరించండి. మంచి సంబంధాలు దాటిపోతే దొరకవని మీకుగూడ తెలుసునుగదా.

వాసు— మంచి సంబంధాలంటూ కొన్నియున్నాయా యేమిటి! ఎప్పుడు కావలిస్తే అప్పుడే వుంటాయి మంచిసంబంధాలు చెడ్డ సంబంధాలున్నూ.

కామా—ఆమాట నేను వప్పుకోను.

వాసు—ఒప్పుకోకపోతే మంచిసంబంధ మేదో చెప్పు. వీలుగా నుంటే కుదిర్చి యుంచుకుందాము.

కామా—నిడదవోలు సంబంధము చాలామంచిది.

వాసు—వారింటిపే రెవరు ?

కామా—కొచ్చర్లకోటవారు.

వాసు—పిల్లవాడి కెంతవయస్సున్నది ?

కామా—పదియారు సంవత్సరము లుంటాయి.

వాసు—ఏమి చదువుకొన్నాడు?

కామా—తెనుగుబడ్లో చదువుతున్నాడు. ఇంగ్లీషు చదవడం లేదు.

వాసు—అయితే చదువు సంధ్యలు రాని శుద్ధ మొద్దు స్వరూపాని కిమ్మంటావా?

కామా—మరీచోద్యాలూ శుద్ధమొద్దు స్వరూపమా? వ్రాలు చేయలేడనుకొన్నారా! నిశానీప ద్దనుకొన్నారా. లెక్కాడొక్కా సొంతముగా చూచుకుంటాడు సాలుకు నాలుగువేల రూపాయలువస్తాయి. ఏభైవేల రూపాయల రొక్కము వడ్డీకి తిరుగుతూంది.

వాసు—అయితే ఆసొమ్ము చాలంటావూ చదువు లేకపోయినా.

కామా—చదు వెందుకు సొమ్ము సంపాదించడానికే గాదు. ఆసొమ్ము కావలసినంత యింట్లోవున్నపుడు చదు వెందు కేమిటి. శుభ్రంగా పెళ్ళికూతురుకు వంటినిండా నాలుగైదువేల రూపాయల నగలు పెడతారు. ముద్దినిసు చీర ముద్దినిసు రవిక యిస్తారు. అన్ని ముచ్చట్లు జరుగుతాయి. అత్తా మామా యున్నారు. ఒక్కడేపిల్లాడు.

వాసు—అయితే కూతురుకి వంటినిండా నగలొస్తాయనా యీ సంబంధము చెయ్యమనడం.

కామా—ఒక్క నగలేనా యేమిటి. పిల్ల సుఖపడుతుందని చెయ్యమన్నాను.

వాసు—బియ్యేప్యాసయినవాడికి స్తే పిల్ల సుఖపడదా యేమిటి.

కామా—బియ్యే ప్యాసయినవాడి కిస్తే సుఖపడేకన్న నేను చెప్పిన సంబంధమువాడి కిస్తే యెక్కువ సుఖపడుతుంది. పిల్లవాడు బియ్యేప్యాసయి యేంజేస్తాడు? ఏకచేరీలోనో పదిహేను రూపాయల గుమాస్తాగా ప్రవేశించడమేకాదూ! ఆపదిహేను రూపాయలు మొగుడూ పెళ్ళానికి బువ్వకైనా చాలవు. ఇంటద్దెలకు, కట్టుకొనే

బట్టలకు, రోగాలొస్తే మందులకు అన్నింటికి తుమ్మదగ్గరనుంచి దేవ తార్చనముదాకా మనమే పంపుతూండాలి డబ్బు. పెళ్ళికొడుక్కి పూటకు టికాణా యుండదు. నా అన్నవస్త్ర మెక్కడా యుండదు. ఏ భైరూపాయలుద్యోగ మయ్యేటప్పటికి పదిపద్దాలుగేళ్ళు పడుతుంది. పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నమాటేగాని యేమిసుఖ ముంటుంది బిడ్డకి? మనసొచ్చిన రవికెలగుడ్డ కొనుక్కుందామంటే ఒక్కపావలా డబ్బు లుండవు పిల్లదగ్గిర. అమ్మాయికి పుట్టింటివారిస్తే కలదు, లేకపోతే లేదు.

వాసు—భూమీ పుట్రా లేకపోయినా యిల్లూవాకిలీ లేకపో యినా బియ్యే ప్యాసయినట్టయితే పేరూ ప్రతిష్ఠా వుంటుంది. క్రమంగా గొప్పవుద్యోగ మవుతుంది. పూటకు టికాణాలేని బియ్యేలు ఇప్పుడు డిప్యూటి కలక్టరులు చేస్తూన్నారు. సబుజడ్జీపనులు చేస్తూన్నారు. వాళ్ళత్తవారు వాళ్ళ చదువులుచూసే పిల్లనిచ్చారుకాని వాళ్ళ ఆస్తి చూచికాదు. చదువులేని శుద్ధ మొద్దుకు పిల్లనిచ్చి ఇత డెవరండీయని పెద్దమనుష్యు లడిగినప్పుడు నాఅల్లుడని చెప్పుకుంటే నాకెంతో సిగ్గుగా వుంటుంది.

కామా—నెత్తిమీద గుడ్డిగవ్వ పెడితే గుడ్డిగవ్వ చెయ్యని వాడికి పిల్లనిస్తే సిగ్గుగా నుండదుగాబోలు మీకు.

వాసు—చదువుకొన్నవాడి కిస్తే సిగ్గుపడవలసిన అవసరము లేదు. మనపిల్ల ఫస్టుఫారములో చదువుతూందికదా. దానిమాత్ర మైనా చదువురాని నిర్భాగ్యుని కెల్లాగియ్యమన్నావు పిల్లని. ఉత్తరము వస్తే పెళ్ళాము చదివిపెట్టాలి. టెలిగ్రాఫువస్తే ఊరమ్మట పరుగెత్తాలి చదివించుకుందుకు.

కామా—విచిత్రపు కబుర్లూ విడ్డూరపు మాటలూ. నాకెం దుకు మీ యిష్టమువచ్చిన ట్లేయ్యండి. పోరాపిల్ల మీకు స్వతంత్రం.

నా కేమి స్వతంత్రముంది? ఊళ్ళో పిల్లలందఱు కంటెలు కాసులు పెట్టుకొనివుంటే నా మొగుడు బియ్యేఅని చెప్పుకుంటూ మెళ్ళో బొందూ అదీ చూసి వాయనము పేరంటాలులాగ నుంచుంటే మీకు సంతోషముగా నుంటుంది.

(అని దుప్పటి ముసుగు వేసికొని పండుకొనును.)

వాసు—నీవు నూరు చెప్పు వేయి చెప్పు. నేను బియ్యే ప్యాసయినవానికేగాని యియ్యను.

(అని నిద్రపోవుచున్నాడు.)



(పార్థసారథిరావుగారు భార్యమీనాక్షమ్మగారుప్రవేశించుచున్నారు)

పార్థ—కట్నముబిషయమై నీకు సంతుష్టికలిగినదికదా ?

మీనా—సుముహుర్తలు పన్నడంలో మీరందివేసినచెయ్యి. ఉపాయాలు చెప్పడానికి మీరంటే నాకు సంతుష్టికలుగకపోతుందా యేమిటి.

పార్థ—నీవంటి పెళ్ళాముంటే యెన్నియుపాయాలయినా చెప్ప వలసివస్తుంది. ఇంకా నీకేమి సంగతులు కావాలో అడుగు.యిప్పుడే మన మిద్దరము పరిష్కారము చేసికుంటేమంచిది.

మీనా—అలాగైతే చెపుతా వినండి. మంచిభోగముమేళము పిలిపించాలి.

పార్థ—బ్రహ్మ దిగివచ్చినా సరే. అందుకు నేను వప్పుకొనను.

మీనా—ఎందుకు వప్పుకోరు?

పార్థ—వివాహములలో భోగముమేళము పిలువగూడదని మేము ప్రతిజ్ఞ చేసికొన్నాము. చిన్నప్పుడు [illegible] వేటప్పుడే

నేను కాగితములో సంతకం చేసినాను భోగముమేళము లేనిదే పెళ్ళి జరగదా యేమిటి?

మీనా—(కోపముతో) భోగముమేళము లేకపోయినా పెళ్ళి జరుగుతుంది. బాజాభజంత్రీలు లేకపోయినా జరుగుతుంది. పెళ్లి కూతురు పెళ్ళికొడుకు వుంటేసరి. పెళ్లిజరగడాని కేమీ అభ్యంతరము లేదు.

పార్థ—అభ్యంతరము లేనప్పు డింకభోగముమేళ మెందుకు?

మీనా—మేళమేకాదు భజంత్రీలు పల్లకీకూడా మానిపించండి మనకు కావలసినంత సొమ్ముకూడివస్తుందిగా.

పార్థ—ఇదేమికర్మము. ప్రతివిషయములోను కత్తివెయ్యనా బద్దవెయ్యనాయని నాతో నెదుగు వాదము లంకించుకుంటున్నావు. ఒక సంగతిలోనైనా నామాట వినవద్దా నీవు.

మీనా—ఇప్పుడు వినక మీమాట కేమి యెదిరించాను. కాక పోతే పిల్లవాడిపెళ్లి శోభగా చెయ్యమన్నాను. ఇంతేకాదూ నావల్ల వచ్చినతప్పు. ఇంతమాత్రముమాట చెప్పకుండా మూగిముూశానమ్మ లాగ నోట్లో గుడ్డలు కుక్కుకొని యింట్లోకూర్చో లేనుమరి. లేక లేక యీయొక్క గుంటవెధవ బ్రతికాడు. వాడిపెళ్ళి ముచ్చటగా అచ్చట గా చేసుకుందామని యేలూరులో భోగముమేళము పిలిపింతామని నా కెంతో అంత యిదిగావుండేది. అందులో యొకర్తె భామవేషము కడు తుందట. దానిచేత భామవేషముకట్టించి వినాలని మనవీధిలో ఆడవాళ్ళు మనచుట్టాలు అంతా ముచ్చటపడుతూవున్నారు. అబ్బాయిపెళ్లినాడు కట్టిస్తానని నేను వాళ్ళతో చెపుతూవుండేదాన్ని. నావెఱ్ఱేకాని కట్టించే టందుకు నేనెవర్తిని? మీయింట్లో దాసీదీయుంది నేనూవున్నాను. చాకి రీచేస్తే దానికీయింతన్నం పెడుతున్నారు. నాకూ యింతన్నం పెడు తున్నారు.

పార్థ—అబ్బో! కోరికలు చాలా దూరమున్నాయి. ఏలూరు మేళమూ, భామ వేషమూనా? అంతకంటె హరికథలు చెప్పించుకో రాదూ. పుణ్యము మోక్షమూ వస్తుంది. ఆబూతుకూతలజావళీలే వినాలి. రామా కృష్ణా అనేమాటలు చెవిని పడగూడదా.

మీనా—మాకు హరికథలు గిరికథలు అక్కఱలేదు. మే మంత వేదాంతులము కాము. ఇది కులాసాగా తిరిగే పెళ్లికాని బైరాగుల మతంగాదు హరికథలు చెప్పించేటందుకు. ఏకాదశీవ్రతము చేసే టప్పుడో సత్యనారాయణవ్రతము చేసేటప్పుడో హరికథలు చెప్పించ వచ్చును. పిడుగుకు బియ్యానకు ఒకటే మంత్రమన్నట్టుగా ఎప్పుడు పడితే అప్పుడే హరికథలు. వేందాతులు వచ్చారు చెంబు ముంతా జాగ్రత్తచేసుకోమన్నట్టు నీకు కొత్త వేందాంతులు బయలుదేరాకు నేడు. భోగమువాళ్ళు శోభనదేవతలు. వాళ్ళు లేకపోతే యేంపెళ్ళి వెధవపెళ్ళి. వాళ్ళు వచ్చారంటే యిల్లుకలకలలాడుతూవుంటుంది నాలు గురోజులునూ.వాళ్ళు లేకపోతే పెళ్ళి ఏదోపోతూన్నట్టుంటుంది.అందు చేత లేనిపోని భేషజాలకు పోక నామాటవిని బోగముమేళము పెట్టండి.

పార్థ—బోగముమేళము పెటితే వచ్చే నష్టాలు నీకు చెపుతా విను. పడితే మంచిమేళము పెట్టాలికదా. మంచిమేళము యీాలగ్గసరి రోజులలో రెండువందల రూపాయలకు తక్కువరాదు. ఏలూరుమేళమే కావాలని కోరి వేడి మనము పిలిచామంటే వాళ్ళుమరీ చెట్టెక్కి బిఱ్ఱ బిగుస్తారు. మేళము లేకపోతే రెండువందలు కలిసొస్తాయిగదా. పైగా నేనుచేసినప్రతిజ్ఞ నిలుపుకొన్నవాడ నగుదునుకదా. పైగా భోగము మేళాలవల్ల కుఱ్ఱవాళ్ళంతా చెడిపోతారు.

మీనా—అసలు పెళ్ళేచెయ్యకపోతే వేయిరూపాయలు కలి సొస్తాయి. తిరపతిలో చేసికొంటే ఏబదిరూపాయలతో పెళ్ళవుతుంది. తొమ్మిదివందలు మేరకు కలిసొస్తాయి. మీప్రతిజ్ఞమాట కేమిటిలెండి.

భోగముమేళ మాటఃతూంటే మీరు వీధిలోనికి వెళ్ళి కూర్చోవచ్చును. భోగముమేళాలవల్ల పిల్లలు పాడగుతారంటే నేను వప్పుకోను. పాడైన వాళ్ళంతా వివాహములలో పాడైనారాయేమిటి? మీపెళ్లికి మీనాయనగారు భోగముమేళము పెట్టేరుగదా! మీరుపాడైనారా యేమిటి? మనస్సు నిబ్బరంలేని నిర్భాగ్యులెప్పుడూ పాడౌతారు.

పార్థ—నీతల్లకిందులవాదాని కంతంలేదు. నాకు నిద్రవస్తూంది. నేనుమాటాడలేను పడుకో.

(మీనాక్షి పార్థసారథి ప్రవేశించుచున్నారు).

మీనా—నిన్నరాత్రి నిద్రవస్తున్నదని దొంగవేషము వేసి ఆమాట మరపించి పండుకొన్నారు. భోగముమేళముమాట యేమిటో తేల్చండి. పెట్టడమా పెట్టకపోవడమా.

పార్థ—నీకు భోగముమేళముపిచ్చి పట్టుకొన్నదేమి. ఈపిచ్చకేమిమందు లేదా యేమిటి

మీనా—వద్దన్న వెట్టి మీకు. కావాలన్నవెట్టి నాకు. ఈరెండువెఱ్ఱులకుగూడ మందులు లేవు.

పార్థ—ఈవిషయములో నీయభిప్రాయముకంటె నాయభిప్రాయముకంటె కుఱ్ఱవాడభిప్రాయము పుచ్చుకోవలసి వుంటుంది. వాడేలాగుచెపితే ఆలాగు చేదాము.

మీనా—ఊరుపీడ పీరిశెట్టిని కొట్టుకొనిపోయినదన్నట్లు మీరూ నేను పట్టింపులుపట్టుకొని అఱుంతగింజ కుఱ్ఱవాడినెత్తిని వేయడమా! బాగానేయున్నది.

పార్థ—అఱుంతలఃగింజ లేయడ మేమిఃటి! వాడు కావలెనంటె తప్పకుండా పెడతాను. వాడు వద్దంటే మానివేస్తాను. ఇది వాడి పెళ్ళిగనుక వాడి కుంతవలసిన సరదా. వాడికి సరదా వుంటే తప్పక పెట్టితీరవలె. సరదా లేకపోతే మానవలెను.

మీనా—వాళ్ళ సరదా జోలి మనకెందుకూ. ఈకట్నాలు వియ్యపురాలు లాంచనాలు అన్నీని వాళ్ళసరదా కేనా యేమిటి పుచ్చు కోవడం మనం?

పార్థ—వియ్యపురాలు లాంచనాలు కట్నాలు నీసరదాకోసం.

మీనా—అలాగయితే భోగముమేళముకూడా నాసరదాకో సమే పెట్టాలి. వాడిమాటెందుకు.

పార్థ—అయినా కుఱ్ఱవాడిని పిలుస్తానుండు ఓరె అబ్బాయీ రామచంద్రము (అని పిలుచుచున్నాడు).

(అప్పుడు రామచంద్రుడు ప్రవేశించుచున్నాడు).

రామ—ఏమండినాన్నగారూ యెందుకుపిలిచారు ?

పార్థ—నీపెళ్ళికి భోగముమేళము కావలెనా వద్దా? మీయమ్మ కావలెనంటూన్నది, నేను వద్దంటూన్నాను. నీయిష్టమేమిటో చెప్పు?

మీనా—ఒరే! తెలివితక్కువమాటలు మాటాడక జాగ్రత్తగా చెప్పు. వెఱ్ఱిమొఱ్ఱికబురులు మాటాడకు.

రామ—భోగముమేళమువద్దు గీగముమేళమువద్దు. ఈకాల ములో భోగముమేళా లెవరు పెట్టుతున్నారు? మా కాలేజీపిల్లలలో నీ మధ్య పదిమందికి పెళ్లయినది. అందులో ఒకరిపెళ్ళికిగూడ భోగము మేళము పెట్టలేదు. నా పెళ్ళికి పాతికమంది స్టూడెంట్లు కొందరు ప్రొఫె సర్లు రావలనుకుంటూన్నారు. ఈ డేం నాస్నేన్ను భోగముమేళముంటే వాళ్ళెవరురారు. భోగముమేళము పెట్టారంటే నేను పెళ్లికి రానేరా ను. ఎవరికి పెళ్ళిచేస్తారో చేసుకోండి. స్టూడెంట్లందరు నన్ను కాకినిపొ డిచినట్లు పొడుస్తారు. ఆగోలంతా యెవరుపడగలరు? అందుచేత అమ్మ చెప్పినాసరే యెవరుచెప్పినాసరే మీరు భోగముమేళము పెట్టవద్దు.

మీనా—ఆరినీపొగరు పొడిచెయ్య! యెంతవాడవైనావురా. నీచదువు చట్టుబండలైనట్లేయున్నది. ఊరుఊరనుంచి వచ్చిన నిర్భా

గ్యాపువెధవలలో గలిసిపోయి పూర్తిగా పాడై పోయినావు. భోగము మేళము లేనిదే పెళ్ళేమిటిరా నీకెత్తికాయి. ఎవళ్ళో చేప్పారని నీవు మానుతావా. ఈబుద్ధులు నీకు పుట్టినవి కావు. మీనాన్నగారు ముందుగా చెప్పిపెట్టారేమో. పద్ధెనిమిదేళ్ళొచ్చాయి. ఇప్పటికి జ్ఞానం లేదు. నిన్ను ఎవళ్ళేకూత కుయ్యమంటే ఆకూత కూస్తావా? కాకపోయి నా యీనాటి కుఱ్ఱవెధవలకు స్వతంత్రాలెక్కువ. కాకపోయినా వాడి నడగడమేమిటి. మీకిష్టము లేదన్నమాట వాడికి తెలుసును గనుక మీరు పిలిచి అడగగానే భయముచేత మీముందే ఆడాడు, మీరెదట లేకుండా వున్నట్టయితే వాడు కావాలనే చెప్పును,

పార్థ—ఏమిరా అబ్బాయీ నీవుభయపడి చెప్పావా నేమిటి? భయము లేదు నీమనస్సులోనున్న సంగతి నిజం చెప్పు,

రామ— నేను భయపడి చెప్పలేదు నాబుద్ధిపూర్వకముగానే చెప్పినాను.

మీనా—భయపడకపోతే అలా యెందుకు చెవుతాడూ? కాక పోయినా యీనాటి కుఱ్ఱవెధవలు మైరావణవెధవలు. వీళ్ళని కింద పెడితే పంటలు లేవు పైన పెడితే వానలు లేవు. వేలెడున్నాడో లేడో వీడి కింతంతబుద్ధు లేమిటి చిన్నప్పటినుంచీ? ఈమగవాళ్ళే పాడుచేస్తూ న్నారు కుఱ్ఱవెధవలిని. ఈలాటి అవకతవక పేలాపన ప్రేలినపుడు బుగ్గ లు సాగతీసి రెండు మొట్టికాయలువేసి కూర్చోపెడితే బుద్ధివచ్చును,

పార్థ—నీపక్షము మాటలాడినాడు కాడని కుఱ్ఱవాడినిపట్టుకు తిట్టకు. వాడికితోచిన ముక్కేమో వాడు చెప్పాడు. ముందుగావెళ్లి వాడితోను నేను చెవులో నేమీ చెప్పలేదుగదా, మన మెదుగబట్టి వాడికితోచిన ముక్కేమో వాడుచెప్పాడు.

మీనా—తిట్టడానికి నాకేమిపట్టినది. తండ్రి కొడుకూ ఒకటై నారు. నా [illegible] వ్యము. పెద్ద

వాళ్ళకు లేకపోయినతరువాత చిన్నవాళ్ళకు వస్తుందా యేమిటి గౌర వము. నన్నుచూస్తే మీఅందరికి ఒకచేవయు పెద్దవాళ్ళు నామాట వినవేవినరు కుట్టివెధవైనా వింటాడేమో- అంటె వీడికికూడా చేటుకా లము వచ్చినది

(అని యేడ్చుచు లోపలికిపోవుచున్నది)

పార్థ—శుభకార్యములు బెట్టుకొని కంటనీళ్ళు పెట్టుకుంటా వెందుకు రారా వెళ్ళకు

రామ—ఏడవనియ్యండి కాశ్మేపు సైత్యపునీళ్ళు కారిపోతాయి. ఊరుకుంటుంది. బోగముమేళముమాత్రము పెట్టవద్దు. నేను చదువు కుందుకు వెడతాను.

(అని నిష్క్రమించుచున్నాడు)

పార్థ—సరే నేను కచ్చేరీకివెళ్ళుచున్నాను.

(అని నిష్క్రమించుచున్నాడు)

---

(పార్థసారథి రావుగారు భార్య మీనాక్షమ్మగారు
ప్రవేశించు చున్నారు.)

పార్థ—ఉడుకుబోతుతన మెందుకు; రారా వెళ్ళవద్దు.మాటకు మాట చెప్పవలెగాని బొల్లిబొల్లి యేడ్పులెందుకు (అని చేయిబట్టుకొని లాగుచున్నాడు.)

మీనా—నే నెందుకు? నా యాలోచనెందుకు? నన్ను వెళ్ల నియ్యండి. మీ యిష్టమువచ్చినట్లు పిల్లవాడికి పెళ్ళిచేసికొనవచ్చును

పార్థ—అలా గనకు వచ్చి కూర్చుండు. నా కప్రతిష్ట లేకుండా యుండుటకు నీవు కోరినకట్నము వచ్చుటకు మంచి యుపాయము చెపుతాను.

మీనా—కట్నా లక్కఅలేనివారు మీ రుపాయాలు చెపు తారా? ఆ మాట నేను నమ్మను.

పార్థ—తప్పకుండా చెపుతాను. నా మాట నమ్మి డబ్బు వస్తూంటే నాకుమాత్రము చేదాయేమిటి. పొరబాటుచేత కాగితంలో దస్కతు చేసినానుకదా యని పస్తాయిస్తూన్నానుకాని వీలయినంత వరకు వియ్యాలవారిదగ్గరనుంచి డబ్బు గుంజవలసినదనే నా యభి ప్రాయముకూడాను!

మీనా—ఇది నాలుక చివరమాటా మనసులో మాటా ?

పార్థ—మనసులో మాట కాని ఆడ వాళ్ళనోట్లో నువుగింజ దాగదన్నారు నే నిల్లా గన్నానని యెక్కడా చెప్పవద్దు చెప్పినావంటే నన్ను కాకులుపొడిచినట్లు పొడుస్తారు నా తలమీద వెంట్రుక లుండ నియ్యరు.

మీనా—నే నెక్కడా చెప్పనుకాని ఆ యుపాయ మేమిటో త్వరగా చెప్పండి తెలివి తక్కువవ్రాతలు వ్రాసుకొన్న వాళ్ళందరూ కూడా యిల్లాగే యిరుకున బడిపోయి నానా బాధలు పడుతుంటారు అడుసు తొక్కనేల కాలు కడగనేల?

పార్థ—తెలివి తక్కువ పనులు చేసుకున్నాము కనుక నే పనికి మాలిన ఆడదాని చేతకూడా చీవాట్లు తినవలసి వచ్చింది.

మీనా—నాచీవాట్లు మీరు కొాగా భరిస్తూన్నారు ఈమాటల కేమికాని ఆ యుపాయ మేమిటో చెప్పండి

పార్థ—చెపుతూన్నాను విను తిన్నగా పెళ్ళికి తరలివెళ్ళుదాము విడిదిలోస్నాతకము చేసికొందాము పెండ్లి రాత్రిగదా స్నాతకము అయినతరువాత నేను గ్రామములోనున్న పెద్ద మనుష్యులను పిలవ డానికి వెళ్ళినట్లు వెడతాను ఆ సమయములో నీ వొక్కపని చెయ్యి రెండు వేల రూపాయలకట్నము వియ్యపురాలు లాంచనాలు వెండి

నళ్ళేము వెండిచెంబులు కట్టుపంచలు ఇస్తేనేకాని మేము తరలిరామని కబు రంపించు నీవు ముందుగా రెండువేలరూపాయలు సాయంకాల మైదు గంటలలోగానె మా విడిదిలోనికి చేరవలసిన దని గట్టిగా కబు రంపు దానితో రూపాయలవర్షము గల్లున కురిసిపోతుంది

మీనా—సరే బాగానేయున్నది మీరు వచ్చిన తరువాత మీతో చెపితే పెప్పెప్పె మెమ్మెమ్మె యంటారేమి అంతా అభా సౌతుంది మీరు మరియొక మాటంటే'

పార్థ—సర్లే వ్యవహారము చెడగొడతానాయేమిటి ఇంతియుపా యము చెప్పినవాడిని! నేనసలు రాత్రి యెనిమిదిగంటలదాకా యిం టికి రానేరాను వచ్చినతరువాత వాళ్ళొకవేళ నాతో చెప్పినా నే నీలా అంటాను "బొత్తిగా పెంకిమనిషి నేను చెప్పినాకాని వినదు ఏలాగో ఒకలాగ సామామణీ చేయించండి లేకపోతే యిప్పుడు వివా హానికి అడ్డువస్తుంది చేపితే వినేమనిషిగాదు వాళ్ళది మోటసామాజి కం" అని యేమేమో అంటాను ఆమాటలు మాత్రము నీవు తప్పు పట్టుకోవద్దు.

మీనా—మీరేమన్నాసరే నానెత్తిమీద నలుగురు అక్షింతల గింజలు వేసినాసరే నా రెండు వేల రూపాయలు నాలాంచనాలూ నా వొళ్ళో పడితేసరి ఆతరువాత ఊళ్ళోవాళ్ళు పెళ్ళివాళ్ళు నన్నాడిపోసి కొని కట్టకట్టుకొని గంగలో దిగమనండి.

పార్థ—నీకు పిల్లనిచ్చి నీతో వియ్యమందినందుకు వాళ్లను గం గలో దిగమంటూన్నావూ?

మీనా—నేను వాళ్ళ నన్నానా. యేమిటి నన్నాడిపోసికొనే వాళ్ళనందరిని అన్నాను.



పార్థ—ఉపాయం నీకు నచ్చినదా లేదా?

మీనా—ఉపాయమేమిటి చాలా బాగాయున్నది కాని చివర దాకా మీరు నిలబడతారో నిలబడరో అని నాకు భయము వేస్తూన్నది మీకు చేటు ముగమోటనుకూడాను.

పార్థ—ఆలాటి ముగమోటములో పడేవాడినికాను భార మంతా నీమీదే త్రోసివేస్తానుకాదూ!

మీనా—అయితే భార్యచేతిలో కీలుబొమ్మని మిమ్మలిని నలుగురు అంటారు.

పార్థ—కొందరు నన్ను కీలుబొమ్మంటారు కొందరు నిన్ను గయ్యాళి గంపంటారు ఎవరేమంటేమి రెండువేలరూపాయలు గల్లున చేతిలో పడతాయా లేదా!

మీనా—సరే యీయుపాయము అసమానమైనది ఈప్రకారము కానిద్దాము.

(అని యిద్దఱు నిష్క్రమించిరి.)





